ఓం

వాసుదేవచైతన్యగురవేనమః

# చేయుము! ఇప్పుడే చేయుము!!



మనము మనుష్యజాతిప్రాణులుగా నున్నాము; అందవలన మనకు స్వవిషయమందు విచారము కర్తవ్యముగానున్నది దానిలో ప్రథమముగ ఈవిచారము—పశుపక్ష్యాదిప్రాణులకును, మనకును, భేద మేది? పశుపక్ష్యాదులును ఇంటిలోనున్నవి; మనమును ఇంటిలోనున్నాము; అవియు తినుచున్నవి, త్రాగుచున్నవి; మనమును తినుచున్నాము, త్రాగుచున్నాము; వానికిని కొడుకులు, కొమార్తెలు పుట్టుచున్నారు; మనకును పుట్టుచున్నారు; వానికిని కామక్రోధాదులు కనఁబడుచున్నవి; మనకును ఉన్నవి. ఇట్లు విచారము చేయఁగాచేయఁగా ఈభేదము కనఁబడును—వానికి తాము పశుపక్ష్యాదులని తెలియదు, మనకు మనము మనుష్యులనియు, అవి పశుపక్షులనియు తెలియును.

మఱియును ఇంతవిలక్షణత కనఁబడును—ఒక్కొకపశువు పక్షియు మనుష్యునికన్న శతాధికము శక్తముగా నున్నది; అయినను, అది అశక్తుఁడైన మనుష్యుని స్వాధీనముగా నున్నది; మనుష్యుఁడు ఎంతఅశక్తుఁడుగా నుండినను పశుపక్షులకి అధీనుఁడుగాఁడు; ఈప్రకారముగా చూచినట్టయిన మఱియును బహువిధములుగా విలక్షణత కనఁబడును. పునరపి విచారము చేయవలయును—ఇంతవిలక్షణత యుండుటయందు హేతు వేమి?

అప్పుడు ఇట్లు ఎఱుఁగవచ్చును—వానియందు జ్ఞానముయొక్క న్యూనత, మఱియు మనయందు అధికత గలదు; ఆజ్ఞానాధిక్యము వలన పశ్వాదులకన్న మనుష్యునకు శ్రేష్ఠత గలదు. విద్యారణ్యస్వాములు చెప్పుచున్నారు—

"యావద్యావజ్ఞానసామీప్యం తావచ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే" అభిప్రాయము— ఎంతెంత జ్ఞానముయొక్క సామీప్యము గలదో, అంతంత శ్రేష్ఠత్వవృద్ధి యగుచున్నది; ఇపుడు ఏజ్ఞానాధిక్యమువలన మనుష్యునకు పశ్వాదులకంటె శ్రేష్ఠత్వమో, ఆ జ్ఞానముయొక్క ఉపయోగము ఏరీతిగా చేయవలయునని మరల విచారము చేయవలయును; దానివలన సిద్ధమగునదేమనఁగా— పశ్వాదులకు అశక్యమైనట్టి, మనకు హితమైనట్టి యోగ్యవిచారమే ఆ జ్ఞానముయొక్క ఉపయోగము.

ఇచ్చట అనేకఆక్షేపములు పుట్టును—సముద్రముయొక్క గంభీరత వెతకుట యోగ్యవిచారమా? దూరమునందుండిన పదార్థము సమీపమున కనఁబడుటకు వెతకుట యోగ్యవిచారమా? పెట్టెలోపలనుంచిన కాకితమును బయటినుండి చదువుట యోగ్యవిచారమా? బృహస్పతియొక్క గతిని ఐదింటిచేగుణించి, మూడింటిచేభాగించినపుడు శనిగతికి ఎంతగుణ మగును? ఇదే యోగ్యవిచారమా? ఈవిధముగా విచారము చేయుచుపోగా ఇట్లు కనఁబడును—వానిలో ఏదియు యోగ్యవిచారముగాదు.

ఇట్లనినపక్షమందు ఏదియోగ్యవిచార మగుననిన, తనకు అతిశయావశ్యకమైనట్టి ఏవిచారమో, ఏవిచారముచేయనియెడ తనకుహానియగునో, అదియే యోగ్యవిచారమని సిద్ధమగును;ఇట్టి

ప్రత్యంతావశ్యకవిచార మేదియనఁగా—జగత్తుయొక్క మాతాపితరుఁడైన, సచ్చిదానందపరమాత్మయొక్క చరణము నూమట కొలుకు ఏ విచార ముపయోగమగునో, ఆ విచారమే.

ఒకానొకఁడనుచున్నాఁడు— సర్వజనులు పరమాత్మ విషయమందు కాముకులై యున్నారు; ఏలాగున ననఁగా—సర్వపురుషులు దుఃఖనివృత్తిని సుఖప్రాప్తిని కోరుచున్నారు; అదే పరమాత్మయొక్క స్వరూపము; పరమాత్మయందు ఇచ్ఛలేనిపురుషుఁడు ఎవ్వఁడును జగత్తునందు కనఁబడఁడు; కావున ఈవిషయమందు ఉపదేశము అనావశ్యకము? దానికి సమాధానము— సర్వజనులు పరమాత్మవిషయమందు కాముకులై యుండినను, పరమాత్మయొక్క యథార్థస్వరూపము ఎఱుఁగరు; భిన్నుఁడా? అభిన్నుఁడా? ఇదియును ఎఱుఁగరు; అందువలన పరమాత్మ విషయమందు విచారముకర్తవ్యము గలదు. ఇదియును గాక—

ఏగృహస్థుఁడు ఇల్లు కట్టుకొని యున్నాఁడో, వానికి గజములు, అశ్వములు, రథములు, అలంకారములు, దాసీదాసాదులు మొదలుకొని చాలపదార్థములఇచ్ఛ గలదు; అయిన ఏపదార్థములందు తీవ్రేచ్ఛ గలదో, అట్టి బియ్యము ఉప్పు మొదలయిన పదార్థములు మాత్రము శీఘ్రముగ ప్రాప్తమగును; మిగతపదార్థములు కాలాంతరమున ప్రాప్తము లగును; లేక ఎప్పుడును ప్రాప్తము గాకుండును; ఆప్రకారముగా సకలజనులకు పరమాత్మదర్శనేచ్ఛ యుండినను, అది తీవ్రముగ నుండుట లేదు; తీవ్రముగ నుండినపక్షమందు సిద్ధమగును; తీవ్రేచ్ఛగల వారైనబహుజనులకు పరమాత్మదర్శనమైనవిషయమునందు పురాణములలో చాలసంగతులు వినఁబడుచున్నవి.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఈ ప్రథమసూత్రాభిప్రాయము బ్రహ్మజ్ఞానవిషయమందు ఉత్కటజిజ్ఞాసగలవాఁడైన పురుషుఁడే ముక్తుఁడగుచున్నాఁడు; సర్వజనులకు పరమాత్మవిషయమందుండు ఇచ్ఛయొక్క ప్రకారమిట్లున్నది—

ఏ యనుచున్నాఁడు—నాకు ఇల్లుకట్టుకొనుట ఒకపెద్దపని యున్నది; సహస్రప్రయత్నములుచేసి, ఒకసారి ఇల్లుకట్టినపుడు నేను విశ్రాంతుఁడ నగుచున్నాను; తరువాత పరమాత్ముని భజనముచే చేయుచుందును. బీ యనుచున్నాఁడు— నాకొడుకు పెద్దవాఁడయినాఁడు; ఒకసారి వానికి వివాహముచేసిన, నేను విశ్రాంతుఁడనగుచున్నాను; తరువాత పరమాత్ముని భజనమునే చేయుచు కూర్చుండెదను. సీ యనుచున్నాఁడు—నాతలమీఁద ఇంకకొంచెము ఋణముగలదు; నేను ఆఋణమును తీర్చుకొనిన, నాకు పరమాత్మునిభజనముదప్ప ఏదియు పని లేదు. డీ యనుచున్నాఁడు— నాయుద్యోగము ఇరువదిఏడుసంవత్సరము లాయెను; ఇంకమూఁడుసంవత్సరములు గడచిన, నాకు ఇన్నూరు రూపాయలు పింఛనువచ్చును; తరువాత నాకు పనియేమి? పరమాత్మయే పరమాత్మ, నేనే నేను.

ఈరీతిగా ఒక్కొకమనుష్యుని ఒక్కొకకార్యము ఆటంకించును; ఆకార్యము కదాచిత్తుగా పూర్ణమైనపుడు దానివెంట నింకొక్కకార్యము ఉండనే యుండును; ఆకార్యమునుండి విశ్రాంతి ఎపుడు గలుగును? ఒకదినముమాత్రము విశ్రాంతి కనఁబడుచున్నది; అది ఏదిన మనఁగా—ఆదినమందు వీనికొఱకు అనేకజనులకు ఏడ్చుపని ప్రాప్తమగును; ఆదినముదప్ప వాఁడు ఎప్పటికిని విశ్రాంతుఁడగునది లేదు, భగవద్భజనమును చేయునది

లేక; దీనివలన జన్మమరణాది ప్రవాహమందు పడిపోయి, నానా ప్రకారములుగా దుఃఖోపభోగమును చేయుచుండును.

ఎవ్వరు సర్వకార్యములయొక్క తిరోధానముచేసి, భగవద్భజనమందు ప్రవృత్తులై యున్నారో, వారు అఖండసచ్చిదానంద బ్రహ్మరూపులయి యుంటున్నారు; కాబట్టి ఇపుడు మనము సర్వకార్యతిరోధానముచేసి, తీవ్రముగా భగవద్భజనమందు ప్రవర్తింపవలయును.

ఆభగవద్భజనమును అనేకవిధములుగా నున్నది; అందులో ఎవనికి పరమాత్మదర్శనమందుకోరిక యో, వాఁడు ఆత్మవిచారము చేయవలెను; ఎందుకనఁగా—అనన్యబోధముచేతనే పరమాత్మదర్శనమని వేదమందు చెప్పఁబడినది; దేనియొక్క అనన్యతవలన; ఎఱుఁగుటకు యోగ్యతఘటిల్లదో, అదిఅనన్యబోధమనఁబడియె. అభిప్రాయము—ఎవ్వఁడు పరమాత్మదర్శనముకోరుచున్నాఁడో వానికి తనకన్న భిన్నతచే అనఁగా—పరమాత్మ వేఱె, నేను వేఱె, ఈబుద్ధిచే పరమాత్మను ఎఱుఁగుటకు అధికారము లేదు; వాఁడు తనకన్న అభిన్నబుద్ధిచే చూచినపక్షమందే పరమాత్మదర్శనమగును; కనుక తనస్వరూపముయొక్కవిచారము మొదలు చేయవలసినది; అందువలననే భగవంతుఁడైన శ్రీమచ్ఛంకరాచార్యుఁడు పలుకుచున్నాఁడు—

కోఽహం కథమిదం జాతం కో వా కర్తాస్య విద్యతే,
ఉపాదానం కిమస్తీహ విచారస్సోఽయమీదృశః. 1

అభిప్రాయము— నేనెవఁడు? ఈజగత్తు ఎట్లు పుట్టుచున్నది? దీనికి కర్తఎవఁడు? దీనికి ఉపాదానమేమి? వీనివిచారము చేయవలెను.

ఇతరసర్వవిచారములను విడిచి, మొదట ఈవిచారము మనకు కర్తవ్యముగ నున్నది. ఈవిషయమందు ఒకసాధు వను చున్నాడు—"కలకా ఆజ కర్ ఆజకా అబ" రేపుచేయఁదగిన సాధనము నేఁడె చేయుము; మఱియు నేఁడుచేయఁదగినసాధనము ఇప్పుడె చేయుము. ఉక్తవిచారము మేముచేయకపోయిన, పశువు లోను నాలోను ఏమియును భేదము లేదు. ఒకసాధువు ఉక్త విచారహీనుఁడయిన మనుష్యుని పశువుకన్నను నీచుఁడని చెప్పు చున్నాఁడు—

"పశుకా హోతపన్హయ్యా నరకాకఛునహి హోయ,
నరకరనీకరేతో నరకానారాయణహోయ. 1

అభిప్రాయము—పశువుయొక్క మాంసము, రక్తము, చర్మము ఉపయోగించును; మనుష్యశరీరమునం దుండునది ఏ యుపయోగమునకురాదు; అట్లయినను, పూర్వము చెప్పినరీతిగా జ్ఞానాధిక్యమువలన మనుష్యునందు ఇంతపరాక్రమము గలదు- ఎపుడు మనుష్యుఁడు ఆత్మవిచారముచేయునో, అపుడు తానే పరమాత్ముఁ డగును; ఆత్మవిచారము చేయకపోయిన, పశువు కన్నను నీచుఁడుగా నున్నాఁడు; వాఁడు పశు వయ్యె ననుట ఎక్కువేమి? అందువలన ఆత్మవిచారము చేయుము! ఇప్పుడే చేయుము!!

---

# ఉపోద్ఘాతము

న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః,
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా. 1

సకలపురుషులు దుఃఖనివృత్తిని, సుఖప్రాప్తిని కోరుచున్నారు; వానికొఱకు నానాప్రయత్నములును చేయుచున్నారు; పెక్కు లేల! ఒకప్రాతఃకాలమునుండి ఇంకొక్క ప్రాతఃకాలమువఱకు ఇదే ప్రయత్నము; వినను "నేను దుఃఖినై యున్నాను" అనునీభ్రాంతిదక్క ఇంకొక్క దుఃఖము లేదు; మఱియు తననాభియందుండుకస్తురిచే సకలవనముసుగంధితమగుచున్నదని ఎఱుఁగక, సుగంధముకొఱకు మృగము వనవనముపరుగెత్తుచున్నది; ఆప్రకారముగ తాను సుఖరూపాత్మ, తనచేత నే విషయమందును సుఖలాభ మగుచున్నది; ఇట్లుండఁగా సుఖముకొఱకు నానాప్రయాసము చేయుచున్నాఁడు; ఇదియొక భ్రాంతియే.

ఈద్వివిధభ్రాంతి నివర్తించుటకొఱకు శ్రీవేదనారాయణుఁడు నడుముకట్టి నిలుచుచున్నాఁడు; అధికారులభేదోపభేదములు కల్పించి, వానివానికిఁదగినది ఉపదేశము కొఱకు కర్మోపాసనాజ్ఞానము లని త్రివిధభేదములును, అనేకోపభేదములును

కల్పించి, చిత్రవిచిత్రముగ ఉపదేశప్రకారము నారంభించెను; వానిలో సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని, దుఃఖనివృత్తి సుఖప్రాప్త్యుపాయములే వర్ణింపఁబడినవి.

వానిలో— జిజ్ఞాసువైన అత్యంతశ్రేష్ఠాధికారికిఁ దగినవి ఉపనిషత్తులు గలవు; వానివలన సాక్షాత్తుగా దుఃఖనివృత్తిసుఖప్రాప్తిరూపమోక్షము ప్రాప్తమగుచున్నది; ఆయుపనిషత్తులమీఁద సూత్రభాష్యవార్తికాద్యనేకగ్రంథము లగుచున్నవి; ఆయుపనిషత్తులును, ఆగ్రంథములును గీర్వాణవాణీరూపము లగుటవలన ఆవాణియొక్క అభ్యాసము లేనివానికి వానియొక్క ఉపయోగమవుట మహాకష్టమని యెఱిఁగి, అనేకభాష లెఱిఁగిన వారైన ఆధునికసాధుజనులు పరోపకారబుద్ధిచే ఆధునికభాషలలో వానియొక్క భాషాంతరమును, వానిమీఁద అనేకప్రకార గ్రంథములను రచించుచున్నారు; వానిలో—

ఈ శ్రీవిచారసాగరగ్రంథముసకుకర్త హాస్తినాపురసన్నిధిని కిహడౌలిగ్రామనివాసి శ్రీనిశ్చలదాసపండితాచార్యులు గారు; ఆధునికసాధువులకన్నను, ఆధునికపండితులకన్నను ఈయాచార్యులు విలక్షణులుగా నున్నారు; ఏలాగున ననఁగా- ఆధునికసాధువులందు ఇంతపండితుఁడు ఎవ్వఁడును లేఁడు; మఱియు ఆధునికపండితులందు ఇంతసాధువు ఎవ్వఁడును లేఁడు.

ఈగ్రంథముయొక్క భాషాంతరీకరణము అనేకభాషలలో అగుచున్నది; దానివలన దీనియొక్క ఉత్తమత సహజముగ తెలియఁబడును.

ఈ గ్రంథముమీఁద నేను ఆంధ్రభాషలో భాషాంతరము చేయ నారంభించి, ఏడుసంవత్సరములైనవి; ఇదివఱకుపనినడుచుచు ఇప్పుడిప్పుడు పూర్ణత కనఁబడుచున్నది; దానివలన నాది విశ్వారస్యమును, బుద్ధియును సహజముగా తెలియఁబడును; ఏలాగుననఁగా నేనుధనికుఁడై యుండినపక్షమందు కావలసినంతధనముఖర్చుచేసి, బుద్ధిమంతులచే శీఘ్రముగా పూర్తిచేసియుందును; నేను బుద్ధిమంతుఁడై యుండినపక్షమందు స్వయముగ శీఘ్రమే పూర్ణము చేయుదును; రెండునుగామివలన ఇంతకాలము వ్యవహారము నడుచుచున్నది; "మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్. యత్కృపా" అను నీ సజ్జనవచనమును సన్మానించుట కొఱకు పరమాత్మ ఈ గ్రంథము నాచేత పూర్ణము చేయించుచున్నాఁడు గాని నేను అధికారిని గాను.

ఈ గ్రంథము అనేకసాధుజనులయొక్కయు, పండితజనుల యొక్కయు సాహాయ్యముచే సిద్ధమగుచున్నది; వారిలోను శ్రీ చదలవాడ సుందరరామశాస్త్రిగారు ఈ గ్రంథరూపమందిరము నకు వరస్తంభముగ నున్నారు; ఆరంభమునుండి ఇదివఱకు వీరి యొక్కసాహాయ్యము విజ్ఞానవాదియొక్క విజ్ఞానధారవలె నడిచియే యున్నది.

శ్రీ జనార్దన చైతన్య

# అహాహా! మామతము ఎంతమంచిది!!



న్యాయాధీశునియొద్దకు వాదివచ్చి, ఉపచారములువేసి, తనఫిర్యాదుచక్కగారచించి, నివేదనముచేయుచున్నాఁడు; వాదియొక్క రసభరితభాషణమునుగురించి మోహితుఁడగుటవలన నది న్యాయాధీశునకు సర్వథా నిజముగఁ దోఁచుచున్నది; పిదప వాదిని విశేషమూ క్షేపింపక, సాక్ష్యమడుగక, ప్రతివాదినిపిలువక, వాదితరఫున తీర్పువ్రాయుచున్నాఁడు; ఆతీర్పు పైకోర్టుకు ఎంత విశ్వాసనీయమో, తనమతమునకు విరోధి ఏమతముగలదో, దానియొక్క పూర్తిశోధనముచేయక, తనప్రతివాది ఆచార్యుఁడు ఏమనుచున్నాఁడో అడుగక, అహాహా మామతము ఎంతమంచిది; అనువారియొక్క భాషణము అంతవిశ్వాసనీయముగ నున్నది.

శ్రీమద్వ్యాస వాల్మీకి గౌడపాద శంకర పద్మపాద మధుసూదనాచార్యులు మొదలగువారైన ఆచార్యులయొక్క వేదాంతప్రస్థానత్రయ మనుసరించిన ఏయద్వైతమతముగలదో, ఆమతము అన్నిమతములకు ముఖ్యప్రవాదిగా నున్నది, "అహాహా! మామతము ఎంతమంచిది!!" అనునట్టి ఆచార్యులు ఆమతముయొక్క మంచిశోధనముచేసి, ఏయేయంశములందు తమమతమునకు విరోధముగలదో, వానియొక్క మంచి విచారముచేసి, యుక్తిప్రమాణములచే ఆమతముయొక్క ఖండనము

చేసినపక్షమందే వారియొక్క అహాహా సార్థకమగును; లేనిపక్షమందు వారియొక్క అహాహా హుంహుంహుం అన్నియు సుజ్ఞజనులకు ఉపహాసాస్పదమగుచున్నదిగాని, వేఱొక్క అర్థములేదు.

ఎవరిమతమందు చావుకువెనుక కాకికుక్క రూపముల ముక్తి చెప్పఁబడినదో, ఎవరిమతమందు చావుకువెనుక దాసదాసానుదాసరూపముక్తి చెప్పబడినదో, ఎవరిమతమందు చావుకువెనుక చతుర్భుజపీతాంబరధారిరూపముక్తి చెప్పఁబడినదో, ఎవరిమతమందు చావుకువెనుక బ్రహ్మరూపముక్తి చెప్పఁబడినదో, ఆయామతస్థులైనజనులు, ఎవరిమతమందు జీవితదశలో సచ్చిదానందరూపముక్తి చెప్పఁబడినదో,ఆమతమును ముందుగా అనుసరించి,ముందుగా ఆముక్తియొక్క అనుభవముపొంది, దానియందున్న న్యూనాధికతల విచారముచేసి, తరువాత తమతమమతమందు ప్రవృత్తులగుట సయుక్తికముగ కనఁబడుచున్నది.

ఎవరిమతమందు "ఆదేశకాలము లనుసరించి ఆయాచార్యుఁడు అట్లె చెప్పుచున్నాఁడు; ఇంకొక్క దేశకాలములననుసరించి ఇంకొక్కాచార్యుఁడు అట్లె చెప్పుచున్నాఁడు; ఈ దేశకాలమనుసరించి ఈయాచార్యుఁడు ఇట్లుచెప్పుచున్నాఁడు; గాని, అందఱికి అభిప్రాయ మొకటే" అనువారియొక్క మతము అన్ని ఆచార్యులమతములకంటె వేఱుగానున్నది;ఏలాగుననఁగా—ఆయాయాచార్యులమతంబులందు పరస్పరవిరోధకము, ఒకనియొక్క మతమందు ఇంకొక్కఁడు దోషములుచూపి, ఆమతము తిరస్కరించి,ఆమతముయొక్కయు ఆచార్యునియొక్కయు నింద

చేయుచున్నాఁడు; ఈమతమందో, దేశకాలనిమిత్తముచే మతభేదముగాని, అభిప్రాయ మొక టగుటచే పరస్పరవిరుద్ధమైనట్టి వారిభాషణములకు సమన్వయము చేయుచున్నారు.

మంచిది! వేర్వేఱె మతముచేయుట బుద్ధికి భూషణము గాని, దూషణముగాదనిను, ఆమతస్థులనడుగుట ఏమనఁగా— ఆదేశకాలమందు ఆత్మ వేఱె, ముక్తి వేఱె, సాధనములు వేఱె, ఇంకొక్క దేశకాలమందు, ఈదేశకాలమందు వేఱా? ఒకటియా? వేర్వేఱైన, ఆంధ్రదేశముయొక్క ఉపదేశము కలింగదేశమునకు, కలింగదేశముయొక్క ఉపదేశము గుర్జరదేశమునకు, ఉపయోగింపదు; నిన్నటి ఉపదేశము నేఁడు; నేఁడు చేయఁబడినఉపదేశము రేపు, ఉపయోగింపదు. ఆత్మ ఒకఁడె ముక్తి ఒకఁడె అనినపక్షమందు దేశకాలభేదముచే ఆచార్యులభాషణము ముక్తికి ఉపయోగింపదు; ఈవిచారము చేయవలసినది.

[సుభిక్షకాల మనుసరించి ధాన్యము అగ్గువగా చెప్పి, మధుర మధురవచనముతో గ్రాహకుని ఆదరముచేయు, దుర్భిక్షకాల మనుసరించి ధాన్యము ప్రియముగ చెప్పి, కర్కశవచనముతో కావలసినదైనతీసికొనుము, లేనిపక్షమందుపొమ్ము,అనువర్తకుని ధాన్యవ్యాపారమువలె ఆచార్యస్వాములవారియొక్క దేశకాలాధీనమగు పరమార్థవ్యాపారము ఈమతమునందు కనఁబడుచున్నది ]

ఎవరిమతమందు కొన్ని అంశములు పైఁజెప్పఁబడిన వ్యాసవసిష్ఠాద్యాచార్యుల మతానుసారములుగాను,కొన్ని అంశములు

విరుద్ధములుగాను ఉన్నవో, ఆమతస్థులు తమమతమునకు అద్వైతమతమని పేరుపెట్టఁగూడదు; ఎందుకనఁగా—"అహింసా పరమో ధర్మః" మొదలగు కొన్ని వేదవచనములయొక్క అంగీకారము చేయఁబడినట్టి జైనమతమును ఆస్తికజనులు వైదికమత మనరు.

ఎవరిమతమందు—"ఇతరసర్వమతములు దూషితములుగా నున్నవి, అందువలన వానిని విడిచి, నీవు మామతము మీఁద విశ్వాస ముంచుము; అనఁగా నీయుద్ధార మగును" అను చున్నారో, ఆమతాచార్యులు తమమతముమీఁద విశ్వాస ముంచుటకన్న మునుపు తమమీఁద విశ్వాస ముంచునట్లు వర్తనము చేయవలయును; లేనిపక్షమందు వారిమతముమీఁద బుద్ధిమత్పురుషునికి విశ్వాసము పుట్టదు; ఎట్లనఁగా—ఎప్పుడు ఉమేదవారుఁడు తనసంభావితతవిషయమందు ఎవనిసర్టిఫికేటు తీసికొని వచ్చుచున్నాఁడో, అపుడు యజమానుఁడు సర్టిఫికేటువ్రాయువానియొక్క సంభావితత మొదలే స్మరించుచున్నాఁడు.

ఆయాచార్యులకు తమకు విశ్వసనీయముగ వర్తించుట అశక్యముగ కనఁబడినపక్షమందు తమమతమందు వ్రాయఁబడిన వాక్యము మార్చి, "దూషితములైన సర్వమతములును విడువుము, మామతమందు దోషము గలదా లేదా చూడుము" అనునీప్రకారముగ వ్రాయుట సయుక్తికముగ తోఁచుచున్నది.

ఓయి శ్రద్ధావంతుఁడా! ఆమతమందు విద్వాంసులసంఖ్య తక్కువగానున్నది, ఈమతమందు ఎక్కువగానున్నది, ఇంకొక్క

మతమందు దీనికన్న ఎక్కువగా నున్నది. ఏమతమందు విద్వాంసుల యాధికతగలదో, ఆమతము యథార్థముగ నుండవలయును. ఎందుకనఁగా అయథార్థమతమందు విద్వాంసులు ప్రవేశము చేయరు.అనునీప్రకారముగ విద్వాంసులఆధిక్యమువలన మతముయొక్క యథార్థతాభ్రాంతిని వీడుము; ఎందు కనఁగా—నీక ఎవరెవరు విద్వాంసులని కనఁబడుచున్నారో, వారిలోకొందఱు పరమార్థవిషయమందు అవిద్వాంసులుకూడ నున్నారు.

బి. ఎ., బి. యల్., యమ్. ఎ. ఎంతెంత పెద్దపెద్దవిద్యలయొక్క పరీక్షనిచ్చి, సర్టిఫికేటు సంపాదనము చేయుచున్నారు; రావుసాహేబ్, రావుబాహాదూర్, దివాన్‌బాహాదూర్, అంతంత పెద్దపెద్దమరాతబలను పొందుచున్నారు; యంత్రతంత్రసంగీతసాహిత్యకళాకౌశల్యములనుసంపాదించుచున్నారు. అంతజనులను అవిద్వాంసు లనవలెనా? అని సంశయము పడవలదు; చూడుము—

ఒకానొకపురుషుఁడు ఆశియాయురోపఆఫ్రికా అమేరికాలు నాలుగుఖండములపృథ్వీసంచారము చేయుచున్నాఁడు; ఏదైనపట్టణముయొక్క వార్త అడిగినపుడు సవిస్తరముగ చెప్పుచున్నాఁడు; అయినను, వానిగ్రామమందు వానిఇంటిసమీపమే ఒకతోఁటయున్నది; దానియందు ఏయేచెట్టులు గలవని యడిగిన, చెప్పుటకు సమర్థుఁడుగాఁడు; ఎందుకనఁగా—ఎక్కడెక్కడ బుద్ధియొక్కప్రవాహము నడుచుచున్నదో, అక్కడక్కడ జ్ఞానరూ

ప్రకాశమగును; మిగతస్థలమందు అజ్ఞానరూప మగుచీఁకటి యుండనేయున్నది; సమీపదూరములమీఁద తాత్పర్యము లేదు.

సకలపృథ్వి తిరుగుచున్నాఁడు; అందువలన సకలపృథ్వీ వృత్తాంతము తెలియును; సమీపపుతోఁటయందు పోవుప్రసంగము ఎప్పటికిని రాలేదు, పోలేదు; అందువలన దానియొక్క వృత్తాంతము తెలియదు; సకలపృథ్వీవార్త తెలిసినవానికి సమీపవార్త తెలియదేమి అనుట అనుచితము. ఆప్రకారముగా ఏయేవిద్యలందు విద్వాంసులు అభ్యాసము చేయుచున్నారో, ఆయావిద్యలందు ఝగ్ ప్రకాశము గలిగినను, వారికి బ్రహ్మవిద్య విషయమందు చీఁకటియే.

ఓరివిద్వాంసులారా! మీరు చాలపరిశ్రమముచేసి, పెద్ద పెద్దవిద్యలను సంపాదించి, వానివలన ధనమానకీర్తులను పొందుచున్నారు. అయిన, సుజ్ఞజనులు ఒకబ్రహ్మవిద్యదక్క సకల విద్యలు అవిద్యయొక్క ఉపభేదము లని ఎఱుఁగుచున్నారు; నిర్గంధవృక్షోపవనమునందు చందనతరువు పుట్టినపుడు, తత్సన్నిధానముచే నిర్గంధవృక్షములును సుగంధిలము లగుచున్నవి; ఆ ప్రకారముగ ఇతరవిద్యారూప నిర్గంధవృక్షములయొక్క బుద్ధి రూపమగుతోఁటయందు బ్రహ్మవిద్యారూపచందనతరువు పుట్టిన పక్షమందే ఇతరవిద్యారూపవృక్షములు సుగంధిలము లగును; లేకుండిన?

---

•

# విషయానుక్రమణిక



## ప్రథమతరంగము


| విషయము. | | | పుటం. |
|---|---|---|---|
| వస్తునిర్దేశరూపమంగళము | ... | ... | 1 |
| గ్రంథమహిమ | ... | ... | 24 |
| అనుబంధవర్ణనము | ... | ... | 27 |
| అధికారివర్ణనము | ... | ... | 28 |
| సాధనచతుష్టయము | ... | ... | 31 |
| వివేకవర్ణనము | ... | ... | 31 |
| వైరాగ్యలక్షణము | ... | ... | 33 |
| శమాదిషట్కము | ... | ... | 37 |
| ముముక్షుతాలక్షణము | ... | ... | 50 |
| సాధనసంఖ్య | ... | ... | 51 |
| అంతరంగబహిరంగసాధనములు | ... | ... | 53 |
| వివేకాదికమునకు అంతరంగత | ... | ... | 55 |
| ముఖ్యమైనయంతరంగసాధనము మహావాక్యము, శ్రవణాదుల లక్షణములు | ... | ... | 56 |
| శ్రవణాదులు పరంపరగా జ్ఞానహేతువులు | ... | ... | 69 |
| అవాంతరమహావాక్యములకు పరోక్షాపరోక్షజ్ఞానహేతుత | | ... | 75 |
| వేదాంత్యేకదేశిమతము, కేవలవాక్యమువలన పరోక్షజ్ఞానము | | ... | 76 |
| ఏకదేశిమతముయొక్క అసమీచీనత | ... | ... | 77 |

విషయము. పుట.

సంబంధవర్ణనము ... ... 83

విషయవర్ణనము ... ... 85

ప్రయోజనవర్ణనము ... ... 86

ప్రయోజనమందు ప్రథమాక్షేపము—ప్రాప్తప్రాప్తి ఘటిల్లదు 86

ప్రథమాక్షేపసమాధానదృష్టాంతము ... ... 87

ప్రయోజనమందు ద్వితీయాక్షేపము—ఒక్కటే మోక్షమందు భావాభావములు రెండుఁసిద్ధింపవు? ... ... 90

ద్వితీయాక్షేపమున కుత్తరము—మోక్షమందు రెండును సంభవించును 90

ద్వితీయతరంగము

సకారణమగు జగన్నివృత్తీచ్ఛ ఘటిల్లదు? ... ... 96

దుఃఖనివృత్తికొఱకు సాజ్ఞానజగన్నివృత్తీచ్ఛ ఘటిల్లదు? ... 97

బ్రహ్మప్రాప్తిరూపమోక్ష ద్వితీయాంశేచ్ఛయుం ఘటిల్లదు? ... 98

అన్యరీతివలన అధికార్యభావము? ... ... 99

జీవబ్రహ్మలయేకత గూడదు? ... ... 100

సాక్షియొక్క నానాత్వము? ... ... 103

మిథ్యాబంధమునకు సామగ్రిలేదు; సత్యబంధనివృత్తి జ్ఞానముచేత ఘటిల్లదు? ... ... 109

అధ్యాససామగ్రి? ... ... 111

బంధాధ్యాసమందు సత్యవస్తుజ్ఞానజన్యసంస్కారమును ప్రమేయదోషమును లేదు? ... ... 113

బంధాధ్యాసమునందు ప్రమాత్రాది దోషాసిద్ధి? ... 114

బంధాధిష్ఠానమునకు సామాన్యజ్ఞానము విశేషాజ్ఞానము ఘటిల్లదు? 115

కేవలకర్మవలన మోక్షసిద్ధి ఏకభవికవాదము? ... 116

సంబంధఖండనము? ... ... 124

విషయము. పుట.

25—26-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—మోక్షము ప్రథమాంశమునందు ఇచ్ఛ పుట్టుట సంగతము ... 126

27—28-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—ముముక్షువు లేకపుట ఘటిల్లదు ... ... 129

ముముక్షువుయొక్క ప్రవృత్తివలన గ్రంథారంభసఫలత ... 132

పురుషవర్గములు పామరవిషయిలక్షణములు ... ... 136

జిజ్ఞాసులక్షణము ... ... 138

ముక్తలక్షణము ... ... 143

గ్రంథమందు పామరాదిత్రయమునకు అప్రవృత్తి జిజ్ఞాసువునకు ప్రవృత్తి ... ... 143

29-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—సాక్షి బ్రహ్మైక్యసిద్ధి ... ... 145

30-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—జీవబ్రహ్మైక్యసిద్ధి 148

31-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—కార్యాధ్యాస నిరూపణము ... ... 150

32—33-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—పూర్వపూర్వ సంస్కారమువలన ఉత్తరోత్తరాధ్యాసము ... 151

34-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—అధ్యాసమునకుఁ దోషత్రయాపావశ్యకత ... ... 162

35-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—కార్యాధ్యాస నిరూపణము ... ... 169

36-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—ఏకభవికవాదము యొక్క ఖండనము ... ... 175

37-గత పూర్వపక్షమునకు సానువాదసమాధానము—అధికార్యాధ్యాస బంధసిద్ధి ... ... 182

విషయము. పుట.

## తృతీయతరంగము


| | | | |
|---|---|---|---|
| గ్రంథారంభప్రతిజ్ఞ | ... | ... | 184 |
| శ్రీగురులక్షణము | ... | ... | 184 |
| శిష్యలక్షణము | ... | ... | 197 |
| గురుభక్తిఫలనిరూపణము | ... | ... | 198 |
| జ్ఞానియగుగురువువలన వేదార్థపఠనశ్రవణముయొక్క యోగ్యత. | | | 200 |
| భాషాగ్రంథమువలనను జ్ఞాన మగుచున్నది | ... | ... | 200 |
| గురుసేవాకర్తవ్యత | ... | ... | 203 |
| ఆచార్యసేవాప్రకారము | ... | ... | 204 |
| తన్వర్పణము | ... | ... | 205 |
| మనోర్పణము | ... | ... | 205 |
| ధనార్పణము | ... | ... | 206 |
| వచనార్పణము | ... | ... | 206 |
| శిష్యునకు గురువుతో సంబంధవ్యవహారము | ... | ... | 207 |
| భిక్షాన్నవినియోగము | ... | ... | 209 |
| ప్రసంగానుసారప్రార్థనము | ... | ... | 210 |
| పూర్వసుకృతాధికారికి సహజోపదేశము | ... | ... | 210 |


## చతుర్థతరంగము


| | | | |
|---|---|---|---|
| శుభసంతతిరాజకథారంభము | ... | ... | 219 |
| తత్త్వదృష్టియొక్క మోక్షేచ్ఛాసూచకప్రార్థన | | ... | 230 |
| 70-గతప్రశ్నకుత్తరము—మోక్షేచ్ఛయొక్క భ్రాంతిజన్యతా ప్రతిపాదన పూర్వకమైనమహావాక్యోపదేశము | ... | ... | 230 |
| ప్రశ్న—ఆత్మయానందరూపుండైనపుడు విషయసంబంధమువలన ఆనందభానము గాఁగూడదు ? | ... | ... | 231 |

విషయము. పుట.
72-ప్రశ్నకు ఉత్తరము—అంతర్ముఖవృత్తియందు ఆనందభానము విషయమునందు ఆనందము లేదు ... ... 232
ప్రశ్న—జ్ఞానికిని అజ్ఞానికివలె విషయేచ్ఛయుండు విషయముచే సుఖజ్ఞానమును అయినదా లేదా ? ... ... 234
74-గతప్రశ్నకు ఉత్తరము—ఆత్మవిముఖులు ఇద్దఱకు విషయానందము స్వరూపానందముకన్న అభిన్నము ... ... 234
ప్రశ్న—జన్మాదిదుఃఖము దేనియందున్నది ? ... 236
76-ప్రశ్నకుత్తరము—జన్మాదిదుఃఖము ఎక్కడను లేదు ... 237
ప్రశ్న—దుఃఖ మెక్కడను లేదేని ప్రత్యక్షప్రతీత మెట్లగును ? 243
78-గతప్రశ్నకుత్తరము—ఆత్మాజ్ఞానమువలన సంసారప్రతీతి రజ్జు సర్పదృష్టాంతము ... ... 243
ప్రశ్న—రజ్జువునందు సర్పము ఎట్లు భాసమానముగా నున్నది ? 244
80-గతప్రశ్నయొక్క అభిప్రాయము ? ... ... 244
అసత్ఖ్యాతి ... ... 244
ఆత్మఖ్యాతి ... ... 245
అన్యథాఖ్యాతి ... ... 245
అఖ్యాతిప్రతిపాదనము, పైమూడుఖ్యాతులఖండనము ... 247
80—85-గతప్రశ్నలకుత్తరము—86—90-అఖ్యాతిమతఖండనము 249
అనిర్వచనీయఖ్యాతి వేదాంతమతము 87—90 ... 250
భ్రమస్థలమందు సర్పాదికము, తద్జ్ఞానముసాక్షిభాస్యము ... 252
రజ్జుసర్పము తద్జ్ఞానము అవిద్యాపరిణామమై చైతన్యవివర్తము 254
విషయమునకును జ్ఞానమునకును భిన్నభిన్నాధిష్ఠానములైనను ఏకాధిష్ఠానజ్ఞానమువలన నివృత్తి ... ... 255
శంక—రజ్జుజ్ఞానమువలన సర్పనివృత్తి గానేరదు ? ... 256

విషయము. పుట.
91-గత ప్రశ్నకుత్తరము—రజ్జుజ్ఞానమే సర్పాధిష్ఠానజ్ఞానము 256
అన్యశంక—రజ్జుజ్ఞానమువలన సర్పజ్ఞాననివృత్తి ఘటిల్లదు ... 257
93-గత ప్రశ్నకుత్తరము—సర్పాభావమువలన సర్పజ్ఞాన
నివృత్తి 94—97 ... ... 258
రజ్జుజ్ఞానసమయమందు సాక్షియొక్క భావము ... 259
సకలత్రిపుటీజ్ఞానమందు సాక్షిజ్ఞానము ... ... 260
సర్పము సర్పజ్ఞానము రెండింటికిని అధిష్ఠానము సాక్షి ... 261
ప్రశ్న—జగత్తునకు ఆధారము అధిష్ఠానము ఎవ్వఁడు? ... 264
98-గత ప్రశ్నకుత్తరము—99—100-జగత్తునకు ఆధారమును
అధిష్ఠానమును నీవు ... ... 264
ఆత్మయొక్క సామాన్యరూపము ఆధారము, విశేషరూపము అధిష్ఠానము 265
ప్రశ్న—జగద్ద్రష్ట ఆత్మకన్న భిన్నుఁడనవలయును? ... 266
101-గత ప్రశ్నకుత్తరము—102—103 సకలకల్పితపదార్థమునకు
అధిష్ఠానమే ద్రష్ట ... ... 267
మిథ్యాసంసారముయొక్క నివృత్తిచ్ఛ ఘటిల్లదు ... 267
సంసారము దుఃఖహేతువగుటవలన తన్నివృత్త్యుపాయము చూపుఁడు 268
104-గత ప్రశ్నకుత్తరము— జగన్నివృత్త్యుపాయమగు
జ్ఞానస్వరూపము 105—106 ... 268
జ్ఞానముచేతనే అజ్ఞాననాశము ... ... 269
ప్రశ్న—గురూక్త్యర్థానువాదపూర్వకముగా వక్ష్యమాణశంకా
సూచనము? ... ... 270
బ్రహ్మస్వరూపము నాస్వరూపము విరుద్ధమగుటచే ఏకతఘటిల్లదు? 270
జీవబ్రహ్మైక్యమువలన కర్మోపాసన ప్రతిపాదకవేదము నిష్ఫలమగును? 271
107-గత ప్రశ్నకుత్తరము 110—119 ఆకాశములు నాలుగు
చైతన్యములు ... ... 273

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| ఘటాకాశవర్ణనము | ... | ... | 273 |
| జలాకాశవర్ణనము | ... | ... | 274 |
| మేఘాకాశవర్ణనము | ... | ... | 275 |
| మహాకాశవర్ణనము | ... | ... | 276 |
| నాలుగుచైతన్యములకు ఉపోద్ఘాతము | ... | ... | 276 |
| కూటస్థస్వరూపవర్ణనము | ... | ... | 276 |
| జీవస్వరూపవర్ణనము | ... | ... | 277 |
| ఈశ్వరస్వరూపవర్ణనము | ... | ... | 284 |
| బ్రహ్మస్వరూపవర్ణనము | ... | ... | 287 |
| 108-గత ప్రశ్నకుత్తరము 120—121 కూటస్థుఁడు ప్రకాశవంతుఁడు ఆభాసుఁడుభోగి | ... | ... | 291 |
| ఆభాసుఁడు కర్మచేయువాఁడు ఆభాసుఁడు ఫలమిచ్చువాఁడు | | | 292 |
| 109-గతప్రశ్నకుత్తరము—జీవబ్రహ్మలలక్ష్యార్థమున కభేదము | | | 293 |
| ప్రశ్న—అహంబ్రహ్మ మనుజ్ఞాన మెవ్వనికగును ? | . | ... | 294 |
| 123-గతప్రశ్నకుత్తరము—ఆభాసునిసప్తావస్థలు నామములు 124—129 | ... | ... | 295 |
| అజ్ఞానావరణముల స్వరూపము | ... | ... | 297 |
| భ్రాంతివర్ణనము | ... | ... | 297 |
| పరోక్షాపరోక్ష ద్వివిధజ్ఞానవర్ణనము | ... | ... | 297 |
| భ్రాంతినాశవర్ణనము | ... | ... | 298 |
| అతివార్త నిరూపణము | ... | ... | 299 |
| 123-గతప్రశ్నకు గూఢాభిప్రాయము—ఆభాసునకు నేను బ్రహ్మ మను జ్ఞానము మిథ్య యగును ? | .. | ... | 300 |
| 130-గతప్రశ్నకుత్తరము—ముఖ్యసామానాధికరణ్యము, బాధ సామానాధికరణ్యము | ... | ... | 306 |

విషయము. పుటం.

ప్రశ్న—కూటస్థాభాసులభానము క్రమముగానా? క్రమరహితముగానా? 308

132-వ ప్రశ్నకుత్తరము 133—146 ఒకేసమయమునందు రెంటియొక్క భానము ... ... 308

అజ్ఞానమున కాశ్రయము విషయము చైతన్యము ... 310

బాహ్యపదార్థములందు వృత్త్యాభాసునియొక్క ఉపయోగము 311

ఉక్తసంగతియొక్క దృష్టాంతసహిత కథనము ... 313

మతమతాంతరములందు అధికాధికప్రమాణాంగీకారము ... 314

ప్రమాణప్రమేయములలక్షణములు ... ... 317

స్మృతివిచారపూర్ణత ... ... 319

ప్రమ, కారణము, కరణము వీని విచారము ... ... 321

చైతన్యచతుష్కము ... ... 322

అవచ్ఛేదవాదమురీతిగా ప్రమాత, సాక్షి, విశేషణము, ఉపాధి వీనిలక్షణములు ... ... 324

ఆభాసవాదమురీతిగా జీవసాక్షులలక్షణములు ... 327

ఆభాసవాదముయొక్క శ్రేష్ఠత 144—145 ... 329

అంతఃకరణమునందు ద్వితీయప్రకాశము గలుగుటవలన అదియె ప్రమాత ... ... 330

చతుర్విధచైతన్యస్వరూపము, సాక్షిసాక్షాత్కారము ... 331

ప్రశ్న—147—151 అహంబ్రహ్మాస్మి అనుజ్ఞానము ప్రత్యక్ష మెట్లగును ? ... ... 333

బ్రహ్మము నేత్రమునకు అవిషయము, రామకృష్ణాదులశరీరములు బ్రహ్మముగావు? ... ... 333

బ్రహ్మమునకు త్వగాదీంద్రియములయొక్క అవిషయత! ... 343

బ్రహ్మమునకు కర్మేంద్రియములయొక్క అవిషయత! ... 345

విషయము. పుట.

బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షముగాదను ఆక్షేపమునకు సమాప్తి? 345

147—151-నకప్రశ్నకుత్తరము 152—153 పరోక్షాపరోక్ష

జ్ఞానముల విభాగము ... ... 345

బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షమగును ... ... 348

పంచమతరంగము

వేదగురువులు సత్యముగనుండనీ మిథ్యగానుండనీ అద్వైతసిద్ధి పుట్టిల్లదు 354

154-నకప్రశ్న కుత్తరము—శంకరమతముయొక్క

ప్రామాణ్యము 155—161 ... ... 355

భర్తృకథారంభము ... ... 357

మిథ్యయొక్కనాశము మిథ్యవలన ... ... 383

మృగజలము, తృష వీనియందు సత్తయొక్క భేదము ... 386

సమసత్తగలపదార్థములకు తమలో తమకు సాధకబాధకత ... 386

సత్తాత్రయవిచారము ... ... 389

వేదగురు భవదుఃఖములు సమసత్తగలవగుటవలన వేదగురువులచే

భవదుఃఖనాశము ... ... 391

శుక్తిరజతాదులు, సంసారదుఃఖము వీనిబాధయందు భేదము ఎందువలన? 393

152-నకశంకకుత్తరము—దేనిఅజ్ఞానమువలన దేనిప్రతీతియో,

దానిజ్ఞానమువలన దానిబాధ ... ... 394

సంసారోత్పత్తికి క్రమ మేది? ... ... 394

164-నకప్రశ్నకుత్తరము—165—195 క్రమములేకజగద్భానము 394

జగదుత్పత్తియందు ఏకరూపతా ప్రతిపాదకమగు భాష్యకారుని

యభిప్రాయము ... ... 395

మాయాస్వరూపప్రతిపాదనము ... ... 397

అజ్ఞానముయొక్క స్వాశ్రయస్వవిషయత ... ... 399

| విషయము. | పుట. |
|---|---|
| వాచస్పతియొక్క మతము ... ... | 399 |
| 169-గతమతముయొక్క అసమీచీనత ... ... | 400 |
| స్వాశ్రయస్వవిషయపక్షముయొక్క అంగీకారము ... | 401 |
| ఏకాజ్ఞానపక్షమందు బంధమోక్షవ్యవస్థ ... ... | 403 |
| ఈశ్వరస్వరూపము, ద్వివిధకారణలక్షణము ... ... | 404 |
| జీవస్వరూపవర్ణనము ... ... | 407 |
| ఈశ్వరునియందు విషమసృష్టి, క్రూరత లేవు ... | 407 |
| జీవునిభోగమునిమిత్తము ఈశ్వరునకు జగదుత్పత్తీచ్ఛ ... | 407 |
| సూక్ష్మసృష్టినిరూపణము—177—181 గుణసహితముగ పంచభూతోత్పత్తి ... ... | 409 |
| అంతఃకరణోత్పత్తి ... ... | 410 |
| ప్రాణపంచకోత్పత్తి ... ... | 411 |
| దశేంద్రియములయొక్క ఉత్పత్తి ... ... | 413 |
| సూక్ష్మసృష్టిసంపూర్ణత ... ... | 413 |
| పంచీకరణము ... ... | 414 |
| స్థూలబ్రహ్మాండాదికముయొక్క ఉత్పత్తి ... ... | 415 |
| పంచకోశవివేకము 185—195 ... ... | 415 |
| విరోచనునిసిద్ధాంతము: అన్నమయకోశమే ఆత్మ ... | 423 |
| ఇంద్రియాత్మవాదిమతము ... ... | 435 |
| హిరణ్యగర్భుని నుపాసించువారియొక్క మతము: ప్రాణమే ఆత్మ | 435 |
| మనఆత్మవాదిమతము ... ... | 436 |
| విజ్ఞానవాదిమతము: బుద్ధి ఆత్మ ... ... | 437 |
| పూర్వమీమాంసైకదేశిభట్టమతము: ఆనందమయకోశము ఆత్మ | 438 |
| మాధ్యమికబౌద్ధుండైన శూన్యవాదిమతము: ఆనందమయకోశము ఆత్మ | 439 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| ప్రభాకరనైయాయికులమతము: ఆనందమయకోశము ఆత్మ ... | | | 440 |
| ఆచ్ఛాదకమైన జీవపంచకోశన్యాయమున ఈశ్వరుని పంచకోశములు | | | 441 |
| పంచకోశవ్యతిరేకప్రకారము | ... | ... | 444 |
| మహావాక్యార్థోపదేశము | ... | ... | 447 |
| ప్రశ్న—కర్తభోక్తయగు ఆత్మకు బ్రహ్మముతో ఏకత ఘటిల్లదు | | | 448 |
| 196-గతప్రశ్నకుత్తరము—197—227 అకర్త అభోక్త యగునాత్మకు బ్రహ్మముతో అభేదము | | ... | 448 |
| జీవన్ముక్తనిశ్చయము; వేదాంతశ్రవణఫలము | | ... | 449 |
| జ్ఞానియొక్కయు అజ్ఞానియొక్కయు చిహ్నము | | ... | 451 |
| గోప్యతత్త్వోపదేశము | ... | ... | 451 |
| లయచింతనము—201—203 సర్వప్రపంచమునకు ఈశ్వరత | | | 456 |
| సకలసూక్ష్మసృష్టియొక్క అపంచీకృతత | ... | ... | 458 |
| బ్రహ్మంబునందు సకలపదార్థములయొక్క లయచింతనము | | ... | 458 |
| ధ్యానజ్ఞానాంతర్భేదము, అహంగ్రహధ్యానము | | ... | 461 |
| ప్రణవముయొక్క ఉపాసన | ... | ... | 466 |
| నిర్గుణసగుణోపాసనలయొక్క ఫలసహితకథనము | | ... | 467 |
| నిర్గుణప్రణవోపాసనప్రకారము | ... | ... | 468 |
| ఓంకారమునకును బ్రహ్మమునకును అభేదము | | ... | 469 |
| పాదచతుష్టయకథనపూర్వకముగా ఆత్మకు బ్రహ్మముతో విశ్వునితో విరాట్టుతో అభేదము | ... | ... | 470 |
| చతుర్దశత్రిపుటి | ... | ... | 472 |
| విశ్వాకారాదకారముల కభేదము | ... | ... | 473 |
| విశ్వతైజసులయొక్క పరస్పరవిలక్షణత | ... | ... | 474 |
| తైజసహిరణ్యగర్భోకారముల కభేదము | ... | ... | 475 |

| విషయము. | పుట. |
| --- | --- |
| ప్రాజ్ఞేశ్వరమకారముల కభేదము ... ... | 475 |
| విశ్వాదులగు ముగ్గురికి ఏకత తురీయేశ్వరసాక్షుల ఏకత ... | 475 |
| ఓంకారమునకు ఆత్మకు బ్రహ్మమునకు మాత్రాపాదములవలన అభేదము | 476 |
| లయచింతనమునకు అనువాదము, ఒక్కొక్కమాత్రారూపమునకు అన్యమాత్రారూపత ... ... | 477 |
| ఓంకారచింతనమందు పరమహంసాధికారము ... | 478 |
| ప్రణవోపాసన చేయువానికి ఫలము ... ... | 479 |
| బ్రహ్మలోకముయొక్క మార్గక్రమము ... ... | 480 |
| సాయుజ్యమోక్షవర్ణనము ... ... | 481 |
| అహంగ్రహోపాసనమువలన బ్రహ్మలోకప్రాప్తి ... | 483 |
| ఉత్తరాయణమార్గమువలన అపునరావృత్తి ... ... | 483 |
| హిరణ్యగర్భలోకవాసికి బ్రహ్మాత్మజ్ఞానమందు హేతుత ... | 484 |
| ఓంకారమహావాక్యములందు అర్థమొక్కటె... ... | 485 |
| అదృష్టదృష్టికి పురుషార్థసిద్ధి ... ... | 486 |
| నిర్గుణోపాసనయందు అనధికారికి కర్తవ్యము ... | 486 |
| **షష్ఠతరంగము** | |
| ఉపోద్ఘాతము ... ... | 489 |
| తర్కదృష్టియొక్క ప్రథమప్రశ్న—స్వప్నదృష్టాంతముచే జాగ్రత్పదార్థము మిథ్య యనుట సంభవింపదు?... ... | 490 |
| ద్వితీయప్రశ్న—స్వప్నము మిథ్యగాదు? ... ... | 490 |
| 229—30-గతప్రశ్నకుత్తరము 31—451 జాగ్రత్పదార్థస్మృతి స్వప్నమందు లేదు ... ... | 490 |
| స్వప్నమందు లింగశరీరము బాహిరము వెడలి జాగ్రత్పదార్థములను చూడదు ... ... | 494 |

విషయము. పుట

సిద్ధాంతము—జాగ్రత్స్వప్నములతుల్యత త్రిపుటీసమాజమే స్వప్నమందు క్రొత్త ... ... 497

స్వప్నమందు పదార్థోత్పత్తిశంక ? ... ... 499

234-గతోక్తశంకకు సమాధానము—స్వప్నమం దుత్పత్త్యంగీకారము యోగ్యము ... ... 500

ద్వితీయపక్షమందు ప్రథమశంక—బ్రహ్మజ్ఞానముదప్ప స్వప్ననివృత్తి గాఁగూడదు ? ... ... 502

అన్యశంక—జాగ్రత్స్వప్నములరెంటికిని ఒకసత్త గావలయును ? 503

236-గతోక్తప్రథమశంకకు సమాధానము—నివృత్తిద్వివిధము 503

237-గతోక్తద్వితీయశంకకు సమాధానము—స్థూలదృష్టిచే భిన్నసత్తానిరూపణము ... ... 504

దేశకాలప్రతీతియందు అన్యథాఖ్యాత్యంగీకారశంక, మఱియుం తత్సమాధానము ... ... 511

240-గతశంకాసమాధానమునకు పరిశేషము—జాగ్రత్ప్రపంచము స్వప్నసమానము మిథ్య ... ... 516

ఒకజాగ్రత్తయందలి పదార్థము అన్యజాగ్రత్తయం దుండఁగూడ దని శంకయుం తత్సమాధానమును ... ... 518

జాగ్రత్పదార్థములకు కారణకార్యభావము లేదనుటయందు శంక ? 520

243-గతశంకకు సమాధానము—స్వప్నమందును కార్యకారణ భావప్రతీతి ... ... 522

దృష్టిసృష్టివాదముయొక్క అంగీకారము ... ... 523

ప్రశ్న—స్వప్నమువలె స్వల్పకాలస్థాయిసంసార మనిన బహుకాలికబంధము గాఁగూడదు ? ... ... 526

246-గతప్రశ్నకుత్తరము—అగ్రుథదేవుని స్వప్నప్రతీతి ... 529

| విషయము. | పుట. |
|---|---|
| అగ్నృధదేవుఁడు స్వప్నమందు గురువును సంధించుట ... | 533 |
| మిథ్యాచార్యుని మిథ్యాశిష్యునకు మిథ్యాగ్రంథోపదేశమునకు మంగళాచరణము ... ... | 533 |
| వస్తునిర్దేశాదిమంగళప్రకారము ... ... | 535 |
| వేదాంతశాస్త్రకారుఁడయిన ఆచార్యునకు నమస్కారము ... | 536 |
| అగ్నృధదేవుని ప్రశ్న—నే నెవ్వఁడను? సంసారమునకు కర్త ఎవ్వఁడు? ముక్తికి హేతువు జ్ఞానమా? కర్మమా? ఉపాసనయా? లేక రెండా? లేక మూఁడా? ... ... | 540 |
| 252-గక ప్రథమప్రశ్నకుత్తరము—ఆత్మ సంఘాతమునకు సాక్షి | 541 |
| ఆత్మ సుఖదుఃఖరహితుఁడు ఒక్కఁడు ... ... | 541 |
| సాంఖ్యమతోక్తాత్మమతఖండనము ... ... | 542 |
| త్రివిధన్యాయమతఖండనము ... ... | 546 |
| అబాధితమైనట్టి వేదాంతమతమందు వ్యాపకాత్మ ఒక్కఁడే ... | 564 |
| ఆత్మ సద్రూపుఁడు ... ... | 567 |
| ఆత్మ చిద్రూపుఁడు ... ... | 568 |
| ఆత్మ ఆనందరూపుఁడు ... ... | 570 |
| సచ్చిదానందములు పరస్పరభిన్నములుగావు, ఆత్మ బ్రహ్మరూపుఁడు | 576 |
| బ్రహ్మరూపుఁడైన ఆత్మ అజన్ముఁడు ... ... | 579 |
| ఆత్మ అసంగుఁడు ... ... | 582 |
| 252-గక ద్వితీయప్రశ్నకుత్తరము—జగత్కర్త ఈశ్వరుఁడు | 583 |
| జగత్కర్త ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు, మఱియుం స్వతంత్రుఁడు ... ... | 585 |
| ఈశ్వరుఁడు వ్యాపకుఁడు, మఱియుం నిత్యుఁడు ... | 587 |
| ఈశ్వరునకును, జీవునకును స్వరూపముచేత భేదము లేదు ... | 589 |

| విషయము. | పుట. |
|---|---|
| 252-గతతృతీయప్రశ్నకుత్తరము—ముక్తికి హేతువు జ్ఞానము | 590 |
| కర్మోపాసనలు ముక్తికి హేతువులు గావు ... ... | 591 |
| కర్మఫలపంచకము ... ... | 591 |
| ఆక్షేపము—కర్మోపాసనలు జ్ఞానమునకును మోక్షమునకును హేతువు? | 596 |
| 271-గత ఆక్షేపమునకు సమాధానము—కర్మోపాసనలకును జ్ఞానమునకును పరస్పర విరోధము ... ... | 599 |
| జ్ఞానమందు కర్మోపాసనాపేక్ష లేదు ... ... | 602 |
| కర్మోపాసనలచేత జ్ఞానరక్షణము గాదు ... ... | 605 |
| జ్ఞానికి పాపచంచలతయొక్క అభావమువలన కర్మోపాసనలయొక్క అనుపయోగము ... ... | 606 |
| జ్ఞానిప్రారబ్ధవిలక్షణత, ఉపాసనయందు అప్రవృత్తి ... | 608 |
| దృఢాదృఢజ్ఞానులకును, ఉత్తమమందజిజ్ఞాసువులకును కర్మోపాసనలం దధికారము లేదు ... ... | 609 |
| దృఢబోధమునకు కర్మోపాసనలు విరోధులుగావు, మందబోధమునకే విరోధులు ... ... | 611 |
| ఉక్తార్థము సర్వవేదముయొక్క సారము ... ... | 615 |
| ఉక్తార్థముయొక్క సంగ్రహము 280—83 ... | 616 |
| జ్ఞానసాధనములు ... ... | 616 |
| జ్ఞానముయొక్క స్వరూపము ... ... | 618 |
| అన్యప్రకారముగా మోక్షసాధనము జ్ఞానమని కథనము, జ్ఞాన్యజ్ఞాని చిహ్నములు ... ... | 619 |
| లక్షణాత్రయ నిరూపణము ... ... | 622 |
| న్యాయమతప్రకారముగ శక్తిలక్షణము—ఈశ్వరేచ్ఛ ... | 624 |
| స్వమతప్రకారముగ శక్తిలక్షణము—పదమునందు అర్థజ్ఞానసామర్థ్యము | 624 |

విషయము. పుటం.

ప్రశ్న—పదసముదాయమునకన్న భిన్నశక్తిలేదు; కనుక ఈశ్వరేచ్ఛయే శక్తిగా కనఁబడుచున్నది? ... ... 627
287-గత ప్రశ్నకుత్తరము—అగ్న్యాదులందు దాహశక్తి ప్రతిపాదనము ... ... 627
న్యాయమతశక్తిఖండనము ... ... 629
వ్యాకరణమతశక్తిలక్షణము—పదమునందు అర్థజ్ఞానయోగ్యత 630
వ్యాకరణోక్తశక్తియొక్క ఖండనము ... ... 631
భట్టమతరీతిగా శక్తిలక్షణము పదమునకు అర్థముతో భేదాభేద తాదాత్మ్యము ... ... 633
భట్టమతశక్తిఖండనము ... ... 639
శక్యముయొక్క లక్షణము ... ... 647
లక్ష్యార్థముయొక్కయు, లక్షణయొక్కయు స్వరూపము ... 647
లక్షణాత్రయవిచారము ... ... 648
తత్త్వమసిమహావాక్యమునందు లక్షణ, తత్పదవాచ్యార్థము ... 654
త్వంపదమునకు వాచ్యార్థము ... ... 655
వాచ్యార్థమందు విరోధము, మఱియును లక్షణాపేక్ష ... 655
మహావాక్యమునందు జహాత్యసంభవము ... ... 658
మహావాక్యమునందు అజహాత్యసంభవము ... ... 658
మహావాక్యమునందు భాగత్యాగలక్షణాంగీకారము ... 659
జీవేశ్వరులస్వరూపము అనేకవిధము ... ... 659
అభాసమునకును, ప్రతిబింబమునకును భేదము ... 661
అన్యమహావాక్యములందు భాగత్యాగలక్షణాప్రదర్శనము ... 667
ప్రశ్న—రెండుపదములందు లక్షణయంగీకరించుట నిష్ఫలమగును? 669
306-గతప్రశ్నకుత్తరము—రెండుపదములందు లక్షణ సఫలము 670

విషయము. పుట.

ఈశవాచకపదమునందు లక్షణాంగీకారము, మఱియు దానికి ఉత్తరము 672
జీవవాచకపదమునందు లక్షణాంగీకారము, దీనికుత్తరము ... 673
రెండుపదములందు లక్షణ, మఱియు ఓతప్రోతభావము ... 674
ప్రశ్న—సార్థగ్రంథాధ్యయనము చేసినను, ఈవనము దుఃఖహేతువుగా కనఁబడుచున్నది ... ... 677
311 గత ప్రశ్నకుత్తరము—వననాశమునకు హేతువు మహావాక్యవిచారము, అగృథదేవుని స్వప్నసమాప్తి ... 677
మిథ్యాజీవగురువులచే మిథ్యాజగత్తుయొక్క పరిహారము ... 678

## సప్తమతరంగము.

జ్ఞానికి వ్యవహారమందు నియమములేదు ... ... 680
జ్ఞానికి సమాధియందే ప్రవృత్తి యుండవలెనని ఆక్షేపము 315–330 681
సమాధియొక్క అష్టాంగము ... ... 689
యమనియమప్రకారములు ... ... 702
ఆసనప్రకారములు ... ... 702
ప్రాణాయామము ... ... 703
ప్రత్యాహారము, ధారణ, ధ్యానము ... ... 704
సమాధినిరూపణము ... ... 704
సుషుప్తికి నిర్వికల్పసమాధికి భేదము ... ... 706
నిర్వికల్పసమాధి భేదములు ... ... 707
అద్వైతావస్థానసమాధికి, సుషుప్తికి భేదము ... ... 708
నిర్వికల్పసమాధియొక్క నాలుగువిఘ్నములు ... ... 708
లయవిఘ్ననిరూపణము ... ... 709

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| విక్షేపవిఘ్ననిరూపణము | ... | ... | 710 |
| కషాయవిఘ్ననిరూపణము | ... | ... | 710 |
| రసాస్వాదవిఘ్ననిరూపణము | ... | ... | 715 |
| జ్ఞానికి బాహ్యప్రవృత్తిసంభవాక్షేపము, మఱియుం దానియొక్క సమాధానము | ... | ... | 717 |
| 315—330-గతాక్షేపమునకు సమాధానము—జ్ఞాని నిరంకుశుండు, ప్రారబ్ధముచేత వ్యవహారము 331—334 | | ... | 717 |
| జ్ఞానికి విదేహమోక్షత్యాగమందు, లేక పరలోకేచ్ఛయందు శంకాసమాధానము | ... | ... | 723 |
| జ్ఞానికి మందప్రారబ్ధముచే జీవన్ముక్తిసుఖవిరోధియయిన ప్రవృత్తి | | | 725 |
| జ్ఞానికి వ్యవహారముయొక్క అనియమము | ... | ... | 734 |
| తత్త్వదృష్టియొక్క దేశాద్యపేక్షారహితమైనట్టి దేహపాతము | | | 736 |
| ఉపాసకునకు దేశకాలాద్యపేక్ష | ... | ... | 737 |
| అదృష్టదృష్టియొక్క దేశకాలాద్యపేక్షాసహితదేహపాతము | | | 737 |
| తర్కదృష్టియొక్క నిశ్చయము—విద్యాప్రస్థానములైన సర్వశాస్త్రములు బ్రహ్మజ్ఞానహేతువులు | ... | ... | 738 |
| విద్యయొక్క అష్టాదశప్రస్థానములు | ... | ... | 739 |
| నాలుగువేదములకు బ్రహ్మజ్ఞానమందు తాత్పర్యము | | ... | 741 |
| నాలుగుపవేదములకు బ్రహ్మజ్ఞానమందు తాత్పర్యము | | ... | 743 |
| చతుర్వేదషడంగములయొక్క ప్రయోజనము | | ... | 745 |
| అష్టాదశపురాణములు, ఉపపురాణములు | ... | ... | 747 |
| న్యాయవైశేషికసూత్రములఫలము | ... | ... | 748 |
| మీమాంసాసంకర్షణకాండములఫలము | ... | ... | 749 |

విషయము. పు


స్మృత్యాదిగ్రంథములకు కర్తలు, మఱియుం ప్రయోజనము... 75
సాంఖ్యశాస్త్రముయొక్క ఫలము ... ... 75
యోగశాస్త్రముయొక్క ఫలము, మఱియుం శారీరకముతో అవిరోధము 75
పాంచరాత్ర పాశుపతతంత్రములఫలము ... ... 75
వామమార్గము ... ... 75
నాస్తికమతము ... ... 75
సాహిత్యాదికములయొక్క తాత్పర్యపూర్వకమైన తర్కదృష్టిసారగ్రాహి నిశ్చయము ... ... 75
తర్కదృష్టికి అన్యవిద్వాంసులతో మేలనము ... 761
జ్ఞానికి ఇచ్ఛాసంభవముయొక్కయుం, సంభవముయొక్కయుం అభిప్రాయము ... ... 761
శుభసంతతిరాజప్రసంగము ... ... 763
రాజుయొక్క ప్రశ్న ? ... ... 764
విష్ణూపాసకులయుత్తరము ... ... 764
శైవపండితునియుత్తరము ... ... 766
గణపత్యుపాసకునియుత్తరము ... ... 770
శక్త్యుపాసకునియుత్తరము ... ... 772
సూర్యోపాసకునియుత్తరము ... ... 775
ఉక్తపంచమతములయొక్క అనువాదపూర్వకమైన స్మార్తమతము 777
షట్ఛాస్త్రములయొక్క పరస్పరవిరుద్ధత ... ... 778
రాజుయొక్క సంశయాభివృద్ధి. మఱియుం దీనత ... 779
తర్కదృష్టికి రాజుతో మేలనము ... ... 787
పురాణమున అన్యనిందకు తాత్పర్యము స్తుత్యస్తుతియందు ... 789

విషయము. పు

పంచదేవతోపాసకులకు సమానఫలప్రాప్తి ... ... 79
ఒకపరమాత్మయందు నానానామరూపములు సంభవించును ... 79
సకలపురాణములతాత్పర్యము కారణబ్రహ్మమందుపాదేయత, కార్యబ్రహ్మమందు హేయత ... ... 79
మహర్షిప్రతిపాదనమైన కభిప్రాయము ... ... 79
ఉత్తరమీమాంసయొక్క ప్రమాణత, అట్టి ఇతరములయొక్క అప్రమాణత ... ... 79
ఇతరశాస్త్రములపరిత్యాగమునకు దృష్టాంతము, మఱియు హేతువు 79
అంధగోలాంగూలన్యాయమున కర్థము ... ... 80
రాజునకు బ్రహ్మలోకప్రాప్తి ... ... 801
పరమాత్మతో అభేదరూపమైన తర్కదృష్టియొక్క విదేహముక్తి 802
ఈభాషాగ్రంథముయొక్క రచనాప్రయోజనము ... 805
మంగళాచరణపూర్వకముగా గ్రంథసమాప్తి... ... 806



# శ్రీవిచారసాగరము

## ప్రథమతరంగము

### అనుబంధసామాన్యనిరూపణము

#### 1 వస్తు[1] నిర్దేశరూపమంగళము[2]

హిం దూ స్థా ని దో హా[3]

జో సుఖనిత్యప్రకాశవిభునామరూపఆధార
మతినలఖై జిహింమతిలఖై సోమైంశుద్ధఅపార 1
అబ్ధిఅపారస్వరూపమమలహరీవిష్ణుమహేశ
విధిరవిచందావరుణయమ శక్తిధనేశగణేశ 2
జాకృపాలుసర్వజ్ఞకోంహియధారతమునిధ్యాన
తాకోహోతఉపాధితైంమోమైంమిథ్యాభాన 3

---

1 నిర్గుణబ్రహ్మరూపమయిన పదార్థము. 2 విఘ్నధ్వంసమునకు అనుకూలమయిన వ్యాపారము. 3 ఇది హిందుస్థాని కవిత మూలగ్రంథముయొక్క ఆరంభమందే యున్నది. గొప్పసాధువుయొక్క వచన మౌటవలన ఇచ్చట మంగళాచరణారంభమునందు వ్రాయుచున్నాను. ఈకవితయొక్క అర్థము మంగళాచరణమందు సవిస్తరముగనున్నది. సకలగ్రంథమునందును దీనియొక్క అర్థమే ప్రసరించుచున్నది. కావున ఇది యీస్థానమునందు వ్రాయుట

వ్యాయిజిహిజానై బినజగత మనవాంజేపరిసావ
వసై భుజగజగజహింలహైసోహాం ఆపేఆప 4
బోధచాహిజాకోంసుకృతభజత రామునిషాము
సోమెరో హైఆతమా కాకూంకరూం ప్రనామ. 5

మంగళాచరణమున కారంభమందు గ్రంథకర్త "సోహమ్" అనుచున్నాఁడు. సోహమ్మనుటచే మహావాక్యముయొక్క అర్థరూపమును, ప్రత్యక్కును[1] అభిన్నమును అగు పరబ్రహ్మమే తన స్వరూపమని యభిప్రాయమును జూపుచున్నాఁడు. ఇపుడు ఆపరబ్రహ్మమునకు భిన్నభిన్నములయిన విశేషణంబులను వర్ణించుచున్నాఁడు.

ఆబ్రహ్మమేలాగున నున్నది? అది సుఖము[2] నిత్యము[3]; అది నిత్యము ప్రకాశము[4]; అది ప్రకాశము వ్యాపకము; అది వ్యాపకము సాఘురూపాధారము[5]; అది సాఘురూపాధారము స్వయంప్రకాశము; అది స్వయంప్రకాశము శుద్ధము[6]; అది శుద్ధము అపారము.[7]

---

అయుక్తము కాదు. హిందూస్థానిమాట ఎఱిఁగినవాఁడుగాని ఎఱుఁగనివాఁడు గాని శ్రద్ధావంతుఁడైనపురుషుఁడు ఈసాధువచనంబును చదువుచున్నాఁడు.
1 అంతర్ముఖవృత్తియొక్క విషయమైన యేచైతన్యబ్రహ్మము కలదో, దానిని ప్రత్యక్కు, ప్రత్యగాత్మ, అంతరాత్మ అనుచున్నారు. 2 ఆనందము, పరమప్రేమముయొక్క విషయమయినయాత్మ. 3 సత్యస్వరూపము, త్రికాలాబాధ్యము. 4 చిద్రూపము, చైతన్యస్వరూపము, జ్ఞానస్వరూపము. 5 అధిష్ఠానము, ఆధారము, వివర్తోపాదానకారణము. 6 అవిద్యాది దోషరహితము. 7 దేశకాలవస్తువులచేత పారము [అంతము] లేనటువంటిది అపారమని చెప్పఁబడును. ఈయంతము దేశకాలవస్తుభేదముచేత త్రివిధము.—

ఏది సర్వస్థలములందు వ్యాపించక ఏకస్థలమందుమాత్ర ముండునో, దానికి దేశముచేత అంతము గలదు. ఎట్లనఁగా—ఘటము. బ్రహ్మమో, ఘటమువలె ఏకస్థలమందు మాత్రముండుటగాక సర్వత్ర వ్యాపించి యుండుట వలన బ్రహ్మంబునకు దేశముచేత అంతము లేదు. లేక సర్వదేశము బ్రహ్మంబు నందు మాయచేత కల్పితమగుటవలనను, బ్రహ్మము దానియొక్క యధిష్ఠాన మగుటవలనను బ్రహ్మంబునకు దేశముచేత అంతము లేదు.

దేనికి జన్మముకన్న పూర్వమునందు, నాశముకన్న ఉత్తరమునందు అభావమున్నదో, దానికి కాలముచేత నంతము గలదు. ఎట్లనఁగా—ఘటము. బ్రహ్మమో, ఘటమువలె యుత్పత్తినాశవంతము గాకపోవుటవలన నత్యము; దానికి కాలముచేత నంతము లేదు. లేక సర్వకాలము బ్రహ్మంబునందు కల్పిత మగుటవలనను, బ్రహ్మము దానియొక్క యధిష్ఠానమగుటవలనను బ్రహ్మంబునకు కాలముచేత అంతము లేదు.

ఏది దేనితో వేఱుపడుటవలనను, విలక్షణతవలనను భేదముపడు చున్నదో, దానివలన దానికి అంతము కలదు. ఎట్లనఁగా—ఘటమునకు పటముతో భేదము గలదు; అందువలన ఘటమునకు పటముచే అంతము గలదు. బ్రహ్మమో, ఘటపటాదికమువలె నానాప్రకారము కాదు; ఒకటిగ నున్నది; ఇందువలన బ్రహ్మంబునకు వస్తువుచేత నంతము గాదు. [రెండు, లేక అనేక వస్తువులందు వేఱుపడుట సంభవించుచున్నది; ఒకేవస్తువునందు సంభవించదు.] లేక బ్రహ్మమునందు ఘటపటాది సకలవస్తువులు, వానియొక్క భేదములు అన్నియు కల్పితముగ నుండుటవలనను, బ్రహ్మము వానికి అధిష్ఠాన మగుట వలనను బ్రహ్మమునకు వస్తువుచేత అంతము లేదు.

మృత్తికయందు కల్పితమైనఘటము తనయధిష్ఠానమైన మృత్తికకు దేశముచేత గాని కాలముచేతగాని లేక వస్తువుచేతగాని యేప్రకారముచేతను ఎప్పటికిని అంతము చేయుటకు సమర్థము కాదు. ఈస్థానమునందు అత్యంత

భ్రాంతిష్టుఁడైన మూఢునకు కల్పితపదార్థము అధిష్ఠానమునకు అంతము చేయునట్లు కనఁబడుచున్నది. ఒకమూఢుఁ డనుచున్నాఁడు—రజ్జుస్థానమునందు సర్పము పుట్టి రజ్జువు చనిపోవుచున్నది. మరల రజ్జువు పుట్టి సర్పము చనిపోవుచున్నది. వాని నడుగవలెను—అయ్యా! నీవు చెప్పినప్రకారముగ రజ్జువు చనిపోయి సర్పముపుట్టుచున్నది; మఱియు మొదటిసారి పుట్టినసర్పము చనిపోయి యొక రజ్జువు పుట్టుచున్నది. ఆరజ్జువు మరల అనఁగా రెండవసారి సర్పముపుట్టి చనిపోవుచున్నదా యేమి? అయ్యా! నీవుచెప్పినప్రకారముగా రజ్జువు నిజముగా చనిపోయినపక్షంబునందు ఎపుడు దీపముతెచ్చి రజ్జువు స్పష్టముగాఁ జూచుచున్నాఁడో, అపుడు రజ్జువు మరల ఎందుకు చనిపోలేదు? ఒకసారి స్పష్టముగ రజ్జుజ్ఞానమయిన వెనుక సర్పము ఎందుకు పుట్టదు? సారాంశము—కల్పితపదార్థముచేత అధిష్ఠానమునకు అంతము ఘటిల్లదు; ఇది నియమము భ్రాంతిబలము వలన ఎపుడు కల్పితపదార్థము కనఁబడుచున్నదో, అపుడు ఆపదార్థముచే అధిష్ఠానము మూయఁబడుచున్నది. ఆప్రసంగమునందు బుద్ధిహీనునకు అధిష్ఠానముయొక్క అంతమయినటుల కనఁబడుచున్నది; గాని నిజముగా కల్పితపదార్థముచేత అధిష్ఠానమునకు అంతము ఘటిల్లదు. ఆప్రకారముగ బ్రహ్మరూపాధిష్ఠానమునందు కల్పితమైన దేశకాలఘటపటాది సకలపదార్థములందు ఏదొకపదార్థము అధిష్ఠానమయిన బ్రహ్మమును మూయుచున్నవి; గాని అంతము చేయుదు. పెక్కులేల బ్రహ్మంబునందు కల్పితమయిన దేశకాలఘటపటాది పదార్థములు, ఫిరంగి, తుపాకి, కత్తి, పెద్దపెద్ద సేనాపతులు ఇవన్నియుచేరి ప్రచండయుద్ధముచేసికూడ పరబ్రహ్మమునకు అంతముచేయుటకు సమర్థములు కావు.

ఈరీతిగా బ్రహ్మము దేశకాలవస్తువులందు దేనిచేతను అంతుచేఁబడక యుండుటవలన దానిని అనంతము అపారము వ్యాపకము లేక భూమ యందురు.

## —{ బ్రహ్మలక్షణములలో నుండు స్వయంప్రకాశత్వముయొక్క విశదార్థ[1] వర్ణనము }—

ఆ బ్రహ్మము స్వయంప్రకాశ మనుట యేరీతిగా సిద్ధించు చున్నది? బుద్ధి యా బ్రహ్మమును ప్రకాశింపఁజేయ నేరదు; కాని ఆ బ్రహ్మము బుద్ధిని ప్రకాశింపఁజేయును ["యన్మనసా నమనుతే యేనాహుర్మనో మతం" ఈ శ్రుతియొక్క యర్థము.]

ఇచ్చట నింకొకపక్షము గలదు—శబ్దముయొక్క శక్తివృత్తి[2]వలన మఱి ఆ బ్రహ్మము నెఱుఁగఁజాలదు; లక్షణావృత్తివలననే యెఱుఁగఁజాలును. [అందువలననే బ్రహ్మము అనిర్వాచ్యమని[3] శ్రుతియందు ప్రసిద్ధము.]

---

1 స్పష్టార్థముగా. 2 శబ్దములకు అర్థములతో సంబంధము ఏది గలదో, దానిని వృత్తి యనుచున్నారు. ఆవృత్తి శక్తియనియు, లక్షణయనియు ద్వివిధము. ఈసంగతి ముందు ఆయాప్రసంగములందు సవిస్తరముగ చెప్పఁబడును.

3 పదముయొక్క అర్థము శక్తివృత్తివలన చేయఁబడినపుడు ఆపదమునకు వాచక మని, అర్థమునకు వాచ్య మని పేరు. బ్రహ్మపదముగాని లేక సత్తు చిత్తు ఆనందము విభువు మొదలగు బ్రహ్మపదమునకు పర్యాయపదములందు వేఱొకపదముగాని దానియొక్క యర్థము శక్తివృత్తివలన ఘటిల్లదు; లక్షణావృత్తివలననే ఘటిల్లును. అందువలన బ్రహ్మమునకు అనిర్వాచ్య మందురు.

కొందఱు అనిర్వాచ్యపదమునకు అనిర్వచనీయమని యర్థము చేయుచున్నారు. కాని ఈయర్థముచేతఁ గూడ ఉక్తార్థమునకు విరోధము లేదు. ఏలాగున ననఁగా—సత్తుకన్న విలక్షణ పదార్థమును వ్యవహారమునందు అసత్తు అనుచున్నారు. అసత్తుకన్న విలక్షణ పదార్థమును సత్తనుచున్నారు. సదసద్విలక్షణమగు తృతీయపదార్థము వ్యవహారమునందు అప్రసిద్ధము. అట్టి పండిత జనులకే గోచరమగునట్టి తృతీయపదార్థము రజ్జుసర్పాదిక మగుటవలన దానికి

ఇచ్చట మఱియొక మతము గలదు — మలినమతి[1] యా బ్రహ్మము నెఱుఁగఁజాలదు; శుద్ధమతియే యెఱుఁగఁజాలును. శుద్ధమతి[2] యను ఫలవ్యాప్తి[3] వలన నా బ్రహ్మము నెఱుఁగఁజాలదు; వృత్తివ్యాప్తి[4] వలననే యెఱుఁగఁజాలును. వృత్తివ్యాప్తివలన ననఁగను ఎట్లు పాత్రముచేత ప్రచ్ఛన్న[5]మయిన వజ్రమణి అంధకారమునందుండి యా పాత్రమును దండముచేత భంగించినపుడు దీపము లేకుండినను ఆమణి తన ప్రకాశముచేత తాను ప్రకాశితముగనో, అట్లు బ్రహ్మంబును విషయముచేయఁదగిన శమాదిసాధనసంపన్నమయిన యంతఃకరణము యొక్క "అహం బ్రహ్మాస్మి" అనునీవృత్తివలన బ్రహ్మావరణరూపమైన యజ్ఞానము యొక్క నివృత్తి చేయఁబడినపుడు ఆ బ్రహ్మము అన్యప్రకాశము యొక్క అపేక్ష లేనిదై [ఆవరణభంగ

అనిర్వచనీయ మని [చెప్పుటకు అశక్య మని] పేరు పెట్టుచున్నారు. ఆలాగు పదమునకు శక్తివృత్తివలన నయినయర్థమే ముఖ్యార్థము; ఆయర్థమే వ్యవహారమునందు బహుప్రసిద్ధముగనున్నది. లక్షణావృత్తిచేత అర్థమయినదో, ఒకానొకప్పుడు విశేషప్రసంగానుసార మగుచున్నది. కావున శక్తివృత్తిచేత అశక్యమయినట్టి లక్షణావృత్తివలననే యగునట్టి యర్థముగూడ అప్రసిద్ధమగుటవలన అనిర్వచనీయముగ నున్నది. గనుక అనిర్వాచ్య. అనిర్వచనీయ అను రెండు శబ్దముల యొక్క యర్థములందు పరస్పర విరోధము లేదు; రెంటియందును అభిప్రాయ మొక్కటే.

1 మలవిక్షేపదోషసహితమయిన బుద్ధి. 2 మలవిక్షేపదోషరహితమయి జ్ఞానసాధనసహితమయిన బుద్ధి. 3 చిదాభాసునిద్వారమున ఎఱుఁగుటను ఫలవ్యాప్తి యందురు. 4 కేవలవృత్తిద్వారమున ఎఱుఁగుటను వృత్తివ్యాప్తి యందురు. 5 ఆచ్ఛాదితము.

ప్రసంగమునందు అహం బ్రహ్మాస్మివృత్తియందు ప్రకాశరూప మైన చిదాభాసము విద్యమానముగ నుండినను దానియొక్క సాహాయ్యమును గ్రహింపకయే] తన ప్రకాశముచే తాను ప్రకాశితముగ నున్నది. దానిని "వృత్తిప్రకాశింపఁజేసినది" అని వ్యవహరింతురు. దానినే వృత్తివ్యాప్తి యందురు. అందువలన రజ్జుసర్పసుఖదుఃఖాది జ్ఞానప్రసంగమునందు ఆజ్ఞేయపదార్థముల కన్న వేఱొక్క తత్ప్రకాశకమగు వృత్తిజ్ఞానమును ఉండును. [ఆప్రసంగమునందు అంతఃకరణముయొక్క లేక అవిద్యయొక్క జ్ఞేయాకారమనియు జ్ఞానాకారమనియు ద్వివిధ పరిణామ మగు చున్నది. ఆపరిణామరూప వృత్తిజ్ఞానమును ఆపదార్థములతోడనే వర్తించుచున్నది.] ఆవృత్తిజ్ఞానముచేత కల్పితమైన జడమైన ఉక్త పదార్థములయొక్క ప్రకాశమగుచున్నది. అట్లు బ్రహ్మము కల్పితపదార్థమును కాదు; జడపదార్థమును కాదు. త్రికాలా బాధ్యసద్రూపమై స్వయంప్రకాశముగ నున్నది. దానికి వృత్తి ద్వారమున ప్రకాశించుట ఆవశ్యకతయును లేదు. వృత్తిప్రకా శింపఁజేయుటకు సమర్థమును కాదు. [ఎట్లు దీపము అన్యవస్తు వును ప్రకాశింపఁజేయునో, లేక ఎట్లు అంతఃకరణముయొక్క ప్రమాణవృత్తి ఘటపటాదిపదార్థములను ప్రకాశింపఁజేయునో, లేక ఎట్లు అంతఃకరణముయొక్క సాక్షిభాస్యవృత్తి సుఖదుఃఖా దులను ప్రకాశింపఁజేయునో, లేక ఎట్లు అవిద్యావృత్తి రజ్జు సర్పాదులను ప్రకాశింపఁజేయునో, అట్లు వృత్తి బ్రహ్మమును ప్రకాశింపఁజేయుటకు సమర్థము కాదు.] ఉక్తవృత్తివలన దండము చేత పాత్రభంగమువలె బ్రహ్మమునకు ఆవరణభంగమాత్రమగు చున్నది. దానికే వృత్తివ్యాప్తి యని పేరు పెట్టఁబడినది. ఎట్లు

నిత్యము ప్రకాశము-ఆ బ్రహ్మము "నిత్యము" మాత్రమే యని చెప్పినట్టయిన న్యాయమతమున ఆకాశకాలాదులును, సాంఖ్యమతమున ప్రధానమును నిత్యము లని యంగీకరింపబడినవి; వానియందు బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి యగును; తత్పరిహారార్థము ఇచ్చట బ్రహ్మలక్షణమునందు నిత్యముతోడ ప్రకాశ మని చెప్పబడెను. న్యాయసాంఖ్యవాదులు ఆకాశాదులను, ప్రధానమును నిత్యము లందురు; కాని అవి ప్రకాశరూపములని యంగీకరింపరు. ఏమనగా—వానిని జడములందురు. ఇచ్చటనో, బ్రహ్మము "నిత్యము ప్రకాశము" అని రెండులక్షణములుచేర్చి చెప్పబడియున్నది. అందువలన వానియందు [ఆకాశకాలాదులందు, ప్రధానమునందు] బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి కాజాలదు.

ప్రకాశము వ్యాపకము—ఆ బ్రహ్మము "ప్రకాశము" మాత్రమే యని చెప్పినట్టయిన ప్రకాశములగు సూర్యదీపాదులందును, న్యాయమతమున నంగీకరింపబడిన ఆత్మనిష్ఠజ్ఞానగుణమునందును, క్షణికవిజ్ఞానమతమున ఆత్మ విజ్ఞానరూపుండనుటయందును బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి యగును. తన్నివారణార్థము ఇచ్చట బ్రహ్మలక్షణమునందు ప్రకాశముతోడ వ్యాపకమని చెప్పబడెను. సూర్యదీపాదులు ప్రకాశములుగనుండినను అవి వ్యాపకములు గావు. నైయాయికులు తమచేత నంగీకృతమైన ఆత్మయొక్క జ్ఞానగుణమును, అట్లు విజ్ఞానవాదులుగూడ తమచేనంగీకృతమగు క్షణికవిజ్ఞానరూపాత్మను వ్యాపకుం[1] డని చెప్పరు. ఏమనగా—

1 దేశకాలవస్తువులచేత అంతము రహితమయినది వ్యాపకము. ఈ సంగతి పూర్వముఅపారలక్షణముయొక్క వ్యాఖ్యానమునందు చెప్పియున్నాము.

పరిచ్ఛిన్నుఁ[1]డందురు. ఇచ్చటనో, బ్రహ్మమునకు "ప్రకాశము వ్యాపకము" అని లక్షణద్వయము చేర్చి చెప్పఁబడియున్నది. అందువలన వానియందు [పైనఁజెప్పిన అతివ్యాప్తిస్థలములందు] బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి కాఁజాలదు.

వ్యాపకము నామరూపాధారము—ఆబ్రహ్మము "వ్యాపకము" మాత్రమేయని చెప్పినయెడల న్యాయమతమున ఆకాశకాలాదులను వ్యాపకములని వాడుటయందును, న్యాయప్రాభాకరసాంఖ్యమతములందు ఆత్మను వ్యాపకుఁడని వాడుటయందును, సాంఖ్యమతమునందు ప్రకృతిని వ్యాపకమని వాడుటయందును బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి యగును. తన్నివారణార్థము ఇచ్చట బ్రహ్మలక్షణమునందు వ్యాపకముతోడ నామరూపాధార మని చెప్పఁబడెను. న్యాయమతప్రకారముగ ఆకాశాదులు వ్యాపక[2]ములుగ నుండినను అవి నామరూపాధారములు గావు. మఱియు నైయాయికప్రభృతులమూవురియొక్క మతప్రకారముగ ఆత్మ వ్యాపకుఁడయినను వాఁడు నామరూపాధారుఁడు గాఁడు. అట్లు సాంఖ్యమతప్రకారముగ ప్రకృతి వ్యాపకముగ నుండినను అది నామరూపాధారము గాదు. ఇచ్చటనో- బ్రహ్మము "వ్యాపకము నామరూపాధారము" అని రెండులక్షణములు చేర్చి చెప్పఁబడియున్నది. అందువలన వానియందు [పైనఁజెప్పిన అతివ్యాప్తిచోటులందు] బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి కాఁజాలదు.

---

1 దేశకాలవస్తువులందు దేనిచేతను అంతవంతమయినట్టి. 2 ఆకాశాదికముయొక్క వ్యాపకతను ఆపేక్షికవ్యాపకత అనుచున్నారు. ఈసంగతి ముందు చతుర్థతరంగమునందు చెప్పఁబడును.

నామరూపాధారము స్వయంప్రకాశము—ఆబ్రహ్మము "నామరూపాధారము" మాత్రమే యని చెప్పినయెడల ప్రాతిభాసికములగు[1] సర్పాదులకు నామరూపాధారమైన రజ్జ్వాదులందు బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి యగును. తన్నివారణార్థము ఇచ్చట బ్రహ్మలక్షణంబునందు నామరూపాధారము తోడ స్వయంప్రకాశ[2] మని చెప్పఁబడెను. రజ్జ్వాదులు అధిష్ఠానములగుటవలన సర్పాదుల నామరూపములకు ఆధారములు గాని అవి స్వయంప్రకాశములు గావు. ఇచ్చటనో, బ్రహ్మము "నామరూపాధారముస్వయంప్రకాశము" అని లక్షణద్వయము చేర్చి చెప్పఁబడియున్నది. అందువలన వానియందు [రజ్జ్వాదులందు] బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి కాఁజాలదు.

వేదాంతమతముననో, కల్పితమగు సర్పాదికమునకు నామరూపాధారము రజ్జ్వాదికోపహితచైతన్యమే యంగీకరింపఁబడును; కాని రజ్జ్వాదికము గాదు. కాఁబట్టి నామరూపాధారము అను నీయొక్క విశేషణముచేతనే యేమతమందేని, యేపదార్థమందేని బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి కాఁజాలదు. ఇచ్చట రెండవవిశేషణము అనావశ్యకము. ఇట్లుండఁగా నిచ్చట రజ్జ్వాదికమునకు నామరూపాధారమని చెప్పిస్వయంప్రకాశమను నీద్వితీయవిశేషణము ద్వారమున అతివ్యాప్తి పరిహరింపఁబడినది

1 ప్రతీతికాలంబునందు మాత్రమే ఉండు పదార్థము ప్రాతిభాసికము. ఉదాహరణము—1 రజ్జుసర్పాదికము. 2 ఎవ్వని ప్రకాశింపఁజేయుటయందు వేరొకఁడును సమర్థుఁడు గాఁడో, మఱియుం సర్వప్రకాశకుఁడు ఎవ్వఁడో, వాఁడు స్వయంప్రకాశుఁడు. ఈసంగతి పూర్వము చెప్పఁబడియున్నది.

స్థూలదృష్టివలననే చేయఁబడియున్నది; [వేదాంతశాస్త్రసంస్కార రహితులగు బహిర్ముఖపురుషులు ప్రాతిభాసికమగు సర్పాదికము నకు అధిష్ఠానము రజ్జ్వాదికమని భావింతురు. వారియొక్క దృష్టి వలన నిచ్చట రజ్జ్వాదికమును అధిష్ఠానమని చెప్పి స్వయం ప్రకాశ మని రెండవవిశేషణముచే అతివ్యాప్తి పరిహరింపఁబడి నది;] అని యెఱుఁగవలెను.

స్వయంప్రకాశము శుద్ధము—ఆ బ్రహ్మము "స్వయం ప్రకాశము" మాత్రమే యని చెప్పినట్టయిన ఒకానొక యుపాసకమత[1]మున బ్రహ్మము స్వయంప్రకాశమని యంగీకరించుట

1 ఉపాసకుని యడుగవలెను—అయ్యా! మీరు అవిద్యాదిమలసహిత బ్రహ్మముయొక్క ధ్యానము చేయుచున్నారా? అప్పుడే కొట్టుటకు వచ్చు చున్నాఁడు. ఏందుకనఁగా వానికి అవిద్యాదిమలసహిత మనఁగా నేమి శుద్ధ మనఁగా నేమి తెలియదు. ధ్యానము చేయుట యైననో, అవిద్యాసహిత బ్రహ్మమే. ఏలాగన ననఁగా—జ్ఞేయబ్రహ్మమనియు, ధ్యేయబ్రహ్మమనియు బ్రహ్మము ద్వివిధము. నిర్గుణబ్రహ్మమునకు జ్ఞేయబ్రహ్మమనియు, సగుణబ్రహ్మ మునకు ధ్యేయబ్రహ్మమనియు పేరు. వానిలో నిర్గుణబ్రహ్మమునందు ధ్యాన యోగ్యతయే లేదు. అందువలన దానియొక్క ధ్యానము ఎవ్వనికిని, ఏవిధిచేతను ఘటిల్లదు. ఇపుడు ధ్యానము ఘటించుచున్నది సగుణబ్రహ్మముయొక్కయే. ఆసగుణబ్రహ్మమునందును కేవల మాయావిశిష్ట బ్రహ్మము [కారణబ్రహ్మము, ఈశ్వరుఁడు] యొక్క ధ్యానముచేయువాఁడు అధికారి దుర్లభమే. ఎందు కనఁగా—జన్మజన్మాంతరముయొక్క భక్తిబలమువలన ఈశ్వరకృపచేతనే కారణబ్రహ్మముయొక్క చింతన గలుగవలయును; అన్యథా ఘటిల్లదు. ఇపుడు ధ్యానము చేయువారియందు బహుళముగా మూర్త్యాదికముయొక్క అవలం బనద్వారమున కార్యబ్రహ్మము [కారణబ్రహ్మమైన ఈశ్వరుని అవతారము]

యందు బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి యగును. తత్పరిహారార్థము ఇచ్చట బ్రహ్మలక్షణమునందు స్వయంప్రకాశముతోడ శుద్ధమని చెప్పఁబడెను. ఆ యుపాసకమతమున బ్రహ్మము స్వయంప్రకాశమని యంగీకరింపఁబడినను అవిద్యాది మలసహితముగ భావింపఁబడును. ఇచ్చటనో, బ్రహ్మము "స్వయంప్రకాశము శుద్ధము" అని విశేషణద్వయము చేర్చి చెప్పఁబడియున్నది. అందువలన దానియందు [అవిద్యాదిమలసహిత బ్రహ్మంబునందు] బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి కాఁజాలదు.

శుద్ధము అపారము—ఆ బ్రహ్మము "శుద్ధము" మాత్రమే యని చెప్పినట్టయిన సాంఖ్యమతమున నాత్మ శుద్ధుఁడని చెప్పుటయందు బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి యగును. తత్పరిహారార్థము ఇచ్చట బ్రహ్మలక్షణమునందు శుద్ధముతోడ అపారమని చెప్పఁబడెను. సాంఖ్యమతమునందు కూడ ఆత్మ శుద్ధుఁడని భావించి అపారుఁడనియు భావింతురు. అంతవంతుఁడని భావింపరు. అయినను అచ్చట అపారుఁడనుటయందు, ఇచ్చట అపారుఁడనుటయందు విలక్షణత యున్నది. అదేమనఁగా—సాంఖ్యమతమున నాత్మ దేశకాలములవలన అంతవంతుఁడని భావింపకుండినను వస్తువువలన అంతవంతుఁడని భావింతురు; సర్వప్రకార[1]ములను అపారుఁడని భావింపరు. ఇచ్చటనో, బ్రహ్మము "శుద్ధము

రేయి ధ్యానము చేయుచున్నారు. ఇట్లుగాని అట్లుగాని బ్రహ్మధ్యానమే మో నిజము. ఉపాసకుఁడయినను, ఇంతవిచారము నెఱుఁగఁడు. ఉపాసనయే చేయుచున్నాఁడు. ఈయభిప్రాయమువలన "ఉపాసకమతమున" అని మూలగ్రంథమునందు వ్రాయఁబడినది. లేకుండిన పాపము ఆ యజ్ఞానియుపాసకునకు మతము ఎక్కడ? వాఁడేమి విచారవంతుఁడా? [1] దేశము, కాలము, మఱియు వస్తువు ఈ మూఁటింటిచేనను.

అపారము" [సర్వప్రకారములచే అపారము] అని విశేషణ ద్వయము చేర్చి చెప్పఁబడియున్నది. అందువలన వానియందు [వస్తుపరిచ్ఛిన్నాత్మయందు] బ్రహ్మలక్షణమునకు అతివ్యాప్తి కాఁజాలదు.

సుఖము నిత్యము, నిత్యము ప్రకాశము అని ఈప్రకారముగా రెండు రెండు విశేషణములు పైనఁ జెప్పఁబడినవి. వానియందు రెండువిశేషణములయొక్క యేదొక సముదాయము చేతనే అతివ్యాప్తి నివారింపఁబడినను ఎక్కువవిశేషణములు చెప్పుట జిజ్ఞాసువులకు ఆవిశేషణములయొక్క బోధ యగుట కొఱకే యని తెలియవలెను. లేక ఒకే బ్రహ్మము అనేకలక్షణ సంపన్నమని బోధయగుటకొఱకే యని తెలియవలెను.

పూర్వోక్త విశేషణ[1] యుక్తమైన బ్రహ్మమే నేనుగా నున్నాను. ఇదే మంగళాచరణముయొక్క భావార్థము. అందువలననే మంగళాచరణారంభమునందు సోహమ్మని చెప్పఁబడి

1 ఇవి విశేషణములు గావు; లక్షణము లని తెలియవలెను. ఏలాగనఁగా—నిత్యవిశేషణ మనియు, అనిత్యవిశేషణ మనియు నీప్రకారముగ వైయాకరణమతమున విశేషణములు ద్వివిధ మని చెప్పఁబడియున్నది. విశేష్యమునందు [ధర్మియందు] నిరంతరముగ వర్తనము చేయఁదగిన ధర్మమును నిత్యవిశేషణ మందురు. [కర్మధారయసమాసమునందు అన్ని నిత్యవిశేషణముల యొక్కయే వ్యవహారము జరుగుచున్నది.] విశేష్యమునందు నిరంతరముగ వర్తనము చేయక ఒకానొకప్పుడు వర్తించును, ఒకానొకప్పుడు వర్తింపదు: ఇట్టి యే ఆగమాపాయి [వచ్చునట్టిపోవునట్టి] ధర్మము గలదో, అది అనిత్య విశేషణ మందురు.

వేదాంతమునందో, అనిత్యవిశేషణమునకే విశేషణ మందురు. నిత్యవిశేషణమును విశేషణ మనరు; దానిని లక్షణ మందురు. ఈగ్రంథమునందును,

యున్నది. ["ముంగిటిమీఁదనే ఇంటియొక్క పరీక్ష" అనుమాట లోకమునందు ప్రసిద్ధముగ నున్నది. అలాగు మంగళాచరణమే గ్రంథముయొక్క విషయము జీవబ్రహ్మైక్యమనిచూపుచున్నది.]

ఆక్షేపము—విష్ణుశివాది దేవతాస్మరణరూపమైన మంగళాచరణ ముచితమైయుండఁగా నట్టి దేవతలవిడనాడి ఆత్మ [తన] స్మరణరూపమైన మంగళాచరణము అనుచితము ?

సమాధానము—నాస్వరూపము సముద్రము[1] వలె

---

ఇంకకొన్ని వేదాంతగ్రంథములందును లక్షణంబనకును నైయాకరణరీతిగా విశేషణ మందురు. ఉచితమే. అయినను ఎవ్వఁడేని మందబుద్ధిగల పురుషుఁడు ఈయభిప్రాయము నెఱుఁగక ఆవిశేషణమును అనిత్యవిశేషణ మనియే యెఱుఁగు చున్నాఁడు. చదువువారు ప్రసంగానుసారముగా నిత్యానిత్యతయొక్క విచారము చేయఁదగినది. ఈమంగళాచరణప్రకరణమందయినను, బ్రహ్మలక్షణంబులకు ఒకొక్కచోట విశేషణంబు లని వ్రాయఁబడియున్నవి. అన్యమైన వేదాంతగ్రంథమునందు కూడ అట్టే వ్రాయఁబడియున్నది.

1 ఎట్లు సముద్రముయొక్క పారము నౌకవలన పొందఁదగునో, అట్లు స్వస్వరూపముయొక్క పారము పొందుట కాఁజాలదు. గనుక సముద్రోపమ యోగ్యముకాదు. ఏలయన ఉపమ సమానవస్తువునకేగుదును; విషమ వస్తువునకుఁ గానేరదు. అట్లయినను సముద్రముయొక్క పారము నౌకవలన నయినను హస్తపాదాదికాంగముల క్రియచేత కాఁజాలదు. ఈప్రకారముగా నిక దేశియైన సమత్వముచూచి నాస్వరూపమునకు సముద్రోపమ చెప్ప బడినది. ఇది పూర్ణోపమగాదు; అయినను లుప్తోపమగానున్నది. ఎట్లు ద్విహస్తద్విపాదుఁడై వివేకబుద్ధితోఁగూడిన మనుష్యప్రాణికి ఒకశూరత్వధర్మమాత్రమును జూచి బుద్ధిహీనమైన చతుష్పాద్పశుప్రాణితో "సింహో దేవదత్తః" అని ఏక

అపారము. అట్టి నాస్వరూప సముద్రమునకు విష్ణువు, మహేశుఁడు, విధి [1] మొదలగు సకలదేవతలు.

---

దేశియైన సమత్వోపమా ప్రయోగ మగుచున్నదో, అట్లు నాస్వరూపమునకు సముద్రముతో ఏకదేశియైన సమత్వోపమ వ్రాయఁబడినది.

1 వేదమతమున విష్ణుశివులు ఈశ్వరకోటియం దుండుటవలన వారికి ప్రథమగ్రహణము, బ్రహ్మ జీవకోటియందుం డుటవలన వానికి పశ్చాద్గ్రహణము ఇచ్చుట చేయఁబడియున్నది. అయినను ఈస్థానంబునందు ఇంకవిచారము గూడ చేయఁదగినది. అ దేమనఁగా—

వేదంబునం దొకానొకచోట బ్రహ్మదేవుని జీవకోటియందు ఏది చెప్పఁబడినదో, అది వాఁడు నిజముగా జీవుఁ డను నభిప్రాయముచేతఁ గాదు. వానియీశ్వరతకూడ వేదమునందు అనేకమారులు చెప్పఁబడియున్నది. అట్లు శాస్త్రమునందును, పురాణమునందును వానియీశ్వరత ప్రసిద్ధముగ నున్నది.

వాఁడు శ్రీనారాయణ నాభికమలమున పుట్టుటవలన వానిని జీవుఁ డనవలెననఁగా విష్ణువు నితని జఠరమున, రామ కృష్ణాదులు కౌసల్యా దేవకీజఠరమున పుట్టుచున్నారు; వారలుకూడ జీవు లనవలయును.

శ్రీయోగవాసిష్ఠమునందు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్వురినిగురించి సాత్వికజీవు లనఁబడినది. అయినను విష్ణుమహేశుల నీశు లనిచెప్పి బ్రహ్మదేవుని మాత్రము జీవుఁ డన లేదు.

ఇప్పుడు విష్ణుమహేశులు వారు స్వయముగా ఆదిగురువులు. వారికి ఇంకొకఁడు గురువు లేఁడు. వారే సకలగురువులయొక్క పరమగురువులు. బ్రహ్మదేవునకుఁగూడ విష్ణువుచేత ననుగ్రహ మయినది. బ్రహ్మదేవుఁడు వారివలె ఆదిగురువైనయెడల శిష్యుఁడు కాలేఁడు. ఇట్లైనపక్షమున రామకృష్ణాదులుకూడ వసిష్ఠసాందీపనుల శిష్యులగుచున్నారు. వారినికూడ జీవు లనవలయును.

ఈరీతిగాఁ జూచినయెడల బ్రహ్మదేవుని జీవుఁ డనుట అయోగ్యము.

ఉపలక్షణ[1] రూపతరంగములు [లహరి, అలలు]
కాఁబట్టి యాత్మస్మరణరూప తుంగళమువలన సకలదేవతాస్మరణ

---

అయినను ఒకానొకప్పుడు వేదముచేత చెప్పఁబడియున్నది. దానియం దభిప్రాయ మిట్లున్నది—

అజ్ఞానులైన జీవుల కొక్కొక్కసారి భ్రాంతిబలమువలన సంశయమును, విపర్యయమును పుట్టుచున్నవి— బ్రహ్మజ్ఞానమువలన సంసారనివృత్తి యగునా? లేదా? మోక్షప్రాప్తి యగునా? లేదా? సంసారము అనాదిగానుండఁగా నెట్లు నివృత్తమగును? అఖండానందరూప మోక్షము బ్రహ్మజ్ఞానమువలన నెట్లు కలుగును? నాజీవభావము పోఁగొట్టుశక్తి బ్రహ్మజ్ఞానమునం దున్నదా? నేను ప్రయత్నము చేసిన బ్రహ్మజ్ఞానము ప్రాప్తమగునా? నావంటి అజ్ఞాని, పాపి జీవుని యుద్ధార మెట్లు కావలెను? కానే కాదు. ఇట్టే జన్మమరణములందు తిరుగవలెను.

ఈలాటి భ్రాంతియును, అధైర్యమును జీవులం దున్నవి. ఆజీవులు ఎఱుఁగవలెను— బ్రహ్మాండాభిమాని యంత పెద్దజీవుఁడు బ్రహ్మదేవుఁ డుండఁగా వానియొక్క అంత పెద్దజీవత్వముకూడ బ్రహ్మజ్ఞానముచేత నివృత్తమాయెను. నే నేమి? నాజీవత్వ మెంత? అవశ్యముగ బ్రహ్మజ్ఞానము సంపాదింపవలెను.

అజ్ఞానిజీవున కింత ధైర్యముకొఱకును, ఉత్సాహముకొఱకును కరుణాసాగర వేదముచే నొకానొకప్పుడు బ్రహ్మదేవుఁడు జీవుఁ డని చెప్పఁబడెనే కాని వేరేయభిప్రాయము లేదు. నిజముగానే జీవుఁ డని యభిప్రాయ ముండినయెడల వేదమునం దనేకస్థానములందు ఈశ్వరుఁ డని చెప్పఁబడినది; దానికి విరోధ మగును.

1 ఉపలక్షణద్వారమున నెఱిఁగినపదార్థమునకు ఉపలక్షిత మని పేరు. ఏపదార్థము ఉండునో, అప్పుడు ఉపలక్షితమునందే యుండును; ఇతరస్థానమునం దుండదు. ఎప్పుడు ఉండునో, అప్పుడు ఉపలక్షితముయొక్క ఏదొక్క దేశమునం దుండును; సర్వదేశంబునం దుండదు. ఉండునో, అప్పుడు ఏదొక కాలమునం

రూప మంగళము సిద్ధించుచున్నది. కనుక నాత్మస్మరణమంగళము ఏలాగునను అనుచితము గాదు.

---

దుండును సర్వకాలంబునం దుండదు. అపదార్థమును ఉపలక్షణ మనవలెను. ఉపలక్షణము ఇతరపదార్థములకన్న వేఱే వేసి యొకపదార్థమును చూపుచు దానికి వ్యావర్తక మందురు. ఉక్తప్రకారముగా ఉపలక్షణముకూడ తనచేత లక్షిత పదార్థమును చూపుచున్నది; అందువలన నది వ్యావర్తకముగ నున్నది.

"కాకవద్దేవదత్తగృహమ్" ఈస్థానంబునందు కాకి దేవదత్తుని గృహమునకు ఉపలక్షణముగ నున్నది. ఈవిధముగ బ్రహ్మస్వరూపమునకు బ్రహ్మా విష్ణు, మహేశ్వరుఁడు గణనాథుఁడు, సూర్యుఁడు, దేవి ఈదేవతలు [ఏదేవతలకు బ్రహ్మరూపత వేదశాస్త్రమునందు ప్రతిపాదింపఁబడినదో, ఆదేవతలు] ఉపలక్షణములు. అయినను వరుణకుబేరాది దేవతలు ఉపలక్షణములు గావు.

మూడవది— బ్రహ్మవిష్ణుమహేశాదులు గాని వారియవతారములు రామకృష్ణాదులు గాని అంత సర్వజ్ఞసర్వశక్తిమానసర్వేశ్వరత్వాదిలక్షణసంపన్నులైన దేవులు ఉందురో, అప్పుడు బ్రహ్మంబునందే యుందురు. [ప్రకటనముగు దురు.] జీవజడాది ఇతరస్థానంబునం దుండరు. ఉందురో అపుడు నిరపేక్ష వ్యాపకమైన సకలబ్రహ్మంబునం దుండరు; బ్రహ్మముయొక్క ఏదొకదేశమునం దుందురు. [అందువలననే ఈశ్వరావతారరూపములైన ఈదేవులుగాని అవతారియైన ఈశ్వరుఁడుగాని వ్యాపకములుగ నుండినను సాపేక్షవ్యాపకములుగనున్నారు శుద్ధబ్రహ్మమువంటి నిరపేక్షవ్యాపకములు గారు.]

వీరు బ్రహ్మంబునందు సర్వదా యుండరు. సృష్టికాలంబునందుగాని సాధుజనరక్షణకాలంబునందు గాని దుష్టజనభంజనకాలంబునందు గాని యుందురు.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. I." భ. గీ.

ఆక్షేపము—విష్ణుశివాది దేవతలు మాయావిశిష్టచైతన్యములగు నీశ్వరస్వరూపసముద్రమునందు తరంగములగుట సంభవించును.

---

వీరు జడజీవాది పదార్థములకంటె బ్రహ్మస్వరూపమును వేఱే చేసి చూపుచున్నారు. [బ్రహ్మజ్ఞానోపదేశ ప్రసంగమునందు "నేతి నేతి" ఇత్యాది వాక్యములచే వ్యతిరేకద్వారమున శరీరప్రాణాది సకలపదార్థములకన్న వేఱే చేసి కేవలబ్రహ్మస్వరూపమును చూపుచున్నారు.]

ఈవిధముగ ఉపలక్షణముయొక్క లక్షణమును జూచినయెడల వరుణయమకుబేరాది దేవులు పరబ్రహ్మముయొక్క ఉపలక్షణరూపములు గారు. మఱియును మంగళాచరణమునందు వరుణయమకుబేరాదులయొక్క పేర్లు వ్రాయుట శిష్టసంప్రదాయము లేదు.

శ్రీనిశ్చలదాస పండితాచార్యకృత హిందూస్థాని గ్రంథముయొక్క ప్రథమావృత్తియందుఁగూడ వరుణయమకుబేరాది దేవులయొక్కయు పేర్లు ఉపలక్షణపంక్తియందు వ్రాయఁబడినవి. అయినను ఈస్థానమునందు విచారము చేయఁదగినది. వరుణాదిదేవులు ఉపలక్షణమవుటకు వారేమి ఈశ్వరునియవతారములా? వారు తమతమ శుభకర్మప్రాదుర్భావమువలన దేవభావమును పొందుచున్నారు. నిజముగా వారు జీవులే. యమవరుణాదులచేతఁ గొందఱికి బ్రహ్మజ్ఞానోపదేశము వేదమునందు కనఁబడుచున్నది. దానివలన వారు అజ్ఞానిజీవులు గారు. వారు జీవన్ముక్తవిద్వాంసులే; గాని వారు ఈశ్వరావతారములు గారు. వారిపేర్లు నాపండితాచార్యుఁడు ఈశ్వరావతారపంక్తియందు వ్రాయఁడు. ఎవఁడును కాపీసాయిబు లేక కాపీశ్వరుఁడు వ్రాయవలెను. దానిమీఁద ఇదివరకు ఆహిందూస్థాని గ్రంథముయొక్క అనేకఆవృత్తులు అనేకభాషలందు భాషాంతరము అగుచున్నవి. అయినను ఆనామములు అట్లే వచ్చుచున్నవి.

కాని తొట్టిపేళ్ళవంటి[1] నీస్వరూపమునందు సంభవింపదు. కనుక ఈశ్వరస్మరణరూప మంగళాచరణము చేయఁదగినది. ఎట్లు వృక్షమూలమును తడుపుటవలన స్కంధాదులకున్ను

---

బ్రహ్మాభిన్న పదార్థమునకు సత్తయే లేదను అర్థమునకు వాచకమైన "సర్వం ఖల్విదం బ్రహ్మ" "పురుష ఏవేదం సర్వమ్" మొదలైన వాక్యసమూహముచే నిగమరాజుయొక్క భేరీభాంకారము ఘోషించుచున్నది. జీవన్ముక్త విద్వాంసులును అధికారులైన శిష్యులకు తమఅనుభవసహితముగా అట్లే పలుకుచున్నారు. ఆపరమార్థదృష్టివలన చూచినయెడల జీవజడాది సకలపదార్థములును బ్రహ్మరూపములే. ఈప్రకారముగా సురనరతిర్యగాది ప్రాణిపదార్థములు గాని ఘటపటాది జడపదార్థములుగాని అన్నింటియందు సత్తత్వాది బ్రహ్మలక్షణము సహజముగానే వర్తించుచున్నది. గనుక సకలపదార్థములును బ్రహ్మలక్షణములే. ఇపుడు సకలపదార్థములను బ్రహ్మముయొక్క ఉపలక్షణము లనుటయందు ఎక్కువ యేమి? సకలపదార్థములును ఉపలక్షణములైనపిదప వరుణ యమ కుబేరాదులను ఉపలక్షణము లనుటయందు దోషమేమి? ఏమియును లేదు. అయినను ఇచ్చట వ్యవహారసత్తను అంగీకరించి కేవల విద్యోపాధిచైతన్యమునకే బ్రహ్మముయొక్క ఉపలక్షణ మని చెప్పఁబడినది. అందువలన ఇచ్చట విద్యోపాధియైన ఈశ్వరుఁడుగాని వానియవతారములు బ్రహ్మవిష్ణు రామకృష్ణాదులు గాని వారియొక్కయే గ్రహణము చేయవలయును. వారియందు అవిద్యోపాధులైన వరుణాదిదేవులను చేర్చుట అనుచితము గానున్నది.

1 భేదవాది జీవుని ఈశ్వరునికన్న భిన్న మని యెఱింగి నీచ మని యెఱుఁగుచున్నాఁడు, ఉచితమే. వానిమతమునకు అదే పెద్దభూషణముగ నున్నది; గాని ఒకానొక అద్వైతవాదికూడ జీవుని శుద్ధ మని యెఱిఁగి పరిచ్ఛిన్నమని యెఱుఁగుచున్నాఁడు. అభిప్రాయమేమనఁగా—వాఁడు కూటస్థాత్మను జీవపదమునకు లక్ష్యార్థ మని యెఱిఁగి ఆకూటస్థుఁడు అంతఃకరణోపహిత చైతన్య

ప్రాణమునకు ఆహారమిచ్చుటవలన నింద్రియములకును తృప్తి యగునో, అట్లు ఈశ్వరమంగళాచరణమువలన సర్వదేవతామంగళసిద్ధి సంభవించును; నీయొక్క [పరిచ్ఛిన్నమయిన కూటస్థాత్మయొక్క] మంగళమువలన సర్వదేవతామంగళసిద్ధి సంభవింపదు?

సమాధానము—— కృపాళుఁడును, సర్వజ్ఞుఁడును అగు నే ఈశ్వరుని మునిజనులు మనస్సునందు ధ్యానింతురో, ఆ ఈశ్వరుఁడు మాయోపాధియగుటవలన రజ్జువునందు సర్పాదులును, స్వప్నమునందు నగరాదులును ఎట్లు కల్పితములో, అట్లు నా స్వరూపమునందు కల్పితముగ నున్నాఁడు. అందువలన నధిష్ఠానరూపుఁడైన నాయొక్క మంగళమువలన కల్పితుఁడైన ఈశ్వరునియొక్కయు, తదంతర్గతములయిన సకలదేవతలయొక్కయు మంగళము సిద్ధించుచున్నది.

ఆక్షేపము—— ఈశ్వరుఁడో, వ్యాపకమైన శుద్ధమగు నిర్గుణబ్రహ్మమునందు అధ్యస్తుఁడు [1] గాని పరిచ్ఛిన్నమైన కలినమగు నీస్వరూపమునందు గాఁడు. కావున నిర్గుణబ్రహ్మమంగళమే యుచితము.

సమాధానము—— ఎట్లు రజ్జువు తెలియక సర్పప్రతీతి యగునో, అట్లు బ్రహ్మమును తెలియక జగత్ప్రతీతి యగును.

---

మంగళాచరణమువలన నాకది పరిచ్ఛేదము అంతఃకరణము, మఱి నేను పూడను పరిచ్ఛిన్నుఁడు అని ఎఱుఁగుచున్నాఁడు. ఘటస్థితమయిన ఆకాశము మహాదాకాశముతో వేఱే ఎట్లుగును ఎఱుఁగఁడు. సామానాధికరణ్యమార్గమే ఎఱుఁగఁడు. ఇదేపక ఆశ్చర్యముగనున్నది. "తొల్లిటివల్లవంటిస్వరూపము" అను నీ యాక్షేపము ఉక్త అద్వైతవాదియొక్కయే. 1 కల్పితుఁడు.

మఱియు ఎట్లు రజ్జువును తెలియుటవలన సర్పనివృత్తి యగునో, అట్లు బ్రహ్మమును తెలియుటవలన జగన్నివృత్తి యగును. ఆ యధిష్ఠానరూప శుద్ధబ్రహ్మము నేనుగానె[1] యున్నాను. కాబట్టి నామంగళమే శుద్ధబ్రహ్మమంగళము.

---

1 ఆబ్రహ్మము నేనుగానే యున్నాను. అట్లుగాక బ్రహ్మమున్నది నేను ఉన్నాను అనినయెడల భేదవాదిరచితమైన తత్త్వమస్యర్థ పద్ధతిగా బ్రహ్మమునకు నాకు పరస్పర భేదము సిద్ధించును. పిదప ఆభేదము బ్రహ్మము అంశి, మఱియు నేను అంశము ఈరీతిగా అంశాంశిభావరూపముగానుండనీ లేక ఆభేదము బ్రహ్మము వికారి [కారణము] నేను వికారము [కార్యము] ఈరీతిగా వికారవికారిభావరూపముగానుండనీ లేక ఆభేదము బ్రహ్మము ఉపాస్యము, నేను ఉపాసకుఁడు ఈరీతిగా ఉపాసకోపాస్యభావరూపముగా నుండనీ ఏలాగైనను భేదముసిద్ధించుట యథార్థము. కనుక బ్రహ్మము నేనుగానె యున్నాను. అట్లనుటచేత సర్వదా భేదాభావముయొక్క నిశ్చయ ముండుట వలన ఏరీతినైనను పరతంత్రత్వమే సిద్ధింపదు. ఎట్లనఁగా చూదుము—

ఆబ్రహ్మము స్వతః కారణరూపముగాను, ప్రకాశరూపముగాను, ఆధారరూపముగాను ఉన్నది; అందువలన తద్భిన్నముగా నున్న ఏపదార్థము గలదో, అది స్వతః కార్యరూపముగా, లేక అప్రకాశరూపముగా, లేక ఆధేయరూపముగా నున్నది.

ఆబ్రహ్మభిన్నపదార్థము కార్యరూపముగా ఉన్నదనునెడ దానియందు కార్యతారూపమగు [కారణాధీనతారూపమైనట్టి] పరతంత్రత ఉన్నది. ఏల యనఁగా కారణములేక కార్యపదార్థసిద్ధియే ఘటిల్లదు.

ఆబ్రహ్మభిన్నపదార్థము అప్రకాశరూపముగా ఉన్నదనునెడ దానియందు అప్రకాశకతారూపమగు[ప్రకాశకాధీనతారూపమైనట్టి]పరతంత్రత ఉన్నది. ఏల యనఁగా ప్రకాశకపదార్థములేక అప్రకాశపదార్థమునకు ప్రకాశమే ఘటిల్లదు.

ఆక్షేపము — నీవు పరంపరగా గురువైన భాగవతోత్తముఁడైన శ్రీ నాదోజీయొక్క సంప్రదాయముగా ఇష్టదేవతయైన శ్రీరామచంద్రుని నమస్కారరూప మంగళమును చేయవలసియుండెను.

సమాధానము — ఏ రామచంద్రుని సుకృతిజనులు బ్రహ్మబోధేచ్ఛవలన నిష్కామముగా భజింతురో, ఆరాముఁడే నా యాత్మగా నున్నాఁడు. నే నెవ్వనికి నమస్కరింతును ? లేక ఏ బ్రహ్మముయొక్క బోధేచ్ఛవలన సుకృతిజనులు రామచంద్రుని భజింతురో, ఆపరబ్రహ్మము నా యాత్మగా నున్నది. [బ్రహ్మము సర్వమునకు నధిష్ఠాన మని ప్రసిద్ధము. ఆబ్రహ్మమే నాయాత్మ యగుటవలన] సర్వమునకును అధిష్ఠాన మగునేను ఎవనికి నమస్కరింతును? కల్పితపదార్థమునకా? సత్యపదార్థముయినవో, నాకన్న వేఱె యేదొక్కటియును లేనే లేదు.

## 2. గ్రంథమహిమ

సూత్ర [1]

---

ఆ బ్రహ్మాభిన్న పదార్థము ఆధేయరూపముగా నున్నదనుటచే దానియందు ఆధేయతారూపమగు [ఆధారాధీనతారూపమైనట్టి] పరతంత్రత ఉన్నది. ఏలయనఁగా ఆధారములేక ఆధేయపదార్థముయొక్క స్థితియే ఘటిల్లదు.

ఏందువలన నేను బ్రహ్మాభిన్నపదార్థము కానో, అందువలన నేను ఉక్తత్రివిధ పరతంత్రతారహితుఁడుగా నున్నాను. ఇది లేయభిప్రాయము.

1 స్పష్టాక్షరములు అసందిగ్ధము [నిస్సందేహము] సారము సర్వశాస్త్రార్థమునందు ప్రవృత్తిగలిగి అన్యగ్రంథములకాధారమై ఎవ్వరిచేతను ఆణచఁబడని నిర్దోషమైనట్టి వాక్యమును సూత్ర మందురు. అట్టి సూత్రములు షట్ఛాస్త్రాద్యనేకగ్రంథము లున్నవి. అసూత్రసమూహములందిచ్చట సూత్రశబ్దముచేత వేదవ్యాసరచిత బ్రహ్మసూత్రములను గ్రహింపుము. మఱియు

భాష్య [1] వార్తిక [2] ప్రభృతులగు సంస్కృతగ్రంథములు అనేకము లుండినను ఆగ్రంథములచేత సంస్కృతభాషాజ్ఞానము లేనివారికి బోధ కాఁజాలదు; భాషాగ్రంథముచేత కాఁజాలును. కనుక గ్రంథారంభము నిష్ఫలము గాదు. మఱేమనఁగా—సంస్కృతభాషా రహితుల గుఱించి సఫలము.

ఇది వేదసిద్ధాంతరూప జలముచే నిండఁబడి అతి గంభీరమగు శ్రీవిచారసాగర మను [3] గ్రంథము. ఓం శ్రద్ధావం

---

ఉపనిషత్తులు గీతాసూత్రాది అన్యగ్రంథములు ప్రభృతిశబ్దముచేత గ్రహింపఁబడుచున్నవి.

1. సూత్రాది మూలగ్రంథమునందుఁగల పదములఁ దీసికొని వానికి పర్యాయరూపములయిన స్వపదములఁజెప్పి మూలగ్రంథపదానుసారముగ పదములచేత స్వపదములయొక్క వివరణము [విశేషవర్ణనము] ఏది గలదో, దానిని భాష్య మందురు. ఇట్టి భాష్యములనేకములు గలవు; వానిలో నిచ్చట శ్రీమద్భగవత్పాదశంకరాచార్యకృత భాష్యము ప్రమాణము.

2 మూలగ్రంథముచే ఉక్త [చెప్పఁబడిన] అనుక్త [చెప్పఁబడని] యర్థము, అధ్యాహారము చేయఁబడిన యర్థమును, విరుద్ధము [స్థూలదృష్టిచే వ్యత్యస్త మని కనఁబడు] యర్థమును వీనియొక్క చింతన [విచారము] గల శ్లోకబద్ధవ్యాఖ్యానమును వార్తిక మందురు. అట్టి వార్తికము లనేకము లున్నవి. వానిలో నిచ్చట శ్రీమత్పూజ్యపాదశంకరాచార్యుల శిష్యుఁడైన శ్రీసురేశ్వరాచార్యులచేత [మండనమిశ్రులచేత] రచింపఁబడిన వార్తికము ప్రమాణము.

3 ప్రతివాది సిద్ధాంతిద్వారమున లేక గురుశిష్య ద్వారమున చేయఁబడిన యోజనచైతన్యాదిక పదార్థములయొక్క వివేచనము గలదో, దానిని విచార మందురు. ఆవిచారముయొక్క నిశ్చితార్థమే సిద్ధాంతము. కనుక ప్రతి

తుఁడ ! ఓయి ధీరుఁడ! [1] సద్గురుసన్నిధికి పోయి, ఈగ్రంథము యొక్క మంచి అధ్యయనముఁజేసి, బ్రహ్మజ్ఞానము సంపాదించి,

వాది లేక శిష్యరూపపవనముచేత ప్రేరితుఁడైన యీసిద్ధాంతి లేక గురురూప మేఘము కలదో, తద్ద్వారమున నయిన విచారరూప వృష్టియం దుండిన దేవిషయరూపమైన సిద్ధాంతజలమో, అది సాగరన్యాయమున విస్తీర్ణమగుటం జేత నీగ్రంథమును విచారసాగర మందురు.

దీనియందు వర్ణసమష్టిరూపమైన భూమి గలదు. సిద్ధాంతరూపమైన జలము గలదు. సప్తప్రకరణరూపమైన తరంగములు గలవు. [గ్రంథమును సాగరమనుటచే నధ్యాయము తరంగ మనఁబడినది.] భేదదోషరూపమైన జలజంతువులు గలవు. కఠినప్రసంగ రూపమైన మకరములు [మొసళ్లు] గలవు. వేదవాక్యరూపమైన శుక్తులు గలవు. [ఆశుక్తులందు] శుద్ధస్వరూప నిర్ణయరూపమైన ముత్యములు గలవు. సాధనరూపమైన రత్నచతుర్దశములు [వివేకాదులు 9, శ్రవణాలు 4, ఓతప్రోతభావము 1 కూడి చతుర్దశములు] గలవు.

ఈసముద్రము నుల్లంఘించుటకు [దాఁటుటకు] జిజ్ఞాసువుయొక్క బుద్ధిరూపమైన నౌక గలదు. అభ్యాసరూపమైన శుభపవనము గలదు. బ్రహ్మనిష్ఠాచార్యుఁడైన కర్ణధారుఁడు [చుక్కాని ధరించువాఁడు] గలఁడు. ఈసముద్రమునకు సంసారరూప కుదేశ సంబంధము గల పూర్వతీరము గలదు. మోక్షరూపసుదేశ సంబంధముగల పరతీరము గలదు.

ఈప్రకారముగా సముద్రోపమాలంకారముచేత భూషితమై మోక్షప్రదమగు నీగ్రంథముయొక్క శ్రద్ధాపూర్వకమగు శ్రవణపఠనము చేయుటకును ధీరుఁడైన జిజ్ఞాసువునే అను గ్రంథకర్త సూచించుచున్నాఁడు.

1 జీవన్ముక్త విద్వాంసుని జిజ్ఞాసువును గూర్చి ఉపనిషత్తులందు ధీరుఁడని చెప్పఁబడినది. ఇచ్చట బుద్ధిని విషయమునుండి రక్షణము చేయువాఁడైన జిజ్ఞాసువును గూర్చి ధీరుఁడనఁబడియున్నది. ["ధీర" ఇది సంస్కృతపదము.

అవిద్యాదిసకలానర్థములను జంపి అఖండానందమును బొందు దూ ! లెమ్ము! !

భాషాగ్రంథము లనేకము లుండినను విచారసాగరము తప్ప ఇతర భాషాగ్రంథములచేత ఆత్మవస్తువునందలి సకల సందేహ నివృత్తి కాఁజాలదు. ఏలయనఁగా—ఎన్ని యోభాషా గ్రంథములు[1] కొందఱిచేత శాస్త్రశ్రవణముగాని పఠనము గాని యల్పాల్పముగఁ జేసి రచింపఁబడినవి. దానివలన వానియందు కొన్నిచోట్ల శాస్త్రవిరుద్ధార్థమును కొన్నిచోట్ల అపూర్ణార్థ మును నివసించుచున్నది. ఈగ్రంథమందో వేదాంతప్రక్రియ సమగ్రమై వేదానుసారముగ నున్నది. ఎచ్చటను వేదవిరోధము లేదు. ఆత్మజ్ఞానోపయోగకపదార్థములయొక్క నిరూపణమును సవిస్తరముగ నున్నది. అందువలన ప్రకృతములగు సకలభాషా గ్రంథములకన్న ఉత్తమమై యున్నది.

### 3 అనుబంధవర్ణనము [2]

దేనిని తెలియక వివేకిపురుషునకు గ్రంథమునందు ప్రవృత్తి

---

దానియందు "ధీ" "ర" ఇవి రెండు అవయవములు. "ధీ" అను నవయవము బుద్ధి యనునర్థమును, "ర" అను నవయవము రక్షణ మనునర్థమును జూపు చున్నది.]

1 హిందూస్థాని మూలగ్రంథమునందు ఎన్నియో భాషాగ్రంథము లందు న్యూనత చూపి ఆగ్రంథములయొక్కయు, వానికర్తలయొక్కయు పేర్లు వ్రాయఁబడినవి. ఆవశ్యకత లేకుండుటవలన నిచ్చట వ్రాయ లేదు.

2 నాల్గుకాళ్లులేక ఎట్లు మంచము కూడదో, అట్లు నాల్గు అనుబంధ ములు లేక గ్రంథము సిద్ధింపదు. అందువలన సకలగ్రంథములందును అనుబంధ చతుష్టయము అవశ్యకముగ నున్నను కొన్ని గ్రంథములందు వ్రాయఁబడి

గలుగదో, దాని ననుబంధ మందురు. అధికారి, సంబంధము, విషయము, ప్రయోజనము ఈనాల్గు తెలియక వివేకిపురుషునకు గ్రంథమునందు ప్రవృత్తి గానేరదు. అందువలన వానిని అనుబంధ మందురు. మఱియు నీయనుబంధములు నాల్గుండుటవలన వానియొక్క సముదాయంబును అనుబంధచతుష్టయ మందురు.

### 4. అధికారివర్ణనము. [1]

అంతఃకరణమునందు మూఁడుదోషములు [2] గలవు. మొదఁటిది మలము, రెండవది విక్షేపము, మూఁడవదిఆవరణము.

---

యున్నది; కొన్నిట వ్రాయబడలేదు. ఈ గ్రంథమునందో, రెండుతరంగముల క్రింద స్పష్టముగా వ్రాయఁబడియున్నది.

1 ఎట్లు బృహస్పతిసవనయాగమునకు బ్రాహ్మణుఁడు, లేక రాజసూయయాగమునకు క్షత్త్రియుఁడు అధికారి యని వేదంబునఁ జెప్పఁబడినదో అట్లు సాధనచతుష్టయ సంపన్నుఁడు వేదాంతమునకధికారి.

2 స్థూలశరీరమునందు ఎట్లు పిత్తము, వాతము, కఫము ఈమూఁడు రోగములు గలవో, అట్లు సూక్ష్మశరీరమునందును [అంతఃకరణమునందును] మలము, విక్షేపము, ఆవరణము అను మూఁడుదోషములు గలవు. స్థూలశరీరాశ్రితమైన రోగము ఇంద్రియముద్వారమునఁ దెలియఁబడదు; అది నాడీద్వారమునఁ దెలియవలెను. అప్పుడు సూక్ష్మశరీరాశ్రితమైన దోషములు ప్రత్యక్షప్రమాణముచేత నేలాగు తెలియవలెను? అవి అనుమానాది ప్రమాణములచేతఁ దెలియవలెను. ఎట్లనఁగా—

1. మలము. [పాపము] జన్మజన్మకృతములయిన శుభాశుభకర్మముల సూక్ష్మసంస్కారములు అంతఃకరణమునం దుండును; వానిలో నశుభకర్మసంస్కారముచేతఁ బాపోత్పత్తియగును; ఆపాపము అశుభవాసనవలన [విషయాసక్తిరూపచిహ్నమువలనను, నిషిద్ధకర్మప్రవృత్తిరూప చిహ్నమువలనను] తెలియవలెను.

జన్మాంతరపాపమును మల మని, మనసుచంచలతను విక్షేప మని

2. ఆత్మయందు లేక వేదాంతవిచారమునందు చిత్త మేకాగ్రము గా నేరదు; అనేకపదార్థములందు భ్రమించుచున్నది; దానిచేత విక్షేపముం దెలియవలెను.

3. తా నెవ్వఁడో, యీసంగతిఁ దెలియకుండుట ఆవరణ మని తెలియవలెను.

ఈరీతిగా నంతఃకరణంబునందు మూఁడుదోషములు తెలియవలెను. మఱియుఁ స్థూలశరీరాశ్రిత రోగనివృత్తికొఱకు ధన్వంతర్యాదులచేత చికిత్సా గ్రంథములు చేయఁబడినవి. అట్లే పరమేశ్వరునిచేత నంతఃకరణదోషనివృత్తి కొఱకు కర్మము, ఉపాసన, జ్ఞానము అని త్రికాండవేదము నిర్మింపఁబడినది. దానిలో—

1. గంగాస్నానము ఈశ్వరనామోచ్చారణము, భూతదయ, నిష్కామ కర్మానుష్ఠానము వీనిలో దేనిచేతనైనను మలదోషము నివృత్తమగుచున్నది.

2. ఈశ్వరధ్యానము, అజపాజపము, యోగము, ఈశబుద్ధిచే గురుసేవ, వేదాంతప్రవేశము వీనిలో దేనిచేతనైనను విక్షేపదోషము నివృత్తమగుచున్నది.

3. బ్రహ్మాత్మయొక్క యపరోక్షజ్ఞానముచే నావరణదోషము నివృత్త మగుచున్నది.

ఈస్థానంబునం దీరహస్య మున్నది—మలదోషనివృత్తికొఱకు చేయను ష్ఠానము చెప్పఁబడినదో, దానిచేత నొక మలదోషము మాత్రము నివృత్త మగుచున్నది. విక్షేపనివృత్తిసాధనముచేత మలము, విక్షేపము ఈరెండుదోష ములు నివృత్తము లగుచున్నవి. ఆవరణనివృత్తిసాధనముచే మూఁడును నివృత్తము లగుచున్నవి.

మలవిక్షేపదోషములనివృత్తినిగుఱించి చెప్పఁబడిన సకలసాధనములందు విచారపూర్వకముగఁ జూచినట్టయిన నీశ్వరనామోచ్చారణమునందు అద్భుత

[1] స్వరూపాచ్ఛాదనమును ఆవరణ మని తెలియవలెను. వీనిలో నిష్కామ కర్మమువలన మలదోషము, ఉపాసనవలన విక్షేప దోషము, జ్ఞానమువలన ఆవరణదోషము పరిహరింపఁబడును.

---

శక్తిఁ గనఁబడుచున్నది ఏం యన—నామమాహాత్మ్యము నెఱుఁగకయే యీశ్వరనామోచ్చారణముచేత సకలపాపములు నశించుచున్నవి. తెలిసి నిష్ఠాపూర్వకముగ నీశ్వరనామోచ్చారణముచేత సకలమలవిక్షేపములు నివృత్తములై, యంతఃకరణము శుద్ధమై, స్థిరమై, జ్ఞానముదయించి, యాజ్ఞానముచేత మోక్షప్రాప్తి యగుచున్నది. ఈసంగతి శ్రీమద్భాగవతషష్ఠస్కంధమునందు అజామిళకథ దృష్టాంతద్వారమున భగవచ్ఛుకాచార్యునిచేత పరీక్షిద్రాజు కొఱకు చెప్పఁబడినది.

[1] ఇంద్రియములయొక్క, లేక చిత్తముయొక్క చాంచలత్వమువలన వినఁబడినయర్థము కొఱవిదయ్యమువలె ఉన్నచోటనే స్థిరముకాఁజాలదు; చంచలమగుచున్నది. [అరణ్యము మొదలగు స్థానములందు ఒక్కొక్కసారి ప్రజ్వలితాగ్ని కనఁబడుచున్నది. ఆయగ్ని ఒకేస్థానమునందు స్థిరముగాఁ గనఁబడదు. క్షణమునందు ఒకస్థానమునందు మఱియుం క్షణమునందు ఇంకొక్క స్థానమునందుఁ గనఁబడుచున్నది. దానిని భూతాగ్ని యనుచున్నారు. దానివలె]

ఈచంచలత అన్ని అంతఃకరణములందు సమానముగ నుండదు. ఏయంతఃకరణమునందు సత్త్వగుణముయొక్క తమోగుణముయొక్క బలము ఎక్కువగ నుండునో, ఆయంతఃకరణమునందు చంచలత తక్కువగ నుండును. మఱియు ఏయంతఃకరణమునందు రజోగుణముయొక్క బలము ఎక్కువగ నుండునో, ఆయంతఃకరణమునందు చంచలత ఎక్కువగ నుండును. దీనివలన సిద్ధమగుచున్నది—ఎక్కడెక్కడ చంచలతాధిక్యమో అది రజోగుణమహారాజుయొక్క మాహాత్మ్యమే.

ఏపురుషుఁడు ఈజన్మమున, లేక పూర్వజన్మమున, నిష్కామకర్మము ఉపాసన చేసి తన మలదోషమును విక్షేప దోషమును దూరము చేసెనో, స్వరూపావరణమును ఒకదోషము మాత్రము కలిగియుండునో, మఱియును సాధనచతుష్టయ సంయుక్తుఁ డగునో, వాఁడు అధికారి యనఁబడును.

## 5. సాధనచతుష్టయము

వివేకము, వైరాగ్యము, శమాదిషట్క సంపత్తి, ముముక్షుత ఈనాల్గింటిని సాధనచతుష్టయ మందురు.

## 6. వివేకవర్ణనము

ఆత్మ అవినాశి [1] మఱియు అచలుఁడు [2] గా నున్నాఁడు. జగత్తు ఆత్మకన్న వ్యత్యస్తము [3] అనఁగా—వినాశి, మఱియు చలరూపముగా నున్నది. ఈజ్ఞానమునకు వివేక మని పేరు. ఈ వివేకమే సర్వసాధనములకు మూలముగా నున్నది. ఏలయనఁగా—ప్రథమమున వివేకము [4] పొడమెనేని వైరాగ్యము మొదలైన యుత్తరసాధనములు కలుగును. అది గలుగదేని యుత్తర

---

1 నాశరహితుఁడు 2 క్రియారహితుఁడు. 3 విపరీతస్వభావము గలది.
4 క్షీరనీరములొకటిఁజేసి సమ్ముఖమున నుంచినట్టయిన హంసపక్షి క్షీర నీరవిభాగ మెట్లుచేయునో, అట్లు అహంకారమాదిగాఁగల సమష్టివ్యష్టిరూప సకలప్రపంచమునందు జడమును, చైతన్యమును నీరెండుపదార్థములు గలవు; వానియొక్క విభాగము చేయుటను వివేకమందురు. [ఈవివేకములోపల ఏజడ చైతన్యజ్ఞానముచున్నదో, అది సామాన్యపరోక్షజ్ఞాన మగుటవలన విశేష పరోక్షజ్ఞానముయొక్క, మఱియు అపరోక్షజ్ఞానముయొక్క ప్రాప్తికొఱకు

సాధనములు కలుగజాలవు. [వైరాగ్యాదులు మూడు, మఱియు శ్రవణాదుల నాల్గు గూడి ఏడుసాధనములును. ఉత్తరోత్తరసాధన

వైరాగ్యాద్యుత్తరసాధనములు అవశ్యముగా వలయును.] మరుభూమియందు జలసేచనము లేక ఎట్లు కదళీవృక్షము వృద్ధిగాదో, అట్లు త్రివిధదోష సహితాంతఃకరణమునందు ఈవివేకము లేక వైరాగ్యాద్యుత్తర సాధనములు గానేరవు.

ఆక్షేపము—విజిగీషు [అన్యుని జయింప నిచ్ఛగలిగినవాఁడు] పండితునకుఁగూడ ఆత్మ నిత్యుఁడు, ఆత్మకన్న భిన్నమైన దేహాదిప్రపంచ మనిత్యము; ఈలాటి భేదజ్ఞానరూపమైన వివేకమగుచున్నది. ఆవివేకము వైరాగ్యాద్యుత్తర సాధనములకు హేతు వెట్లు గాదు?

సమాధానము—విజిగీషునకు శాస్త్రాభ్యాసముచేత వివేకము గలిగినను అది నిష్కామకర్మోపాసనారహితమై యశుద్ధమగు నంతఃకరణప్రదేశమునం దుదయించుటవలన సారవత్ప్రదేశమునుండి యుత్పాటించి మరుభూమియం దునిచిన కదళీవృక్షమున్యాయమున వైరాగ్యాద్యుత్తరసాధనరూపములైన కదళీవృక్షములయొక్క పరంపరకు హేతువుగాఁజాలదు. చిత్రాంగదన్యాయముగా, చిత్రామృతన్యాయముగా, లేక చిత్రాగ్నిన్యాయముగా శబ్దమాత్ర మగుటవలన అది వివేకము గాదు; అవివేకమే యగును.

శుద్ధాంతఃకరణదేశమునం దుదయించినవివేకము సజలసరసభూమియందు నాటఁబడిన కదళీవృక్షమున్యాయమున వైరాగ్యాద్యుత్తరసాధనరూపములైన వృక్షములయొక్క పరంపరకు హేతు వగును. కనుక నిట్టి వివేకము వైరాగ్యమునకు కారణము. ఆవైరాగ్యము షట్సంపత్తికి కారణము.

ఈరీతిగా ఉత్తరోత్తరసాధనములకు పూర్వపూర్వసాధనములు నిమిత్తకారణములు. మఱియు శుద్ధాంతఃకరణమనుభూమి సర్వసాధనముల కుపాదానకారణముగా నున్నది. కాఁబట్టి సాధకపురుషునకు చిత్తశుద్ధిపూర్వకముగా వివేకము సంపాదించుట యోగ్యము.

ములు. ఇవి అన్నియును వివేకోద్భవములే. వానియందు వైరాగ్యము సాక్షాద్వివేకోద్భవము. తక్కిన ఆఱు పరంపరగా వివేకోద్భవములు.]

## 7. వైరాగ్యలక్షణము

ఆబ్రహ్మాదిమర్త్యపర్యంతము లోకంబులయందుండు భోగసాధనమైన సకలవిషయంబులయందుఁగల దుఃఖదోషముల నెఱిఁగి విసిగి కాకమలమువలె త్యాజ్యముగా చూచు మనోవృత్తి వైరాగ్య మనఁబడును.[1]

---

వివేకాదికములు నాల్గును సర్వకాలము అవశ్య ముండవలయును. ఏల యన—ప్రథమసాధనముగల శాస్త్రజ్ఞుఁడును విషయములందాసక్తి గలవాఁడై కామకర్మంబులయందుఁ బ్రవర్తించును; కనుక ద్వితీయసాధనము [వైరాగ్యము] గావలయును. ఈ రెండుసాధనము లుండినను కొందఱు కోపాదులచేత దహింపఁబడుటవలన మూఁడవసాధనము [శమాదిషట్కము] కావలయును. ఈ మూఁడు నుండినను కొందఱు మోక్షాకాంక్ష లేక శ్రవణాదికములందు ప్రవర్తింపరు. అందువలన నాల్గవసాధనము [ముముక్షుత] గావలయును. [ఈ స్థానమునందు ముముక్షుతాశబ్దముచేత తీవ్రముముక్షుత యని తెలియవలెను. ఏల యన—మందముముక్షుత సకలసాధకజనులకు సర్వదా కలదు.]

1 భోగత్యాగేచ్ఛ, మఱియు భోగానిచ్ఛ వైరాగ్యలక్షణము.
ఈవైరాగ్యము నాల్గువిధములు. మొదటిది యతమానము, రెండవది వ్యతిరేకము, మూఁడవది ఏకేంద్రియము, నాల్గవది వశీకరము.

(1) యతమానము [మందవివేకము]

(2) వ్యతిరేకము [సత్సంగముచేత దుర్గుణములను విడుచుట.] నకులము అనఁగా ముంగిస ఒకవల్లి [దేని ఆశ్రయమువలన నకులము స్వశక్తిదుర్బలముగ నుండినను ఆది సర్పమును జంపుటకు శక్తిఁ బొందుచున్నదో, అట్టిదగు నకులవల్లి

యనుచున్నారు.] యొక్క ఆశ్రయముం జేసికొని సర్వమును జంపుచున్నది. అలాగున సజ్జనుల నాశ్రయముం జేసికొని ముముక్షువు స్వతః తనయం దుండిన దుర్గుణమును విడుచుటకు దుర్బలుండుగ నుండినను వాడాదుర్గుణమును విడుచుచున్నాడు.

(3) ఏకేంద్రియము [ఇంద్రియనిగ్రహము]

(4) వశీకరము [మనోనిగ్రహము] ఈవశీకరవైరాగ్యము మందము, తీవ్రము, తీవ్రతరము అని త్రివిధము. వానిలో 1. పుత్రధనాదినాశముచేత సంసారమును తిరస్కరించు బుద్ధి మందము. 2. ఈలోకమునందు పుత్రాది సంబంధమువలనఁ గలుగు సుఖము దోషదృష్టిచే నిచ్ఛయించకుండుట తీవ్రము. 3. పునరావృత్తి యున్నదని యెఱిఁగి సర్వలోకేచ్ఛ లేకుండుట తీవ్రతరము.

ఈప్రకారముగా వైరాగ్యముయొక్క భేదోపభేదములు శాస్త్రంబు నందు వర్ణింపఁబడియున్నవి. వీనిలో జ్ఞానహేతువైన తీవ్రతరవశీకర వైరాగ్యము ఉత్తమము, తీవ్రవశీకరవైరాగ్యము మధ్యమము, మఱియు మందవశీకరవైరాగ్యము కనిష్ఠము.

హిందుస్థాని మూలగ్రంథముమీఁద టిప్పణకర్తయైన శ్రీపీతాంబర పండితుఁడు ఈటిప్పణము వ్రాయలేదు. ఒకానొక వేదాంతగ్రంథమునందు వ్రాయఁబడియున్నది. ఇది మంచిదై యున్నది; సాధకునకు గ్రాహ్యమై యున్నది; గాని దీనియందు వైరాగ్యలక్షణముతోడ శమదమాదిలక్షణములు కూడ మిశ్రముగ నున్నవి; కేవల వైరాగ్యలక్షణము వేఱే చేసి వ్రాయలేదు.

శ్రీమత్పూజ్యపాద శంకరాచార్యునిచేత అపరోక్షానుభూతియందు వైరాగ్యముయొక్క లక్షణము ఇట్లు వ్రాయఁబడియున్నది.—

బ్రహ్మాదిస్థావరాన్తేషు వైరాగ్యం విషయేష్వను,
యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్. 4

ఈ అపరోక్షానుభూతిశ్లోకముమీఁద వ్యాఖ్యాకారులైన శ్రీవిద్యారణ్యస్వామిచే ఇట్లు వ్రాయఁబడియున్నది—"కృతం తద్వైరాగ్యాదిచతుష్టయమిత్యాకాంక్షాయాం తత్స్వరూపమేవ వ్యాచష్టే—"బ్రహ్మాది" ఇత్యాదినా "వక్తవ్యా సా ముముక్షుతా" ఇత్యన్తేన శ్లోకషట్కాత్మకేన గ్రన్థేన. తత్రాదౌ వైరాగ్యస్య లక్షణమాహ—బ్రహ్మాదిస్థావరాన్తేష్వితి. బ్రహ్మాదిస్థావరాన్తేషు సత్యలోకాదిమర్త్యలోకాన్తేషు భోగసాధనేషు అను కర్మజన్యత్వేనానిత్యత్వం లక్షీకృత్యేత్యర్థః. వైరాగ్యం ఇచ్ఛారాహిత్యం. తత్ర దృష్టాన్తమాహ—యథైవేతి. యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యమ్ గర్దభాదివిష్ఠాయామపి కదాచిత్ కస్యచిత్ జ్వరశాన్త్యర్థం గ్రహణేచ్ఛా భవతి అతః కాకవిష్ఠాయా గ్రహణమ్. ఉపలక్షణమేతద్వాన్తాదీనామ్. విషయేష్విచ్ఛాభావమేవ వైరాగ్యస్య హేతుగర్భితం విశేషణమాహ—తదితి. హి తస్మాద్వైరాగ్యం నిర్మలం రాగాదిమలరహితమ్.

ఈవచనానుసారమే మూలగ్రంథమునందు వైరాగ్యలక్షణము వ్రాయఁబడియున్నది; కనుక ఇంక ఈవచనముయొక్క యర్థము ఆంధ్రభాషయందు వ్రాయలేదు.

దోషదృష్టియనియు, అపరోక్షమిథ్యాదృష్టియనియు ఈప్రకారముగ వైరాగ్యమునకు ముఖ్యములగు రెండుభేదములు. వానియందు సాధకజనులకు కర్తవ్యమైనట్టి దోషదృష్టివైరాగ్యముయొక్క భేదోపభేదములు పైన సవిస్తరముగ వ్రాయఁబడినవి.

ఈదోషదృష్టివైరాగ్యము తాను స్వతః దోషసహితముగ నున్నది. ఏ విషయమునందు ఒకసారి దోషదృష్టి యగుచున్నదో, ఆవిషయమునందే కాలాంతరమున నిర్దోషదృష్టి కూడను అగుచున్నది. చూడుము—స్త్రీవిషయమునందు సంభోగము పూర్తియైనతరువాత ఒక్కొక్క విచారశీలపురుషుఁడు "ఏమి! ఉన్నది ఈవిషయమునందు అన్నిశ్రమములును, దోషములును మాత్రమే

గొండియున్నవి" ఈప్రకారముగ ఆవిషయము దోషదృష్టిచే చూచుచున్నాఁడు. పెక్కులేల "నేను ఎంతమూర్ఖుఁడను సదోషవిషయములందు ఉన్మత్తుఁగా రమించి బలహానిమాత్రము పొందుచున్నాను." అని ఈప్రకారముగ పశ్చాత్తాపమును జెందుచున్నాఁడు. "పునరపి ఈవిషయములందు ప్రవర్తింపను." అని ఈప్రకారముగ నిశ్చయమును చేయుచున్నాఁడు. అయినను కాలాంతరమున ఈయుక్తసంగతులను మఱచిపోయి ఆవిషయముయొక్క ఉపాసనమే చేయుచున్నాఁడు. ఈరీతిగా దోషదృష్టివైరాగ్యమునందు అల్పకాలీనదోషము సహజముగానె యున్నది. రెండవది నిర్దోషమైనట్టి అపరోక్షమిథ్యాదృష్టివైరాగ్యము ఏది గలదో, అది జీవన్ముక్తవిద్వాంసులందు సహజముగానే నివసించుచున్నది; అది సాధకునకు సాధనదశయందు మఱియు ఏవిధిచేతను ప్రాప్తము కానేకాదు; అందువలన దానియొక్క ప్రస్తావ మిచ్చట వ్రాయుట అనావశ్యకము. అయినను ఎట్లు దరిద్రునికి బంగారు డేకసా దొరికిన నపుడు "నావంటి ఐశ్వర్యవంతుఁడు ఎవ్వఁడును లేఁడు; ఇంత ఐశ్వర్యము ఎక్కడ లేదు;" అని ఎఱుఁగుచున్నాఁడు. చిన్న ఒక వజ్రమణి ఉండిన నపుడు ఒకమణుగుబంగారముచేతను దానియొక్క వెల పూర్తికాదు. వజ్రవైడూర్యాది సహస్రావధి మణిసంపన్నులైనపురుషులు ప్రపంచమునందు ఉన్నారు; అని ఎఱుఁగఁడు. అట్లు ఎవ్వఁడేని అప్రబుద్ధ పురుషుఁడు నిర్దోషమయినట్టి ద్వితీయవైరాగ్యము నెఱుఁగక దోషదృష్టివైరాగ్యమునకే నిర్దోషమని దురాగ్రహము చేయుచున్నాఁడు. అందువలన రెండవది అపరోక్షమిథ్యాదృష్టివైరాగ్యముయొక్క దిగ్దర్శనమాత్ర మిచ్చట చేయుచున్నాను.

దోషదృష్టివైరాగ్యమునందు దోషము వర్తించుటవలన అది సాధకునకు ఆవశ్యకము కాదని యభిప్రాయము కాదు. దుర్భిక్షకాలమునందు సదన్నము దొరకదు; అపుడు సంకటిమీఁదనే నిర్వాహము చేయఁబడెను. అపుడు సంకటి మంచి అన్నము కాదని ఎఱిఁగి సేవింపకున్న ముందు సదన్నప్రాప్తి ఘటిల్లదు. అప్రకార

## 3. శమాదిషట్కము [1]

శమము, దమము, శ్రద్ధ, సమాధానము, ఉపరతి, మఱియు తితిక్ష ఈయాఱుసాధనములు గూడి శమాదిషట్కము అనఁబడును. వానిలో—

(1) మనస్సును విషయములనుండి యాకర్షించుట శమము అనఁబడును. [2]

---

ముగ సాధకుఁడు సాధనదశయందు దోషదృష్టివైరాగ్యము సేవించినపక్షము నందు వానికి జీవన్ముక్తిదశయందు నిర్దోషవైరాగ్యము సహజముగానే ప్రాప్త మగుచున్నది. లేకుండిన ఎక్కడ ?

1 శమాదిషట్కమునందుండిన ఆఱుసాధనములందు సాధనము యొక్క లక్షణము, అభిప్రాయ మొకటిగ నుండినను వేదాంతముయొక్క తత్తద్గ్రంథములందు వేర్వేఱుగ వ్రాయఁబడినది. ఆయాఱుసాధనములందును ఉపరతిసమాధానములయొక్క లక్షణము వేర్వేఱుగా వ్రాయఁబడియున్నది. చదువువారు సారగ్రాహకరీతిగా అర్థగ్రహణము చేయువలయును.

2 వైరాగ్యమువలన సిద్ధమైనది విషయములయందు దోషదృష్టి ఏది గలదో, అదోషదృష్టిరూపమైన అంకుశముచే విషయచింతారూపమైనఘోర వనమునందు తిరుగఁబోవు మనోరూపమత్తగజమును ఆకర్షించుట శమము. మఱియు శబ్దాదివిషయ రూపమార్గమునఁబోవు నింద్రియరూపమయిన అశ్వములను శాస్త్రోక్తయుక్తిరూపమయిన కళ్లెముచేత నాకర్షించుట దమము. ఈశమదమములనుగురించి శరీరరూపరథముయొక్క ప్రతిపాదనము ఉపనిషత్తునందిట్లున్నది—

శరీరరూపరథమునకు ఇంద్రియములు అశ్వములు; మనము లగాము; బుద్ధి సారథి; చిదాభాసుఁడైనజీవాత్మ రథికుఁడు. ఎవని బుద్ధిరూపమైన సారథి సరిగా నుండునో, వానియింద్రియములైన అశ్వములు సన్మార్గమునందుఁబోవు

(2) బాహ్య విషయముల నుండి ఇంద్రియముల నాకర్షించుట దమ మనఁబడును.

(3) వేదవచనమునందును, గురువచనమునందును పరమ విశ్వాసము శ్రద్ధ యనఁబడును. [1]

---

రథికుని స్వర్గదేశంబునందు లేక మోక్షదేశంబునందుఁ జేర్చును. [మోక్షమను నది ఏదో ఒక లోకము గాదు; గాని లోకమనుట యొకయుపచారాలంకారముగా నున్నది.] ఎవ్వనిసారథి సరిగా నుండఁడో, అతని అశ్వములు దుర్మార్గమునందుఁ బోయి రథికుని నరకదేశంబునందు, లేక నీచయోనిదేశంబునందుఁ జేర్చును. అందువలన ముముక్షువైనవాఁడు తనసారథిని బోధించి, అశ్వములను సన్మార్గమునందు వర్తించునట్లు చేయవలెను. ఈవిధముగా శరీరరూపరథముయొక్క వర్ణనము ఉపనిషత్తునందుఁ జేయఁబడియున్నది. ఇక్కడ బుద్ధిరూపసారథిని స్వాధీనముచేయుట శమ మని చెప్పఁబడును. ఇంద్రియములయిన అశ్వములను స్వాధీనముచేయుట దమ మని చెప్పఁబడును.

1 ఎవ్వనికి పెద్దల [మాతాపిత్రాదుల] యందు పూజ్యబుద్ధి యుండునో, వానికి వేదశాస్త్రాచార్యవచనములందు శ్రద్ధ గలుగును. సారాంశము శ్రద్ధ యనునది భక్తిరూపమగు ఉత్తమసాధనముగ నున్నది. ఇది సాధకునకు అత్యంతావశ్యకముగ నున్నది. చూడుము—

సర్వసాధనసంపత్తి యనునది దధి; దానికి శ్రద్ధ యనునది పాత్రము; ఆపాత్రభంగమైనయెడల సర్వసాధనములకు వ్యర్థత గలుగును. లేక సర్వసాధనసంపత్తి యనునది వృక్షము; దానికి శ్రద్ధ యనునది ఫలము; ఆఫలముయొక్క నాశమయ్యెనేని సాధనరూపమయిన వృక్షము నిష్ఫలమగును. అందువలన జ్ఞానహేతువైన సకలసాధనములలో శ్రద్ధ యనునది ముఖ్యసాధనముగ నున్నది. దానిని దుస్సంగాది నాశకరపదార్థమునుండి రక్షించుట యోగ్యము. "శ్రద్ధావాఁల్లభతే జ్ఞానమ్" భగవద్గీత.

(4) మనస్సును ఏకాగ్రముగా నుంచుట సమాధాన మనఁబడును.[1]

---

1. ఒకానొకఁడు నిర్గుణబ్రహ్మమునందు చిత్తముయొక్క నివృత్తిని సమాధానలక్షణమని చెప్పుచున్నాఁడు. వానినడుగవలెను—అయ్యా! ఈసమాధానము చేయువాఁడైన అధికారికి మరల శ్రవణాదిసాధనములు కర్తవ్యము లున్నవా? లేక ఈసమాధానమునందే కృతార్థుఁడగునా? వేదశాస్త్రములందయిననో, నిర్గుణబ్రహ్మమునందు చిత్తముయొక్క నివృత్తి [బాధ] యగుట తత్కాలమున బ్రహ్మసాక్షాత్కారమని చెప్పి అదే కృతార్థతయని చెప్పఁబడియున్నది. జీవన్ముక్తవిద్వాంసులును అట్లే పలుకుచున్నారు. వివేకాదిసాధనచతుష్టయసంపన్నుఁడైన పురుషుఁడు శ్రవణాదిసాధనములకు అధికారియై ఆశ్రవణాదులయొక్క అంతమునందు సాక్షాత్కారమును పొందుచున్నాఁడు. ఆవివేకాది చతుష్టయమునందే సమాధానము చెప్పఁబడియున్నది. మీరుచెప్పినప్రకారముగ వివేకాదిసాధనములందే అధికారి కృతార్థుఁ డగును. వానికి శ్రవణాది సాధనములయొక్క ఆవశ్యకతయే లేదు. మంచిది! అయినను ఈసిద్ధాంతమునకు ఎక్కడను యుక్తి ప్రమాణము కనఁబడదు. వేదప్రతిపాద్యశ్రవణాది సాధనములకు వ్యర్థతయు నగును.

ఇంకొకఁడు అనుచున్నాఁడు—నేను శుద్ధబ్రహ్మమునందు చిత్తముయొక్క బాధ అనను; నేను లయము అనుచున్నాను. వానిని అడుగవలెను—కారణమునందు కార్యముయొక్క లయము శాస్త్రమునందు చెప్పఁబడినది; అధిష్ఠానమునందు లయము చెప్పలేదు; బ్రహ్మమో, ప్రపంచమునకు అధిష్ఠానమని ప్రసిద్ధము; ఆయధిష్ఠానరూపశుద్ధబ్రహ్మమునందు చిత్తముయొక్క లయము ఎట్లు అగును? కారణమయిన మూలావిద్యయందు క్రమముగా ఏపదార్థమునకుఁగాని లయమగుచున్నది.

సారాంశము—సమాధానముయొక్క లక్షణము అట్లు [మీరుచెప్పిన ప్రకారముగ] కాదు. శమదమాదిసాధనముల సాహాయ్యముచే చిత్తమును

సకలపదార్థములనుండి ఆకర్షించి ఏకాగ్రముగ నుంచుటకొఱకు పలుమాఱు ప్రయత్నముచేయుట సమాధాన మనఁబడును.

ఒకఁడు ఆక్షేపించుచున్నాఁడు—నీవుచెప్పినప్రకారముగ సాధనచతుష్టయమునకు పూర్వమునందే అంతఃకరణస్థితమయిన విక్షేపదోషనివృత్తికొఱకు చిత్తమేకాగ్రముచేయుటకు ప్రయత్నము చేయఁబడినది; మరల సమాధాన ప్రసంగమునందును అదేసాధనము ఎట్లు పలుకుచున్నావు? పూర్వసాధనమునకును, ఈసాధనమునకును విలక్షణత ఉండవలెను. లేక ఆయేకాగ్రతయందును, ఈయేకాగ్రతయందును విలక్షణత ఉండవలెను.

సమాధానము—పూర్వసాధనమువలన పూర్వము చిత్తమేకాగ్రమైనను వెనుక వివేకాదిసాధనములు కలుగుచున్నవి; అయినను ఆవివేకాదిసాధనములకన్న శ్రవణాదిసాధనములందు విచారకర్తవ్యత అధికముగ నున్నది; దానికి అంత ఏకాగ్రత చాలదు. [శ్రవణాదిసాధనములయొక్క అపేక్షచే చూచిన యెడల వివేకాదిసాధనములందు విచారకర్తవ్యత న్యూనముగ నున్నది; మఱియును వివేకాద్యపేక్షచే శ్రవణాదులందు అది అధికముగ నున్నది. కావున వివేకాదులకు అయల్పమయిన ఏకాగ్రత చాలును; అది శ్రవణాదులకు చాలదు.] అందువలన మరల సమాధానమను ఒకసాధనము చెప్పఁబడియున్నది. ఈవిధముగ పూర్వోత్తరైకాగ్ర్యములందు అల్పకాలస్థిరత బహుకాలస్థిరత ఇంతభేదము; గాని ఆచిత్తైకాగ్ర్యము ఈచిత్తైకాగ్ర్యము వేఱేకాదు. మఱియును పూర్వము వానికి శమదమాదిసాధనములయొక్క సాహాయ్యము లేదు; అందువలన చిత్తము స్థిరముగుటకొఱకు మూర్త్యాదిసాకారపదార్థముయొక్క ఆశ్రయము చేయవలసినది; ఇపుడు వానికి శమదమాదిసాహాయ్యమున్నది; గనుక సాకారపదార్థాశ్రయముయొక్క ఆవశ్యకత లేదు; ఇంతే ఆసాధనమునందు ఈసాధనమునందు భేదమున్నది.

ఒకఁడనుచున్నాఁడు—పూర్వము సగుణబ్రహ్మచింతనము చేయుచున్నాఁడు. ఇపుడు [సమాధానప్రసంగమునందు] నిర్గుణబ్రహ్మచింతనము

చేయుచున్నారు. వానిని అడుగవలెను—అయ్యా! శ్రవణముకన్న మొదలు నిర్గుణబ్రహ్మమనఁగా ఏమి తెలియునా; ఎట్లు నిర్గుణబ్రహ్మచింతన చేయుచున్నారు? నిర్గుణబ్రహ్మము యొక్క ఉపాసనయే భ్రాంతులకు; ఇది సిద్ధాంతము. [ఈసంగతి పూర్వము ఉపాసకమత టిప్పణమునందు సవిస్తరముగ చెప్పియున్నాను.]

శ్రీమద్భగవత్పూజ్యపాదాచార్యుల చేత అపరోక్షానుభూతియందు—

"చిత్తైకాగ్ర్యం తు సల్లక్ష్యే సమాధానమితి స్మృతమ్".

"సదేవ సౌమ్యేత్యాది శ్రుతిలక్ష్యమయిన బ్రహ్మమునందు చిత్తైకాగ్ర్యము" సమాధానలక్షణమని చెప్పఁబడినది. మఱియును వివేకచూడామణి యందు—

"సర్వథా స్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా,
తత్సమాధానమిత్యుక్తం నతు చిత్తస్య లాలనమ్."

"సర్వప్రకారముల చేతను అవిద్యాదిమలరహితమైనట్టి శుద్ధబ్రహ్మమునందు బుద్ధినిలుపుట సమాధానము. ఇదిగాక వట్టి ఏనేకప్రకారముగ చిత్తమును సంతోషింపఁజేయుట సమాధానము గాదు." ఈప్రకారముగ ఈ శ్లోకమునందు వివేకరహితులైన పురుషులకు స్థూలదృష్టిచే అర్థము కనఁబడుచున్నది. అయినను కొంచెము విచారద్వారమున చూడుము—శుద్ధబ్రహ్మమునందు బుద్ధినిలుపుట ఏమి? శ్రవణమననములయిన వెనుక నిదిధ్యాసనవంతుఁడు "నేతినేతి" వాక్యార్థముద్వారముగ బాహ్యాంతరములైన సకలపదార్థములకన్న బ్రహ్మమును వేఱే యనియెఱిఁగి బుద్ధిపూర్వకము బ్రహ్మసమ్ముఖముగ వృత్తిని నిలుపుటకు ప్రయత్నము చేయుచున్నాఁడు. అట్లేనా? అట్లే యనినపక్షమునందు ఇపుడు వానికి శ్రవణాదికము యొక్క ఆవశ్యకతయే లేదు. ఎందుకనఁగా శ్రవణాదులచే కాఁదగినసిద్ధి వానికి సమాధానమునందే కలుగుచున్నది. ఇపుడు వాట్లు

గాక ఉపాసనప్రకారముగ శుద్ధబ్రహ్మముయొక్క చింతనము చేయుచున్నాఁడు. ఇట్లు అనినయెడల శుద్ధబ్రహ్మముయొక్క చింతనమే ఘటిల్లదు. ఎందుకనఁగా—శుద్ధబ్రహ్మమునకు జ్ఞేయబ్రహ్మ మనుచున్నాఁడు; జ్ఞేయబ్రహ్మముయొక్క చింతనము ఘటిల్లదు; అది జ్ఞానగమ్యమే. ఇది ఆచార్యస్వామియొక్కయే సిద్ధాంతము. తనసిద్ధాంతమునకే విరోధమెట్లు పలుకుచున్నాఁడు?

సారాంశము—స్థూలదృష్టిచే కనఁబడునర్థము ఘటిల్లదు. ఆశ్లోకమునందు ఆచార్యస్వామియొక్క అభిప్రాయము ఇట్లు ఎఱుఁగవలెను—సమాధానసాధకుఁడు మూర్త్యాదిసాకారపదార్థముయొక్క చింతనము చేయఁకూడదు; సత్యకామసత్యసంకల్ప సర్వజ్ఞత్వాదీశ్వరధర్మములయొక్క చింతనమును చేయఁగూడదు; అందువలన "శుద్ధే బ్రహ్మణి" అనుచున్నాఁడు. ఎందుకనఁగా—సకలాకారమును, కల్పనను వదలినపుడు నిరాకారనిర్వికల్పమై శుద్ధబ్రహ్మమే యున్నది. ఆచార్యస్వామికూడ అదే శుద్ధబ్రహ్మమని ఎఱిఁగి "శుద్ధే బ్రహ్మణి" అనుచున్నాఁడు. సాధకుఁడేమి అది శుద్ధబ్రహ్మమని ఎఱుఁగుచున్నాఁడా? అట్లే ఎఱిఁగినపుడు వానిభాగ్యమునకు తక్కువ యేమి? వానికి శ్రవణాదిసాధనము లెందుకు? వాఁడు అది శుద్ధబ్రహ్మ మని ఎఱుఁగఁడు; కనుక శుద్ధబ్రహ్మమునందు బుద్ధిని నిలుపుటవలని ఫలము వానికి ప్రాప్తము గాదు; అందువలన ముందు శ్రవణాదులందు ప్రవృత్తుఁడగుచున్నాఁడు.

"సర్వదా" శబ్దముయొక్కకూడ "ఎపుడును, కాలముయొక్క అంతరము లేనిదై, ఎల్లకాలము, అవ్యవహితము" ఇట్లు అర్థము చేయఁగూడదు. ఎందుకనఁగా—ఇట్లు అర్థము చేసినపుడు వానికి భోజనగమనాహ్నికములకును, శ్రవణేచ్ఛ చేయుటకును, గురుసమీపమునకు పోవుటకును కాలము దొరకదు. ఉక్తమగు భోజనశ్రవణేచ్ఛాది కాలమునువదలి తక్కినకాలమంతయు అని అర్థము చేయుటయందుఁ గూడ పెద్దసంకటమున్నది. ఏలాగున ననఁగా—

ఎవని యొక్క యోగము పూర్ణమయినదో, అంత పెద్ద పెద్దయోగి [అక్ష్మ జ్ఞాని యొక్క ఇతరయోగి] వానికి యోగానందము ప్రాప్తమగుటవలన అదేవరమతత్త్వమని ఎఱిఁగి శ్రవణాదిసాధనములందు ప్రవృత్తుఁడుగాలేఁడు. అట్లే సావరణానందమునందు చిక్కుకొని సంసారనదీప్రవాహమునందు జరుగుచున్నాఁడు. అట్టి ఈసాధకుఁడుగూడ సర్వకాలము ఏకాగ్రచిత్తుఁడగుటవలన ఇతఁడు పెద్దయోగియై యోగానందమునందే కృతార్థత ఎఱుఁగుచున్నాఁడు; శ్రవణాదులందు ప్రవృత్తుఁడు గాలేఁడు. అందువలన "సర్వదా" శబ్దముయొక్క అర్థముకూడ ఎల్లకాలమని చేయఁగూడదు; సాధకుఁడు ఎంతకాలమువరకు ఏకాగ్రచిత్తము చేయుట యుచితమో, అంత అన్ని కాలము అని యర్థము చేయవలెను.

లేక సర్వకాలము చిత్తమేకాగ్రముండుటవలన యోగసంపూర్తి యగుచున్నది; గాని సర్వదా ఏకాగ్రతకొఱకు ప్రయత్నముచేయుటవలన యోగసంపూర్తి గాలేదు; అందువలన సర్వకాలప్రయత్న మని అర్థము చేయవలెను.

లేక దరిద్రుఁడైన ఒకగృహస్థుఁడు తనకొడుకుపెండ్లికొఱకు ఆలోచన చేయుచున్నాఁడు. మనస్సులో అనుచున్నాఁడు—నూఱురూపాయలు ఖర్చు కావలెను. నామిత్రుఁడు ధనికుఁడుగా నున్నాఁడు. వానియొద్దకుపోయి నూఱు రూపాయలు అడిగినపుడు వాఁడు మహాకృపణుఁడుగా నున్నాఁడు. ఐదు రూపాయలు తీసికొనుము; అనుచున్నాఁడు. దానికి ఏమియుక్తి చేయవలెను; పోయి వానికి రెండువేలురూపాయలు పెండ్లిఖర్చని చెప్పవలెను. అనఁగా నూఱురూపాయలు ఇచ్చుచున్నాఁడు. దానియందు వివాహము చేయవలెను. అని ఈప్రకారముగ మనస్సులో నిశ్చయించి అట్టే వర్తనముచేసి పుత్రుని వివాహము చేయుచున్నాఁడు. అట్లు కరుణాసాగరుఁడైన నాఆచార్యస్వామి మనస్సులో అనుచున్నాఁడు—ఈసోమరిసాధకుఁడు కొంచెముకొంచెము

కాలము చిత్తమును స్థిరము చేయును; అని చెప్పినయెడల కొంచెముకాలము కూడ చేయడు; "సర్వదా" అని చెప్పినయెడల కొంచెముకాలము చేయుచున్నాడు. చాలు. దానిచేతనే యుండు కల్యాణమును పొందుచున్నాడు. ఈకరుణాబుద్ధిచే నాస్వామి "సర్వదా" అని చెప్పుచున్నాడు.

శ్రీయజ్ఞవారాహ గీతాటీకాకారుడు శమదమసమాధానములు మూడింటియొక్కయు పర్యవసానము శ్రవణమునందే చేయుచున్నాడు. శమదమసమాధాన సాధకుడు ఇంద్రియములను, మనోవృత్తియు శ్రవణవ్యతిరిక్త అన్యవిషయములనుంచి త్రిప్పి శ్రవణమునందే నిలుపవలెను; అని వ్రాయుచున్నాడు. వానినడుగవలెను—అయ్యా! ఆసాధకుడు మొదలు సాధనచతుష్టయము సంపాదించి తరువాత శ్రవణమునకు ఆరంభము చేయుచున్నాడా? లేక మొదలు శ్రవణమునకు ఆరంభముచేసి తరువాత సాధనచతుష్టయము సంపాదించుచున్నాడా? మీరు చెప్పినప్రకారమో, మొదలు శ్రవణము నారంభించి తరువాత శమాదిసాధనమునందు చెప్పబడిన అంతఃకరణవృత్తి బాహ్యపదార్థములనుంచి త్రిప్పి తాను పూర్వము ఆరంభించినదే శ్రవణాదికమో, ఆశ్రవణమునందు నిలుపవలయును. వేదశాస్త్రమునందో, సాధనచతుష్టయము మొదలు సంపాదించి తరువాత శ్రవణమునందు ప్రవృత్తము గావలెను?

శ్రీమత్పరమహంస విద్యారణ్యస్వామి అపరోక్షానుభూతియొక్క వ్యాఖ్యయందు ఇట్లనుచున్నారు—

"చిత్తైకాగ్ర్యంతు సంలక్ష్యే సమాధానమితి స్మృతమ్. అ.వ."

తు పునః సంలక్ష్యే "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" ఇత్యాది శ్రుతిలక్ష్యే ప్రత్యగభిన్నే బ్రహ్మణి చిత్తైకాగ్ర్యం తదేకనిష్ఠాసక్త్యర్థః తత్ సమాధానమితి స్మృతమ్.

భావార్థము—సదేవసౌమ్యేత్యాది శ్రుతులయొక్క లక్ష్యార్థమగు ప్రత్యక్కుగు అభిన్నమగు ఏబ్రహ్మమో, దానియందు చిత్తముయొక్క ఏకాగ్రత

చేయవలయును. నాస్వామి ఈ ప్రకారముగ సమాధానముయొక్క లక్షణము చెప్పి కడపట "తదేకజిజ్ఞాసేత్యర్థః" అని చెప్పుచున్నాఁడు. కరుణాసాగరుఁడైన నాస్వామియొక్క సర్వజ్ఞత ఎంతవర్ణించినకూడ తక్కువనే.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఈ ప్రథమసూత్రముయొక్క అర్థప్రకారముగ బ్రహ్మజ్ఞానముయొక్క ఉత్కటేచ్ఛ [తీవ్రతరమైనట్టిఆశ] ఏది గలదో, దానియందు సమాధానసాధకుఁడు చిత్తైకాగ్ర్యము చేయవలయును; ఇది నాస్వామియొక్క అభిప్రాయము.

సమాధానార్థముయొక్క పరీక్షయందు ఇది అచలపక్షముగ నున్నది. ఇది ఎవ్వరిచేతను చలాయమానము కాదు. ఇదేపక్షము సర్వోత్కృష్టముగ నున్నది.

ఈ ప్రకారము నాశక్త్యనుసారముగ సమాధానలక్షణమును చెప్పుచున్నాను. దానిమీఁదఁగూడ ఎవఁడేని దురాగ్రహముచే "ఇట్లుగాదు. శుద్ధబ్రహ్మంబునందే సర్వకాలము చిత్తమును నిలుపుటయే సమాధానము." అనినప్పుడు వానితోడ వాదముచేయుటకు నాకేమియును శక్తిలేదు అయినను కడపట "శుద్ధబ్రహ్మంబునందే సర్వకాలము చిత్తైకాగ్ర్యము చేసినఁగూడ 'ఆ బ్రహ్మము లేక ఈ బ్రహ్మము" అని ఈ ప్రకారముగ తనకన్న వేఱేయని కల్పించి బ్రహ్మంబునందు సమాధానసాధకుఁడు చిత్తైకాగ్ర్యము చేయుచున్నాఁడు; [ఈ ప్రకారముగ చిత్తైకాగ్ర్యము చేసినపుడు అది శుద్ధబ్రహ్మమని సిద్ధమేకాదు. ఎందుకనఁగా— శుద్ధబ్రహ్మమో, అహంబ్రహ్మాస్మివృత్తికి విషయము; అది ఇదంత, తత్త్వవృత్తికి విషయమే కాదు.] గాని నిదిధ్యాసనమందువలె "నేను బ్రహ్మము" అను ప్రకారముగ బ్రహ్మముతో తనకు అభేదమును నిశ్చయించి శుద్ధబ్రహ్మంబునందు చిత్తైకాగ్ర్యము చేయఁడు" అని నేను నా సదాగ్రహమును విడువనే విడువను.

(౮) వైరాగ్యముచేత విషయత్యాగము చేసినను మరల ఎప్పుడేని అప్రయత్నముగ విషయప్రాప్తి అయిన యెడల విచార పూర్వకముగా తిరస్కరించుట ఉపరతి యనఁబడును.[1]

1. వాంతిచేయఁబడిన పదార్థమునందు ఇచ్ఛ గలుగదు; తిరస్కారబుద్ధి గలుగును. అట్లు వైరాగ్యప్రసంగమునందు స్త్రీధనాది సకలవిషయములను దోషరూపమని యెఱిఁగి పరిత్యాగముచేసినను మరల అప్రయత్నముచేత ప్రాప్తమైన విషయముయొక్క తిరస్కారమువలనఁ గలిగినవిషయేచ్ఛయొక్క యభావము ఉపరతి యనఁబడును. ఈయుపరతి పునర్భోగమునందు అదీనతారూపముగా నున్నది. ఇదియే వైరాగ్యమునను ఫలము [సరిపర్యావస్థ] ఏలాగున ననఁగా—పురుషునకు ఇచ్ఛపుట్టినతరువాత అది పూర్ణమగువరకు మనస్సు దీనమగుచున్నది. ఇచ్ఛయొక్క విషయము సంపాదించు ప్రయత్నమునందును మనస్సు దీనమగుచున్నది. వైరాగ్యహీనపురుషునకు విషయమునందు అలంబుద్ధి యుండుటవలన తీవ్రమగు ఇచ్ఛయును, తీవ్రమగు ప్రయత్నమును కలుగుచున్నవి. వానివలన వాఁడు ఎప్పటికిని దీనమనస్కుఁడై యున్నాఁడు. వైరాగ్యశీలపురుషుఁడు విషయమునందు తిరస్కారబుద్ధి చేయుచున్నాఁడు; విషయముకొఱకు ప్రయత్నము చేయఁడు; అందువలన వానిమనస్సు దీనముగాలేదు. అయినను వైరాగ్యపురుషుఁడు ప్రయత్నముచేయక సహజగతి ప్రాప్తవిషయముయొక్క కదాచిత్తుగా సేవనము చేయుచున్నాఁడు. అందువలన విషయము ప్రాప్తమైనతరువాత అది సేవనము చేయుటకొఱకు ఇచ్ఛ జనించుచున్నది; దానివలన కదాచిత్తుగా మనస్సు దీనమగుచున్నది. ఉపరతిపురుషుఁడు సహజప్రాప్త విషయమునందు కూడ తిరస్కారబుద్ధి చేయుచున్నాఁడు: కనుక వానికి ప్రాప్తవిషయము సేవించుటయందు కూడ ఇచ్ఛ జనింపదు. ఈరీతిగ వైరాగ్యవంతునికన్న కూడ ఉపరతివంతుని మనస్సునందు

అదీనకఉత్కృష్టముగ నుండుటవలన ఉపరతి వైరాగ్యముయొక్క ఫలమని ఎఱుఁగవలెను.

"విషయేభ్యః పరావృత్తిః పరమోపరతిర్హి సా."

ఈ అపరోక్షానుభూతివచనముమీఁద దోషదృష్టిచే విషయగ్రహణము యొక్క అనిచ్ఛ అని శ్రీవిద్యారణ్యస్వామి అర్థము చెప్పి కడపట "అథవా సర్వకర్మ సంన్యాసో లభ్యతే" అని సంన్యాసముయొక్క అపేక్ష చూపుచున్నాఁడు. ఇంకకొన్ని వేదాంతగ్రంథములందు కూడ సన్యాసాపేక్ష చెప్పఁబడియున్నది. ఈటిప్పణమునందును ఆరంభమునుంచి ఉపరతిలక్షణము ఏది చెప్పఁబడినదో, అది సంన్యాసమని పేరుమాత్రము పెట్టలేదు; గాని సంన్యాసార్థవాచకమే యున్నది. "సంన్యస్య శ్రవణం కుర్యాత్" అని శ్రుతివచనము కూడ ఉన్నది. ఈసంన్యాసము శిఖాసూత్రాదిత్యాగరూపము కాదు.

"కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయోవిదుః."
"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సంన్యాసీ చ యోగీ చ ననిరగ్నిర్న చాక్రియః."

మొదలగు భగవద్గీతప్రకారముగ గృహస్థునకుకూడ ఈసంన్యాసము సాధింపతగినదిగ నున్నది. [విస్తారముచే సంన్యాసలక్షణము ముందు చెప్పఁబడును; గనుక ఇచ్చట ఎక్కువ వ్రాయలేదు. తాయన్యావస్థ కలవారుగృహస్థాశ్రములయిన నాజిజ్ఞాసువులు సంన్యాసముయొక్క పేరు విని "ఇదివిమిపీడ మధ్యమందు" అని భయపడుచున్నారు; వారియొక్క అభయమునకొఱకు దిగ్దర్శన మాత్రము చేయుచున్నాను.]

హిందుస్థాని మూలగ్రంథమునందు శ్రీనిశ్చలదాసపండితాచార్యుఁడు తనకవితయందు—

"సాధనసహితకర్మసబత్యాగై లఖివిఖసదువిషయనతెంభాగై,
దృగ్నారీలఖిహైగ్లానియగ్లానా యహాలచ్ఛనఉపరామపఛానా."

## (6) శీతోష్ణక్షుత్పిపాసాదులను సహించుట తితిక్ష యనఁబడును.[1]

అని చెప్పుచున్నాఁడు. ఇచ్చట అన్ని విషయములయొక్క తిరస్కారము ఒకసారి చెప్పి మరల స్త్రీతిరస్కారమును చెప్పుచున్నాఁడు. ఇచ్చట పునరుక్తి యున్నది. అందువలన అన్నివిషయములకన్న ఎక్కువ ఇంక నేతే స్త్రీతిరస్కారసంపాదకమగు టిప్పణము వ్రాయవలెనని కదా తత్త్వకథనమ్మగా వచ్చుచున్నది; అయినను అట్లు కాదు. "విషయేభ్యః పరావృత్తిః" అను వచనము అపరోక్షానుభూతియందుండగ వ్యాఖ్యానకారులైన శ్రీస్వామి "శబ్దాది విషయేభ్యః" అని చెప్పుచున్నారు. అట్లు పండితులచేతను వ్రాయబడుటవలన కూడ స్త్రీమొదలగు విషయము మని యున్నది; పునరుక్తి కాదు; గనుక స్త్రీదూషకముగ ఇంకొక టిప్పణము వ్రాయలేదు.

సామాన్యబుద్ధిచే చూచినయెడల వైరాగ్యము, శమము, దమము, ఉపరతి, మఱియు సమాధానము ఈయైదింటియందు అర్థము ఒకటిగ కనఁబడుచున్నది. పరస్పరములందు కొంచెముకొంచెము భేదము వర్తించుచున్నది. వైరాగ్యము, ఉపరతి ఈరెంటియందో, భేదము లేశముగ నున్నది. అట్లు శమము, దమము, సమాధానము ఈమూఁడింటియందును భేదము లేశలేశముగ నున్నది. శాస్త్రకారులబుద్ధి అతిసూక్ష్మముగనుండుటవలన అది సహజము స్పష్టముగ కనఁబడుచున్నది; సామాన్యబుద్ధిగలవానికి కష్టముగ నున్నది.

1. తితిక్షాధర్మముయొక్క విచారము మఱియొక్కమాఱు జల్లెడవలె నుండును. ఎట్లనఁగా—పెద్దవిచిన్నవి కూడిన ముత్యములరాశిలో నవకోటిగాని నవరత్నప్రమాణముగల ముత్యముల చేరికొనుటకు మొదలు వలసినంతటి ప్రమాణముగల ముత్యములను వానికిఁదగినట్టి ఛిద్రములుగల జల్లెడలో గాలించవలయును. అప్పుడు చిన్నవన్నియుం జారిపోవును. మరల కించిదధికఛిద్రముల జల్లెడలో గాలించినఁ దనకువలసినవియే నిలుచును. ఈన్యాయముగానే చూడఁగా— శీతోష్ణక్షుత్పిపాసాదులు సకలప్రాణులకును సంభవించును. ఎప్పుడొకానొకము

## శమాదిషట్కసంపత్తియందు చెప్పఁబడిన సాధనములు

సంప్రాప్తమగునో, అప్పుడు దానిని సకలజీవులు సహింతురు; అందువలన తితిక్షాధర్మము అందరికి సహజముగానే సిద్ధము. మఱియుం నెట్లు ఆహారనిద్రాభయమైథునాది సహజధర్మములు ఎవ్వరిచేతను నేర్పవలసినది లేదో, అట్లు తితిక్షాధర్మమును నేర్పవలసినది లేదు. వేదముచేతనో, తితిక్షాధర్మముయొక్క విధానము చేయఁబడియున్నది; గనుక తితిక్షాధర్మలక్షణము ఇట్లు నిరూపింపవచ్చు—సకలప్రాణులు శీతోష్ణాదితాపములు సంప్రాప్తములైనప్పుడు వలదు వలదనుచు హాహాకారముతో సహింతురు; అట్లు సహించుటను తితిక్ష యనఁగూడదు. మఱియును నెవ్వఁడేని రాక్షసస్వభావముగల మనుష్యుఁడు కావలయునని యనేకప్రకారములుగా తనచేతనే తనశరీరమునకు బాధ జేసికొనును; అదియును తితిక్ష గాదు. అట్లుగాక దైవగతివలన ప్రాప్తమై శీతోష్ణాదితాపములను మనస్సునందు ఖేదముఁబొందక సహించుట తితిక్ష యనవలయును.

శ్రీమత్పరివ్రాజకాచార్యునిచేత వివేకచూడామణియందు తితిక్షాలక్షణము ఇట్లు వ్రాయఁబడియున్నది.—

"సహనం సర్వదుఃఖానాం అప్రతీకారపూర్వకమ్,
చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే."

ఈయభిప్రాయానుసారమే మీఁద వ్రాయఁబడియున్నది. శీతము ఉష్ణము; క్షుధ, తృష మొదలగు రెండురెండు దుఃఖములయొక్క సముదాయరూపద్వంద్వము ఏది గలదో, ఆద్వంద్వదుఃఖముయొక్క సహించుటయే తితిక్ష యనవలయు; జ్వరము, కాసము మొదలగు ఒక్కొక్క దుఃఖముయొక్క సహించుట తితిక్ష కాదు. అని కొందఱు దురాగ్రహము చేయుచున్నారు. విచారవంతునియొద్ద కూడ ఒక్కొక్క అద్భుతమైనట్టి అవిచారము వర్తించుచున్నది; దానియొక్క ఉదాహరణము ఉక్తదురాగ్రహము. ఈదురాగ్రహముయొక్క నిరాకరణము "సహనం సర్వదుఃఖానామ్" ఈ స్వామివచనమునందు సహజముగానే యగుచున్నది.

ఆఱును జేరి యొకటే సాధనము[1] అనఁబడును. ఈరీతిగాఁ జూచి నపుడు సాధనములు తొమ్మిది గావు; నాల్గే యగుచున్నవి. వివేకి జనులు ప్రాచీనకాలమునుండి సాధనములు నాల్గే యనుచున్నారు.

### ౪. ముముక్షుతాలక్షణము

అనర్థనివృత్తి, మఱియు పరమానందప్రాప్తి ఈరెండును గూడి మోక్షస్వరూప మనఁబడును. తదిచ్ఛను ముముక్షుత[2]

---

1. ఎట్లు అద్దమునకు పాటకము మొదలగు పదార్థము పూయనియెడల నేత్రవృత్తి బయటికిఁ బోవునో, మఱియుఁ బూసినయెడలఁ బోదో, అట్లు అంతఃకరణమునుండి యింద్రియవృత్తి బయటికిఁ బోవు ప్రసంగమునందు నింద్రియవృత్తియొక్క నిరోధము చేయనియెడల వృత్తి బయటికి విషయము వరకుఁ బోవును: నిరోధము చేసినయెడలఁ బోదు. ఆయింద్రియవృత్తినిరోధమునకు దమ మని పేరు. ఆదమము లేక మనోవృత్తి నిరోధరూపమగు శమము సిద్ధింపదు. మఱియును కష్టముబిగింపని యవశ్యముగ్యాయముగ శమము లేక దమము సిద్ధింపదు. ఈరీతిగా శమదమములకుఁ బరస్పరాపేక్ష గలదు. అట్లే షట్కసంపత్త్యంతర్గతమైన పూర్వోత్తరమగు రెండురెండు సాధనములకుఁ బరస్పరాపేక్ష గలదు. [ఆవశ్యకత లేదని ఎఱిఁగి పరస్పరాపేక్షయొక్క విస్తారము ఇచ్చటఁ జేయలేదు.] అనేక సువర్ణములును గూడి యొకమాలయగు నట్టుల శమాదిసాధనములు ఆఱును గూడి యొకసాధన మగును; అందువలన దానిని శమాది షట్క మందురు.

2. క్షుధానిమిత్తము అన్నాపేక్షయుం తృష్ణానిమిత్తము జలాపేక్షయుం గలుగు న్యాయమున ముముక్షుత సకల సాధనములకు మొదలై కలుగు చున్నది. ఏలయన ప్రయోజనము లేక మందుఁడైనను ఏ కార్యంబునందు ప్రవర్తింపఁడు అయిన నామముముక్షుత సకలసాధనములకన్న మొదలు మందమై యుండును. మరియును నెంతెంత వివేకాదిసాధనములొక్కొక్కటి సిద్ధించునో

యునవలయును. ఈముముక్షుత తీవ్రమందాదిత్రై భేదముచేత త్రివిధముగ నున్నది.

## 10. సాధనసంఖ్య

వివేకాదులు నాల్గు, శ్రవణ మనన నిదిధ్యాసనము లని

---

అంతంత తీవ్రమగును. అతితీవ్రముముక్షుతయే శ్రవణాదికమునందుఁ ప్రవృత్తింపఁ జేయును.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను నీప్రథమసూత్రముయొక్క యభిప్రాయము జిజ్ఞాస యనగా—బ్రహ్మజ్ఞానమునం దుక్కటేచ్ఛ. ఎట్లు వైద్యశాస్త్రమునందుఁ జెప్పఁబడిన 1. శాకభుక్, 2. మితభుక్, 3. అశాకభుక్ అని ఈప్రకారముగా క్షుధ త్రివిధము. వానిలో—

(1) శాకభుక్కనఁగా—వ్యంజన బాహుళ్యముండియు నొక్కొక్క దానియం దొక్కొక్కదోష మారోపించి యన్నిటినిదాఁకియుఁ దాఁకనట్లు భుజించుట.

(2) మితభుక్కనఁగా—వేళకు మితముగా భుజించుట. [అధికమాపసించిన జీర్ణముగానించే మితాహారము గలిగియుండుట.]

(3) అశాకభుక్కనఁగా—భస్మకరోగమున జఠరాగ్ని అత్యంత ప్రదీప్తమగుటవలన నేమితినుదును నేమితినుదునను నిట్టియిచ్ఛ యెల్లప్పుడును ఉండుట. పక్వాపక్వముల భక్షించియు తత్కాలమున జీర్ణమై యెల్లప్పుడు క్షుధాతురుఁడై యుండుట.

ఈరీతిగా తీవ్రత్వమధ్యత్వమందత్వభేదములచేత త్రివిధమైన క్షుధాన్యాయముగ ముముక్షుతయుఁ ద్రివిధముగా నున్నది. దానిలో నెంతెంత తీవ్రతాధిక్య ముండునో, అంతంత యుత్తమము. అయుత్తమముముక్షుతయే శీఘ్రముగా బ్రహ్మప్రాప్తికి హేతు వగును: మఱియు నితర ముముక్షుతయు శక్త్యనుసారముగ దీర్ఘకాలమున హేతు వగును.

మూఁడు, మఱియు తత్త్వంపదార్థశోధనము [1] ఒకటి యుప స్థియుఁ జేరి జ్ఞానసాధనములు ఎనిమిదిగా నున్నవి. ఇందువలన వానిని వివేకాద్యష్టక మందురు. [2]

---

1 చైతన్యజడములయొక్క. కారణకార్యభావము, అధిష్ఠానాధ్యస్తభావము, ద్రష్టృదృశ్యభావము, మఱియు సాక్షిసాక్ష్యభావముఅను నీప్రకారముగ సంబంధములు శాస్త్రమునందుఁ జెప్పబడినవి. [వ్యాపకమైన శుద్ధచైతన్యమునందయిననో, ఒక అధిష్ఠానాధ్యస్తభావముదక్క వేఱొక్కసంబంధము సంభవింపదు. ఉపాధిస్థచైతన్యమునందు అధిష్ఠానాధ్యస్తభావమును, ద్రష్టృదృశ్యభావమును, సాక్షిసాక్ష్యభావమును ఈమూఁడు సంబంధములు సంభవించుచున్నవి; గాని కారణకార్యభావసంబంధముసంభవింపదు. విశిష్టచైతన్యమునందు కారణకార్యభావసంబంధము సంభవించుచున్నది; గానిఇంకొక్కసంబంధము సంభవింపదు.] వీనిని శాస్త్రోక్తమైన యనేక ప్రక్రియలచేత విచారించి క్షీరనీర విభాగన్యాయమున లేక నవనీతతక్ర విభాగన్యాయమున ఏచైతన్యజడవిభాగము చేయఁబడుచున్నదో, దానిని పదార్థశోధనమందురు.

వేదాంతశాస్త్రోక్త సర్వప్రక్రియలకు ఈయర్థమందే తాత్పర్యము. మఱియు ఈయర్థమే మహావాక్యములయొక్క అర్థబోధమునం దుపయోగించును; కావున ఉక్తపదార్థశోధనమును ముముక్షువు అవశ్యముగా చేయవలయును.

2. యోగవాసిష్ఠము మొదలగు కొన్ని వేదాంతగ్రంథములందు మనోనాశము, వాసనాక్షయము అని ఈరెండుసాధనములు అధికముచెప్పి సాధనసంఖ్య పది యని చెప్పఁబడియున్నది. గాని ఈరెండుసాధనములు జీవన్ముక్తినిమిత్తము చెప్పలేదు ; ఇవి జీవన్ముక్తిసుఖనిమిత్తము చెప్పఁబడియున్నవి. జీవన్ముక్తికొఱకయిననో, ఇచ్చట చెప్పఁబడిన వివేకాద్యష్టకము చాలు.

## 11. అంతరంగబహిరంగసాధనములు[1]

ఈవివేకాద్యష్టకము అంతరంగసాధన మనఁబడును. మఱియు యజ్ఞాదికర్మము బహిరంగసాధన మనఁబడును. ఇందులో జిజ్ఞాసువైనవాఁడు బహిరంగసాధనములను త్యజించి[2] యంతరంగసాధనములను అవలంబింపవలయును.

---

1. ఎట్లు ధనుర్ముక్తబాణము లక్ష్యసమీపము తగిలిన అంతరంగ మందురో, అట్లు జ్ఞానసన్నిధి చేరునట్టి వివేకాద్యష్ట సాధనములు అంతరంగ మనఁబడును. మఱియు ఎట్లు ధనుర్ముక్తబాణము లక్ష్యమునకు దూరముగ తగిలిన బహిరంగమందురో, అట్లు జ్ఞానమునకు దూరమైన యజ్ఞకర్మము మూర్త్యుపాసన ఇవి బహిరంగసాధనమనఁబడును. లేక ధనుర్ముక్తబాణములందు బాణము అంతరంగ మనియు, ధనుస్సు బహిరంగ మనియు తెలియవలెను.

2. మూలగ్రంథమునందు బహిరంగసాధనములను త్యజించి యంతరంగసాధనముల నవలంబింపవలయును; అని ఏది చెప్పఁబడియున్నదో, అది కేవల జిజ్ఞాసువునకే చెప్పఁబడియున్నది; అని తెలియవలెను; సర్వపురుషులకు చెప్పఁబడియున్నది: అని తెలియఁగూడదు. ఎందుకనఁగా—

కూపమునఁబడిన పురుషుఁడు మొదలు వృక్షమూలాశ్రయము నవలంబించును; వెనుక దయాళువైన యొకపురుషుఁడు రజ్జువును విడిచినేని అప్పుడు దానిని పట్టుకొని పూర్వావలంబత్యాగము చేయును; అట్లుగాక రజ్జ్వాశ్రయ మనకుమున్నె పూర్వాశ్రయత్యాగము చేయునేని ఉదయతో భ్రష్టుఁడై కూపమున మునుఁగును. అట్లు జన్మమరణ మను జలముచే నిండిన సంసారమను కూపమునఁబడిన పామరజీవుఁడు స్వర్గాదుల మాహాత్మ్యముచే కర్మోపాసనాది బహిరంగసాధనమునందు ప్రవృత్తుఁడగును; అనంతరము దయాళుఁడైన ఈశ్వరునియొక్క కృపవలన వివేకాదిసాధనముల నాచరించును. ఆపురుషుఁడు వివేకాద్యంతరంగసాధనప్రాప్తియైన పిదప కర్మాదిబహిరంగసాధనము

[గ్రాహ్యమో] అట్లు వివేకాదికమును జిజ్ఞాసువునకు ఉపాదేయము; యజ్ఞాదికము ఎట్లు హేయమో, [త్యాజ్యమో] అట్లు వివేకాదికము హేయము కాదు. అట్లే యజ్ఞాదికాపేక్షచేతను వివేకాదికము అంతరంగముగనున్నది. కావున వివేకాదికము అంతరంగ మనఁబడును.[1] అన్యగ్రంథకారులును దానిని అంతరంగమందురు. ఆవివేకాదిచతుష్టయమే శ్రవణాది చతుష్టయాపేక్ష చేత ఇచ్చట బహిరంగమనఁబడుచున్నది. [శ్రవణాదుల యొక్క అపేక్షచేత వివేకాదులను బహిరంగ మనుటవలన అంతరంగ మనుదానితో విరోధము సంభవింపదు ]

ఈవిధముగ వివేకాదిచతుష్టయంబునకు అపేక్షాభేదముచే అంతరంగ మనియు, బహిరంగ మనియు అనుట ఘటిల్లుచున్నది.

### 13. ముఖ్యమైన యంతరంగసాధనము మహావాక్యము, శ్రవణాదులలక్షణములు

విచారమువలన చూచినట్టియైన జ్ఞానమునకు ముఖ్యమైన అంతరంగసాధనము తత్త్వమస్యాదిమహావాక్యమే యగును. శ్రవణాదికము గాదు. ఏల యనఁగా—

1. వివేకాది చతుస్సాధనరహితుఁడైన బహిర్ముఖపురుషునకు వేదాంతశాస్త్రముయొక్క ఆదరసహితశ్రవణము గాఁజాలదు; అది సాధనసహితునకు గాఁజాలును; ఈరీతిగా శ్రవణమునందు వివేకాదులకుఁ ప్రయోజనము; అట్లు శ్రవణాదిరహితునకు దృఢజ్ఞానము గాచేరదు; శ్రవణాదిసహితునకుఁ గాఁజాలును; ఈరీతిగా జ్ఞానమునందు శ్రవణాదికముయొక్క ఉపయోగము; అందువలన సంపూర్ణవివేకాద్యష్టకముకు అంతరంగ మనవలయును.

## (1) యుక్తివలన వేదాంతవాక్యములయొక్క తాత్పర్యనిశ్చయంబును శ్రవణమందురు.[1]

1. “పర్వతో వహ్నిమాన్ ధూమాత్” ఈస్థానమునందు ధూమమును జూచి పర్వతముమీఁద నగ్నియున్న దని నిశ్చయము అగుచున్నది. [ఈసంగతి ముందు అనుమానప్రమాణవిచారమునందు చెప్పఁబడును.] అందువలన ఆధూమము అగ్నియొక్క లింగ మనుచున్నారు. ఆలాగు వేదాంతములకు సత్తామాత్రమైన అద్వితీయబ్రహ్మమునందే తాత్పర్యము. దానిని నిశ్చయించుటకు షడ్లింగములు గలవు. ఇచ్చట యుక్తిశబ్దముచేత వానికి గ్రహణము. ఆషడ్లింగములు—

(1) ఉపక్రమోపసంహారములయొక్క ఏకరూపత అనఁగా—ప్రకరణారంభమునందు ఏయర్థము చెప్పఁబడినదో, ఆయర్థమే ప్రకరణాంతమునందు చెప్పుట. ఈలక్షణానుసారమే ఉపనిషత్తులందు—

“సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్”, “ఏకమేవాద్వితీయం బ్రహ్మ”

మొదలగు శ్రుతులచే సృష్టికిపూర్వము ఈజగత్తు నామరూపరహితమై సత్తామాత్రమై ద్వితీయరహితమైనట్టి ఒక బ్రహ్మరూపమై యున్నది. అని ఈప్రకారముగ ఆరంభమునందు బ్రహ్మముయొక్క సత్తామాత్రత, అద్వితీయత ప్రతిపాదించి—

“ఐతదాత్మ్యమిదంసర్వంతత్సత్యంసఆత్మా”, “సర్వంఖల్విదంబ్రహ్మ”

మొదలగు శ్రుతులచే ఈప్రతీయమానమైనట్టి సమస్తజగత్తు పూర్వమునందు చెప్పఁబడిన ఆసత్తామాత్రబ్రహ్మరూపమే యున్నది. అదే సత్యము; అని ఈప్రకారముగ అంతమునందు కూడ సత్తామాత్రమైన బ్రహ్మము ప్రతిపాదింపఁబడినది; దీనివలన సత్తామాత్రమై అద్వితీయమైన బ్రహ్మముయొక్క ప్రతిపాదనమునందే ఉపనిషత్తుయొక్క తాత్పర్యము తెలియఁబడుచున్నది; గనుక ఉపక్రమోపసంహారములయొక్క ఏకరూపత వేదాంతవాక్యతాత్పర్యముయొక్క లింగ మని చెప్పఁబడియున్నది. ఇది ప్రథమలింగము.

(2) అభ్యాసము అనఁగా—ఎట్లు ఉపాసకుఁడు "భగవద్దర్శనము కావలెను" అను నీయొక అభిలాష మనస్సునందు దృఢముగా నుంచుకొని అనేక స్తోత్రములను, పూజానమస్కారాదులను, భగవన్నామోచ్చారణమును పలుమాఱు చేయుచున్నాఁడో, అట్లు ఒకేయర్థము వేర్వేఱ అనేక ప్రకారములచే పలుమాఱు చెప్పుట, వినుట. ఈలక్షణానుసారమే ఛాందోగ్యోపనిషత్తునందు శ్వేతకేతువను పుత్త్రునిగుఱించి ఉద్దాలకుఁడను పిత వేర్వేఱ ప్రకారముగ జగత్కర్తయైన ఈశ్వరునియొక్క వర్ణనము జేసి "వాఁడు నీవు" ఈయర్థబోధకమైనట్టి "తత్త్వమసి" అనువాక్యము తొమ్మిదిమాఱులు చెప్పుచున్నాఁడు. ఈవిధముగ అభ్యాసమునందు గూడ సత్తామాత్రమైన అద్వితీయబ్రహ్మమునందు వేదాంతములయొక్క తాత్పర్యముండుటవలన అభ్యాసమును ఒకలింగమని చెప్పఁబడియున్నది. ఇది ద్వితీయలింగము.

(3) అపూర్వత యనఁగా సామాన్యతః సకలపదార్థముల వ్యవస్థయొక్క సామాన్యపద్ధతి ఏది గలదో, ఆపద్ధతిగాక వ్యవస్థయందు ఏయొక్క విశేషపద్ధతి ఎక్కడ కనఁబడుచున్నదో, అక్కడ అపూర్వత అనుచున్నారు. అప్రసిద్ధార్థమును అపూర్వ మందురు; ఈరీతిగా అపూర్వత, ఆశ్చర్యకారకత, అద్భుతత ఈమూఁడుశబ్దములందు అభిప్రాయము ఒకటిగ నున్నది. ఈలక్షణానుసారముగ అపూర్వత లక్షణమునందు బ్రహ్మాభిన్నసకలపదార్థములకన్న విశేషత ఉపనిషత్తులందు చెప్పఁబడియున్నది—

"అత్ర వానకిలసత్సోమ్యనసిభాలస"

బ్రహ్మాభిన్నములైన సకలపదార్థములందు కొన్నిపదార్థములయొక్క జ్ఞానము రెండుప్రమాణములచే కొన్నిటియొక్క జ్ఞానము అనేకప్రమాణములచే నగుచున్నది. [ప్రత్యక్షానుమానాది ప్రమాణములు ఆఱు ఉన్నవి; వాని సంగతి ముందు చెప్పఁబడును.] సత్తామాత్రమైన అద్వితీయబ్రహ్మము అట్లు కాదు; దానియొక్క జ్ఞానము ఒక ఉపనిషద్రూపశబ్దప్రమాణము దప్ప వేఱే

ష్టప్రమాణముచేతను ఘటిల్లదు; [బ్రహ్మజ్ఞానమును గుఱించి శబ్దప్రమాణము ముఖ్యము, మనస్సు సహకారి; మఱియు మనస్సు ముఖ్యప్రమాణము, శబ్దము సహకారి; అని ఈప్రకారముగ వేదాంతశాస్త్రమునందు రెండుపక్షములు చెప్పఁబడినను ప్రథమపక్షమునను సరించి ఇచ్చట వ్రాయఁబడియున్నది.] ఈప్రకారముగ సకలపదార్థములకన్న విశేషతారూపమయిన అపూర్వత బ్రహ్మంబునందు వర్తించుచున్నది.

ఇదిగాక బ్రహ్మభిన్నములైన సకలలౌకికపదార్థములు అప్రకాశరూపములుగ నున్నవి; ఆయప్రకాశపదార్థములందును అంతఃకరణము, అవిద్య మొదలగు కొన్నిపదార్థములు పరప్రకాశములుగ నున్నవి; అయినను ఆయప్రకాశపదార్థంబులందును, పరప్రకాశ పదార్థంబులందును బ్రహ్మంబువంటి స్వయంప్రకాశపదార్థము ఒకటికూడ లేదు; ఈప్రకారముగ బ్రహ్మంబునందు అలౌకికతారూపమైన అపూర్వత వర్తించుచున్నది.

ఈవిధముగ అపూర్వతచేతఁ గూడ సత్తామాత్రాద్వితీయబ్రహ్మమునందు వేదాంతవాక్యముయొక్క తాత్పర్యము తెలియుటవలన అపూర్వత ఒకలింగ మని చెప్పఁబడియున్నది. ఇది తృతీయలింగము.

(4) ఫల మనఁగా—ఉపయోగము, ప్రయోజనము. ఈలక్షణానుసారమే ఉపనిషత్తులందు జ్ఞానమునకు మోక్షము ఫలమని చెప్పఁబడియున్నది.

“తస్య తావదేవ యావన్న విమోక్ష్యేథ సంపత్స్యే”

మొదలగు వాక్యములచే అద్వైతబ్రహ్మజ్ఞానమునకు ముక్తిరూపఫలము చెప్పఁబడియున్నది. ఈవిధముగ ఫలవర్ణనమునందుఁగూడ వేదాంతవాక్యముయొక్క తాత్పర్యము సత్తామాత్రాద్వితీయబ్రహ్మంబునందుండుటవలన ఫలము ఒకలింగ మని చెప్పఁబడియున్నది. ఇది చతుర్థలింగము.

(5) అర్థవాదము అనఁగా—ఏభాషణమునకు స్వార్థముమీఁద తాత్పర్యము లేదో, వేఱొక్క యర్థముమీఁద తాత్పర్యమున్నదో, అట్టిభాషణము.

ఎట్లనఁగా ఒకతల్లి తనపుత్త్రునితో అనుచున్నది- గోపాలుఁడు ఎంత ఉత్తముఁడు! ప్రాతఃకాలమున లేచి విద్యాలయమునకు పోవుచున్నాఁడు; తనపాఠము చక్కఁగా చదువుచున్నాఁడు; ఎవ్వరితోడను కలహము చేయఁడు; నీవు వేళకుసరిగా విద్యాలయమునకు పోవు; విద్యాభ్యాసమును చేయవు; చూడుము- ఈభాషణమునందు గోపాలుని స్తుతియును, తనపుత్త్రుని నిందయును స్పష్టముగ కనఁబడుచున్నది; అయినను గోపాలునిస్తుతిమీఁద తల్లిభాషణమునకు తాత్పర్యములేదు. తనపుత్త్రుని నిందమీఁదను తాత్పర్యములేదు. తల్లిభాషణముయొక్క తాత్పర్యము తనపుత్త్రుఁడు మంచివిద్యాభ్యాసము చేయవలయు ననుదానిమీఁద నున్నది. ఈలక్షణానుసారముగ ఉపనిషత్తులందు—

"యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్"

ఏవస్తువు వినుటవలన వినఁబడని వస్తువు వినఁబడుచున్నదో, ఏవస్తువుయొక్క మననమువలన మననము చేయఁబడని వస్తువుయొక్క మననమగుచున్నదో, యేవస్తువు తెలియుటవలన తెలియఁబడని వస్తువు తెలియఁబడుచున్నదో, ఇత్యాద్యర్థవాచకమైన శ్రుతివాక్యములచేత సత్తామాత్రాద్వితీయమైన బ్రహ్మమునందు వేదాంతవాక్యముయొక్క తాత్పర్యముండుటవలన అర్థవాదము ఒకలింగ మని చెప్పఁబడియున్నది. ఇది పంచమలింగము.

(6) ఉపపత్తి యనఁగా—ఉపపన్నత సిద్ధమగుటకొఱకు అనుకూల దృష్టాంతపూర్వకముగా ఉపపన్నపదార్థముయొక్క కథనము. ఈలక్షణానుసారముగ ఉపనిషత్తులందు—

"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"

మొదలగు శ్రుతులచే మృద్వికారమునకు ఘటమని పేరుపెట్టుట వాక్కుయొక్క ప్రలాపముగ నున్నది. మృత్తికాజ్ఞానముచే బాధితమగుటవలన అధ్యాసవికారరూపమైన ఘటము మిథ్యగా నున్నది. మఱియు వివర్తోపాదానకారణమైనట్టి మృత్తిక అబాధిత మగుటవలన సత్యముగ నున్నది.

(2) జీవబ్రహ్మల అభేదమునకు సాధకములైన, భేదమునకు బాధకములైన, యుక్తులచేత అద్వితీయబ్రహ్మచింతనంబును మనన మందురు.[1]

---

అట్లు నామరూపాత్మక జగత్తును అధ్యాసవికారరూపమగుటవలనను బ్రహ్మజ్ఞానముచే బాధితమగుటవలనను అది వాచారంభణమాత్రమై మిథ్యగా నున్నది. మఱియు వివర్తోపాదానకారణరూపమైన బ్రహ్మము త్రికాలాబాధితమగుటవలన సత్యముగ నున్నది. ఈప్రకారముగ అనుకూలదృష్టాంతములచే సత్తామాత్రాద్వితీయబ్రహ్మంబునందు వేదాంతవాక్యములయొక్క తాత్పర్యము తెలియుటవలన ఉపపత్తియు ఒకలింగ మని చెప్పఁబడియున్నది. ఇది యాఱవ లింగము.

ఈషడ్లింగములచేత సత్తామాత్రమగు నద్వితీయ బ్రహ్మంబునందు వేదాంత వాక్యములకు తాత్పర్యనిశ్చయము ఏది యగునో, దానిని శ్రవణ మందురు. మఱియు వేదాంతశాస్త్రాభ్యాసము దీనికి సాధనమగుటవలన దానిని కూడ శ్రవణ మందురు. వానియందు యుక్తిసహితముగ తాత్పర్యనిశ్చయము శ్రవణశబ్దమునకు ముఖ్యార్థము. అట్లుగాక కేవల వేదాంతశాస్త్రము చదువుట, లేక వినుట శ్రవణశబ్దమునకు గౌణార్థ మని ఎఱుఁగవలెను.

1. మననముయొక్క విశేషవిచారము—

జీవబ్రహ్మలయొక్క యభేదమునకు సాధకమైన యుక్తులు—

(1) జీవుఁడు బ్రహ్మముకన్న అభిన్నుఁడు. సచ్చిదానందుఁ డగుటవలన. ఈశ్వరచైతన్యన్యాయమున ఎవ్వఁడు సచ్చిదానందుఁడు గాఁడో వాఁడు బ్రహ్మముకన్న అభిన్నుఁడు గాఁడు. మ ఱేమనఁగా—భిన్నుఁడు. ఎట్లనఁగా ఘటము. [ఘటము సచ్చిదానందముకాదు. అది బ్రహ్మముకన్న భిన్నము.] ఏదువలన జీవుఁడు ఘటమువలె అసదాదిరూపుఁడు గాఁడో, అందువలన బ్రహ్మముకన్న భిన్నుఁడు గాఁడు. మ ఱేమనఁగా—అభిన్నుఁడు. ఇచ్చట

(3) అనాత్మాకారవృత్తియొక్క పరిత్యాగము చేసి ప్రత్యగ్జీవుఁడు పక్షము. జీవబ్రహ్మాభేదము సాధ్యము. సచ్చిదానందత హేతువు. ఈశ్వరచైతన్యమును, ఘటమును ఉదాహరణము. [పక్షము, సాధ్యము, హేతువు, ఉదాహరణము-ఇవి అనుమానప్రమాణముయొక్క అవయవములు. వీని విశదార్థము ముందు తెలియఁగలదు.] ఇవి మొదలయిన యనుమానప్రమాణయుక్తులు గలవు.

అభిప్రాయము—బ్రహ్మము సచ్చిదానందము; ఈశ్వరుఁడును సచ్చిదానందుఁడు; అందువలన బ్రహ్మములో ఈశ్వరుఁడు అభిన్నుఁడు. మఱియు ఘటము అసద్రూపము [సత్తాహీనము] అచిద్రూపము [జడము] దుఃఖరూపము అందువలన బ్రహ్మముతో ఘటము భిన్నము. ఈసంగతి వ్యవహారమునందు ప్రసిద్ధముగ నున్నది. జీవుఁడో, ఘటమువలె అసదాది లక్షణవంతుఁడు కాఁడు; ఈశ్వరునివలె సచ్చిదానందుఁడుగా నున్నాఁడు; అందువలన వాఁడును ఈశ్వరునివలె బ్రహ్మముతో అభిన్నుఁడే అయి యుండవలెను; అని అనుమానప్రమాణముచేత సిద్ధమగుచున్నది.

(2) ఎట్లు ఘటమఠోపాధులను విడుచుటచే ఘటాకాశమఠాకాశముల యొక్క యభేదము గలదో, అట్లు బుద్ధిమాయోపాధులను విడుచుటచే జీవబ్రహ్మల కభేదము గలదు. మఱియు ఘటాకాశము, జలాకాశము, మేఘాకాశము, మహాకాశము ఈనాలుగు ఆకాశము లందురు; వానిలో జలాకాశమేఘాకాశములకుఁ బరస్పరాభేదము లేకున్నను ఘటాకాశమహాకాశములకు అభేద మగును; భేదమనుట నామమాత్రమే. అట్లు కూటస్థుఁడు, జీవుఁడు, ఈశ్వరుఁడు, బ్రహ్మము ఈనాలుగుచైతన్యము లందురు; వానిలో జీవునకు, ఈశ్వరునకు పరస్పరభేదము లేకున్నను వీనికి యధిష్ఠానమై లక్ష్యార్థమగు కూటస్థునకు, బ్రహ్మకు అభేదమే యగును; భేదమనుట నామమాత్రమే. ఇత్యాది దృష్టాంతరూపమైన యనుమానప్రమాణయుక్తులు గలవు.

ధ్యానరహితముగా బ్రహ్మాకారవృత్తియొక్క స్థితిని నిదిధ్యాసన

(3) "నేహ నానాస్తి కించన" ఇత్యాది శ్రుతులందు భేదనిషేధము చెప్పఁబడియున్నది, ఆనిషేధము వాస్తవమయిన యభేదముండినచో సంభవించును; లేనియెడల సంభవింపదు; అందువలన భేదనిషేధానుపపత్తియొక్క జ్ఞానరూపమగు అర్థాపత్తి ప్రమాణమున జీవబ్రహ్మలయొక్క యభేదము సిద్ధించుచున్నది. ఇత్యాది అర్థాపత్తిప్రమాణ యుక్తులు గలవు.

ఇవన్నియు అభేదసాధకయుక్తులు.

జీవబ్రహ్మలయొక్క భేదమునకు బాధకమయిన యుక్తులు—

(1) జీవబ్రహ్మల భేదము మిథ్య. ఔపాధికమగుటవలన. ఘటాకాశ మహాకాశముల భేదన్యాయమున. ఏది మిథ్య గాదో, అది ఔపాధికమును గాదు; ఎట్లు ఘటపటములకు ఏభేదము గలదో, [వ్యావహారదశయందే భేదము గనఁబడుచున్నదో] అది ఔపాధికము గామివలన మిథ్యగాదు. [వ్యావహారిక సత్యము] ఎందువలన నాజీవబ్రహ్మల భేదము ఇట్లు గాదో, [నిరుపాధికము గాదో, యనఁగా ఔపాధికమో] అందువలన మిథ్య గాదని యనఁగూడదు; అది మిథ్యయే. ఇచ్చట భేదము పక్షము. మిథ్యాత్వము సాధ్యము. ఔపాధికత హేతువు. ఆకాశద్వయభేదమును, ఘటపటములభేదమును ఉదాహరణము. ఇత్యాది అనుమానప్రమాణయుక్తులు గలవు.

అభిప్రాయము—ఘటపటాది పదార్థములు నిరుపాధికములుగ నున్నవి. వానియొక్క పరస్పర భేదమును వ్యావహారికసత్యమందురు. ఘటాకాశమునకు ఉపాధి ఘటమున్నది; అందువలన ఘటాకాశమహాకాశముల భేదము ఘటపట భేదమువలె సత్యము కాదు; అది మిథ్యగా నున్నది. అట్లు జీవునకు ఉపాధి అంతఃకరణ మున్నది; అందువలన వానియొక్క బ్రహ్మముతో భేదము ఏది గలదో, అది ఘటపటభేదమువలె సత్యము కాదు; ఘటాకాశమహాకాశ భేదము వలె మిథ్యగా నున్నది; అని అనుమానప్రమాణముచేత సిద్ధమగుచున్నది.

ముందురు. నిదిధ్యాసనముయొక్క పరిపాకావస్థనే సమాధి

---

(1) ఎట్లు బింబప్రతిబింబముల భేదము మిథ్యయో, అట్లు జీవబ్రహ్మల భేదము మిథ్య. మఱియు నెట్లు అనేక ఘటాకాశముల పరస్పరభేదము మిథ్యయో; అట్లు అనేక జీవుల పరస్పరభేదము మిథ్య. మఱియు నెట్లు స్వప్న జీవులకు స్వప్నఘటాదులకు భేదము మిథ్యయో, అట్లు జీవునకు జడమునకు భేదము మిథ్య. మఱియు నెట్లు రజ్జువునకు కల్పితసర్పమునకు భేదము మిథ్యయో, లేక సాక్షిచైతన్య స్వప్నప్రపంచభేదము మిథ్యయో, అట్లు జడమగు జగత్తునకు చైతన్యమగు ఈశ్వరునకు భేదము మిథ్య. మఱియు నెట్లు రజ్జువునందు కల్పితమైన సర్పదండాదుల పరస్పరభేదము మిథ్యయో, లేక స్వప్నపదార్థముల పరస్పరభేదము మిథ్యయో, అట్లు జడపదార్థముల పరస్పరభేదము మిథ్య. ఇత్యాది ఉపమానప్రమాణయుక్తులు గలవు.

(3) మహావాక్యములందుఁ జెప్పఁబడిన జీవబ్రహ్మల కభేదమేది గలదో, అది ప్రతీయమానభేదముయొక్క మిథ్యాత్వము లేక ఘటిల్లదు; కావున జీవబ్రహ్మల భేదము మిథ్య యను కల్పన గలుగుచున్నది. ఇత్యాది అర్థాపత్తి ప్రమాణయుక్తులు గలవు.

(4) ఎట్లు జాగ్రత్స్వప్నములందు భేదబోధకమయిన యుపాధి యుండుటవలన జీవబ్రహ్మల భేదము తోఁచునో, అదే సుషుప్తియందు ఆ యుపాధి లేమివలన భేదము తోఁపదు; అందువలన జీవబ్రహ్మలకు పారమార్థిక భేదము లే దని నిశ్చితమగుచున్నది. ఇత్యాది అనుపలబ్ధి ప్రమాణయుక్తులు గలవు.

ఈస్థానమునందు విచారము చేయవలసినది. అ దేమనఁగా—జాగ్రత్స్వప్నసుషుప్తులందు స్థూలసూక్ష్మకారణశరీరము లున్నవి; అవే ఉపాధులా? కావు. [ఇవి కూడ ఉపాధులే అయినను ఇచ్చట ఈ ఉపాధులను గుఱించి చెప్పలేదు.] ఇచ్చట భేదబోధకోపాధి యని చెప్పఁబడియున్నది, భేదబోధ

యందురు. ఇందువలన సమాధి నిదిధ్యాసనమునందు అంతర్భూతముగా నున్నది; అది పృథక్సాధనముగాదు. 1

---

కళ యయినను, జాగ్రత్తలో బుద్ధియందు లేక కేవలావిద్యయందు స్వప్నములో నిద్రాదోషసహితావిద్యయందు ఉన్నది. ఇంక ఏదొక్క ఉపాధి యందుండదు. సుషుప్తియందయినను, ఉపాధి కారణావిద్య యున్నది; గాని దానియందు భేదబోధక యోగ్యత లేదు. ఒకానొకఁ డనుచున్నాఁడు— సుషుప్తియందు ఉపాధియే లేదు. వాని నడుగవలయును— అయ్యా! నీమత ప్రకారముగ సుషుప్తియందు ఉపాధియే లేదు; కావున సుషుప్తి అనఁగా నిరుపాధికబ్రహ్మమే; మంచిది; ఇపుడు ఆసుషుప్తి రూపబ్రహ్మముయొక్క అనుభవమయినతరువాత శ్రవణమననాది సాధనము చేయవలెనా? వద్దా? సుషుప్తి బ్రహ్మానుభవముచేతనే కృతార్థుఁడగునా? సారాంశము—సుషుప్తి యందు ఉపాధి యున్నది; గాని దానియందు భేదబోధకత లేదు.

ఇవన్నియు భేదబాధకయుక్తులు.

1, నిదిధ్యాసనముయొక్క విశేషవిచారము—

సాక్షాత్కారమునందు అనాత్మాకారవృత్తి పరిత్యాగపూర్వకముగ అంతరాయరహితమయిన బ్రహ్మాకారవృత్తియొక్క స్థితి నమ్రశాఖాన్యాయమున అప్రయత్నముగానే యగును; మఱియు నిదిధ్యాసనవంతునకు ఆస్థితి చేయిపట్టి యాకర్షించి వంచినశాఖవలె ప్రయత్నమువలన నగును. ఆకర్షణ ప్రయత్నపరిత్యాగము చేసినయెడల శాఖ సరళమేసరళము. అట్లు నిదిధ్యాసనవంతునకు ప్రయత్నత్యాగము చేసిన ఉక్తస్థితి యుండదు. పూర్వవత్తుగా బహిర్ముఖవృత్తియే యగును. [కుక్కతోఁక వంకరను జూచి ఒకఁడు అది సరళ మగుటకొఱకు ప్రయత్నము చేయుచున్నాఁడు—ఒక గొట్టము తెచ్చి దానియందు ఆతోఁక గట్టిగా దూర్చి పదిరెండుసంవత్సరములు అట్లే యుంచుచున్నాఁడు; తరువాత గొట్టముతీసి చూచుచున్నాఁడు; అనఁగా ఏమి వంక

ఈశ్రవణాదిత్రయము జ్ఞానమునకు సాక్షాత్సాధనము.

నమేవంకర.] మఱియును సాక్షాత్కారవంతునకు వ్యవహారకాలమునందు ఆస్థితియొక్క యభావమువలన పశ్చాత్తాపము గాఁజాలును అట్లు నిది ధ్యాసనవంతునకుఁ గాఁజాలదు.[నిధిధ్యాసనాంతమునందు బ్రహ్మావరణభంగమై నిరావరణబ్రహ్మము ప్రకటమగుచున్నది; అదే సాక్షాత్కారము, ఈలాగు సాక్షాత్కారవంతుఁడు అద్భుతమైనట్టి నిరావరణబ్రహ్మానందమును పొందు చున్నాఁడు; అందువలన వ్యవహారకాలమునందు ఆయానందమును స్మరించి ఎందుకు ఈసమాస్రావధిదుఃఖరూపమగు వ్యవహారమునందు వచ్చుచున్నాము; అని వానికి పశ్చాత్తాపము అగుచున్నది].

"యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి.
సుఖమాత్యంతికం యత్తద్ బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః.
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే." -భ.గీ.

[శ్రీభగవంతుఁడు అర్జునునిగుఱించి సాక్షాత్కారవంతుని లక్షణము చెప్పుచున్నాఁడు.]

భావార్థము—యోగమార్గముచేత నిరుద్ధమయినట్టి చిత్తము ఎచ్చట విశ్రాంతమగుచున్నదో, జ్ఞానానందరూపుఁడైన యాత్మను జూచి ఎచ్చట సాధకుఁడు [ఇపుడే జీవన్ముక్తి పొందినవాఁడు విద్వాంసుఁడు] హర్షనిర్భరుఁ డగుచున్నాఁడో, అచ్చట సుఖము అత్యంతముగ నున్నది. ఆసుఖము ఎట్లున్నది అనఁగా అది ఇంద్రియములకు గోచరముకాఁతగినది కాదు; అది సామాన్య బుద్ధికి గోచరము కాఁతగినది కాదు; అది శ్రవణాదిసాధనములచే పరిశుద్ధమై విక్షేపరహితమైన విశేషబుద్ధికే గోచరము కాఁతగినదిగా నున్నది. ఎప్పుడు

గాదు. అయినను బుద్ధిదోషములైన అసంభావనావిపరీతభావన

---

అసుఖమును ఎఱుగుచున్నాఁడో, అప్పుడు వాఁడు అసుఖమునుండి చలనము పొందఁడు. ఆయాత్మసుఖము ప్రాప్తమైన వెనుక ఆ యాత్మ సుఖముకన్న అధికమని యేదొక్క లాభమును తలంపఁడు; ఆయాత్మసుఖమునందుండఁగ ఎంత పెద్దదుఃఖము ప్రాప్తమైనను అసుఖస్థానమునుండి చలనము పొందఁడు. [వృశ్చికదంశముగాని అగ్నిస్పర్శముగాని శస్త్రాఘాతముగాని లేక వీనికన్న పెద్ద ఒకదుఃఖముగాని లేక ప్రపంచమునందు ఎన్నిదుఃఖములున్నవో, ఆయన్ని దుఃఖములయొక్క సమష్టిరూపమైనట్టి ఒక మహాదుఃఖముగాని ప్రాప్తమయినను ధీరుఁడైన సాక్షాత్కారవంతుఁడు ఒకసారి ప్రాప్తమైన ఆయాత్మానందస్థానమును విడఁడు.]

[శ్రీజ్ఞానేశ్వరుఁడను మహానుభావుఁడు మహారాష్ట్రభాషయందు సాక్షాత్కారవంతుని లక్షణము చెప్పుచున్నాఁడు.]

“జై సేరోడకేంధోర పావే సుఖాశీక బిఢాక,
మగటాకీ లేంచిశరీర ఉఠోం నేది.”

భావార్థము—రోగములచే అత్యంతదుర్బలమైన ఆవు ఆయాసముగా తిరుగుచుతిరుగుచు ఒక విశ్రాంతిస్థానమును జూచి ఆస్థానమునందు ఒకసారి పడుచున్నది. తరువాత ఆయావును కావలసినంత తిట్టుము కొట్టుము; ఆస్థానమునుంచి లేచుచున్నదా ఏమి? లేవదు. అట్లు త్రివిధతాపముచే తప్తుఁడైన జిజ్ఞాసువు జన్మమరణరూపభవారణ్యమునందు తిరుగుచుతిరుగుచు ఆత్మరూపసుఖస్థానమునందు ఒకసారి పడినపుడు ఎంతదుఃఖము ప్రాప్తమైనను ఆస్థానము విడఁడు.

ఈభగవద్భక్తిప్రకారముగ విద్వద్భక్తిప్రకారముగ, నిదిధ్యాసనవంతునకు ఇదివరకు ఆత్మానందము ప్రాప్తమే లేదు; వానికి ఎందుకు పశ్చాత్తాపమగును ! ఇది ఇరువురకు పరస్పరభేదము. [భేదము, అసత్యభాషణము, తస్క

కు నాశకముగా నున్నది. [సంశయమును అసంభావన, విపర్య
యమును విపరీతభావన యందురు.]

---

ఁడు, ఈముగ్గురు స్వఘాతభయముచే బహుశముగ ఏకాకిగా ఉండరు; పరి
వారసహితముగానే ఉందురు.]

హిందుస్థాని మూలగ్రంథమునందు పైనచెప్పిన ప్రకారముగ ఇది
ఇరువురియందు భేదము ; ఈఅర్థముయొక్క వాచకమగు వాక్యము ప్రాయఁ
బడియున్నది ; ఇదియొక భాషణమునందలి ప్రౌఢతగానున్నది. ఎట్లనఁగా—

ఒకానొకఁ డనుచున్నాఁడు—నేను నేఁడె రాజును, యువరాజును
ఒకేచోట చూచుచున్నాను. వస్త్రాలంకారాదికమును, ఐశ్వర్యమును ఇద్దఱికి
సమానముగానే యున్నవి. రాజుమాత్రము కొంచెము పెద్దవాఁడుగ కనఁబడు
చున్నాఁడు ; పుత్త్రుఁడు కొంచెము చిన్నవాఁడుగ కనఁబడుచున్నాఁడు.
ఈస్థానమునందు చూడుము—చెప్పువాని భాషణముమీఁద భేదము స్వల్పము
గానే కనఁబడుచున్నది ; అయినను విచారపూర్వకముగ చూచినయెడల రాజు
అన్నిప్రకారములను స్వతంత్త్రుఁడు ; రాజపుత్త్రుఁడు అన్నిప్రకారములను
పరతంత్త్రుఁడు ; ఇదియొక పెద్దభేదమున్నది. ఇంక చిన్న చిన్న భేదములును
అనేకము లున్నవి.

అట్లు సాక్షాత్కార నిదిధ్యాసనవంతులిరువురియందు సాక్షాత్కార
వంతునకు బ్రహ్మాకారవృత్తియొక్క స్థితి ఏది గలదో, అస్థితి నిదిధ్యాసనవంతు
నకు ప్రాప్తమే లేదు. బాహ్యాంతరసకలవ్యాపారమును వదలి వానియొక్క
వృత్తి అంతర్ముఖమయినను ఎదివరకు సాక్షాత్కారము లేదో, అదివరకు
ఆవృత్తి బ్రహ్మభావనారూపముగ నుండును; గాని బ్రహ్మాకారము కాదు; ఇది
యొక పెద్దభేదముండనే యున్నది. సాక్షాత్కారవంతుఁడు ముక్తుఁడు; గనుక
ఈశరీరము వదలిన మరల జన్మమునకు రాఁడు; నిదిధ్యాసనవంతుఁడు బద్ధుఁడు;
గనుక వచ్చును ; ఇదియొక పెద్దభేద ముండనేయున్నది. ఈరెండు పెద్దపెద్ద
భేదముల మధ్యమున ఇంక చిన్నచిన్న భేదములు అనేకము లున్నవి. అందు

## 14. శ్రవణాదులు పరంపరగా జ్ఞానహేతువులు

శ్రవణమువలన ప్రమాణాసంభావన, మననమువలన

వలన మూలగ్రంథమున ఒక భేద మని ఏది చెప్పఁబడినదో, దానియొక్క అర్థము ఏకభేదోపలక్షితములైన అనేకభేదము లని చేయవలయును. అట్లు ఈ గ్రంథమునందుఁగాని ఇంక వేదాంతగ్రంథమునందుఁగాని నిదిధ్యాసనవంతునకు బ్రహ్మాకారవృత్తి ఏది చెప్పఁబడినదో, అది ఔపచారిక మని ఎఱుఁగవలెను.

త్రిపుటీభావ సహితమైన సవికల్పసమాధియే నిదిధ్యాసనము; దాని యొక్క పరిపక్వావస్థను సమాధి యందురు; అందువలన నిచ్చట సమాధి శబ్దముచేత త్రిపుటీభావ రహితమైన నిర్వికల్పసమాధి యని యెఱుఁగవలెను? ఈనిర్వికల్పసమాధి బాహ్యమనియు, ఆంతరమనియు ద్వివిధము—మూర్త్యాది బాహ్యావలంబనముయొక్క చింతనమువలన నేది యగునో, అది బాహ్యము. మఱియు సర్వాంతర్గతమైన అద్వైతబ్రహ్మముయొక్క చింతనమువలన నేది యగునో, అది ఆంతరము. ఆయాంతరనిర్వికల్పసమాధియు అసాక్షాత్కార సాక్షాత్కారభేదమువలన ద్వివిధము. వానిలో—

(1) విచారపూర్వకముగా నద్వైతబ్రహ్మచింతనముద్వారమున ఏకత్వ నిశ్చయసహితముగ నున్నను పరోక్షభావసహితము ఏదిగలదో, అది యసాక్షాత్కారరూపము.

(2) గురుముఖమున ప్రాప్తమైన అర్థసహిత మయిన మహావాక్యము యొక్క శ్రవణమననాది విచారపూర్వకముగా బ్రహ్మాత్మైక్యరూపాపరోక్ష జ్ఞానము ఏదిగలదో, అది సాక్షాత్కారరూపము. [కొందఱు అపరోక్షభావనా సహితమైన సమాధిని సాక్షాత్కారరూపాంతరనిర్వికల్పసమాధి యందురు. ఈసంగతి వేదమునకును, యుక్తికిని, జీవన్ముక్తునియొక్క అనుభవమునకును విరుద్ధముగ నున్నది. చూడుము—ఎదివరకు బ్రహ్మముయొక్క యపరోక్ష జ్ఞానము కలుగదో, అదివరకు బ్రహ్మభావన చేయుట యావశ్యకముగ నున్నది.

ప్రమేయాసంభావన, మఱియు | నిదిధ్యాసనమువలన విపరీత

బ్రహ్మాపరోక్షజ్ఞాన సమయమునందు బ్రహ్మభావన అక్కరలేదు; ఆ ప్రసంగము నందు భావనకు అవకాశమును లేదు. ఇంక చూడుము—అపరోక్షజ్ఞానమునకే సాక్షాత్కారమని పేరు; అసాక్షాత్కారరూపమయిన సమాధియందు భావన యొక్క పేరుకూడ సంభవింపదు.]

వీనిలో అసాక్షాత్కారరూప నిర్వికల్పసమాధి కూడ సాక్షాత్కార రూపసమాధికి సాధనమగుటవలన దానికి నిదిధ్యాసనమునందు అంతర్భావము గలదు; అదిగూడ పృథక్సాధనము కాదు; అప్పుడు సవికల్పసమాధి వేఱసాధన మెట్లగును? కానే కాదు.

ఈవిధముగా నొక సాక్షాత్కారరూపమైన సమాధిదప్ప ఇతరములైన సకలసమాధులకును నిదిధ్యాసనమందు అంతర్భావమగుటవలన ఆయితరసమాధులు పరంపరాక్రమముగ సాక్షాత్కార సమాధియొక్క సాధనము లని సిద్ధమగుచున్నది; అట్టిది ఆసమాధి ఎంతసమర్థ ముండవలెను; ఈ ప్రకారముగ జిజ్ఞాసువులు ఆశ్చర్యము పొందుచున్నారు; వారు ఎఱుగుటకొఱకు ఆసాక్షాత్కారరూపమైన నిర్వికల్పసమాధియొక్క మాహాత్మ్యము కొంచెము వర్ణించుచున్నాడు—

సాక్షాత్కారరూపమైన నిర్వికల్పసమాధి ఏది గలదో, దానియందు ఎట్లు ఒకసారి అంతఃకరణముయొక్క బహిర్ముఖవృత్తిచే ఘటావరణభంగమైన వెనుక ఘటావరణభంగముకొఱకు మరల ఆవృత్తియొక్క ప్రయోజనము లేదో, అట్లు శ్రవణాదిసాధనసంపన్నమైన అంతఃకరణముయొక్క అహం బ్రహ్మాస్మి యను నీ చరమవృత్తివలన [వెదురునకు లేక కదళికి ఫలమయినతరువాత మరల ఫలము పుట్టదు. ఫలము పక్వమవుట అవృక్షములయొక్క నాశమే యగు చున్నది. అలాటి వివృత్తిచే బ్రహ్మావరణభంగమై సాక్షాత్కారమగుచున్నదో ఆవృత్తిని చరమవృత్తి లేక అంత్యవృత్తి యనుచున్నారు. సుజ్ఞజనులు

అవృత్తికి భవ ద్ధిసీమ అనుచున్నాను. అవృత్తివంటి పవిత్రపదార్థమును, స్తుత్య పదార్థమును ప్రపంచమునందు ఇంకొక్కటికూడ లేదు. అవృత్తియొక్క అను ష్ఠానము చేయువాఁడు మరల సంసారముఖమును చూడఁడు. ఆవృత్తిచేత] ఒకసారి బ్రహ్మావరణమైన యజ్ఞానము భంగమైనవెనుక బ్రహ్మావరణభంగము కొఱకు మరల వృత్తినిరోధప్రయోజనము లేదు.

ఈస్థానమునందు కొందఱు గ్రంథకారులు న్యాయపద్ధతి ననుసరించి ఒకక్షణమునందు అహంబ్రహ్మాస్మివృత్తిచే సాక్షాత్కారరూప నిర్వికల్పసమాధి యొక్క ఉదయమగుచున్నది; రెండవక్షణమునందు దానికి స్థితియై ఆవరణ నాశారంభమగుచున్నది; తృతీయక్షణమునందు ఆవరణనాశము పూర్ణమై దానివలన జీవన్ముక్తి ప్రాప్తమగుచున్నది. [వారిమతప్రకారముగ జీవన్ముక్తికిఁ గూడ ఉత్పత్తిస్థితి ఉండవలెనేమో వానికిఁగూడ వేర్వేఱె క్షణములు కావలె నేమో పెక్కులేల దండముచేత ఘటభంగమునకుఁ గూడ అనేక క్షణములు అంగీకరించుచున్నారు.] ఈప్రకారముగ క్షణములయొక్క లెక్క వ్రాయు చున్నారు. అయినను ఇది తర్కశాస్త్రముయొక్క ప్రలాపమాత్రమేగాని దీనియందు ఏయుక్తియు లేదు; ఏప్రమాణమును లేదు. వేదమునకును, జీవ న్ముక్త విద్వాంసుని యనుభవమునకును విరుద్ధముగ నున్నది.

జలపూరితఘటముమీఁద ఉచ్చస్థానమునుంచి పెద్దరాయి ఒకసారి పడి నపుడు ఒకేక్షణమునందు ఘటము శతధా చూర్ణమై నీళ్లు పారిపోయి భూమి అర్ద్రమగుచున్నది. ఈసంగతి చెప్పువానికి చెప్పుటకు మూఁడుక్షణములు కావలెను. కాని ఘటభంగము, జలప్రసారణము, భూమ్యార్ద్రత ఈమూఁడు వ్యవహారములును ఒకేక్షణమునందు అగుచున్నవి. అచ్చట మూఁడువ్యవహార ములకొఱకు మూఁడుక్షణములయొక్క అవశ్యకత లేదు. అట్లు అహంబ్రహ్మాస్మి యను నీచరమవృత్తియొక్క పర్యవసానమునందుదయించిన సాక్షాత్కారరూప మైన నిర్వికల్పసమాధియొక్క ఉదయము, స్థితి, కారణాజ్ఞానరూపమైన ఆవ రణముయొక్క భంగము [అత్యంతనివృత్తి] అజ్ఞానకార్యమైన సకలప్రపం

చముయొక్క అత్యంతనివృత్తి, బ్రహ్మసాక్షాత్కారము, జీవన్ముక్తి ఈయన్ని వ్యవహారములు ఒకేక్షణమునందు కలుగుచున్నవి. వానికి అనేకక్షణముల యొక్క అవశ్యకతయే లేదు.

కొన్ని వేదాంతగ్రంథములందు ఉక్తప్రకారముగ ఆవరణభంగమయి నను సప్తమభూమిక [శుభేచ్ఛ, సువిచారణ మొదలగు జ్ఞానభూమికలు ఏడు అని చెప్పఁబడినది. వానిలో తుర్యగయను సప్తమభూమిక] వరకు వృత్తినిరోధము ఏది చెప్పఁబడినదో, అది వాసనాక్షయము, మనోనాశము [మనస్సు యొక్క స్థూలీభావనివృత్తి] ద్వారమున జీవన్ముక్తియొక్క విలక్షణానందము నకు [వ్యవహారదశయందు దోషసహితమై, దుఃఖసహితమగు విషయానందము కలుగును. ఆ యానందముకన్న వేఱయిన బ్రహ్మానందమునకు లేక గ్రంథాంతరమునందు విద్యానందము, యోగానందము మొదలయిన అనేకానందములు చెప్పఁబడినవి. ఆయన్నింటికన్న వేఱయిన అట్టి బ్రహ్మానందమునకు] హేతువు గాని ఆవరణభంగమునకు హేతువు కాదు. ఈరీతిగా ఒక సాక్షాత్కార రూపమైన నిర్వికల్పసమాధిదప్ప ఇతర సకలసమాధులకు నిదిధ్యాసనమునందు అంతర్భావమే. దీనియందు ఏయాక్షేపము ఘటిల్లదు.

సమాధియొక్క భేదోపభేదములు వేదాంతముయొక్క అనేకగ్రంథము లందు వేర్వేఱ అనేకప్రకారములుగ వ్రాయఁబడియున్నవి. కొన్నింటి యందు సవికల్పనిర్వికల్పములని రెండుభేదములే వ్రాయఁబడియున్నవి; కొన్నింటియందు నాల్గు, కొన్నింటియందు ఆఱు, కొన్నింటియందు ఎనిమిది వ్రాయఁబడి యున్నవి. భేదోపభేదములు ఎన్ని ఉండనీ సాక్షాత్కారముకన్న పూర్వము సమాధిశబ్దముయొక్క ముఖ్యార్థమే సిద్ధము కాదు. ఎందు కనఁగా— బ్రహ్మాకారవృత్తియే సమాధిశబ్దముయొక్క ముఖ్యార్థము; బ్రహ్మాకారవృత్తియో, సాక్షాత్కారముకన్న మొదలు ఘటిల్లదు. ఈసంగతి ఇపుడే నిదిధ్యాసనవిశేష విచారమునందు చెప్పుచువచ్చుచున్నాను. సాక్షాత్కారమయినతరువాత జీవన్ముక్త్యవస్థయందు అన్ని సమాధిశబ్దములకు మంచి సార్థకత యగుచున్నది.

భావనదూరమగుచున్నది. ఈప్రకారముగా శ్రవణాదిత్రయము సంశయాదిత్రయ [1] మునకు నాశకముగనున్నది.

1. సంశయము, అసంభావన, విపరీతభావన ఇవి భ్రమజ్ఞానముయొక్క మూఁడు రూపములు. వీనిలో.—

(1) ఒకేధర్మిమీఁద రెండుధర్మములయొక్క ఆరోపము సంశయ మనఁబడినది. లేక కోటిద్వయ [రెండుపక్షములు] విషయకజ్ఞానము సంశయ మనఁబడినది. ఎట్లనఁగా—ఇదేమి రజ్జువా? సర్పమా?

(2) సంభవనీయ వస్తువుమీఁద అసంభావ్యజ్ఞానము అసంభావన యనఁబడినది. ఎట్లనఁగా—రూపవంతులై గుణవంతులైన తల్లిదండ్రులయొక్క కురూపదుర్గుణయుక్తుఁడైనకుమారునిఁజూచి కర్మబలముచే చిత్రవిచిత్రసంతతి యగుటకు సంభవముండినను ఆతల్లిదండ్రులకు ఈకుమారుఁడు ఎట్లు పుట్టును? ఇతఁడు వారియొక్క కుమారుఁడు కాఁడు; అనుట.

(3) ఒకేధర్మిమీఁద వేఱేయొక ధర్మియొక్క నిశ్చయము విపరీతభావన యనఁబడినది. ఎట్లనఁగా—శుక్తియుండఁగా రజతమని నిశ్చయము.

ఈప్రకారముగ భ్రమజ్ఞానమునందు సంశయాదిత్రయము కొన్ని వేదాంతగ్రంథములందు చెప్పఁబడియున్నది. ఇంక కొన్ని గ్రంథములందును, ఈగ్రంథముయొక్క మూలమయిన హిందుస్థాని గ్రంథమునందును సంశయము అసంభావన ఈరెంటియొక్క ఏకీభావము చెప్పఁబడియున్నది. వేర్వేఱె రూపములుచేసి చెప్పలేదు.

ఈసంశయాదిత్రయవిచారముయొక్క విస్తరము ప్రసంగమును జూచి ముందు వ్రాయఁబడును.

వేదాంతవాక్య[1]ములు అద్వితీయబ్రహ్మప్రతిపాదకములా? లేక యన్యార్థప్రతిపాదకములా? ఇట్టి సందేహము ప్రమాణ[2]మునందగుచున్నది; అది ప్రమాణాసంభావన. జీవబ్రహ్మలయభేదము సత్యమా? లేక భేదము సత్యమా? ఇట్టి[3] సందేహము ప్రమేయమునందు కలుగుచున్నది; అది ప్రమేయాసంభావన. మఱియు దేహాదికము సత్యము; జీవబ్రహ్మలభేదము సత్యము; ఇట్టిజ్ఞానమును విపరీతభావన యందురు.

ఈరీతిగా శ్రవణాదిత్రయము అసంభావనా విపరీతభావనలకు నాశకము; అసంభావనావిపరీతభావనలు జ్ఞానమునకు

---

1. వేదముల యంతర్భాగమైన యేయుపనిషత్తులు గలవో, వానిని వేదాంత మందురు. లేక వేదములయొక్క యంత మనఁగా నిర్ణయము దేనియందుఁగలదో, అట్టి సూత్రభాష్యరూపమైన యుత్తరమీమాంసాశాస్త్రమును వేదాంత మందురు. తద్వాక్యము అనఁగా పదసముదాయము.

2. ప్రమాజ్ఞానమునకు ఏకరణము గలదో, దానిని ప్రమాణమందురు. ఇచ్చట వేదప్రతిపాదితమైన మోక్షాదిపదార్థములయొక్క యథార్థానుభవరూపమయిన శాబ్దిప్రమ ఏది గలదో, తత్కారణమైన ఏయుపనిషద్రూపశబ్దము గలదో, అది ప్రమాణశబ్దమునకర్థము. తత్స్వరూపమున నుక్తప్రకారమైన సంశయము గలుగునో, అదియె ప్రమాణగతసంశయము. విచారించి చూచినట్టయిన శాస్త్రమునందు ఎన్ని ప్రమేయగతసంశయభేదములు చెప్పఁబడెనో, అన్నియుఁ బ్రమాణగతసంశయభేదము లని సిద్ధించును.

3 "ఇట్టి" అనఁగా—ఇది మొదలుకొని యనేకాకారములుగలవి ప్రమేయగతసంశయములు. లేక ఉపనిషద్రూపమయిన శబ్దప్రమాణముచేత తెలియఁగ యోగ్యమయిన లేక ఆ ప్రమాణముచేత పుట్టిన శాబ్దిప్రమచేత తెలియఁగయోగ్యమైన మోక్షాదికపదార్థములు ఏవి గలవో, వానిని ఇచ్చట ప్రమేయ మందురు; కనుక వానియందు గలుగు సంశయములు.

ప్రతిబంధకములు; గనుక జ్ఞానప్రతిబంధకనాశనద్వారమున శ్రవణాదికము జ్ఞానమునకు హేతువందురు; గాని సాక్షాద్ధేతువు [1] గాదు. కనుక శ్రవణాదిత్రయమునకు పరంపరగా జ్ఞానహేతుత్వము చెప్పఁబడియున్నది.

## 15. అవాంతరమహావాక్యములకు పరోక్షాపరోక్షజ్ఞానహేతుత.

జ్ఞానమునకు సాక్షాత్సాధనము శ్రోత్రసంబంధమయిన వేదాంతవాక్యమే. ఆవేదాంతవాక్యము రెండువిధములుగానున్నది. మొదటిది అవాంతరవాక్యము, రెండవది మహావాక్యము. [పరమాత్మయొక్క, లేక జీవునియొక్క స్వరూపము బోధించునట్టి వాక్యము అవాంతరవాక్యము; మఱియు జీవపరమాత్మలయొక్క ఏకత్వము బోధించునట్టి వాక్యము మహావాక్యము.] అవాంతరవాక్యమువలన పరోక్షజ్ఞానము, మఱియు మహావాక్యమువలన అపరోక్షజ్ఞానము కలుగుచున్నది. ["బ్రహ్మమున్నది" అనునీ జ్ఞానము పరోక్షజ్ఞానమని "నేను బ్రహ్మము" అనునీజ్ఞానము అపరోక్షజ్ఞానమని ఎఱుఁగవలయును.]

"త్వం బ్రహ్మ" అని ఆచార్యులు చెప్పినవాక్యమునకు శ్రోత్రముతో సంబంధమయినక్షణమే "అహం బ్రహ్మ" అను అపరోక్షజ్ఞానము శ్రోతకగుచున్నది; శ్రోత్రముతో వాక్యసం

1 నేత్రములందుఁ బూయఁబడిన యంజనము నేత్రరోగనివృత్తిద్వారమున సూర్యదర్శనమునకు సాధనము గాని సాక్షాత్సాధనము గాదు; సాక్షాత్సాధనము నేత్రము. అట్లు శ్రవణాదులు జ్ఞానప్రతిబంధకమయిన దోషనివృత్తిద్వారమున జ్ఞానమునకు సాధనములుగాని సాక్షాత్సాధనములు గావు; సాక్షాత్సాధనము శ్రోత్రసంబంధమయిన మహావాక్యము.

బంధము లేనియప్పుడు అజ్ఞానము పోడమదు. అందువలన శ్రోత్రసంబంధముగల వాక్యము జ్ఞానమునకు హేతువుగా నున్నది. దానిలో— అవాంతరవాక్యము పరోక్షజ్ఞానమునకు, మహావాక్యము అపరోక్షజ్ఞానమునకు హేతువు. [మహావాక్యమువలన సర్వథా అపరోక్షజ్ఞానమే యగును; ఎప్పటికిని పరోక్షజ్ఞానము గానేరదు.]

## 16. వేదాంతైకదేశిమతము కేవలవాక్యము వలన పరోక్షజ్ఞానము.

శ్రవణము, మననము, నిదిధ్యాసనము ఈమూఁడు సాధనములతోఁగూడిన మహావాక్యమువలన అపరోక్షజ్ఞాన మగును; కేవలవాక్యమువలనపరోక్షజ్ఞాన మగును;గాని అపరోక్షజ్ఞానము గానేరదు అనునది ఏకదేశియొక్క మతము. ఆస్వమతమును స్థాపించుటకొఱకు ఏకదేశి [1] ఈసంగతి చెప్పును.—

"కేవలవాక్యమువలన అపరోక్షజ్ఞానము సంభవించిన యెడల శ్రవణాదిసాధనములు వ్యర్థములగును. ఏలాగుననఁగా, సిద్ధాంతమందు కేవలవాక్యమువలన అపరోక్షజ్ఞానము, శ్రవణాదికమువలన అసంభావనాదికముయొక్క నాశము అగునని చెప్పఁబడినది; అయినను ఏవస్తువుయొక్క అపరోక్షజ్ఞానమగునో, దానియందు అసంభావన, లేక విపరీతభావన ఎవ్వరికిని గానేరదు; గనుకఅపరోక్షజ్ఞానవాదియొక్క సిద్ధాంతమందు తత్త్వమస్యాది మహావాక్యమువలన అపరోక్షజ్ఞానమయినవెనుక అసంభావ

---

1. సిద్ధాంతముయొక్క ఏకదేశము నాశ్రయించి స్వయముగా విశేషార్థనిరూపణము దేనియందుఁ జేయఁబడినదో, అట్టి పంచదశ్యాది వేదాంత గ్రంథముల కర్తలగు నాచార్యుల నిచ్చట ఏకదేశి యందురు.

కాదులు సంభవింపవు; కావున శ్రవణాదులు వ్యర్థములగును. మామతమందో కేవలవాక్యమువలన పరోక్షజ్ఞానము, శ్రవణాది సహితవాక్యమువలన అపరోక్షజ్ఞానము గలుగు ననుటచేత శ్రవణాదులు వ్యర్థము [1] గానేరవు."

[అనేకగ్రంథకారులు [2] ఇట్లే తలంచియున్నారు; అయి నను ఈమతము సమీచీనము గాదు.]

## 17. ఏకదేశిమతముయొక్క అసమీచీనత

[ప్రథమాంశముయొక్క అసమీచీనత.]

శబ్దమున కిది స్వభావము—ఏవస్తువు వ్యవహితమగునో, శబ్దమువలన దానియొక్క జ్ఞానము పరోక్షమే యగును; ఏలాగైనను అపరోక్షము గానేరదు. ఎట్లనఁగా—శాస్త్రరూపమైన శబ్దమువలన వ్యవహితస్వర్గముయొక్క, ఇంద్రాది దేవతలయొక్క

---

1. ఓసిమైత్రేయీ! ఆత్మను చూడవలెను. శ్రవణము చేయవలెను. మననము చేయవలెను. మఱియు నిదిధ్యాసనము చేయవలెను. "ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యాదులయిన శ్రుతులచేత ప్రతిపాదితమయిన ఆత్మదర్శనసాధనమగు శ్రవణాదికము విఫలమగుటకు యోగ్యముకాదు; మఱేమనఁగా—సఫల మగుటకే యోగ్యము. కేవలమహావాక్యముచే నపరోక్షజ్ఞానాంగీకారమువలన శ్రుత్యుక్తమగు శ్రవణాదిసాధనములు నివర్తనీయదోషాభావమువలన రోగాభావానంతరము ఔషధసేవనన్యాయమున నిష్ఫల మగును. ఇది ఏకదేశియొక్క యభిప్రాయము.

2. మందబోధగలవానికి శ్రవణాదిసాధనమునందు సాలస్యబుద్ధి యగు నను నభిప్రాయమున నిచ్చట ఉక్తమతము సంక్షేప శారీరకాచార్యులకన్న భిన్నులగు ననేకగ్రంథకర్తలదిగా నున్నది.

జ్ఞానము పరోక్షమే యగును. మఱియు ఏవస్తువు అవ్యవహిత మగునో, శబ్దమువలనదానియొక్క జ్ఞానము ప్రసంగానుసారము పరోక్షముగాని యపరోక్షముకాని యగును.

ఎచ్చట శబ్దము అవ్యవహితవస్తువును అస్తిరూపమున బోధించునో, అచ్చట అవ్యవహితవస్తువిషయమందును పరోక్ష జ్ఞాన మగును. ఎట్లనఁగా— "దశమపురుషుఁ డున్నాఁడు" ఈరీతిగా అస్తిరూపముచేత బోధింపఁబడిన అవ్యవహితదశమునివిషయమందును పరోక్షజ్ఞాన మగును.

ఎచ్చట అవ్యవహితవస్తువును అహంతా, త్వంతా, ఇదంతా అన్యతమ రూపముచేత శబ్దము బోధించునో, అచ్చట అవ్యవహితవస్తువు[1] యొక్క అపరోక్షజ్ఞానమే యగును; పరోక్ష జ్ఞానముగా నేరదు. ఎట్లనఁగా—"దశముఁడవు నీవున్నావు[2]" ఈరీతిగా శబ్దముచే అవ్యవహితుఁడైన ఏదశముఁడు బోధింపఁబడెనో, వాదియొక్క జ్ఞానము అపరోక్షమగుచున్నది.

---

1. దేశకృతము లేక కాలకృతము అగు అంతరాయమును వ్యవధాన మందురు; వ్యవధానముగలదానిని వ్యవహితమందురు; ఏది వ్యవహితముగాదో, దానిని అవ్యవహిత మందురు.

2. ఇచ్చట ఈ ప్రసంగము కలదు—ఒకానొకప్పుడు పదుగురు కూడి ప్రవాసము పోవ మని నిశ్చయించి ప్రయాణమునకు వలసిన సామగ్రి నెల్లఁ గూర్చుకొని పరదేశమునకు పోవువారము అప్రమత్తులై యుండవలయు నని నిర్ధారించుకొని బయలుదేఱి కొంతదవ్వరిగిరి. మార్గమున జలపూరితమైన ప్రవాహమును జూచి సంభారాదికమును బిగిలపఱచుకొని అప్రమత్తులై దాఁటి యావలదరిఁ జేరి వచ్చినవారిని దెచ్చినసంభారమును గణించుకొని గణించిన వాఁడు తన్ను వదలి ఇతరులలెక్కఁబెట్టఁగా నెవ్వఁడో యొకఁడు నదీప్రవాహ

ఆప్రకారముగా బ్రహ్మము సర్వమునకు ఆత్మయగుట వలన అత్యంతావ్యవహితముగా నున్నది. అవాంతరవాక్యము అస్తిరూపమువలన దానిని బోధించుచున్నది; ఆప్రసంగమందు అవ్యవహితబ్రహ్మముయొక్క యపరోక్షజ్ఞానమగును. మఱియు

---

మందుఁ గొట్టికొనిపోయెనని దుఃఖపడి తొమ్మండ్రుదక్క పదియవవాఁడు పోయెనే యని పదుగురును విలపించిరి.

ఇట్టి యాక్రందనధ్వని విని యధ్వనీనులగు జనులుగూడి యేమేమని విచారించిరి. అప్పుడు వారు దమవృత్తాంతముఁ దెలుపఁగా విన్నవారిలో మేధావియొకఁడు మీరూఱకుండుఁడు; దుఃఖపడవలదు దశముఁ డున్నాఁడని చెప్పెను; ఏడిఏడి యనిరి; చూపుదును; ఒక్కవరుసను నిలువుఁ డనినిల్పి యొక్క బెత్తముఁదీసికొని వరుసగా నొక్కొక్కనిశిరమున తాడనముఁ జేయుచుఁజేయుచు నొకటి రెండు లెక్కపెట్ట నారంభించెను.

అట్లు తొమ్మిది లెక్కపెట్టి వెంటనే పదియవవానిశిరమున గట్టిగా కొట్టి నీవే దశముఁడని చెప్పి చూపెను. అప్పు డాదశముఁడు ఔనౌను నేను దశముఁడను అని గట్టిగా దుముకుచున్నాఁడు.

ఈకథయందు చూడుఁడు—ఎప్పుడు వానికి నజ్ఞానరూపమయిన ద్వివిధావరణము గలిగెనో, అప్పుడు దశమపురుషుఁడు స్వయముగా సాక్షాత్తుగా నుండియుఁ లేఁడనియెఱిఁగి విలపించెను. మఱియుం ఎప్పు డాప్తపురుషుఁడు [యథార్థవక్త] వచ్చి దశముఁ డున్నవాఁడను నవాంతరవాక్యముఁ జెప్పెనో, అప్పు డావాక్యము విని వానికి దశముఁ డెచ్చటనో యున్నాఁడను పరోక్షజ్ఞానము గలిగెను. తరువాత దశముఁడెచ్చటనున్నవాఁడని యడిగిన వెనుక ఆప్తపురుషుఁడు దశముఁడు నీవేయను మహావాక్యముఁ జెప్పిన వెనుక దశముఁడు నేనను అపరోక్షజ్ఞానము పుట్టెను. అజ్ఞానమువలన అజ్ఞానకృతావరణమును రోదనాదివిక్షేపమును నాశమై హర్షరూపతృప్తి గలిగెను.

"దశముఁడు నీవు" ఈవాక్యన్యాయమున శ్రోతయొక్క ఆత్మరూపముచేత బ్రహ్మమును మహావాక్యము బోధించుచున్నది; ఆప్రసంగమందుమహావాక్యముచేఁగలుగుఅవ్యవహితబ్రహ్మముయొక్క జ్ఞానముపరోక్షముగానేరదు; మఱేమనఁగా—ఆప్రసంగమునందు జ్ఞానము అపరోక్షమే యగును.

---

అట్లు ఇక్కడ జీవుఁడు [జీవశబ్దమునకు లక్ష్యార్థమగు కూటస్థుఁడు] స్థూలశరీరసహితమయిన యష్టపురిని, మఱియుం నవమపురుషుఁడైన చిదాభాసుని జేరి సంసారరూపమయిన మృగజలనదియందుఁ బ్రవేశించి దానియొక్క మనుష్యరూపమయిన తీరమునకువచ్చి ఒకానొకప్పుడు [జిజ్ఞాసాకాలమునందు] విచారముఁ జేయును; అప్పుడు తనకన్న భిన్నులయిన అనవపురుషులను దెలియును; మీఁదట వీనిని దెలిసినవాఁడైన యాజీవుఁడు తననిజరూప బ్రహ్మమును ఎఱుఁగఁడు. ఇదే అజ్ఞానావస్థ. దానివలన బ్రహ్మము లేదని బ్రహ్మము దెలియదని ద్వివిధమయిన యావరణమును, దానివలన అర్థాధ్యాసజ్ఞానాధ్యాసరూపమయిన విక్షేపమును [శోకమును] కలుగును. వెనుక బ్రహ్మము ఉన్నదని గురువు అవాంతరవాక్యముఁ జెప్పెను. దానిని విని బ్రహ్మము ఉన్నదని పరోక్షజ్ఞాన మాయెను. వెనుక బ్రహ్మము ఎద్ది? ఇట్టి ప్రశ్న చేసిన వెనుక గురువు నీవే బ్రహ్మము అను మహావాక్యమును జెప్పెను. దానిని విని నేను బ్రహ్మము అను అపరోక్షజ్ఞాన మాయెను. దానివలన అజ్ఞానకృతావరణమును, ద్వివిధాధ్యాసరూపవిక్షేపమును బాధితమై అత్యంతానందరూపమయిన నిరంకుశతృప్తి గలిగెను.

ఇచ్చట ఈరహస్యమున్నది—మనస్సుచేతను, నేత్రముచేతను ప్రత్యక్షమగుటకు యోగ్యమయిన స్థూలసూక్ష్మసంఘాతరూపముయొక్క యపరోక్షజ్ఞానము వానికి మనోనేత్రరూపమయిన సామగ్రియుండియుఁ గాలేదు; మఱియుం దశముఁడు నీవను వాక్యమువలన నపరోక్షజ్ఞాన మాయెను.

## [ద్వితీయాంశముయొక్క అసమీచీనత]

మఱియు ఏకదేశి యిట్లు చెప్పుచున్నాఁడు—"ఏవస్తువు యొక్క యపరోక్షజ్ఞానమగునో, దానియందు అసంభావనావిపరీతభావనలు సంభవింపవు; గనుక శ్రవణాదికము విఫలమగును." ఈశంక ఘటిల్లదు. ఏల యన—ఎట్లు రాజునకు నేత్రమువలన భర్ప్భవు[1] యొక్క యపరోక్షజ్ఞానమయినను విపరీతభావన లేకపోలేదో, అట్లు మహావాక్యమువలన బ్రహ్మముయొక్క యపరోక్షజ్ఞానమయినను, ఎవనిబుద్ధియందు అసంభావనాది దోషముండునో, వానియొక్క ఆదోషసహితమైన సకలంకజ్ఞానము వానికి ఫలమునకు హేతువుగా నేరదు; అందువలన దోషనివృత్తి

ఇచ్చట దశముని యపరోక్షబోధరూపమయిన ప్రమాజ్ఞానమునకు కరణము నీవు దశముఁడను శబ్దమగుటవలన ఆశబ్దము ప్రమాణము; దానికి మనస్సును, నేత్రమును సహకారులై ఉన్నవి. అట్లు బ్రహ్మముయొక్క యపరోక్షబోధరూపమయిన ప్రమాజ్ఞానమునకు కరణము తత్త్వమసి యను మహావాక్యరూపమగు శబ్దమగుటవలన ఆశబ్దము ప్రమాణము; దానికి సంస్కృతమయిన [శ్రవణాదిసాధనసంపన్నమయిన]మనస్సు సహకారిగానున్నది.

ఇచ్చట బ్రహ్మాపరోక్షజ్ఞానమునకు హేతువునందు శబ్దప్రమాణమునకు ప్రాధాన్యము; మఱియు సంస్కృతమనస్సుయొక్క సాహాయ్యము; అని ఒక పక్షము. అట్లే సంస్కృతమనస్సునకు ప్రాధాన్యము; మఱియు శబ్దప్రమాణము యొక్క సాహాయ్యము; అని రెండవపక్షము. ఈవిధముగా రెండుపక్షములును వేదాంతమునందు చెప్పఁబడియున్నవి. వానిలో ప్రథమపక్షమే సిద్ధాంతము. ఈసంగతి ముందు చెప్పఁబడును.

1. భర్ప్భవను మంత్రియొక్క సవిస్తరవృత్తాంతము అంగదవతరంగమునఁ జెప్పఁబడును.

నిమిత్తము వాఁడు శ్రవణాదికము చేయనీ; ఎవని బుద్ధియందు దోషము లేదో, వాఁడు చేయకపోనీ.

ఈరీతిగా జ్ఞానమునకు సాధన మేమో, కేవలమహావాక్యమే[1] శ్రవణాదిసాధనసహితమహావాక్యము గాదు. అయినను శ్రవణాదికము జ్ఞానమునకు ప్రతిబంధకమైన దోషమునకు నాశకమగుటవలన శ్రవణాదికమును జ్ఞానహేతువని చెప్పుదురు.

శ్రవణాదికమునకు హేతువు వివేకాదికమగుటవలన వివేకాదికము గూడ జ్ఞానసాధనమందురు. మఱియు వివేకాదిచతుస్సాధన[2] సంయుక్తుఁడైన పురుషుఁడు అధికారి[3] యందురు.

---

1. దృఢబోధగలవానికి శ్రవణాదులందు కర్తవ్యబుద్ధి యుండదంచు నను నభిప్రాయమున కేవల వాక్యమువలన నపరోక్షజ్ఞానముం జెప్పు సిద్ధాంతమతము ననుసరించి యిచ్చట సమాధానము చెప్పఁబడియున్నది.

2. జ్ఞానముకన్న పూర్వము సగుణ బ్రహ్మసాక్షాత్కారముపరకు ఎవ్వఁడు ఉపాసనఁ జేసియుండునో, వానిని కృతోపాసనుఁ డని చెప్పుదురు. తద్భిన్నుని అకృతోపాసనుఁ డని యందురు. వీరిలో కృతోపాసనునందు వైరాగ్యాదిసాధనములు తీవ్రముగా నుండుటవలన ప్రసిద్ధముగాఁ గనఁబడును. అకృతోపాసనునందుండెడి సాధనములు మందమగుటవలన నవి ప్రసిద్ధముగా గనఁబడవు; గుప్తముగా నుండును. అయితే వస్త్రముయొక్క ఒకయంచును పట్టినయెడల సకలవస్త్రమును బట్టినట్లె యగును; అట్లు చతుస్సాధనములందు నొకసాధనముయొక్క నిశ్చయమయినపిదప మిగత సర్వసాధనములు దానియందే యుండునని తెలియవలెను. ఏలయన వస్త్రమునకు అంచునకు పరస్పరాపేక్ష గలయట్లు వివేకాది సర్వసాధనములకు పరస్పరాపేక్ష గలదు.

సారాంశము—శ్రద్ధాళువు, వ్యసని [జ్ఞానమునందాసక్తిగలవాఁడు తీవ్రబుద్ధిమంతుఁడయిన పురుషునకు బోధ యగును. ఇది యభిప్రాయము.

3. వాఁడు గ్రంథవిచారమునకు, విచారమూలకమయిన ఆత్మజ్ఞానమునకు, మఱియు నాత్మజ్ఞానమూలకమయిన మోక్షమునకు నధికారి యగును.

## 18. సంబంధవర్ణనము

గ్రంథమునకు, విషయమునకు ప్రతిపాదక ప్రతిపాద్య భావసంబంధము గలదు. గ్రంథము ప్రతిపాదకము, విషయము ప్రతిపాద్యము. [ప్రతిపాదనము చేయునది ప్రతిపాదకము, ప్రతిపాదనము చేయుటకు యోగ్యమయినది ప్రతిపాద్యము.]

---

మోక్షమునకు అధికారి ఎవఁడు? అని ప్రశ్నము చేసినపుడు ఎవఁడు బద్ధుఁడో, వాఁడు మోక్షాధికారి యని ఉత్తరము వచ్చుచున్నది? బద్ధుఁడెవఁడు? అని ప్రశ్నము చేసినపుడు నేను బద్ధుఁడని యెఱిఁగినవాఁడు బద్ధుఁడని ఉత్తరము వచ్చుచున్నది. ఈయభిప్రాయమువలననే సాంఖ్యశాస్త్రమునందు పశుపక్ష్యాదిప్రాణులు సహజముక్తులని చెప్పఁబడియున్నది. [సహజముక్తమనునది ఒక వినోదవచనముగ నున్నది.] అత్యంతమూఢులై ప్రమత్తులయిన మనుష్యులకును పశ్వాదులందే యంతర్భావముగ నున్నది; వారుదక్క సామాన్యతః మనుష్యప్రాణులందఱును మేము బద్ధులని యెఱుఁగుచున్నారు; వారందఱును మోక్షమునకు అధికారులుగా నున్నారు. అయినను వారికి మోక్షము చాల దూరమున నున్నది; మఱియు సాధనసంపన్నపురుషునకు అది చాలసమీపమున నున్నది. కనుక వేదాంతమునందు వాఁడే మోక్షాధికారియని చెప్పఁబడియున్నది.

"వృక్షమును నాటించినవాఁడు ఫలాధికారి" అని ఒక సామాన్యవచనమునకు మోహితుఁడై నేను ఫలాధికారి అని యెఱిఁగి జలసించనాది ప్రయత్నము విడిచినపక్షమున వృక్షము ఎండిపోయి ఫలాధికారముకూడ దానితోడనే పోవుచున్నది; అన్యాయమున సామాన్యతః మనుష్యప్రాణులు మోక్షాధికారి యని వచనమునకు మోహితుఁడై నేను మోక్షాధికారి,యని యెఱిఁగి సాధనచింత విడిచినయెడల ఆయధికారము ఆయుష్యముతోడనే నశించుచున్నది. నరదేహము పోయినపిదప అన్యజన్మమునందు అధికారముయొక్క పేరుకూడ ఉండదు.

అధికారికిని, ఫలమునకు ప్రాపకప్రాప్యభావసంబంధము గలదు. అధికారి ప్రాపకుఁడు, ఫలము ప్రాప్యము [దేనికి ప్రాప్తముగునో, అది ప్రాపకము, ఏది ప్రాప్తముగునో, అది ప్రాప్యము.]

అధికారికి, విచారమునకు కర్తృకర్తవ్యభావసంబంధము గలదు. అధికారి కర్త, విచారము కర్తవ్యము. [చేయువాఁడు కర్త, చేయతగ్గది కర్తవ్యము.]

గ్రంథమునకు, జ్ఞానమునకు జనకజన్యభావసంబంధము గలదు. విచారద్వారమున గ్రంథము జ్ఞానమునకు జనకము, జ్ఞానము జన్యము. [ఉత్పత్తిచేయునది జనకము, ఉత్పన్నమగునది జన్యము.]

ఇవి [1] మొదలగు యితరసంబంధ [2] ములను దెలియవలయును.

---

1. ఇచ్చట "ఇవి" శబ్దముచేత శ్రవణాదిసాధనములయొక్క, మఱియు మోక్షముయొక్క సాధ్యసాధనభావము; ఇత్యాది సంబంధములు తెలియవలయును.

2. జలమునందు సించనయోగ్యత యుండునట్లు పరస్పరోపయోగయోగ్యతగల పదార్థద్వయముయొక్క సంబంధము గలుగును. నిరుపయోగిపదార్థములకు సంబంధము గలుగదు. ఏలయన యోగ్యతలేక సంబంధము సంభవింపదు. ఇట్టిజ్ఞానరూపమగు అర్థాపత్తిప్రమాణముద్వారమున ఆయా పదార్థముయొక్క యోగ్యతాకల్పన కలుగుచున్నది; దానివలన అకల్పనారూపమయిన అర్థాపత్తిప్రమ యగుచున్నది; ఈహేతువువలన శాస్త్రమునందు సంబంధరూపానుబంధముయొక్క వ్యవహారము వ్రాయఁబడినది; అన్యప్రయోజనము లేదు.

ఉక్తటిప్పణము ప్రకారాంతరముచేత వ్రాయుచున్నాను—

## 19. విషయవర్ణనము

జీవబ్రహ్మలయొక్క యేకత యీగ్రంథమునకు విషయము. ఏది ప్రతిపాదింపఁబడునో, దానిని విషయమందురు. ఈగ్రంథమునందు జీవబ్రహ్మలయేకత ప్రతిపాదింపఁబడుచున్నది; కాఁబట్టి ఆయేకత ఈగ్రంథమునకు విషయము. ఆయేకతను సర్వవేదవచనములు ప్రతిపాదించుచున్నవి; అందువలన జీవబ్రహ్మలకు భేదము చెప్పువాఁడు శఠుఁడు[1] వేదవిరోధి అని తెలియవలెను.

---

ఏవస్తువునకు దేనితోడ ఉపయోగము గలదో, ఆవస్తువునకు దానితో సంబంధము గలదు. ఉదాహరణము—కులాలదండాదులకు ఘటవిషయమందు ఉపయోగము కలదు; అందువలన వీనికి ఘటముతో సంబంధము గలదు.

ఏవస్తువునకు దేనిచేత నుపయోగము లేదో, ఆవస్తువునకు దానితో సంబంధము లేదు. ఉదాహరణము—నేత్రముయొక్క యుపయోగము వాయువునకు, ఆకాశమునకు లేదు. అందువలన వానికి నేత్రముతో సంబంధము లేదు. వాయువుయొక్కయు, ఆకాశముయొక్కయు జ్ఞానము నేత్రముచేతఁ గలుగదు. [వాయువుయొక్క జ్ఞానము త్వగింద్రియముచేతను, ఆకాశముయొక్క జ్ఞానము మనస్సుచేతను గలుగును.] అందువలన ఆరెంటికిని నేత్రముయొక్క ఉపయోగమును లేదు; సంబంధమును లేదు.

ఈరీతిగా గ్రంథముయొక్క యుపయోగము బ్రహ్మజ్ఞానమందు లేని యెడల బ్రహ్మప్రాప్తియందు గ్రంథముయొక్క సంబంధము గాకుండవలసి యుండేను; గ్రంథముయొక్క యుపయోగమో, బ్రహ్మప్రాప్తియందున్నది; గనుక వానికి పరస్పరసంబంధము వ్రాయఁబడినది.

---

1. ప్రియమైన మాటలాడి వెనుక దుఃఖాపత్తి గలుగఁజేయువాఁడు శఠుఁడు. [వంచకుఁడు, మోసగాఁడు] అనఁబడును.

## 20. ప్రయోజనవర్ణనము

ప్రపంచకారణ మజ్ఞానము, తత్కార్యము ప్రపంచము జన్మమరణరూపమైన దుఃఖమునకు హేతువుగా నున్నది; గనుక నివి యనర్థమని చెప్పఁబడును. ఆయనర్థముయొక్క నివృత్తియు, పరమానందప్రాప్తియు మోక్షమని చెప్పఁబడుచున్నది; అదే యీ గ్రంథమునకు పరమప్రయోజనము. మఱియు అవాంతర ప్రయోజనము జ్ఞానము.

దేనియందు సకలపురుషులకు అభిలాష గలదో, దానిని పరమప్రయోజనమందురు. దానినే పురుషార్థమనియు చెప్పుదురు. ఆయభిలాష దుఃఖనివృత్తియందును, సుఖప్రాప్తియందును సకలపురుషులకు నుండును; అదియే మోక్షస్వరూపము; అందువలన పరమప్రయోజనము మోక్షమే యగును; జ్ఞానము గానేరదు. ఏలయన జ్ఞానము సుఖప్రాప్తికి, దుఃఖనివృత్తికి సాధనమాత్రము గాని అది సుఖప్రాప్తిదుఃఖనివృత్తిరూపము గాదు.

ఏవస్తువువలన పరమప్రయోజనముయొక్క ప్రాప్తి గలుగునో, దానిని అవాంతరప్రయోజనమందురు; ఇట్టిది జ్ఞానము. ఏలయన గ్రంథముచేత జ్ఞానముద్వారమున ముక్తిరూపమైన పరమ ప్రయోజనముయొక్క ప్రాప్తి యగుచున్నది.

## 21. ప్రయోజనమందు ప్రథమాక్షేపము ప్రాప్తప్రాప్తి ఘటిల్లదు.

ఒకానొకఁ డనుచున్నాఁడు. పూర్వము అనర్థనివృత్తియు, పరమానందప్రాప్తియు గ్రంథప్రయోజనమని చెప్పఁబడినది; అది

ఘటిల్లదు. ఏల యన—సర్వవేదములు [1] జీవుని పరమానంద స్వరూపుఁడని వర్ణించుచున్నవి; నీవును అంగీకరించెదవు; మఱియు ఏవస్తువు అప్రాప్తమో, తత్సంప్రాప్తి యగును; సదాప్రాప్తవస్తువు యొక్క ప్రాప్తి యెప్పటికిని ఘటిల్లదు; అందువలన సదాపరమానందస్వరూపుఁడైన యాత్మకు పరమానందప్రాప్తి యనునది సర్వవిధములను అసంభవము.

## 22. ప్రథమాక్షేపసమాధానదృష్టాంతము [2].

ఒకానొకఁడు చేత కంకణముండియు పోయె నని భ్రమపుట్టి యేడ్చుచుండెను. అప్పు డొకసుజనునిబోధవలన తనకంకణము తనయొద్దనే యున్నదను జ్ఞానము జనించెను. అందుపైన వాని నింకొక్కఁడు మీపోయినకంకణము లభించినదా? యని యడిగెను. అవును; నాకంకణము నాకు లభించె నని చెప్పెను.

ఈరీతిగా సదాకరస్థకంకణముయొక్క ప్రాప్తి సిద్ధమగును. అట్లు పరమానందస్వరూపుఁడైన యాత్మవిషయంబునందు అవిద్యాబలమున నిట్టి భ్రాంతి యగును—ఆత్మ పరమానంద స్వరూపుఁడు గాఁడు, పరమానందస్వరూపము బ్రహ్మము; ఆ బ్రహ్మమునకు, నాకు వియోగమయినది; ఉపాసించి ఆ బ్రహ్మమును నేను పొందుదును గాక. ఇట్టిభ్రాంతి యనేకమూర్ఖప్రాణులకు నగుచునే

1. "ప్రజ్ఞానమానందం బ్రహ్మ" ప్రజ్ఞానస్వరూపుఁడైన జీవుఁడు; వాఁడు ఆనందరూపుఁడైన బ్రహ్మము. ఇది మొదలుకొని చతుర్వేదముల వాక్యములు జీవుని స్వభావసిద్ధముగ ఆనందరూపుఁడని చెప్పును.

2 వాదిప్రతివాదులిద్దఱికి సమ్మతమయిన యేయర్థము గలదో, అది దృష్టాంత మనఁబడును. ఇదే యుదాహరణము న్యాయము. దృష్టాంతము చేత సిద్ధమయిన యర్థము దార్ష్టాంతికము; దానిని సిద్ధాంత మనియు నందురు.

యందును; ఇట్లే యనేకపండితులును చెప్పియున్నారు; అయి నను వారు మూర్ఖులే యగుదురు. ఏలయన ఎవ్వఁడు జీవబ్రహ్మలకు వియోగమంగీకరించునో, వాఁడు మూర్ఖుఁడే యగును.

అట్టిపురుషునకు ఉత్తమసంస్కారమువలన నొకానొకప్పుడు బ్రహ్మజ్ఞానాచార్యులవలన వేదాంతశ్రవణప్రాప్తి యగునో, అప్పుడు విన్నయర్థము నిశ్చయము చేసుకొని వచించును—నాకు పరమానందము గ్రంథమువలన, ఆచార్యకృపవలన లభించుచున్నది.

అభిప్రాయ మేమనఁగా—మొదటినుండి యాత్మ పరమానందస్వరూపుఁడుగానే యున్నాఁడు; అయినను నాయాత్మ పరమానందస్వరూపుఁడు అని యెఱుఁగనైతి; అందువలన అప్రాప్తముగ లేనే అయినది యని చెప్పుచుంటిని; ఇప్పుడు ఆచార్యుల ద్వారమున గ్రంథశ్రవణమువలన పరమానందజ్ఞానము బుద్ధియందు పొడమినది; అందువలన పరమానందము ప్రాప్తమైనది; యని చెప్పుచున్నాను.

ఈప్రకారముగా ప్రాప్తముయొక్క ప్రాప్తి ఘటిల్లుటవలన పరమానందప్రాప్తిరూపమగు గ్రంథముయొక్క ప్రయోజనము సంభవించుచున్నది.

ఎట్లు ప్రాప్తముయొక్క ప్రాప్తి గ్రంథప్రయోజనముగా సంభవించెనో, అట్లే నిత్యనివృత్తముయొక్క నివృత్తియు ప్రయోజనముగా సంభవించుచున్నది. ఎట్లు రజ్జువునందు సర్పము నిత్యనివృత్తముగా నుండినను అది రజ్జుజ్ఞానమువలన నివృత్తమగునో, అట్లు ఆత్మయందు సంసారము నిత్యనివృత్తమయినను తన్నివృత్తి యాత్మజ్ఞానమువలన గలుగును; కాఁబట్టి నిత్యనివృత్తము

యొక్క [1] నివృత్తియు, నిత్యప్రాప్తముయొక్క [2] ప్రాప్తియు గ్రంథముయొక్క ప్రయోజనముగా సిద్ధమయ్యెను.

---

1. వర్తమానకాలమందు వ్యావహారికమైన లేక ప్రాతిభాసికమైనట్టి ప్రపంచముయొక్క సద్భావప్రతీతియైనను పారమార్థికసత్తాదృష్టివలనను, నిషేధముఖశ్రుతివలనను, జీవన్ముక్తవిద్వాంసులయనుభవమువలనను ప్రపంచముయొక్క కాలత్రయసిద్ధమైన అభావమున్నది; అదె దానికి [ప్రపంచమునకు] నిత్యనివృత్తి. దానినే విషయరూపనివృత్తి యనియుం జెప్పుదురు. ఉక్త నిత్యనివృత్తిగల యే ప్రపంచము గలదో, దానియొక్క శ్రుతివలనను, యుక్తి వలనను, తత్త్వజ్ఞానము [నేను బ్రహ్మము అని చరమవృత్తిరూపజ్ఞానము] వలనను త్రికాలాభావరూపనిశ్చయము ఏది యగునో, అదియే నివృత్తముయొక్క నివృత్తి. [ఉక్తప్రకారముగ ప్రపంచముయొక్క అత్యంతాభావముండినను సకలజీవులకు భ్రాంతికాలమునందు ప్రపంచము సత్యమని కనఁబడుచున్నది. ఎదివఱకు బ్రహ్మజ్ఞానము లభించదో, అదివఱకు ముముక్షువునకుం గూడ ప్రపంచము సత్యమని కనఁబడుచున్నది. బ్రహ్మజ్ఞానము లభించినపుడు వానికి త్రికాలాభావరూపమగు నిశ్చయము గల్గుచున్నది; దానివలన ఇచ్చట చెప్పఁబడిన ప్రకారము నిత్యనివృత్తముయొక్క నివృత్తి సిద్ధించుచున్నది.]

2. స్వగృహమునందు నిక్షిప్తమైన ద్రవ్యభాండము అజ్ఞానమువలన అప్రాప్తమైనట్లుండి వెనుక అంజనాది సాధనమువలన దానియొక్క స్థలనిశ్చయ మగుచున్నది; అది నిత్యప్రాప్తముయొక్క ప్రాప్తి. అట్లు పరమానందస్వరూపమైన బ్రహ్మము జీవునియొక్క యాత్మయగుటవలన పరమానందము నిత్యప్రాప్తమయినను వానికి అజ్ఞానమువలన అప్రాప్తమైనట్లు కనఁబడుచున్నది. పిదప వానికి తత్త్వజ్ఞానముచేత [అహం బ్రహ్మాస్మి అనునిచరమవృత్తికి తత్త్వజ్ఞానమందురు.] నేనే పరమానందబ్రహ్మము; ఇట్టి నిశ్చయమగుచున్నది; అదియే నిత్యప్రాప్తముయొక్క ప్రాప్తి.

## 23. ప్రయోజనమందు ద్వితీయాక్షేపము— ఒక్కటే మోక్షమందు భావాభావములు రెండు సిద్ధింపవు.

ఒకఁ డనుచున్నాఁడు—సకారణజగన్నివృత్తి, మఱియు పరమానందప్రాప్తి గ్రంథముయొక్క ప్రయోజనమని మున్ను చెప్పఁబడినది; అది సంభవింపదు. ఏలయన—నివృత్తిపేరు ధ్వంసము. ధ్వంసము, నాశము ఈ రెండు పర్యాయశబ్దములు; ఆనాశము అభావరూపము; గనుక మోక్షమునందు అభావరూపత, భావరూపత రెండును ప్రతీతమగును [అనర్థనివృత్తియనునది అభావరూపము, పరమానందప్రాప్తియనునది భావరూపము] ఈ రెండును ఒక్కపదార్థమునందు ఘటిల్లవు. ఏలయన—ఈ రెండు పదార్థములు తమలోతాము విరుద్ధములు; ఏవి విరుద్ధధర్మములు గలవో, అవి యేకకాలమున నొకేవస్తువునందు ప్రకాశాంధకారములవలె ఉండవు. అందువలన గ్రంథప్రయోజనముగా సంభవింపవు.

## 24. ద్వితీయాక్షేపమునకుత్తరము మోక్షమందు రెండును సంభవించును.

సకారణముగుజగన్నివృత్తి అధిష్ఠానమైన బ్రహ్మరూపము వేఱు గాదు. ఎట్లనఁగా—సర్పనివృత్తి అధిష్ఠానమైన రజ్జురూపము. సకలమైన కల్పితవస్తువృత్తి అధిష్ఠానరూపమగును[1] పృథక్కుగాదు; ఇది భాష్యకారుల సిద్ధాంతము. అందువలన

1. కల్పితానర్థనివృత్తియందు పక్షములు రెండు—

(1) కల్పితముయొక్కనివృత్తి జ్ఞాతృత్వధర్మముచేత నుపలక్షితమయిన యధిష్ఠానరూపము. ఇది ఒకపక్షము—

నీస్థానమునందు అనర్థనివృత్తి బ్రహ్మరూపముగా నున్నది. ఏలా

దేనియందు జ్ఞాన ముండునో, దానియందే జ్ఞాతృత్వధర్మము ఉండును; స్వయముగ జ్ఞానహీన పదార్థమునం దుండదు. బ్రహ్మాభిన్నమైన మాయయు, మాయాకార్యములయిన భూతభౌతికపదార్థములును అవి యన్నియు జడమనఁగా జ్ఞానహీన మగుటవలన వానియందు జ్ఞాతృత్వము సంభవింపదు. అది జ్ఞానరూప మయిన బ్రహ్మపదార్థమునందే సంభవించును. కనుక సర్వస్థానమునందు అధిష్ఠానము చైతన్యము. [బ్రహ్మము] దానియందు—

అంతఃకరణవిశిష్టమైన ప్రమాతృ చైతన్యంబునందును, మాయావిశిష్టమైన ఈశ్వరచైతన్యంబునందును జ్ఞాతృత్వధర్మము కనఁబడుచున్నది; అయినను విశిష్టచైతన్యంబునందు అధిష్ఠానత్వము సంభవింపదు. [ఈసంగతి ముందు చెప్పఁబడును.] ఈవిధముగా సర్వత్రయధిష్ఠానము శుద్ధచైతన్యమే.

ఈరీతిగా శుద్ధచైతన్యము యధిష్ఠాన ముండినను ఏస్థానంబునందు అధిష్ఠానము నిరుపాధికచైతన్యముండునో, ఆస్థానంబునందు అశుద్ధచైతన్యంబునందును జ్ఞాతృత్వము సంభవింపదు; అది సోపాధికచైతన్యంబునం దుండును.

ఆయా సోపాధిక చైతన్యంబునందును ఘటపటాది, రజ్జుశుక్త్యాద్యుపాధిస్థ చైతన్యంబునందు సంభవింపదు; అది మాయోపాధిస్థ చైతన్యంబునందు, లేక అంతఃకరణోపాధిస్థ చైతన్యంబునందు, లేక అవిద్యోపాధిస్థ చైతన్యంబునం దుండును.

ఆయుపాధిత్రయంబునందును మాయోపాధిగాని అంతఃకరణోపాధిగాని ఈరెండుఉపాధులందు సత్త్వగుణప్రాధాన్యముండుటవలన తదుపాధిస్థచైతన్యంబునందు రజ్జుసర్పాది, శుక్తిరజతాది భ్రాంతిజ్ఞానము జనింపదు; పరిశేష మగు అవిద్యోపాధిస్థ చైతన్యంబునందు జనించును.

ఈప్రకారముగఁ జూచినట్టయిన జ్ఞాతృత్వము చైతన్యమునకు ఏకదేశమునం దుండుటవలన అది చైతన్యముయొక్క యుపలక్షణముగ నున్నది.

గున ననఁగా— సకలానర్థములయొక్క అధిష్ఠానము బ్రహ్మము;

---

[ఉపలక్షణవిచారము పూర్వము మంగళాచరణముయొక్క టిప్పణమునందు వ్రాయఁబడినది.] అందువలన చైతన్యము ఉపలక్షితముగ నున్నది. ఆచైతన్యమే యధిష్ఠాన మగుటవలన అచైతన్యరూపాధిష్ఠానము జ్ఞాతృత్వధర్మముచేత నుపలక్షిత మని చెప్పఁబడియున్నది.

ఈస్థానంబునందు జ్ఞాతృత్వధర్మముచేత నుపలక్షిత మను నీవాక్యమంతయు నధిష్ఠానముయొక్క విశేషణముగ నున్నది. అయినను ఇది స్వరూపభూతవిశేషణ మగుటవలన నిది యధిష్ఠానముయొక్క లక్షణమని యెఱుఁగవలెను. మఱియు నీస్థానంబునందు అధిష్ఠానము అవిద్యోపహితమైన సాక్షిచైతన్యమని యెఱుఁగవలెను.

(2) కల్పితముయొక్కనివృత్తి యధిష్ఠానముకన్న భిన్నమై యనిర్వచనీయము. ఇది రెండవపక్షము.

వీనియందు ప్రథమపక్షము భాష్యకారునిది; మఱియు రెండవపక్షము వాచస్పత్యకారునిది. వానియందు—

(i) ప్రథమపక్షమందు "పురుషుఁడు స్థాణువు" ఈవాక్యమునందు పురుషునియొక్క యభావరూపము స్థాణువుగా నున్నది; ఇది బాధసామానాధికరణ్యముద్వారమున నర్థమగును. అట్లు విధిముఖముచేత సమస్తజగత్తుయొక్క బ్రహ్మరూపతాప్రతిపాదకమయిన "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఈశ్రుతివాక్యముయొక్క అభిప్రాయముగూడ ఈప్రతీయమాన సమస్తజగత్తుయొక్క యభావరూపము బ్రహ్మమని యగుచున్నది. ఇట్లు సర్వము, మఱియు బ్రహ్మము ఈసమానవిభక్తి [రెంటికిని ఒక ప్రథమావిభక్తి] కలిగిన రెండుపదములను బాధసామానాధికరణ్యరూపమగు సంబంధముద్వారమున నర్థమగును; అందువలన కల్పితానర్థముయొక్క నివృత్తి యనఁగా పరమార్థసత్తవలన అత్యంతాభావము బ్రహ్మరూప మగుటవలన మోక్షమందు భావరూపతయొక్కయు, అభావరూపతయొక్కయు అభావముచేత ద్వైతాపత్తిశంక ఘటిల్లదు.

## ఆబ్రహ్మము భావరూపము; ఆకల్పితమైన అనర్థనివృత్తి ఉక్త

(ii) ద్వితీయపక్షమందు "పురుషుఁడు స్థాణువు" ఈ వాక్యమున కర్థము పురుషాభావరూపవిశేషణముచే విశిష్టము స్థాణువు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఈ శ్రుతివాక్యమునకును ఈయర్థము — ఈ ప్రతీయమానమయిన సర్వజగత్తు యొక్క యభావముగలది బ్రహ్మము. మఱియు ఈస్థానమునందు బ్రహ్మము యొక్క విశేషణరూపమయిన యేయభావముగలదో, అది అనిర్వచనీయముగ నున్నది. ఏవస్తు వనిర్వచనీయ మగునో, అది నిజమయిన యధిష్ఠానముకన్న భిన్నముగాదు; అధిష్ఠానరూపమే యగును.

ఈరీతిగా ద్వితీయపక్షస్థనివృత్తియు అధిష్ఠానముకన్న భిన్నము గాదు; అధిష్ఠానరూపమే యగును; అందువలన మోక్షమునందు ద్వైతాపత్తిశంక ఘటిల్లదు.

పైఁజెప్పిన రెండుపక్షములందు ప్రథమపక్షమునందు లాఘవము, ద్వితీయపక్షమునందు గౌరవము గలదు; అందువలన ప్రథమపక్షము శ్రేష్ఠము. రెండుప్రకారములను మోక్షమునందు ద్వైతాపత్తిశంక ఘటిల్లదు.

ఉక్తటిప్పణము ఇంకొక్క ప్రకారముగా చెప్పుచున్నాను—

సర్పము రజ్జువునందుఁ దోఁచుటవలన రజ్జువు సర్పమునకు అధిష్ఠానమని చెప్పఁబడును. మందాంధకారమునందు సర్పభ్రమ యుండును. వెలుఁగు అయిన తోడనే రజ్జువని తెలియఁబడును. ఆక్షణమునందే సర్పనివృత్తి యగును. ఆసర్పనివృత్తి, మఱియు రజ్జుజ్ఞానము ఒకేక్షణమునందు కలుగుటవలన సర్పనివృత్తి యధిష్ఠానరజ్జురూపముగా సిద్ధించును. ఆన్యాయమున అనర్థనివృత్తి యధిష్ఠానమైన బ్రహ్మరూపమని తెలియవలెను.

చూడుము — ఎదివఱకు అజ్ఞానరూపమైన మందాంధకారముండునో, అదివఱకు బ్రహ్మరూపాధిష్ఠానమునందు జన్మమరణాద్యనర్థము కాన్పించుచున్నది; మఱియు ఎప్పుఁడు శ్రవణాదిసాధనమువలన తత్త్వజ్ఞానము జనిం

ప్రకారముగా భావరూపమగుటవలన గ్రంథముయొక్క ప్రయోజనము ఘటిల్లుచున్నది.

---

చునో, అప్పుడు ఆతత్త్వజ్ఞానరూపప్రకాశముచే అధ్యాసరూపానర్థము నివృత్తమై అధిష్ఠానరూపబ్రహ్మమే కనఁబడుచున్నది. [అనుభవ మగుచున్నది] అప్పుడు అయధ్యాసరూపమైన అనర్థముయొక్క నివృత్తి మఱియు నధిష్ఠానరూపమైన బ్రహ్మముయొక్క ప్రతీతి రెండును ఒకేక్షణమునందు కలుగుటవలన ఆయనర్థనివృత్తి బ్రహ్మరూప మని సిద్ధించుచున్నది.

[సచ్చిదానందరూపమైన శుద్ధబ్రహ్మంబునందు స్వరూపభూతమైన విజ్ఞానము వర్తించుచున్నదో, దానికి బ్రహ్మప్రకాశ మను చున్నారు; మఱియు అహం బ్రహ్మాస్మి అను చరమవృత్తిరూపమైన తత్త్వజ్ఞానమునకును బ్రహ్మప్రకాశమనుచున్నారు; వీనిలో ప్రథమబ్రహ్మప్రకాశమునందు అనర్థనివృత్తియోగ్యత లేదు, [ఈసంగతి ముందు చెప్పఁబడును] ద్వితీయప్రకాశమునందు అనర్థనివృత్తియోగ్యత యున్నది. ఇట్లుండఁగా దీనియొక్క యభిప్రాయము ఎఱుఁగక మందబుద్ధిపురుషుఁడు ప్రథమప్రకాశముచేనే యనర్థనివృత్తి యని ఎఱుఁగుచున్నాఁడు. అందువలన ఆయనర్థనివృత్తి ఇచ్చట ఎప్పుడు శ్రవణాదిసాధనమువలన తత్త్వజ్ఞానముజనించునో, అప్పుడు ఆతత్త్వజ్ఞానరూపప్రకాశముచే అని స్పష్టముగా వ్రాయఁబడెను. ఏదైనను వేదాంతగ్రంథము చదువునపుడు నూతనుఁడైన అధికారిపురుషుఁడు ఈసంగతియొక్క స్మరణము ఉంచవలయును.]

అనఘా! ఇప్పుడు నీకు అజ్ఞానరూపమగు గాఢాంధకారము లేదు; మందాంధకారమే యున్నది. ఏలాగున ననఁగా—సుషుప్తియందు గాఢాంధకారమున్నది; అప్పుడు నీకు జగత్తు కనఁబడదు; అట్లు ఇప్పుడును గాఢాంధకార మున్నయెడల ఇప్పుడుకూడ జగత్తు కనఁబడకుండవలసియుండెను; అట్లు కాదు; ఇప్పుడు జగత్తు కనఁబడుచున్నది; దానివలన ఇప్పుడు నీకు

ఈ ప్రకారముగా ఈ అనుబంధసామాన్యనిరూపణనామధేయమగు విచారాబ్ధియొక్క ప్రథమతరంగము ఏ జిజ్ఞాసువైన పురుషుడు శ్రద్ధాపూర్వకముగా శ్రవణము, పఠనము చేయుచున్నాడో, వానియందు దీనదయాళుడగు శ్రీగురునాథుడు కరుణ చేయుచున్నాడు.

---

అజ్ఞానరూపమైన మందాంధకారమే యున్నదని తెలియుము. మఱియు గాఢాంధకారముండుటవలన నీవు వెలుతురు చేయుటకు అశక్యముగ నుంటివి; ఇప్పుడు మందాంధకారముండుటవలన వెలుతురు చేయుటయందు కూడ నీవు సమర్థుడవుగా నున్నావు; ఎందుకు విస్మయము మూర్చుచున్నావు? లెమ్ము! త్వరగా జ్ఞానదీపము ఉజ్జ్వలితము చేయుము. లెమ్ము!!

ఇతి శ్రీమదనుబంధసామాన్యనిరూపణనామధేయమగు
ప్రథమతరంగము సంపూర్ణము





# శ్రీవిచారసాగరము

## ద్వితీయతరంగము



### అనుబంధవిశేషనిరూపణము[1]

### అధికారిఖండనము

### 25. సకారణమగు జగన్నివృత్తీచ్ఛ ఘటిల్లదు?

చతుస్సాధనసంయుక్తుఁడైన వానిని అధికారి యందురు; చతుస్సాధనములందు ముముక్షుత గణింపఁబడినది; [మోక్షేచ్ఛకు ముముక్షుత యని పేరు] సకారణమగు జగన్నివృత్తి, బ్రహ్మ

---

1. ఒకపురుషుఁడు ఇల్లుకట్టుటకు ప్రారంభించును; వాని నొకప్రతివక్షి ఆటంకించును; అప్పుడు వాఁడు రాజుతోఁ జెప్పుకొని, న్యాయము పొంది నిశ్శంకుఁడై మరల ప్రారంభము చేయును. అట్లు గ్రంథకారుఁడు ప్రథమ తరంగమునందు అనుబంధచతుష్టయముయొక్క సామాన్యనిరూపణము చేసెను; వానిని ద్వితీయతరంగముయొక్క పూర్వార్థమున పూర్వపక్షి ఆటంకించును. అప్పుడు గ్రంథకారుఁడు శ్రుతిరూపరాజునొద్ద, యుక్తిరూపమంత్రియొద్దఁ జెప్పుకొని తద్బలమున నిశ్శంకుఁడై మరల ననుబంధనిరూపణము చేయుట కారంభించును. ఈరీతిగా ఈతరంగమునందు పూర్వోక్తానుబంధముయొక్క నిరూపణమే విశేషముగా నున్నది.

ప్రాప్తి చేరి మోక్షమందురు. వానియందు సకారణజగన్నివృత్తి రూపమైన మోక్ష ప్రథమాంశమును ఎవ్వరును ఇచ్ఛింపరు. ఈ సంగతి పూర్వపక్షి ప్రతిపాదించుచున్నాఁడు—

### 26. దుఃఖనివృత్తికొఱకు సాజ్ఞానజగన్నివృత్తీచ్ఛ ఘటిల్లదు

మూలావిద్యాసహితమైన జగన్నివృత్తీచ్ఛను వివేకిపురుషుఁడు చేయఁడు; మఱేమనఁగా— త్రివిధమై యేదుఃఖము [1] గలదో, తన్నాశమును వివేకిపురుషుఁడు ఇచ్ఛించును. దాని కీ యభిప్రాయము— దుఃఖము మూఁడువిధములుగలది— మొదటిది ఆధ్యాత్మికము, రెండవది ఆధిభౌతికము, మూఁడవది ఆధిదైవికము. వీనిలో—

(1) రోగక్షుధాదికమువలన నైన దుఃఖము ఆధ్యాత్మికము. [2]

(2) చోరవ్యాఘ్రసర్పాదికమువలన నైన దుఃఖము ఆధిభౌతికము. [3]

---

1. ఏపురుషుఁడును భిక్షుకులకు జడిసి అన్నత్యాగేచ్ఛ చేయఁడు, పేలకు భయపడి శిఖాత్యాగేచ్ఛ చేయఁడు; పశుపక్ష్యాది భయమువలన క్షేత్రత్యాగేచ్ఛ చేయఁడు. అట్లు వివేకియైన పురుషుఁడును త్రివిధదుఃఖభయమున సకారణజగన్నివృత్తి నిచ్ఛింపఁడు; మఱేమనఁగా— త్రివిధదుఃఖనాశమునే యిచ్ఛించును. ఇది సాంఖ్యమతానుసారి శంకగా నున్నది.

2. ఆత్మను ఆశ్రయించి యుండునట్టి స్థూలసూక్ష్మశరీరాదికమును అధ్యాత్మమందురు; దానివలన పుట్టినదుఃఖము ఆధ్యాత్మికము.

3. స్వసంఘాతముకన్న భిన్నమై జ్ఞానేంద్రియములకు విషయమయిన దానిని అధిభూత మందురు; దానివలన పుట్టిన దుఃఖమును ఆధిభౌతికమందురు.

(3) యక్షరాక్షసప్రేతగ్రహాశీతవాతాతపములవలననైన దుఃఖము ఆధిదైవికము [1]

ఈప్రకారమైన త్రివిధదుఃఖమును నాశము చేయుటకు ప్రతిపురుషుఁడు నిచ్ఛించును. ఆదుఃఖభిన్నమైన పదార్థము యొక్క నాశమును ఏపురుషుఁడును ఇచ్ఛింపఁడు. అందువలన అజ్ఞానసహితజగన్నివృత్తీచ్ఛ యెవ్వరికిని ఘటిల్లదు?

సిద్ధాంతి యిట్లనును—"అజ్ఞానసహితసకలజగన్నివృత్తి గాక కేవలదుఃఖనివృత్తి గాఁజాలదు; గనుక దుఃఖనివృత్తికోరిన వారు సకలపురుషులు దుఃఖనివృత్తినిమిత్తము అజ్ఞానసహిత జగన్నివృత్తిని కోరెదరు." ఆమాట ఘటిల్లదు. ఏలయన—

ఆయుర్వేదోక్తౌషధము చేత రోగజన్యదుఃఖనివృత్తి యగును; భోజనమువలన క్షుధాజన్యదుఃఖనివృత్తి యగును; ఈరీతిగా ఆయా యుపాయము చేత సర్వదుఃఖనివృత్తి యగును. ఈప్రకారముగా సాజ్ఞానజగన్నివృత్తిలేకయు దుఃఖనివృత్తి ఘటిల్లును. ఇట్లు దుఃఖనివృత్త్యర్థము సాజ్ఞానజగన్నివృత్తియొక్క ఇచ్ఛ యెప్పుడును ఘటిల్లదు?

## 27. బ్రహ్మప్రాప్తిరూపమోక్షద్వితీయాంశేచ్ఛయు ఘటిల్లదు

ఏవస్తువుయొక్క అనుభవముగునో, తత్ప్రాప్తీచ్ఛ గలుగును; అనుభవము గలుగదో, తద్వస్తుప్రాప్తీచ్ఛ గలుగదు. ఎట్లనఁగా—అన్యదేశములయందలి యనంతపదార్థములు అజ్ఞా

1. స్వసంఘాతముకన్న భిన్నమై జ్ఞానేంద్రియములకు అవిషయమైన వానిని అధిదైవమందురు; దానివలన పుట్టినదుఃఖమును అధిదైవిక మందురు.

తీయము లుండినను తత్ప్రాప్తీచ్ఛ యేపురుషునకు నెప్పటికిని పొడమదు.[1]

ఇచ్చట అధికారియైన పురుషునకు బ్రహ్మజ్ఞానము లేమి వలన వానికి బ్రహ్మప్రాప్తీచ్ఛ గలుగదు; ఎవనికి బ్రహ్మజ్ఞానము గలదో; వాఁ డధికారియే గాఁడు; మఱియేమనఁగా— వాఁడు ముక్తుఁడు; వానికి బ్రహ్మప్రాప్తీచ్ఛ ఘటిల్లదు. ఉక్తప్రకారముగా వేదాంతశ్రవణముకన్న మున్ను తెలియఁబడని యేబ్రహ్మము గలదో, తత్ప్రాప్తీచ్ఛ యెవరికిని ఘటిల్లదు?

ఈరీతిగా సాజ్ఞానజగన్నివృత్తిరూపమై బ్రహ్మప్రాప్తిరూపమైన మోక్షముం దిచ్ఛ యెవనికిని ఘటిల్లదు. కాఁబట్టి ముముక్షువు ఎవ్వఁడును గాఁడు?

## 28. అన్యరీతివలన అధికార్యభావము

సర్వపురుషులు విషయసుఖమును ఇచ్ఛించుచున్నారు. మఱియు నెవ్వఁడేని సకల విషయత్యాగము చేసి తపస్సునందు ఆరూఢుఁడగునో, వాఁడును పరలోకముయొక్క ఉత్తమభోగములనిచ్ఛించి నానావిధక్లేశములను సహించును.

ఈరీతిగా ఈలోకముయొక్క, లేక పరలోకముయొక్క విషయసుఖమునే యందఱును అభిలషింతురు. ఆవిషయసుఖము మోక్షమునందు లేదు; జగత్తునం దుండును; గనుక మోక్షమార్గమును ఏపురుషుఁడు నిచ్ఛింపఁడు అని సిద్ధించును.

---

1. పూర్వానుభూతమైన వస్తువుయొక్క ఇచ్ఛ జనించును; బ్రహ్మరూపాధిష్ఠానముయొక్క జ్ఞానమువలన కారణసహితజగన్నివృత్తియొక్క అనుభవము పూర్వమెన్నఁడును చేయలేదు; గనుక సకారణజగన్నివృత్తీచ్ఛ ఎవ్వరికిని ఘటిల్లదు. ఇది పూర్వపక్షియొక్క శంకను బలపఱచునట్టి ఆక్షేపము.

మఱియు సకలపురుషులకు విషయసుఖేచ్ఛ కలుగును; దానివలన వైరాగ్యశమదమాదులును ఎవరికిని ఘటిల్లవు; కాబట్టి సాధనచతుష్టయసహితుఁడయిన యధికారియొక్క అభావ మగుటవలన గ్రంథారంభము నిష్ఫలము?

విషయఖండనము

## 29. జీవబ్రహ్మలయేకత కూడదు

జీవబ్రహ్మలయేకత గ్రంథవిషయ మని సిద్ధాంతి చెప్పెను; అది ఘటిల్లదు. ఏలయన— బ్రహ్మమో, అవిద్య [1] అస్మిత[2]

---

1. ఏది విచారము చేసినవెనుక యుండుటలేదో, విచారము లేనప్పుడు మాత్రముండునో, దానిని అవిద్య యందురు. ఆయవిద్య మూల, తూల యను భేదములచేత రెండువిధములు గలది. వీనిలో—

(1) ఏది శుద్ధచైతన్యము నాచ్ఛాదించునో; అది మూలావిద్య యనఁబడును. (2) ఏది ఘటాద్యుపాధిగల చైతన్యము నాచ్ఛాదించునో, అది తూలావిద్య యనఁబడును.

వీనిలో మూలావిద్యయుం కారణకార్యభేదములవలన రెండువిధములుగా నున్నది—

(1) ఆవరణవిక్షేపశక్తులుగల అనాదిభావరూప మేది గలదో, అది కారణరూపము. (2) ఒక్కదానియందు అన్యబుద్ధిరూపమైన దేది గలదో, అది కార్యరూపము. ఈకార్యరూపమూలావిద్యయుం నాలుగువిధములుగా నున్నది—

(i) అనాత్మయైన దేహాదికమునందు ఆత్మబుద్ధి.

(ii) అనిత్యమైన ఆకాశాదికమునందు నిత్యబుద్ధి.

(iii) దుఃఖరూపమైన ధనాదికమునందు సుఖబుద్ధి.

(iv) అశుచియైన స్త్రీపుత్త్రముఖ చుంబనాదులందు శుచిబుద్ధి.

ఇచ్చట పంచక్లేశముల ప్రసంగమునందు ఉక్త చతుర్విధములయిన కార్యరూపావిద్యయొక్క గ్రహణము గలదు.

2 బుద్ధియొక్కయుం, ఆత్మయొక్కయుం ఏకతా ప్రతీతి అస్మిత

రాగము [1] ద్వేషము [2] అభినివేశము [3] ఈపంచక్లేశములు లేనిది, విభువు [వ్యాపకము] ఒక్కటి, సజాతీయాదిభేదరహితము [4] జీవునియందు సర్వక్లేశములు గలవు; జీవుఁడు పరిచ్ఛిన్నుఁడు; మఱియు ననేకుఁడు. ఏలయనఁగా— ఎన్నిశరీరములు గలవో,

---

యందురు. దానినే సామాన్యాహంకారమనియుం అందురు. సకలాహంతలు, సకల మమతలు దీనియందే అంతర్భూతము లగును.

1. అనుకూలతయొక్క జ్ఞానమువలన జన్యమైన యేబుద్ధివృత్తిగలదో; అది రాగ మనఁబడును.

2. ప్రతికూలతయొక్క జ్ఞానమువలన జన్యమైన యేబుద్ధివృత్తి గలదో, అది ద్వేష మనఁబడును.

3. మరణభయమువలన శరీరరక్షణమునందు ఏయాగ్రహము గలదో, అది అభినివేశ మనఁబడును. మరణసంబంధమయిన చింతలన్నియుం దీనియందే అంతర్భూతము లని యెఱుఁగవలయును.

4. భేదత్రయవిచారము

"వృక్షస్య స్వగతో భేదః పత్రపుష్పఫలాదితః,
వృక్షాంతరాత్సజాతీయో విజాతీయశ్శిలాదితః." ప. ద.

భావార్థము—పత్రపుష్పఫలములు వృక్షముయొక్క స్వగతభేదము; అన్యవృక్షములు ఆవృక్షముయొక్క సజాతీయభేదము; రాలు, మన్ను మొదలగునవి విజాతీయభేదము. ఈవిధముగా వృక్షాదిపదార్థములందు మూఁడు భేదములు వర్తించుచున్నవి. అట్లు బ్రహ్మమునందు మూఁడుభేదములు వర్తించుటకు సంభవము లేదు. పెక్కులేల? ఒకటికూడ సంభవింపదు. చూడుము—

(1) సర్వము ఒకటే బ్రహ్మస్వరూపమై ఉండుటవలన సజాతీయముగు అన్యబ్రహ్మము లేనందువలన బ్రహ్మము సజాతీయభేదరహితము.

అన్ని జీవులు గలరు. సర్వశరీరములందు నొకజీవుఁడయినపక్షమందు నొకశరీరమున సుఖదుఃఖములగుటవలన సర్వశరీరములందు సుఖదుఃఖములు గలుగవలసియుండును; అట్లు గలుగదుండుటవలన నానాగా నున్నాఁడు. మఱియు నానాగా నుండుటవలన సజాతీయాది భేదరహితుఁడు.

మఱియు వేదాంతి చెప్పెను—"సుఖదుఃఖము మొదలు గాని యంతఃకరణధర్మములు; ఆయంతఃకరణ మనేకమగుటవలన నొకటిసుఖదుఃఖి అయినంతట అన్నియు సుఖదుఃఖులు గాఁజాలవు. సాక్షియో, సుఖదుఃఖరహితుఁడు; ఏకుఁడు; సర్వక్లేశరహితుఁడు; వానికి బ్రహ్మముతో ఏకత [1] ఘటిల్లును." ఆమాటయు ఘటిల్లదు. ఏల యన—

---

(2) బ్రహ్మముకన్న అన్యముగాఁ దోఁచు ప్రపంచము విజాతీయమన వలయును; ఆప్రపంచము సత్యముగాదు; రజ్జుసర్పమువలె మిథ్యగా నున్నది; ఏది మిథ్యయో, అది అధిష్ఠానముకన్న వేఱుగాదు; గనుక బ్రహ్మము విజాతీయభేదరహితము.

(3) ఘటపటాదికమువలె ఏది అవయవము గలదియో, అది స్వగతభేదముగలదిగా నుండును; బ్రహ్మమో, నిరవయవమై యున్నది. చక్కెరయొక్క శ్వేతమృదుమధురలక్షణములవలె సచ్చిదానందములు బ్రహ్మమునకు లక్షణములుగాని అవయవములు గావు; గనుక బ్రహ్మము స్వగతభేదరహితము.

ఈరీతిగా బ్రహ్మము త్రివిధభేదరహితముగా నున్నది.

1 జీవబ్రహ్మైక్యవిషయమునందు శంకాసమాధానములు—

(1) ఆక్షేపము—సర్వశరీరములందును ఒకఁడేయాత్మ యుండిన యెడల బ్రహ్మమునకు ఆత్మకు ఏకత్వము చెప్పవచ్చును; అనేకశరీరములందు ఆత్మ యనేకముగా నుండుటవలన ఏకత్వము చెప్పఁగూడదు.

## 30. సాక్షియొక్క నానాత్వము

కర్తయు, భోక్తయు నయిన యేజీవుఁడు గలఁడో,

సమాధానము—ఆత్మ అనేకమనుటకు ఏప్రమాణము లేదు. ఇంద్రియములచేత అజ్ఞానులకుఁ దోఁచుభేదము శరీరమును పొందినదిగా నున్నదేగాని ఆత్మను పొందలేదు. ఏలయన—ఆత్మయో, శ్రుతితప్ప అన్య ప్రమాణములచేత నెఱుఁగఁదగినవాఁడు గాఁడు; శ్రుతియో, ఆత్మ ఒకఁడని చెప్పుచున్నది ! కాఁబట్టి అనేకశరీరములందుండు ఆత్మ వేఱువేఱు గాఁడు అనేకఘటములందుండు ఆకాశము ఏకముగా నుండునట్లు అనేక శరీరములందుండు ఆత్మ ఒక్కఁడే; వానికి బ్రహ్మమునకు ఏకత చెప్పవచ్చును.

(2) ఆక్షేపము—ఆత్మ అనేకమనుటయందు ప్రమాణము లేదని చెప్పినది సరిగాదు. ఏలయన—అనేకమనుటకు అనేకప్రమాణములు గలవు ! చూడుము—

(i) నేను నీను అను భేదముండుటకు ఆత్మ యనేకమనుట ప్రత్యక్షమే; ప్రతిదేహమునందు నేను బ్రాహ్మణుఁడను, నేను శూద్రుఁడను అని భేదము ప్రసిద్ధముగా నున్నది. ఇది ప్రత్యక్షప్రమాణము.

(ii) ఆత్మ వేఱువేఱు గానియెడల నీవు నే నను వ్యవహారము సిద్ధింపదు. వ్యవహార ముండుటవలన భేదము నంగీకరింపవలయును. ఇది యర్థాపత్తి ప్రమాణము.

(iii) ఘటములు వేర్వేఱయి కనఁబడునట్లు శరీరములు వేఱువేఱుగా కనఁబడుటవలనను, ప్రతిశరీరమునందు నేనను ప్రతీతి యుండుటవలనను ఆత్మ అనేకమనుటయందు ఉపమానప్రమాణము.

(iv) శ్రుతులందును, పురాణములందును దేవగంధర్వమనుష్యదానవ యక్షరాక్షసాదులు మొదలగు భేదములు వర్ణింపఁబడినవి. ఇది ఆత్మ యనేకమనుటయందు శబ్దప్రమాణము.

వానికన్న భిన్నుఁడైన సాక్షి వంధ్యాపుత్రసమానుఁడుగా నున్నాఁడు. ఒకానొకప్పుడు సాక్షిని నంగీకరింతుమేని వాఁడును

(v) ఆత్మ యొక్కఁడైనయెడల ఒక్కని సుఖదుఃఖములు అందఱికిని కావలయును; ఒక్కఁడు జ్ఞానియైన అందఱు జ్ఞానులు గావలయును; అప్పుడు విధినిషేధశాస్త్రములు వ్యర్థము లగును. ఇది ఆత్మ యనేక మనుట యందు అనుమాన ప్రమాణము.

2. సమాధానము—

(i) నేను నేనను భేదము దోఁచుటవలన ఆత్మ యనేకమనుట సిద్ధింపదు. ఏలయన—నేను బాలుఁడను, నేను తరుణుఁడను, నేను వృద్ధుఁడను అని చెప్పుటయందు శిశుత్వము మొదలగు అవస్థారూపమైన విశేషణభేదములు సిద్ధించుచున్నవి; గాని ఆత్మభేదములు సిద్ధింపవు; నేననుశబ్దముయొక్క యర్థమైన ఒకఁడేమాత్మ సకలావస్థలందున్నాఁడని సిద్ధించినది. మఱియు భిన్నభిన్నమైన యవస్థలందు ఆత్మ భిన్నభిన్నుఁడని చెప్పినట్లయిన బాల్యాద్యవస్థలందు చేసినవ్యవహారముయొక్క స్మృతి వృద్ధావస్థయందు గాకుండవలసియుండెడి. ఈరీతిగా అనేకస్థానములందు నేను నేను అనుటవలన ఆత్మ యనేక మనుటయందు ప్రత్యక్షప్రమాణము సిద్ధింపదు.

(ii) ఒకదేశరీరమునందు అవయవభేదములవలన తల, కాలు మొదలయిన వ్యవహారము సిద్ధించుచున్నది; ఈవ్యవహారసిద్ధినిమిత్తము శరీరములు అనేకములు సిద్ధింపవు. అట్లు నీవు నేనను వ్యవహారసిద్ధి కొఱకును ఆత్మ అనేకములు సిద్ధింపవు. ఈరీతిగా అర్థాపత్తి ప్రమాణము సిద్ధింపదు.

(iii) ప్రతిశరీరమునందు రూపభేదముగుటవలనను,ఆ ప్రతిశరీరమునందు నేను నేనను భావము ఏర్పడుటవలనను నానాకారములుగల నానాఘటములవలె నుపమానప్రమాణముచేత ఆత్మ నానా యనుట ఘటిల్లదు. ఏలయన— స్థూలసూక్ష్మకారణశరీరములయొక్క రూపములు [లక్షణములు] వేర్వేఱుగా నుండినను వానియందు స్థితుఁడైన నేనుశబ్దార్థమైన ఆత్మయందు భేదము ఘటిల్లదు. ఈ ప్రకారముగా నుపమానప్రమాణము సిద్ధింపదు.

నొకఁడుగా సిద్ధింపఁడు; వాఁడును నానా యని యంగీకరింప వలసివచ్చును. ఏలయన ఇది వేదాంతసిద్ధాంతము—అంతఃకరణ మును, సుఖదుఃఖాది తద్ధర్మములును ఇవి ఇంద్రియములకును, అంతఃకరణమునకును విషయములు గావు; మఱేమనఁగా—ఇవి సాక్షివిషయములు. చూడుము—

(iv) నానాశరీరములందును ఉండునట్టిచైతన్యము ఒకటిగానుండుట వలన శ్రుతిపురాణములందు చెప్పిన దేవగంధర్వాదిభేదము ఆత్మను పొందినది గాదు. ఆత్మోపాధియైన దేహమును పొందినదిగా నుండును, ఈరీతిగా శ్రుతి ప్రమాణము [శబ్దప్రమాణము] సిద్ధింపదు.

(v) సుఖదుఃఖములు ప్రారబ్ధమున ననుసరించి యుండును; ప్రతిశరీరము నందు కర్మభేదమువలన ఆసుఖదుఃఖాదులు విచిత్రముగాఁ గనఁబడును; మఱియు చిదాభాససహితాంతఃకరణరూపమైన భోక్తృభేదమువలన సుఖ దుఃఖములు భేదపడును; ఆసుఖదుఃఖభేదమువలన ఆత్మయందు భేదము ఘటిల్లదు. ఆత్మ ఎల్లప్పుడును సకలము నెఱుఁగువాఁడైనను ఆయాబుద్ధి ననుసరించియే ఎఱుఁగును; దేహభేదమువలన బుద్ధియందు భేద మగుచున్నది; దీనివలన జ్ఞానము భేదపడుచున్నది. ఏలయన—బుద్ధివృత్తికి సంబంధమగు వస్తువే ప్రకాశించును; వేఱేమియుం బ్రకాశింపదు. ఎట్లనఁగా—శబ్దమునిచ్చు ఆకాశము అంతట వ్యాపించి యుండినను మృదంగాదికముతో ఆకాశము సంబంధపడినను కరాభిఘాతముచేతనే దానియందు శబ్దము గలుగును [ప్రకట మగును] మిగతచోటులందు గలుగదు. ఈరీతిగా ఆత్మ యొక్కఁడై, పూర్ణుఁడై యుండినను ఎప్పుడు ఏచోట బుద్ధివృత్తికి పదార్థమునకు సంబంధముగలుగునో, అప్పుడు ఆచోట జ్ఞానోదయమగును; మిగతచోటులఁ గలుగదు. ఆబుద్ధివృత్తి యనేకమై యుండుటవలన ఒకఁడు సర్వజ్ఞుఁడైనప్పుడు అందఱికి సర్వజ్ఞ త్వము సిద్ధింపదు. ఆ తక్కిన అల్పజ్ఞులనుగుఱించి ప్రవృత్తికి కారణ మగు విధినిషేధశాస్త్రములు వ్యర్థములు గావు. ఈరీతిగా అనుమానప్రమాణము సిద్ధింపదు.

పైఁజెప్పిన ఆక్షేపములు సిద్ధింపమివలన జీవబ్రహ్మైక్యము సిద్ధించును.

ఇంద్రియములయినవో, పంచీకృతభూతములను, తత్కార్యములను ఎఱుఁగును. వానిలో నిన్ని భేదములు గలవు— నేత్రేంద్రియము రూపవంతమయిన వస్తువుయొక్క రూప[1]మును, తదాశ్రయమును రెంటిని ఎఱుఁగును. ఎట్లనఁగా—నీల పీతాదికమయిన ఘటముయొక్క రూపము, మఱియు తదాశ్రయమయిన కంబుగ్రీవాది లక్షణముగల ఘటమును నేత్రేంద్రియము విషయములు చేయును. త్వగింద్రియము స్పర్శ[2]మును, తదాశ్రయమును రెంటిని విషయము చేయును. రసన, ఘ్రాణము, శ్రవణము ఈమూఁడును, రసగంధశబ్ద[3]మాత్రములను విషయము చేయును; తత్తదాశ్రయములను విష

---

1. ఇచ్చట రూపశబ్దముచేత రూపమునకు ఆశ్రయమై వ్యాపక [అధిక దేశవృత్తి] మగు రూపత్వజాతికిని, రూపత్వమునకు వ్యాప్య [అంతర్గత న్యూనదేశవృత్తి] ములగు శుక్లనీలతాది సప్తజాతులకును గ్రహణము గలదు.

2. ఇచ్చట స్పర్శశబ్దముచేత స్పర్శమునకాశ్రయమైన వ్యాపకమగు స్పర్శత్వజాతికిని, స్పర్శత్వమునకు వ్యాప్యములగు కాఠిన్యకోమలత్వాది చతుర్జాతులకును గ్రహణము గలదు.

3. ఇచ్చట రసము, గంధము, శబ్దము వీనిచేత క్రమముగా రసత్వగంధత్వశబ్దత్వములను మూఁడు జాతులకును, మఱియు రసత్వమునకు వ్యాప్యములగు మధురత్వాది షడ్జాతులకును, మఱియు గంధత్వమునకు వ్యాప్యములగు సుగంధత్వదుర్గంధత్వములను రెండుజాతులకును, మఱియు శబ్దమునకు వ్యాప్యములగు తారత్వమందత్వరూపములగు రెండుజాతులకును గ్రహణము గలదు. [ఇచ్చట 1, 2, 3 టిప్పణములందు ఏవిచారము వ్రాయఁబడినదో, అది ఇచ్చట విశేషముగ సూక్ష్మవిచారముయొక్క ఆవశ్యకత లేదని ఎఱిఁగి సామాన్యతః స్థూలవిచారమే వ్రాయఁబడినది; విశేషముగ సూక్ష్మవిచారము ప్రసంగమును జూచి ముందు వ్రాయఁబడును.]

యము చేయవు. గనుక నీమాటవలన అంతఃకరణజ్ఞానము ఘటిల్లదు. మఱియు నేత్రత్వక్కులచేతను అంతఃకరణజ్ఞానము ఘటిల్లదు. ఏలయన పంచీకృతభూతము, మఱియు తత్కార్యము ఏది రూపవంతము, లేక స్పర్శవంతముయిన పదార్థమగునో, అది నేత్రత్వక్కులకు విషయమగును; అంతఃకరణమో, అపంచీకృతభూతముల కార్యమగుటవలన నేత్రత్వక్కులకు విషయము గాదు. ఈ కారణమువలననే అపంచీకృతభూతకార్యమయిన నేత్రేంద్రియమును నేత్రమునకు విషయము గాదు.

మఱియు బాహ్యవస్తువులు ఇంద్రియములకు విషయములు; అంతఃకరణమో, ఇంద్రియాపేక్షచేత ఆంతరము; అందువలన అది ఇంద్రియములకు విషయము గాదు.

మఱియు అంతఃకరణవృత్తికిని అంతఃకరణము విషయము
[1] గాదు. ఏలయన—అంతఃకరణము తనవృత్తికి ఆశ్రయముగ

---

1. ఎట్లు గృహముయొక్క మధ్యభాగము అంధకారమునకు ఆశ్రయమగునో, మఱియు విషయముకై యుండునో, మఱియు ఎట్లు చైతన్యము అజ్ఞానమునకు ఆశ్రయమగునో, విషయముకై యుండునో, అట్లు అంతఃకరణము వృత్తికి ఆశ్రయముగా నున్నది; అందువలన నది వృత్తికి విషయము గావలయును; అయినను దీనిలో ఈరహస్యము గలదు—గృహమధ్యమందు అంధకారాదిన్యాయమున ఎక్కడ ఆశ్రయాశ్రితములకు భేదము గలదో, అక్కడ ఒక్కటేవస్తువు ఆశ్రయము, మఱియు విషయముగా నున్నది. ఎచ్చట అగ్నిదాహన్యాయమున ఆశ్రయాశ్రితములకు భేదము లేదో, అచ్చట ఆశ్రయము, మఱియు విషయము ఒకటిగా నేరదు. ఎందువలన అంతఃకరణమునకు వృత్తికిని భేదము లేదో, అందువలన అంతఃకరణము వృత్తికి ఆశ్రయము గాని విషయము గాదు.

నున్నది. ఎట్లు అగ్ని దాహకత్వమున కాశ్రయముగనుండి అది దాహకత్వమునకు విషయముగాదో, అగ్నికన్న భిన్నమయిన కాష్ఠాదిపదార్థము దాహకత్వమునకు విషయమగునో, అట్లే అంతఃకరణముకన్న భిన్నమయిన వస్తువే అంతఃకరణాశ్రితవృత్తికి విషయమగును; అంతఃకరణము గాదు.

అట్లె అంతఃకరణముయొక్క సుఖాదిధర్మమును అంతఃకరణవృత్తికి విషయము గాదు. ఏలయన—ఆవృత్తి అంతఃకరణమును విషయము చేయునేని తద్ధర్మమును విషయము చేయును; ఆవృత్తి అంతఃకరణమునకు సమ్ముఖముగానే పోదు; కాఁబట్టి అంతఃకరణమును, తద్ధర్మమును విషయము చేయదు.

ఇది నియమము—ఏది వృత్తియొక్క ఆశ్రయముకన్న కొంచెము దూరవస్తువగునో, అది వృత్తికి విషయమగును; అత్యంతసమీపవస్తువు వృత్తికి విషయము గాఁజాలదు. ఎట్లు నేత్రవృత్తికి ఆశ్రయమైన నేత్రమునకు దానికి అత్యంతసమీపమయినయంజనమును నేత్రవృత్తి [1] విషయము చేయదో,

---

1. నేత్రేంద్రియము తనకన్న దూరస్థితమైన అన్యమగు సర్వరూపవద్వస్తువును ప్రకాశింపచేయును; అయినను మందత్వపటుత్వధర్మసహితమగు తన్ను ప్రకాశింపజేయనేరదు. మఱియు నేత్రదేశస్థితమగు అంతఃకరణము ఉక్తధర్మసహితనేత్రమును ప్రకాశింపచేయును. అట్లు అంతఃకరణమును తనకన్న భిన్నమగు సర్వజడవస్తువును ప్రకాశము చేయును; అయినను సుఖాదిధర్మసహితమగు తన్ను తానే ప్రకాశింపచేయనేరదు; మఱేమనఁగా—సాభాసమగు నంతఃకరణమందారూఢుఁడైన యేసాక్షిగలఁడో, వాఁడు ధర్మసహితాంతఃకరణమును ప్రకాశింపజేయును. కాఁబట్టి సాభాసాంతఃకరణము ఆపేక్షిక స్వయంప్రకాశముగా నున్నది; నిరపేక్షస్వయంప్రకాశము గాదు

అట్లు అంతఃకరణవృత్తికి ఆశ్రయమైయున్న అంతఃకరణమును మఱియుదానికి అత్యంతసమీపమైయున్న సుఖదుఃఖాదిధర్మములను అంతఃకరణవృత్తి విషయము చేయదు.

ఈరీతిగా సధర్మాంతఃకరణమునకు అంతఃకరణమువలన, లేక దానివృత్తివలన, లేక ఇంద్రియమువలన భానము ఘటిల్లదు; మఱేమనఁగా—అది సాక్షివిషయము.

ఆసాక్షి యొకఁడేయని యంగీకరించినట్టయిన ఎట్లు ఏకాంతఃకరణమునందలి సుఖదుఃఖములకు సాక్షిచేత భానమగునో, అట్లే సర్వులయొక్క సుఖదుఃఖభానమును ఆసాక్షిచేఁ గావలసియుండును; అదియో, ఘటిల్లదు; అందువలన సాక్షి నానాగా వలయును. మఱియు నానాసాక్ష్యంగీకారమువలన దోషమును లేదు. ఏలయన—ఏసాక్షి కుపాధి ఏయంతఃకరణమో, ఆసాక్షి వలన ఆయంతఃకరణధర్మముయొక్క భానము గలుగును; గనుక సర్వులయొక్క సుఖదుఃఖభానము గలుగదు. ఈరీతిగా సిద్ధమైన యే నానాసాక్షులు గలరో, ఆనానాసాక్షులకు ఏకబ్రహ్మము తోడ ఏకత ఘటిల్లదు.

## ప్రయోజనఖండనము

**31. మిథ్యాబంధమునకు సామగ్రి లేదు; సత్యబంధనివృత్తి జ్ఞానముచేత ఘటిల్లదు**

అహంకారమాదిగా నేది యనాత్మవస్తువు గలదో,

---

మఱియు సాక్షి తనప్రకాశమందు అన్యప్రకాశమును అపేక్షింపక సర్వప్రకాశకుఁడుగా నున్నాఁడు; కనుక వాఁడు నిరపేక్షస్వయంప్రకాశుఁడుగా నున్నాఁడు.

గానిని బంధమందురు. ఆబంధము అధ్యాసరూప[1] మైనట్టియిన జ్ఞానముచేత నివృత్తమగును; అధ్యాసరూపము గాదేని

---

1. స్వకీయము అభావముయొక్క అధికరణమందు ఏఅవభాసము విషయము, మఱియు తద్జ్ఞానము] గలదో, దానిని అధ్యాసమందురు. ఎట్లనఁగా కల్పితసర్పముయొక్క వ్యావహారికము, లేక పారమార్థికమయిన అభావముయొక్క అధికరణము [ఆశ్రయము] అయిన రజ్జువునందు ప్రాతిభాసికమగు సర్పముయొక్క అవభాసము [సర్పము, మఱియు తద్జ్ఞానము] ఏది గలదో, అది అధ్యాసమనఁబడును. లేక అధిష్ఠానముకన్న విషమసత్తగల ఏయవభాసము గలదో, దానిని అధ్యాస మందురు. ఎట్లనఁగా వ్యావహారికసత్తగల రజ్జురూపాధిష్ఠానముకన్న విషమ [విపరీతము, లేక వ్యత్యస్తము] సత్తగల యేయవభాసము గలదో, దానిని అధ్యాసమందురు. ఇచ్చట వ్యావహారికసత్తగల రజ్జుస్థానమునందు ప్రాతిభాసికసత్తగల సర్పము మఱియు తద్జ్ఞానము నుండుటవలన ఈయవభాసమును విషమసత్తగలిగియే యున్నది.

అర్థాధ్యాసము, జ్ఞానాధ్యాసము అను భేదమువలన అధ్యాసము రెండువిధములు. వానిలో—

(1) భ్రాంతిజ్ఞానవిషయమైన యేసర్పాది మిథ్యావస్తువు గలదో, అది అర్థాధ్యాస మనఁబడును.

(2) భ్రాంతిజ్ఞాన [మిథ్యావస్తువుయొక్క మిథ్యాజ్ఞానము] మేది గలదో, అది జ్ఞానాధ్యాస మనఁబడును.

వీనిలో జ్ఞానాధ్యాసము పరోక్షాపరోక్షభేదమువలన రెండువిధములుగా నున్నది. మఱియును అర్థాధ్యాసము మొదటిది కేవల సంబంధాధ్యాసము, రెండవది సంబంధసహిత సంబంధ్యధ్యాసము, మూఁడవది కేవల ధర్మాధ్యాసము, నాలుగవది ధర్మసహితధర్మ్యధ్యాసము, అయిదవది అన్యోన్యాధ్యాసము, ఆఱవది అన్యతరాధ్యాసము ఈభేదమువలన ఆఱువిధములు

జ్ఞానముచేత నివృత్తము గానేరదు. ఏలయన—జ్ఞానమునకిది స్వభావము—ఎప్పుడు ఏవస్తువుయొక్క జ్ఞానమగుచున్నదో, అప్పుడు ఆవస్తుజ్ఞానము ఆవస్తువునందుఁగల అధ్యాసమును, అజ్ఞానమును దూరము చేయును. ఎట్లనఁగా—రజ్జుజ్ఞానము రజ్జువునందుఁగల సర్పాధ్యాసమును, రజ్జ్వజ్ఞానమును దూరము చేయును. [భ్రాంతిజ్ఞానవిషయమైన దేమిథ్యావస్తువు గలదో, అది భ్రాంతిజ్ఞానమునుచేసి అధ్యాసము] ఏవస్తువు మిథ్యగాదో, మఱేమనఁగా—సత్యమో, దాని నివృత్తి జ్ఞానముచేతఁ గాఁజాలదు. అట్లు ఆత్మయందు అహంకారము మొదలుగాఁగల బంధము అధ్యాసరూపమయినప్పుడు జ్ఞానముచేత నివృత్తమగును; ఆత్మయందో, మిథ్యాబంధముయొక్క సామగ్రి లేనే లేదు; బంధమో, ప్రతీతమై యున్నది; ఇట్లు ఆబంధము మిథ్యగాదు; మఱేమనఁగా—సత్యమే. ఆసత్యబంధముయొక్క నివృత్తి జ్ఞానమువలనఁ గావలయునను ఆశ నిష్ఫలము.

## 32. అధ్యాససామగ్రి[1]

మొదటిది సత్యవస్తుజ్ఞానజన్యసంస్కారము, రెండవది ప్రమాతృదోషము, మూఁడవది ప్రమాణదోషము, నాలుగవది ప్రమేయదోషము, అయిదవది అధిష్ఠానసామాన్యరూపజ్ఞానము

---

గలదిగా నున్నది. లేక సంసర్గాధ్యాసము, స్వరూపాధ్యాసము ఈభేదమువలన అర్థాధ్యాసము రెండువిధములుగలదిగా నున్నది. అధ్యాసముయొక్క సవిస్తర విచారము ప్రసంగమునుజూచి ముందు వ్రాయఁబడును.

1. కారణసముదాయమును సామగ్రి యందురు. ఇంధనములు, చుల్లి మొదలయినవి పాకసామగ్రి అయినట్లు.

ఆఱవది అధిష్ఠానవిశేషరూపాజ్ఞానము ఇవి యన్నియు అధ్యాస సామగ్రి అనవలయును. చూడుము—

(1) శుక్తియందు రజతముయొక్క, లేక రజ్జువునందు సర్పముయొక్క ఏయధ్యాసమయినదో, ఆయధ్యాసము ఏపురుషునిచేత పూర్వకాలమందు సత్యరజతము, లేక సత్యసర్పము చూడఁబడెనో, వానికి అగును; ఎవఁడు చూడలేదో, వానికిఁ గానేరదు, కావున సత్యవస్తుజ్ఞానజన్యసంస్కారము అధ్యాసమునకు హేతువు.

(2, 3) ప్రమాతయందుండు లోభభయాదిదోషములును, నేత్రాదిప్రమాణమందుండు పిత్తకామలాది దోషములును అధ్యాసమునకు హేతువు.

(4) శుక్తియందు సర్పముయొక్క, రజ్జువునందు రజతముయొక్క అధ్యాసము గానేరదు; కావున ప్రమేయ[1] దోషము అధ్యాసమునకు హేతువు.

(5, 6) శుక్తియొక్క "ఇదం" రూపముచేత సామాన్యజ్ఞానము కలిగి శుక్తికి నీలపృష్ఠత్రికోణాకృతులు గలవను విశేషజ్ఞానము లేకపోవునప్పుడు అధ్యాస

1. ప్రమాజ్ఞానమునకు విషయమైన దానిని ప్రమేయ మందురు. కల్పితమైన సర్పరజతాదికమునకు అధిష్ఠానమగు రజ్జుశుక్త్యాదికము ప్రమాజ్ఞానమునకు విషయముగా నున్నది; అందువలన నది ప్రమేయ మనఁబడును; వీని యందు సర్పాదికముయొక్క సాదృశ్యము ఏది గలదో, అది ప్రమేయదోష మనఁబడును. ఎట్లనఁగా—రజ్జువునందు భూమిస్పృగ్భిత్వము, దీర్ఘత్వము, శ్రీవలయాకారత్వము వీనిచే సర్పముయొక్క సాదృశ్యము గలదు; మఱియును. శుక్తియందు చాకచక్యరూపము రజతముయొక్క సాదృశ్యము గలదు.

మగును; ఉక్తములైన జ్ఞానాజ్ఞానములు లేనపుడు గానేరదు; కావున అధిష్ఠానసామాన్యరూపము[1] యొక్కజ్ఞానమును, విశేషరూపము[2] యొక్క అజ్ఞానమును అధ్యాసమునకు హేతువు.

ఇదంతయు అధ్యాససామగ్రి; వీనిలో ఒకపదార్థము లేదేని అధ్యాసము గానేరదు. ఎట్లనఁగా—కులాలదండచక్రమృత్తికలు గూడి ఘటమునకు సామగ్రి; వీనిలో నొకటి లేదేని ఘటము గానేరదు.

[కొందఱు గ్రంథకారులు అయిదవది, ఆఱవది ఈ రెండు దోషములను ఒకేదోషమని గణించి దోషసంఖ్య అయిదని వ్రాయుచున్నారు. విరోధము లేదు.]

## 33. బంధాధ్యాసమందు సత్యవస్తుజ్ఞానజన్యసంస్కారమును ప్రమేయదోషమును లేదు.

బంధ మెప్పటికిని సత్యముండు నేని, అప్పుడు తద్జ్ఞానసంస్కారమువలన ఆత్మయందు మిథ్యాబంధము ప్రతీతమగును. సిద్ధాంతమందో, ఆత్మకన్న భిన్నమైన యేవస్తువును సత్యము

1. ఏది భ్రాంతికాలమునందును తోఁచునో, ఏది లేక భ్రాంతి గలుగనేరదో, దానికి సామాన్యాంశ మని, ఆధార మని పేరు. ఉదాహరణము—అయం, ఇదం [ఇతఁడు ఇది] మొదలయినవి.

2. ఏది భ్రాంతికాలమునందుఁ దోఁపదో, ఏది తోఁచుటవలన భ్రాంతి నివృత్తి యగునో, అది విశేషాంశ మనియు, అధిష్ఠాన మనియు చెప్పఁబడును. ఉదాహరణము—రజ్జువు, శుక్తి మొదలయినవి.

గాదు. ఈరీతిగా సత్యబంధజ్ఞానజన్యసంస్కారాభావమువలన ఆత్మయందు బంధముయొక్క అధ్యాసము ఘటిల్లదు?

అట్లే ఆత్మకును, బంధమునకును పరస్పరసాదృశ్యమును లేదు; వ్యత్యస్తమయి తమఃప్రకాశసాదృశ్యమున విపరీతస్వభావమే యుండును. చూడుము—ఆత్మ "ప్రత్యక్కు", బంధము "పరాక్కు", ఆత్మ "విషయి", బంధము "విషయము".

ప్రత్యక్కునందు పరాక్కునకును, పరాక్కునందు ప్రత్యక్కునకును అధ్యాసముగానేరదు. ఎట్లనఁగా—పుత్త్రాద్యపేక్షచేత దేహము ప్రత్యక్కు; దానియందు పుత్త్రాదులకు, పుత్త్రాదులందు దేహమునకు అధ్యాసము గానేరదు. విషయమునందు విషయికిని, విషయియందు విషయమునకును అధ్యాసము గానేరదు. ఎట్లనఁగా—ఘటాదికమందు దీపమునకును, దీపమందు ఘటాదులకును అధ్యాసము గానేరదు?

## 34. బంధాధ్యాసమునందు ప్రమాత్రాది దోషాసిద్ధి

అట్లే ప్రమాతృదోషమును, ప్రమాణదోషమును సంభవింపదు. ఏలయన—ప్రమాతృప్రమాణము మొదలుకొని సకల ప్రపంచము అధ్యాసరూపము; అదియే బంధము; ఇది వేదాంతముయొక్క సిద్ధాంతము. ఈరీతిగా బంధాధ్యాసముకన్న పూర్వమునందు[1] ప్రమాతృప్రమాణములయొక్క స్వరూపమే అసిద్ధము; వానిదోషము నసిద్ధము; కాఁబట్టి బంధాధ్యాసము ఘటిల్లదు?

---

1. బ్రహ్మచైతన్యముకన్న భిన్నమయిన అజ్ఞానము, మఱియుం తత్కార్యమయిన స్థూలసూక్ష్మప్రపంచము ఏది గలదో, అది సర్వము చైతన్యమునందు అధ్యస్తముగా నున్నది. అంతఃకరణరూపమైన ప్రమాతయుం

## 35. బంధాధిష్ఠానమునకు సామాన్యజ్ఞానము, విశేషాజ్ఞానము ఘటిల్లదు.

అట్లు అధిష్ఠానముయొక్క విశేషరూపాజ్ఞానమును ఘటిల్లదు; ఏలయన—బంధమున కధిష్ఠానమైన యేబ్రహ్మముగలదో, అది స్వయంప్రకాశరూపముగా నున్నది. ఆస్వయంప్రకాశ బ్రహ్మంబునందు సూర్యునియందు తమోనామ్యయమున అజ్ఞానము ఘటిల్లదు. ఎట్లు ప్రకాశమానుఁడైన సూర్యునితో తమస్సునకు విరోధము గలదో, అట్లు చేతనప్రకాశమునకు, తమోరూపమైన యజ్ఞానమునకు పరస్పరవిరోధముఁ గలదు.

అధిష్ఠానాశ్రితాజ్ఞానము అంఁగీకరింపఁబడునేని బంధాధ్యాసము ఘటిల్లదు. ఏలయన—అత్యంతాజ్ఞాతమందు అట్లే అత్యంతజ్ఞాతమందు అధ్యాసము గానేరదు; మఱేమనఁగా—సామాన్యరూపముచేత జ్ఞాతమయి విశేషరూపముచేత అజ్ఞాతమయిన వస్తువునందగును. బ్రహ్మమో, సామాన్యవిశేషభావము లేనిది, నిర్విశేషముఁ; ఇది సిద్ధాంతముఁ; ఈవిధముగ సామాన్యరూపముఁచేత జ్ఞాతముఁ, విశేషరూపముచేత అజ్ఞాతము బ్రహ్మము గానేరదు; అందువలన దానియందు అధ్యాసము ఘటిల్లదు?

ఒకానొకప్పుడు అధ్యాసలోభమువలన బ్రహ్మమునందు సామాన్యవిశేషభావములను అంగీకరించినయెడల మీసిద్ధాంతమునకు హాని యగుచున్నది.

---

ఇంద్రియరూపమైన ప్రమాణమును దీనిలో నంతర్గతముగా నున్నది. కనుక నిదియును నధ్యస్తమే; ఈకారణమువలన ప్రమాతృప్రమాణములు అధ్యాసము కన్న పూర్వము సిద్ధింపవు; ఇట్టు ఉపనిషత్తులయొక్క నిర్ణీతార్థరూపమగు సిద్ధాంతము.

ఈరీతిగా బ్రహ్మమునందు బంధము అధ్యాసరూపము; అను నీమాట ఘటిల్లదు; బంధము సత్యము. ఆసత్యబంధము జ్ఞానమువలన నివర్తింపదు. కనుక జ్ఞానముద్వారమున మోక్ష రూపమైన ప్రయోజనము ప్రతిపాదించు సిద్ధాంతమతము సమీచీనము గాదు ?

## 36. కేవలకర్మవలన మోక్షసిద్ధి ఏకభవికవాదము

"కేవలకర్మమువలన మోక్షమయినది" అనునీమాట ఏకభవికవాదమురీతిగా పూర్వపక్షి ప్రతిపాదించుచున్నాఁడు—

సత్యబంధముయొక్క నివృత్తి జ్ఞానముచేత నగునని యంగీకరించుట యుక్తముగాదు; మతేమనఁగా—అయుక్తమే. కావున ఏపురుషుఁడు ముక్తుఁడౌటకాశించునో, వాఁడు నిరంతరము కర్మము చేయవలయును. దీనికిది అభిప్రాయము— కర్మము ద్వివిధము; మొదటిది విహితము, రెండవది నిషిద్ధము. వానియొక్క లక్షణములు—

(1) పురుషుని ప్రవృత్తి నిమిత్తము వేదముచేత బోధించినది విహితము.

(2) పురుషుని నివృత్తినిమిత్తము వేదముచేత బోధించినది నిషిద్ధము.

స్వభావసిద్ధమైన క్రియ కర్మము గాదు [1] ఏలయన— ఏది వేదముచే ప్రవృత్తినిమిత్తము, లేక నివృత్తినిమిత్తము

1. దేనికి వేదమునందు విధానము, లేక నిషేధము చెప్పలేదో, అట్టి యే రాగద్వేషరహితమై స్వాభావికమయిన గమనశౌచాది క్రియ గలదో, దానిని ఉదాసీనక్రియ యందురు.

బోధింపఁబడినదో, దానిని కర్మమందురు. ఉదాసీనక్రియకర్మము గాదు. కనుక కర్మము ద్వివిధముగాని త్రివిధముగాదు.

వానిలో విహితకర్మము నాలుగుప్రకారములు— మొదటిది నిత్యము, రెండవది నైమిత్తికము, మూఁడవది కామ్యము, నాలుగవది ప్రాయశ్చిత్తము—

(1) దేనిని చేయనందువలన పాపము సంభవించునో, మఱియు చేసినపుడు పుణ్యము లేదో, పాపమును లేదో, మఱియు ఏది నిత్యము విధింపఁబడినదో, దానిని నిత్యకర్మమందురు. ఉదాహరణము—స్నానసంధ్యాదికములు.

(2) దేనిని చేయనందువలన పాపము సంభవించునో, మఱియు చేసినపుడు పుణ్యపాపములు లేవో, మఱియు ఏది నిత్యము విధింపఁబడదో, అయినను ఏదొక్కనిమిత్తముబట్టి విధింపఁబడినదో, దానిని నైమిత్తికకర్మమందురు. ఉదాహరణము—గ్రహణము, శ్రాద్ధము, అట్లు అవస్థావృద్ధుఁడు[1], జాతివృద్ధుఁడు, ఆశ్రమవృద్ధుఁడు, ధర్మవృద్ధుఁడు, విద్యావృద్ధుఁడు[2] జ్ఞానవృద్ధుఁడు[3]. వారిలో అన్యతమపురుషునియొక్క ఆగమనము వలన ఉత్థానరూపమైన కర్మము.

---

1. అవస్థావృద్ధుని [వయోవృద్ధుని] కన్న జాతివృద్ధుఁడు [వర్ణవృద్ధుఁడు] ఉత్తముఁడు. కేవలవర్ణవృద్ధునికన్న అవస్థావృద్ధత్వసహితవర్ణవృద్ధుఁడు మేలు. ఈరీతిగా ఉత్తరోత్తరవృద్ధులు ఒకరికన్న నొకరు ఉత్తములని తెలియవలయును.

2. శాస్త్రజ్ఞ, పరోక్షజ్ఞాని.

3. అపరోక్షజ్ఞాని.

(3) ఫలనిమిత్తము విధింపఁబడిన కర్మమును కామ్యకర్మమందురు. ఉదాహరణము—వృష్టికామునకు కారీరయాగము[1] స్వర్గకామునకు అగ్నిహోత్రసోమయాగాదులు.

(4) పాపనాశనిమిత్తము విధింపఁబడిన కర్మమును ప్రాయశ్చిత్తమందురు. ఉదాహరణము—యతికి ప్రమాదముచేత[2] సంభవించిన ద్రవ్యగ్రహణజన్యపాపముయొక్క నాశముకొఱకు ద్రవ్యత్యాగము, దినత్రయోపవాసము.

ఈరీతిగా నాలుగుప్రకారములుగా విహితము, మఱియు నిషిద్ధమొకటి చేరి కర్మము అయిదుప్రకారములుగా నున్నది.

## కర్మముయొక్క యైదుప్రకారములందు ముముక్షువుయొక్క వర్తనము.

మోక్షేచ్ఛగలవాఁడు కామ్యము, నిషిద్ధము ఈరెండు

1. స్వదేశమునందు వృష్టిగోరువాఁడు రాజు తనప్రజలవలన ధన విభాగరూపమైన పన్ను గ్రహణముచేసి యేయాగ మొనర్చునో, దానిని కారీరయాగ మందురు.

2. ఏది అవశ్యము చేయుటకు యోగ్యమో, దేనిని చేయుటకు వేద శాస్త్రవిధియుం గలదో, దేనిని చేయుటకు ఇచ్ఛయుం గలదో అట్టి క్రియను విస్మృతివలన చేయకుండుట ప్రమాద మందురు. లేక ఏది చేయుటకు యోగ్యము గాదో, దేనిని చేయుటకు శాస్త్రవిధియుం గాదో, మఱేమనఁగా—నిషేధమున్నదో, దేనిని చేయుటకిచ్ఛయుం లేదో, అట్టి క్రియనువిస్మృతివలన చేయుటను ప్రమాదమందురు. ఉదాహరణము—యతికి ద్రవ్యగ్రహణము చేయకుండుట శాస్త్రమునందు విహితమయినది, గ్రహించుట నిషేధమున్నది; అట్లే వర్తింపవలయునను ఇచ్ఛయుం గలదు; అట్లయినను విస్మృతివలన యతికి ఏద్రవ్యగ్రహణము ఘటిల్లినదో, అది ప్రమాద మందురు.

కర్మములను త్యజింపవలయును. ఏలయన— కామ్యకర్మము వలన ఉత్తమలోకమునకు పోవును; నిషిద్ధకర్మమువలన నీచ లోకమునకు పోవును.

మఱియును మోక్షేచ్ఛు నిత్యకర్మము నిత్యము, అట్లు నైమిత్తికకర్మము నిమిత్తము గలుగునప్పుడు చేయవలయును. ఏలయన—నిత్యనైమిత్తికకర్మములు చేయకుండిన పాపమగును; తత్పాపమువలన నీచయోనిలోఁ బడును.

మఱియును మోక్షేచ్ఛు ఎప్పుడేని ఒకానొకప్పుడు ప్రమాదముచేతనిషిద్ధకర్మమును చేసెనేని తద్దోషపరిహారార్థము ప్రాయశ్చిత్తకర్మము చేయవలయును. ఎప్పుడేని నిషిద్ధకర్మము చేయలేదన్నను జన్మాంతరపాపనివృత్తికొఱకు ప్రాయశ్చిత్త కర్మము చేయవలయును. ఏలయన ప్రాయశ్చిత్తము రెండు ప్రకారములుగలది— మొదటిది అసాధారణము రెండవది సాధారణము. వీనిలో—

(1) ఏది విశేషపాపనివృత్తికొఱకు శాస్త్రమునందు విధింపఁబడినదో, అది అసాధారణమందురు. ఇట్లు ముందు చెప్పఁబడినది యతికి దినత్రయోపవాసము.

(2) సర్వపాపనివృత్తినిమిత్తము శాస్త్రము దేనిని విధించునో, దానిని సాధారణ మందురు. అట్లు గంగాస్నానము, ఈశ్వరనామోచ్చారణము మొదలగునవి.

ఈరీతిగా రెండువిధములు ప్రాయశ్చిత్తకర్మము. ఎప్పుడు పాపము జ్ఞాతమగునో, అప్పుడు తన్నివృత్త్యర్థము అసాధారణ ప్రాయశ్చిత్తము, మఱియు అజ్ఞాత మయిన జన్మాంతరపాప

నివృత్త్యర్థము సాధారణప్రాయశ్చిత్తము చేయవలయును. [జన్మాంతరముయొక్క పాప మిట్టి దని తెలియదు; గనుక అది అజ్ఞాతము.]

యద్యపి గంగాస్నానము, భగవన్నామోచ్చారణము మొదలగు ఏసాధారణప్రాయశ్చిత్తములు గలవో, అవి కేవల ప్రాయశ్చిత్తరూపములు గావు; మఱేమనగా—కామ్యరూప ములును, ప్రాయశ్చిత్తరూపములునుగా నున్నవి. ఏలయన గంగా స్నానముచేతను, ఈశ్వరనామోచ్చారణాదికముచేతను పాప నివృత్తియై యుత్తమలోకప్రాప్తియు చెప్పఁబడినది; ఎట్లు అశ్వమేధము బ్రహ్మహత్యాదోషనాశకమో, మఱియు స్వర్గ దాయకమో, అట్లు గంగాస్నానాదికమును పాపనాశకము, మఱియు ఉత్తమలోకదాయకముగ నున్నవి. ఆయుత్తమ లోక మేమో, ముముక్షువునకు వాంఛితము గాదు; తథాపి అవి ఎవ్వనికి ఉత్తమలోకవాంఛ గలదో, వానికి నుత్తమలోకము నిచ్చును; ఎవ్వనికి వాంఛ లేదో, వానికి కేవలపాపనాశకముగా నుండును. ఎట్లనఁగా—వేదాంతమతమునందు సంపూర్ణకర్మము సకాముఁడైన వానికి సంసారహేతువు; మఱియును నిష్కామ పురుషునకు అంతఃకరణశుద్ధిద్వారమున మోక్షహేతువుగా నున్నది. ఈరీతిగా జన్మాంతరముయొక్క సంపూర్ణపాపనాశము జ్ఞానము లేకయు గలుగును. జ్ఞానము అనావశ్యకము.

అట్లు జన్మాంతరకామ్యకర్మమును ముముక్షువునకు వంధ్యా సమానము; ఫలహేతువు గాదు. ఏలయన—ఎట్లు కర్మానుష్ఠాన కాలమునందు పురుషేచ్ఛ ఫలహేతువని వేదాంతమతమునందు

అంగీకరించినారో, అట్లు [1] కర్మసిద్ధ్యనంతరమును పురుషేచ్ఛ ఫలమునకు హేతువుగా నున్నది. అపురుషేచ్ఛయేమో, ఎప్పుడు పురుషుఁడు ముముక్షువగునో, అప్పుడే దూరమగును; కనుక జన్మాంతర కామ్యకర్మమును వానికి ఫలహేతువు గాదు. ఎట్లనఁగా—ఏపురుషుఁడేని ధనప్రాప్తికొఱకు ధనవంతుని ఆరాధనము చేసినను ఆయారాధనానంతరమును ధనేచ్ఛ దూరమైనప్పుడు వానికి ధనప్రాప్తి గానేరదు.

వర్తమానజన్మమునందు కామ్యనిషిద్ధములు చేయలేదు; చేసియుండునెడల ఊర్ధ్వలోకమునకు లేక అధోలోకమునకు పోవలసియుండును; జన్మాంతరముయొక్క ప్రారబ్ధమయిన కామ్యనిషిద్ధములు భోగమువలన నశించును; నిత్యనైమిత్తికములు చేయనందువలన నేపాపమగుచుండెనో, అది వీనిని చేయుటవలన గాదు; జన్మాంతరసంచితమయిన యేనిషిద్ధమో, దానినాశము సాధారణప్రాయశ్చిత్తమువలన నగును; జన్మాంతర సంచితమయిన కామ్యకర్మము ఇచ్ఛాభావమువలన ఫలము నియ్యదు; అందువలన ముముక్షువు నిత్యనైమిత్తిక సాధారణప్రాయశ్చిత్తకర్మములను చేయవలయును; మఱియు వర్తమాన జన్మమునందు జ్ఞాత నిషిద్ధకర్మమైనపుడు అసాధారణప్రాయశ్చిత్తము చేయవలయును?

లేక నిత్యనైమిత్తికములనే చేయవలయును? ప్రాయశ్చిత్తము [2] చేయనక్కరలేదు. ఏలయన—ఎట్లు జ్ఞానవంతుని

1. "అట్లు" మొదలయిన వాక్యముయొక్క యభిప్రాయము—నేను వికభవికవాది యట్టి మాసిద్ధాంతమందు.

2. సాధారణప్రాయశ్చిత్తమును, అసాధారణ ప్రాయశ్చిత్తమును చేయుటయందు శ్రమాధిక్యమును చూచునేని ముముక్షువునకు తనమతము.

సంచితకర్మనాశము వేదాంతమతమునందు అంగీకరించిరారో, అట్లు నిషిద్ధకామ్యములు త్యాగముచేసి నిత్యనైమిత్తికకర్మము నందు ప్రవర్తకుఁడైన ముముక్షువునకు సకలసంచితకర్మనాశము తానే యగును?

లేక [1] సంచితమైన కామ్యమును, నిషిద్ధమును అవన్నియుఁ గూడి యొకేజన్మము నారంభించును; గనుక ముముక్షువునకు ఇంకొక్క జన్మమగును?

లేక [2] యోగికాయవ్యూహన్యాయమున ఏకకాలమునందు సకలసంచితము అనంతశరీరములనారంభించును; దేనివలన ముముక్షువు ఉత్తరజన్మమునందు సకలసంచితఫలోపభోగమును చేయును?

లేక [3] నిత్యనైమిత్తికములయొక్క అనుష్ఠానమువలన

---

నందు రుచి పుట్టదు; అనుసీయభిప్రాయమువలన ఏకభవికవాది 'ప్రాయశ్చిత్తము లేకయె సులభమయిన వేఱేయొక ప్రకారమును చూపుచున్నాఁడు.

1. జ్ఞానవంతుని సంచితనాశమువలె ముముక్షువుని సంచితనాశము గానియెడల తత్ఫలోపభోగమునకు అనేకజన్మములు కావలెనని ముముక్షువు భయపడు ననితలచి, వాది ఒకేజన్మము చూపును.

2. అనంతవిలక్షణజన్మములకు కారణమగు అనంతకర్మములయొక్క ఫలము ననుభవించుట ఒకజన్మమునందు సంభవింపదు; ఈశంకను పరిహరించుటకొఱకు వాది అన్యపక్షమును చెప్పుచున్నాఁడు—"ఒకేజన్మమునందే అనేక శరీరములు కావచ్చును."

3. యోగికాయ [శరీరము] వ్యూహ [సమూహ] న్యాయమున ఒకే [జన్మ]మునందు అనంతశరీరమయినప్పుడు అనంతజన్మమునందు ఉపభోగింపదగిన అనంతప్రకారమగు సుఖము ననుభవించునట్లు అనంతప్రకారములగు

ఏక్లేశమగునో, అది జన్మాంతరసంచితనిషిద్ధకర్మఫలము; కనుక ఆసంచితనిషిద్ధమును ఇంకొక్కజన్మము నారంభింపదు; మఱియు సంచితకామ్యమైనది యొకజన్మమును లేక యేకకాలమున అనంత శరీరములను ఆరంభించును; ఆయుత్తరజన్మమునందు ముముక్షు వునకు దుఃఖలేశమును గలుగదు; కేవలసుఖోపభోగమే యగును. ఏలయన సంచితవిహితకర్మముచేత శరీరమయినది; సంచితమైన నిషిద్ధమో, నిత్యనైమిత్తికానుష్ఠానక్లేశమువలన పూర్వజన్మమందే భుక్తమై నశించును. ఈరీతిగా ప్రాయశ్చిత్తము లేకయు

---

దుఃఖభోగములును ఒకేజన్మమునందు కావచ్చును. ఈభయమువలన ముముక్షువునకు సామతమునందు ప్రవృత్తి గా నేరదు. అనునీయభిప్రాయమువలన ఏకభవికవాది ఉత్తరజన్మమునందు ముముక్షువునకు దుఃఖలేశమును ఘటిల్లదు; కేవలసుఖభోగమునే పొందును. ఇట్టియన్యపక్షము ప్రతిపాదించుచున్నాఁడు. అది క్రింద వ్రాయఁబడినది.

అజ్ఞానియొక్క కర్మభోగవ్యవస్థ—

"నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి,
అవశ్యమేవం భోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్." స్మృ.

భావార్థము—శతావధికల్పకాలము పోయినను ఉపభోగము చేయక కర్మనివృత్తి ఘటిల్లదు. జన్మజన్మమునందు చేయఁబడిన శుభాశుభకర్మములు ఎన్ని గలవో, ఆయన్నింటియొక్క ఫలము ఆవశ్యముగా ఉపభోగింపవలయును.

భోగములేకనే కర్మముయొక్క నాశమును చెప్పినప్పుడు ఉక్తమైన శాస్త్రవచనమునకు విరోధముగా నుండును; తన్నివారణార్థము ఏకభవికవాది అన్యపక్షమును చెప్పినాఁడు—"కర్మానుష్ఠానక్లేశోపభోగమునందు నిషిద్ధకర్మఫలోపభోగము ఘటిల్లిపోయినది."

కేవల నిత్యనైమిత్తికకర్మానుష్ఠానమువలననే మోక్షము గలుగును? [ఈమతమును శాస్త్రమునందు ఏకభవికవాదమందురు.[1]]

కాఁబట్టి జ్ఞానద్వారమున బంధనివృత్తియను గ్రంథముయొక్క ప్రయోజనము ఘటిల్లదు. ఏవస్తువు ఏదిలేక వేఱొక్కదానిచేతఁ గాదో, ఆవస్తువు దానికి ప్రయోజనముగ ఘటిల్లును. చూడుము—రూపజ్ఞానము నేత్రములేక వేఱొక్కదానిచేత గాదు; గనుక ఆరూపజ్ఞానము నేత్రమునకు ప్రయోజనముగ నున్నది; బంధనివృత్తియో, గ్రంథములేక కర్మముచేతఁ గూడ అగును; కావున నది గ్రంథమునకు ప్రయోజనము గాదు. [గ్రంథముచే జ్ఞానము ఘటిల్లినను ఒకజ్ఞానముచేతనే మోక్షము ఘటిల్లదు; అది కర్మముచేతఁగూడ ఘటిల్లుచున్నది; అందువలన గ్రంథముచేత జ్ఞానముద్వారమున మోక్షమని పూర్వము సిద్ధాంతి అనుచున్నాఁడు; అసిద్ధాంతియొక్క వచనము ఘటిల్లదు; అని ఉక్తభాషణమునందు ఏకభవికవాది తన యభిప్రాయమును చూపుచున్నాఁడు.]

## 37. సంబంధఖండనము

ఇదివఱకు చెప్పఁబడిన ప్రకారముగ అధికారి మొదలయిన అనుబంధములు మూఁడును సంభవింపవు; కావున వానియొక్క పరస్పరసంబంధముగూడ సంభవింపదు. ఏలాగుననఁగా—విషయాభావమువలన గ్రంథమునకు, విషయమునకు ప్రతిపాదకప్రతిపాద్యభావసంబంధము లేదు, అధికార్యభావము

1. ఒకేజన్మముయొక్క లేక మోక్షసాధనమైన యొకేకర్మముయొక్క వాదము [కథనము] ఇది ఏకభవికవాదశబ్దమునకు అర్థము.

వలనను, ఫలాభావమువలనను వానియొక్క ప్రాపక ప్రాప్యభావ సంబంధమును లేదు. అధికార్యభావమువలన వానికి విచారముతో కర్తృకర్తవ్యభావసంబంధము సంభవింపదు. జ్ఞానము నిష్ఫలమగుటవలన గ్రంథమునకు, జ్ఞానమునకు జనకజన్యభావ సంబంధము ఘటిల్లదు? [ఇపుడు ప్రయోజనఖండనప్రకరణము నందు చెప్పినప్రకారముగఁ జూచినయెడల జ్ఞానమునందు మోక్షరూప ఫలోత్పత్తిసామర్థ్యము లేమివలన అది నిష్ఫలమనఁగా నిరుపయోగముగ నున్నది; అయినను అజ్ఞానము నిష్ఫలమని ఎఱుఁగక దానియందు మోక్షోత్పత్తిసామర్థ్యము కల్పించి సిద్ధాంతి దానికి గ్రంథముతో సంబంధము చెప్పుచున్నాఁడు; నిష్ఫలమని ఎఱిఁగినపక్షమున సిద్ధాంతి అట్లు చెప్పఁడు; ఈయభిప్రాయమున పూర్వపక్షి గ్రంథమునకును, జ్ఞానమునకును జనక జన్యభావసంబంధము సంభవింపదని చెప్పుచున్నాఁడు.]

మఱియును పూర్వము చెప్పినప్రకారముగ జ్ఞానము నిరుపయోగమగుటవలన దానియొక్క సంబంధమును నిరుపయోగముగ నున్నది; దానివలన ఏసిద్ధియు సంభవింపదు? [కదాచిత్తుగా నిష్ఫలమైన జ్ఞానమునకుఁగూడ సిద్ధాంతిసంబంధము చెప్పఁబోవునేమో! అని సంశయమువలన పూర్వపక్షి అసంబంధమే నిరుపయోగమని చెప్పుచున్నాఁడు.]

ఇంక చూడుము—పుత్త్రవతీపుత్త్రుఁడు భావరూపపదార్థమగుటవలన వానియొక్క జన్యత సిద్ధమగుచున్నది; మఱియు వానికి మాతాపితృలతో జనకజన్యభావసంబంధమును సిద్ధమగుచున్నది; వంధ్యాపుత్త్రుఁడు అభావపదార్థమగుటవలన వానియొక్క జన్యతయు సంభవింపదు; జనకజన్యసంబంధమును సంభ

వింపదు. అట్లు సిద్ధాంతమందో, జీవబ్రహ్మైక్యనిశ్చయమునకు జ్ఞానమని పేరుపెట్టుచున్నారు; ఆజీవబ్రహ్మైక్యము ఏరీతిగాను సిద్ధింపదు. [ఈసంగతి విషయఖండనమునందు మొదలే ప్రతిపాదితమైనది.] ఇపుడు జీవబ్రహ్మైక్యనిశ్చయ మెక్కడవచ్చును? జ్ఞానమెట్లు సంభవించును? జ్ఞానమే వంధ్యాపుత్రునివలె అభావరూపముగ నున్నది; ఆజ్ఞానమనెడి అభావమునకు గ్రంథముతో జనకజన్యభావసంబంధ మనుట సర్వదా అసంభవనీయముగ నున్నది?

ఈరీతిగా అధికార్యాద్యనుబంధములయొక్క అభావము వలన గ్రంథారంభము ఉపపన్నముగాదు.

---

## అధికారిమండనము

**38.** 25, 26 గతపూర్వపక్షమునకు సానువాద సమాధానము. మోక్షము ప్రథమాంశమునందు ఇచ్ఛ పుట్టుట సంగతము.—పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము

కేవలదుఃఖనివృత్తి సకలపురుషులు గోరుటవలనను, ఆదుఃఖములు తమతమఉపాయముచేత నివృత్తమగుటవలనను సకారణముగు జగన్నివృత్తీచ్ఛ ఎవ్వఁడును చేయఁడు.

### ఉక్తపూర్వపక్షమునకు సమాధానము

మాలమనఁగా జగత్కారణమైన అజ్ఞానము మఱియు తత్కార్యమైన జగత్తు వానియొక్క నాశములేక త్రివిధదుఃఖములయొక్క నాశము ఇతరోపాయములచేత కాఁజాలదు;

మూలావిద్యానాశమువలన సర్వదుఃఖములును, దుఃఖకారణము లయినరోగాదులును, రోగాదులకు ఆశ్రయమయిన దేహాదులును నశించును; గనుక త్రివిధదుఃఖనివృత్త్యర్థము సకారణజగన్నివృత్తిరూపమయిన మోక్షప్రథమాంశమును సకలపురుషులు నిచ్ఛింతురు.

తాత్పర్య మేమనఁగా—ఎవ్వఁడు సకలౌషధోపాయము చేయుటయందు సమర్థుఁడో, వానికిని దుఃఖము నియమముచేత నశింపదు; కొందఱికి నశించును; కొందఱికి నశింపదు; మఱియు నెవ్వనికి దుఃఖనివృత్తి యగునో, వానికిని మరల దుఃఖోత్పత్తి యగును. ఈరీతిగా ఔషధాదికోపాయమువలన దుఃఖముయొక్క అత్యంతనివృత్తి గానేరదు. ఏనివృత్తికి వెనుక పునరుత్పత్తి గానేరదో, దానిని అత్యంతనివృత్తి యందురు; ఇట్టి అత్యంతనివృత్తి యైననో, ఔషధాదికోపాయములవలనఁ గానేరదు; దుఃఖసాధన నాశమైనయెడల సకల దుఃఖములయొక్క అత్యంతనివృత్తి నియమముచేత నగును; అందువలన త్రివిధదుఃఖనివృత్తినిమిత్తము దుఃఖసాధననివృత్తీచ్ఛయును[1] సర్వులకుఁ గలదు.

---

1. కఫకారకపదార్థత్యాగము లేక కఫరోగనివృత్తి గానేర దని ఎఱిఁగి కఫనివృత్తీచ్ఛువు "నేను వైద్యునిద్వారమున తెలిసికొని కఫకారకపదార్థత్యాగము చేయుదును" ఇట్టు కఫనివృత్తీచ్ఛువు కఫసాధననివృత్తిఁ గోరుచున్నాఁడు. అట్టు దుఃఖసాధననివృత్తి లేక దుఃఖనివృత్తి గానేర దని ఎఱిఁగి దుఃఖనివృత్తీచ్ఛువు "నేను శాస్త్రగురుద్వారమున తెలిసికొని దుఃఖసాధనత్యాగము చేయుదును" అని ముముక్షువు దుఃఖసాధననివృత్తీచ్ఛ చేయుచున్నాఁడు.

ఆదుఃఖసాధనము అజ్ఞానము మఱియు తత్కార్యమయిన ప్రపంచము. ఈసంగతి ఛాందోగ్యోపనిషత్తులో భూమవిద్య యందు ప్రసిద్ధము. అచ్చట ఈప్రసంగము గలదు—

ఒకానొకప్పుడు భగవంతుఁడైన శ్రీసనత్కుమారుని యొద్దకు వేదశాస్త్రజ్ఞుఁడైన నారదుఁడు పోయెను; అపుడు నారదుఁడు ప్రార్థించును—ఓభగవంతుఁడా! ఎవఁడు ఆత్మజ్ఞానియో, వానికి శోకము లేదు; నేనో, శోకసహితుఁడను; కనుక నేను అజ్ఞానిని; నా కిట్లుపదేశింపుఁడు; నాయజ్ఞానము దూరముగానీ. అపుడు సనత్కుమారుఁ డనుచున్నాఁడు— ఓనారదుఁడా! అయ్యా! భూమ శోకరహితము, సుఖరూపము; మఱియు భూమకన్న భిన్నమైన సకలము తుచ్ఛము, దుఃఖసాధనము. [భూమ యనఁగా బ్రహ్మము]

ఈరీతిగా బ్రహ్మముకన్న భిన్నమైన ఏవస్తువు గలదో, అది సకలమును దుఃఖసాధనమందురు; అజ్ఞానము, మఱియు తత్కార్యమైన ప్రపంచము బ్రహ్మముకన్న భిన్నము; కావున దుఃఖసాధనము; తన్నివృత్తియైనయెడ సకలదుఃఖములయొక్క అత్యంతనివృత్తి నియమము చేత నగును; అందువలన సకలదుఃఖనివృత్తినిమిత్తము సాజ్ఞాన జగన్నివృత్తిరూపమయిన మోక్షముయొక్క ప్రథమాంశమునందు ఇచ్ఛపుట్టుట[1] సంగతము.

---

1. ఇచ్చట ఈశంక యున్నది—ఏవస్తువు పూర్వము దనుభూతమైనదో, తత్ప్రాప్తీచ్ఛ గలుగును; ఇది నియమము. బ్రహ్మరూపాధిష్ఠానజ్ఞానము వలన అజ్ఞానసహితప్రపంచనివృత్త్యనుభవము ముముక్షునకుపూర్వము వికాలమందును ఘటిల్లలేదు; కావున వానికి అజ్ఞానసహిత ప్రపంచనివృత్తీచ్ఛ ఘటిల్లదు. దీనికి సమాధానము—అనుభూతమైన వస్తువుయొక్క ఇచ్ఛ గలుం

## 39. 27, 28 గతపూర్వపక్షమునకు సానువాద సమాధానము. ముముక్షువు లేదనుట ఘటిల్లదు

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

ఏవస్తువుయొక్క అనుభవమయినదో, తత్ప్రాప్తీచ్ఛ యగును; బ్రహ్మానుభవము ఎప్పటికిని చేయఁబడలేదు; అందువలన బ్రహ్మప్రాప్తిరూపమయిన మోక్షముయొక్క ద్వితీయాంశమునందిచ్ఛ[1] ఎవ్వనికిని గలుగదు?

---

గును; అనునిట్టినియమము లేదు; మఱేమనఁగా— అనుభూతసజాతీయముయొక్క ఇచ్ఛ గలుగునని నియమముగలదు. ఎపుడు అనుభూతమైనవస్తువుయొక్క ఇచ్ఛ గలుగునో, అప్పుడు భుక్తభోజనమందును పునరపేక్ష గలుగవలయును గదా? అది గలుగదు; మఱేమనఁగా— తత్సజాతీయము, తత్తుల్యము, లేక తద్విలక్షణమైన అన్యభోజనమునందు ఇచ్ఛ గలుగును.

ఆప్రకారముగా ఎట్లు కల్పితసర్పాదికమునకు అధిష్ఠానము రజ్జ్వాదికమున్నదో, అట్లు కల్పితమైనసాజ్ఞానప్రపంచమునకు అధిష్ఠానము బ్రహ్మమున్నది; కాఁబట్టి రజ్జ్వాదికము, బ్రహ్మము అధిష్ఠానత్వముచేత పరస్పరజాతీయములు; అట్లు సర్పాదికనివృత్తియు, సాజ్ఞానప్రపంచనివృత్తియు పరస్పరసజాతీయములుగా నున్నవి. ఎందువలన రజ్జ్వాదికజ్ఞానముచేత సర్పాదికనివృత్తి అనుభూతమో, అందువలన దీనికి సజాతీయమగు బ్రహ్మజ్ఞానమువలన సాజ్ఞానప్రపంచనివృత్తి; అది పూర్వానుభూతము గాకుండినను దానియొక్క ఇచ్ఛ ముముక్షువునకు ఘటిల్లినది.

1. పూర్వపక్షి అనినప్రకారముగా అనుభూతమైన వస్తువుయొక్కయే ఇచ్ఛ గలుగవలయునేని అప్పుడు అనుభూతమైన రోగజన్యదుఃఖముయొక్కయు, తత్సాధనమయిన రోగాదిప్రతికూలవస్తువుయొక్కయు ఇచ్ఛ

ఠ ⟵ ఉక్తపూర్వపక్షమునకు సమాధానము ⟶

సుఖానుభవము చేయని పురుషుఁడు ఒకఁడుకూడా లేఁడు; సర్వపురుషులు సుఖానుభవము చేసియున్నారు; గనుక సుఖేచ్ఛ అందఱికిఁ గలదు; మఱియు బ్రహ్మము నిత్యసుఖరూప మని సచ్ఛాస్త్రమునందు వినియున్నారు; అందువలన వివేకియైన పురుషుఁడు సుఖస్వరూపముయిన బ్రహ్మమును పొందఁగోరును.

⟵ { మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము } ⟶

సర్వపురుషులు ఏ విషయజన్యసుఖము నిచ్ఛింతురో, ఆ విషయజన్యసుఖము మోక్షమునందు లభింపదు; ఆసుఖము జగత్తునందు లభించును. కనుక మోక్షేచ్ఛగలవాఁడైన యధి కారియొక్క అభావమువలన గ్రంథారంభము నిష్ఫలము?

⟵ ఉక్తపూర్వపక్షమునకు సమాధానము ⟶

వానిని [బూర్వపక్షిని] ఇట్లడుగవలయును—ఎవ్వఁడును ముముక్షువు గాఁడా? లేక ముముక్షువుగా నుండినను వానికి గ్రంథమునందు ప్రవృత్తి కాదా? [ఈ మోక్షేపద్యయములో

---

సర్వులకుఁ గలుగవలసినదేగదా! అది గలుగదు. అనుభూతమైన సుఖమునందు, సుఖసాధనమునందు, అట్టి అనుభూతమైన అనుకూలవస్తువునందు, మఱియు తత్సజాతీయవస్తువునందు మాత్రము ఇచ్ఛ గలుగును. అని నియమము.

ఎందువలన బుద్ధియందు బ్రహ్మానందముయొక్క ప్రతిబింబసుఖాను భవము ఎల్లవారును చేసియున్నారో, మఱియు తత్సజాతీయమగు బింబభూత సుఖరూపబ్రహ్మమును శాస్త్రమునందు విన్నారో, అందువలన సుఖరూపబ్రహ్మ ప్రాప్తీచ్ఛ ఎల్లవారికిని ఘటిల్లినది.

ప్రథమాక్షేపముయొక్క సమాధానము ఈయంకమందు వ్రాసి రెండవదాని సమాధానము ముందు నలుబదియవఅంకమందు వ్రాయఁబడినది.]

ముముక్షువు లేఁడనుమాట యుక్తము గాదు; ఏల యన—సర్వపురుషులు సర్వదుఃఖములనాశమును, నిత్యసుఖ ప్రాప్తిని గోరుదురు; అదియే దుఃఖనాశము, మఱియు సుఖప్రాప్తి రూప మగు మోక్షముగా నున్నది; కాఁబట్టి సర్వపురుషులు ముముక్షువులుగా నున్నారు.

## మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము

సర్వపురుషులు విషయజన్యసుఖమునే గోరుదురు. అందు వలన అధికారి ఎవ్వఁడును లేఁడు?

## ఉక్తపూర్వపక్షమునకు సమాధానము

ఆమాట ఘటిల్లదు; ఏ లేమనఁగా—సర్వపురుషులు సుఖమాత్రమునే గోరుదురు. ఆసుఖము విషయమువలనగాని, లేక విషయము లేక గాని, కేవలవిషయజన్యసుఖమునే కోరిన పక్షమునందు సుషుప్తిసుఖేచ్ఛ గాకుండవలసియుండెను; ఏలయన సుషుప్తిసుఖము విషయజన్యముగాదు. విచారపూర్వకముగాఁ జూచినట్టయిన విషయసుఖవిపరీతమైన ఆత్మసుఖమునేగోరుదురు. ఎందు కనఁగా—సర్వపురుషులకు న్యూనాధిక మగు విషయ సుఖము ప్రాప్తమైయుండును; అయినను ఇట్టి ఇచ్ఛ యెల్లప్పుడు గలదు— "మాకిట్టిసుఖము కావలయును; ఆసుఖముయొక్క నాశము ఎప్పటికిని గాఁగూడదు." అట్టి సుఖమో, అదె ఆత్మ స్వరూప మయిన మోక్షము.

ఈరీతిగాఁ జూచినయెడల సర్వపురుషులును ముముక్షువులుగా నుండఁగా "ఎవ్వఁడును ముముక్షువుగాఁడు" అనునీ పూర్వపక్షి చెప్పినమాట సరికాదు.

## 40. ముముక్షువుయొక్క ప్రవృత్తివలన గ్రంథారంభసఫలత

పూర్వము ముప్పదితొమ్మిదవఅంకమునందు పూర్వపక్షికి సమాధానము చెప్పు ప్రసంగమును సిద్ధాంతి పూర్వపక్షికి రెండుఆక్షేపములు కల్పించుచున్నాఁడు; వానిలో ప్రథమాక్షేపముయొక్క సమాధానవ్యవస్థ పూర్వాంకమునందే పూర్ణమగుచున్నది; ఇపుడు "ముముక్షువుగా నుండినను వానికి గ్రంథమునందు ప్రవృత్తి కాదా?" అను నీద్వితీయాక్షేపముయొక్క సమాధానవ్యవస్థ ఈఅంకమునందు వ్రాయఁబడియున్నది—

వానిని ట్లడుగవలయును—[సిద్ధాంతి అనుచున్నాఁడు– "ముముక్షువుగా నుండినను వానికి గ్రంథమునందు ప్రవృత్తి కాదు." అనునీప్రకారముగ పూర్వపక్షి అనిన పక్షమునందు వానిని క్రిందవ్రాసిన ప్రకారముగ అడుగవలెను.] గ్రంథము మోక్షసాధనము గానందున గ్రంథమునందు ప్రవృత్తి గలుగదా? లేక గ్రంథముకన్న నితరమై మోక్షహేతువైన ఇంకొక్క సాధనమునందు ప్రవృత్తి యగుటవలన గ్రంథమునందు ప్రవృత్తి గానేరదా? లేక శమాదికములవలన గ్రంథమునందు నధికారి యగునందురో, అట్టి శమాదులుగల అధికారి ఎవఁడును లేనందున తనయందు అధికారము లేదని తెలియుటవలన ఎవ్వనికిని గ్రంథమునందు ప్రవృత్తి గానేరదా?

ఇందులో—గ్రంథము మోక్షమునకు సాధనము గాదు; అనునీమాట ఘటిల్లదు. ఏల యన—మోక్షము జ్ఞానమువలననే నియమముచేత నగును; ఇది వేదముయొక్క సిద్ధాంతము. ఆజ్ఞానము శ్రవణమువలన నగును. ఆశ్రవణము[1] రెండువిధములు—మొదటిది వేదాంతవాక్యశ్రోత్రసంయోగరూపము, రెండవది వేదాంతవాక్యవిచారరూపము. వీనియందు జ్ఞానమునకు సాక్షాద్ధేతువు ప్రథమశ్రవణము; రెండవది కాదు. ఏల యనఁగా-శబ్దజన్యజ్ఞానమునందు శ్రోత్రేంద్రియముతోడ శబ్దముయొక్క సంయోగమే అంతటను హేతువు; కావున వేదాంతవాక్యశ్రోత్రసంయోగరూపమైన ప్రథమశ్రవణము బ్రహ్మజ్ఞానమునకు హేతు వని యెఱుఁగవలెను. దానియందు అవాంతరవాక్యశ్రవణము పరోక్షజ్ఞానమునకు, మఱియు మహావాక్యశ్రవణము అపరోక్షజ్ఞానమునకు హేతువుగా నున్నది. [ఈసంగతి యసంభావనాదుల స్వరూపముతో ప్రథమ తరంగమునందు ప్రతిపాదితమైనది.] ఎవనికి జ్ఞానమైన వెనుకఁగూడ అసంభావనావిపరీతభావనలు గలుగునో, వాఁడు శ్రవణాదిసాధనములు చేయవలయును. వానిలో వేదాంతవాక్యవిచారరూపమైన ద్వితీయశ్రవణమువలన మననానిదిధ్యాసనద్వారమున క్రమముగా ప్రమాణాసంభావనయు, ప్రమేయాసంభావనయు, విపరీతభావనయు నివృత్తము లగును. ఈరీతిగా ప్రథమశ్రవణము జ్ఞానముద్వారమున మోక్షమునకు సాక్షాద్ధేతువు; మఱియు ద్వితీయ

1. అంగాంగిభేదమువలన శ్రవణము రెండువిధములు గలది. వీనిలో ప్రథమశ్రవణము ద్వితీయశ్రవణమునకు ఉపకారకమగుటవలన దానిని అంగ మందురు. ద్వితీయశ్రవణము ఉపకార్యమగుటవలన దానిని అంగి యందురు.

శ్రవణము అసంభావనాది దోషనివృత్తిద్వారమున మోక్షము నకు పరంపరగా హేతువు. ఉపనిషత్తునకు వేదాంత మని పేరు; అది ఈగ్రంథముకన్న భిన్నమైనను తత్సమానార్థకములయిన భాషావాక్యములు ఈగ్రంథమునందుఁ గలవు; వానియొక్క శ్రవణమువలనను జ్ఞాన మగును[1]. ఈరీతిగా జ్ఞానముద్వారమున గ్రంథము మోక్షమునకు హేతువుగా నున్నది.

మఱియు విచారరూపము [మననరూపము] కూడ ఈగ్రంథ మగుటవలన అసంభావనాది దోషనివృత్తిద్వారమునఁ గూడ మోక్షమునకు హేతు వగును.

ఈప్రకారముగా గ్రంథమునందు జ్ఞానహేతుశక్తి ఇంత యుండఁగా "గ్రంథమువలన మోక్షము గానేరదు." అనుట వాతమాత్రముగాని ఇంకరహస్యము లేదు.

## మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము

గ్రంథమువలన మోక్షము గలుగు నట్లయినను అన్యసాధనముచేతఁగూడ మోక్షము సిద్ధించును; గావున గ్రంథారంభము నిష్ఫలము.

## ఉక్తపూర్వపక్షమునకు సమాధానము

వాని నిట్లడుగవలయును—దేనివలన మోక్షమగునో అట్టిది ఆ యన్యసాధనము ఏదియున్నది? అతఁ డిట్లు చెప్పును.—

1. భాషాగ్రంథమువలనను జ్ఞానమగునను సంగతి తృతీయతరంగమునందు వ్రాయఁబడును.

"ఉపనిషత్తులు[1] సూత్రభాష్యాదికములయిన సంస్కృతగ్రంథములు జీవబ్రహ్మైక్యప్రతిపాదకములైనవి యనేకము లున్నవి; వానివలననే జ్ఞానద్వారమున మోక్షము కాఁగలదు; వానికన్న భిన్నమైన ఈగ్రంథమునకు నధికారి లేమివలన ఈగ్రంథము నిష్ఫలము." ఇది వాస్తవమే; అట్లయినను తదర్థగ్రహణమునందు ఎవ్వనిబుద్ధి సమర్థము గాదో, అట్టి ముముక్షువునకు వానివలన జ్ఞానము గానేరదు; కాఁబట్టి ఆముముక్షువునకు ఈగ్రంథమునందు ప్రవృత్తి యగును.

### మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము

గ్రంథమువలన మోక్షము అగును; మఱియు ముముక్షువేమో ఉన్నాఁడు; అయినను వివేకవైరాగ్యాదిసాధనసంపన్నుఁడైన యధికారి దుర్లభుఁడు; అందువలన తనయందు అధికారాభావము తెలిసికొనినవాఁడైన ముముక్షు వుండినను వాఁడు ఈగ్రంథమునందు ప్రవృత్తి చేయఁడు?

### ఉక్తపూర్వపక్షమునకు సమాధానము

వాని నిట్లడుగవలయును.—అనేకులు అధికారులు లేరా? లేక ఎవ్వఁడును లేఁడా? అతఁ డిట్లు చెప్పెను—"అనేకులు లేరు" దానిని నేను అంగీకరింతును; మఱియు అతఁడిట్లు చెప్పెను—

1. ఉపనిషత్తు లనేకములు గలవు. వీనిలో ఈశము, కేనము, కఠము, ప్రశ్నము, ముండకము, మాండూక్యము, తైత్తిరీయము, ఐతరేయము, ఛాందోగ్యము, బృహదారణ్యము – ఈదశోపనిషత్తులు ముఖ్యములు. వీనిపైన శ్రీశంకరాచార్యస్వామికృతభాష్యము గలదు. వీనిలో కొన్ని ఉపనిషత్తులు హిందూస్థానిలోనికి భాషాంతరమయినవి.

"ఎవ్వఁడును లేఁడు" ఈమాట ఘటిల్లదు; ఏలయన ప్రథమ తరంగమునందు ప్రతిపాదింపఁబడిన ప్రకారముగా అంతఃకరణము నందు మూఁడుదోషములు గలవు— మొదటిది మలము, రెండవది విక్షేపము, మూఁడవది ఆవరణము. ఎవని అంతఃకరణము నందు మూఁడు దోషములు గలవో, వాఁడు అధికారియుఁ గాఁడు; అయినను ఈజన్మంబునందుఁ గాని పూర్వజన్మంబు నందుఁ గాని శుభకర్మోపాసనానుష్ఠానమువలన ఎవ్వని మల విక్షేపములు నశించినవో, మఱియు ఒకయావరణదోషము మాత్రము ఎవని అంతఃకరణమునందున్నదో, వాఁడు జ్ఞానమునకు యోగ్యుఁడైన అధికారిగా [1] నున్నాఁడు; వానికి గ్రంథము నందు ప్రవృత్తి గలుగును.

**41.** పురుషవర్గములు పామరవిషయిలక్షణములు
పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.

సర్వపురుషులకు విషయసుఖమునందు అలంబుద్ధి గలదు? కనుక నిత్యసుఖమును ఎవ్వఁడు ఇచ్ఛింపఁడు?

---

1. కృతోపాసనుఁడు, మఱియు అకృతోపాసనుఁ డను భేదమువలన అధికారులు రెండువిధములుగా నున్నారు. వీరిలో—నిర్గుణబ్రహ్మజ్ఞానమునకు పూర్వము సగుణబ్రహ్మోపాసనము సాక్షాత్కారమువఱకు ఏపురుషుఁడు చేసెనో, వానిని కృతోపాసనుఁ డందురు. వానియందు శాస్త్రోక్తసాధనము సకలపరిపూర్ణముగా నుండును. ఎవనికి జ్ఞానముకన్న పూర్వము సగుణోపాసన అపూర్ణముగా నున్నదో, వానిని అకృతోపాసనుఁ డందురు. వానియందు సకలసాధనములు పూర్ణముగా నుండవు; మఱేమనఁగా—కొంతపూర్ణముగాను కొంత అపూర్ణముగాను ఉండును; అందువలన జ్ఞానముత్పన్నమైన వెనుక వానికి

### [ఉక్తపూర్వపక్షమునకు సమాధానము]

ఆమాట ఘటిల్లదు; ఏల యనఁగా పురుషులు నాలుగు ప్రకారములుగా నున్నారు— మొదటిది పామరుఁడు, రెండవది విషయి, మూఁడవది జిజ్ఞాసువు, నాల్గవది ముక్తుఁడు. వీరిలో—

(1) ఈలోకమునందలి విహితభోగమునందును, నిషిద్ధభోగమునందును, ఆసక్తుఁడయి శాస్త్రసంస్కారరహితుఁడైన పురుషుఁడు పామరుఁ డనఁబడును.[1]

(2) శాస్త్రానుసారముగా విషయములను భోగించుచు ఈలోకముయొక్క లేక పరలోకముయొక్క విషయభోగమునిమిత్తము ఎవ్వఁడు కర్మము నాచరించునో, వాఁడు విషయి అనఁబడును.[2]

---

విపరీతభావన పుట్టుచున్నది; తన్నివారణార్థము వానికి మరలమరల నిదిధ్యాసనము చేయఁదగినది.

1. ఉత్తమమధ్యమకనిష్ఠభేదమువలన పామరులు మూఁడువిధములుగా నున్నారు. వారిలో—

(1) ఎవ్వఁడు శాస్త్రవేత్తయయ్యును ఈలోకముయొక్కభోగమునందు ఆసక్తుఁడో, వాఁడు ఉత్తముఁడు.

(2) ఎవ్వఁడు శాస్త్రవేత్తగాక అన్యముఖమున వినఁబడిన శాస్త్రార్థమునందు విశ్వాసములేక ఈలోకభోగమునం దాసక్తుఁడో, వాఁడు మధ్యముఁడు.

(3) ఎవ్వఁడు శాస్త్రసంస్కారమేలేక యీలోకభోగమునం దాసక్తుఁడో, వాఁడు కనిష్ఠుఁడు.

2. ఉత్తమమధ్యమకనిష్ఠభేదమువలన విషయి మూఁడు ప్రకారములుగా నుండును. వానిలో—

(3—4) జిజ్ఞాసుముక్తులయొక్క లక్షణములు ముందు చెప్పఁబడును.

## 42. జిజ్ఞాసులక్షణము

ఏపురుషునకు ఉత్తమసంస్కారమువలన సచ్ఛాస్త్రశ్రవణము ఘటిల్లునో, వానికి ఇట్టి వివేకము గలుగును—

విషయసుఖము అనిత్యము; ఎప్పుడు విషయసుఖము ప్రాప్తమగునో, అపుడు తత్పూర్వము తదిచ్ఛాది దుఃఖము అవశ్యముగా నుండును; పరిణామమునందును రోగాదిదుఃఖము కలుగును; వర్తమానకాలమునందును నాశభయమువలన దుఃఖహేతువే యగును. ఈరీతిగా విషయసుఖము దుఃఖముచేత గ్రస్తమగుటవలన నది దఃఖరూపమే.

ఆదుఃఖముయొక్క నివృత్తి లౌకికోపాయమువలనఁ గానేరదు; ఏలయనఁగా—ఎవ్వఁడు లౌకికోపాయము చేయువాఁడున్నాఁడో, వానికిని సకలదుఃఖనివృత్తి యగుటలేదు; కొంచెము దుఃఖము నివృత్తమైనను దానికి పునరుత్పత్తి యగును; ఎదివఱకు శరీరమున్నదో, అదివఱకు దుఃఖనివృత్తి సంభవింపదు; ఎందు కనఁగా—ఏది శరీరమో, అది సకలము పుణ్యపాపములవలనఁ గలిగియుండును వీనిలో—

---

(1) ఎవ్వఁడు వైకుంఠముయొక్క లేక బ్రహ్మలోకాదికముయొక్క ఇచ్ఛచేత కామ్యోపాసనమునందు ప్రవృత్తుఁ డయినాఁడో, వాఁడు ఉత్తముఁడు.

(2) ఎవ్వఁడు స్వర్గేచ్ఛవలన సకామకర్మమునందు ప్రవృత్తుఁడయినాఁడో, వాఁడు మధ్యముఁడు.

(3) ఎవ్వఁడు ఈలోకమునందలిరాజ్యాదిభోగేచ్ఛచేత పుణ్యకర్మమునందు ప్రవృత్తుఁడయినాఁడో, వాఁడు కనిష్ఠుఁడు.

మనుష్యశరీరమో మిశ్రకర్మఫల మని ప్రసిద్ధము; మఱియు దేవశరీరమును మిశ్రకర్మఫలమే; కేవలపుణ్యఫలముచేత దేవశరీర మగుననుపక్షమునందు తనకన్న నధికమైన అన్యదేవతా విభూతిఁ జూచి యీ దేవునకు సంతాపము ఏది గలుగునో, అది కలుగకుండవలయునుగదా? సర్వదేవతలస్వామియైన యింద్రునకును అనేకదైత్యదానవులవలన ననేకప్రకారమైన దుఃఖము గలుగునట్లు పురాణమునందు చెప్పఁబడినది. ఈరీతిగా దేవశరీరమును మిశ్రకర్మఫలమే.

[కర్మాధికారము [1] కేవలమనుష్యశరీరమునందుఁ గలదు; ఇతరమునందు లేదు; కనుక దేవశరీరమునందు చేసిన శుభాశుభకర్మములఫలము దేవునకు ఉత్తరశరీరమునందు కలుగదు; అని అభిప్రాయమున "దేవతలు పాపరహితులు" అని శ్రుతియందు చెప్పఁబడినది; గాని దేవతలకు పూర్వకృతమైన శుభాశుభము ఉత్తరశరీరారంభము చేయదు; ఈయభిప్రాయము లేదు; వానికి పూర్వకృతమైన ఉభయ కర్మములవలన దేవశరీరము ప్రాప్తమైనది.]

---

1. వీనిలో ఇన్ని భేదములుగలవు—పరమేశ్వరునియొక్క భక్తి, దయ, సత్యము, జ్ఞానము మొదలయిన శుభగుణములందు మనుష్యమాత్రునకు అధికారముగలదు. వర్ణాశ్రమములకర్మములందు వర్ణాశ్రమములుగల మనుష్యునకు యథాయోగ్య మధికారము గలదు. అందువలన దేవతిర్యక్పశుపక్షులకు క్రమముగా సర్వజ్ఞత, మఱియు అజ్ఞత యను హేతువులవలన క్రమముగా జ్ఞానిబాలకన్యాయమున వర్తమానశరీరమునందు చేసిన శుభాశుభకర్మము అన్యజన్మమునందు ఫలహేతువు గా నేరదు. ఇది శాస్త్రమర్యాద.

మఱియు తిర్యక్పశుపక్ష్యాదికశరీరమును మిశ్రకర్మ ఫలముగానే యున్నది. ఏలాగున ననఁగా—ఏది వీనికి పరతంత్రతాది ప్రసిద్ధమైన దుఃఖము గలదో, అది వాని పాపఫలము; మఱియు నేది మైథునాది సుఖము గలదో, అది పుణ్యఫలము.

[ఉదరముచేత గమనము చేయుదానిని తిర్యక్కందురు; పక్షములచేత గమనము చేయుదానిని పక్షియందురు; చతుష్పాదములచేత గమనము చేయుదానిని పశువందురు. ఒకానొకచోట పశుపక్షులను తిర్యక్కు లందురు.]

ఈరీతిగా సర్వశరీరములు పుణ్యపాపకార్యములుగా నున్నవి. ఏయొకశరీరము న్యూనపాపముచేతను, అధికపుణ్యముచేతను రచితమైనదో, అట్టిదే దేవశరీరము. ఈయభిప్రాయమున శాస్త్రమునందు కేవలపుణ్యఫలము దేవశరీర మందురు. దానిలో విరోధము లేదు. ఎట్లనఁగా—బ్రాహ్మణగృహములు అనేకములున్నదానిని బ్రాహ్మణగ్రామమం దురు. తిర్యక్పశుపక్షిశరీరములు అధికపాపముచేతను, న్యూనపుణ్యముచేతను రచితములైనవి. ఉత్తమమనుష్యుఁడు దేవసమానుఁడుగాను నీచమనుష్యుఁడు పశుసమానుఁడుగాను నుండును.

ఈరీతిగా సర్వశరీరములు పుణ్యపాపరచితములుగా నున్నవి; పాపఫలము దుఃఖము; అందువలన శరీర ముండువఱకు దుఃఖనివృత్తి గానేరదు.

ఆశరీరము ధర్మాధర్మములయొక్క ఫలమగుటవలన తన్నివృత్తిగాక శరీరనివృత్తి గానేరదు; ఏలయన—వర్తమాన శరీరనివృత్తి యైనను పుణ్యపాపములవలన అన్యశరీరము లగును.

ఆపుణ్యపాపములు రాగద్వేషోద్భవము లగుటవలన తన్నివృత్తిగాక పుణ్యపాపములు నివృత్తములు గావు; ఎందువలన ననఁగా—వర్తమానపుణ్యపాపములయొక్క నివృత్తి భోగముచేత నైనను రాగద్వేషములచేత పునరపి పుణ్యపాపములు సంభవించును.

ఆ రాగద్వేషములు అనుకూలప్రతికూల జ్ఞానోద్భవము లగుటవలన అనుకూలప్రతికూల జ్ఞానములనివృత్తిగాక రాగద్వేషములనివృత్తి గానేరదు; ఏలయన—వర్తమానరాగద్వేష నివృత్తి యైనను అనుకూలప్రతికూలజ్ఞానముచేత పునరుత్పత్తి యగును.

ఆయనుకూలప్రతికూలజ్ఞానము భేదజ్ఞానజన్యమగుట వలన [1] తన్నివృత్తిగాక అనుకూలప్రతికూల జ్ఞాననివృత్తి గానేరదు; ఏల యన— వర్తమానానుకూలప్రతికూలజ్ఞాన నివృత్తి యయినను భేదజ్ఞానముచేత పునరుత్పత్తి యగును.

ఆ భేదజ్ఞానము అవిద్యాజన్యము. ఏల యనఁగా—సంపూర్ణ ప్రపంచము, మఱియు తద్జ్ఞానము స్వరూపముయొక్క అజ్ఞాన

1. అజ్ఞానరూపమైన మూలనివృత్తి యయిన జ్ఞానికి అజ్ఞానకార్యమగు జీవేశ్వరులభేదము, మఱియు తదంతర్గతావశేష భేదచతుష్కము వాస్తవముగా ప్రతీతముగాదు, మఱేమనఁగా—కల్పితముగా ప్రతీతమగును; అట్లే అనుకూలప్రతికూలజ్ఞానము, రాగద్వేషాదులు, పంచక్లేశములు, మఱియు శుభాశుభక్రియలు బాధితానువృత్తిచేత దగ్ధధాన్యన్యాయమున ప్రతీతములగును; కాఁబట్టి తత్ఫలమగు భావిజన్మమును సుఖదుఃఖములును వానికిఁ గానేరవు.

కాలమం దుండును, ఇది సంపూర్ణ వేదశాస్త్రముయొక్క తేరీఖాంకారముగ నున్నది.

ఈరీతిగా సంపూర్ణ దుఃఖ హేతువు స్వరూపాజ్ఞానమే. ఆస్వరూపాజ్ఞానము స్వరూపజ్ఞానము గాక నివృత్తము గా నేరదు. ఏలయన—ఎపుడు ఏవస్తువుయొక్క అజ్ఞాన మగునో, అపుడు ఆవస్తువుయొక్క జ్ఞానమువలన ఆయజ్ఞానము దూరమగును. ఎట్లు రజ్జువుయొక్క అజ్ఞానము రజ్జుజ్ఞానమువలన దూరమగునో అట్లు స్వరూపాజ్ఞానముకూడ స్వరూపజ్ఞానము చేత దూరమగును. ఈరీతిగా స్వరూపజ్ఞానమే స్వరూపాజ్ఞాననివృత్తి ద్వారమున దుఃఖనివృత్తికి హేతువు.

మఱియు స్వరూపజ్ఞానమువలన బ్రహ్మప్రాప్తి యగును; ఆబ్రహ్మము నిత్యము, ఆనందస్వరూపము, దుఃఖసంబంధరహితముగా నున్నది. ఈరీతిగా దుఃఖనివృత్తికిని పరమానందప్రాప్తికిని హేతువు స్వరూపజ్ఞానమే, కాబట్టి స్వరూపము తెలియుట ఆవశ్యకము; ఇట్లు ఎవనికి వివేకము పొడమినదో, వానిని [1]జిజ్ఞాసు వందురు.

---

1. ఉత్తమమధ్యమకనిష్ఠభేదమువలన జిజ్ఞాసువు మూఁడువిధములు.—

(1) తీవ్రజిజ్ఞాసావంతుఁడయి చతుస్సాధనముల చేత లేక మందబోధ చేత సంపన్నుఁడయిన వాఁడు ఉత్తముఁడు.

(2) మందజిజ్ఞాసావంతుఁడయి వేదాంతశ్రవణమునందు ప్రవృత్తుఁడయినవాఁడు మధ్యముఁడు.

(3) మందజిజ్ఞాసావంతుఁడయి నిష్కామకర్మోపాసనయందు, లేక వివేకాదిసాధనములందు ప్రవృత్తుఁడైన వాఁడు కనిష్ఠుఁడు.

## 43. ముక్తలక్షణము

స్థూలసూక్ష్మకారణశరీరములకన్న భిన్నమైన తనస్వరూపము సాక్షాత్పరబ్రహ్మముగా నున్నది; ఈ ప్రకారముగా అహంబుద్ధిచే పరబ్రహ్మస్వరూపముయొక్క అపరోక్షజ్ఞానము ఎవనికైనదో, వానిని ముక్తుం డందురు.

## 44. గ్రంథమందు పామరాదిత్రయమునకు అప్రవృత్తి జిజ్ఞాసువునకు ప్రవృత్తి.

ఉక్తరీతిగా నాలుగుప్రకారములగ పురుషు లుందురు; వారియందు పామరునకును, విషయికిని విషయసుఖమునందు అలంబుద్ధి గలదు. అందువలన వారు గ్రంథంబునందు ప్రవర్తింపరు.

ఒకానొకప్పుడు ఒకానొకవిషయికి పరమసుఖేచ్ఛ గలిగినను అతఁడు దాని కేది యుపాయము గాదో, దానియందుపాయబుద్ధి కల్పించుకొని అన్యమార్గమునందు ప్రవర్తించును. ఎందు కనఁగా— పరమసుఖోపాయముయొక్క జ్ఞానమైననో, సత్సంగము వలనను, సచ్ఛాస్త్రమువలనను గలుగును; అది వానికి ప్రాప్తింపదు; కావున వానికి సుఖప్రాప్తినిమిత్తము గ్రంథమునందు ప్రవృత్తి కాఁజాలదు. అట్లు దుఃఖనివృత్తినిమిత్తమును వానికి అన్యోపాయములందు ప్రవృత్తి గలదు; కాఁబట్టి వానికి గ్రంథమునందు ప్రవృత్తి గలుగదు.

ముక్తునకేమో, ప్రవృత్తి కలుగనే కలుగదు; ఏలయన— ఎవఁడు జ్ఞానవంతుఁడో, వానిని ముక్తుం డందురు; అజ్ఞాని

కృతకృత్యుఁడు[1] వాని కేదియు కర్తవ్యము లేదు. [ఈసంగతి ముందు[2] చెప్పఁబడును.] మఱియు లీలచేత ముక్తుఁడు ప్రవృత్తుఁడైనను వానికి గ్రంథప్రవృత్తివలన వినోదముదప్ప ఏప్రయోజనమును సిద్ధింపదు; కనుక ముక్తునినిమిత్తమును గ్రంథము లేదు.

పరిశేషమై జిజ్ఞాసువైన పురుషునకు విషయసుఖమునందు అలంబుద్ధి లేదు; ఎందు కనఁగా— వాఁడు పరమసుఖేచ్ఛయందాసక్తుఁడు, సమూలదుఃఖమును తిరస్కరించిన వాఁడుగానున్నాఁడు; ఆపరమసుఖప్రాప్తియు, సమూలదుఃఖనివృత్తియు జ్ఞానమువలననేగాక ఇతరోపాయముచేతఁ గానేరదని వానికి సత్సంగమువలన వివేకము కలుగును; వానికి గ్రంథంబునందు ప్రవృత్తి ఘటిల్లును.

ఈరీతిగా మోక్షేచ్ఛగలవాఁడు అధికారి కలఁడనుట సిద్ధమగుచున్నది; గనుక గ్రంథారంభము సఫలము.

---

1. కృతకృత్యుఁడు—అజ్ఞానదశయందు ఈలోకవ్యవహారముకొఱకు వ్యవసాయాదులు, పరలోకనిమిత్తముసకామకర్మోపాసనలు, చిత్తశుద్ధ్యైకాగ్రతలనిమిత్తము నిష్కామకర్మోపాసనలు, వేదాంతశ్రవణముకొఱకు వివేకాది సాధనములు, అపరోక్షజ్ఞానముకొఱకు గురూపదేశము, సంశయాదులనివృత్తికొఱకు శ్రవణాదులు, తత్పదార్థమునం దుండిన పరోక్షభ్రాంతి, మఱియుం త్వంపదార్థమునం దుండిన పరిచ్ఛిన్నభ్రాంతి నివర్తించుటకొఱకును, దృఢాపరోక్షజ్ఞానముకొఱకును ఓతప్రోతభావము [పలుమాఱు అన్వయవ్యతిరేకము] వీనిని చేయుట [సంపాదించుట] అది ఆయాయధికారికి కర్తవ్యముగ నున్నది; కావున అది చేసినవాఁడు కృతకృత్యుఁడు.

2. ఈసంగతి ముందు పంచమతరంగమునందు వ్రాయఁబడును.

## విషయమండనము

## 45. 29 గత పూర్వపక్షమునకు సానువాద సమాధానము: సాక్షి బ్రహ్మైక్యసిద్ధి.

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

జీవుఁడు రాగాదిక్లేశసహితుఁడు, బ్రహ్మము క్లేశరహితము; గనుక జీవబ్రహ్మాల యేకత యైన గ్రంథముయొక్క విషయము సంభవింపదు.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఈమాట సత్యమైనను రాగద్వేషరహితుఁడైన ఏసాక్షి గలఁడో, వానికిని బ్రహ్మమునకును ఏకత ఘటిల్లును.

[మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

కర్తృభోక్తలకన్న భిన్నుఁడైన సాక్షి వంధ్యాపుత్త్రుని వలె అసత్తుగా నున్నాఁడు ?

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

సద్రూపుఁడైన సాక్షిని అసత్తనుట సంభవింపదు; ఏలయన — కర్త భోక్త యయిన సంసారియొక్క విశేష్యభాగమునకు సాక్షియనిపేరు; ఆసాక్షియొక్క నిషేధము చేసినయెడల సంసారియొక్క విశేష్యభాగమునకు నిషేధమగుటవలన సంసారియొక్కయు నిషేధ మగును.[1]

---

1. ఒక్కటే అంతఃకరణము వివేకదృష్టివలన చైతన్యమునకు ఉపాధిగాను అవివేకిదృష్టివలన అది చైతన్యమునకు విశేషణముగానున్నది; అందువలన ఒక్కటే చైతన్యము వివేకికి సాక్షిరూపముగా, అవివేకికి జీవరూపముగాఁ గనఁ

ఒకేచైతన్యంబునందు సాక్షిభావమునకు అంతఃకరణము ఉపాధిగా నున్నది; మఱియు కర్తృభోక్తృభావమునకు విశేషణముగా నున్నది. ఉపాధిమంతుని ఉపహితుఁడందురు; విశేషణసహితుని విశిష్టుఁ డందురు. ఏవస్తువు ఎంతదేశమునందు తాను ఉండునో, అంతదేశమునందుండు వస్తువును తనకన్న భిన్నము చేసి చూపించి తాను పృథక్కుగా నుండును; దానిని ఉపాధి యని చెప్పుదురు. ఎట్లనఁగా—నైయాయికమతమున కర్ణగోలకవృత్తియయిన ఆకాశమును శ్రోత్రమందురు. ఆస్థానమునందు ఆకర్ణగోలకము శ్రోత్రమునకు ఉపాధిగా నున్నది. ఏలనున— ఆకర్ణగోలకము ఎంతదేశమునందు తానుండునో, అంతదేశమునందుండు ఆకాశమును శ్రోత్రరూపముచేత చూపించి తాను పృథక్కుగా నుండును. అట్లు అంతఃకరణమును ఎంతదేశమునందు తానుండునో, అంతదేశమునందు స్థితమైన చైతన్యమును సాక్షిసంజ్ఞచేత చూపించి తాను పృథక్కుగా నుండును. అందువలన అంతఃకరణము సాక్షికి ఉపాధిగా నున్నది. దీనివలన నీయర్థము[1] సిద్ధమైనది— అంతఃకరణమునందు వర్తించునట్టి ఏచైతన్యమాత్రము గలదో, దానిని సాక్షి యందురు.

---

బడుచున్నది. ఈసంగతి బాలబోధాది గ్రంథములందు సవిస్తరముగ వ్రాయఁబడియున్నది.

1. ఇచ్చట సాక్షిలక్షణముయొక్క పదకృతి [పరీక్ష] గలదు— అంతఃకరణమో, తానె యున్నది; అయినను అది తనయందు వృత్తిగలది [వర్తనముగలది] గాదు. చైతన్యమాత్రమో, బ్రహ్మమున్నది; అది అంతఃకరణవృత్తిగాదు. [బ్రహ్మము వ్యాపకమగుటవలన అది కేవలమంతఃకరణమునందు వర్తనము చేయ తగినదికాదు] అందువలన పైవ్రాసిన సాక్షిలక్షణము నిర్దోషము.

తనతోఁ గూడియున్న వస్తువును ఏది తెలుపునో, దానిని విశేషణమందురు. ఎట్లనఁగా—"కుండలవంతుఁడైన పురుషుఁడు వచ్చియున్నాఁడు." ఈస్థానంబునందు కుండలము విశేషణము; ఏలయన—తనతో సహితుఁడైన పురుషుని యాగమనమును కుండలము దెలుపుచున్నది. "నీలరూపముగల ఘటమును నేను చూచుచున్నాను" ఈస్థానంబునందును నీలరూపము ఘటమునకు విశేషణముగ నున్నది.

అట్లు అంతఃకరణమును కర్తయు, భోక్తయు నైన జీవచైతన్యమునకు విశేషణముగా నున్నది. ఏలయన— ఆయంతఃకరణము తనతో సహితమైన చైతన్యమును కర్తృభోక్తృరూపముచేత దెలుపుచున్నది. దీనివలన ఈయర్థము సిద్ధమగుచున్నది.—అంతఃకరణమునందు వర్తించు చైతన్యమును, అంతఃకరణమును జేర్చి సంసారి యందురు. [ఈయర్థము విస్తారముగా ముందు[1] చెప్పఁబడును.]

రాగద్వేషాదిక్లేశములు సంసారియందుఁ గలవు; సాక్షియందు లేవు. సంసారికిని విశేషణమైన యే యంతఃకరణము గలదో, దానియందుఁ[2] గలవు; విశేష్యమైన చైతన్యమందు లేవు. ఏలయన—సంసారియందు విశేష్యమైన ఏచైతన్యభాగము గలదో, దానికి సాక్షికి భేదము లేదు. [ఒక్కటే చైతన్యము అంతఃకరణముతోఁగూడి సంసారి యనఁబడును; అంతః

1. ఈసంగతి నాలుగవతరంగమునందును, ఆఱవతరంగమునందును వ్రాయఁబడును.

2. దేనికి విశేషణము ఆశ్రితమగునో, దానిని విశేష్యభాగ మందురు.

కరణభాగము త్యజించి కేవలచైతన్యభాగము సాక్షి యనఁబడును.] కనుక విశేష్యభాగమందు క్లేశము నంగీకరించినట్లయిన సాక్షియందును అంగీకరింపవలసివచ్చును; సాక్షియో, సర్వక్లేశరహితుఁ డని వేదముయొక్క సిద్ధాంతము.

ఈరీతిగా క్లేశము సంసారియొక్క విశేషణభాగమైన అంతఃకరణమునందే గలదు; ఈయభిప్రాయమువలననే కొన్ని గ్రంథాంతరములందు రాగద్వేషములు బుద్ధియొక్క ధర్మమని చెప్పఁబడియున్నది; జీవుని ధర్మ మని చెప్పలేదు.

ఈరీతిగా అంతఃకరణవిశిష్టమునకు బ్రహ్మముతో ఏకత ఘటిల్లదు; అయినను అంతఃకరణోపహితమైన సాక్షికి బ్రహ్మముతో ఏకత ఘటిల్లినది.

## 46. ౩౦ గతపూర్వపక్షమునకు సానువాద సమాధానము. జీవబ్రహ్మైక్యసిద్ధి.

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

సాక్షి నానాగా నున్నాఁడు; బ్రహ్మమో, ఒకటి; కనుక నానాసాక్షికిని ఒక బ్రహ్మముతో ఏకత ఘటిల్లదు; వ్యాపకమైన ఒక బ్రహ్మముతో సాక్షికి అభేద మంగీకరించినపుడు సాక్షియును సర్వశరీరవ్యాపకుఁడు ఒక్కఁడే యగును; అపుడు ఆయొకేసాక్షికి సర్వశరీరములయొక్క సుఖదుఃఖభానము గావలసియుండె.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఈ ఆక్షేపము ఘటిల్లదు; ఏలయన—సాక్షి నానాగా నున్నను, పరిచ్ఛిన్నుఁడుగానున్నను వ్యాపకబ్రహ్మముకన్న భిన్నుఁడుగాఁడు; మ తేమనఁగా—బ్రహ్మరూపుఁడే యగును.

ఎట్లనఁగా—ఘటాకాశము నానాగానున్నను, పరిచ్ఛిన్నముగా నున్నను మహాకాశముకన్న భిన్నము గాదు; మఱేమనఁగా— మహాకాశరూపమే యగును.

[మఱియును పూర్వపక్షియొక్క పూర్వ
భాషణమునకు అనువాదము.]

సుఖదుఃఖాదికము అంతఃకరణవృత్తికి విషయము గాదు?
[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఈ పూర్వపక్షియొక్క వచనము అసంగతము. ఏలయన సుఖదుఃఖాదికము సాక్షిభాస్యముగానున్నను, అసాక్షి నానాగా నున్నను ఎప్పుడు అంతఃకరణముయొక్క పరిణామము సుఖదుఃఖాదివిషయరూప మగునో, అపుడు దానితోడనే అంతఃకరణముయొక్క జ్ఞానరూపపరిణాము మైన వృత్తి సుఖదుఃఖాదికమును విషయము చేయునది యగును; ఆవృత్తియందారూఢుఁడైన సాక్షి దానికి ప్రకాశకుఁడుగా నుండును. ఈయభిప్రాయమున గ్రంథకారునిచేత సుఖాదికము సాక్షికి విషయమని చెప్పబడినది; అయినను వృత్తిరహితుఁడైన కేవలసాక్షికి విషయము గాదు.

ఈస్థానమందు దీరహాస్యము గలదు—ఆకాశంబునందు ఘటాకాశమను పేరు, మఱియు జలానయనరూపమైన కార్యము ఏది ప్రతీత మగునో, అది ఘటోపాధిదృష్టివలన ప్రతీత మగును; ఆదృష్టిగాక ఆపేరు, మఱియు ఆకార్యము ప్రతీతము గానేరదు; మఱేమనఁగా—ఆకాశము మాత్రము ప్రతీత మగును; కనుక ఘటాకాశము మహాకాశరూపముగా నున్నది. అట్లు చైతన్య

ముందు సాక్షియనునామము [1] మఱియు ధర్మసహితాంతఃకర ణముయొక్క ప్రకాశరూపమైన కార్యము అంతఃకరణోపాధి దృష్టివలన ప్రతీత మగును; ఆదృష్టిగాక సాక్షియనునామమును, ప్రకాశరూపకార్యమును ప్రతీతము గానేరదు; మఱేమనఁగా– చైతన్యమాత్రము బ్రహ్మమే ప్రతీత మగును; గనుక సాక్షి బ్రహ్మరూపము. ఈ అభిప్రాయముచేతనే సాక్షి యొక్కఁడని చెప్పఁబడియున్నది. ఆసాక్షిజీవపదమునకు లక్ష్యము. [ఈసంగతి ముందు [2] ప్రతిపాదింపఁబడును.]

ఈరీతిగా జీవబ్రహ్మలయేకత గ్రంథముయొక్క విష యము ఘటిల్లినది.

## ప్రయోజనమండనము

## 47. 31 గత పూర్వపక్షమునకు సానువాద సమాధానము. కార్యాధ్యాస [3] నిరూపణము

1. తెల్లనికాకితమునందు మసిపూసి తన్మధ్యమునందు శ్వేతాక్షరరచ నము చేయుదురు; ఆయక్షరములకును, తెల్లనికాకితమునకును ఎట్లు కథనమాత్ర భేదముగలదో, వాస్తవభేదములేదో, అట్లు సాక్షికిని, శుద్ధచైతన్యమునకును భేదముగ కథనమాత్రము గలదు. ఎట్లు కజ్జలరూపోపాధి దృష్టిలేక అక్షరనామ మేమియు లేదో, పట్టి తెల్లనికాకితమే యున్నదో, అట్లు అంతఃకరణరూప మయిన ఉపాధిదృష్టిలేక సాక్షిపేరు లేదు; పట్టి శుద్ధచైతన్యమే గలదు.

2. ఈసంగతి నాలుగవతరంగమునందును, ఆఱవతరంగమునందును వ్రాయఁబడును.

3. అజ్ఞానకృతమైన స్థూలసూక్ష్మప్రపంచముయొక్క భ్రమ మేది గలదో, అది కార్యాధ్యాస మనఁబడును.

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

బంధము సత్యమగుటవలన తన్నివృత్తి జ్ఞానమువలనఁ గానేరదు; మిథ్యావస్తువుయొక్క నివృత్తిజ్ఞానమువలన అగును; ఆత్మయందు మిథ్యాబంధముయొక్క సామగ్రి లేదు; గనుక బంధము సత్యము; తన్నివృత్తి జ్ఞానమువలనఁ గానేరదు ?

(ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.)

ఈమాట ఘటిల్లదు. ఏల యన—బంధము మిథ్యయే; దానియొక్క నివృత్తి జ్ఞానమువలననే అగును.

48. ౩౨.౩౩ గతపూర్వపక్షమునకుసాను వాదసమాధానము: పూర్వపూర్వసంస్కారము వలన ఉత్తరోత్తరాధ్యాసము.

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

ఎట్లు సత్యసర్పజ్ఞానము సంస్కారద్వారమున సర్పాధ్యాసమునకు హేతు వగునో, అట్లు సత్యబంధముండినయెడల సత్యబంధముయొక్క జ్ఞాన మగుచుండెను; జ్ఞాన ముండినయెడల అజ్ఞానమునకు సంస్కార ముండవలెను; సిద్ధాంతమందైననో, అనాత్మవస్తువేదియు సత్యము గాదు; గనుక సత్యవస్తుజ్ఞానజన్య సంస్కారమైన ఏఅధ్యాససామగ్రి గలదో, దానియొక్క అభావ మగుటవలన బంధము అధ్యాసరూపము గాదు; బంధము సత్యమే.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఈశంక ఘటిల్లదు; ఏలయన—అధ్యాసమునందు సంస్కారద్వారమున సత్యవస్తుజ్ఞానము హేతువు గాదు; మత్తే

మనఁగా—వస్తుజ్ఞానముమాత్రము హేతువుగా నున్నది; ఆవస్తువు సత్యముగానీ, లేక మిథ్యగానీ. సత్యవస్తువుయొక్కయు జ్ఞానము అధ్యాసమునకు హేతువైనపక్షమునందు ఏపురుషుఁడు సత్యమైన చూతవృక్షము చూడ లేదో, ఇంద్రజాలికకల్పితమైన మిథ్యాచూతవృక్షము మాత్రము పలుమాఱుఁ జూచి ఇంద్రజాలికునిచేత ఇది చూతవృక్ష మని తెలుపఁబడెనో, ఆపురుషునకు నీపవృక్షమును చూచినపుడు చూతవృక్షముయొక్క అధ్యాస మగును; అది గాకుండవలసియుండె; ఏల యన—సత్యమయిన చూతవృక్షజ్ఞానము వానికి లేదు.

మారీతిగా నైననో, ఇంద్రజాలికునిదైన మిథ్యాచూతవృక్షముఁ జూచుటచే దానియొక్క జ్ఞానము గలదు; దానిచేత అధ్యాసము ఘటిల్లవచ్చును; కనుక సిద్ధమైనది—సజాతీయవస్తుజ్ఞానజన్యసంస్కారముగూడ అధ్యాసమునకు హేతువగును. ఆ సంస్కారజనకమైన జ్ఞానము, మఱియు దానివిషయము సత్యముగానీ; లేక మిథ్యగానీ.

"సంస్కారద్వారమున జ్ఞానము హేతువు, మఱియు జ్ఞానజన్యసంస్కారము హేతువు" అనునీ వాక్యద్వయమునందు అర్థభేదము లేదు; ఒక్కటే యర్థము. ఏలయన—"సంస్కారద్వారమున జ్ఞానము హేతువు" అను వాక్యమున కర్థము—జ్ఞానము సంస్కారమునకు హేతువు; ఆ సంస్కారము అధ్యాసమునకు హేతువు. ఈరీతిగా సంస్కారద్వారమున జ్ఞానమునకు హేతుత్వము చెప్పుటవలనను జ్ఞానజన్యసంస్కారమునకు అధ్యాసమునందు హేతుత సిద్ధమైనది.

మఱియు పూర్వపక్షీ యో, వస్తుజ్ఞానమునకే అధ్యాసము నందు హేతుత్వము చెప్పెను; అది ఘటిల్లదు. ఏలయన ఇది నియమము—ఏది హేతువగునో, అది కార్యముకన్న అవ్యవహితపూర్వకాలమునందుండవలెను. ఎట్లు ఘటమునకు హేతువు దండము; అది ఘటముకన్న అవ్యవహిత పూర్వకాలమునందున్నదో, అట్లు అధ్యాసమునకు హేతువైన ఏ జ్ఞానము అంగీకరింపఁబడునో, అదియు అధ్యాసముకన్న అవ్యవహితపూర్వకాలమునందు నుండవలెనుగదా! అది ఘటిల్లదు.

ఘటిల్లినయెడ ఏపురుషునకు సర్పజ్ఞానమైనదో, వానికి ఆ జ్ఞానముకన్న నెలవెనుక రజ్జువునందు సర్పాధ్యాసముయినది; అది గాకుండవలసియుండె; ఏలయన—ఏది రజ్జువునందు సర్పాధ్యాసమునకు హేతువైన సర్పజ్ఞానమో, తన్నాశముయినది; ఆజ్ఞానము అవ్యవహితపూర్వకాలమునందు లేదు; పూర్వకాలమునందుండినను అవ్యవహితపూర్వకాలమునందు లేదు; [అంతర రహితునకు అవ్యవహిత మని పేరు; అంతరసహితమునకు వ్యవహిత మని పేరు]

సిద్ధాంతి అనుచున్నాఁడు—ఉక్తసిద్ధాంతమును విని పూర్వపక్షి ఒకానొకప్పుడు ఇట్లు చెప్పును—కార్యమునకన్న పూర్వకాలమునందు హేతువుండవలెను; ఆకాలము వ్యవహితము గానీ; అవ్యవహితము గానీ అవ్యహితపూర్వకాల వర్తియే హేతువని యంగీకరించినపుడు విహితకర్మము స్వర్గప్రాప్తికి హేతువు, మఱియు నిషిద్ధకర్మము నరకప్రాప్తికి హేతువు. ఈశాస్త్రవచనము అప్రమాణ మగును; ఏలయన—కాయికవాచికమానసికమైన క్రియకు పేరుకర్మము; ఆక్రియయో,

అనుష్ఠానకాలానంతరము నశించును; స్వర్గనరకములో, కాలాంతరమున ప్రాప్తములగును; స్వర్గనరక ప్రాప్తికి అవ్యవహితపూర్వ కాలమునందు విహితనిషిద్ధకర్మములు లేవు; ఎట్లు వ్యవహిత పూర్వకాలముయొక్క శుభాశుభకర్మములు స్వర్గనరకప్రాప్తికి హేతువులుగా నున్నవో, అట్లు వ్యవహితపూర్వకాలమునందుఁ గలిగిన సర్పజ్ఞానమును రజ్జువునందు సర్పాధ్యాసమునకు హేతువుగా నుండవలెను? [ఉక్తాక్షేపమును, క్రింద వ్రాసిన సమాధానమును రెండును సిద్ధాంతిచేత కల్పిత మని ఎఱుఁగవలెను.]

ఉక్తమైన పూర్వపక్షియొక్క వచనము ఘటిల్లదు. ఏల యన—ఎట్లు నష్టజ్ఞానమువలన లేక నష్టకర్మమువలన అధ్యాసము మఱియు స్వర్గనరకములయొక్క ప్రాప్తి అంగీకరింపఁబడినదో, అట్లు మృతకులాలునిచేతను నష్టదండాదులచేతను ఘటోత్పత్తి యంగీకరింపవలసివచ్చును. ఏలయన–ఎట్లు సర్పాధ్యాసముకన్న, స్వర్గనరకప్రాప్తికన్న వ్యవహితపూర్వకాలమునందు సర్పజ్ఞానము, శుభాశుభకర్మములు గలవో, అట్లు ఘటముకన్న వ్యవహిత పూర్వకాలమునందు మృతకులాలుఁడును, నష్టదండాదులును గలవు; వీనిచేతను ఘటోత్పత్తి కావలెను; అది గానేరదు. దాని వలన సిద్ధమయిన దేమనఁగా—వ్యవహితపూర్వకాలమునందు వవస్తువును హేతువు గాదు; మఱేమనఁగా—అవ్యవహిత పూర్వకాలస్థితవస్తువే హేతు వగును.

శుభాశుభకర్మములును కాలాంతరభావియగు స్వర్గనరక ప్రాప్తికి హేతువు గావు; మఱేమనఁగా—శుభాశుభకర్మములు తమకన్న అవ్యవహితోత్తరకాలమునందు ధర్మాధర్మములయొక్క ఉత్పత్తి చేయును; ఆధర్మాధర్మములు అంతఃకరణమునందుండును;

వీనివలన కాలాంతరమునందు స్వర్గనరకప్రాప్తి యగును, తదనంతరము ధర్మాధర్మములయొక్క నాశమగును. ఈయభిప్రాయము వలననే శాస్త్రమునందు శుభాశుభకర్మములు అపూర్వద్వారమున ఫలహేతు వని చెప్పుదురు; సాక్షాద్ధేతు వని చెప్పరు.

[అపూర్వ మనఁగా ధర్మాధర్మములు. వీనినే యదృష్టమందురు; వీనినే పుణ్యపాపము లందురు. కొందఱు ధర్మాధర్మజనకములైన యేశుభాశుభక్రియలు గలవో, వానినికూడ ధర్మాధర్మము లందురు. ఎట్లనఁగా—శుభక్రియాకర్తను కొందఱు ధర్మాత్ముఁడందురు. మఱియు అశుభక్రియాకర్తను అధర్మాత్ముఁడు లేక దురాత్ముఁ డందురు. ఆ శుభాశుభక్రియలపేరు ధర్మాధర్మములు గావు; ఆక్రియలో, ధర్మాధర్మములకు జనకముగానున్నవి; ఆ క్రియలుకూడ ధర్మాధర్మము లందురు. ఎట్లనఁగా ఆయుర్వర్ధనమైన ఘృతమునకు వైద్యశాస్త్రమునందు ఆయువందురు.]

ఈరీతిగా అవ్యవహితపూర్వకాలమునందే హేతువు సిద్ధమైనది.

రజ్జువునందు సర్పాధ్యాసముకన్న అవ్యవహితపూర్వకాలమునందు సర్పజ్ఞానము లేదు; గనుక ఆసర్పజ్ఞానము రజ్జువునందు సర్పాధ్యాసమునకు హేతువు గాదు; సర్పాధ్యాసమునకు అవ్యవహితపూర్వకాలమునందు సర్పజ్ఞానజన్యసంస్కారము మాత్రమున్నది; కావున ఆసర్పజ్ఞానజన్యసంస్కారమే సర్పాధ్యాసమునకు హేతువుగా నున్నది. అట్లు శుక్తియందును రజతాధ్యాసమునకు హేతువు రజతజ్ఞానజన్యసంస్కారముగానే యున్నది. ఈరీతిగా సకలస్థానంబులందును వస్తుజ్ఞానజన్యసంస్కా-

రమే అధ్యాసమునకు హేతువుగాను, వస్తుజ్ఞానము సంస్కార మునకు హేతువుగాను నున్నది. ఎట్లు శుభాశుభకర్మజన్యధర్మా ధర్మములు అంతఃకరణమునందుఁ గలవో, అట్లు వస్తుజ్ఞానజన్య సంస్కారమును అంతఃకరణమునందుఁ గలదు. ఏపురుషునకు పూర్వము సర్పజ్ఞానము గాలేదో, ఇతరవస్తుజ్ఞాన జన్యసంస్కా రము మాత్రము గలదో, వానికి రజ్జువునందు సర్పాధ్యాసము గానేరదు.

ఏవస్తువుయొక్క అధ్యాసమయినదో, తత్సజాతీయవస్తు జ్ఞానజన్యసంస్కారము అధ్యాసమునకు హేతువుగా నుండును; విజాతీయవస్తుజ్ఞానజన్యసంస్కారము హేతువు గాదు. సర్పము నకు సజాతీయము సర్పము; వేఱు గాదు; కావున ఎవ్వనికి పూర్వము సర్పజ్ఞానము లేదో, కాని అన్యవస్తుజ్ఞానము మా త్రము గలదో, వానికి సజాతీయవస్తుజ్ఞానజన్యసంస్కారము లేనందున రజ్జువునందు సర్పాధ్యాసము గా నేరదు. [సూక్ష్మావస్థకు సంస్కార మనిపేరు] ఈరీతిగా అధ్యాసముకన్న మొదలు సజా తీయవస్తుజ్ఞానజన్యసంస్కారము మాత్రము ఉండవలెను; ఆ వస్తువు సత్యముగానీ; మిథ్యగానీ.

ఆసంస్కారమైననో, బంధాధ్యాసమునందు ఘటిల్లినది. ఏలయన— ఏవి అహంకారము మొదలుకొని అనాత్మవస్తువు లుఱియు తద్జ్ఞానము గలదో, దానినె బంధ మందురు. ఆ యనాత్మవస్తువు రజ్జుసర్పన్యాయమున ఎప్పుడు ప్రతీతమగునో, అప్పుడే యున్నది; ఎప్పుడు ప్రతీతము గాదో, అప్పుడు లేదు; ఇది మా వేదసమ్మతమయిన సిద్ధాంతము. ఈకారణముననె ఎచ్చట ఏ పదార్థమునకును ప్రతీతి గాదో, అట్టి సుషుప్తియందు

సర్వప్రపంచాభావమే ప్రతిపాదింపఁబడినది. ఈమతమునకు శాస్త్రమునందు [1] దృష్టిసృష్టివాద మందురు [ఈయర్థమును[2] ముందు ప్రతిపాదించుచున్నాము.]

ఈరీతిగా అనంతమైన అహంకారాదికమును, తజ్ జ్ఞానమును ఒకేకాలంబునందు ఉత్పన్నమైనది; మఱియు ఒకేకాలంబునందు లీనమైనది. ఎప్పుడు అహంకారాదికముయొక్క ప్రతీతి యగునో, అప్పుడే దాని ఉత్పత్తి యగును; ప్రతీతియొక్క లయమైనప్పుడు దానిలయ మగును; కావున అహంకారాదికవిషయమును; తజ్ జ్ఞానమును చేర్చి అధ్యాసమందురు. [ఈమాట ముందు ప్రతిపాదించుచున్నాము.]

యద్యపి అహంకారము సాక్షిభాస్యము; గనుక తత్ప్రతీతియును సాక్షిరూపముగా నున్నది. దానికి ఉత్పత్తి, లయమును వ్యవహారము ఘటిల్ల దనుట వాస్తవమే; తథాపి సాక్షి అహంకారమును వృత్త్యపేక్షవలన ప్రకాశింపఁజేయును; సాక్షాత్తు గాదు; తద్వృత్తికి ఉత్పత్తి, లయ నుగుటవలన అహంకారాదులకును ఉత్పత్తి, లయము చెప్పఁబడినది. ఈరీతిగా ఉత్తరోత్తరాహంకారాదులయొక్కయు, తద్ జ్ఞానముయొక్కయు ఉత్పత్తిహేతువు పూర్వపూర్వమయిన మిథ్యాహంకారాదులయొక్క జ్ఞానజన్యసంస్కారము ఘటిల్లినది.

---

1. దృష్టి [అవిద్యావృత్తిరూపజ్ఞానము] యొక్క సమసమయమునందు సృష్టి [పదార్థోత్పత్తి] తద్వాదము [కథనము] ఏపక్షమునందు చేయఁబడినదో, ఆపక్షమును శాస్త్రమునందు దృష్టిసృష్టివాద మందురు.

2. ఈఅర్థము ఆఱవతరంగమునందు వ్రాయఁబడును.

[మఱియును పూర్వపక్షియొక్క
పూర్వభాషణమునకు అనువాదము]

ఉత్తరోత్తరాహంకారాదికముయొక్క అధ్యాసమందైననో, పూర్వపూర్వాధ్యాసముయొక్క సంస్కారము హేతువు ఘటిల్లినను అన్నిటికి ప్రథమమం దుండిన ఏ అహంకారము, మఱియు తజ్జ్ఞానముగలవో, వానియొక్క హేతువు సంస్కారము ఘటిల్లదు. ఏలయన—ప్రథమాహంకారముకన్న పూర్వము మఱియొక అహంకారముండెనేని అప్పుడు తజ్జ్ఞానజన్య సంస్కారము ప్రథమాహంకారమునకు హేతు వగును; ప్రథమాహంకారముకన్న పూర్వము వేఱొక అహంకారముండనే లేదు; అట్లైన సర్వవస్తువులయొక్క ప్రథమాధ్యాసమునకు హేతువు సంస్కారము ఘటిల్లదు?

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము]

ఈశంకయు సిద్ధాంతముయొక్క అజ్ఞానమువలన అయినది; ఏలయన ఇది వేదాంతముయొక్క సిద్ధాంతము—బ్రహ్మము, ఈశ్వరుడు, జీవుడు, అవిద్య, భేదము, మఱియు సంబంధము ఈ యాఱుపదార్థములు స్వరూపముచేత అనాదులుగా నున్నవి.

ఏవస్తువునకు [1] ఉత్పత్తి లేదో, దానిని స్వరూపముచేత అనాది యందురు; అహంకారాదికమునకో, శ్రుతులందు ఉత్పత్తి

1. బ్రహ్మేశ్వరాదులగు ఆఱుపదార్థములయొక్క యనాదిత్వము—
(1) బ్రహ్మము అవిద్యకు[మూలప్రకృతికి] అధిష్ఠానమగుటవలన దానికి అవిద్యవలన ఉత్పత్తి లేదు. మఱియు ఈశ్వరజీవాదులనాల్గింటి యొక్క సిద్ధియో, బ్రహ్మములేక కాదు; గనుక ఈనాలుగుపదార్థములచేతను బ్రహ్మముయొక్క యుత్పత్తి గానేరదు; కాబట్టి బ్రహ్మము అనాది.

చెప్పఁబడియున్నది; కావున అహంకారాదికము స్వరూపముచే ననాది గాదని చెప్పఁదగియున్నను ప్రవాహరూపము

(2) బ్రహ్మము నిర్వికార మగుటవలన వానిచేత అవిద్యోత్పత్తి సంభవింపదు; ఈశ్వరాదుల నాల్గింటియొక్క సిద్ధియో, అవిద్యాసిద్ధికి అధీనముగా నున్నది; కనుక వీనిచేతను అవిద్యయొక్క యుత్పత్తి సంభవింపదు; కాఁబట్టి అవిద్యయు అనాది.

(3—4) కేవలబ్రహ్మమువలన లేక కేవలమాయవలన లేక ఈరెంటియొక్క భేదమువలన లేక స్వసిద్ధియొక్క యధీనమైన దేభేదము గలదో, [జీవేశ్వరులు తాము పుట్టినతరువాత ఆజీవేశ్వరులందు పరస్పర భేదముగలదో] దానివలన జీవేశ్వరులయొక్క ఉత్పత్తి సంభవింపదు; అవిద్యాచైతన్యసంబంధమువలన [ఈసంబంధము భేదాభేదముల కన్న విలక్షణ మగుటవలన దీనిని తాదాత్మ్యసంబంధమందురు. ఈసంబంధముయొక్క విశేషవర్ణనము ముందు చేయఁబడును.] జీవేశ్వరులసిద్ధి సంభవించినది; ఈసంబంధము తానును అనాది యగుట వలన జీవేశ్వరులు అనాదులు.

(5) బ్రహ్మము,మఱియు అవిద్య అనాదియగుటవలన వీరికి తాదాత్మ్యసంబంధమును అనాదిగానున్నది;అందువలన బ్రహ్మావిద్యల చేత సంబంధోత్పత్తియనఁగూడదు;ఈశ్వరాదిత్రయముయొక్కసిద్ధియో, బ్రహ్మావిద్యాసంబంధసిద్ధికి అధీనముగా నున్నది; కనుక ఈశ్వరాదిత్రయమువలనను సంబంధముయొక్క యుత్పత్తి సంభవింపదు; కాఁబట్టి సంబంధమును అనాదిగా నున్నది.

వృక్షము స్వయముగ అచలమగుటవలన ఎవ్వనితో సంబంధము చేయుటకు ఎక్కడను పోదు; అయినను పక్షియొక్క క్రియవలన వృక్షపక్షిసంబంధము కలుగుచున్నది. అట్లు బ్రహ్మము స్వయముగా అసంగపదార్థమగుటవలనను

వలన సకలవస్తువులును అనాదులే. అనాదికాలమునుండి ఇది

అక్రియమగుటవలనను ఎవ్వనితో సంబంధము చేయుటకు ఆ బ్రహ్మము స్వయముగ ప్రవర్తింపదు; అందువలన ఎవ్వనితో దానియొక్క సంబంధము సంభవింపదు; అయినను అవిద్యాస్వభావమువలన బ్రహ్మావిద్యాసంబంధము చెప్పఁబడియున్నది. ఎట్లు జ్యోతిశ్శాస్త్రమునందు గ్రహమైత్రిప్రకరణములో ఒకగ్రహము ఇంకొక్కగ్రహముతో మిత్రత్వము ఎఱుఁగుచున్నది; అయినను ఆగ్రహము దీనితో మిత్రత్వము ఎఱుఁగదు. అలాగు అవిద్య తాను బ్రహ్మముతో సంబంధము ఎఱుఁగుచున్నది; గాని బ్రహ్మము అవిద్యతో సంబంధము ఎఱుఁగదు. ఈప్రకారముగ ఉపదేశచండాంశులైన వేదాంతశాస్త్రకారులచేత బ్రహ్మావిద్యలయొక్క సంబంధము కల్పితముగ చెప్పఁబడియున్నది. ఉక్తసంబంధము చేత అసంగమైన బ్రహ్మముయొక్క అసంగత్వమునకు లేశమాత్రముకూడ హాని లేదు. ఈవిధముగా చెప్పఁబడిన బ్రహ్మావిద్యాసంబంధ సంగతియొక్క స్మరణము జిజ్ఞాసువులు తమ మనస్సునందు సర్వకాలముగ నుంచవలయును.

(6) భేదముయొక్క విచారము ఇట్లున్నది—బ్రహ్మావిద్యాదులగు అయిదువస్తువులకు ఎట్లు అన్యవస్తువులచేత ఉత్పత్తి ఘటిల్లదో, అట్లు తమలో తమచేతను ఉత్పత్తి ఘటిల్లదు;తమవలన తామే ఉత్పన్నమనినపుడు ఆత్మాశ్రయదోషమగును; కనుక తమవలన తమకే యుత్పత్తి యనఁగూడదు ఎందువలన నీ అయిదింటికి ఉత్పత్తి లేదో, అందువలన వానియందుండిన పరస్పరభేదముయొక్కయు ఉత్పత్తి ఘటిల్లదు; అందువలన ఆఱవది యయిన భేదమును అనాదిగా నున్నది.

ఈరీతిగా నీయాఱుపదార్థములయొక్క యుత్పత్తి లేదు; అందువలన నీ ఆఱును స్వరూపముచేతనే అనాదిగా నున్నవి. వీనిలో ఒక బ్రహ్మము త్రికాలాబాధ్యమగుటవలన అనాదిఅనంతముగాను,అవిద్యాదికములగు అయిదు జ్ఞానముచేత బాధితములగుచున్నవి. కనుక అవి అనాదిసాంతములుగా నున్నవి.

వఱకు ఘటములేదను ప్రసంగము ఎప్పుడును గలుగ లేదు; కాఁబట్టి ఘటముయొక్క ప్రవాహము అనాదిగా నున్నది. ఈరీతిగానే సకలవస్తువులప్రవాహము అనాదిగా నున్నది. ప్రలయకాలమందును సుషుప్తివలెనే సర్వవస్తువులుసంస్కారరూపములై మాయయందుండును; ఈప్రకారముగ ప్రపంచముయొక్క ప్రవాహము అనాది యగుటవలన ప్రపంచమును అనాది[1] యందురు.

ఉక్తప్రకారముగా ఎవ్వనికి సిద్ధాంతజ్ఞానము లేదో, వానికే "ప్రథమాధ్యాసమునకు హేతువు సంస్కారము ఘటిల్లదు," అనునీ ఆక్షేపము జనించుచున్నది; సిద్ధాంతమం దయిననో, అహంకారాదికవస్తువులయొక్క అధ్యాసము సర్వముకన్న ప్రథమ మని చెప్పఁబడ లేదు; మఱేమనఁగా—దానికన్న పూర్వపూర్వాధ్యాసమువలన సంపూర్ణమయినఉత్తరోత్తరాధ్యాసము ఘటిల్లుచున్న దని చెప్పఁబడియున్నది.

ఈరీతిగా పూర్వపూర్వసజాతీయవస్తుజ్ఞానజన్యసంస్కారమువలన అహంకారాదికబంధముయొక్క అధ్యాసము ఘటిల్లినది.

---

1 ప్రపంచము అనాది; కాఁబట్టి బహుకాలస్థాయి అగుటవలన సత్యమగునా? ఈశంకకు సమాధానము—రజ్జువునందు సర్పభ్రాంతిగలుగును; సాక్షియందు స్వప్నమగును; అది గడియ, జాము, నాలుగుజాముల పర్యంతము ఉండినను దానిలో నిపదార్థములు ప్రతీతమగునో, అవి పూర్వసిద్ధముగా అనాదిసిద్ధముగా ప్రతీతమగును; అట్లయినను రజ్జువుయొక్క మఱియుం జాగ్రత్తయొక్క జ్ఞానమైన వానికి త్రికాలాభావనిశ్చయరూపమైన బాధ యగును; అందువలన అవి మిథ్యగా నున్నవి. అట్లు ప్రపంచమును ఆరోపదశయందు అనాదిసిద్ధముగాఁ దోఁచుచున్నది; అయినను అధిష్ఠానజ్ఞానమైనవానికి త్రికాలాభావనిశ్చయరూపమైన బాధయగును; కాఁబట్టి ప్రపంచము మిథ్య. దానిని ప్రవాహరూపముగా అనాది యని, సాంత మని యందురు.

## 49. 34. గత పూర్వపక్షమునకు సానువాద సమాధానము. అధ్యాసమునకొఱకు దోషత్రయానావశ్యకత

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము]

త్రివిధదోషములు [ప్రమాతృదోషము, ప్రమాణదోషము, ప్రమేయదోషము,] అధ్యాసమునకు హేతువులుగా నున్నవి; బంధాధ్యాసమందో, ఏదోషమును ఘటిల్లదు; గనుక బంధము అధ్యాసరూపము గాదు; మఱేమనఁగా—సత్యము.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము]

ఆశంక ఘటిల్లదు; ఏల యన—దోషము లేక అధ్యాసము గానేర దనుపక్షమందు అధ్యాసమునకు హేతువు దోషము సిద్ధించుచుండెను; విపీత, తురి, తంతు, వేమ ఇవి పటమునకు హేతువులు; వీనిలో ఏదైనను ఒకటికూడ దేని పటము గానేరదు; అట్లు ప్రమాత్రాదిదోషము అధ్యాసమునకు హేతువు గాదు. ఏలాగున ననఁగా—

[ప్రమేయదోషము లేకయే అధ్యాససిద్ధి.]

సాదృశ్యదోషము లేకయే ఆత్మయందు జాతియొక్క అధ్యాసము గలదు. బ్రాహ్మణత్వము మొదలుకొని ఏజాతులు గలవో, అవి స్థూలశరీరముయొక్క ధర్మముగాని ఆత్మయొక్క లేక సూక్ష్మశరీరముయొక్క ధర్మము గాదు. ఏల యన—అన్య శరీరప్రాప్తిమైనప్పుడు ఆత్మయు, సూక్ష్మశరీరమును పూర్వమైన స్థూలశరీరమందున్నవే యుత్తరమయిన స్థూలశరీరమందు ఉండును; మఱియు జాతిమాత్రము అన్యమగును. ఈనియమము లేదు—"పూర్వమయిన స్థూలశరీరస్థితజాతియే ఉత్తరమయిన

స్థూలశరీరమం దుండును". ఆ జాతి ఆత్మయొక్క లేక సూక్ష్మశరీరముయొక్క ధర్మమగుచుండెనేని ఉత్తరశరీరమందు అన్యజాతి గాఁగూడదుగదా! అట్లగుటవలన జాతి ఆత్మయొక్క లేక సూక్ష్మశరీరముయొక్క ధర్మమని సిద్ధింపదు; మ తేమనఁగా— స్థూలశరీరధర్మమనియే సిద్ధించినది.

నేను ద్విజాతిని. ఈరీతిగా బ్రాహ్మణత్వము, క్షత్రియత్వము, వైశ్యత్వములను ఈ మూఁడుజాతులయొక్క జ్ఞానము ఆత్మయందు కలుగుచున్నది; ఇదే ఆత్మయందు జాతియొక్క అధ్యాసముగా నున్నది. ఆత్మతోడనో, జాతికి సాదృశ్యము లేదు. చూడుము—

ఆత్మ వ్యాపకుఁడు, జాతి పరిచ్ఛిన్నము. ఆత్మ ప్రత్యక్కు, జాతి పరాక్కు; ఆత్మ విషయి, జాతివిషయము. ఈరీతిగా ఆత్మయందు సర్వథా విరోధి యయిన జాతియొక్క అధ్యాసము గలుగుచున్నది.

ఎట్లు ఆత్మయందు సాదృశ్యము లేకయు జాతియొక్క అధ్యాస మగునో, అట్లు ఆత్మయందు సాదృశ్యము లేకయే అహంకారాదికబంధముయొక్క అధ్యాసము ఘటిల్లుచున్నది.

ఇంతేగాదు—శంఖంబునందు [1] పీతతయొక్క, ఖండ

1. న్యాయమతమునందు నిత్యము, ఏకము, మఱియు అనేకధర్మ లందు [వ్యక్తులందు] అనుగతమగు ధర్మమును జాతి యందురు; దానికిని, ఆత్మకును సాదృశ్యరూపమైన ప్రమేయదోషము ఘటిల్లుచున్నది; దానిచే ఆత్మయందు జాతియొక్క అధ్యాసమగుచున్నది. ఈరీతిగా ప్రమేయదోషము అధ్యాసమునకు హేతువుగా నున్నది. ఈశంకను మనస్సునం దుంచుకొని శంఖమునందు శ్వేతతాధ్యాస మను పేఱుదృష్టాంతము ఈయఁబడినది.

శర్కరయందు [1] చేఁదుయొక్క అధ్యాసముగూడ సాదృశ్య దోషము లేకయు కలుగుచున్నది.

---

1. శంఖమునందు పీతతయొక్క అధ్యాసము లేదు; మఱేమనఁగా—కామలరోగయుక్తమైన నేత్రమునందుండు పీతవర్ణము శంఖమునందు సంక్రమించుచున్నది; కనుక శంఖము పసుపువర్ణము గలది యగును.

సమాధానము—ఘటమునకు పూయఁబడిన సువర్ణము స్వర్ణకారునకు, మఱియు అన్యపురుషునకు అగపడుచున్నది; శంఖముయొక్క పీతవర్ణమైననో, తనకే అగపడుచున్నది; గాని ఇతరునకుఁ గనఁబడదు; అందువలన ఆవర్ణము నేత్రముననుండి వెడలి శంఖమునందు సంక్రమింపలేదు; మఱేమనఁగా—కేవలభ్రమరూపమే.

ఆకాశమునందు ఎగురుచున్న పక్షి యెవని నేత్రసమీపమున పోయినదో; వానికి దూరదేశమువఱకు నగపడుచున్నది; అన్యునకుఁ గనఁబడదు. అట్లు ఈపీతవర్ణమును ఎవ్వని కంటినుండి బయలువెడలి శంఖమువఱకు పోయినదో; వానికే అగపడును; గాని ఇతరునకుఁ గనఁబడదు; అందువలన నాపీతవర్ణము సత్యముగా నున్నది.

సమాధానము—ఆకాశమునందు ఎగురుచున్న పక్షి యెవ్వని దృష్టిసమీపమున పోయినదో, ఆపురుషుఁడు అంగుళీనిర్దేశముచేత చూపువేని అన్యపురుషునకు అగపడును. అట్లు శంఖముయొక్క పీతవర్ణము అంగుళీనిర్దేశమువలనను అన్యునకు అగపడదు; అందువలన నది సత్యము గాదు; మఱేమనఁగా—భ్రమరూపమే.

ఈరీతిగా శంఖమునందు పీతతాధ్యాసము సాదృశ్యదోషము లేకయే ఆయినది. అట్లయినను ఈదృష్టాంతము ఉక్తశంకాసమాధానరూపమైన వివాదమువలన సిద్ధించుచున్నది; ప్రత్యక్షసిద్ధవస్తువునందు వివాదము లేదు. ఈశంక మనస్సునందుంచుకొని ఖండశర్కరయందు కటుతాధ్యాసము అను మూఁడవ దృష్టాంతము చెప్పఁబడుచున్నది.

ఈ ప్రకారముగాఁజూచినయెడల దోషము [ప్రమేయ దోషము] అధ్యాసమునకు హేతువుగాదు.

[ప్రమాతృప్రమాణములదోషములేకయే అధ్యాససిద్ధి]

ప్రమాతృదోషమును అధ్యాసహేతువు గాదు. ఏల యన—లోభరహితుఁడై వైరాగ్యవంతుఁడైన పురుషునకును శుక్తియందు రజతాధ్యాసము కలుగుచున్నది.

ప్రమాణదోషమును అధ్యాసహేతువు గాదు. ఏల యన—సకలపురుషులకు రూపరహితమయిన ఏయాకాశము గలదో, అది నీలరూపముగా, కటాహాకారముగా, పటకుటీరా కారముగా ప్రతీతమగుచున్నది.

ఆకాశమునందు నీలాదికముయొక్క ఏ అధ్యాసము గలదో, దానియందు ఒక ప్రమాణదోషాభావము మాత్రము [1] గలదని గాదు; మఱేమనఁగా— సకల దోషములయొక్క అభావము గలదు [సాదృశ్యమును లేదు; ప్రమాతృదోషమును లేదు.] ఎట్లు సర్వదోషాభావముండినను ఆకాశమునందు నీలాదికముయొక్క అధ్యాసమయినదో, అట్లు ఆత్మయందును బంధాధ్యాసము దోషములేకయు ఘటిల్లఁగలదు.

---

1. ఆకాశమునందు ఏ నీలతాద్యధ్యాసము గలదో, దానియందు సర్వపురుషులనేత్రమునందు తిమిరాదిదోషాభావమువలన ప్రమాణదోషము యొక్క అభావ మున్నది; నీలాదికమునకును, ఆకాశమునకును సాదృశ్యమును లేదు; కనుక ప్రమేయదోషముయొక్కయుం అభావ మున్నది. ఆకాశము యొక్క నీలవర్ణమునందును, ఆకాశమువంటి కటాహమునందును, ఆకాశము వంటి కుటీరమునందును లోభము ఎవ్వనికి లేదు; కాఁబట్టి ప్రమాతృదోషము యొక్కయుం అభావము గలదు.

ఈరీతిగా [1] దోషము అధ్యాసమునకు హేతువుగాదు; గనుక బంధాధ్యాసమునందు దోషాపేక్ష లేదు.

1. దోషము అధ్యాసమునకు హేతువు కాదనుటయందు అభిప్రాయ మేమనఁగా—సర్వదోషములుండిననే అధ్యాసమగు నను నియమము లేదు; మఱేమనఁగా—ఒకానొకదోషము విద్యమాన ముండినను అధ్యాసమగును.

యద్యపి పైఁజెప్పిన ఆకాశమునందు నీలతాదికముయొక్క అధ్యాసమునందు సర్వదోషములయొక్క అభావము ప్రతిపాదింపఁబడినది; దానివలన ఏదోషమును అధ్యాసమునకు హేతువు గాదని కనఁబడుచున్నది; తథాపి ఎచ్చట ఏదోషమును లేదో, అచ్చట అవిద్యారూపమైన ఒక్కదోషముండనే యున్నది; సర్వదా దోషాభావమగునేని అధ్యాసమే గానేరదు.

ఈయభిప్రాయముననె పూజ్యచరణ శ్రీమధుసూదనస్వాములవారు అద్వైతబ్రహ్మసిద్ధి యనుగ్రంథమునందు దోషజన్యత భ్రమయొక్క లక్షణమని అనేకయుక్తిప్రయుక్తులచే చెప్పియున్నారు.

ఇచ్చట సర్వదోషాభావమువలన అధ్యాసిసిద్ధినిరూపణము ఏది చేయఁబడినదో, అది ప్రౌఢివాద మని ఎఱుఁగవలెను. [ప్రౌఢియనఁగా ఆత్మోత్కృష్టత, దానివలననే వాదము అనఁగా కథనము; అది ప్రౌఢివాదశబ్దమునకు అర్థము.]

దీనిలో ఒకానొకఁడు ద్వైతవాది వ్యతిరేకానుమానప్రమాణము ద్వారమున ఈశంకఁ గలిగించుచున్నాఁడు.

వివాదవిషయమైన జగత్తు మిథ్యగాదు. అధిష్ఠానముతో సమానసత్త గలదోషముచేత అజన్యమగుటవలన. ఏది అధిష్ఠానముతో సమానసత్తగల దోషముచేత అజన్యమో, అది మిథ్య గాదు. ఏది అధిష్ఠానముతో సమానసత్త గలదోషముచేత అజన్యము గాదో, మఱేమనఁగా—జన్యమో, అది మిథ్యగాదనుట ఘటిల్లదు; మఱేమనఁగా—అది మిథ్యయే. ఎట్లనఁగా—రజ్జుసర్పాదిక

మంలం. ఈవ్యతిరేకానుమానముచేత చూచినట్టయిన జగత్తుయొక్క అధ్యాసము సంభవింపదు. జగత్తు సత్య మనియే సిద్ధమగుచున్నది.

ఈ ద్వైతవాదిశంక ఘటిల్లదు. ఏలయన—వ్యావహారికరజ్జ్వాదికము కల్పితసర్పాదికమునకు అధిష్ఠానమగుచున్నయెడల మీదృష్టాంతముచేత ఉక్తానుమానముయొక్క సిద్ధి యగును; విచారముచే చూచినయెడల సర్పాదికమునకు అధిష్ఠానము రజ్జ్వాదికము కాదు; మఱేమనఁగా—రజ్జ్వాదికోపహితచైతన్యము, లేక వృత్త్యుపహితచైతన్యముగా నున్నది. [ఈసంగతి సాల్గవతరంగమునందు చెప్పఁబడును.] ఆచైతన్యమునకు పరమార్థసత్త యగుటవలన తత్సమానసత్తగల దోషముయొక్క అభావము దృష్టాంతమునందున్నది; మీదృష్టాంతముసరికాదు. లేక ముఖ్యసిద్ధాంతము [దృష్టిసృష్టివాదము] నందయినన్నో, సర్వకార్యములకు ప్రాతిభాసికసత్తయగుటవలన దృష్టాంతమైన, రజ్జుసర్పాదికము, మఱియు దార్ష్టాంతికమైన జగత్తు వీనికి పరస్పరవిలక్షణతాభావ మగుటవలన ఒక్కటే చైతన్యము రజ్జుసర్పాదికమునకును, ఘటాదికమునకును అధిష్ఠానముగా నున్నది. ఈరీతిగా ముఖ్యసిద్ధాంతదృష్టిచే చూచినయెడల అధిష్ఠానమునకు సమానసత్తగలదోషముయొక్క అభావమే కనఁబడుచున్నది; అందువలన సర్పాధ్యాసమునకును, అధిష్ఠానముకన్న విషమసత్తదోషముచేత జన్యత యున్నదే యున్నది.

మఱియు ఎట్లు దృష్టాంతమైన రజ్జుసర్పాదికము అధిష్ఠానముకన్న విషమసత్తగల దోషముచేత జన్యమో, అట్లు దార్ష్టాంతికమైన జగత్తుకూడ తన అధిష్ఠానముకన్న విషమసత్తగలదోషముచే జన్యముగా నున్నది. నీచెప్పిన హేతుదృష్టాంతముమాత్రము సరి కాదు.

ఈరీతిగా హేతుదృష్టాంతములయొక్క అభావమువలన ఉక్తవ్యతిరేకానుమానముయొక్క సిద్ధియే ఘటిల్లదు; కాఁబట్టి ప్రపంచము సత్యము కాదు; మఱేమనఁగా—మిథ్యగానే యున్నది.

ఈ గ్రంథమునందును ఇంక వేదాంత గ్రంథములందును "అధ్యాసమునకు అనేకదోషములయొక్క అపేక్ష లేదు; ఒకానొకదోషముచాలు." అను నీ ప్రకారముగ అనేకయుక్తులచే అనేకమాఱులు చెప్పఁబడియున్నది; అయినను జగత్సత్యత్వాగ్రహులైన భేదవాదిజనులకు జగత్తు సత్యమని కనఁబడుచున్నది; గాని ఆయుక్తులు మిథ్యలని కనఁబడుచున్నవి. ఉచితమే. జగత్సత్యత్వము ప్రతిపాదించుట వారియొక్క ప్రతిజ్ఞయే యున్నది; ఆ ప్రతిజ్ఞాసిద్ధికొఱకు వటతరువుయొక్క తోలు నింబతరువునకు, నింబతరువుయొక్క తోలు వటతరువునకు అంటించుట వారికి ఆవశ్యకముగానే యున్నది; తదనుసారముగ వారు అధ్యాసస్థానమునందు ప్రమాత్రాద్యనేకదోషములు అడుగుచున్నారు. దానియందు ఆశ్చర్యములేదు. అయినను కొందఱు అద్వైతవాది అనువారుఁ గూడ ఎక్కువదోషములు కోరుచున్నారు; వారందఱియొక్క సమాధానార్థము సంక్షేపశారీరకాచార్యులు మొదలగు సర్వజ్ఞజనులచే అనేకదోషములును చెప్పఁబడియున్నవి. ఆదోషములు——

(1) అంతఃకరణదేశగతమైన అజ్ఞానముయొక్క విక్షేపశక్తియందు ఉండునట్టి శుభాశుభకర్మముయొక్క సంస్కారరూపమైనయదృష్టమే ప్రమాణదోషము.

(2) చైతన్యమునందు అన్యత్రప్రమాతయొక్క అభావమువలన తన స్వరూపమె ప్రమాతగా నున్నది; దానియం దుండు అవిద్యయే ప్రమాతృదోషము.

(3) చైతన్యమునందు నిరపేక్షవ్యాపకత గలదు; ప్రపంచమునందు సాపేక్షవ్యాపకత యున్నది. చైతన్యమునందు పారమార్థిక వస్తుత గలదు; ప్రపంచమునందు అనిర్వచనీయవస్తుత యున్నది. ఇట్లు వ్యాపకతావస్తుతాలక్షణమువలన చైతన్యమునందు ప్రపంచముయొక్క సాదృశ్యము గలదు; అది ప్రమేయదోషము.

ఈరీతిగా సంక్షేపశారీరకాది గ్రంథములందు అధ్యాసమునకు కారణరూపమైన దోషములు ప్రతిపాదితములైనవి.

## 50. 35 గత పూర్వపక్షమునకు సానువాద సమాధానము. కార్యాధ్యాస నిరూపణము.[1]

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

విశేషరూపముచేత అజ్ఞాతవస్తువునందు అధ్యాసమగును; ఆత్మయో, స్వయంప్రకాశుఁడు; వానియందు ప్రకాశమునందు తమస్సువలె అజ్ఞానము ఘటిల్లదు. ఎట్లు అత్యంతప్రకాశస్థిత మయిన రజ్జువునందు సర్పాధ్యాసము గానేరదో, అట్లు స్వయం ప్రకాశుఁడైన ఆత్మయందు బంధాధ్యాసము సంభవింపదు.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఆశంకయు ఘటిల్లదు. ఏలయన—ఆత్మ ప్రకాశరూపుఁడైనను ఆత్మయొక్క స్వరూపప్రకాశము అజ్ఞానమునకు విరోధి గాదు; అది విరోధి యగునేని సుషుప్తియందు ప్రకాశరూపుఁడైన ఆత్మయందు అజ్ఞానము గాకుండవలెను.

---

1. ప్రపంచమునకు కారణమైన ఏ అధిష్ఠాన విశేషరూపాజ్ఞానము గలదో, దాని యధ్యాసమునే కారణాధ్యాస మందురు. యద్యపి ప్రపంచాధ్యాసమునకు కారణము అజ్ఞానము; అజ్ఞానమునకు కారణము వేఱే లేదు; గనుక అజ్ఞానాధ్యాసము ఘటిల్లదు; తథాపి దీపన్యాయమున, మఱియు సాంఖ్యాభిమతమైన స్వప్రకాశాత్మన్యాయమున, మఱియు నైయాయికాభిమతమైన భేదన్యాయమున ఆ యజ్ఞానము స్వపరనిర్వాహకముగా నున్నది; కాఁబట్టి తదధ్యాసము ఘటిల్లినది. తదధ్యాసమునందు అన్యకారణాపేక్ష లేదు.

గాఢనిద్రనుండి జాగ్రత్తనొందిన పురుషునకు ఇట్లు జ్ఞానమైనది—"నేనుసుఖముగా నిదురించియుంటిని; ఏమియు నెఱుఁగనైతిని." ఈజ్ఞానమునకు విషయము సుఖము, మఱియు అజ్ఞానము; సుషుప్త్యనంతరము ఆసుఖముయొక్కయు, అజ్ఞానముయొక్కయు జ్ఞానము ఏది గలదో, అది ప్రత్యక్షరూపము గాదు. ఏలయన—ఏజ్ఞానమునకు విషయము సమ్ముఖమైనదో, అది ప్రత్యక్షజ్ఞాన మనఁబడును; జాగ్రదవస్థయందో, ఉక్తజ్ఞానముయొక్క విషయమైన సుఖమును, అజ్ఞానమును సమ్ముఖముగా నుండవు; కాఁబట్టి జాగ్రత్తునందు తజ్జ్ఞానము ప్రత్యక్షరూపము గాదు; మఱేమనఁగా—అది స్మృతిరూపముగా నున్నది. స్మృతియో, అజ్ఞాతవస్తువునకు కలుగదు; అది జ్ఞాతవస్తువునకే కలుగును. ఈరీతిగాఁ జూచినయెడల సుషుప్తినుండి లేచిన పురుషుఁడు జాగ్రదవస్థయందు ఏసుఖాజ్ఞానములయొక్క సంగతి చెప్పుచున్నాఁడో, ఆసుఖాజ్ఞానములయొక్క ప్రత్యక్షానుభవము వాఁడు పూర్వము సుషుప్తియందు చేయుచున్నాఁడు; అని సిద్ధమగుచున్నది.

మఱియు సుషుప్తియందు వానికి సుఖాజ్ఞానములయొక్క ఏయనుభవ మయినదో, ఆ యనుభవము ఇంద్రియము చేతను సంభవింపదు; అంతఃకరణముచేతను సంభవింపదు. ఎందుకనఁగా సుషుప్తియందు ఇంద్రియములయొక్కయు, అంతఃకరణముయొక్కయు అభావము శ్రుతిప్రసిద్ధముగ నున్నది. "సుషుప్తికాలే సకలే విలీనే తమోభిభూతస్సుఖరూపమేతి." కైవల్యోపనిషత్తు. ఇపుడు చూడుము—ఆపురుషునకు సుషుప్తియందు ప్రత్య

తనానుభవరూపజ్ఞానము ఏది కలిగినదో, అజ్ఞానము ఎక్కడనుంచి రావలెను ? ఆ జ్ఞానము ఆత్మస్వరూపమనియే ఎఱుఁగవలయును.

ఈరీతిగా సుషుప్తియందు ఆత్మ ప్రకాశరూపుఁడుగా నున్నాఁడు; ఆప్రకాశరూపుఁడైన ఆత్మవలన స్వరూపసుఖము యొక్కయు, అజ్ఞానముయొక్కయు ప్రతీతి అయినది; ఆత్మ యొక్క స్వరూపప్రకాశము అజ్ఞానమునకు విరోధియగునెడల సుషుప్తియందు అజ్ఞానముయొక్క ప్రతీతి గాకుండవలయును; ప్రతీతియో, కలుగుచున్నది; దానివలన సిద్ధమైన దేమనఁగా— ఆత్మస్వయంప్రకాశరూపుఁడుగా నుండినను వాని స్వరూపప్రకాశము [1] అజ్ఞానమునకు విరోధి గాదు; వ్యత్యస్తముగా అజ్ఞానమునకు సాధకముగా నున్నది. [ఆత్మ సాధకముండుటవలననే సత్తాహీనమైనట్టి ఏ అజ్ఞానమో; దానికి అజ్ఞాన మున్నది; అని ప్రయోగమగుచున్నది.]

ఈయభిప్రాయమువలననే వేదాంతశాస్త్రంబునందుఁ జెప్పఁబడియున్నది.—సామాన్యచైతన్యము అజ్ఞానమునకు విరోధి గాదు; విశేషచైతన్యమే విరోధిగా నున్నది. [వ్యాపకమైన

1. అంధకారము ఆకాశాదికమగు నాలుగుభూతములయొక్క గుణము లయిన శబ్దస్పర్శరసగంధములయొక్క ఆవరణము చేయదు; మఱేమనఁగా— తేజోగుణమైన రూపమునకే ఆవరణము చేయుచున్నది. దానివలన సిద్ధమయినది—అంధకారము సామాన్యతేజస్సుయొక్క ఆశ్రితమై యుండగా దానినే విషయము చేయుచున్నది. ఆసామాన్య తేజము అంధకారమునకు విరోధి గాదు. అట్లు అజ్ఞానమును సామాన్యప్రకాశరూపమైన సామాన్యచైతన్యమున కాశ్రితమై యుండఁగా దానినే విషయము చేయుచున్నది; ఆసామాన్యచైతన్యము అజ్ఞానమునకు విరోధి గాదు.

చైతన్యమునే సామాన్యచైతన్యమందురు; వృత్తియందుండు చైతన్యమునేవిశేషచైతన్యమందురు.] కాష్ఠమునందుండుసామాన్యాగ్ని అంధకారమునకు విరోధిగాదు; మంథనమువలన ప్రకటితమైన అగ్ని వర్తియందు స్థితమై అంధకారమునకు విరోధియగును. అట్లు వ్యాపకమైన సామాన్యచైతన్యము అజ్ఞానమునకు విరోధి కాదు; అయితే వేదాంతవిచారమువలన నీయంతఃకరణవృత్తి బ్రహ్మాకారమగునో, దానియందుండిన విశేషచైతన్యము [1] విరోధిగా నున్నది.

వృత్తిసహితచైతన్యము అజ్ఞానమునకు విరోధి అని ప్రథమపక్షము, చైతన్యసహితవృత్తి విరోధి అని ద్వితీయపక్షము; వీనిలో ప్రథమపక్షమునందు అజ్ఞాననాశమునకు హేతువు చైతన్యము, మఱియు వృత్తి సాహాయ్యము; మఱియు ద్వితీయపక్షమునందు వృత్తి హేతువు, చైతన్యము సాహాయ్యముగా నున్నది. ఈ రెండుపక్షములును అవచ్ఛేదవాదియొక్క మార్గము. ఆభాసవాదమందైననో, సామాన్యచైతన్యన్యాయమున విశేషచైతన్యమును అజ్ఞానమునకు విరోధి గాదు; మఱే మనఁగా—వృత్తిసహితాభాసము, లేక ఆభాససహితవృత్తి అజ్ఞానమునకు విరోధిగా నున్నది.

ఈరీతిగా స్వయంప్రకాశరూపమగు సామాన్యచైతన్యము అజ్ఞానమునకు విరోధి గాదు. కాఁబట్టి చైతన్యమున

1. అవచ్ఛేదవాదమునందు వృత్తిసహితచైతన్యమును లేక చైతన్యసహితవృత్తిని విశేషచైతన్యమందురు. అది అజ్ఞానమునకు విరోధిగా నున్నది. ఈ రెండుపక్షములందును వృత్తికే ఆవరణభంగముయొక్క హేతుతయగుటవలన ఉత్తరపక్షము శ్రేష్ఠము.

కాశ్రితమైన [1] ఏఅజ్ఞానముగలదో, ఆయజ్ఞానముచేత అవృతుఁడైన ఆత్మయందు బంధాధ్యాసము ఘటిల్లినది.

[మఱియు పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము]

సామాన్యరూపముచేత జ్ఞాతమై విశేషరూపముచేత అజ్ఞాతమైన వస్తువునందు అధ్యాసమగును; ఆత్మయందైననో, సామాన్యవిశేషభావములు లేవు; అందువలన ఆ నిర్విశేషుఁడైన ఆత్మ జ్ఞాతుఁడగుట, మఱియు అజ్ఞాతుఁడగుట ఘటిల్లదు; కనుక వానియందు అధ్యాసము సంభవింపదు.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఆమాట ఘటిల్లదు. ఏల యన— "ఆత్మయున్నాఁడు" అనునీ ప్రతీతి సర్వులకుఁ గలదు. [ఆత్మయనుట తనస్వరూపమునకు పేరు.] "నేను లేను" అనునీప్రతీతి ఎవ్వరికిని లేదు. ఈరీతిగా సర్వులకు సద్రూపముచేత ఆత్మ జ్ఞాతుఁడుగా నున్నాఁడు. "చైతన్యానందవ్యాపకనిత్యశుద్ధనిత్యముక్తరూపుఁడైన ఆత్మయున్నవాఁడు" అను నీప్రతీతి సర్వులకు లేదు. కావున చైతన్య

1. సూర్యునందు అంధకారన్యాయమున స్వప్రకాశాత్మయందు అజ్ఞానము సంభవింపదు; అను పూర్వపక్షము ఘటిల్లదు. ఏలయన—సూర్యాదికజ్యోతులు మహాతేజముయొక్క విశేషరూపములె గాని సామాన్యరూపములు గావు; ఆత్మయొక్కస్వరూపమో, సామాన్యప్రకాశము గనుక అది అజ్ఞానమునకు విరోధి గాదు. ఈరీతిగా దృష్టాంతము సూర్యుఁడు, మఱియు దార్ష్టాంతికము చైతన్యము, వీనియందు విషమత యుండుటవలన ఉక్తశంకకు అవకాశము లేదు.

నందాదిరూపములచేత ఆత్మ అజ్ఞాతుఁడుగా నున్నాఁడు. ఈ మాట అనుభవసిద్ధమే. ఆయనుభవసిద్ధమయిన మాట యుక్తి వలన దూరము గాలేదు.

ఈరీతిగా సర్వులకు ప్రతీతమయిన ఏ ఆత్మయొక్క సద్రూపము గలదో, అది సామాన్యరూపము; మఱియు కేవల జ్ఞానికి ప్రతీతమయిన ఏ చైతన్యానందాదికరూపముగలదో, అది విశేషరూపము. [అధిక కాలమునందు, అధిక దేశమునందు ప్రతీతమయినది సామాన్యరూపము, మఱియు న్యూనకాలమునందు, న్యూన దేశమునందు ప్రతీతమయినది విశేషరూపము.]

యద్యపి ఆత్మయొక్క స్వరూపమగుటవలన చైతన్యానందాదికముగూడ సద్రూపన్యాయమున సర్వత్ర వ్యాపకముగా నున్నది; ఇట్లుండఁగా సద్రూపాపేక్షవలన చైతన్యానందాదికమునకు న్యూన దేశమునందు, చైతన్యానందాద్యపేక్షవలన సద్రూపమునకు అధిక దేశమునందు ప్రతీతి గలదని చెప్పుట ఘటిల్లదు; కాఁబట్టి సద్రూపము ఆత్మకు సామాన్యరూపమనియు, చైతన్యానందాదికము విశేషరూపమనియు నిట్లు చెప్పుటయే ఘటిల్లదు; తథాపి సద్రూపముయొక్క ప్రతీతి సర్వులకు అవిద్యాకాలమందును గలుగును; అట్లు చైతన్యానందాదిరూపప్రతీతి సర్వులకు అవిద్యాకాలమందుఁ గాదు; కేవలజ్ఞానికే విద్యాకాలమందు అగును; అవిద్యాకాలమందు చైతన్యానందాది లక్షణములుండినను ప్రతీతములు గావు; కనుక లేనట్లున్నవి; ఈయభిప్రాయమువలన చైతన్యానందాదికము న్యూనకాలవృత్తియనియు, సద్రూపము అధికకాలవృత్తి యనియు చెప్పఁబడియున్నది.

నీవు చెప్పినరీతిగా సామాన్యవిశేషభావములు లేమియు గలదు; అయితే పూర్వోక్తవిధమున అల్పకాలమునందు, అధిక కాలమునందు ప్రతీతముగుటవలన సామాన్యవిశేషభావమునలె నున్నది; ఈకారణమువలన ఆత్మయొక్క సద్రూపము సామాన్యాంశమందురు; మఱియు చైతన్యానందాదికము విశేషాంశమందురు. ఉక్తప్రకారముగా సామాన్యవిశేషభావము కల్పించుటయందు "ఆత్మ నిర్విశేషుఁడు" అను నీ సిద్ధాంతమునకు హానియు లేదు. ఏలయన—ఆత్మయందు సామాన్యవిశేషభావము నంగీకరించినపుడు ఆత్మ నిర్విశేషుఁ డను నీసిద్ధాంతమునకు భంగ మగును; ఆ సామాన్యవిశేషభావము ఆత్మయందు అంగీకరింపలేదు; మఱేమనఁగా—అవిద్యాబలమువలన సామాన్యవిశేషన్యాయమున ప్రతీతమయినది; ఈయభిప్రాయమువలన సామాన్యవిశేషభావము చెప్పఁబడియున్నది.

ఈరీతిగా సద్రూపముచేత జ్ఞాతుఁడు, మఱియు చైతన్యానందాదిరూపముచేత అజ్ఞాతుఁడైన ఆత్మయందు బంధముయొక్క అధ్యాసము ఘటిల్లినది. ఆ అధ్యాసరూపమయిన బంధముయొక్క నివృత్తి జ్ఞానమువలనఁ గలుగును. అందువలన గ్రంథముయొక్క ప్రయోజనము సంభవించినది.

## 51. 36 గతపూర్వపక్షమునకు సానువాదసమాధానము ఏకభవికవాదముయొక్క ఖండనము.

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

నిషిద్ధకామ్యకర్మములవలన క్రమముగా ఉత్తమలోకముయొక్కయు, నీచలోకముయొక్కయు ప్రాప్తి యగుచున్నది;

అది వాని త్యాగమువలనఁ గానేరదు; నిత్యనైమిత్తికము చేయ నందువలన ఏ పాపముగునో, అది వాని చేయుటవలన కలుగదు; ఈ జన్మమందు లేక అన్యజన్మమందు చేసిన పాపము సాధారణా సాధారణప్రాయశ్చిత్తములవలన నశించును; పూర్వజన్మమునందు చేసిన కామ్యకర్మముయొక్క ఫలము ఇచ్ఛాభావమువలనఁ గానేరదు; ఈరీతిగా ముముక్షువునకు నిత్యనైమిత్తికప్రాయశ్చిత్తకర్మాచరణముచేత జ్ఞానము లేకయు జన్మభావరూపమైన మోక్షము కలుగును.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము]

ఈవార్త ఘటిల్లదు. ఏల యన—నిత్యనైమిత్తికకర్మముల వలనను స్వర్గాదికఫలము భాష్యకారునిచేత అనేకయుక్తిప్రమాణముగా ప్రతిపాదింపఁబడినది; కనుక నిత్యనైమిత్తికములచే ఉత్తమలోకము ప్రాప్తమగును; గాని జన్మాభావము ఘటిల్లదు. మఱియు నిత్యనైమిత్తికములకు ఫలమంగీకరింపక పోయినయెడ కర్మబోధకమయిన వేదము నిష్ఫలమగును.

మఱియు నిత్యనైమిత్తికములు చేయమివలన ఏ పాపమగునో, ఆపాపముయొక్క అనుత్పత్తియే తత్కర్మాచరణ ఫలము; అని ఏది చెప్పుచున్నాఁడో, అదియు ఘటిల్లదు. ఏల యన—నిత్యనైమిత్తికములు చేయకుండుట అభావరూపము గాను పాపము భావరూపముగాను ఉన్నది; అభావమువలన భావోత్పత్తి కలుగదు; కాఁబట్టి కర్మాభావమువలన భావరూపమగు పాపమగునను వాక్యప్రయోగమును ఘటిల్లదు. కర్మాచరణాభావమువలన పాపము నంగీకరించినయెడల "నాసతో విద్యతేభావో నాభావో విద్యతే సతః" అను నీద్వితీయాధ్యాయము

నందు చెప్పఁబడిన భగవదుక్తికి విరోధమగును. ఈరీతిగా నిత్యనైమిత్తికకర్మాచరణమునకు పాపానుత్పత్తి ఫలము లేదు; పాపానుత్పత్తిరూపమైననో, కర్మాచరణము లేకయు సిద్ధమై యున్నది; కాఁబట్టి నిత్యనైమిత్తికమునకు ఫలము స్వర్గాదిక మని అంగీకరింప కుండినపుడు కర్మము నిష్ఫల మగును; మఱియు దానివలన కర్మప్రతిపాదకమైన వేదము నిష్ఫల మగును.

మఱియు పూర్వపక్షి చెప్పినప్రకారముగా జన్మాంతర కామ్యకర్మలఫలము ఇచ్ఛాభావమువలనఁ గానేరదను వార్తయు ఘటిల్లదు. ఏలయన కర్మరూపమైన బీజమువలన రెండంకురములు ఉద్భవించును— మొదటిది వాసన, రెండవది అదృష్టము. వీనిలో—

(1) శుభకర్మమువలన శుభవాసన, మఱియు ధర్మము ఈ రెండంకురములు ఉద్భవించును.

(2) అశుభకర్మమువలన అశుభవాసన, మఱియు అధర్మము ఈ రెండంకురములు ఉద్భవించును.

శుభము, మఱియు అశుభము ఈ రెండు వాసనారూపాంకురమునకు ఉపభేదములు; ధర్మము, మఱియు అధర్మము ఈ రెండు అదృష్టరూపాంకురమునకు ఉపభేదములు. శుభవాసనవలన శుభకర్మంబునందు ప్రవృత్తి, మఱియు ధర్మమువలన సుఖోపభోగము కలుగుచున్నది. అట్లు అశుభవాసనవలన అశుభకర్మంబునందు ప్రవృత్తి, మఱియు అధర్మమువలన దుఃఖభోగము కలుగుచున్నది.

ఉక్తమైనద్వివిధాంకురములందు వాసనారూపాంకురము ఉపాయమువలన నశించును; అదృష్టరూపాంకురమైననో, ఫలో

త్పత్తిచేయక ఏప్రకారమువలనను నశింపదు. ఇది శాస్త్రము యొక్క నిర్ణయము.

ఆ శుభాశుభవాసనలయొక్క నాశము క్రమముగా దుస్సంగసత్సంగములచేత నగును; మఱియు శాస్త్రమునందు ఏ పురుషకారము చెప్పఁబడినదో, దానివలనను ప్రవృత్తికి హేతువైన వాసనయొక్క నాశముగలుగును. కనుక పురుషకారము ను నిష్ఫలముగాదు; సఫలమే. భోగమునకు హేతువైన అదృష్ట రూపాంకురముయొక్క నాశము ఫలోపభోగము లేక ఏయుపాయముచేతను ఎప్పటికిని గానేరదు.

ఈరీతిగా అజ్ఞానికి ఫలభోగము లేక కర్మనివృత్తి ఘటిల్లదు. జ్ఞానికైననో, భోగము లేకయు కర్మనివృత్తి ఘటిల్లుచున్నది. ఏలయన—కర్త, కర్మము మఱియు ఫలము ఇవి పరమార్థమువలన లేవు; మఱేమనఁగా—అవిద్యాకల్పితములుగా నున్నవి; ఆయవిద్యకు జ్ఞానము విరోధి యగుటవలన అవిద్యాకల్పితమైన కర్మాదికముయొక్క నాశము జ్ఞానమువలన వానికి కలుగుచున్నది. ఎట్లు స్వప్నమందు నిద్రాదోషమువలన ప్రతీతమైన పదార్థములు జాగ్రదవస్థయందు నిద్రానివృత్తివలన నశించునో, అట్లు అవిద్యారూపమైన నిద్రవలన ప్రతీతమైన కర్తృకర్మఫలములు జ్ఞానదశారూపమైన జాగ్రదవస్థయందు అవిద్యానివృత్తివలన నశించును; ముముక్షువునందుజ్ఞానాభావముండుట వలన వానికి కర్మాదికములు నశింపవు.

ఇచ్ఛాభావమువలన కర్మఫలభోగముగానిరొడల ఈశ్వర సంకల్పము మిథ్యయగును; ఏలయన—ఫలభోగముచే దప్ప అజ్ఞానికి కర్మనివృత్తి గాఁగూడదు. ఇది ఈశ్వరసంకల్పము. కని

తప్పుపక్షమున ఈశ్వరసంకల్పము మిథ్య యగును; ఈశ్వరుఁడు సత్యసంకల్పుఁడు, ఈమాట శాస్త్రమందు ప్రసిద్ధము; కాఁబట్టి ఇచ్ఛాభావముచే ముముక్షువునకు పూర్వకృతమైన కామ్యకర్మముయొక్క ఫలము గాదనుమాట విరుద్ధము. మఱియు ఇచ్ఛాభావమువలన కర్మఫలము గాదనుపక్షమున అశుభకర్మముయొక్క ఫలము ఎవ్వనికిని గాఁగూడదు. ఏలయన—అశుభకర్మముయొక్క ఫలము దుఃఖము; తదిచ్ఛ ఎవ్వనికిని లేదు.

ఈరీతిగా జ్ఞానముఁదప్ప కర్మఫలాభావము ఏలాగైనను ఘటిల్లదు.

[మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము]

ఎట్లు కర్మానుష్ఠానకాలమునందు ఇచ్ఛారహితుఁడైన పురుషునకు కర్మఫలము వేదాంతమతమునందు అంగీకరింపలేదో అట్లు అనుష్ఠానమైనతరువాతను ఇచ్ఛాభావమయినట్టయిన కర్మఫలము గలుగదు.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఈమాటయు వేదాంతమతము తెలియనందువలన చెప్పఁబడినది. ఏలయన—కర్మమేది గలదో, అది ఇచ్ఛారహితముగా చేయనీ, లేక ఇచ్ఛారహితముగా చేయనీ, ఫలభోగము అవశ్యముగా ఇచ్చుచున్నది. అయినను దీనియందింత భేదముగలదు—ఇచ్ఛారహితకర్మమువలన ఫలభోగమై అంతఃకరణశుద్ధి యగుచున్నది. మఱియు ఇచ్ఛాసహితకర్మముచేత కేవల భోగమేమో అగుచున్నది; గాని అంతఃకరణశుద్ధి గానేరదు.

మఱియు ఎవ్వనికి ఇచ్ఛారహితకర్మమువలన అంతఃకరణశుద్ధియై శ్రవణమువలన జ్ఞానము సిద్ధించినదో, వానికిమాత్రము కర్మఫలము గానేరదు; మఱియు ఎవనికి ఇచ్ఛలేక కర్మము చేయఁబడినను శ్రవణాభావమువలనను, లేక అన్యమైన ఒకనిమిత్తము వలనను జ్ఞానము గలుగదో, వానికి ఇచ్ఛారహితకర్మముయొక్కయు ఫలభోగము దూరముగానేరదు. ఇదియే వేదాంతముయొక్క సిద్ధాంతము. [మృత్యువిచ్చు విషస్వభావమైనట్లు ఫలమిచ్చు కర్మస్వభావము; అది సకామముగానీ, నిష్కామము గానీ.]

ఈరీతిగా జ్ఞానసంపాదమున లేక కర్మఫలభోగము ఎవ్వనికిని ఎప్పుడును [1] దూరము గానేరదు.

## [ మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము ]

ప్రాయశ్చిత్తమువలన సంపూర్ణమైన అశుభకర్మముయొక్క నాశమగును?

---

1. భోగము, ప్రాయశ్చిత్తము, జ్ఞానము ఈమూఁడింటివలన కర్మనివృత్తి యగును; ఇవిదప్ప కర్మనివృత్తికి చతుర్థకారణము లేదు. దీనిలో— ప్రారబ్ధకర్మనివృత్తి భోగమువలనను, క్రియమాణకర్మము [ఆగామికర్మము] యొక్క నివృత్తి ప్రాయశ్చిత్తమువలనను, జ్ఞానమువలనను అగును. మఱియు సంచితకర్మముయొక్క కించిన్నివృత్తి సాధారణప్రాయశ్చిత్తమువలన, సంపూర్ణనివృత్తి జ్ఞానమువలన నగును.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము]

ఆమాటయు ఘటిల్లదు. ఏలయన—అనంతజన్మముల యొక్క ఏ అనంతాశుభకర్మములు గలవో, వానికి ఒకేజన్మమునందు ప్రాయశ్చిత్తము ఘటిల్లదు. మఱియు గంగాస్నానము, ఈశ్వరనామోచ్చారణము మొదలగు సర్వపాపనాశకమగు ఏ సాధారణప్రాయశ్చిత్తము గలదో, అదియు జ్ఞానమునకే సాధన మగుటవలన సర్వపాపనాశక మందురు. ఈరీతిగా చూచినట్లయిన జ్ఞానమువలననే సర్వపాపములు నాశమగును.

{ మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము. }

నిత్యనైమిత్తికకర్మానుష్ఠానమువలన ఏక్లేశ మగునో, అది పూర్వసంచితమైన నిషిద్ధకర్మముయొక్క ఫలము; అందువలన ఆసంచితనిషిద్ధకర్మముయొక్క ఫలము మరలఁ గానేరదు?

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఆమాటయు ఘటిల్లదు. ఏలయన— అనంతప్రకారములైన ఏ అనంతసంచితనిషిద్ధకర్మములు గలవో, తత్ఫలమును అనంతప్రకారమయిన దుఃఖముగా నుండవలయును; కేవలకర్మానుష్ఠానక్లేశోపభోగముచేత దాని సంపూర్ణత ఘటిల్లదు.

{ మఱియును పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము. }

సంపూర్ణసంచితకామ్యకర్మమువలన ఒక్కటే జన్మము అగును.

[ఉక్తపూర్వపక్షమునకు సమాధానము.]

ఆమాటయు ఘటిల్లదు. ఏలయన — సంచితకామ్యకర్మము అనంతము; దానియొక్క భోగము ఒకేజన్మమునందు ఒకేశరీరము చేత ఘటిల్లదు. మఱియు ఒకపురుషునకు ఒకేకాలమునందు నానాశరీరములవలన భోగము ఏది చెప్పఁబడినదో, అది యోగసిద్ధయోగికేఁదప్ప ఇతరులకు ఘటిల్లదు. సిద్ధయోగికైననో, ఇతర సంపూర్ణసామర్థ్యము గలదు; అయితే జ్ఞానముగాక మోక్షము గానేరదు; ఇది వేదముయొక్క సిద్ధాంతము. ఈరీతిగా కామ్యనిషిద్ధకర్మత్యాగముచేసి, కేవలనిత్యనైమిత్తికకర్మము నాచరించినవాఁడైన అజ్ఞానికి నిత్యనైమిత్తికముయొక్క ఫలోపభోగము కొఱకు అనంతశరీరములగును; గాని మోక్షము గానేరదు.

ఈప్రకారముగా జ్ఞానముద్వారమున బంధనివృత్తి గ్రంథముయొక్క ప్రయోజనము ఘటిల్లినది. ఎట్లు స్వప్నమునందు ప్రతీతమైన మిథ్యాపదార్థముయొక్క నివృత్తి జాగ్రత్తులేక సంభవింపదో, అట్లు బంధముగూడ అవిద్యచే మిథ్యాప్రతీతముగుటవలన దానియొక్క నివృత్తియు జ్ఞానరూపమయిన జాగ్రత్తులేక ఘటిల్లదు.

సంబంధమండనము

{ 52. 47 గత పూర్వపక్షమునకు సానువాద సమాధానము. అధికార్యాద్యనుబంధసిద్ధి. }

ఈరీతిగా గ్రంథమునకు అధికారి, విషయము, ప్రయోజనము సిద్ధించినవి; అధికార్యాదికముయొక్క సిద్ధివలన సంబంధమును సిద్ధించినది; గనుక గ్రంథారంభము ఉపపన్నము.

ఈప్రకారముగా వర్ణింపఁబడిన యీయనుబంధవిశేషనిరూపణనామధేయ మగు విచారాబ్ధియొక్క ద్వితీయతరంగమును ఎవ్వఁడు జిజ్ఞాసువైన పురుషుఁడు శ్రవణము, లేక పఠనము చేయునో, వానియందు కృపానిధాన మగు సద్గురునాథుఁడు కరుణ చేయుచున్నాఁడు.

ఇది అనుబంధవిశేషనామధేయ మగు ద్వితీయతరంగము
సంపూర్ణము.





# శ్రీవిచారసాగరము

## తృతీయతరంగము



### గురుశిష్యలక్షణము మఱియును గురుభక్తిఫలనిరూపణము

#### 53. గ్రంథారంభప్రతిజ్ఞ

నాలుగు అనుబంధములతోఁ గూడిన ఈ గ్రంథమును జ్ఞానవంతుఁడగు గురువువలన ఏపురుషుఁడు చదువునో, లేక ఏకాగ్రచిత్తమున వినునో, ఆపురుషుఁడు మోక్షఫల[1] మైన బ్రహ్మజ్ఞానమును పొందును.

#### 54. శ్రీగురులక్షణము

వేదముయొక్క అర్థమును ఉత్తమప్రకారమున ఎవఁడు దెలిసికొనునో, వానిని ఆచార్యుఁ డందురు. ఇట్లు చెప్పుటవలన అధీతవేదుఁడు ఆచార్యుఁ డనఁబడును. మఱియు జీవబ్రహ్మల యొక్క ఏకతను నిశ్చయమువలన ఎవ్వఁడు దెలిసికొనునో, వానిని ఆచార్యుఁడందురు. ఇట్లు చెప్పుటచేత ఆత్మజ్ఞానంబునందు స్థితిగలవాఁడు ఆచార్యుఁ డనఁబడును.

---

1. మోక్షహేతువైన పరోక్షబ్రహ్మజ్ఞానమును, అపరోక్షబ్రహ్మజ్ఞానమును లభించును.

అధీతవేదుఁడై జ్ఞానంబునందు ఎవనికి నిష్ఠ లేదో, వాఁడు ఆచార్యుఁడు గాఁడు. మఱియును ఎవఁడు జ్ఞాననిష్ఠుఁడై యధీతి గాఁడో, వాఁడు తానేమో, ముక్తుఁడగుఁ గాని, శిష్యునకు ఉపదేశము చేయుటకు అసమర్థుఁడగుటవలన ఆచార్యుఁడు గాఁడు. ఎవ్వని చిత్తమునందు సంశయములు లేవో, అట్టి ఉత్తమజిజ్ఞాసువునకు ఉపదేశము చేయుటకు వాఁడు సమర్థుఁడగును; గాని సర్వులకు ఉపదేశము చేయుటకు యోగ్యుఁడు గాఁడు. [సర్వజిజ్ఞాసువులయొక్క సందేహోపశమనయుక్తిరూపశక్తి వానికి లేదు; కనుక వాఁడు ఆచార్యుఁడు గాఁజాలఁడు.] పరిశేషముచే అధీతవేదుఁడై బ్రహ్మజ్ఞానంబునందు నిష్ఠుఁడైన వానిని ఆచార్యుఁడనవలయును.

మఱియును శిష్యునిబుద్ధియందు తోఁచిన పంచభేదములను [1] నానాయుక్తులచే దూరముచేయుటకు సమర్థుఁడైనవానిని ఆచార్యుఁడనవలయును. ఆపంచభేదములు—

---

1. పంచభేదములఖండనమునకు ఈయుక్తులున్నవి—

(1) జీవేశులభేదము కల్పితము. అవిద్యామాయారూపోపాధులచే కృతమగుటవలన. ఘటాకాశమఠాకాశముల భేదన్యాయమున.

(2) జీవజీవులపరస్పరభేదము కల్పితము. సాభాసాంతఃకరణరూపోపాధికృతమగుటవలన. నానాజలాకాశములభేదన్యాయమున.

(3) జీవజడములభేదము కల్పితము. సాభాసాంతఃకరణనిరాభాసనామరూపాత్మకములైన ఉపాధులచే కృతమగుటవలన. స్వప్నగతమైన చరాచరభేదన్యాయమున.

(4) ఈశజడములభేదము కల్పితము. సాభాసమాయానిరాభాసనామరూపాత్మకములైన ఉపాధులచే కృతమగుటవలన. సాక్షిస్వప్నప్రపంచభేదన్యాయమున.

నము చేసికొని, శిష్యుని శిఖాచ్ఛేదనము మాత్రము చేయువానిని లేక వేఱేయేదో సాంప్రదాయికమైన చిహ్నమాత్రమువలన అంకితము చేయువానిని ఆచార్యుఁ డనఁకూడదు. 1

---

1. ఒకనాఁడు పరమమిత్రులయిన ఏ బీ సీ డీ ఈ ఎఫ్ జీ హెచ్ అనువారు విహారార్థము పట్టణమువదలి బయలుదేఱి కొంతదవ్వరిగి నిర్జనప్రదేశమగు నొకమైదానమును గనిరి. కని, అచ్చోట ఆసీనులై ఒండొరుల స్థితిగతులం విచారించుచు క్షేమసమాచారము, ధనము, ఉద్యోగము, భూమి, వివాహము మొదలగు తమతమ వ్యవహారవార్తలు పరస్పరము నివేదించుకొన దొడఁగిరి. అంతట వారిలో శ్రద్ధావంతుఁడొకఁడు పురస్సరుడై ఇట్లనెను.

అయ్యలారా! ఈశరీరము క్షణభంగురము. ఏమిధనము, ఏమిఉద్యోగము, ఏమిభూమి, ఏమిఆలుబిడ్డలు ఎంతఆర్జించినను తనతోడ వచ్చునదెద్దియు లేదు. ప్రాతఃకాలమునుండి చేసినది చేయుట, తినినది తినుట దీనియందే ఆయుష్యమంతయుఁ గడిచిపోయి ఒకదినము యమధర్మజడ్జీగారి హుకుంవారంటు వచ్చినపుడు తోడనే పోవుట; ఇంతయేగదా! ఈక్షణభంగురసంసారమందు ఎల్లపనులను విడిచి, సర్వదా భగవద్భజనమే చేయుట ఉచితము.

అనుడు విని, మఱియొకఁడు ఇట్లనెను.—

ఏమయ్యా! భజనము, పూజనము ఏమి యున్నది దానియందు? భజనము చేసిచేసి, తలపగిలినను గురువుదక్క మార్గమే లేదు. చతుర్వేదషట్శాస్త్రసంపన్నుఁడైన విద్వాంసుఁ డుండినను గురువుదక్క గతియే లేదు. [అని చెప్పి, ఉక్తవచనమునకు అనుకూలమయినట్టి ఒకపద్యమును పాడుచున్నాఁడు.]

ఈమాటవిన్నతోడనే ఏ ముందువచ్చి అనుచున్నాఁడు.—

ఆహాహా! గురు వనఁగా నాగురువే సుమా. నాకెంత సుగమమార్గమును జూపుచున్నాఁడు— రెండుఅంగుష్ఠములచేత రెండుకన్నులు గట్టిగా అదుమ.

మొదటిది జీవేశులభేదము, రెండవది జీవులపరస్పర భేదము, మూఁడవది జీవజడములభేదము, నాల్గవది ఈశజడ ములభేదము, ఐదవది జడములపరస్పరభేదము. ఇవి పంచప్రకార భేదములు.

ఏది భేదమో, అది భయమునకు హేతువు; అందువలన భేదముయొక్క నిరాకరణము అవశ్యముగ చేయఁదగినది; కాబట్టి భేదనిరాకరణము చేసి, అద్వయామలమగు [1,2] బ్రహ్మమును చూపించును. [ఆత్మరూపముచేత సాక్షాత్కారము చేయును.] మఱియు సర్వసంసారమును మిథ్యారూపముచే ఉపదేశము చేయును; అట్టి యద్వైతోపదేశము చేయువాఁడు ఆచార్యుఁ డనవలయును.[3]

ఈప్రకారముగా ఆచార్యలక్షణము శాస్త్రంబునందు చెప్పఁబడియున్నది. ఈలక్షణములేక కేవలము తాను ముండ

---

(5) జడజడములపరస్పరభేదము కల్పితము. నామరూపాత్మకమైన ఉపాధికృత మగుటవలన. రజ్జువునందు కల్పితసర్పదండాదుల భేదమున్యాయమున.

ఈరీతిగా పంచభేదఖండనమునందు పంచప్రకారములయిన అనుమాన ప్రమాణయుక్తులు ఇచ్చట వ్రాయఁబడియున్నవి. భేదధిక్కారాది గ్రంథము లందు అనేకప్రకారములయిన యుక్తులు చెప్పఁబడియున్నవి. విస్తారభయ ముచే ఇచ్చట వ్రాయలేదు.

1. ద్వైతరహితము.

2. అవిద్యాదిమలరహితము.

3. మార్గము తెలియనివానికి మార్గము చూపువానివలె బ్రహ్మస్వరూ పము తెలియనివానికి బ్రహ్మజ్ఞానోపదేశము చేయఁదగినవాఁడు గురువనవల యును.

నము చేసికొని, శిష్యుని శిఖాచ్ఛేదనము మాత్రము చేయువానిని లేక వేఱేయేదో సాంప్రదాయికమైన చిహ్నమాత్రమువలన అంకితము చేయువానిని ఆచార్యుఁ డనఁగూడదు. [1]

---

1. ఒకనాఁడు పరమమిత్రులయిన ఏ బీ సీ డీ ఈ ఎఫ్ జీ హెచ్ అనువారు విహారార్థము పట్టణమువదలి బయలుదేఱి కొంతదవ్వరిగి నిర్జనప్రదేశమగు నొకమైదానమును గనిరి. కని, ఆచోట ఆసీనులై ఒండొరుల స్థితిగతులు విచారించుచు క్షేమసమాచారము, ధనము, ఉద్యోగము, భూమి, వివాహము మొదలగు తమతమ వ్యవహారవార్తలు పరస్పరము నివేదించుకొనఁ దొడఁగిరి. అంతట వారిలో శ్రద్ధావంతుఁడొకఁడు పురస్సరుఁడై యిట్లనెను.

అయ్యలారా! ఈశరీరము క్షణభంగురము. ఏమిధనము, ఏమిఉద్యోగము, ఏమిభూమి, ఏమిఆలుబిడ్డలు ఎంతఆర్జించినను తనతోడ వచ్చునదొద్దియు లేదు. ప్రాథమికకాలమునుండి చేసినది చేయుట, తినినది తినుట దీనియందే ఆయుష్యమంతయుఁ గడిచిపోయె. ఒకదినము యమధర్మజడ్జీగారి హెబీవారంటు వచ్చినపుడు తోడనే పోవుట; ఇంతయేగదా! ఈక్షణభంగురసంసారమందు ఎల్లపనులను విడిచి, సర్వదా భగవద్భజనమే చేయుట ఉచితము.

అనుడు విని, మఱియొకఁడు ఇట్లనెను.—

ఏమయ్యా! భజనమా, పూజనమా ఏమి యున్నది దానియందు? భజనము చేసిచేసి, తలఁకగిలినను గురువుదక్క మార్గమే లేదు. చతుర్వేదషట్శాస్త్రసంపన్నుఁడైన విద్వాంసుఁ డుండినను గురువుదక్క గతియే లేదు. [అని చెప్పి, ఉక్తవచనమునకు అనుకూలమయినట్టి ఒకపద్యమును పాడుచున్నాఁడు.]

ఈమాటవిన్నతోడనే ఏ ముందువచ్చి అనుచున్నాఁడు—

ఆహా! గురు వనఁగా నాగురువే సుమా. నాకెంత సుగమమార్గమును జూపుచున్నాఁడు—రెండుఅంగుష్ఠములచేత రెండుకన్నులు గట్టిగా అదుము.

వలెను; మొదట కొంతకాలమువరకు చీకటియే కనఁబడుచున్నది; తరువాత ఆచీకటియందే ఒకసూర్యుఁడు ఉదయమగుచున్నాఁడు; ఎంతసుందర సూర్యుఁడు! ఎంతతేజము! అయినను ఆకాశమందు నిత్యోదితసూర్యునివంటి వాఁడు గాఁడు. ఆకాశసూర్యుని ప్రకాశమందు తాపమున్నది; ఆసూర్యుఁడు ఎంతశీతలుఁడు! వెన్నెలగల చంద్రునికంటె శీతలుఁడు; ఆసూర్యుని ఉదయము కాఁగా మనస్సే తడియుచున్నది. ఔరా!

ఈప్రకారముగా వీ యొక్క భాషణము విని, బీ వానిని ధిక్కరించి తనగురువుయొక్క సంగతి చెప్పనారంభించెను—

తప్పుతప్పు; పరమాత్మ అట్లు కాఁడు. అయ్యా! నాగురువు నాకు సాక్షాత్తు పరమాత్మయొక్క దర్శనము చేయించుచున్నాఁడు ఆహాహా! పరమాత్మరూపమేమి చెప్పుటకు వచ్చుచున్నదా? వేదముసకుఁగూడ అగమ్యము. మొదట పద్మాసనము వేసికొని, నాసాగ్రమునసే దృష్టి యుంచి, కూర్చుండవలెను; ఒకటిరెండు దినములయిన తరువాత ఒకసారి ఝుక్ అగుచున్నది. నక్షత్రపతనమేమో, విద్యుత్పతనమేమో ఏమి చెప్పుటకు శక్యమేకాదు. ఈవిధముగా నొకసారి దర్శనమిచ్చి, పరమాత్మ తత్కాలము గుప్తమగుచున్నాఁడు; ఎంతపరమాత్మ అయ్యా! చెప్పుటకుసాధ్యమా! ఆహాహా!

ఈప్రకారముగ బీ యొక్క భాషణము విని, సీ పరిహాసించుచు, ఇట్లు పలుకఁదొడఁగెను—

ఔనౌను, పరమాత్మ ఒకసారిప్రకటమై మరల గుప్తమగుచున్నాఁడు; ఓహో! నీకు భయపడి గుప్తమగుచున్నాఁడుకాఁబోలు? అట్లు కాదయ్యా! పరమాత్మయొక్క రూపము అట్లు కాదు. భగవద్గీతయందుఁగూడ చెప్పఁబడియున్నది—పరమాత్మయొక్క రూపము ఆశ్చర్యకారకముగా నున్నది. ఏమి చేయవలెను—ముక్కుయొక్క రంధ్రములు రెండు, కండ్లయొక్కరంధ్రములు రెండు, చెవులరంధ్రములు రెండు ఈనూఁటురంధ్రములు రెండుచేతులయొక్క పదివ్రేళ్లచేత నొకసారి గట్టిగా నదిమి కడకట ముఖముకూడ మూయవలెను;

ఈప్రకారముగ అనుదినము అనుష్ఠానము చేయఁగాచేయఁగా ఏమిచమత్కార మయ్యా! ఎంతెంతసుందరసుందరవాద్యములు, ఎంతెంత సుందరసుందరదీపములు, ఎంతెంత సుందరసుందర మతాపి, చంద్రజ్యోతులు చూడనుచూడను, వినను వినను మనస్సుఆశ్చర్యపడుచున్నది. ఆహాహా! నాగురువు కృపచేసి, అశ్చర్య రూపపరమాత్మయొక్క దర్శనము నాకు చేయించు చున్నాఁడు. ఆపరమాత్మ మిమ్ము గుప్తము నుంచుచున్నాఁడా! ఎప్పుడు చూతుమో, అప్పుడే సిద్ధము. పెక్కు వేళల స్వప్నమందుఁగూడ ఒక్కొక్కసారి దర్శనము ఇచ్చుచున్నాఁడు; ఆహాహా! పరమాత్మఅనఁగా అతఁడే పరమాత్మ, గురు వనఁగా అతఁడే గురువు.

ఈప్రకారము స్వానుభవము నివేదించి సీ యూరకుండెను. వెంటనే డీ ఇట్లనియె—

ఏమిపలుకుచున్నారయ్యా! మీకు పరమాత్మపరమాత్మఅని ఎంతభ్రాంతి అగుచున్నది? పరమాత్మ అట్టిఁ కాఁడు. వేదశాస్త్రములందు చెప్పఁబడియున్నది. సకలపదార్థములకన్న ఆత్మ విపరీతముగా నున్నాఁడు. మొదలే తనదృష్టి విపరీతము చేసి, విపరీతపరమాత్మను జూడవలెను; మీరు సకలపదార్థములను జూచు నట్టే సమానదృష్టిచేతనే పరమాత్మను జూచుచున్నారు. మీకు పరమాత్మ ఎట్లు కనఁబడును? ఎప్పుడును కనఁబడఁడు. మీరు భ్రాంతివలన ఏదో ఒక్కొక్క పదార్థమునకు పరమాత్మ యను పేరు పెట్టుచున్నారు; కాని పరమాత్మ అట్టు కాఁడు; పరమాత్మ అనఁగా ఒకదివ్యమూర్తికముగా నున్నది. ఆమూర్తము ఎట్లు ఉన్నదనఁగా—దానిప్రకాశముముందు కోట్లమిణుగురుల చంద్రజ్యోతుల యొక్క ప్రకాశము తుచ్ఛముగ నున్నది. ఆపరమాత్మయొక్క దర్శనము కొఱకు ఏమి చేయవలెను—కంటియొక్క శుద్ధి మొదలు కంటిమూల ములకు లేవలెను; తరువాత ఆ శుద్ధ దృష్టి వలెను.

ఈప్రకారముగ అనేకదినములు అభ్యాసముఁ జేయఁజేయ నొకదినము ఆ మూర్తము ప్రకటమగుచున్నది. ఏమిచెప్పవలెను! ఆ మూర్తముయొక్క

స్వరూపము! చెప్పుటకు ఎవ్వఁడును సమర్థుఁడు గాఁడు; అముత్తమా చూచు వాఁడు ప్రపంచమందు ఎవ్వఁడును లేడు. అముత్తము ఒక నాగురువునకే లభించినది. వానికృపవలన నేనును ఒకసారి చూచుచున్నాను. ఏమిచెప్ప వలెను! అముత్తముయొక్క స్వరూపము అహాహా!

ఈప్రకారము డీ తనశక్త్యనుసారముగ ముత్తముయొక్క వర్ణనము చేసి, పిమ్మట అముత్తముయొక్క స్వరూపవర్ణనము చేయునట్టి ఒకగీతమును పాడనారంభించెను.

డీ యొక్క పాట సంపూర్ణమైన వెనుక ఈ ఇట్లనియె—

అయ్యా! పరమాత్మ అట్లు కాఁడు. మొదలే అనేకజన్మసుకృతముండె నేని పరమాత్మ దర్శనమిచ్చుచున్నాఁడు. అయ్యా! పరమాత్మసమ్ముఖమున వచ్చిన భయముచేత ప్రాణములు విడుచుచున్నారు; సుకృతబలమునచే పరమాత్మను చూచుటకు ధైర్యమగుచున్నది. ఏమిచేయవలెను—మూఁడవజామున గ్రామమునుండి బయలుదేఱి, దూరమున నొకవిస్తీర్ణమైనట్టి స్థానమందు సూర్యుని చూచుచు నిలువవలెను; ఈప్రకారముగ పెక్కుదినములు అభ్యాసము జేయఁగఁ జేయఁగా ఒకసారి విరాటపురుషుఁడు ప్రకటమగుచున్నాఁడు. భూమినుండి సూర్యమండలమువఱకు ఒకేపురుషుఁడు సమ్ముఖమున నిలుచుచున్నాఁడు. ఏమయ్యా! వానిని చూచుటకు ధైర్యమగునా? నాగురువు నిర్భయముగాఁ జూచుచున్నాఁడు; నాకేమో ధైర్యము లేదు నాగురువు సన్నిధిని ఉండినప్పుడు నేను ధైర్యముచేసి కొంచెముకొంచెము చూచుచున్నాను; నాగురువువంటి పుణ్యపురుషుఁడే వానిని చూచుచున్నాఁడు; ఇతరులకు సాధ్యము గాదు.

ఈప్రకారముగా ఐదుగురియొక్క పలుకులను విని, యఙ్ఞఖాన్నముఖముచేత భాషణము నారంభించెను.—

నాగురువువంటి భాగ్యవంతుఁడు ఎవ్వఁడును లేఁడు; వానికి ప్రతి దినము పరమాత్మదర్శనమగుచున్నది. ప్రాతఃస్నానము, సంధ్యావందనాదికము

చేసి, కన్నులుమూసి, ధ్యానములో కూర్చున్నాఁడు. చతుర్భుజపీతాంబరధారి పరమాత్మ ప్రకటమై "వరం బ్రూహి" అనుచున్నాఁడు; వానికి నమస్కారము చేసి, కండ్లు తెఱచుచున్నాఁడు. నాకుఁగూడ "సంచింతయేద్భగవతశ్చరణారవిందమ్" ఇక్కడనుండి సమగ్ర ధ్యానము చెప్పుచున్నాఁడు; అయితేను నావంటి పాపి ఎవ్వఁడును లేఁడు; నాకు ధ్యానపూర్తి ఘటిల్లదు. కండ్లుమూసి ధ్యానము చేసికొనుచు కూర్చున్నపుడు ఒకసారి చరణము కనఁబడుచున్నది; మరల చరణము గుప్తమై మోకాలు కనఁబడుచున్నది; అదిగుప్తమై చేయి కనఁబడుచున్నది; అదిగుప్తమై ముఖము కనఁబడుచున్నది; ముఖముగుప్తమై చీఁకటి కనఁబడుచున్నది; ఒక్కొక్కసారి ఏమియుంతోఁచదు. ఈసంగతి ఒకనాఁడు నాగురువుతో చెప్పితిని; అంతట నాగురు వనుచున్నాఁడు— మంచిది ఏమియుం చింతలేదు; ఎందువలన నీవు నాశిష్యుఁడవగుచున్నావో, అందువలన పరమాత్మ నీకు దర్శనమియ్యఁగలఁడు; నేను చెప్పినప్రకారముగ నిత్యశః ధ్యానము చేయుము. ఈలాగు చెప్పి; నాపేరు తనశిష్యపంక్తియందు వ్రాసి, తరువాత నాశరీరము నాల్గయిదుస్థానములందు కాల్చి, అనుచున్నాఁడు— ఈచిహ్నములుచూచి, యమదూతలు నీదగ్గఱకురారు; నిన్నుఁజూచి, పాఱిపోవుదురు; అని చెప్పుచున్నాఁడు. ఇప్పుడు నాకు యమదూతల భయము లేదు; గాని పరమాత్మయొక్క దర్శనము ఇదివఱకుఁ గాలేఁదని మాత్రము విచారపడియెదను.

ఈప్రకారముగా యఫ్ యొక్క భాషణము విని "నేతీధౌతీతథా వస్తి నాలికాభస్త్రికాతథా, కపాలభాతిచైతాని షట్కర్మాణి ప్రచాలయేత్." మొదలయిన యోగశాస్త్రవచనపూర్వకముగ జీ తనగురుమాహాత్మ్యము వర్ణించుటకు నారంభించెను.

నాగురువుయొక్క మాహాత్మ్యము ఏమనవలెనయ్యా! నలుబది నలుబది ఆమడుగుల పాగా నోటిచేత మ్రింగి, అపానద్వారముచే బయటికి తెచ్చుచున్నాఁడు. అపానద్వారముచే మ్రింగి, ముఖముచే లాగుచున్నాఁడు.

తోట్టెడు తోట్టెడునీళ్లు మూత్రేంద్రియముచేత్రాగి, ముక్కుచే బయట విడుచుచున్నాఁడు; చెవిచేత గ్రహించి, ముఖముచే గ్రక్కుచున్నాఁడు. నాగురువుయొక్క చరిత్రము విచిత్రముగా నున్నది. ఒకదినము గురువు పలుకుచున్నాఁడు—ఈనేతిధౌతియొక్క అభ్యాసము నీవు కొంచెము చేయవలెను; రక్తమాంసములమూత్రాదులచేత శరీరము మలినముగా నున్నది; అది పవిత్రముగాక ఏదోక యోగాచరణము నడవదు: శ్రద్ధావంతుఁడగు పురుషుఁడు ఒక్కొక్కసాధనమునకు మూఁడుమూఁడుసారులు చనిపోవుచున్నాఁడు; కాని ఒక్కొక్కసాధనము సంపాదించుచున్నాఁడు. నీవుగూడ ఇప్పుడు ప్రారంభము చేయవలెను; ఈప్రకారము నాగురువుయొక్క భాషణము విని, నేను పరుగెత్తి వచ్చుచున్నాను; ఇప్పుడు నాకు గురువనఁగా భయమే తోఁచుచున్నది.

అందఱియొక్క భాషణము సంపూర్తియైనను హెచ్ ఒకశబ్దమైన ఒకరింపక ఊరకుండెను; ఏమియుం భాషణము చేయఁడు; దానివలన వాఁడు నుచ్ఛ గుర్వాశ్రయము చేయలేదేమో, అని అందఱికి సంశయము పుట్టుచున్నది; అందువలన అందఱును వానిని అడుగుచున్నారు—ఏమయ్యా! నీకు గురువు లేఁడేమి? ఉన్నపక్షమందు నీకు గురువు ఏమిచెప్పినాఁడు? చెప్పుమా! అంతట హెచ్ ఇట్లు చెప్పనమకట్టెను—

అయ్యా! నాకు గురువున్నాఁడు; నాగురువు అట్టిట్టి వాఁడు కాఁడు; పెద్దమహానుభావుఁడుగా నున్నాఁడు. వాఁడె నాకు బ్రహ్మజ్ఞానముయొక్క పూర్ణోపదేశము చేయుచున్నాఁడు. పెక్కులేల నన్ను సాక్షాద్బ్రహ్మరూపము చేయుచున్నాఁడు. అయినను గుర్వాజ్ఞ ఇట్లున్నది—"నీవు నీఅనుభవము ఎవ్వనికి చెప్పఁగూడదు; చెప్పినపక్షమున గురుద్రోహివై దానివలన అఖండ నరకవాసము ఉపభోగించువాఁడవు." అని చెప్పినందువలన ఆ నరకవాసమునకు భయపడి నేను నాఅనుభవము ఎవ్వనితోఁ జెప్పను.

ఈప్రకారముగ ఏ బీ సీ డీ మొదలగు ఎనమండ్రును తమతమగురువుల యొక్క మాహాత్మ్యము చెప్పుచున్నారు. అయినను ఈయెనమండ్రుగురువు లందు ఒకఁడుగూడ గురుపదమునకు వాచ్యుఁడుగాఁడు.

హెచ్ యొక్కగురువు అద్వైతబ్రహ్మజ్ఞాని యగునేమో అని సంశయముపుట్టుచున్నది; కాని అట్లుకాదు. మొదలే హెచ్ చెప్పుచున్నాఁడు— నన్ను బ్రహ్మరూపమే చేయుచున్నాఁడు; ఇప్పుడు గురుద్రోహమువలన బ్రహ్మమునకే అఖండనరకవాస మగుచున్నదా ఏమి? బ్రహ్మమే నరకమునకు భయపడుచున్నదాఏమి? అదేమియుం ఘటిల్లదు. దానివలన సిద్ధమగుచున్న దేమనఁగా— హెచ్ యొక్కగురువుకూడ పూర్వముచెప్పిన ఏడుగురివలె బ్రహ్మమన్న పేరుమీఁద ఒకానొక అయోగ్యమయినట్టి ఉపదేశము చేసి, తన ఉపదేశము జనులందు ప్రకటమైనపుడు తనకు అపకీర్తి అగుచున్నదని ఎఱిఁగి, శిష్యునకు గురుద్రోహనరకవాసాది భయముఁ జూపెను.

యద్యపి "గుహ్యాద్గుహ్యతరం" అనునీప్రకారముగ వేదాంతశాస్త్రము యొక్క విశేషణము శాస్త్రంబునందు అనేకచోట్ల చెప్పఁబడియున్నది. నవమాధ్యాయమునందు భగవంతుఁడును స్వముఖముచే "గుహ్యాద్గుహ్యతరం శాస్త్రమ్" అని స్పష్టముగఁబలికెను; దానివలన వేదాంతశాస్త్రము ఎవ్వనికి చెప్పఁగూడదని స్థూలదృష్టిచే కనఁబడుచున్నది; తథాపి దానియందు అభిప్రాయము వేఱుగానున్నది—వేదాంతశాస్త్రము అత్యంత పవిత్రమగుట వలనను, అత్యంతసూక్ష్మార్థవాచకమగుటవలనను అది వివేకవైరాగ్యాదిసాధనము లేనివాఁడైన అనధికారిపురుషునకు బోధయగుటకు అశక్యమై గూఢముగ నున్నది. ఈయభిప్రాయమున "గుహ్యాద్గుహ్యతరం శాస్త్ర" మని చెప్పఁబడి యున్నది; గాని ఎవ్వనికి చెప్పఁగూడదు, చెప్పుట ఒకనిషిద్ధకర్మమై దానివలన పాపమగుచున్నది; అని యభిప్రాయము లేదు.

"ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన" అని భగవదుక్తియే యున్నది; దీనియొక్క అభిప్రాయము శ్రద్ధాహీనుఁడైన, తపోహీనుఁడైన

పురుషునకు చెప్పఁగూడదని యున్నది; గాని ఎవ్వనికిని చెప్పఁగూడదని యభిప్రాయము లేదు.

ఒకానొకఁడనుచున్నాఁడు—హెచ్ యొక్క గురువు బ్రహ్మసాక్షాత్కారరూపమైన తనఅనుభవము ఎవ్వనికి చెప్పఁగూడదని చెప్పుచున్నాఁడు; కాని వేదాంతశాస్త్రము ఎవ్వనికిని చెప్పఁగూడదని చెప్పలేదు?

దానికి సమాధానము—ఒకనికి ఒకరూపాయి ఇచ్చి ఇచ్చువాఁడు చెప్పుచున్నాఁడు—ఈరూపాయి మంచిది; ఎవ్వనికి చూపవద్దు. ఇట్లనినపుడు రూపాయితీసికొనువానికి తత్కాలమున సంశయము పుట్టుచున్నది—ఇది టక్కరరూపాయిగా నుండవలెను; అందువలననే ఎవ్వనికి చూపగూడదని చెప్పుచున్నాఁడేమో? ఎవ్వనికైన శీఘ్రముగ చూపవలయును. తీసికొన్నవాని యొక్క మనోవృత్తి తత్కాలమగుచున్నది. ఐదురూపాయలకు ఒకపదార్థము అంగడియందు తీసికోవలెననఁగా నాల్గు అంగళ్లు చూచి, నలుగురుజనులకు చూపి, తీసుకొనుచున్నారు; ఇట్లు జగులందు వ్యవహారము జరుగుచున్నది; ఒకరూపాయి టక్కరదొరికినపుడు లేక మూఁడురూపాయలయొక్క పదార్థము ఐదురూపాయలకు దొరికినపుడు వానిి కొంచెముకొంచెము ఉన్నది; బ్రహ్మసాక్షాత్కారసమయమందు బ్రహ్మభిన్నమైన ఒకానొక పదార్థమును జూచి, అదే బ్రహ్మమని; నిశ్చయించినయెడల పూర్ణహానిగానున్నది. ఎప్పుడు హెచ్ యొక్క గురువు 'ఇదే బ్రహ్మము; జన్మాంతరభక్తిబలమువలన నీకు దర్శనమగుచున్నది; ఈబ్రహ్మానుభవము నీవు ఎవ్వనికిని చెప్పఁగూడదు;' అని హెచ్చునకు చెప్పుచున్నాఁడో, అపుడే హెచ్ యొక్క మనస్సునందు అనేక సంశయములు పుట్టుచున్నవి. ఇట్లుండఁగా తన అపకీర్త్యపహాసాది భయమున మోసగాఁడు వానికి గురుద్రోహనరకవాసాది భయము చూపుచున్నాఁడు. అంత మోసగాఁడు తాను మునిఁగి శిష్యుని ముంచువాఁడు తాయిగాని వేదశాస్త్రసారముగ గురుపదమునకు వాచ్యార్థుఁడు గాఁడు.

తన బ్రహ్మానుభవము ఎవ్వనికేని చెప్పుట దోషమనినపుడు బ్రహ్మమునకే దోషమగుచున్నది. ఎందుకనఁగా—"బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అని శ్రుతివచనమే యంున్నది. కావున అనుభవము చెప్పుటవలన దోషములేదు; చెప్పనివపక్షమందు పెద్దహానిమాత్రమున్నది. అది ఏ బీ సీ డీ సంగతిచే స్పష్టముగకనఁబడుచున్నది. తర్కదృష్టిఅనుశిష్యుఁడు తనఅనుభవము అనేక సాధుజనులకు చెప్పుచున్నాఁడు; ఈసంగతి షష్ఠతరంగమునందు చెప్పఁబడును. భగవదుక్త్యనుసారము శ్రద్ధాహీనమూర్ఖనాస్తికజనులకు మాత్రము చెప్పఁగూడదు. ఎందుకనఁగా—పిత్తరోగికి మధురమైనట్టి చక్కెర చేఁదుగఁ గనఁబడుచున్నది; అట్లు దుర్జనులకు అత్యంతసత్యమైన సచ్చిదానందబ్రహ్మానుభవము ఉపహాసాస్పదముగఁ గనఁబడుచున్నది.

ఏ బీ సీ డీ గురువులయొక్క ఉపదేశప్రకారముకన్న ఇంకను చిత్రవిచిత్రములుగ అనేక ప్రకారములుగల ఉపదేశముచేయు మూర్ఖజనులు తాము కృతార్థులని యెఱుఁగుచున్నారు; వారిశిష్యులు గూడ కృతార్థులని యెఱుఁగుచున్నారు. ఎవఁడైన కృపాళుఁడగు పురుషుఁడు ఇట్టిమూర్ఖగురువులయొక్క చరిత్రమని పెద్దగ్రంథము వ్రాసినయెడల జనులకు మహోపకారమగుచున్నది. ఏలాగుననఁగా—సముద్రమునందు మునుఁగుచు తేలుచుండెడివాఁడు తనకంఠమునకు పెద్దఱాయి కట్టినపుడు తత్కాలమే మునుఁగుచున్నాఁడు. ఆప్రకారముగా ఈమూర్ఖగురు [ఎక్కువబరువుగల బంగారు, ఇనుము, ఱాయి మొదలగు పదార్థములను గురువనుచున్నారు.] రూపమైన పెద్దఱాయి కంఠమునకుఁ గట్టినయెడల భవసముద్రమునందు మొదలే మునుకలువేట్టుచుండెడి శిష్యుఁడు తత్కాలము మునుఁగుచున్నాఁడు. ఎట్లు ఱాయి తాను మునిఁగి, స్వాశ్రితమును ముంచుచున్నదో, అట్లు ఈ గురువులు తాము మునిఁగి, శిష్యులను ముంచువారై యున్నారు. వారియొక్క సవిస్తరమగు చరిత్రము ప్రకటమైనపక్షమునందు జనులు వాని ఉపదేశవిషయమునందు జాగ్రత్తఁగలవారు కాఁగలరుగదా!

పైఁజెప్పిన గురువులయొక్క ఉపదేశము వేదబాహ్యమనియుం, అది త్యాజ్యమనియుం అభిప్రాయము లేదు; అది వేదానుసారముగాను, గ్రాహ్యము గాను ఉన్నది. అయినను అట్టి ఉపదేశము చేయువానియందు ఇచ్చట మూల గ్రంథమునందు చెప్పఁబడినప్రకారముగ గురుశబ్దప్రయోగము ఘటిల్లదు.

ఉక్తగురూపదేశము యోగశాస్త్రానుసారముగాను, ఉపాసనాప్రకారముగాను ఉన్నది; అందువలన నది అంతఃకరణదేశస్థితమైన మలవిక్షేపదోషములనివృత్తికి హేతువుగా నున్నది; మలవిక్షేపదోషములయొక్క నివృత్తి యైనపుడు పురుషుఁడు వివేకాదిసాధనమునకు అధికారి యగుచున్నాఁడు; దానివలన శ్రవణాదిసాధనమునకు అధికారియై దానివలన ముక్తిరూపమగు పరమపురుషార్థమును పొందుచున్నాఁడు; ఈలాటి ఈయుపదేశము పరంపరగా శ్రేయస్కరముగా నున్నది; అందువలన ఈయుపదేశము జనులకు సర్వథా గ్రాహ్యముగానే యున్నది; అయినను దానియందు త్యాజ్యమను అంశము వేఱుగా నున్నది; ఏమనుము—

ఈయుపదేశము చేయువారు గురువులు తాము అభ్యసించిన ధ్యానమునందు ఏపదార్థము ప్రకటమగుచున్నదో, అదే పరమాత్మయని ఎఱుఁగుచున్నారు; అదే పెద్దదోషముగా నున్నది. ఆపరమాత్మయొక్క దర్శనముచేత మేము కృతార్థులము; ఇప్పుడు మాకు సాధనమేమియు కర్తవ్యము లేదు; అని ఈప్రకారముగ ఏది ఎఱుఁగుచున్నారో, అది స్పష్టముగ భవసముద్రమునందు మునుఁగుట యైయున్నది. ఈప్రకారముగ తాము స్వతః మునుఁగువారై తాల్మిగానుండగా ద్రవ్యలోభముచేతఁగాని, శిష్యలోభముచేతఁగాని దీనజనులకు ఉపదేశరూపమగు ఆశ్రయమిచ్చి వారియొక్క కంఠాభరణస్థానమునందు కూర్చుండి, తమతోడనే జనులను ముంచుచున్నారు; ఇది అద్భుతమైనట్టి మహాపరాధముగనున్నది. మఱియు తాము స్వతః మునుఁగువారు తాలను విశ్వసించి, వారి ఉపదేశము గ్రహించి, జనులు తాము కృతార్థులని ఎఱుఁగుచున్నారు. వారి బుద్ధిరూపమయిన కండ్లుకప్పి వారిని స్పష్టముగ

## 55. శిష్యలక్షణము

ఏసాధనమువలన గ్రంథంబునందు అధికారము గలుగునో, ఆసాధనమే శిష్యుని లక్షణమని [1] తెలియవలయును. దీనిని పూర్వము అధికారిలక్షణంబునందు చెప్పినారము. ఇది

అంధులుగc జేయుచున్నట్టి అవిచారరూపధూమము ఎక్కడనుండి వచ్చుచున్నదని మహాశ్చర్యమగుచున్నది.

ఈచెప్పcబడిన ఏ బీ సీ డీ గురువులయొక్క చరిత్రము స్మరించి, గురువిషయమునందు జాగ్రత్తగా నుండవలెనని శ్రద్ధావంతులైన అధికారిజనులను గ్రంథకర్త ప్రార్థించుచున్నాcడు. అట్లు—

"శబ్దబ్రహ్మణి నిష్ణాతో పరం బ్రహ్మాధిగచ్ఛతి."

—అమృతబిందూపనిషత్తు.

శబ్దబ్రహ్మమునం దనcగా బ్రహ్మవిషయకపరోక్షజ్ఞానమునందు. నిష్ణాతుc డనcగా ప్రవీణుcడెవ్వcడో, వాcడు పరబ్రహ్మమును పొందుచున్నాcడు; అని ఈ శ్రుతివచనమునకు అర్థమగుచున్నది. దీనివలన పరోక్షజ్ఞానమునందు ప్రవీణత లేనివాcడు పరబ్రహ్మమును బొందcడు; అని అర్థము వ్యతిరేకానుమానమురీతిగా సిద్ధమగుచున్నది. మఱియు ఈయర్థమే ఏ బీ సీ డీ సంగతియందు స్పష్టముగ కనcబడుచున్నది. చూడుము—

బ్రహ్మవిషయకమైన జిజ్ఞాస యుండినను వారియొక్క గురువునకును, వారికిని పరోక్షజ్ఞానప్రవీణత లేమివలన మూఢులు, మోసకారులగు తమతమగురువులను విశ్వసించి; భవసముద్రమునందు మునుcగుచున్నారు.

అందువలన మొదలె ఉత్కృష్టమైనట్టి పరోక్షజ్ఞానము సంపాదింపవలయునని సభాగ్యులైన బ్రహ్మజిజ్ఞాసువులను గ్రంథకర్త మరలమరల ప్రార్థించుచున్నాcడు.

1 వివేకాదిసాధనసహితుcడైన అధికారిలక్షణము ప్రథమతరంగమందు చెప్పcబడినది.

గాక గురుసేవాచరణాది శిష్యలక్షణము ఇపుడే ముందువచ్చు ప్రకరణములందు చెప్పఁబడును.

## 56. గురుభక్తిఫలనిరూపణము

గురువునందు ఈశ్వరునికన్న అధికభక్తి[1] చేయవలయును. ఏలయన—సకలశాస్త్రప్రవీణుఁడైన పురుషుఁడును గురూపదేశములేక జ్ఞానలాభమును పొందఁజాలఁడు.

వేదరూపమైన సముద్రము, గురువులేక లవణసమానము క్షారముగలదిగా నుండును. ఎట్లు క్షారసముద్రముయొక్క జలము త్రావినపుడు క్షారతానుభవమై క్లేశప్రాప్తి యగునో, అట్లు గురువులేక ఎవ్వఁడు వేదార్థవిచారము చేయునో, వాఁడు భేదరూపమగు క్షారత ననుభవించి జన్మమరణరూపమగు ఖేదమును పొందును.

ఈకారణమువలననే భేదవాదిజనులు వేదవిచారమేమో, చేసియున్నారు; గాని గురుద్వారమున చేయలేదు; కనుక భేదమునందు నిశ్చయము చేసికొని జన్మమరణరూపమగు ఖేదమును పొందుదురు; వారికి ముక్తిరూపమగు పరమానందముయొక్క లాభము కలుగనేరదు.

యద్యపి భేదవాదులును వేదమును తమతమ గురువులయొద్దనే పఠించి విచారముచేసిరి; విచారపూర్వకవ్యాఖ్యానమును చేసిరి; తథాపి వారెవరియొద్ద వేదము చదివిరో, వారు గురువులు కారు. ఏలయన—ఎవ్వఁడు జీవబ్రహ్మలయేకత నుప

1 ప్రేమసహితనిష్కపటబుద్ధిచే సేవ చేయుట ఇచ్చట భక్తిశబ్దమునందు అభిప్రాయము.

దేశించునో, వాఁడే గురువు. [ఈసంగతి పూర్వప్రసంగముననే చెప్పినారము.] భేదవాదిపాఠకులెవ్వరో, వారు జీవబ్రహ్మల భేదము నుపదేశించువారలైరి; కాబట్టి ఆర్హతునియందువలె వారియందు గురుశబ్దము ప్రయోగింపఁబడినది. ఎట్లు ఆర్హతుని శిష్యుఁడు ఆర్హతుని గురువనినను ఆర్హతుఁడు[1] గురుశబ్దమునకు వాచ్యుఁడుగాఁడో, అట్లు భేదవాదియొక్క శిష్యుఁడయిన వాఁడు తనపాఠకుని గురువనినను వాఁడు గురువుగాఁడు.[2]

ఈరీతిగా భేదవాదిపురుషులు గురుద్వారమున విచారము చేయలేరు. అందువలననే భేదమునం దభినివేశము చేసికొని జన్మమరణరూపమైన క్లేశమును పొందుదురు. అట్లు మఱియు నెవ్వఁడు పూర్వోక్తలక్షణయుక్తుఁడైన గురువుచేతఁ గాక తానే వేదార్థవిచారము చేయునో, లేక భేదవాదులతోఁ గూడి విచారముచేయునో, వాఁడును భేదరూపక్షారతననుభవించి జన్మమరణరూపమైనక్లేశమును అనుభవించును.

ఏపురుషుఁడు బ్రహ్మవిద్గురుముఖద్వారమున వేదార్థము విని, విచారము చేయునో, వానికి వేదము అమృతముకన్న అధికానందహేతువగును. ఎట్లు సముద్రజలము స్వభావతః క్షారమయ్యును మేఘద్వారమున మధురమగునో, అట్లు వేదార్థము బ్రహ్మజ్ఞానియగు గురువువలన ఆనందమునకు హేతువగును.

---

1 జైనులగురువు.

2 గురుశబ్దముయొక్క అర్థము గాఁడు. అనఁగా శ్రోత్రియబ్రహ్మనిష్ఠపురుషుఁడే గురువని శాస్త్రంబునందు చెప్పఁబడియున్నది; భేదవాదిపాఠకుఁడు అట్లు గాఁడు; అందువలన వాఁడు గురువు గాఁడు.

## 57. జ్ఞానియగుగురువువలన వేదార్థపఠనశ్రవణముయొక్క యోగ్యత

గురుద్వారమున వేదార్థముయొక్క విచారము చేయుట వలన ముక్తిరూపఫలప్రాప్తి యగుననుటచే ఆగురువు జ్ఞానిగా నుండవలెనా? లేక అజ్ఞానిగానుండవలెనా? అని శేషము చెప్ప లేదు; చెప్పుట అవశ్యము గాదు; అట్లయినను "జ్ఞానహీనుఁడు గురువగుట లేదు" ఇని మొదలే చెప్పితిమి; ఆ మొదట చెప్పిన సంగతియే ఇపుడు దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నాము—

అజ్ఞానియైనవాఁడు చర్మపాత్రసమానముగాను ఘట సమానముగాను ఉన్నాఁడు. చర్మపాత్రవలన, లేక ఘటము వలన గ్రహణముచేసిన సముద్రజలము ఎట్లువిలక్షణమైన మాధుర్యమునకు హేతువు గాదో, అట్లు అజ్ఞానియైన భేద వాదిద్వారమున గ్రహణముచేసిన వేదరూపసముద్రముయొక్క అర్థరూపజలము అద్భుతానందహేతువు గాఁజాలదు. అందు వలన చర్మపాత్రసమానుఁడు, లేక ఘటసమానుఁడైన అజ్ఞాని పాఠకుని త్యజించి మేఘసమానుఁడైన జ్ఞానిగురువువలన వేదార్థము విచారింపవలయును.

## 58. భాషాగ్రంథమువలనను [1] జ్ఞానమగుచున్నది

జ్ఞానవంతునియొద్ద వేదము విచారింపవలెను; ఇట్లనుట వలన ఈశంకపొడముచున్నది. వేదశ్రుతిద్వారమున జీవబ్రహ్మల-

1 భాషాగ్రంథమువలన జ్ఞానము గానేరదు. ఇట్లెవ్వఁడేని అగ్రహించి నపుడు వాని నడుగవలయును—1 భాషాగ్రంథము వేదానుసారము గానందు వలన దానిచేత జ్ఞానముగానేరదా? లేక 2 అది భాషారూపముగా నున్నందువల

స్వరూపవిచారము చేయుటవలన జ్ఞానమగును; అన్యసంస్కృత గ్రంథములవలన, లేక హిందూస్థానిమహారాష్ట్రాంధ్రములు మొదలగు భాషాగ్రంథములవలన జ్ఞానము గానేరదు; కాబట్టి ఆ యన్యభాషాగ్రంథములు నిష్ఫలములగును?

---

నా? లేక 3 ఆ భాషాగ్రంథము అవతారశరీరునిచేత రచితముగానందువల నా? లేక 4 ఆ భాషాగ్రంథము అశుద్ధముగా నుండుటవలననా? వీనిలో—

(1) వేదానుసారము గాదనునది మొదటిపక్షము అంగీకరించినప్పుడు వేదపాఠానుసారము గాదా? లేక అర్థానుసారము గాదా? పాఠానుసారము గాదని చెప్పినప్పుడు అన్యసంస్కృతగ్రంథము లును పాఠానుసారములు గావు; వానిచేతను జ్ఞానము గాఁగూడదు. అర్థానుసారము గాదనిచెప్పినపుడు అదియుం ఘటిల్లదు. ఏల యన—ఎట్లు సంస్కృతగ్రంథములు అర్థానుసారములో, అట్లు ప్రాకృతగ్రంథములు అర్థానుసారములుగా నున్నవి; గనుక ఎట్లు ఆయుర్వేదానుసారములగు అన్యసంస్కృతప్రాకృతగ్రంథ ములవలన ఔషధాదికముయొక్క జ్ఞానమగునో, అట్లు వేదా ర్థానుసారములగు సంస్కృతప్రాకృతగ్రంథములచేతను బ్రహ్మ జ్ఞానమగును; ఇది సిద్ధము.

(3) భాషాగ్రంథము భాషారూపమగుటవలన దానిచే జ్ఞానము కానే రదు; అట్లయినప్పుడు ఎట్లు సంస్కృతగ్రంథము దేవభాషారూప మో, అట్లు ప్రాకృతగ్రంథము నరభాషారూపముగా నున్నది. భాషయనుట రెంటియందు తుల్యము.

(3) భాషాగ్రంథము అవతారరచితము గామివలన దానిచేత జ్ఞానము గానేరదు; అని యిట్లు చెప్పినప్పుడు సంస్కృతగ్రంథమును అవ తారరచితము గాకపోయినను దానివలన జ్ఞానమగుచున్నది.

ఈశంకకు సమాధానము—"బ్రహ్మవేత్త అయిన పురుషుఁడు బ్రహ్మరూపుఁడు" అనునీ సంగతి శ్రుతియందు ప్రసిద్ధముగా నున్నది; కనుక తద్వచనము వేదరూపము; అది అన్యభాషారూపముగానీ, లేక సంస్కృతభాషారూపముగానీ, సర్వప్రకారముగా భేదభ్రమను ఛేదించుచున్నది.

వేదవచనముచేతఁగాక జ్ఞానము కానేరదు; ఈనియమము లేదు. ఎట్లు ఆయుర్వేదమందు చెప్పఁబడిన రోగము, తన్నిదానము, ఔషధము వీనియొక్క సంపూర్ణజ్ఞానము అన్యసంస్కృత గ్రంథములవలన, లేక ఫార్సి, యింగ్లీషు మొదలైన భాషలయందలి గ్రంథములవలనఁ గలుగుచున్నదో, అట్లు సర్వమునకు ఆత్మయయిన బ్రహ్మముయొక్క జ్ఞానమును అన్యభాషాగ్రంథముల

---

అట్టు భాషాగ్రంథము అవతారరచితము గాకపోయినను దానిచేతను జ్ఞానమగును.

(4) భాషాగ్రంథము అశుద్ధమని చెప్పినప్పుడు ఎట్లు సంస్కృతగ్రంథనియమముచేత ప్రాకృతగ్రంథ మశుద్ధమో, అట్లు ప్రాకృతనియమముచేత సంస్కృతగ్రంథ మశుద్ధము; అశుద్ధత రెంటియందు సమము.

ఈరీతిగా భాషాగ్రంథమువలన జ్ఞానము గానేరదు; అనుట వాత మాత్రము. ఈయభిప్రాయముచేతనే నానక దాదూజి, ఏకనాథస్వామి, వామనపండితుఁడు మొదలగు మహాత్ములు ప్రాకృతవాణిలో గ్రంథములు రచించినారు; అవి అన్నియుం సంస్కృతాభ్యాసరహితునకు కల్యాణకారకముగ నున్నవి; మఱియుం అవిఎట్టు కల్యాణకారకములో, అట్టు అధునిక బ్రహ్మవేత్తలు చేసినవియుం, చేయుచున్నవియుం, చేయబోవునవియుం ప్రాకృతగ్రంథములుం సంస్కృతాభ్యాసరహితునకు జ్ఞానద్వారమున కల్యాణహేతువులుంగా నున్నవి.

వలన నగుచున్నది. అది ఘటిల్లదనినయెడ సర్వజ్ఞులైన మునుల చేత స్మృతిపురాణేతిహాసాది గ్రంథములందు బ్రహ్మవిద్యాప్రకరణము చెప్పఁబడియున్నది; వేదము లేక జ్ఞానముఁ గాదేని అప్పుడు ఆసంపూర్ణప్రకరణము నిష్ఫలమగును. సర్వజ్ఞవచనము నిష్ఫలమనుట ఘటిల్లదు; కనుక ఇట్లు ఎఱుఁగవలెను— ఆత్మస్వరూపప్రతిపాదకమైన వాక్యమువలన జ్ఞానమగును; అది వేదవాక్యముగానీ, లేక ఇతరవాక్యము గానీ.

ఈరీతిగా భాషాగ్రంథముచేతను జ్ఞానమగునను సంగతి సిద్ధించినది.

## 59. గురుసేవాకర్తవ్యత

ఏ బ్రహ్మవేత్తయొక్క వచనము వేదసమానముగా నున్నదో, ఆబ్రహ్మవేత్తయగు ఆచార్యుని జిజ్ఞాసువు సేవింపవలయును. ఏలయన— సేవవలన ఎప్పుడు ఆచార్యుఁడు ప్రసన్నుఁడగునో, అప్పుడు జిజ్ఞాసువు తనస్వరూపముఁ దెలియును. ఇట్లనుటవలన ఇది సూచింపఁబడినది— ఆచార్యునిసేవ యనునది ఈశ్వరసేవకన్న అధికము.

చూడుము— ఈశ్వరునిసేవయో, అదృష్టఫలమునకు హేతువు; ఆచార్యసేవ అదృష్టఫలమునకును, దృష్టఫలమునకును హేతువుగా నున్నది. ఏది ధర్మాధర్మోత్పత్తిద్వారమున ఫలమునకు హేతువగునో, దానిని అదృష్టఫలహేతువందురు. మఱియు ఏది ధర్మాధర్మోత్పత్తిలేకయే సాక్షాత్ఫలమునకు హేతువగునో, దానిని దృష్టఫలహేతువందురు.

ఈశ్వరునిసేవ ధర్మోత్పత్తిద్వారమున అంతఃకరణశుద్ధిరూపమైన ఫలమునకు హేతువగుటవలన అదృష్టఫలమునకు

హేతువుగా నున్నది. ఆచార్యసేవయో, ధర్మాపేక్షలేకయు ఆచార్యుని ప్రసన్నతాద్వారమున నుపదేశరూపఫలమునకు హేతువగుటవలన దృష్టఫలమునకు హేతువుగా నున్నది. మఱియు ధర్మోత్పత్తిద్వారమున అంతఃకరణశుద్ధిరూపమైన ఫలమునకు హేతువగుటవలన అదృష్టఫలమునకును హేతువుగా నున్నది.

ఈరీతిగా ఆచార్యసేవ ఈశ్వరసేవకన్న నుత్తమము; కాబట్టి జిజ్ఞాసువు సర్వప్రకారములను బ్రహ్మవేత్తయయిన ఆచార్యుని సేవ చేయవలయును.

## 60 ఆచార్యసేవాప్రకారము

గురువు సమ్ముఖప్రాప్తుఁడైనప్పుడు దండమువలె సాష్టాంగ ప్రణామము [1] చేయవలయును. పావనమైన [2] పాదసరోజము యొక్క [3] రజస్సును [4] ఉత్తమాంగమందు [5] ధరింపవలయును. మఱియు తనుమనోధనవచనార్పణము. చేయవలయును. ఇవి మొదలైనవి ఆచార్యసేవ యందురు.

---

1 "ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా,పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం ప్రణామోఽష్టాంగ ఉచ్యతే." హృదయము, శిరము, దృష్టి, మనస్సు, వాక్కు, పదము, కరము, జానువు ఈఅష్టాంగములచే చేసిన నమస్కారమును సాష్టాంగమందురు. ఇది ఒకప్రకారము. మఱియు పాదములు 2, చేతులు 2, జానువులు 2, హృదయము 1, శిరము 1, ఈ అష్టాంగములచే చేసిన నమస్కారమునకు సాష్టాంగమందురు. ఇది రెండవప్రకారము.

2 పవిత్రము. 3 కమలము.

4 ధూళి. 5 మస్తకము.

## 61. తన్వర్పణము

గురువుయొక్క ఆశ్రమమునందు [1]సమ్మార్జనాది సకల కర్మములు చేయవలయును. మఱియుగురువునకు చరణసంవాహనాది శుశ్రూష [2] చేయవలయును; దీనిని తన్వర్పణమందురు.

## 62. మనోర్పణము

గురువునందు సాక్షాత్ శ్రీరామభావన [3] ఉంచుకొని, పూజాదికము చేయవలయును. గురువునందు దోషదృష్టిస్వప్నమందును ఉంచఁగూడదు. మఱేమనఁగా—సదా పూజ్యబుద్ధియే యుంచవలయును; దీనిని మనోర్పణమందురు.

1 మతాంతర్గతము. 2 సేవ.

3 రామునియందు అనఁగా పరమేశ్వరునియందు ఉంచిన ప్రేమతో సమానమైన ప్రేమ [భక్తి] నుంచవలయును. అభిప్రాయము—గురువును పరమేశ్వరరూపమనియెంచి భక్తిచేయవలయును. ఎవ్వఁడు ఇట్లు చేయుచున్నాఁడో, వానికి గురువుచెప్పిన అర్థముయొక్క జీవబ్రహ్మైక్యార్థముయొక్క] ప్రకాశమగుచున్నది. ఈయర్థమునకు వాచకమైన శ్రుతి—

"యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశం తే మహాత్మనః." 1

శ్రీగురువందు ఎల్లప్పుడు ఈశ్వరభావన ఉంచుటప్రకారము ఇట్లున్నది—

గురువెప్పుడు శిష్యునిపై వాత్సల్యము చేయునో, అప్పుడు విష్ణురూపుఁడని భావింపవలయును. గురువెప్పుడు క్రోధముచేయునో, అప్పుడు శివరూపుఁడనిభావింపవలయును. గురువెప్పుడు రాజసవ్యవహారమునందు తత్పరుఁడగునో, అప్పుడు బ్రహ్మరూపుఁడని భావింపవలయును. గురువెప్పుడు శాంతుఁడుగా నుండునో, అప్పుడు గంగారూపుఁడని భావింపవలయును. మఱియు గురు-

## 63. ధనార్పణము

భార్యమొదలుకొని వ్రీహి [ధాన్యము] పర్యంతమయిన సమస్తసముదాయమును ధనమందురు. ఇవన్నియు విడిచి, త్యాగియైన గురువును శరణుపొందవలయును. దీనిని ధనార్పణమందురు. ఇది యొకప్రకారమైన ధనార్పణమే. ఏలయన—గురువు స్వతః త్యాగియగుటవలన నంగీకారము చేయఁడు; ఆగురుప్రాప్తికొఱకు ధనత్యాగము చేసినాఁడుగనుక నట్టి యే త్యాగము గలదో, అదియు గురువునకే అర్పణమందురు. గృహస్థు గురువైన పక్షమందు సకలము అతని స్వాధీనము చేయవలయును. దీనికి ప్రకారాంతరమగు ధనార్పణమని పేరు.

ఈవిషయమునందు ఒకానొకఁడు శంకించుచున్నాఁడు— బ్రహ్మవిద్యాచార్యుఁడు గృహస్థుగా నేరఁడు? ఈశంక ఘటిల్లదు. ఏలయన— యాజ్ఞవల్క్యోద్దాలకాది బ్రహ్మవిద్యాచార్యులు గృహస్థులైనట్లు వేదమునఁ దెలియఁబడుచున్నది.

## 64. వచనార్పణము

ప్రసంగము చూచికొని స్తుతిచేయుట, మఱియు వారంవారము మాటలవలన తనదీనతను దోఁపఁజేయుట ఇది వచనార్పణము [1] అనఁబడును.

---

ఎప్పుడు వచనరూపమయిన కిరణములచేత భ్రమాంధకారమును దూరము చేయుండో, అప్పుడు సూర్యరూపుఁడని భావింపవలయును. ఈరీతిగా బ్రహ్మవేత్తయగు గురువునందు శిష్యుఁడెప్పటికిని ఈశ్వరభావనయే ఉంచవలయును. స్వప్నమందును దోషదృష్టి లేఁకూడదు.

1 వివేకచూడామణియను గ్రంథమునందు జగద్గురు శ్రీశంకరాచార్యుఁడు శ్రీగురుసమ్ముఖమున శిష్యునిప్రార్థన పలుకుచున్నాఁడు—

## 65. శిష్యునకు గురువుతో సంబంధవ్యవహారము

ఏపురుషుఁడు తనకల్యాణము [హితము] నిచ్ఛించుచున్నాఁడో, వాఁడు పూర్వరీతిగా తనుమనోధనార్పణముచేసి,

స్వామిన్నమస్తే నతలోకబంధో
కారుణ్యసింధో పతితం భవాబ్ధౌ,
మాముద్ధరాత్మీయకటాక్షదృష్ట్యా
ఋజ్వ్యాతికారుణ్యసుధాభివృష్ట్యా. 37

భావార్థము—ఓస్వామీ! నీకొఱకు నమస్కారము. నీవు కరుణాసముద్రుఁడవు. నీవు శరణాగతజనులయొక్క బంధువుఁడవు. నేనో, సంసారమను మహాసముద్రమునందు పడియున్నాను; నీవాత్సల్యధర్మముచే నన్నుద్ధరింపుమా! కరుణామృతముచే నిండఁబడిన నీకటాక్షరూపమేఘముయొక్క వృష్టిచేసి త్రివిధతాపములచేఁ దప్తుఁడనైన నాకు శాంతము చేయుమా!

దుర్వారసంసారదవాగ్నితప్తం
దోధూయమానం దురదృష్టవాతైః,
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః
శరణ్యమన్యం యదహన్న జానే. 38

భావార్థము—నాదుష్కర్మమను వాయువుచే ప్రజ్వలితమై దుర్నివారమైన సంసారమను దావాగ్నియందు చిక్కుకొని కాలుచున్నాను. మిక్కిలి భయపడియున్నాను. నీవుదక్క నాకెవ్వఁడును దిక్కులేడు. నిన్ను శరణుఁబొందితిని. ఓస్వామీ! నన్ను మృత్యుభయమునుండి రక్షింపుమా!

శాంతా మహాంతో నివసంతి సంతో
వసంతవల్లోకహితం చరంతః,
తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనా-
అహేతునాన్యానపి తారయంతః. 39

తాను బహుకాలము గురువుండుచోట లేక తత్సమీపమున వాసము చేయవలయును. మఱియు తాను భిక్షాన్నమువలన జీవనము [ప్రాణధారణము] చేయవలయును.

---

భావార్థము— అరణ్యముచేత తనకు ఏయొక లాభము లేకుండినను కేవలవనహితార్థముగానే ఎట్లు వసంతఋతువు అరణ్యమునందు సంచరించుచున్నదో, అట్లు సకలవిషయములనుండి నివృత్తులైనను కేవలలోకహితార్థముగానే నీవంటిసత్పురుషులు భూమియందు సంచరించుచుందురు. తాము భయంకరమైన ఈసంసారమహాసముద్రమును స్వయముగా తరించినవారై యేవిధమయిన కారణములేకయె ఇతరుల నుద్ధరింపఁజేయుటకై కనిపెట్టి యుండుదురు.

అయం స్వభావః స్వత ఏవ యత్పర
శ్రమాపనోదప్రవణం మహాత్మనాం,
సుధాంశురేష స్వయమర్కకర్కశ
ప్రభాభితప్తామవతి క్షితిం కిల. 40

భావార్థము—ఇతరులకు ఆపదకలిగినపుడు వారు ప్రార్థింపకుండ తమంతనె వారియాపదలను బోఁగొట్టి రక్షించుట తమవంటి మహాత్ములస్వభావముగానే యున్నది. ఇదిగో చంద్రుఁడు సూర్యకిరణాభితప్తమైన భూమిని తానైయే చల్లనికిరణములచేఁ దాపమునుదీర్చి కాపాడుచున్నాఁడుగదా!

బ్రహ్మానందరసానుభూతికలితైః పూతైః సుశీతైఃసితైః [య,
యుష్మద్వాక్కలశోజ్ఝితైః శ్రుతిసుఖైర్వాక్యామృతైః సేచ
స న్త ప్తం భవతాపదావదహనజ్వాలాభిరేనం ప్రభో
ధన్యాస్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః. 41

## 66. భిక్షాన్నవినియోగము

భిక్షాన్నమును శిష్యుఁడు దెచ్చి, తాను భుజింపక గురువు నెదుట నుంచవలయును. ఉంచినవెనుక స్వోదరపూరణమునకు గురువును దానిని యాచింపఁగూడదు. ఒకేదినమందు గ్రామమున రెండవమాఱు భిక్షచేయగూడదు; మఱేమనఁగా— గురువే కృపచేసి, ఇచ్చిన భుజింపవలయును. శిష్యునిపరీక్షకొఱకు గురువు ఈయఁడేని అప్పుడును రెండవదినమే భైక్షము ఆచరింపవలయును.

---

భావార్థము — ఓమహాపురుషుడా ! సంసారతాపమనుదావానలము యొక్క జ్వాలలు నన్ను చుట్టిముట్టి మిక్కిలి దహించుచున్నవి. నీవు నాయందు కృపయుంచి, పరిశుద్ధములును మిక్కిలి చల్లనివియు బ్రహ్మానందరసానుభవజనితములును అగు నీవాక్కునెడు కలశమునుండి పడునట్టి వాక్యామృతధారచేఁ దడిపి,నాతాపము శమింపుమా! ఏకటాక్షముయొక్కనీడ లోక్షణము నిలిచినచో ఎట్టివారును ధన్యులగుదురో, అట్టి నీకృపాకటాక్షముయొక్క నీడయందు నాకును గొంచెము స్థలము నిమ్మా !

కథం తరేయం భవసింధుమేతం?
కా వా గతిర్మే? కతమోఽస్త్యుపాయః?
జానే న కించిత్ కృపయాఽవ మాం ప్రభో
సంసారదుఃఖక్షతిమాతనుష్వ. 42

భావార్థము—ఓస్వామీ! ఈసంసారసముద్రము ఎట్లు దాఁటఁజాలుదును నాకెద్దిగతి? దీనిదాఁటుట కేమియుపాయము? నాకుఁ గొంచెమయినను తెలియదు. నీవే నన్నుఁ గరుణించి రక్షింపవలెను.

ఈప్రకారముగా వివేకవైరాగ్యాది సాధనసంపన్నుఁడైన జిజ్ఞాసువు సద్గురువుయొక్క ప్రార్థన చేయుచున్నాఁడు. ఇదే వచనార్పణముయొక్క మార్గమని ఎఱుఁగవలెను.

## 67. ప్రసంగానుసారప్రార్థనము

ఈ ప్రకారము వ్యవహరించుచు గురువునవకాశ మొసఁగి, గురువు ప్రసన్నముఖుఁడై తనకు అభిముఖుఁడైనప్పుడు హస్తములుమోడ్చి, గురుస్తవముచేసి, వినతిఁజేసి, "భగవంతుఁడా! నే నడుగఁగోరుచున్నాను" అనవలయును. తరువాత గురువు ఆజ్ఞాపించినయెడల ప్రశ్నము చేయవలయును. [ఈ ప్రకరణము వచశార్పణమునకు అంతర్గతమనియే ఎఱుఁగవలెను.]

## 68. పూర్వసుకృతాధికారికి సహజోపదేశము

ఎప్పుడేని జన్మాంతరమునొక్క ఉత్తమకర్మమువలన గురువు కృపచేసి, శిష్యునకు తన్వర్పణాది సేవ లేకయే ఉపదేశము చేయునేని అప్పుడు విశుద్ధుఁడైన అధికారికి కల్యాణమగును. ఏలయన—గురుసేవవలన రెండుఫలములు గలవు—మొదటిది గురువుయొక్క ప్రసన్నత, రెండవది అంతఃకరణశుద్ధి. ఈ రెండుఫలములును వానికి సిద్ధించినవే.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. భ. గీ."

భావార్థము— నమస్కారముచేతను, ప్రశ్నచేతను, సేవచేతను నీవు ఆ బ్రహ్మజ్ఞానము నెఱుఁగుము. తత్త్వజ్ఞజనులు నీకు బ్రహ్మజ్ఞానము ఉపదేశింతురు. ఈ ప్రకారముగా శ్రీభగవంతుఁడు అర్జునునిగుఱించి చెప్పుచున్నాఁడు.

అభిప్రాయమేమనఁగా— సజ్జనులచే బ్రహ్మజ్ఞానము సంపాదించుటకు నమస్కారము మొదలగు మూఁడు సాధనము లున్నవి. [ఇచ్చట చెప్పఁబడిన తనుమనోధనార్పణాది సకలసాధన

ములు వీనియందే అంతర్భూతముగ నున్నవి.] వానియందు జన్మాంతరభక్తిబలము అధికముగా నుండినపుడు ఒకనయస్కారముచేతనే బ్రహ్మజ్ఞానము ప్రాప్తమగును; సాధారణభక్తిబలముండినపుడు రెండుసాధనములచే కనిష్ఠభక్తిబలముండినపుడు మూఁడుసాధనములచే ప్రాప్తమగును. కొందఱికి ఒకసాధనముచేతనే తత్త్వజ్ఞానము ప్రాప్తమగుచున్నదను సంగతి పురాణమందు వినఁబడుచున్నది; అదియు ఇచ్చట చెప్పినప్రకారముగ జన్మాంతరభక్తిబలముచేతనే సభాగ్యజిజ్ఞాసువులకే ప్రాప్తమగుచున్నది; కాని అందఱికిని కాదు.

సోమరి శఠుఁడైన జిజ్ఞాసువేషధారిపురుషుఁడు అవిద్యాబలముచేత నేనును జన్మాంతరసుకృతిగా నున్నాను; నాకును సహజముగానే బ్రహ్మజ్ఞానము ప్రాప్తమగుచున్నదని ఎఱుఁగుచున్నాఁడు; వాఁడు పథికజామాతలన్యాయమున ఖేదమును బొందుచున్నాఁడు; పథికజామాతలసంగతి ఇట్లున్నది.—

ఒకపరదేశిపథికుఁడు తిరుగుచు తిరుగుచు, ఒకగ్రామసన్నిధికి వచ్చి, ఊరిబయట నొకచెట్టుక్రింద కూర్చుండెను; పిదప తద్గ్రామనివాసియగు ఒకశ్రీమద్బ్రాహ్మణుని అల్లుఁడు చాలదినములకు ఆ గ్రామమునకు వచ్చి, ఆ పథికునియెదుట హనుమానుల గుడియొద్ద కూర్చుండెను; వాఁడు వచ్చినవార్త గ్రామమందు వినఁబడఁగానే వానిమామ పదుగురు సంభావితజనులను వెంటఁ దీసికొని, వచ్చిచేరెను. అత్తయును పదుగురు అమ్మలక్కలను కూడుకొని, వచ్చినది. వచ్చి, ఇంటికి వచ్చుటకొఱకు ప్రార్థింప సాగిరి; అపుడు అల్లుఁడు అనేకహేతువులు చూపి, రానని

చెప్పెను; అందఱును ఆగ్రహము చేసిచేసి, ఎట్టకేలకు వానిని నొకబండియందు కూర్చుండఁజేసి, గ్రామమునకుఁ దీసికొనిపోయిరి.

ఈచరిత్రమంతయు పథికుఁడు దూరమునఁ జూచి, తన మనస్సులో ననుచున్నాఁడు—ఆహా! ఈగ్రామమందు సంప్రదాయము ఎంతబాగుగా నున్నది; ఎవఁడేని పరదేశిపురుషుఁడు వచ్చిన వానిని సత్కారముతో ఇంటికిఁ దీసికొనిపోవుదురు; నేను చెట్టుక్రింద కూర్చుండుటవలన నన్ను ఎవ్వఁడును జూడలేదు; ఎవ్వఁడును పిలువలేదు; అని యోచించి, ప్రసిద్ధమైన హనుమానులగుడికిఁ జేరెను. చేరి, ఎవ్వఁడైనవచ్చును, నన్ను పిలుచును, సమారంభముతోఁడఁ దీసికొనిపోవును; అని మార్గప్రతీక్ష చేసికొనుచు కూర్చుండెను; అర్ధరాత్రమువఱకు ఎవ్వఁడును రాలేదు; జఠరాగ్ని ప్రదీప్తమాయెను; అపుడు గ్రామమందు భిక్షమెత్తుటకు పోయెను; అందఱును తలుపులుమూసి పండుకొనిరి; తలుపుతట్టుటకు ప్రారంభించెను; పరదేశిని దొంగయని ఎంచి; జనులు కొట్టికొట్టి, ప్రాతఃకాలమువఱకుఁ గట్టియుంచిరి. ఈకథవలనఁ జూడుము—

జన్మాంతరభక్తియుత్ పురుషుఁడు పరమాత్మకు జామాతవలె ప్రియుఁడుగాను, భక్తిహీనపురుషుఁడు పథికునివలె ఉదాసీనుఁడు గాను ఉండుచు; అప్రియపాత్రుఁడైన సద్భక్తునకు అగునట్లు నాకును సహజముగా ఉపదేశమగుచున్నదని తలఁచుట ఎఱుఁగుట అవిద్యయొక్క మాహాత్మ్యమే.

కొందఱు జిజ్ఞాసువులు దుర్ఘటసేవచే ఆచార్యుని ప్రసన్నునిఁ జేసి, బ్రహ్మజ్ఞానము లభించినారని సంగతులు పురాణములందు ప్రసిద్ధముగ నున్నవి.

సారాంశము—ఎవ్వని కడుపునందు ఆకలి కలుగునో, వాఁడు సహస్ర కార్యములుచేసి, ఉదరశాంతి చేయును; ఎవ్వనికి ఆఁకలి లేదో, వానికి పాత్రముమీఁద వడ్డించినఅన్నము కూడ భక్షించుట అశక్యమే. [ఈసంగతి అనుభవసిద్ధము.] అట్లు ఎవ్వనికి బ్రహ్మజ్ఞానవిషయమందు ఆఁకలి ఉన్నదో, వాఁడు ఎన్ని ఉపాయములచేతనైనను ఆచార్యుని ప్రసన్నునిఁ జేసి, బ్రహ్మజ్ఞానము సంపాదించును; ఎవ్వనికి ఆఁకలిలేదో, వానికి ఒకనమస్కారము చేయుటకూడ కష్టమే.

ఈప్రకారముగా విచారాబ్ధియొక్క-ఈతృతీయతరంగమునందు చెప్పినట్టి గురుశిష్యలక్షణములు తెలిసికొని, యెవఁడు గురువునకు శరణాగతుఁడగుచున్నాఁడో, అతఁడు శ్రీగురుకృపవలన అత్యంతదుఃఖరూపమైన భవసముద్రమును దాఁటి పరమానందసామ్రాజ్యమును బొంది కృతార్థుఁడగుచున్నాఁడు.

ఇది శ్రీగురుశిష్యలక్షణము, గురుభక్తిఫలప్రకారనిరూపణమును తృతీయతరంగము సంపూర్ణము.





రజ్జుసర్పసంగతి



# శ్రీవిచారసాగరము

## చతుర్థతరంగము

### రజ్జుసర్పసంగతి

అంకము 1

ఒకగృహస్థుని ఇంటియొద్ద ఒకకూపమున్నది. ఆకూపము యొక్క నీళ్లకొఱకు గ్రామవాసిజనులు నిత్యశః వచ్చుచుందురు. ఒకనాఁడు సాయంకాలము దీపసంధికి ఒకఅమ్మ బానతీసికొని నీళ్లకొఱకు వచ్చెను. పాము! పాము! అమ్మా ఎంతపెద్దపాము! అని ఒకసారి గట్టిగా అఱచి, బానతోఁగూడ మూర్ఛితముగ పడెను. అమ్మయొక్క అఱపువిని, చుట్టుపట్టుజనులు పరుగెత్తివచ్చి, భయగ్రస్తాంతఃకరణముచే దూరముననున్న సర్పమును జూచిరి. చూచి, కొందఱు అమ్మనుపట్టుకొని, శీతలోపచారవిధి చేయ నారంభించిరి. ఒకఁడు దూరమున నిలచి, ఛూ! ఛా! చేయ సాగెను. ఒకఁడు తుపాకియందు తోటా వేసి, దూరముననుండి ఆ పాముమీఁద గుఱిచేసెను. ఒకఁడు ధైర్యవంతుఁడు చేతిలో నొకపెద్దదండము పట్టుకొని, కొట్టుటకు ప్రవర్తకుఁడయ్యెను. ఒకఁడు వఱనుండి కత్తిపెఱికి, చంపుటకు పరుగెత్తెను. ఒకఁడు పెద్దఱాయి తలమీఁదపెట్టుకొని, పాముమీఁద వేయుటకు



రజ్జుసర్పసంగతి.

పుట. 216

పోయెను. ఒకఁడు పిలికివాఁడు దూరమున నొకచెట్టుమీఁదఁ గూర్చుండి, తనశరాసనము సజ్జముగఁజేసెను. ఒకఁడు నాగ స్వరము నూఁదనారంభించెను. ఈరీతిగా అనేకజనులు అనేకవిధ ములుగ ఆ పెద్దపామును కాలముచేయించుటకొఱకు ప్రయ త్నించిరి.

అంకము 2

ఆగలభా విని, ఎదుటియింటిలో ధైర్యవంతురాలగు నొకముసలమ్మ ఒకప్రమిదయందు దీపము వెలిఁగించి, మెల్ల మెల్లఁగా ఆపామునొద్దకు వచ్చిచేరెను. పామువీఁద దీప ప్రకాశము పడఁగానే అందఱు త్రాడు! త్రాడు! అని గదగద నవ్విరి. ఈసమయమున నాయింటిలోనిసేవకుఁడు బయటనుండి వచ్చి, పకపకనవ్వుచు గిలకమీఁదిత్రాడు చుట్టిచుట్టి, తొట్టి మీఁద నేనే పెట్టితినని చెప్పెను. అందఱును ఆశ్చర్యపడిరి.

ఈకథయందు చూడుము—రజ్జుస్థానమునందు భ్రాంతి బలమువలన పుట్టినదైన సర్పముయొక్క నాశముకొఱకు అనేక జనులు అనేకోపాయములు జేసినను, అవన్నియు నిరర్థకము లాయెను. ముసలమ్మ దీపముతేఁగానే సర్పము తత్కాలము నాశమై రజ్జుదర్శనముచే అందఱికి ఆశ్చర్యానందమాయెను.

దార్ష్టాంతికము.

ఆప్రకారముగా సంసారమనునది ఒకపెద్దసర్పముగ నున్నది. ఇది బ్రహ్మరూపాధిష్ఠానమునందు మూలావిద్యయను పెద్దభ్రాంతిబలమువలన పుట్టినదిగా నున్నది. ఈసంసారసర్పము యొక్క నివృత్తికొఱకు అనేకజనులు అనేక ఉపాయములు



రజ్జుసర్పసంగతి. పుట. 216

చేయుచున్నారు—కొందఱు తీర్థాటనము, కొందఱు ధూమ్రపానము, కొందఱు జపము, కొందఱు తపము, కొందఱు ధ్యానము, కొందఱు ప్రాణాయామము, కొందఱు కర్మానుష్ఠానము, కొందఱు భజనము, కొందఱు పూజనము. అయినను ఆయుపాయములవలన ఈసంసారసర్పముయొక్క దంతభగ్నమును గాదు. ఎప్పుడు జ్ఞానవృద్ధుఁడు శమాదిసాధనములచే శుద్ధాచలమైన అంతఃకరణమను ప్రమిదయందు "అహం బ్రహ్మాస్మి" అను దీపము ప్రజ్వలింపఁ జేయునో, అప్పుడే ఈ సంసారసర్పము చనిపోయి,సచ్చిదానంద బ్రహ్మరూపరజ్జుదర్శనముచే హర్షనిర్భరుఁడగును.

## దృష్టాంతమహిమ

రజ్జుసర్పదృష్టాంతము వేదాంతశాస్త్రముయొక్క ప్రాణముగనున్నది. ఎట్లు ప్రాణము లేనిశరీరము నిరర్థకమగునో, అట్లు రజ్జుసర్పదృష్టాంతము లేక వేదాంతశాస్త్రము దుర్బోధమగుటవలన నిరర్థకమువలె నుండును. లేక రజ్జుసర్పదృష్టాంతము వేదాంతశాస్త్రముయొక్క గుత్తదారుఁడుగ నున్నది. ఎట్లు గుత్తదారుఁడు కావలసినపదార్థములు ఆయా కాలమందు ఇచ్చుచున్నాఁడో, అట్లు రజ్జుసర్పదృష్టాంతము ఆయా ప్రసంగమందు వేదాంతశాస్త్రమునకు అర్థనిర్వాహము చేయుచున్నది. అందువలన రజ్జుసర్పదృష్టాంతసంగతి ఉత్కృష్టస్పష్టీకరణమగుట ఉచితముగ నున్నది. ఇచ్చుటనో, శక్త్యనుసారముగ వ్రాసితిని.

---

## ఉత్తమాధికార్యుపదేశనిరూపణము

### ౼ 69. శుభసంతతిరాజకథారంభము ౼

పురాతనకాలమందు శుభసంతతి యనురాజు ముల్లోకముల నేలుచుండెను. వానిదగు పూర్వజన్మసముపార్జితపుణ్యమువలన వానిగర్భగోళమందు సకలగుణమణిరత్నాకరులు, వైరాగ్యసంపన్నులు, వివేకచింతామణులు, శుభేచ్ఛయనుదేశము నేలు రాజులు, కులదీపకులైన పుత్త్రులు ముగ్వురు తత్త్వదృష్టి, అదృష్టదృష్టి, తర్కదృష్టి యనువేళ్లుగలవారు క్రమముగా నుద్భవించిరి.

వారలాబాల్యము సదాచరణమార్గానుసారులై యుండిరి. కొన్నిదినములైనపిదప వారు సకలవిద్యలు, సకలకళలు, రాజనీతి ఇత్యాదులైన సకలసద్గుణములందు ప్రవీణులగుచుండఁగా యౌవనదశ ప్రాప్తమాయెను. అప్పుడు రాజొకనాఁడు ఏకాంతమున నుండి భవాగ్నిని శమించునది పరమానందమును పొందించునదైన త్రిభువనవంద్యమైనట్టి సదసద్వివేకమును అనుతాపపూర్వకముగా నిజస్వాంతమున నారంభించెను.

[అనుతప్తకాలమందలి రాజుయొక్కవిచారము.]

రాజు తనలో తానిట్లనుకొనెను—హా హా! నామూర్ఖత్వమేమందును! ఛీ ఛీ! నేనెంతమూర్ఖుఁడను! నేనెంతపాపిని! చూడుము—ధరామండలమందుఁగలగంభీరజలపూరపూరితములైన కాసారములెల్ల నామూర్ఖత్వమనునట్టిజలముచేత నిండినవా

యేమి? అట్టి అత్యుచ్ఛ్రియములైన శిఖరములుగల మహామేరు మందరాదికధరాధరములెల్ల నొకటిగా రాశిపోసిన నాపాపము యొక్క కూటములా యేమి? నేనిదివఱకు చేసిన దేమి?

శిశుత్వమెల్ల ఆటయందు గడచిపోయె; యౌవనము వచ్చినంత వయఃప్రాదుర్భావరూపమయిన భూతావేశమున ఇది గ్రాహ్యము, ఇది త్యాజ్యము, అనువివేకమువదలి కామాంధుఁడనై నిరంతరము వ్యవసాయి హాలికపశువువలె దినములు గడపితిని. ద్విపాత్పశువైన నేను ఇట్లే ఇదివఱకు ప్రవర్తించితిని; అనేక ప్రకారముల విషయోపభోగము చేసితిని; అనేక స్త్రీలతో రమించితిని; ఇంత యేల నే నుపభోగింపని విషయమే లేదు; నేనాచరింపని పాపమే లేదు; ఎట్లనఁగా—వాయసము భుజింపని పదార్థము లేదు.

పదంపడి త్రిభువనమల్లులైన యక్షరాక్షసాది శత్రువుల రూపుమాపి, వసుధ నిష్కంటకముగా సామ్రాజ్యవైభవ మనుభవించితిని; నాపరాక్రమము విని సకలవీరులు చకితు లగుదురు; నాఐశ్వర్యము చూచి ఇంద్రుఁడును సిగ్గుపడును; మఱియు నాయశము దశదిశలందు నిండెను; అయినను విచారదృష్టిచే చూచినయెడల ఇదంతయు అహంకారద్వారమున జన్మమృత్యువునకు, మఱియు అధర్మద్వారమున నరకమునకు సాధనముగా నున్నది.

ఇట్టినింద్యసాధనములందు, మఱియు; క్షణికవైభవమందు రమమాణుఁడై చదివినమూఢుఁడనైనట్టి నాకు ధిక్కారముం

డని. నేనెవ్వఁడను? ఈవిభవ మెవ్వనిది? ఈవిచారము నేను చేయలేదు; సకలైశ్వర్యమునకు ప్రభువు షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన పరమాత్మయేయున్నాఁడు; ఇది నేనెఱుఁగను; నాజ్ఞానమునకును, నావైభవమునకును ధిక్కారముండని.

ఓనారాయణా! నిన్ను మనఃపూర్తిగా ఉపాసన చేయలేదు; నీచరణారవింద ప్రాప్తికొఱకు సుకృతజనులు సర్వము విడిచి, అరణ్యమందుండి, యోగాచరణము, తపశ్చరణము చేయుదురు; అట్టినీగుణములను వాక్కుతో నేనెన్నఁడు పాడనైతిని; నీప్రాప్తికొఱకు ముముక్షుజనులు సాధనచతుష్టయ సంపన్నులై శ్రీగురుచరణము శరణము పొందుదురు; అట్టి విద్యానిధివి, కరుణాసాగరుఁడవు, సర్వజ్ఞుఁడవు అనాదిగురువైన నిన్ను మనస్సునందునిలిపి స్నేహభావముచేత నెన్నఁడును స్మరణము చేయనైతి; కేవలము భూభారముగా నుంటిని; అట్టి దుర్బుద్ధిగలపాపురుఁడైన నాకు ధిక్కారముండని.

ఓసర్వేశ్వరుఁడా! నిన్నుభజనము చేయనివాఁ డెవఁడున్నాఁడు? పశువుచేయలేదందమా? యనినగజేంద్రుఁడుపశువుగాఁడా? వాఁడును నిన్నుభజించి నీచరణలాభము పొందెను. పక్షిచేయలేదందమా? గరుడుఁడు పక్షిగాఁడా? వాఁడును నిన్ను భజించి నీవాహనము గాలేదా? ప్రసిద్ధదురాత్ముఁడైన సర్పరాజును నిన్ను భజించి నీకు శయ్యయైయున్నాఁడు. సారాంశము—సకలాధమాధముఁడను, పాపశిరోమణిని, మనుష్య

పశువులలో నికృష్టుఁడనైన నేను ఒక్కఁడే భగవద్భజనవిముఖుఁడను; అట్టి నాకు ధిక్కారముండని.

ఓపరమేశ్వరా! నావంటిపాపి లేఁడు. ఓదేవుఁడా! నాయపరాధములన్ని స్మరించుకొన్న ఇట్టి యనుతాపకాలమందును నీనామోచ్చారణము చేయుటకు నాకు సిగ్గవుచున్నది; పాపిని! అపరాధిని! క్షమింపుము; దేవుఁడా!

[రాజసభావృత్తాంతము]

ఈప్రకారముగా రాజు మనస్సులో అనుతాపపడుచు కొని, నిశ్చయము చేసుకొనెను; ఏమనఁగా—రాజ్యము పుత్రుల కొప్పగించి, తాను భగవత్ప్రాప్తికొఱకు అరణ్యమునకు పోవలయును. తరువాత మంత్రినిపిలువనంపి, తనమనస్సులోని సకలార్థమును నివేదించెను. తరువాత రాజుయొక్క అభీష్టసిద్ధికొఱకు ప్రతినిధి సకలమంత్రులయొక్కయు, సకలపండితులయొక్కయు సభగూర్చి, రాజపుత్రులను పిలుచుకొనివచ్చి, వారితో రాజు నెదుట రాజుపరముగా తానే మాటలాడుట ప్రారంభించెను.

"మీరో, సకలగుణసంపన్నులగు సుపుత్రులరు; తండ్రి సద్గతికొఱకు ప్రయత్నముచేయుట సత్పుత్రులకు కర్తవ్యము; అట్లై పితృధనవిభాగము తనజీవితకాలములో తండ్రి చేయఁడేని ముందు కలహమునకు కారణమగును; ఇదియునుగాక నేను ఇదివఱకు చాలదినములు రాజ్యము చేసితిని; ఇపుడు వార్ధక్యము సంభవించెను; అయినను ఇదివఱకు భగవత్ప్రీతికొఱకు ధర్మానుష్ఠానము నాకు ఎప్పుడును ఘటిల్లలేదు.

నేనెవ్వఁడను, ఎచ్చటనుండివచ్చితిని, ఎచ్చటికిపోదును; ఇట్టివిచారము నేను చేయలేదు. ఈసంసారమునిన కేవలదుఃఖ సముద్రము; అందుకే ఇదిమొదలుగా గృహమమతాది పరిత్యాగము చేసి, తపోవనమునందు భగవద్భక్తిచే కాలక్షేపము చేయవలెను; ఇట్టిది నామనోరథము మీరు సుపుత్త్రులు గనుక పరిపూర్తి చేయవలెను; అందువలన సకలవిద్యారాజనీతిప్రవీణులగు ఇట్టి ముగ్గురుసుపుత్త్రులు ముల్లోకముల రాజ్యము నిర్వహింపవలెను.''

ఈప్రకారముగా ప్రతినిధిచెప్పినవెనుక రాజపుత్త్రు లేమి చెప్పుదురని వినుటకొఱకు రాజు మొదలు సకలజనులమనోవృత్తి శ్రోత్రద్వారమున కుతూహలపడెను; అయినను ఆసమయమందు రాజపుత్త్రులముఖకమలములు మ్లానములాయెను; నేత్రముల నుండి అశ్రుధారలు దొరిగెను; ఏ ఉత్తరమీక స్తబ్ధులై నిలువఁబడిరి. ఇదిచూచి, అందరి కిట్లుతోఁచెను—ఏమి తండ్రివైరాగ్యావస్థచూచి, వియోగమగునని సత్పుత్త్రులకు దుఃఖమైనదా యేమి?

యోగ్యమె—పితృభక్తులైనవారికి పితృవియోగము సహించుట దుర్భరము. ఇప్పుడు వీరిని ఎక్కువగా అడుగరాదు; ఇంకొక్కసారి సభచేసి, నాలుగు సమాధానపుమాటలు చెప్పి, వీరిమనస్సును వశము చేయవలయును. ఈప్రకారముగా సభాసదులును రాజును విచారముఁ జేసికొని, సభ చాలించిరి. సకలపండితులు తమతమయుండ్లకు పోయిరి; రాజును లేచి, స్నానమునకు పోయెను.

[రాజపుత్రులపరస్పరసంవాదము]

ఈప్రసంగమందు ముగ్గురు రాజకుమారులు ఏకాంతస్థలమునకు పోయి, పరస్పరము తమలోతాము విచారము చేసిరి; అందులో పెద్దవాఁడైన తత్త్వదృష్టి ఇట్లనియె—బాలులారా! తండ్రి యుండని, తల్లి యుండని మఱియు ఎవ్వరేని యుండని, తనకుతానే ప్రియుఁడు. [నవా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్తి ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి. బృహదారణ్యకోపనిషత్తు] చూడుఁడు—మనతండ్రి కరతలమందలి స్ఫోటమువలె ఇదివఱకు మనల లాలించి తుదకు తన సుఖముకొఱకు మనలను రాజ్యభారరూపభవగర్తమందు పడఁద్రోసి, తానుమాత్రము తప్పించుకొని, నిర్వేధమైన తపోవనమునకుపోయి, సచ్చిదానందుఁడైన భగవంతుని చింతనము చేయుచు కూర్చుండవలయుననుచున్నాఁడు.

ఆత్మకల్యాణవార్షోత్కర్షముచేత తనప్రాణముకన్న ఎక్కువగా కాపాడినప్రియపుత్రులను తనచేతితోనె భవసముద్రమున నెట్లు పడఁద్రోయుదునని విచారలేశమును చేయఁడు గదా! చూడుఁడు—అన్యపదార్థమువలన దుఃఖముగునేని వానినుండి మనలఁగాపాడుచునను మనోధైర్యమున నుండునట్టి మనలను ఆ మన తండ్రియే తనచేతితోనే తానే దుఃఖజాలమున తగిల్చి, తాను సుఖసాధనమందు ప్రవృత్తుఁడు గావలయుననుచున్నాఁడు. కృష్ణ! కృష్ణ! నారాయణా! దీనినుండి తప్పించుటకు నీవుదక్క వేఱే యెవ్వఁడుగలఁడు! తమ్ములారా! ఇపుడేమిచేయవలెను! ఏమియుఁ దోఁపదు.

ఇంతచెప్పి, స్తబ్ధుఁడై నిలిచెను. ఇంతలో మధ్యముఁడైన అదృష్టదృష్టి పురస్సరుఁడై చెప్పనారంభించెను—

సోదరులారా! చూడుఁడు— సకలప్రాణులు తమతమ అదృష్టకర్మముచేత బద్ధులు. "సుఖస్య దుఃఖస్య నకోఽపి దాతా" "మాతా పితా వా తనయస్స్వసా వా న కర్మబన్ధాత్పరిమోచయంతి" ఇత్యాది శాస్త్రోక్తు లున్నవి. నాకిదితోఁచుచున్నది— మనలను తండ్రి దుఃఖసముద్రమున ముంచుచున్నాఁడనునది భ్రాంతిమాత్రము. ఏలయన—మన మెట్లు స్వస్వకర్మబద్ధులమో, మనతండ్రియు నట్లే స్వకర్మబద్ధుఁడు. దీనిలో నింతియ భేదము— ఇప్పుడు తండ్రియొక్క అశుభకర్మభోగాస్తమయకాలము, మఱియు, శుభకర్మభోగోదయకాలము వచ్చినది; అట్లె మన శుభకర్మభోగాస్తమయకాలము మఱియు అశుభకర్మభోగోదయకాలము వచ్చినది. ఉండని. ప్రారబ్ధకర్మముయొక్క నివృత్తిభోగము లేక కాదు; ఇది దైవసంకల్పము; దానియెదుట ఎవ్వని దేమి జరుగును?

ఇంతలో తర్కదృష్టియనువాఁడు కనిష్ఠుఁడు పురస్సరుఁడై నిలచి యిట్లనెను—జ్యేష్ఠులారా! నాకిట్లు తోఁచుచున్నది—

ఇప్పుడిట్లు విచారముచేయుచు నూరకుండుట అనుచితము. ఏలయన—ప్రొద్దుపొడిచినతోడనే సభగూర్చి, మనలను జనకుఁడు పిలిపించును. అటుపోయినవెనుక సభలో పలువురు పలువిధముల నుపదేశవాక్యములచేత మనమనమును కైవసముచేసికొన నమకట్టుదురు. వారిమాటల నాదరింపమేని, ప్రత్యక్షముగ నీతి దొలఁగినజాడ గానిపించును.

ఒకవేళ మనమంగీకరింపమేని, తండ్రిమనలనప్పుడు చెఱ నుంచుటకన్న కొంతయేమిచేయును? అంగీకరింతుమా అప్పుడు గృహస్థులై ముగ్గురము ముల్లోకములనడచుమార్గమునే యవలంబింపవలెను; మఱియు, వేర్వేఱు భువనముల ఆధిపత్యము వహింపవలయును. ఇది భువనత్రయమార్గము గాదు; మఱే మనఁగా— కాలత్రయాబాధితమైన దుర్గతిమార్గమే.

ఏలయన— సర్వకాలము రాజ్యభారభరణమందు మఱియు విషయోపభోగమందు నిమగ్నులమై యుందుము. దానిలో సాధుమానసరాజహంస మగుపరమాత్మయొక్క చింతనము ఎంతదవ్వుననో యుండును; మఱియు విషయపంకమందుఁ బురువులను బోలినమనలఁ బామరవిషయజనులసంగతియను కాకగృధ్రములు పొరెకు ముక్కునఁ బొడుచుచుండును.

అప్పుడు ఒకరినొకరు చూచి, పరస్పరమువిచారమువలన త్రివిధతాపముల విశ్రాంతియగునాయని ఊఱడిలియుండుట యొక్కింతైన యొనగూడదు గదా! ఏలయన— మనముండు చోటులు వేర్వేఱుబహుదూరమునసుండుటవలన కాలాంతరమందేని పరస్పరదర్శనమగుటయే ఘటిల్లదు. అందువలన అన్నలారా! నాకిపు డొకటియే యుక్తితోఁచుచున్నది; అదే మనఁగా— ఇప్పుడు చాలవిచారముచేయక "యః పలాయతే స జీవతి" అను జంబుకమంత్రము నవలంబింపవలయును.

ఈప్రకారముగ కనిష్ఠునిమాట విన్నతోడనె జ్యేష్ఠులిద్దరకు ఇంత ఆనందమాయెను— మరణోన్ముఖుఁడైనవానికి అమృతలాభమైనంత. అంతట వారనిరి— తమ్ముఁడా! నీవు మాకు తమ్ముఁడవుగావు. అనఁగా మమ్ముల ననాథలసంరక్షించుట

కొఱకు అనాదిగురుండై సర్వజ్ఞుండైన పరమాత్మవు; వాఁడే నీ రూపముగా నవతరించెను. అందువలననే ఇట్టి యమృతము వంటి ఉపాయమును వెదకితివి. ఇట్లని వారిరువురు పరమహర్ష వివశులై వానిని కౌఁగిలించుకొని, అనేకప్రకారముల స్తుతి చేయ నారంభించిరి.

## రాజపుత్రుల శుభప్రయాణము

తరువాత అత్యంతనికటబంధువులగువారు ముగ్గురు తమలో తాము మిత్రభావవర్తనమునఁగూడి మిత్రాభావ [సూర్యాస్తము] వర్తనమును నెదురుచూచుచుండిరి. సూర్యాస్తమయ మెప్పుడగును; రాత్రియెప్పుడువచ్చును; దేవాలీఘటోల్లంఘన మెప్పుడు చేయుదము; నగరము వెడలి యెప్పుడు పోదము; ఈ చింతతోడ నాదినమెల్ల నొకయుగముగాఁ గడిపిరి.

రాత్రి అయినతోడనే సకలసుహృజ్జనసంబంధము విడిచి, సకలవిషయోపభోగములను విషసమానమునివిడిచి, సకలైశ్వర్య పదార్థములను వాంతియని విడిచి, సర్వాంగము భస్మోద్ధూళనము చేసికొని ఒక్కొక్కఁడొక్కొక్క కౌపీనము ధరించి, చంకలో నొకకృష్ణాజినమునిమిడ్చి, చేతనొకకమండలువుఁ బూని, ఏకభావముతో, భగవన్నామసంకీర్తనము చేయుచుచేయుచు, ఉదీచిని గుఱించి, బయలుదేఱి, వెడలిపోయిరి.

వారు దారినడచుచు పరమాత్మయెవఁడు? నేనెవఁడు? ఈవిచారము చెప్పువాఁడెవఁడు? ఈ భవసాగరముతరించు టెట్లు? పరమాత్మచరణసందర్శన మెప్పుడగును? ముక్తిసూక్తులపాడుట యెప్పుడు? అని ఇట్లు ఉత్కటజిజ్ఞాసావృత్తిప్రవాహమధ్యమున

చింతనము చేయుచుచేయుచు, క్షుత్తృషాశీతోష్ణతాపముల సహించుచు శ్రీముక్తిపురీవారాణసిక్షేత్రమును చేరినవెనుక—

[రాజపుత్రులకు శ్రీగురుదర్శనము]

భగవత్పాదాబ్జసంభూత నిర్ధూతసకలదురితయగు భాగీరథియందు స్నానముచేసి, విశ్వాధిష్ఠానుఁడు విశ్వరూపుఁడగు విశ్వనాథుని దర్శనము చేసికొని, పంచక్రోశీప్రదక్షిణము చేసి, క్షేత్రవాసులగు సాధుసజ్జనులను దర్శనము చేయుచుచేయుచుఁ, దిరుగుచు, అచ్చట అత్యంతసుశోభితమైన [1] ఉపవనమందు ఒక వటవృక్షముక్రింద దోషరహితుఁడై [2] ఏకాగ్రచిత్తుఁడై అనేక శిష్యసంయుతుఁడై భస్మోద్ధూళితసర్వాంగుఁడు భద్రముద్రాధారియై [3] భవతాపవిమోచకమగు వేదాంతశాస్త్రోపదేశము చేయుచుండిన యొకమహాపురుషుని అవలోకించిరి.

వారి కతఁడిట్లగుపడెను—కైలాసగిరియందు సనకాదిమునిజనులకు భద్రాసనాసీనుఁడై ఉపదేశముచేయు ప్రమథనాయకుఁడో, యనునట్టు; లేక ద్వారావతిలో ఉద్ధవాక్రూరా

1 తరువులయొక్క ఘనత వనములశోభ, శాఖలయొక్క ఘనత తరువులశోభ, పల్లవములయొక్క ఘనత శాఖలశోభ ఈత్రివిధప్రకారములైన ఘనతలతో యుక్తమగుటవలన అత్యంతశోభితము.

2 చౌర్యము, జారత్వము, హింస ఈమూఁడు శరీరదోషములు. నింద, అసత్యము, కఠోరత, వాచాలత ఈనాలుగు వాణీదోషములు. తృష్ణ, చింత, బుద్ధిమందత ఈమూఁడు మనస్సుదోషములు. ఇట్టి నృసింహతాపనీయోపనిషదుక్తములైన దశదోషములచే రహితుఁడై.

3 హస్తగతాంగుష్ఠతర్జనీసంయోగమువలన భద్రముద్ర కలుగును. దీనిని లోపాముద్ర, తర్కముద్ర, జ్ఞానముద్రయు నందురు.

ములకు ఉపదేశము చేయు శ్రీకృష్ణపరమాత్ముఁడా యనునట్లు, వెనుక ఆ రాజపుత్రులు సాష్టాంగప్రణామము చేసి, వారిఆశ్రమమునకుఁబోయి, మనోభావమురీతిగా సేవలు సలుపుచుండిరి.

[శ్రీగురుప్రసన్నత]

ఈప్రకారముగా ఆరునెలలైనవెనుక ఒకనాఁడు కృపాసింధువు సద్గురుమూర్తి ప్రసన్నముఖుఁడై వారిని విచారించెను. బాలకులారా! మీరెవ్వరు? మీరేమిగోరివచ్చితిరి? మీసకల వృత్తాంతము మాకుఁదెలుపుఁడు. ఇట్లు సద్గురుముఖచంద్రనిర్గతామృతరూపభాషణము శ్రవణముచేసి, ముగ్గురు సాష్టాంగప్రణామము లొనర్చి, గుర్వాజ్ఞానుసారము ఎదుటఁ గూర్చుండిరి. జ్యేష్ఠుఁడు తత్త్వదృష్టి పురస్సరుఁడై సమిత్పాణియై విన్నవించెను.

[శిష్యునియొక్క శరణాగతిపూర్వకసంభాషణము]

ఓభగవంతుఁడా! మేముముగ్గురు అన్నదమ్ములము. శుభసంతతిమహారాజకుమారులము. భగవద్దర్శనాపేక్షచేత శ్రీచరణములనాశ్రయించి యున్నాము. మేమో, సంసారతాపముచేత తప్తులము; స్వామివచనము భవానలోపశాంతిచేయునని ఎఱిఁగి, సేవాతత్పరులమయి యున్నవారము. ఇపుడు మాకు కల్యాణమగు మార్గమునకు దర్శకము భగవత్పాదాబ్జములే.

ఈప్రకారముగ వారి సవినయసంభాషణము విని కృపానిధానమగు శ్రీగురునాథుఁడు అమృతవాక్యములతో భాషించెను

[ఉత్తరసంవాదమునకు ఉపోద్ఘాతము]

ఈచతుర్థతరంగము మొదలుకొని బ్రహ్మవిచారమేది గలదో, అది గురుశిష్యసంవాదరూపముగా నుండును; ఆసంవాదమునకు సంవాదకులు ఈ గురుశిష్యులేయని తెలియవలెను.

శ్రీగురువు ప్రసన్నముఖముచే తనతో భాషణము చేయు సమయముఁజూచి, తనభాగ్యోదయమని ఎఱిఁగి, దీనతాపూర్వకముగ అగ్రజుఁడైన తత్త్వదృష్టి భవబంధవిమోచకమయినట్టి ప్రశ్న చేయుట కారంభించెను.

## 70 తత్త్వదృష్టియొక్క మోక్షేచ్ఛాసూచకప్రార్థన

ఓభగవంతుఁడా! మీరు కృపానిధానులు, సదాశివునితో సమానులు, సర్వజ్ఞులు, ఓభగవంతుఁడా! నేను జననమరణాదికమగు ఏ దుఃఖరూపసంసారము గలదో, దానికి భయపడియున్నాను; అందువలన కరుణచేసి, తన్నివృత్త్యుపాయమును చెప్పుఁడు.

ఓగురుఁడా! మేము కర్మోపాసనానుష్ఠానము చాల చేసితిమి దానివలన మాకు వాంఛితఫలమేమో, గాలేదు; వ్యత్యస్తముగా సంసారబంధము "యథా పంకేన పంకాంభః సురయా వా సురాకృతమ్" [1]ఈన్యాయమున అధికమే యగుచున్నది. అందువలన కృపచేసి, మీరు వేఱే ఉపాయమును జూపుఁడు, అదిచేసి, నేను కృతార్థుఁడనగుదును.

## 71. 70 గతప్రశ్నకు ఉత్తరము—మోక్షేచ్ఛయొక్క శాంతిజన్యతాప్రతిపాదనపూర్వకమయిన మహావాక్యోపదేశము

దుఃఖనివృత్తిని, పరమానందప్రాప్తిని మోక్షమందురు; తత్కామన శిష్యుని హృదయమునందు చూచి, తత్సాధనమైన

---

1 చరణమునకు కొంచెముబురద తగిలినపుడు ఎక్కువబురదచే తుడుచుట, లేక కొంచెముకల్లుచేత తడిసినఘటము ఎక్కువకల్లుచే కడుగుట.

వేదోక్తజ్ఞానమును చెప్పనారంభించెను. యద్యపి జ్ఞానస్వరూపము అనేకశాస్త్రములందు భిన్నభిన్న ప్రకారములుగా వర్ణించియున్నారు; తథాపి జీవబ్రహ్మలభేదమును దూరముచేయునట్టి ఏ జ్ఞానము గలదో, అదియే వేదమందు మోక్షసాధకమని చెప్పఁబడినది; దానినే ఇచ్చట గురువు శిష్యునికిచెప్పుచున్నాఁడు.

ఓశిష్యుఁడా! జన్మమరణాది సంసారనివృత్తికొఱకును, పరమానందప్రాప్తికొఱకును ఏ ఇచ్ఛ నీకు పుట్టినదో, తదుత్పత్తి భ్రాంతివలన అయినది; ఇట్లు నీవెఱుఁగుము. ఏలయన—నీవు స్వతః పరమానందస్వరూపుఁడవు; కనుక తత్ప్రాప్తీచ్ఛ ఘటిల్లదు; ఏవస్తువు అప్రాప్తమో; తత్ప్రాప్తీచ్ఛ జనించును; నీస్వరూపము సదాప్రాప్తము; తత్ప్రాప్తీచ్ఛభ్రాంతిగాక ఎప్పటికిని ఘటిల్లదు. మఱియు జన్మము మొదలగు సంసారము ఎప్పుడైనను నీయందు కలుగుపక్షమున తన్నివృత్తీచ్ఛ ఘటిల్లును; ఆ సంసారలేశమును నీయందు లేదు; ఇట్టి ఈ అనుత్పన్నదుఃఖనివృత్తియందును ఇచ్ఛ భ్రాంతికేక ఘటిల్లదు. ఓశిష్యుఁడా! జన్మమరణరహితమైన యేచైతన్యరూపబ్రహ్మ గలదో, అది నీవుగానున్నావు; కాఁబట్టి నీవు నీహృదయమందు జన్మాదిభేదమును తెలియకుము.

### 72. ప్రశ్న—ఆత్మయానందరూపుఁడైనపుడు విషయసంబంధమువలన ఆనందభానము గాఁగూడదు?

శ్రీభగవంతుఁడా! నా యాత్మ ఆనందస్వరూపుఁడైనప్పుడు విషయసంబంధమువలన ఆనందభానము నాయందుఁ గాకుండ

వలసెఁగదా! అది యో, అగుచున్నది; కాఁబట్టి ఆత్మ ఆనంద రూపుఁడు గాఁడు?

**73. 72 ప్రశ్నకు ఉత్తరము—అంతర్ముఖ వృత్తియందు ఆనందభానము. విషయము నందు ఆనందము లేదు.**

ఓశిష్యుఁడా! ఆత్మతో విముఖమైన బుద్ధి ఎవ్వనికిఁ గలదో, అట్టి పురుషునకు విషయేచ్ఛ యగును; [ఈస్థానమందు భోగసాధనము ఏది గలదో, దానిని విషయమందురు; గనుక విషయశబ్దముచే స్త్రీధనపుత్త్రాదికముయొక్కయు గ్రహణము చేయవలయును.] ఆవిషయేచ్ఛవలన బుద్ధి చంచలమగును; ఆచంచలబుద్ధియందు ఆత్మస్వరూపానందముయొక్క ఆభాసము [ప్రతిబింబము] గానేరదు; ఎప్పుడు ఇచ్ఛయొక్క విషయము ప్రాప్తమగునో, అపుడు బుద్ధి క్షణమాత్రము శాంతమైఅంతర్ముఖవృత్తియగును; ఆయంతర్ముఖవృత్తియందు ఆత్మస్వరూపానందము యొక్క ప్రతిబింబమగును; ఆప్రతిబింబానుభవమువలన పురుషునకు వక్ష్యమాణరీతిగా భ్రాంతి యగును; "నాకు విషయము వలన ఆనందలాభమయినది" అయినను యథార్థముగా విషయమందు ఆనందముండదు.

విషయమందు ఆనందముండినయెడల ఒకవిషయముచే తృప్తుఁడైన పురుషునకు ఆ విషయము సమీపమున నుండఁగా ఎప్పుడు వేఱువిషయమునందు ఇచ్ఛయగునో, అప్పుడు వానికి ప్రథమవిషయమువలనను ఆనందము గావలసెఁగదా! అది యో, గావుట లేదు. మఱీరీతిగానో, ద్వితీయవిషయేచ్ఛాకాలమందు స్వరూపానందముయొక్క భానము ఘటిల్లదు. ఏలయన—

అప్పుడు అన్యవిషయేచ్ఛచే బుద్ధి చంచలమగును. దానియందు ప్రతిబింబము ఘటిల్లదు. [స్పష్టముగా కనఁబడదు]

లేక విషయమునందే ఆనందము నంగీకరించినయెడ ప్రియపుత్రుని లేక ఎవనినైన అత్యంతప్రియుని ఆకస్మికముగా బహుకాలానంతరము చూచినపుడు చూచినతోడనే మొదట ఏ ఆనందమగునో, ఆయానందము సర్వకాలము నుండవలసియుండును. ఏలయన—ఆనందమునకు హేతువైన ఏపురుషుఁడు గలఁడో, వాఁడు వానికి సమీపముగా నున్నాఁడు. అయినను ఆయానంద మెల్లప్పుడు నుండుట లేదు; మారీతిగానైననో, మొదట మాత్రమే ఆనందము ఘటిల్లును; సర్వదా ఘటిల్లదు. ఏలయన—ఒకసారి ప్రియపురుషునిచూచి, వృత్తిశాంతమగును; మరల వృత్తి వేఱుపదార్థముపై పోవుటవలన చంచలమగును; దానియందు ప్రతిబింబముగానేరదు; ఈరీతిగా విషయమునందు ఆనందము లేదు.

లేక విషయమునందేఆనందము నంగీకరించినయెడ సమాధికాలమందు ఏ యోగానందభానమగునో, అది గాకుండవలసియుండెను. ఏలయన—సమాధియందు ఏవిషయముయొక్క సంబంధము లేదు.[1]

లేక విషయమందే ఆనందము నంగీకరించినయెడ సుషుప్తియందు[2] ఆనందముయొక్క భానము గాకుండవలసియుండెను; ఏలయన—సుషుప్తియందును ఏ విషయసంబంధము లేదు.

---

1 సమాధియందు విషయములేదు; ఈసంగతి ఆఱవతరంగమునందు సహజముగ తెలియఁబడును.

2 సమాధిదృష్టాంతము సర్వులకు అనుభవవిషయము గాకపోవుటచేత అరుచి పుట్టుటవలన అన్యమయిన సుషుప్తిదృష్టాంతము చెప్పుచున్నాఁడు.

ఈరీతిగా విషయమునందు ఆనందము లేనే లేదు; మరే మనఁగా—సకలస్థానములందు ఏ ఆనందము ప్రతీత మగునో, అది ఆత్మస్వరూపానందమే; వేఱుగాదు. ఇందుకొఱకు వేదము నందు వ్రాయఁబడినది—ఆత్మస్వరూపానందముచేతనే సకలానందవంతుఁడై నాఁడు.

**74.** ప్రశ్న—జ్ఞానికిని అజ్ఞానికివలె విషయేచ్ఛయును విషయముచే సుఖజ్ఞానమును అయినదా లేదా?

ఓభగవంతుఁడా! మీరు విషయసంబంధమువలన ఏ ఆత్మానందముయొక్క భానమును పూర్వము చెప్పితిరో, అది అజ్ఞానిపురుషున కగును; జ్ఞానికిఁ గాదు. ఏలయన—ఆత్మకన్న విముఖమైనబుద్ధి ఎవ్వనిదో, యని ప్రస్తాపించితిరి; ఆత్మకన్న విముఖబుద్ధి అజ్ఞానికిఁ గలుగును; జ్ఞానికిఁ గానేరదు; కాఁబట్టి మీరు ఇప్పుడు జ్ఞానియొక్క విచారము చెప్పుఁడు; జ్ఞానవంతునకు విషయేచ్ఛయును, తత్సంబంధమువలన ఆత్మానందభానమును అగుచున్నదా లేదా?

**75.** 74-గతప్రశ్నకు త్తరము—ఆత్మవిముఖులు ఇద్దఱును; విషయానందము స్వరూపానందముకన్న అభిన్నము.

ఓశిష్యుఁడా! పూర్వము ఎవనినేనువిముఖుఁడని అంటినో వాఁడు కేవలము అజ్ఞాని గాఁడు; జ్ఞానవంతుఁడును వ్యవహారమం దెప్పుడు [1] వచ్చుచున్నాఁడో, అప్పుడు వాఁడు తత్త్వమును

1 ఎప్పుడు జాగ్రదాకారవృత్తి యగునో, అప్పుడు స్వప్నాకారము గానేరదు; ఎప్పుడు స్వప్నాకారవృత్తి యగునో, అప్పుడు జాగ్రదాకారము

మఱచిపోవును; అప్పుడు జ్ఞాని గూడ ఆత్మవిముఖుఁడగును. మఱియు జ్ఞానవంతునిబుద్ధి సదా ఆత్మాకారముగా నుండెడుపక్షమున వానికిభోజనాదివ్యవహారములుసంభవింపవు; కనుక వ్యవహారకాలమందు జ్ఞానిగూడ అజ్ఞానివలె ఆత్మవిముఖుఁడగును.

ఈరీతిగా ఆత్మవిముఖబుద్ధి ఇద్దరికి ఘటిల్లుచున్నది; అయినను ఇద్దఱిలో అజ్ఞానియొక్క బుద్ధి సదా ఆత్మవిముఖముగా నుండును; జ్ఞానిబుద్ధి ఒకానొకప్పుడు [వ్యవహారకాలమందు] ఆత్మవిముఖముగా నుండును. అప్పుడు జ్ఞానికిని విషయేచ్ఛ మఱియు విషయసంబంధమువలన ఆత్మస్వరూపానందభానము

గానేరదు. అట్లు జ్ఞానవంతుని బుద్ధియును ఎప్పుడు ఆత్మాకారమగునో, అప్పుడు అనాత్మాకారము గానేరదు; ఎప్పుడు అనాత్మాకారమగునో, అప్పుడు ఆత్మాకారము గానేరదు.

ఏకాంతఃకరణమునందు ఏకకాలమునందు భిన్నభిన్నవిషయాకారములై సామాన్యవిశేషరూపములైన రెండువృత్తులు కలిగినను రెండువిశేషవృత్తులు కలుగవు. అందువలన అన్యవ్యవహారమునందు సంలగ్నుఁడైన పురుషునకు ఎట్లు పెట్టెలో మనస్ఫూర్తిగా నుంచినద్రవ్యముయొక్క విస్మృతి కలిగి వ్యవహారసమాప్తి అయినపిదప తద్ధనస్మృతి కలుగునో, అట్లు జ్ఞానవంతుని బుద్ధియును వ్యవహారమునందు విశేషసంలగ్నమయినప్పుడు వానికి తత్త్వముయొక్క విస్మరణము కలుగుచున్నది; పునరపి వ్యవహారమునుండి విశ్రాంతి పొందినప్పుడు పూర్వమువలె తత్త్వముయొక్క స్మరణమగుచున్నది. అందువలననే భగవంతుఁడైన భాష్యకారుఁడు శారీరకభాష్యప్రథమాధ్యాయ ప్రథమపాదమునందు చెప్పియున్నాఁడు:—వ్యవహారమునందు జ్ఞానవంతుఁడును పశువువలె వ్యవహరించుచున్నాఁడు.

అజ్ఞానికివలెఁ గలుగును; ఆ ఆనందభానమందు ఇద్దఱియొక్క పద్ధతి సమానముగా నున్నది.

అయినను పరస్పరమందు ఇట్టి భేదమున్నది—ఎప్పుడు విషయసంబంధమువలన ఆనందభానమగునో, అప్పుడు జ్ఞాని ఈరీతి నెఱుఁగును—ఈ ఆనందము నాస్వరూపమునకన్న భిన్నము గాదు; నా ప్రతిబింబమే యగును; కనుక జ్ఞానికి విషయభోగమందును సమాధి [1] గలదు. అజ్ఞానికో తనస్వరూపానందమని [2] తెలియదు; మఱేమనఁగా—అయానందము విషయమువలన ప్రాప్తమైనదని భ్రాంతియగును.

**76 ప్రశ్న—జన్మాదిదుఃఖము దేనియందున్నది?**

ఓభగవంతుఁడా! మీరు చెప్పితిరి—"నీవు పరమానందస్వరూపుఁడవు" దానిని నేను బాగుగానె గ్రహించితిని; మఱియు మీరు చెప్పితిరి "జన్మమరణాదిసంసారదుఃఖము నీయందు లేదు; కాఁబట్టి తన్నివృత్తి ఘటిల్లదు." దానియందు నాకు సందేహమున్నది—జన్మాదిదుఃఖము నాయందు లేనియెడ దేనియందున్నది; నాకన్న భిన్నమైన దాని ఆశ్రయము మీరు కృపచేసి, చూపవలయును; అనఁగా దానియందు సకలసంసారదుఃఖము నెఱిఁగి, నేను నాయందు అంగీకరింపకుందును.

---

1 ఇక్కడ ఏసమాధిని చెప్పినాఁడో, అది స్వరూపానుసంధానమైన సమాధిగుణముయొక్క సమతాలేశముచే "సింహోదేవదత్తః" ఈవాక్యన్యాయమున ఏకదేశి మాత్రముగా నున్నది.

2 ఆత్మ ఆనందరూపుఁడు; ఈఅర్థము ఆఱవతరంగమునందు విస్తరముగ చెప్పఁబడును.

## 77. 76 ప్రశ్నకుత్తరము—జన్మాదిదుఃఖము ఎక్కడను లేదు

ఓశిష్యుఁడా! ఈసంసారదుఃఖమే[1] లేదు; నాయందును లేదు; నీయందును లేదు; ఇంకెవ్వరియందును లేదు. ఇట్టి పదార్థముయొక్క స్థానము నేమని యడుగుచున్నావు? ఏపదార్థమున్నదో, దానికి స్థానము సంభవించును; లేనిపదార్థమునకు స్థాన మెక్కడనుండును ?

పరమార్థముచే అసిద్ధమై అధిష్ఠానాజ్ఞానమువలన ఏమిథ్యాపదార్థము ప్రతీతమగునో, ఆ పదార్థమునకును, తజ్జ్ఞానమునకును అధ్యాసమందురు. [అధ్యాసమందు దోషాపేక్షావిచారము పూర్వము ద్వితీయతరంగమునందు చెప్పినారము.]

[అధ్యాసవిచారము]

అధిష్ఠానముకన్న విషమసత్తగల అవభాసమును అధ్యాసమందురు. ఇది ఒకలక్షణము. మఱియు తన అభావముయొక్క అధికరణమందు ఏ అవభాసము గలదో, దానిని అధ్యాసమందురు. ఇది ఒకలక్షణము. ఈప్రకారముగా శాస్త్రంబునందు అధ్యాసము రెండులక్షణములచే చెప్పఁబడియున్నది. భ్రాంతిజ్ఞానముయొక్క విషయమైన మిథ్యావస్తువు మఱియు భ్రాంతిజ్ఞానము ఈరెండుపదార్థములు అధ్యాసమునందు వర్తించు

---

1 ఎట్లు రజ్జువునందు వ్యావహారికసత్తాదృష్టిచే కల్పితసర్పముయొక్క అత్యంతాభావము గలదో, అట్లు బ్రహ్మంబునందు పరమార్థసత్తాదృష్టిచే కల్పితజగత్తుయొక్క అత్యంతాభావము గలదు; అదియే సంసారదుఃఖముయొక్క నిత్యనివృత్తి.

చున్నవి; కనుక ఈ రెండుపదార్థములు చేరి అధ్యాసమనఁబడును. [అధ్యాసమునే వివర్తమనుచున్నారు.]

భ్రాంతిజ్ఞానముయొక్క విషయమైన మిథ్యావస్తువు, మఱియు భ్రాంతిజ్ఞానము ఈ రెండుచేరి, అధ్యాసమనఁబడును. ఇది అధ్యాసముయొక్క సామాన్యలక్షణము చెప్పఁబడినది, మఱియు ఉక్తమైన రెండుపదార్థములందు కేవలము మిథ్యావస్తువు అర్థాధ్యాసమని, కేవలము భ్రాంతిజ్ఞానము, జ్ఞానాధ్యాసమని చెప్పఁబడినది. వానిలో

అర్థాధ్యాసము, స్వరూపాధ్యాసము, సంసర్గాధ్యాసము అను భేదములచే ద్వివిధము—.

ఏపదార్థము యొక్క స్వరూపము అనిర్వచనీయము పుట్టుచున్నదో, దానిని స్వరూపాధ్యాసమందురు. ఎట్లనఁగా—శుక్తియందు రజతము స్వరూపతః అనిర్వచనీయము పుట్టుచున్నది; అట్లు ఆత్మయందు అహంకారాద్యనాత్మపదార్థములు స్వరూపతః అనిర్వచనీయములు పుట్టుచున్నవి; అవి అన్నియు స్వరూపాధ్యాసములు.

ఏపదార్థముయొక్క స్వరూపము పూర్వసిద్ధమే ఉన్నది; [అది పారమార్థికము గానీ, లేక వ్యావహారికముగానీ] అయినను ఆపదార్థముయొక్క సంబంధము మాత్రము అనిర్వచనీయము పుట్టుచున్నది; దానిని సంసర్గాధ్యాస మందురు. ఎట్లనఁగా—ముఖమును, దర్పణమును రెండుపదార్థములు పూర్వసిద్ధమై వ్యావహారికములుగా నున్నవి; ఆరెండుపదార్థముల యొక్క పరస్పరసంబంధమును లేదు; ఇట్లుండఁగా దర్పణమునందు ముఖముయొక్క ప్రతిబింబరూపసంబంధము ప్రతీతమగు

చున్నది; ఆ సంబంధము అనిర్వచనీయముగ పుట్టుచున్నది. అట్లు "లోహితః స్ఫటికః" ఈస్థానమునందు రక్తపుష్పము, మణియు స్ఫటికము ఈ రెండుపదార్థములు పూర్వసిద్ధములై వ్యావహారికములుగా నున్నవి; ఆ రెండుపదార్థములకు పరస్పరసంబంధము లేదు; ఇట్లుండఁగా పుష్పముయొక్క లోహితత స్ఫటికమునందు ప్రతీతమగుచున్నది; ఆ స్ఫటికమునందు పుష్పముయొక్క లోహితతాసంబంధము అనిర్వచనీయము పుట్టుచున్నది. అట్లు చైతన్యము పారమార్థికపదార్థము, అహంకారము వ్యావహారిక పదార్థము ఈ రెండుపదార్థములయొక్క పరస్పరసంబంధము లేదు; చైతన్యమునకు అహంకారమునందు అధ్యాసము లేదు; ఇట్లుండఁగా చైతన్యముయొక్క ఆత్మతారూపమైన తాదాత్మ్య సంబంధము అహంకారమునందు ప్రతీతమగుచున్నది; ఆచైతన్య సంబంధమైన ఆత్మత అహంకారమునందు అనిర్వచనీయముగ పుట్టుచున్నది; అవి అన్నియు సంసర్గాధ్యాసములు.

అర్థాధ్యాసభేదములైన యే స్వరూపాధ్యాసము, సంసర్గాధ్యాసము గలవో, ఆ రెంటియందు ఆఱు భేదములు గలవు— మొదటిది కేవలసంబంధాధ్యాసము, రెండవది సంబంధసహసంబంధ్యధ్యాసము, మూఁడవది కేవలధర్మాధ్యాసము, నాల్గవది ధర్మసహధర్మ్యధ్యాసము, ఐదవది అన్యోన్యాధ్యాసము, ఆఱవది అన్యతరాధ్యాసము—

(1) అనాత్మయందు ఆత్మయొక్క అధ్యాసమైనపుడు అనాత్మయందు ఆత్మయొక్క కేవలసంబంధాధ్యాసమే యగుచున్నది, దానియొక్క ఉదాహరణములు

ఇప్పుడు సంసర్గాధ్యాసలక్షణమునందు చెప్పఁబడి యున్నవి.

(2) ఆత్మయందు అనాత్మయొక్క సంబంధమును, స్వరూపమును రెండును అధ్యస్తములగుచున్నవి. ఎట్లనఁగా— బ్రహ్మాత్మ స్వయముగా అసంగపదార్థముండుటవలన వానిలో ఏ అనాత్మపదార్థముయొక్క సంబంధము ఘటిల్లదు; దానివలన ఏ అనాత్మపదార్థమును ఆత్మయొక్క సంబంధియనుట ఘటిల్లదు; అయినను గ్రహమైత్రీన్యాయమున [గ్రహమైత్రీవిచారము పూర్వము చెప్పఁబడియున్నది.]వ్యవహారమందు మూలావిద్యయొక్క బ్రహ్మరూపాత్మతో తాదాత్మ్యసంబంధమును,అవిద్యాసంబంధియని చెప్పఁబడినది; ఆ అవిద్యయొక్క తాదాత్మ్యసంబంధమును, సంబంధియైన అవిద్యయును బ్రహ్మాత్మయందు అధ్యస్తముగనున్నవి. ఇది సంబంధసహాసంబంధ్యధ్యాసము.

(3) స్థూలదేహవృత్తి గౌరతాదిధర్మములకును, మఱియు ఇంద్రియవృత్తి దర్శనాదిధర్మములకును ఆత్మయందు అధ్యాసమగుచున్నవి; వాని స్వరూపమునకు అధ్యాసము గానేరదు; ఈవిధముగా ఆత్మయందు ధర్మాధ్యాసమే యగుచున్నది.

(4) సధర్మాంతఃకరణమునకు అనఁగా అంతఃకరణవృత్తి కర్తృతాదిధర్మములు, మఱియు స్వరూపతః అంతఃకరణము ఈరెంటిని ఆత్మయందు అధ్యాసమేది

గలదో, అది ధర్మసహితధర్మియొక్క అధ్యాసమని యెఱుఁగవలెను.

(౫) లోహాగ్నిన్యాయమున ఆత్మయందు అనాత్మకు, మఱియు అనాత్మయందు ఆత్మకు ఏ అధ్యాసమగుచున్నదో, దానిని అన్యోన్యాధ్యాసమందురు.

(౬) రెంటియందు ఒకదాని యొక్క అధ్యాసమునకు అన్యతరాధ్యాసమందురు. అనాత్మయైన అహంకారాదులందు ఆత్మయొక్క స్వరూపము అధ్యస్తము కానేరదు; ఆత్మయందు మాత్రము అహంకారాద్యనాత్మపదార్థములయొక్క స్వరూపము అధ్యస్తమగుచున్నది; దీనినే అన్యతరాధ్యాసమని యెఱుఁగవలెను.

ఈప్రకారముగా అర్థాధ్యాసాంతర్గతములైన ఆఱు అధ్యాసములయొక్కస్వరూపము వేఱువేఱుగా యెఱుఁగవలెను.

జ్ఞానముచే బాధయగుటకు యోగ్యమైన వస్తువు అధిష్ఠానమునందు స్వరూపముచే అధ్యస్తమగుచున్నది; దేహాదులైన అనాత్మపదార్థములకు అధిష్ఠానముచే బాధయగుచున్నది; కనుక దేహాదులైన అనాత్మపదార్థములకు ఎప్పటికిని ఆత్మయందు స్వరూపాధ్యాసమే యున్నది.

జ్ఞానముచే బాధయగుటకు అయోగ్యవస్తువుయొక్క స్వరూపము అధ్యస్తము గానేరదు; మఱేమనఁగా—దానియొక్క సంబంధము మాత్రము అధ్యస్తమగుచున్నది; కనుక అనాత్మయందు ఆత్మయొక్క సంసర్గాధ్యాసమున్నది దానిని సంబంధాధ్యాసమనుచున్నారు.

కేవలధర్మాధ్యాసము, ధర్మసహితధర్మియొక్క అధ్యాసము, అన్యతరాధ్యాసము ఇవి మూఁడును స్వరూపాధ్యాసములో అంతర్భూతములుగ నున్నవి. కేవలసంబంధాధ్యాసము సంసర్గాధ్యాసమే యగును. సంబంధసహితసంబంధియొక్క అధ్యాసము సంసర్గాధ్యాససహితస్వరూపాధ్యాసముగ నున్నది. అన్యోన్యాధ్యాసమునందు సంసర్గాధ్యాసము, స్వరూపాధ్యాసము ఈ రెంటియొక్క లక్షణములున్నవి; అందువలన అదియును ఆ రెంటిలో అంతర్భూతముగ నున్నది.

వేదాంతశాస్త్రమునందు అన్యోన్యాధ్యాసముయొక్క విచారము పలుమారు వచ్చుచున్నది—అనాత్మయొక్క ధర్మములు ఆత్మయందు, మఱియు ఆత్మయొక్క ధర్మములు అనాత్మయందు ప్రతీతమగుట అన్యోన్యాధ్యాసమని చెప్పఁబడినది. దుఃఖము, ద్వైతము ఇవి అనాత్మయైన అంతఃకరణముయొక్క ధర్మములుగా నున్నవి; ఇవి ఆత్మయొక్క ఆనందము, మఱియు అద్వైతము వీనియందు స్వరూపముచే అధ్యస్తమై వీనిని మూయుచున్నవి; మఱియు సత్తు, చిత్తు ఇవి ఆత్మధర్మములు [ఆత్మలక్షణములు] గ నున్నవి; ఇవి అనాత్మయొక్క అసత్తాజడతలయందు సంబంధముద్వారమున అధ్యస్తములై వానిని మూయుచున్నవి; ఇదియే అన్యోన్యాధ్యాసముయొక్క లక్షణమని ఎఱుఁగవలెను.

[ఈ అధ్యాసవిచారము వేదాంతసాంప్రదాయికమతానుసారము సంక్షిప్తముగ చెప్పఁబడినది. అధ్యాసప్రకరణమునందు ఇతరమతస్థజనులయొక్కయు, స్వమతస్థజనులయొక్కయు అనేకప్రకారములుగ వివాదము నడుచుచున్నది; పెక్కేల!

అధ్యాసవిచారముచే పెద్దపెద్దగ్రంథములు నిండియున్నవి; వృత్తి ప్రభాకరమునందు కొంచెమువిచారము చూపఁబడియున్నది. అధ్యాసవిచారము గహనముగ నున్నది. శ్రద్ధావంతుఁడైన అధికారికి అంతపాండిత్యము ఆవశ్యకము గాదు; కనుక ఇచ్చట కొంచెము విచారము వ్రాయఁబడినది.

## 78. ప్రశ్న—దుఃఖ మెక్కడను లేదేని ప్రత్యక్ష ప్రతీత మెట్లగును?

ఓభగవంతుఁడా! జన్మమరణాదిసంసారదుఃఖము ఎక్కడను లేనిపక్షమందు ప్రత్యక్షప్రతీత మెట్లగును? ఏవస్తువు లేనే లేదో, అది ప్రతీతమే గానేరదు. ఎట్లు వంధ్యాపుత్రుఁడు, శశశృంగము, ఆకాశపుష్పము లేమిచేత ప్రతీతములు గానేరవో, అట్లు సంసారదుఃఖమును లేదేని ప్రతీతము గాకుండవలెనేగదా? అదియో, ప్రతీతమగుచున్నది; కాఁబట్టి "జన్మాదిసంసారదుఃఖము లేదు" అనుమాట ఘటిల్లదు?

## 79. 78—గతప్రశ్నకుత్తరము—ఆత్మాజ్ఞానము వలన సంసారప్రతీతి రజ్జుసర్పదృష్టాంతము

ఓశిష్యుఁడా! జన్మాదిజగత్తు పరమార్థముగా లేదు; అయినను ఆత్మ బ్రహ్మస్వరూపమని తెలియని ఏ యజ్ఞానము గలదో, దానిచే మిథ్యాప్రతీత మగుచున్నది. ఎట్లు స్వప్నపదార్థము, ఆకాశమందునీలత, రజ్జువునందుసర్పము పరమార్థముగా లేకయు మిథ్యాప్రతీతమగునో, అట్లు జన్మాదిజగత్తు పరమార్థముగా లేకయు మిథ్యాప్రతీత మగుచున్నది.

## 80. ప్రశ్న—రజ్జువునందు సర్పము ఎట్లు భాసమానముగా నున్నది?

ఎట్లు రజ్జువునందు సర్పము మిథ్యయే గనఁబడునో, అట్లు ఆత్మయందు భవదుఃఖము మిథ్య యనవలయును. ఇట్లు శ్రీగురువుచే చెప్పఁబడినది; అచ్చట దృష్టాంతజ్ఞానము లేక దార్ష్టాంతికజ్ఞానము గానేరదు; కనుక రజ్జువునందు సర్పము ఎట్లు ప్రతీతమగునని తత్త్వదృష్టి దృష్టాంతమందు ప్రశ్న చేయుచున్నాఁడు.

## 81. 80—గతప్రశ్నయొక్కయభిప్రాయము

ఎచ్చట రజ్జువునందు సర్పము, శుక్తియందు రజతము మొదలైన భ్రమలు కలుగునో, అచ్చట నాలుగుమతములు వినుచున్నాను—శూన్యవాది[1] అసత్ఖ్యాతియని. విజ్ఞానవాది ఆత్మఖ్యాతియని, నైయాయికుఁడు, మఱియు వైశేషికుఁడు అన్యథాఖ్యాతియని, సాంఖ్యుఁడు, మఱియు ప్రభాకరుఁడు అఖ్యాతియని అనుచున్నారు.

## 82. అసత్ఖ్యాతి

శూన్యవాదియభిప్రాయము— రజ్జుదేశమందు సర్పము అత్యంతాసత్తగును; అట్లు అన్యదేశమందును అత్యంతాసత్తుగా నున్నది. ఈవిధముగ అత్యంతాసత్సర్పప్రతీతి రజ్జువునందగును; దీనిని అసత్ఖ్యాతి యందురు. [అత్యంతాసత్సర్పముయొక్క ఖ్యాతి యనఁగా భానము, మఱియు కథనము.]

---

1 అసత్ఖ్యాత్యాది సకలఖ్యాతులయొక్క విశేషకథనము వృత్తిరత్నావళివృత్తిప్రభాకరములందు చెప్పఁబడినది.

## 83. ఆత్మఖ్యాతి

విజ్ఞానవాదియభిప్రాయము—రజ్జుదేశమునందును, అన్య
దేశమునందును బుద్ధికి బాహ్యమున నెచ్చటను సర్పము లేదు.
లయన—సకలపదార్థములు బుద్ధికన్న భిన్నములు కావు;
ఏతేమనఁగా— సర్వపదార్థములయొక్క ఆకారమును బుద్ధియే
రించుచున్నది; ఆబుద్ధి క్షణికవిజ్ఞానరూపముగా నున్నది.
క్షణక్షణమునందు నాశోత్పత్తులుగల యే విజ్ఞానము గలదో, అది
యేసర్పరూపముగా ప్రతీతమైనది; దీనిని ఆత్మఖ్యాతి యందురు.
ఆత్మయనఁగా క్షణికవిజ్ఞానరూపబుద్ధి; దానియొక్క సర్పరూప
ముచేత ఖ్యాతియనఁగా భానము, మఱియు కథనము.]

## 84. అన్యథాఖ్యాతి

నైయాయికవైశేషికుల అభిప్రాయము—పుట్టమొదలగు
లములందు సత్యసర్పము గలదు; దానిని నేత్రములతో
రాతుము; మఱియు నేత్రములందు పిత్తతిమిరాదిదోషములు
లవు; వానిబలమువలన సమ్ముఖరజ్జుదేశమునందు సర్పము
ప్రతీతమైనది. సత్యసర్పముయొక్కయు, నేత్రముయొక్కయు,
మధ్యభాగమందు భిత్త్యాదికమైన అంతరాయము గలదు; అట్లయి
ను దోషసహితనేత్రమువలన అంతరాయమున్నను సర్పము
నఁబడును.

దీనిని ఒకానొకఁడు శంకించుచున్నాఁడు—దోషము
లన సామర్థ్యము తగ్గును; గాని హెచ్చదుగదా! ఎట్లు జఠ
రాగ్నిపాచనసామర్థ్యము వాతకఫాదిదోషములవలన తగ్గుచు
న్నదో, అట్లు నేత్రమందును పిత్తతిమిరాదిదోషమువలన సామ
ర్థ్యము తగ్గవలయునుగదా! దోషసహితనేత్రమువలన పుట్ట

మొదలగు చోటులందుండు సర్పముయొక్క జ్ఞానము చెప్పఁబడినది; అచ్చట శుద్ధనేత్రములచేతనో, దూరదేశస్థితసర్పముయొక్క ప్రత్యక్షజ్ఞానము గాఁజాలదు; మీరీతిగానైనను, దోషసహితనేత్రముచేతనే దూరస్థపదార్థజ్ఞానమగుచున్నది; దానిచే దోషమువలన నేత్రసామర్థ్యము అధికమైనది; అయినను ఇట్లు అంగీకరించుటయందు ఏ దృష్టాంతమును కనఁబడలేదు?

ఆ శంక ఘటిల్లదు. ఏలయన—ఎవ్వనికి పిత్తదోషమువలన భస్మకరోగము జనించెనో, వానికి చతుర్గుణాహారము చేసియు తృప్తిగానేరదు; ఎట్లు పిత్తదోషమువలన జఠరాగ్నియందు పాచనసామర్థ్యము అధికమైనదో, అట్లు నేత్రమునందును పిత్తతిమిరాదిదోషమువలన దూరదేశస్థితసర్పముయొక్క సమీపదర్శకమగు శక్తి పుట్టుచున్నది.

ఈరీతిగా పుట్టమొదలయిన దేశములందుండు సర్పముయొక్క [1] అన్యథా అనఁగా అన్యప్రకారమువలన సమ్ముఖమైన రజ్జుదేశమునందు ఖ్యాతియనఁగా భానము, మఱియు కథనము.

చింతామణికారుఁడు [2] [ఒకక్రొత్తనైయాయికుఁడు] వీనిమతము—దోషసహితమగు నేత్రమువలన పుట్టయందుండు

1 ఇది ప్రాచీనమతము, ఈమతమునందు అన్యదేశస్థితవస్తువుయొక్క అన్యదేశస్థితానుభవమే భ్రాంతియనఁబడినది; గాని అర్థాధ్యాసజ్ఞానాధ్యాసరూపమగు భ్రాంతి యనఁబడలేదు.

2 ఈచింతామణి గ్రంథకర్త క్రొత్తనైయాయికుఁడు; వాని మతమున ఒకవస్తువుయొక్క అన్యరూపముచేత ప్రతీతిరూపమగు జ్ఞానాధ్యాసమును భ్రాంతియందురు.

సర్పముయొక్క జ్ఞానమగునప్పుడు మధ్యమందుండు [1] నితర పదార్థములయొక్కయు భానము గావలయును; అదియో, అగుటలేదు; కనుక నేత్రముచేత దూరదేశస్థితవస్తువుయొక్క జ్ఞానముగానేరదు; మఱేమనఁగా—సదోషనేత్రమువలన రజ్జువు యొక్క రజ్జురూపజ్ఞానము కలుగక సర్పరూపజ్ఞానమగుచున్నది; కాఁబట్టి రజ్జువుయొక్క అన్యథా అనఁగా—వేఱుప్రకారమున [సర్పరూపముచేత] ఖ్యాతియనఁగా భానము, మఱియు కథనము దానిని అన్యథాఖ్యాతి యనవలయును.

## 85. అఖ్యాతిప్రతిపాదనము, పై మూఁడు ఖ్యాతులఖండనము

అఖ్యాతివాదియభిప్రాయము—అసత్తుయొక్క ప్రతీతి యగుపక్షమునందు వంధ్యాపుత్రునియొక్కయు, శశవిషాణము యొక్కయు ప్రతీతి గావలయును; అదియో, అగుటలేదు; అందువలన అసత్ఖ్యాతి అసంగతము. క్షణికవిజ్ఞానముయొక్క ఆకారము సర్పాదికమైనప్పుడు క్షణమాత్రమునకన్న అధికకాలము ప్రతీతి లేకుండవలయుఁగదా! అదియో, యగుచున్నది; కనుక ఆత్మఖ్యాతి అసంగతము. అన్యథాఖ్యాతియొక్క ప్రథమ రీతియో, చింతామణిమతముచేత దూషితము; అట్లు చింతామణి యొక్క రీతివలనను అన్యథాఖ్యాతి అసంగతము. ఏలయన— జ్ఞేయానుసారముగా జ్ఞానమగును; రజ్జువు జ్ఞేయము, మఱియు సర్పజ్ఞానము ఇట్లు చెప్పుట అత్యంతవిరుద్ధము.

---

1 ఎపుడు దోషబలముచే ఆపణమందుండు రజతము శుక్తిదేశమునందు భాసిల్లునో, అపుడు దోషబలముచే ఆపణముయొక్కయు, దానియందుండు సకలపదార్థములయొక్కయు ప్రతీతి గావలయుఁగదా!అదియో,యగుటలేదు.

అందువలన ఆ అన్నిప్రకారములను వదలి, ఈరీతి అంగీకరించుట యోగ్యము—ఎచ్చట రజ్జువునందు సర్పభ్రమ కలుగునో, అచ్చట రజ్జువుతో నేత్రముయొక్క తనవృత్తి ద్వారమున సంబంధమై ఇదంరూపముచే రజ్జువుయొక్క సామాన్యజ్ఞానమగును. మఱియు పూర్వదృష్టమైన సర్పముయొక్క స్మృతి యగును, "ఈసర్పమున్నది" ఇందులో రెండుజ్ఞానములున్నవి, "ఈ" అంశమో, రజ్జువుయొక్క సామాన్యప్రత్యక్షజ్ఞానము, "సర్పమున్నది" ఇది సర్పముయొక్క స్మృతిజ్ఞానము.

ఈరీతిగా "ఈసర్పమున్నది" ఇచ్చట రెండుజ్ఞానములు గలవు; అయినను భ్రమరూపదోషము ప్రమాతయందు; తిమిరదోషము ప్రమాణమందుఁగలదు; వానిబలమువలన పురుషునకు ఇట్టి వివేకము కలుగదు—"నాకు రెండుజ్ఞానములైనవి; వీనిలో-'ఈ' అంశము రజ్జువుయొక్క సామాన్యమైన ప్రత్యక్షజ్ఞానము, మఱియు 'సర్పమున్నది' అని పూర్వముచూచిన సర్పముయొక్క స్మృతిజ్ఞానము."

ఉక్తప్రకారముగ రెండుజ్ఞానములయొక్క అవివేకమును [వివేకాభావమును] సాంఖ్యప్రభాకరులు భ్రమయందురు.

ఈరీతిగా సకలభ్రమస్థానములందు ఉక్తచతుర్మతములు చెప్పుచున్నవి; వీనిలో—నిజమైనమతమును మీరు ఆజ్ఞాపింపుఁడు; దానిని నేనంగీకరింతును. [ఎనుబదవ అంకెనుండి ఇది వఱకు శిష్యుని పూర్వపక్షము.]

## 86. 80-85 గతప్రశ్నలకుత్తరము.
## 86—90 అఖ్యాతిమతఖండనము

ఓశిష్యుఁడా! పైచెప్పిన నాలుగుఖ్యాతులకన్న ఇంకొక్కటి భ్రమస్థానమునందు అయిదవదైన అనిర్వచనీయఖ్యాతి గలదు; దీనిని నీవెఱుఁగవలెను; మఱియు నీవుచెప్పిన నాలుగు మతములు యుక్తిహీనములని తెలియవలెను. ఎట్లు ఉత్తరోత్తర మతనిరూపణమందు పూర్వపూర్వములైన మూఁడుమతములు అసంగతములని సిద్ధమగుచున్నదో, అట్లు నాలుగవదియగు అఖ్యాతిమతమును అసంగతము.

ఏలయన—"ఈసర్పమున్నది" అనుజ్ఞానమందు మొదలు "ఈ" అంశమునన్, రజ్జువుయొక్క సామాన్యజ్ఞానము ప్రత్యక్షము, మఱియు "సర్పమున్నది" అనునీఅంశము పూర్వదృష్ట సర్పముయొక్క స్మృతిజ్ఞానము; ఇది అఖ్యాతివాదిమతము. అచ్చట పూర్వదృష్టసర్పముయొక్క స్మరణము అంగీకరింపఁబడెను; మఱియు సమ్ముఖరజ్జువునందు సర్పజ్ఞానమును అంగీకరింపఁబడెను; అప్పుడుసమ్ముఖరజ్జువును జూచి, భయమై వెనుకకు పరుగెత్తుట ఘటిల్లగూడదు కదా? అదియో ఘటిల్లినది; దానివలన సిద్ధమయినదేమనఁగా—సమ్ముఖరజ్జుదేశమందే సర్పప్రతీతి అయినది; పూర్వదృష్టసర్పస్మృతి గాదు.

లేక రజ్జువుయొక్క విశేషరూపమువలన యథార్థజ్ఞానానంతరము ఇట్లు బాధయగును—"నాకు రజ్జువునందు సర్పప్రతీతి మిథ్యయే యైనది" ఆ బాధవలనను రజ్జువునందు సర్పప్రతీతి సిద్ధమయియున్నది; పూర్వదృష్టసర్పస్మృతిగాదు.

మఱియు "ఈసర్పమున్నది" యనుస్థానమందును జ్ఞానము ఒకచే ప్రతీతమైనది! రెండుగావు, ఒకేకాలమునందు అంతఃకరణమువలన స్మృతిరూపము, మఱియు ప్రత్యక్షరూపము రెండు జ్ఞానములు అగుటయే లేదు.

ఈరీతిగా అఖ్యాతిమతమును అసంగతమే.

## 87. అనిర్వచనీయఖ్యాతి వేదాంతమతము. 87—90

వేదాంతసిద్ధాంతమందు అనిర్వచనీయఖ్యాతి యంగీకరింపఁబడినది; అదియీరీతిగా నున్నది—అంతఃకరణవృత్తి నేత్రాదీంద్రియద్వారమున బయలు వెడలి, ఘటాదివిషయాకారమును పొందినపుడు దానివలన విషయావరణభంగమై తత్ప్రతీతి యగుచున్నది; యచ్చట ప్రకాశమును [ఆలోకము అనఁగా దీప సూర్యాదిప్రకాశము] సాహాయ్యముగా నున్నది. ఏలయన—ప్రకాశము లేక ఏపదార్థముయొక్క ప్రతీతి గానేరదు.

ఎప్పుడు రజ్జువునందు సర్పభ్రమయగునో, అప్పుడు అంతఃకరణవృత్తి నేత్రద్వారమున బయలువెడలియు, దానికి రజ్జువుతో సంబంధమయ్యును తిమిరాది [1] దోషప్రతిబంధమువలన

1 ఇచ్చట తిమిరశబ్దముచే మందాంధకారప్రమాణము. ఏలయన—స్పష్టప్రకాశమునందు రజ్జ్వాదికాధిష్ఠానముయొక్క విశేషరూపాజ్ఞానము కాఁజాలదు; గాఢాంధకారమునందు అధిష్ఠానముయొక్క సామాన్యరూపజ్ఞానము కాఁజాలదు; మఱియు ఇవిలేక అధ్యాసము కానేరదు; మందాంధకారమునందో, విశేషరూపాజ్ఞానము, సామాన్యరూపజ్ఞానము ఈరెండును ఘటిల్లుచున్నవి;కనుక నేత్రవిషయగతమైన అధ్యాసమునందు మందాంధకారాపేక్షయగుటవలన తద్గ్రహణముగలదు. మఱియు ఆదిశబ్దముచేత నేత్రముయొక్క మందతాదిరోగముల గ్రహణము గలదు.

ఆ వృత్తిచే రజ్జ్వావరణభంగము గాలేదు; కనుక వృత్తియొక్క స్వరూపము రజ్జ్వాకారము గాలేదు. [రజ్జుసామాన్యాంశము వఱకు మాత్రము ఆవరణభంగమయినది; సంపూర్ణమగు రజ్జ్వావరణభంగము గాలేదు.] ఈరీతిగా వృత్తియొక్క సంబంధమైనను ఎప్పుడు రజ్జువుయొక్క పూర్ణావరణభంగము గాలేదో, అప్పుడు రజ్జుచైతన్యమందుండు అవిద్యయందు క్షోభమయి, ఆ అవిద్య సర్పాకారపరిణామమును పొందుచున్నది;

ఆ అవిద్యాకార్యమైన సర్పము సత్తయినపక్షంబునందు రజ్జుజ్ఞానమువలన తద్బాధ గాఁగూడదు గదా! అదియో, అగుచున్నది; కనుక సత్తుగాదు. అసత్తయినపక్షంబునందు వంధ్యాపుత్రన్యాయమున తత్ప్రతీతి గాఁగూడదు గదా! అదియో, అగుచున్నది; కనుక అసత్తునుగాదు. మఱేమనఁగా—సత్తుకన్నను [1]అసత్తుకన్నను విలక్షణముగ నున్నది. సదసద్విలక్షణమునే అనిర్వాచనీయమందురు.

---

1 ఇచ్చట ఈశంక గలదు—సదసద్విలక్షణ మని ఒక పదార్థము కల్పించి దానిని అనిర్వచనీయమనుట సరికాదు; ఎందుకనఁగా—ఆపదార్థము యొక్క సిద్ధియే ఘటిల్లదు. చూడుము— సత్తుకన్నవిలక్షణము అసత్తు, దానిని అసత్తుకన్న విలక్షణమని చెప్పుట విరుద్ధము; మఱియు అసత్తుకన్నవిలక్షణము సత్తు, దానిని సత్తుకన్న విలక్షణమని చెప్పుట విరుద్ధము; సదసత్తులకన్న భిన్నమైన మూఁడవపదార్థముయొక్క అభావమగుటచే అనిర్వచనీయ శబ్దార్థము యొక్క యుపలబ్ధియే లేదు.

సమాధానము—త్రికాలాబాధితపదార్థమును సత్తందురు; దానికన్న విలక్షణమని చెప్పుటవలన బాధయోగ్యమైన పదార్థముయొక్క గ్రహణము గలదు; సత్తాహీనమగు [అస్తిత్వశూన్యమైనట్టి] వంధ్యాపుత్రాదిపదార్థములను

శుక్త్యాదిస్థానంబునందు రజతాదికమును ఈరీతిగానే అనిర్వచనీయోత్పన్నమైనది. ఆ యనిర్వచనీయమురొక్క ఖ్యాతియనఁగా ప్రతీతి, మఱియు కథనము; దానిని అనిర్వచనీయఖ్యాతి యందురు.

### 88. భ్రమస్థలమందు సర్పాదికము, తజ్జ్ఞానము సాక్షిభాస్యము.

ఎట్లు సర్పము అవిద్యాపరిణామమో, అట్లు తజ్జ్ఞానరూపవృత్తియు అవిద్యాపరిణామమే; అంతఃకరణపరిణామము గాదు. ఏలయన—ఎట్లు రజ్జుజ్ఞానమువలన సర్పమునకు బాధయగునో, అట్లు తజ్జ్ఞానమునకును బాధయగును; అంతఃకరణవృత్తిరూపజ్ఞానమైనపక్షమందు దానికి బాధకలిగియుండదు; బాధయగుటవలన ఆజ్ఞానమునుసర్పన్యాయమున అవిద్యాకార్యమగు సదసద్విలక్షణముగా నున్నది.

అయినను రజ్జూపహితచైతన్యమందుండు తమోగుణప్రధానమయిన అవిద్యాంశముయొక్క పరిణామము సర్పముగాను, సాక్షిచైతన్యమందుండు అవిద్యయొక్క సత్త్వగుణపరిణామము సర్పజ్ఞానముగాను ఉన్నది. ఏకాలమందు రజ్జుచైతన్యస్థితమైన అవిద్యయొక్క సర్పాకారపరిణామమగునో, ఆకాలమందే సాక్షి

---

అసత్తందురు; దానికన్న విలక్షణమని చెప్పుటవలన సత్తావత్పదార్థముయొక్క గ్రహణము గలదు; ఈరీతిగాఁ జూచినయెడల బాధయోగ్యమై సత్తావంతమగు అనిర్వచనీయమగు తృతీయపదార్థము సహజముగానే గోచరమగుచున్నది. అట్టి పదార్థము దృష్టాంతస్థానమునందు రజ్జుసర్పాదికము, మఱియు దార్ష్టాంతికస్థానమునందు ప్రపంచము సిద్ధమై యున్నవి. తదుపలబ్ధి [ప్రతీతి] వేదాంతనిపుణులైన పండితులకగును; వివేకహీనులకు మాత్రము కానేరదు.

నాశ్రయించిన అవిద్యయొక్క సర్పజ్ఞానాకారపరిణామమునకును వేలయన— రజ్జ్వాశ్రితమైన అవిద్యయందు క్షోభమున కేనిమిత్తమో, ఆనిమిత్తమువలననే సాక్ష్యాశ్రితమైన అవిద్యయందు క్షోభమగుచున్నది; కాఁబట్టి భ్రమస్థలమందు సర్పాదివిషయమును, తజ్జ్ఞానమును ఏకకాలమునందే ఉత్పన్నమగుచున్నవి మఱియు రజ్జ్వాద్యధిష్ఠానజ్ఞానమువలన ఏకకాలమునందే లీనమగుచున్నవి.

ఈరీతిగా సర్పాదిభ్రమస్థలమునందు బాహ్యవిద్యాంశము సర్పాదివిషయమునకు ఉపాదానకారణముగాను, ఆంతరావిద్యాంశము సర్పజ్ఞానమునకు ఉపాదానకారణముగాను ఉన్నది

స్వప్నమందైననో, సాక్ష్యాశ్రితమైన అవిద్యయొక్క తమోగుణాంశము విషయరూపపరిణామమును పొందును మఱియు ఆ యవిద్యయొక్కయే సత్త్వగుణాంశము జ్ఞానరూపపరిణామమును పొందును. ఈరీతిగా స్వప్నమందు అంతరావిద్యయే విషయము, మఱియు జ్ఞానము ఈ రెంటికిని ఉపాదానకారణముగా నున్నది.

అందువలననే బాహ్యరజ్జుసర్పాదికములును, అంతరస్వప్నపదార్థములును [1] సాక్షిభాస్యములని చెప్పఁబడినది.

---

1 అవిద్యావృత్తిద్వారమున లేక యంతఃకరణవృత్తిద్వారమున సాక్షి దేనిప్రకాశము చేయునో, లేక ప్రమాణవృత్తిద్వారమున ప్రమాత దేనిప్రకాశము చేయదో, ఆపదార్థమును తజ్జ్ఞానమును సాక్షిభాస్యమందురు. ఇచ్చట రజ్జుసర్పాదిజ్ఞానప్రసంగమగుటవలన అవిద్యావృత్తియపేక్ష గలదు; మఱియుం ఎచ్చట సుఖదుఃఖజ్ఞానము కలుగునో, అచ్చట అంతఃకరణవృత్తియపేక్ష గలదు.

## 89. రజ్జుసర్పము తజ్జ్ఞానము అవిద్యా పరిణామమై చైతన్యవివర్తము

రజ్జ్వాదికమునందు అనిర్వాచనీయమైన సర్పాదికమును, తజ్జ్ఞానమును భ్రమ యందురు. అధ్యాసమనియు అందురు. ఆభ్రమ అవిద్యయొక్క పరిణామముగాను, చైతన్యముయొక్క వివర్తముగాను ఉన్నది; ఉపాదానముతో సమానస్వభావమయిు అన్యథాస్వరూపముగలది పరిణామమనఁబడును; అధిష్ఠానము కన్న విపరీతస్వభావమై, అన్యథాస్వరూపముగలది వివర్తమనఁబడును.

ఎట్లు ఉపాదానకారణమైన అవిద్య అనిర్వచనీయమో, అట్లు సర్పమును, తజ్జ్ఞానమును అనిర్వాచనీయము; కనుక ఇవి రెండును అవిద్యతో సమానస్వభావముగలవి; మఱియు సర్పమును, తజ్జ్ఞానమును అవిద్యకన్న అన్యప్రకారములగు ఆకారములు [అన్యథాస్వరూపములు] గలవి; అందువలన నివి రెండును అవిద్యయొక్క పరిణామములుగా నున్నవి.

అట్లు రజ్జ్వవచ్ఛిన్నాధిష్ఠాన [1] చైతన్యము సద్రూపము; సర్పమును, తజ్జ్ఞానమును సత్తుకన్న విలక్షణములు; కనుక ఇవి రెండును అధిష్ఠానచైతన్యముకన్న విపరీతస్వభావముగలవి; మఱియు సర్పమును, తజ్జ్ఞానమును చైతన్యముకన్న అన్యప్రకారములగు ఆకారములు [అన్యథాస్వరూపములు] గలవి;

---

1 రజ్జ్వవచ్ఛిన్నచైతన్యము [అవచ్ఛిన్నస్థానమునందు ఉపహితమనియుం, విశిష్టమనియుం అర్థమగుచున్నది; ప్రసంగానుసారముగా తెలియవలెను.]

అందువలన నివి రెండును చైతన్యముయొక్క వివర్తములుగా నున్నవి.

## 90. విషయమునకును జ్ఞానమునకును భిన్నభిన్నాధిష్ఠానములైనను ఏకాధిష్ఠానజ్ఞానమువలన నివృత్తి

మిథ్యాసర్పముయొక్క అధిష్ఠానము రజ్జ్వాపహితచైతన్యముగాని, రజ్జువు గాదు. ఏలయన—సర్పమువలె రజ్జువుకు కల్పితమే; ఒకకల్పితవస్తువు అన్యకల్పితముయొక్క అధిష్ఠానమగుట ఘటిల్లదు; ఈరీతిగా రజ్జ్వాపహితచైతన్యమే అధిష్ఠానము; రజ్జువు గాదు.

రజ్జువిశిష్టమునకు అధిష్ఠానత్వము చెప్పినయెడల రజ్జువు, మఱియు చైతన్యము రెండును అధిష్ఠానములగును; అచ్చట రజ్జుభాగమందో, అధిష్ఠానత్వము బాధితము; గనుక అధిష్ఠానము రజ్జ్వాపహితచైతన్యమే గాని, రజ్జువిశిష్టచైతన్యము గాదు.

అట్లు సర్పజ్ఞానముయొక్క అధిష్ఠానము వృత్త్యుపహితమైన సాక్షిచైతన్యమేగాని, వృత్తివిశిష్టచైతన్యము గాదు.

ఈరీతిగా భ్రమస్థానమందు విషయముయొక్కయు, తజ్జ్ఞానముయొక్కయు ఉపాధిభేదమువలన అధిష్ఠానము భిన్నభిన్నముగాని, ఏకము గాదు. మఱియు ఎట్లు విశేషరూపముచే రజ్జ్వజ్ఞానము అవిద్యయందు క్షోభద్వారమున విషయము, జ్ఞానము ఈ రెంటియొక్క ఉత్పత్తియందు నిమిత్తమగునో, అట్లు విశేషరూపముచే రజ్జుజ్ఞానమును విషయము, జ్ఞానము ఈ రెంటియొక్క నివృత్తియందు నిమిత్తమగుచున్నది.

### 91. శంక—రజ్జుజ్ఞానమువలన సర్పనివృత్తి గానేరదు?

ఇచ్చట ఈశంక కలుగుచున్నది—రజ్జుజ్ఞానమువలన సర్ప నివృత్తి ఘటిల్లదు. ఏలయనఁగా—మిథ్యావస్తువునకేది అధిష్ఠానమగునో, తజ్జ్ఞానమువలన మిథ్యావస్తువుయొక్క నివృత్తి యగును; ఇది ద్వైతసిద్ధాంతము; ఇచ్చటనో, మిథ్యాసర్పమున కధిష్ఠానము రజ్జుపహితచైతన్యముగాని, రజ్జువు గాదు; ఆ రజ్జు జ్ఞానముచేత సర్పనివృత్తి ఎట్లగును?

### 92. 91—గతప్రశ్నకుత్తరము—రజ్జుజ్ఞానమే సర్పాధిష్ఠానజ్ఞానము

ఎచ్చట రజ్జ్వాదిజడపదార్థములయొక్క అంతఃకరణవృత్తి రూపమైన జ్ఞానమగునో, అచ్చట ఆవరణభంగము వృత్తికి ప్రయోజనము; ఆయావరణము తాను అజ్ఞానముయొక్క శక్తి యగుటవలన జడమునకు ఆశ్రితము గాదు; అయినను జడా ధిష్ఠానచైతన్యమున కాశ్రితముగా నున్నది; కాబట్టి రజ్జు సమానాకారాంతఃకరణవృత్తివలన రజ్జ్వవచ్ఛిన్నచైతన్యము యొక్కయు, ఆవరణభంగమైనది; మఱియు ఆ వృత్తియందున్న చిదాభాసమువలన రజ్జువుయొక్క ప్రకాశమయినది; రజ్జ్వవ చ్ఛిన్నచైతన్యమో, స్వయంప్రకాశము; దానియందు ఆభాసము యొక్క ఉపయోగము లేదు. [ఈసంగతి ముందు చెప్పఁబడును.]

ఈరీతిగా చిదాభాససహితమయిన అంతఃకరణముయొక్క వృత్తిరూపజ్ఞానమందు ఏ వృత్తిభాగము గలదో, దానియొక్క ఆవరణభంగరూపమైన ఫలము చైతన్యమందయినది. మఱియు చిదాభాసభాగముయొక్క ప్రకాశరూపఫలము రజ్జువందగు

చున్నది; కనుక సాభాసవృత్తిజ్ఞానమునకు కేవలము జడరజ్జువు మాత్రము విషయముగాదు. మఱేమనఁగా—సాధిష్ఠానచైతన్యమైన రజ్జువుగా నున్నది; ఇందుకొఱకే సిద్ధాంతమునందు వ్రాయఁబడినది—"అంతఃకరణజన్యసకలవృత్తిజ్ఞానము బ్రహ్మమును విషయము చేయుచున్నది."

ఈరీతిగా రజ్జుజ్ఞానప్రసంగమందు నిరావరణమైన సర్పాధిష్ఠానమగు రజ్జ్వవచ్ఛిన్నచైతన్యముయొక్కయు, నిజప్రకాశమువలన జ్ఞానముగుచున్నది; కాఁబట్టి రజ్జుజ్ఞానమే సర్పాధిష్ఠానజ్ఞానముఁగ నున్నది; దానిచేత సర్పనివృత్తి సంభవించినది.

## 93. అన్యశంక—రజ్జుజ్ఞానమువలన సర్పజ్ఞాననివృత్తి ఘటిల్లదు?

పైఁజెప్పినరీతిగా సర్పనివృత్తి రజ్జుజ్ఞానమువలన సంభవించినది; అట్లయినను రజ్జుజ్ఞానముచే సర్పజ్ఞాననివృత్తి సంభవింపదు; ఏలయన—సర్పమునకధిష్ఠానము రజ్జ్వవచ్ఛిన్నచైతన్యము; మఱియు సర్పజ్ఞానమునకధిష్ఠానము సాక్షిచైతన్యము; పూర్వోక్తప్రకారముననో, రజ్జుజ్ఞానమువలన రజ్జ్వవచ్ఛిన్నచైతన్యముయొక్క భానమయినది; సాక్షిచైతన్యముయొక్క భానము గాలేదు; కనుక రజ్జుజ్ఞానమయినవెనుకను సర్పజ్ఞానాధిష్ఠానమైన సాక్షిచైతన్యము అజ్ఞాతముగ నున్నది; ఆయజ్ఞాతాధిష్ఠానమందు కల్పితజ్ఞాననివృత్తి గానేరదు; అది జ్ఞాతాధిష్ఠానమందే గావలయును; ఈరీతిగా రజ్జుజ్ఞానమువలన సర్పజ్ఞాననివృత్తి ఘటిల్లదు?

**94.** 93—గత ప్రశ్నకుత్తరము—సర్వాభావమువలన సర్పజ్ఞాననివృత్తి. 94—97

జ్ఞానము విషయాధీనమగుటవలన విషయమైన ఏసర్పము గలదో, తన్నివృత్తి అయినతోడనే విషయాభావమువలన సర్ప జ్ఞానము తానే సహజముగా నివృత్తమగుచున్నది. [వంట పొయ్యికధీనమగుటవలన పొయ్యి తీసికొనిపోయినవెనుక వంట అయినదాయని అడుగుటయే ఘటిల్లదు.]

మఱియు పూర్వపక్షి ఇట్లు చెప్పెను—"కల్పితముయొక్క నివృత్తి అధిష్ఠానజ్ఞానము లేక గానేరదు; సర్పజ్ఞానమును కల్పితము; దానికి అధిష్ఠానము సాక్షిచైతన్యము; దానిజ్ఞానము లేక కల్పితమైన సర్పజ్ఞాననివృత్తి ఘటిల్లదు?" ఈభాషణమునకు సమాధానము—

నివృత్తి రెండువిధములుగా నున్నది. మొదటిది అత్యంత నివృత్తి, రెండవది లయనివృత్తి. వానిలో—

(1) కారణసహితకార్యముయొక్క నివృత్తి అత్యంత నివృత్తి యనఁబడును.

(2) కారణమందు కార్యముయొక్క లయమగుట లయ నివృత్తి యనఁబడును.

సకలకల్పితవస్తువులకు కారణము అధిష్ఠానాశ్రితమైన అజ్ఞానము,ఆ అజ్ఞానసహితమగు కల్పితకార్యనివృత్తి యయినదో అధిష్ఠానజ్ఞానమువలననే యగుచున్నది; మఱియు కారణమందు కార్యముయొక్క లయరూపమైన నివృత్తి అధిష్ఠానజ్ఞానము లేకయు అగుచున్నది.

సుషుప్తియందు, మఱియు ప్రలయమునందు అధిష్ఠాన జ్ఞానము లేకయు సర్వపదార్థములయొక్క లయము అజ్ఞానమందగుచున్నది; అచ్చట ఆసర్వపదార్థలయమునందు నిమిత్తము భోగమునకు సమ్ముఖమైన ప్రారబ్ధకర్మముయొక్క అభావముగనున్నది; అట్లు అధిష్ఠానమైన సాక్షియొక్క జ్ఞానము లేకయు సర్పజ్ఞానముయొక్క లయమగుచున్నది; అచ్చట ఆసర్పజ్ఞానలయమునందు నిమిత్తము సర్పజ్ఞానమునకు విషయమైన ఏ సర్పము గలదో, దానియొక్క అభావముగ నున్నది.

[ఈరీతిగా సర్పనివృత్తి రజ్జుజ్ఞానమువలన మఱియు, సర్పజ్ఞాననివృత్తి సర్పాభావమువలన నగుచున్నది. ఇది లయరూపనివృత్తియని ఎఱుఁగవలెను]

### 95. రజ్జుజ్ఞానసమయమందు సాక్షియొక్కభానము

ఓయీ శిష్యుఁడా! సర్పజ్ఞాననివృత్తివిషయమునందు ఇంకొక్కపక్షము చెప్పుచున్నాను—

సర్పము, మఱియు, తజ్జ్ఞానము ఈ రెంటికి నివృత్తి రజ్జుజ్ఞానమువలననే అగును. ఎట్లనఁగా—ఎప్పుడు రజ్జువుయొక్క ప్రత్యక్షజ్ఞానమగునో, అప్పుడు అంతఃకరణవృత్తి నేత్రద్వారమున బయలువెడలి రజ్జుదేశమందు ప్రాప్తమగును; మఱియు ఆవృత్తి రజ్జుసమానాకారమగును; దానివలన రజ్జువుయొక్క ప్రత్యక్షజ్ఞానకాలమందు వృత్త్యుపహితచైతన్యమును, రజ్జూపహితచైతన్యమును రెండును ఒకటియగుచున్నవి. వీనికి భేదము ఉండదు. ఎందుకనఁగా —

చైతన్యమునకు స్వరూపమువలన భేదము ఎచ్చటను లేదు; అయినను ఉపాధిభేదమువలన భేదప్రతీతి యగుచున్నది;

వృత్త్యుపహితచైతన్యముయొక్కయు, రజ్జూపహితచైతన్యము యొక్కయు భేదకోపాధులు వృత్తిరజ్జువులుగా నున్నవి; ఆవృత్తి రజ్జువులు ఎప్పుడు భిన్నభిన్నప్రదేశములందుండునో, అప్పుడు ఉపాధిగలచైతన్యముయొక్క భేదము ప్రతీతమగును. ఎప్పుడు రెండుఉపాధులు ఏకదేశమందు వచ్చునో, అప్పుడు ఉపాధిగల చైతన్యముయొక్క భేదము ఘటిల్లదు. [ఈసంగతి వేదాంతపరిభాషాదిగ్రంథములందు విస్తరముగ వ్రాయఁబడియున్నది.]

ఈరీతిగా ఎచ్చట వృత్త్యుపహితరజ్జూపహితములగు రెండుచైతన్యములు ఏకరూపమగునో, అచ్చట సాక్షిచైతన్యమే వృత్త్యుపహితచైతన్యముగ నున్నది. ఏలయన—అంతఃకరణమందును, తద్వృత్తియందును నుండు ప్రకాశకమైన చైతన్యమాత్రమును సాక్షియందురు; రజ్జుజ్ఞానమువలన రజ్జూపహితచైతన్యముయొక్కయుభానమగుచున్నది; పైఁజెప్పినరీతిగా రజ్జుజ్ఞానకాలమందు వృత్త్యుపహితమైన సాక్షిచైతన్యము రజ్జూపహితచైతన్యముతో అభిన్నముగానే యున్నది. అందువలన రజ్జుజ్ఞానముచే సాక్షిజ్ఞానము సంభవించినది.

ఈప్రకారముగా రజ్జుజ్ఞానసమయమందు సర్పజ్ఞానమునకు అధిష్ఠానమైన సాక్షియొక్క భానమగుటవలన దానిచేత కల్పితమయిన సర్పజ్ఞానముయొక్క నివృత్తి సంభవించినది.

## 96. సకలత్రిపుటీజ్ఞానమందు సాక్షిజ్ఞానము

ఓశిష్యుఁడా! సర్పజ్ఞాననివృత్తివిషయమునందు ఇంకొక్క పక్షము చెప్పుచున్నాను—

కూటస్థదీపమందు విద్యారణ్యస్వాములవారు ఈప్రక్రియ చెప్పియున్నారు—ఆభాససహితాంతఃకరణవృత్తి ఇంద్రియద్వార

మున బయలువెడలి ఘటాదివిషయములను ప్రకాశింపఁజేయుచున్నది; మఱియు ఘటాదివిషయము, సాభాసవృత్తిరూపమైన ఘటజ్ఞానము, సాభాసాంతఃకరణరూపమైన జ్ఞాత ఈమూఁడింటిని సాక్షి ప్రకాశింపఁజేయుచున్నది.

“అయం ఘటః” ఈరీతిగా సాభాసవృత్తివలన ఘటమాత్రముయొక్క ప్రకాశమైనది; మఱియు “ఘటమహం జానామి” అనునీరీతిగా అహంశబ్దమునకు అర్థము ప్రమాతృరూపుఁడైన జ్ఞాత, ప్రమేయరూపమైన జ్ఞేయము ఘటము, ప్రమాణవృత్తిరూపమైన దానిజ్ఞానము ఈత్రిపుటియొక్క ప్రకాశము సాక్షిద్వారమున అగుచున్నది.

ఈప్రకారముగా సర్వత్రిపుటులయొక్క ప్రకాశకుఁడగు సాక్షి; ఆసాక్షి తాను అజ్ఞాతుఁడైనపక్షమందు త్రిపుటిజ్ఞానము సాక్షివలన ఘటిల్లదు; గనుక సర్వత్రిపుటులజ్ఞానమందు సాక్షియొక్క జ్ఞానము అవశ్యముగానే యున్నది; ఆసాక్షిజ్ఞానము వలన సర్పజ్ఞానముయొక్క నివృత్తి సంభవించినది.

ఈప్రథమపక్షమునందు సర్పముయొక్కయు, తజ్జ్ఞానముయొక్కయు అధిష్ఠానము భిన్నభిన్నములుగా ప్రతిపాదింపఁబడినవి. ఈపక్షమునందు కొన్నిశంకలును, సమాధానములును ప్రదర్శింపఁబడినవి. ఈపక్షమునందు ఇంకను శంకాసమాధానరూపమైన వివాదము బహుళముగా నున్నది; అందువలన రెండవపక్షము చెప్పుచున్నాము.

### 97. సర్పము, సర్పజ్ఞానము రెండింటికిని అధిష్ఠానము సాక్షి

సర్పముయొక్కయు, దానిజ్ఞానముయొక్కయు అధిష్ఠా

నము ఒకటే. ఈపక్షమునందు బాహ్యమయిన రజ్జుచైతన్యము సర్పముయొక్కయు, తజ్జ్ఞానముయొక్కయు అధిష్ఠానమగుట ఘటిల్లదు. ఏలయన — ఎన్ని జ్ఞానములగుచున్నవో, అవన్నియు ప్రమాతకు లేక సాక్షికి ఆశ్రితములుగా నున్నవి. బాహ్యరజ్జు చైతన్యాశ్రితమగు జ్ఞానము ఘటిల్లదు. అట్లు సర్పముయొక్కయు, సర్పజ్ఞానముయొక్కయు అధిష్ఠానము అంతఃకరణోపహిత మయిన సాక్షిచైతన్యము నంగీకరించినయెడ శరీరములో అంతఃకరణదేశమందు సర్పప్రతీతి గావలయును; రజ్జుదేశమందుఁ గాఁ గూడదు; మఱియు అంతరుత్పన్నమైన సర్పమునకు మాయా బలమువలన బహిఃప్రతీతి నంగీకరించినయెడ ఆత్మఖ్యాతిమతము సిద్ధమగును; ఈరీతిగా రజ్జూపహితచైతన్యము జ్ఞానాధిష్ఠానమగుట ఘటిల్లదు; మఱియు అంతఃకరణోపహితచైతన్యము సర్పాధిష్ఠాన మగుట ఘటిల్లదు; కాఁబట్టి సర్పముయొక్కయు, తజ్జ్ఞానము యొక్కయు అధిష్ఠానము ఒకటియనుట ఘటిల్లదు?

అట్లయినను రజ్జువునకు సమీపప్రాప్తమైన అంతఃకరణము యొక్క ఇదమాకారవృత్తియందుండు ఏచైతన్యము గలదో, తదాశ్రితమయిన అవిద్య సర్పాకారముగాను, జ్ఞానాకారము గాను పరిణామమును పొందుచున్నది. అచ్చట ఆయవిద్య యొక్క తమోగుణాంశము సర్పమునకు ఉపాదానకారణము గాను, సత్త్వగుణాంశము సర్పజ్ఞానమునకు ఉపాదానకారణము గాను ఉన్నది; మఱియు రెంటికిని అధిష్ఠానము వృత్త్యుపహిత చైతన్యమైన ఒకసాక్షిగానె యున్నాఁడు. ఏలాగున ననఁగా — ఎంత అంతఃకరణముయొక్క స్వరూపమున్నదో, అంతే సాక్షి స్వరూపముగా నున్నది; శరీరమునకు అంతస్స్థితమగు అంతఃకర

ణామే వృత్తిస్వరూపపరిణామమును పొందును; అందువలన వృత్త్యుపహితచైతన్యమును సాక్షిగానున్నాఁడు; ఆ ఒకఁడే సాక్షి జ్ఞానమునకు ఆశ్రయముగ నున్నాఁడు.

మఱియు ఎప్పుడు రజ్జుసాక్షాత్కారమగునో, అప్పుడు రజ్జుచైతన్యమును, వృత్తిచైతన్యమును రెండు నొకటియే యగుచున్నవి; అందువలన రజ్జుజ్ఞానముచేత సర్పముయొక్కయు, తజ్జ్ఞానముయొక్కయు నివృత్తి ఘటిల్లినది.

ఎచ్చట ఒకరజ్జువునందు పదుగురికి సర్పము, దండము, మాల, జలధార, పృథ్వీరేఖ, ఈరీతిగా భిన్నభిన్నప్రతీతి యగునో, లేక అందఱికిని సర్పప్రతీతి యగునో, అచ్చట ఏపురుషునకు రజ్జుసాక్షాత్కారమైనదో, వానివృత్తిచైతన్యమందు కల్పితాధ్యాసనివృత్తి యగుచున్నది. ఎవనికి రజ్జుజ్ఞానము లేదో, వానికి అధ్యాసనివృత్తి కాఁజాలదు; దానివలన వృత్తిచైతన్యమే కల్పితమునకు అధిష్ఠానమని సిద్ధించుచున్నది; రజ్జ్వాదివిషయచైతన్యము గాదు.

రజ్జుచైతన్యమునే సర్పదండాదికమునకు అధిష్ఠానమని అంగీకరించినయెడల పదుగురికి వేఱువేఱుగా ప్రతీతములైనదళ పదార్థములు ఒక్కొక్కరికిని ప్రతీతములు గావలయును గదా! అట్లు గావుట లేదు; మా రీతిగానైననో, ఎవని వృత్తిచైతన్యమునందు ఏపదార్థము కల్పితమగునో, ఆపదార్థము వానికే ప్రతీతమగును; అన్యునకుఁ గాదు.

ఈవిధముగా బాహ్యసర్పాదికముయొక్కయు, తజ్జ్ఞానముయొక్కయు నధిష్ఠానము వృత్త్యుపహితమైన సాక్షిగానున్నాఁడు; మఱియుస్వప్నపదార్థముయొక్కయు, తజ్జ్ఞానము

యొక్కయు అధిష్ఠానము అంతఃకరణోపహితసాక్షిగానే యున్నాఁడు.

ఈరీతిగా సదసత్తులకన్న విలక్షణమగు అనిర్వచనీయావిద్యాపరిణామమైన అనిర్వచనీయసర్పాదికముయొక్క ప్రతీతి, మఱియు కథనము, దానిని అనిర్వచనీయఖ్యాతి యందురు.

**98. ప్రశ్న—జగత్తునకు ఆధారము, అధిష్ఠానము ఎవ్వఁడు?**

ఓభగవంతుఁడా! ఈమిథ్యాజగత్తునకు ఆధారము ఎవ్వఁడు? మఱియు అధిష్ఠానము ఎవ్వఁడు?

**99. 98—గతప్రశ్నకుత్తరము—99—100 జగత్తునకు ఆధారమును అధిష్ఠానమును నీవు.**

ఓశిష్యుఁడా! నీనిజరూపముయొక్క అనఁగా బ్రహ్మరూపముయొక్క అజ్ఞానమువలన మిథ్యాజగత్తు ప్రతీతమగుచున్నది; అందువలన జగత్తునకు ఆధారమును, అధిష్ఠానమును నీవుగానున్నావు. ఎట్లనఁగా— రజ్జ్వజ్ఞానమువలన ప్రతీతమైన ఏ మిథ్యాభుజంగము గలదో, ఆభుజంగమునకు ఆధారమును, అధిష్ఠానమును రజ్జువుగా నున్నది.

[యద్యపి మిథ్యాసర్పాధిష్ఠానముముఖ్యద్వితీయపక్షమునందు వృత్త్యుపహితచైతన్యము, మఱియు ప్రథమపక్షమునందు రజ్జూపహితచైతన్యము; ఏపక్షమందైనను రజ్జువధిష్ఠానముగాదు; తథాపి ప్రథమపక్షస్థచైతన్యమునందు అధిష్ఠానోపాధిరజ్జువగుటవలన స్థూలదృష్టిచే రజ్జువధిష్ఠానమని చెప్పఁబడినది.]

## 100. ఆత్మయొక్క సామాన్యరూపము ఆధారము, విశేషరూపము అధిష్ఠానము

ఈస్థానంబునందు ఈరహస్యమున్నది— రజ్జువునకు రెండురూపములున్నవి— మొదటిది సామాన్యరూపము, రెండవది విశేషరూపము. "ఇదం" ఇది సామాన్యరూపము, "రజ్జువు" ఇది విశేషరూపము.

(1) "ఈసర్పమున్నది" అనుచోట మిథ్యాసర్పముతో అభిన్నమై భ్రాంతికాలమందును ఏది ప్రతీతమైనదో, మఱియు దేని ప్రతీతి లేనియెడల భ్రాంతియు ఘటిల్లదో, ఇట్టి ఏ ఇదంరూపము గలదో, అది సామాన్య రూపము.

(2) భ్రాంతికాలమందు దేని ప్రతీతి గానేరదో, దేని ప్రతీతి యగుటవలన భ్రాంతి దూరమగుచున్నదో, ఇట్టి ఏ రజ్జురూపము గలదో, అది విశేషరూపము.

అట్లు ఆత్మకును రెండురూపము లున్నవి—మొదటిది సామాన్యరూపము, రెండవది విశేషరూపము. వానిలో— సద్రూపము సామాన్యము, మఱియు అసంగకూటస్థనిత్యముక్తాది విశేషరూపము. ఎలాగుననఁగా—

(1) "స్థూలసూక్ష్మసంఘాతమున్నది"ఇచ్చట స్థూలసూక్ష్మ సంఘాతభ్రాంతిసమయమందును మిథ్యాసంఘాతముతో అభిన్నమై "ఉన్నది" యనుసద్రూపము ప్రతీతమగుచున్నది; గనుక సద్రూపము ఆత్మకు సామాన్య రూపము.

(2) స్థూలసూక్ష్మ సంఘాతభ్రాంతిసమయమందు ఆత్మ యొక్క అసంగాది రూపముయొక్క ప్రతీతి గానే రదు; అసంగాద్యాత్మరూపము ప్రతీతమైనప్పుడు సంఘాతభ్రాంతి దూరమగుచున్నది; గనుక అసంగాది ఆత్మకు విశేషరూపము.

సకలభ్రాంతిస్థానంబునందు సామాన్యరూపము ఆధారము, మఱియు విశేషరూపము అధిష్ఠానము అని చెప్పఁబడును. ఎట్లు సర్పమునకాశ్రయమైన రజ్జువుయొక్క సామాన్యమైన ఇదంరూపము సర్పమునకాధారమై, రజ్జువనువిశేషరూపము సర్పమునకధిష్ఠానమో, అట్లు మిథ్యాప్రపంచమునకాశ్రయమైన ఆత్మయొక్క సామాన్యమైనసద్రూపము ప్రపంచమునకాధారమై అసంగాదివిశేషరూపము ప్రపంచమునకధిష్ఠానముగా నున్నది.

ఈరీతిగా భ్రమస్థలములందు ఆధారమునకును అధిష్ఠానమునకును కించిద్భేదము సర్వజ్ఞాత్మనామకుఁడైన ముని[1] చేత ప్రతిపాదింపఁబడుచున్నది.

### 101. ప్రశ్న—జగద్ద్రష్ట ఆత్మకన్న భిన్నుఁడనవలయును?

ఓభగవంతుఁడా! జగత్తునకు ఆధారమును, అధిష్ఠానమును ఆత్మయగుటవలన జగద్ద్రష్ట ఆత్మకన్న భిన్నుఁడనవలయును. ఎట్లనఁగా—సర్పమునకు ఆధారము, అధిష్ఠానమగు రజ్జువుకన్న భిన్నపురుషుఁడు సర్పద్రష్టగా నున్నాఁడు?

1. సంక్షేపశారీరకకర్త శ్రీశంకరుల శిష్యుఁడు.

**102.** 101—గతప్రశ్నకుత్తరము--102-103
సకలకల్పితపదార్థమునకు అధిష్ఠానమే ద్రష్ట

ఓశిష్యుఁడా! ఎచ్చట జడపదార్థము అధిష్ఠానముగునో, అచ్చట అధిష్ఠానముకన్న భిన్నుఁడు ద్రష్ట యగును; ఎచ్చట చైతన్యమధిష్ఠానముగునో, అచ్చట అధిష్ఠానమే ద్రష్ట యగును; భిన్నముగాదు. ఎట్లనఁగా—సర్పరజతాదికముయొక్క అధిష్ఠానము గు రజ్జుశుక్త్యాది జడములుగా నున్నవి; అచ్చట అధిష్ఠానము కన్న భిన్నుఁడైన పురుషుఁడు దాని ద్రష్టగా నున్నాఁడు; మఱియు స్వప్నపదార్థమునకు అధిష్ఠానము గు సాక్షిచైతన్యమే స్వప్నపదార్థమునకు ద్రష్టగా నున్నది.

ఈశంకయు, సమాధానమును స్థూలదృష్టివలన రజ్జువు సర్పాధిష్ఠానమనుట నంగీకరించి చెప్పఁబడినది; ముఖ్యసిద్ధాంతమందైననో, సర్పమునకు అధిష్ఠానము సాక్షిచైతన్యము; అదియే ద్రష్ట.

ఈరీతిగా సకలకల్పితపదార్థమునకు అధిష్ఠానమె ద్రష్టగా నున్నది; దీనిలో శంకాసమాధానములు ఘటిల్లవు.

**103.** మిథ్యాసంసారముయొక్క
నివృత్తిచ్ఛ ఘటిల్లదు

ఓశిష్యుఁడా! ఈరీతిగా నీయందు సంసారదుఃఖము భ్రాంతివలన ప్రతీతమగుచున్నది; అందువలన నది మిథ్యగా నున్నది; ఆమిథ్యయొక్క నివృత్తిచ్ఛ ఘటిల్లదు. ఎట్లనఁగా— ఇంద్రజాలికునిచేత మంత్రబలమువలన మిథ్యాశత్రువు చూపఁబడినను వానిని కొట్టుటయందు పురుషుఁడు ఉద్యోగము చేయఁడు.

## 104. సంసారము దుఃఖహేతువగుట వలన తన్నివృత్త్యుపాయము చూపుఁడు?

ఓ భగవంతుఁడా ! మీరు చెప్పితిరి— "సంసారము నీయందు మిథ్యారూపముగా నున్నది; సత్యరూపముగా లేదు" అది యథార్థమైనను ఓభగవంతుఁడా! ఏయుపాయముచేత ఆ మిథ్యారూపసంసారము నాయందు కనఁబడకపోవునో, ఆయు పాయమును మీరు తెలుపుఁడు?

మఱియు మీరు చెప్పితిరి—"మిథ్యయొక్క నివృత్తి కొఱకు సాధనాపేక్ష కలుగదు." ఆమాటయు యథార్థమే. అయిన ఓభగవంతుఁడా! ఎవ్వనికి మిథ్యాపదార్థమునుగూడ దుఃఖహేతువగునో, వానికి ఆ మిథ్యాపదార్థమును సాధనముచే దూరముచేయుట ఆవశ్యకము. ఎట్లు ఏపురుషునకు ప్రతి దినము కలిగెడు భయానకస్వప్నములు మిథ్యయైనను వానిని దూరముచేయుటకొఱకు వాఁడు జపదానాదినానాసాధనానుష్ఠానములు చేయుచున్నాఁడో, అట్లు ఈసంసారము మిథ్యయైనను నాకు జన్మాదిదుఃఖహేతువై ప్రతీతమగుటవలన దాని నివృత్తిని నేను గోరుచున్నాను; మీరు కృపచేసి, ఉపాయముచూపుఁడు?

## 105. 104-గత ప్రశ్నకుత్తరము-జగన్నివృత్త్యుపాయముగు జ్ఞానస్వరూపము. 105—106

ఓశిష్యుఁడా! నీవు దేని నడిగితివో, అట్టి సంసారదుఃఖ నివృత్తియొక్క సాధనమును మేము నీకు మొదలే చెప్పితిమి, దానియందు నీవు దృఢనిశ్చయము చేసికొనుము; అప్పుడు నీయందు సంసారదుఃఖముండదు.

ఇప్పుడు పూర్వమందు చెప్పినమాటయే మఱల అనువాదము చేయుచున్నాఁడు—

ఓశిష్యుఁడా! నీస్వరూపము తెలియనందువలన సంసారరూపమైన ఖేదము ప్రతీతమగుచున్నది; ఆఖేదము నీస్వరూపము తెలియుటవలన నశించుచున్నది; ఏవస్తువు దేని అజ్ఞానమువలన ప్రతీతమగునో, ఆవస్తువు తజ్జ్ఞానమువలన నశించును; ఇది నియమము. ఎట్లు రజ్జ్వజ్ఞానమువలన ప్రతీతమైన సర్పము రజ్జుజ్ఞానమువలన నశించుచున్నదో, అట్లు ఆత్మాజ్ఞానమువలన ప్రతీతమైన సంసారదుఃఖము ఆత్మజ్ఞానమువలన నశించును.

ఆయాత్మజ్ఞానమును మేము పూర్వమే చెప్పినారము— జగత్తు నాయందు త్రికాలములందును లేదు; ఏలయనఁగా— జగత్తు మిథ్యగా నున్నది; మిథ్యావస్తువు అధిష్ఠానమునకు హాని చేయదు. ఎట్లు మరీచికాజలము పృథ్వీని ఆర్ద్రము చేయదో, అట్లు జగత్తు ప్రతీతమైనను అది మిథ్యయగుటవలన నాకు హాని చేయుటకు సమర్థము గాదు. నేను సచ్చిదానంద బ్రహ్మస్వరూపుఁడను. ఇట్టి యే నిశ్చయము గలదో, దానినే జ్ఞానమందురు; అదియే మోక్షసాధనము; ఇంక యేదియు మోక్షసాధనముగాదు ఆ జ్ఞానము నీకు మేము మొదలే ఉపదేశించితిమి.

## 106. జ్ఞానముచేతనే అజ్ఞాననాశము.

ఓశిష్యుఁడా! జగత్తుయొక్క నిదానము అనఁగా ఉపాదానకారణము తమము. అనఁగా అజ్ఞానము; ఆ అజ్ఞానముయొక్క నాశమువలన జగత్తుయొక్క నాశము ఏప్రయత్నము లేకయు తనకుతానే యగును ఏలయన—ఉపాదానముయొక్క నాశమైనవెనుక కార్యము ఉండదు; ఆ అజ్ఞాననాశము కేవల

జ్ఞానమువలననే యగుచున్నది; కర్మోపాసనములవలనఁ గానేరదు; ఏలాగున ననఁగా—అజ్ఞానమునకు విరోధిజ్ఞానము; కర్మోపాసనలు గావు.

గృహమధ్యమున ఏ అంధకారము గలదో, అది ఏ క్రియ వలనను దూరము గాదు! కేవల ప్రకాశమువలననే దూరమగును; అట్లు అజ్ఞానరూపమైన అంధకారము జ్ఞానరూపప్రకాశమువలననే దూరమగును; ఇంక ఏ సాధనమువలనను గాదు.

**107. ప్రశ్న—గురూక్తవ్యర్థానువాదపూర్వకముగా వక్ష్యమాణశంకాసూచనము ?**

ఓభగవంతుఁడా! మీరు చెప్పితిరి— "జగత్తుయొక్క కారణము అజ్ఞానము; తన్నాశము జ్ఞానమువలన అగును" ఆమాట నేను తెలిసికొంటిని, జ్ఞానస్వరూపము మీరు చెప్పితిరి—"జగత్తు మిథ్య, జీవుఁడు ఆనందస్వరూపుఁడు, వాఁడు బ్రహ్మముకన్న భిన్నుఁడు గాఁడు; ఇట్టి నిశ్చయమునకు పేరు జ్ఞానము" దానియందు జగత్తు మిథ్య, జీవుఁడు ఆనందస్వరూపుఁడు ఈమాట నేను తెలిసికొంటిని; అయినను జీవుఁడును, బ్రహ్మము నొక్కటియే; ఈసంగతి నేనెఱుఁగను. ఏలయన— జీవబ్రహ్మలభేదమును కలిగించునట్టి శంక నాహృదయమునందు స్ఫురించుచున్నది?

**108. బ్రహ్మస్వరూపము నాస్వరూపము విరుద్ధమగుటచే ఏకతఘటిల్లదు ?**

ఓభగవంతుఁడా! నేను పుణ్యపాపములకర్తను; వీనిఫలమైన జన్మమరణసుఖదుఃఖాదులభోక్తను; నానాప్రకారమైన

జగత్తు నాయందు ప్రతీతమగుచున్నది; జగత్కారణమగు అజ్ఞానమును దూరము చేయుటకొఱకు జ్ఞానమును నేను గోరుచున్నాను; బ్రహ్మమందో, పుణ్యము లేదు, పాపము లేదు, జన్మము లేదు; మృత్యువు లేదు, సుఖము లేదు, దుఃఖము లేదు; అట్లు ఇంక ఏ క్లేశమును బ్రహ్మమందు లేదు. మఱియు వానికి జ్ఞానేచ్ఛయు లేదు; ఈప్రకారముగా బ్రహ్మస్వరూపము, నా స్వరూపము పరస్పరవిరుద్ధములగుటవలన రెంటికి ఏకత ఘటిల్లదు. నాయందుఁగూడ జన్మాదిసంసారము పరమార్థమువలన లేకపోయినను భ్రాంతిబలమువలన మిథ్యాజన్మాదిసంసారము నాకు ప్రతీతమగుచున్నది; అది బ్రహ్మమునకు లేదు; ఈభేదమువలన బ్రహ్మమునకు, నాకు ఏకత[1] ఘటిల్లదు?

## 109. జీవబ్రహ్మైక్యమువలన కర్మోపాసన ప్రతిపాదకభేదము నిష్ఫలమగును?

ఓగురుఁడా! నా కింకొక్క సంశయమున్నది. దానివలన జీవబ్రహ్మలయేకతయొక్క నిశ్చయము దూరమగుచున్నది; వేదమునందు[2] నేను ఇట్లు చూచినాఁడను—బుద్ధిరూపమైన ఒక వృక్షమున రెండుపక్షులు గలవు; అవి రెండు సమానములు; వానిలో మొదటిది కర్మఫలమునకు భోక్త, మఱియు రెండవది శుద్ధము, భోగరహితము, అసంగమునై ఆభోగించుదానికి ప్రకాశకముఁగ నున్నది. వానియందు భోగించునట్టిజీవుఁడును, భోగరహితుఁడైన పరమాత్మయును సిద్ధించుచున్నారు. అందువలన ఆ రెంటికి ఏకత ఘటిల్లదు?

---

1 ఇది ప్రమేయగతసంశయస్వరూపము

2 ద్వాసుపర్ణాసయుజాసఖాయాఇత్యాదిశ్రుతియందు.

మఱియు వేదమునందు కర్మోపాసనలు బహువిధములుగా చెప్పఁబడియున్నవి; అవి అంతయు జీవబ్రహ్మలఏకతయందు నిష్ఫలమగును; ఏలాగుననఁగా—

తాము జీవబ్రహ్మైక్యము ఏది చెప్పుచున్నారో, అందు బ్రహ్మమునందు జీవస్వరూపమున కంతర్భావమా? లేక జీవునియందు బ్రహ్మస్వరూపమున కంతర్భావమా?

బ్రహ్మమందు జీవస్వరూపమున కంతర్భావమనినయెడల జీవుఁడే బ్రహ్మరూపుఁడగుటవలన అధికారియొక్క అభావమగును: దానివలన కర్మోపాసనావిధి నిష్ఫలమగును. ఇఁక జీవునియందు బ్రహ్మమున కంతర్భావమనినయెడల బ్రహ్మము జీవరూపమగుట వలన ఎవనిని ఉపాసింపవలెనో, ఆయుపాస్యమైన బ్రహ్మమునకు అభావమగును! దానివలన ఉపాసనావిధినిష్ఫలమగును. మఱియు కర్మఫలప్రదాతయగు పరమాత్మయొక్క అభావమగుటవలన కర్మమును నిష్ఫలమగును.

పూర్వమీమాంసకుఁడు చెప్పుచున్నాఁడు—"కర్మమే ఈశ్వరుఁడు; దానిచేతనె ఫలమగును" ఆమాట సమీచీనము గాదు. చూడుము—కర్మము జడము; దానికి ఫలమిచ్చుసామర్థ్యము లేదు. కాఁబట్టి కర్మఫలమిచ్చువాఁడు ఈశ్వరుఁడే. [బ్రహ్మమే] యని సిద్ధమగుచున్నది.

ఈరీతిగా జీవ[1] బ్రహ్మలయేకత ఘటిల్లదు?

---

1 ఇది ప్రమాణగతసంశయస్వరూపము.

## { 110. 107 గతప్రశ్న కుత్తరము—110—119 ఆకాశములు నాలుగుచైతన్యములు. }

ఓశిష్యుఁడా ! నీశంకకు సమాధానము ఏరీతివలన నగునో, ఆవిచారము నేను చెప్పుచున్నాను; వినుము—ఎట్లుఘటాకాశము, జలాకాశము, మేఘాకాశము, మహాకాశము ఈ ప్రకారముచే ఒకటేయాకాశంబునందు నాలుగుభేదములు గలవో, అట్లు కూటస్థుఁడు, జీవుఁడు, ఈశ్వరుఁడు, బ్రహ్మము ఈరీతిచే ఒకటేచైతన్యంబునందు నాలుగు భేదములు గలవు. ఓశిష్యుఁడా! ఎప్పుడు వీనిస్వరూపములను నీవు మంచిప్రకారమున తెలిసికొందువో, అప్పుడు నీశంకకు నీవేసమాధానము చేసికొందువు. దానిచే నీకు సంశయరహితజ్ఞానమై జన్మమరణాదిదుఃఖములనాశమగును. వీని స్వరూపములను నేను వర్ణించెదను; వినుము—

### 111. ఘటాకాశవర్ణనము

ఓశిష్యుఁడా! జలముచే నిండినఘటమునకు ఎంత ఆకాశము అవకాశమిచ్చునో, అంత ఆకాశమును పండితజనులు ఘటాకాశ [1] మందురు.

---

1 ఇచ్చట ఈశంకయున్నది—"ఘటముకన్న బాహ్యమైన ఆకాశము మహాకాశము, ఘటాంతరమైన ఆకాశము ఘటాకాశము." అనునీ ఘటాకాశలక్షణము సుగమము ; దానిని విడిచి "జలపూరితఘటమునకు ఎంత ఆకాశము అవకాశము నిచ్చునో, అంత ఆకాశము ఘటాకాశము" అనునీలక్షణము చేయుట నేమిప్రయోజనము ?

దీని కిది సమాధానము—ఘటాకాశముయొక్క పూర్వోక్తలక్షణము చేసినయెడల ఘటమునకు దేనియందు స్థితి గలదో, అట్టి ఏ కపాలాకాశము

## 112. జలాకాశవర్ణనము

ఓశిష్యుఁడా! జలముచే నిండినఘటమునందు నక్షత్రాది సహితమైన ఆకాశప్రతిబింబము,[1] మఱియు ఘటాకాశము రెండును గూడి జలాకాశమందురు.

దీనియందొకానొకఁడు శంకించుచున్నాఁడు—ఆకాశము యొక్క ప్రతిబింబము గాదు. కేవల నక్షత్రాదికముయొక్కయే ప్రతిబింబమగును. ఏలయన—ఆకాశమో, రూపరహితము; ప్రతిబింబమో, రూపవంతమగు పదార్థమునకే గలుగును?

దానికి సమాధానము—ఆకాశప్రతిబింబము గాని యెడల మోఁకాలిబంటిజలమందు మనుష్యపరిమాణమైన గంభీరతయొక్క ప్రతీతి గాఁగూడదుగదా? అదియో, అగుచున్నది, కనుక ఆకాశమునకు ప్రతిబింబము నంగీకరించుట యోగ్యము.

మఱియు నొకానొకఁడు దురాగ్రహముచే చెప్పుచున్నాఁడు—రూపరహిత[2] పదార్థముయొక్క ప్రతిబింబమగుట యెప్పటికిని లేనే లేదు?

---

గలదో, అవి పంచమాకాశమని సిద్ధమగును ; శాస్త్రమునందో, ఆకాశములు నాల్గువిధములుగాఁ జెప్పఁబడినవి ; కాఁబట్టి ఇచ్చట చెప్పఁబడిన రెండవలక్షణము ఉచితము.

1 జలములేక ప్రతిబింబము గాచేరదు ; గనుక ఇచ్చట ఆకాశముయొక్క ప్రతిబింబము చెప్పుటవలన ఘటస్థితమైన జలసహితప్రతిబింబముయొక్క గ్రహణము గలదు.

2 గుణము గుణమును ఆశ్రయించుట లేదు. మఱేమనఁగా—అది ఆకాశాదిద్రవ్యముయొక్క ఆశ్రితముగా నున్నది. ఈనియమమువలన నీల

అవియు నియమము గాదు. ఏలయన—రూపరహిత మైన శబ్దముయొక్క ప్రతిధ్వనిరూపమగు ప్రతిబింబమగు చున్నది. ఆప్రకారమున రూపరహితాకాశము యొక్కయు ప్రతిబింబము ఘటిల్లుచున్నది.

## 113. మేఘాకాశవర్ణనము

మేఘమునకు ఎంత ఆకాశము అవకాశమిచ్చుచున్నదో, అంత ఆకాశము; మఱియు మేఘజలమందుండిన ఆకాశప్రతిబింబము అవి రెండునుగూడి మేఘాకాశమందురు.

దానియందు శంక కలుగుచున్నది—మేఘమో, ఆకాశమందున్నది. దానిలో జలమును, ఆకాశప్రతిబింబమును చూడక యే ఎట్లు ఎఱుఁగనగును?

దానికి సమాధానము—మేఘము జలవృష్టిని చేయును. గనుక మేఘమందు జలమున్నదని అనుమాన మగుచున్నది; మఱియు ఎచ్చట జలమున్నదో, అచ్చట ఆకాశప్రతిబింబము గాక యుండుటలేదు; ఈరీతిగా మేఘమునందు జలమును, ఆకాశ ప్రతిబింబమును అనుమాన ప్రమాణము ద్వారమున సిద్ధ మగుచున్నవి.

---

పీతాది రూపమనఁగా వర్ణము ఏది గలదో, అది రూపమనఁబడు గుణము చేత [విశేషణముచేత] అనాశ్రితమగుటవలన రూపరహితముగా నున్నది. అభిప్రాయమేమనఁగా—రూపమునకు వేఱొకరూపము లేదు. అట్టి ఆ రూప రహితమైన నీలపీతాదివర్ణముయొక్క ప్రతిబింబము దర్పణాది స్వచ్ఛోపాధి యందు ఘటిల్లినది. తన్న్యాయమున రూపరహితాకాశము యొక్కయు, రూపరహితచైతన్యముయొక్కయుం ప్రతిబింబము ఘటిల్లినది.

## 114. మహాకాశవర్ణనము

బాహ్యాంతరమై [1] ఏకరసమై వ్యాపకమైన ఏ ఆకాశము యొక్క స్వరూపము గలదో, దానిని పండితజనులు మహాకాశమందురు.

## 115. నాలుగుచైతన్యములకు ఉపోద్ఘాతము

ఓశిష్యుఁడా! నాలుగు ప్రకారముల ఆకాశము చెప్పితిమి; ఇప్పుడు దేనిశ్రవణమువలన నీకు జ్ఞానము లభించునో, ఆనాలుగుచైతన్యముల [2] లక్షణములను చెప్పుచున్నాము శ్రవణము చేయుము.

## 116. కూటస్థస్వరూపవర్ణనము

బుద్ధియొక్క లేక వ్యష్ట్యజ్ఞానముయొక్క అధిష్ఠానమైన చైతన్యమునకు కూటస్థుఁడని పేరు; ఏపక్షంబునందు బుద్ధిసహిత చైతన్యము జీవుఁడో, ఆ పక్షంబునందు బుద్ధికధిష్ఠానము కూటస్థుఁడు; ఏపక్షంబునందు వ్యష్ట్యజ్ఞానసహితచైతన్యము జీవుఁడో, ఆపక్షంబునందు వ్యష్ట్యజ్ఞానమున కధిష్ఠానము కూటస్థుఁడు.

---

1 బ్రహ్మాండముయొక్క అంతరము, బాహ్యము.

2 అనాదులైన ఆఱుపదార్థములందు మూఁడుచైతన్యములు చెప్పఁబడియున్నవి. అట్లు కొన్ని గ్రంథములందును జీవుఁడు, ఈశ్వరుఁడు, బ్రహ్మము అను మూఁడుచైతన్యములని చెప్పఁబడినది: కూటస్థచైతన్యమును విడుచుటవలన ఏదోషము లేదు. ఏలయన—కూటస్థునకు బ్రహ్మమునకు నామమాత్రమే భేదము కాక వేఱేమి భేదము లేదు. ఇదియునుగాక విద్యారణ్యస్వాములు దృగ్దృశ్యవివేకమను గ్రంథమునందు కూటస్థుఁడు పారమార్థికజీవుఁడని, జాగ్రత్తునందుండు అంతఃకరణస్థితమైన ప్రతిబింబము వ్యావహారికజీవుఁడని, స్వప్నమందుండు ప్రతిబింబము ప్రాతిభాసికజీవుఁడని చెప్పుచున్నారు.

ఈస్థానమునందు ఇది సిద్ధాంతము—జీవత్వమునకు ఏ విశేషణము గలదో, దాని అధిష్ఠానమునకు పేరు కూటస్థుఁడు. ఆ కూటస్థుఁడు అజన్యుఁడు; అనఁగా ఉత్పత్తిరహితుఁడు. దీని అభిప్రాయము—ఎట్లు బ్రహ్మముకన్న భిన్నమయిన చిదాభాసుఁడు ఉత్పన్నుఁడగుచున్నాఁడో, అట్లు ఈకూటస్థుఁడు ఉత్పన్నుఁడు [1] గాఁడు. వాఁడు బ్రహ్మరూపుఁడే యున్నాఁడు. ఎట్లనఁగా—ఘటాకాశము మహాకాశముకన్న భిన్నము గాదు. అది మహాకాశరూపమే.

అట్లు ఘటాకాశసమానమయిన ఏ కూటస్థుఁడో, వాఁడే జీవపదమునకు లక్ష్యార్థము. వానినే ప్రత్యక్కందురు; వానినే నిజరూపమందురు; వానినే జీవసాక్షి యందురు.

## 117. జీవస్వరూపవర్ణనము

నానా కామకర్మరూప [2] జలసహితమైన ఏ బుద్ధిరూప ఘటము గలదో, దానియందుండు చైతన్యప్రతిబింబమును

---

1 చంద్రుఁ డెప్పుడునుండినను పక్షములచేత తిథులచేత వృద్ధిక్షయములను బొందుచున్నాఁడు. వృక్ష మెల్లప్పుడు ఉండినను దానిఫలము జన్మాది షడ్వికారరూపపరిణామమును పొందుచున్నది. వీనివలె దేహాదులకు జన్మాది షడ్వికారరూపపరిణామములు గలుగుచున్నవి. అట్లు కూటస్థుఁడును పరిణామమును పొందినయెడల కూటస్థుఁడును దేహాదికమువలె జడమగును; మఱియుం వికారియగును. కనుక కూటస్థునకు పరిణామము చెప్పఁగూడదు.

2 కామకర్మరూపజలసహితమైన బుద్ధిరూపఘటమునందు చైతన్యము యొక్క ప్రతిబింబము గలదు. ఈరీతి దుర్గమమని, స్థూలదేహరూపఘటమునందు నఖశిఖాంతము నిండిన బుద్ధిరూపజలమునందు చైతన్యప్రతిబింబము గలదు. ఈరీతి సుగమమని కనఁబడుచున్నది.

విద్వజ్జనులు జీవుఁడందురు; అదే కేవలచైతన్యప్రతిబింబమును జీవుఁడనరు; ఎట్లు కేవలాకాశప్రతిబింబమును జలాకాశమనరో, ఘటాకాశసహితమైన ఆకాశప్రతిబింబమును జలాకాశమందురో, అట్లు సబింబము అనఁగా బింబమైన కూటస్థునితోఁగూడిన చైతన్యప్రతిబింబమును జీవుఁడందురు. [1] [అంతఃకరణము, చిదాభాసుఁడు, కూటస్థుఁడు ఈసముదాయమునకు పేరు జీవుఁడు.]

---

1 అంతఃకరణము [బుద్ధి] అధిష్ఠానచైతన్యము, అంతఃకరణమునందుండు ప్రతిబింబచైతన్యము [చిదాభాసుఁడు] ఈమూఁడునుగూడి జీవుఁడని చెప్పఁబడును; ఎందుకనఁగా—

(1) కేవలాంతఃకరణము మాత్రము జీవుఁడని చెప్పినపక్షమందు ఘటమునకును జీవత్వము చెప్పవలసివచ్చును. ఘటము స్వచ్ఛమై యుండనందువలన దానికి చెప్పఁగూడదనిన స్వచ్ఛమైన దర్పణమునకు జీవత్వము చెప్పవలసివచ్చును. దర్పణము బాహ్యమగుట వలన దానికి చెప్పఁగూడదనిన అంతరములైన ఇంద్రియములకు చెప్పవలసివచ్చును. ఇంద్రియములకన్నను అంతఃకరణము అంతరమగుటవలన దానికి చెప్పవలయుననిన అంతఃకరణమునకును అంతరమైన అజ్ఞానమునకు చెప్పవలసివచ్చును. అట్లైన జీవత్వయోగ్యపదార్థములు అనేకమగుటవలన అంతఃకరణమునకు జీవత్వము చెప్పఁగూడదు; అట్లైన జీవుఁడు చైతన్యమగుటవలన అచేతనమైన అంతఃకరణమునకు జీవత్వము చెప్పఁగూడదు. [జీవుఁడు చైతన్యమని ప్రసిద్ధముగానే యున్నది; జీవుఁడు అచేతనమని ఎవ్వఁడును అంగీకరింపఁడు.]

(2) కేవలప్రతిబింబమునకు జీవత్వము చెప్పుట సరికాదు. ఏలయన—

(3) అధిష్ఠానచైతన్యమునకు జీవత్వము చెప్పుట సరికాదు. ఏలయన— ఆ చైతన్యము నిర్వికారముగ నున్నది; దానికి వికారరూపమయిన జీవత్వము ఘటిల్లదు.

(4) అంతఃకరణము, ప్రతిబింబము గూడినది జీవుఁడని చెప్పెడు పక్షమునందు రెండును కల్పితములగుటవలన జీవునకు నిత్యత్వాభావమగుటవలన ముక్తికి అధికారి ఎవ్వఁడు నుండఁడు. మఱియు భాగత్యాగలక్షణ సంభవింపక సకలవాచ్యార్థమును విడచునట్టి జహల్లక్షణ సంభవించును; అది ఆచార్యరీతికి విరుద్ధము. మఱియు అధిష్ఠానమునకు అన్యముగాకయే అధిష్ఠానమును ఆచ్ఛాదించినది ఆరోప్యమని యెంచఁబడును; అధిష్ఠానమును అన్యమై ఆరోప్యము దోఁపదు; ఈ అనుభవముచేతను బింబమును విడిచి ప్రతిబింబము దోఁపదు.

(5) అధిష్ఠానచైతన్యము, ప్రతిబింబచైతన్యము గూడి జీవుఁడనిచెప్పిన యెడల ఉపాధిగ్రహణములేక రెండును కేవలచైతన్యమాత్రము నిర్వికారమగుటవలన వానికి కర్తృత్వభోక్తృత్వాది వికారలక్షణమైన జీవత్వము చెప్పఁగూడదు. [ఉపాధిలేక ప్రతిబింబమే ఘటిల్లదు.]

(6) అధిష్ఠానచైతన్యము, అంతఃకరణము గూడి జీవుఁడని చెప్పినట్టయిన దర్పణము, దర్పణాధిష్ఠానము గూడి జీవుఁడు గావలయును; వీనికయినను జీవత్వములేదు. ఎట్లు దర్పణము, దర్పణాధిష్ఠానము ఈరెంటియందు భోగమునకు ఆశ్రయమేదియు సిద్ధింపదో, అట్లు ప్రతిబింబముగాక అంతఃకరణము, అంతఃకరణాధిష్ఠానము ఈరెంటియందుకూడ భోగమునకు ఆశ్రయము ఏదియు సిద్ధింపదు. అందువలన జీవత్వసిద్ధికొఱకు మూఁడవదయిన అంతఃకరణమందు ప్రతిబింబమును అంగీకరింపవలయును.

పూర్వము సబింబచిదాభాసుఁడు [1] జీవుఁడని చెప్పఁబడినది; దానివలన నిది అర్థము కనఁబడుచున్నది—బుద్ధియందలి ఏ ప్రతిబింబము గలదో, అది కూటస్థునిది; బాహ్యమైన బ్రహ్మచైతన్యముది గాదు. ఏలయనఁగా—దేనికి ప్రతిబింబముగునో దానిని బింబమందురు; జపాకుసుమము [దాసానిపువ్వు] పైనుంచిన స్ఫటికంబునందు పుష్పముయొక్క శోణకాంతి ప్రసరించును; అది పుష్పప్రతిబింబము; అట్లు కూటస్థాశ్రితబుద్ధియందు కూటస్థునిఛాయ [2] ప్రసరించును; అది కూటస్థుని ప్రతిబింబము. [ఎట్లు స్ఫటికము అత్యంతోజ్జ్వలమగుటవలన ప్రతిబింబమునకు యోగ్యమో, అట్లు సత్త్వగుణకార్యమైన బుద్ధియును శుద్ధమగుటవలన ప్రతిబింబమునకు యోగ్యము.]

లేక బ్రహ్మచైతన్యముయొక్క ప్రతిబింబమనుటయు సంభవించినది. చూడుము—మహాకాశమునకు ఘటజలమందు ప్రతిబింబమగును; అంతరాకాశమునకుఁ గాదు. ఏలయన—ఎంత గంభీరత జలమందు ప్రతీతమగునో, అంతగంభీరత ఘటాంతరా

---

ఈ ఆఱు ప్రకారముల చేతను జీవుఁడనుట సంభవింపదు; గనుక పూర్వోక్తములు మూఁడును చేరి, జీవుఁడనుటయే ఉచితము. అపుడు చెప్పిన మాటిలో—కూటస్థునకు సంసారము సంభవింపనందున ప్రతిబింబోపాధి సహితుఁడైన జీవుఁడే సంసారియని యంగీకరింపఁదగినగా నున్నది.

1 పటలక్షణము లేక పటమువలెఁ గనఁబడునది పటాభాసమనునట్లు చైతన్యలక్షణము లేక చైతన్యమువలె నగపడునది చిదాభాసమని ఎంచఁబడును.

2 జలభరితమైన ఘటముయొక్క బాహ్యప్రదేశమునందు ప్రకటమైన చెమరుచుట న్యాయమున.

కాశమునందు లేదు; దానివలన సిద్ధమయినది—ఆ అధికగంభీరత బాహ్యాకాశముయొక్కయే ప్రతిబింబము. ఈవిధముగా బుద్ధిరూపఘటమునందు బుద్ధిఘటముకన్న బాహ్యమయిన ఏ బ్రహ్మచైతన్యము గలదో, దానియొక్క ప్రతిబింబము సంభవించినది.

ఇచ్చట ఇట్లు శంకింపవగును—వ్యాపకచైతన్యము యొక్క ప్రతిబింబము ఘటిల్లదు? ఆశంక ఆకాశదృష్టాంతముననే దూరమయినది. ఏలయన—ఎట్లు చైతన్యము వ్యాపకమో, అట్లు ఆకాశము వ్యాపకమే.

మఱియు నిట్లు శంకగలుగును—రూపవంతమగు పదార్థమునకు ప్రతిబింబము రూపవంతమగు పదార్థమునందు సంభవించును; నీరూపపదార్థమునకు నీరూపపదార్థమునందు ప్రతిబింబము సంభవింపదు? అదియు నియమము లేదు. ఏలయన—రూపరహితాకాశమునందు రూపరహితశబ్దముయొక్క ప్రతిబింబము పూర్వమే చెప్పియున్నాము.

ఈరీతిగా బుద్ధి, బుద్ధియందలి ఆభాసుఁడు, మఱియు బుద్ధి కధిష్ఠానమగు చైతన్యము ఈమూఁడింటికి పేరు జీవుఁడు. ఆజీవుఁడు త్వంపదమునకు వాచ్యుఁడుగా నున్నాఁడు; దానియందు బుద్ధి సహితచిదాభాసత్యాగము చేసినపుడు ఏ కేవల కూటస్థుఁడు శేషించునో, వానిని త్వంపదమునకు లక్ష్యమందురు. అట్లె అహంశబ్దమునకు వాచ్యుఁడు జీవుఁడు, మఱియు లక్ష్యుఁడు కేవల కూటస్థుఁడుగా నున్నాఁడు.

బుద్ధిసహితచిదాభాసుఁడు, మఱియు కూటస్థుఁడు గూడి జీవుఁడనినను, పుణ్యము, పాపము, మఱియు పుణ్యపాపఫలమైన

సుఖదుఃఖములు, మఱియు ఏతల్లోకలోకాంతరములందు గమనాగమనములు ఇవియాదిగా సకలములును జీవత్వాధర్మములు సాభాసబుద్ధియం దున్నవి; కూటస్థునియందు లేవు.

కేవలభ్రాంతివలన జీవత్వధర్మములు కూటస్థునియందు ప్రతీతమగుచున్నవి; ఆభ్రాంతిజన్యప్రతీతియును బుద్ధిసహితాభాసునకగుచున్నది; కూటస్థునకుఁ గానేరదు. ఏలయన—కూటమనఁగా కమ్మరిదాగిలి, దానివలె నిర్వికారరూపముగా నుండువానిని కూటస్థుఁ డందురు; లేక కూటమనఁగా మిథ్యయైన బుద్ధిసహిత చిదాభాసుఁడు; వానియందు అసంగరూపముగా నుండువానిని కూటస్థుఁ డందురు; కాఁబట్టి కూటస్థునియందు భ్రాంత్యాదికము ఘటిల్లదు; మఱేమనఁగా—భ్రాంత్యాదికము బుద్ధిసహితమయిన చిదాభాసునియందే ఘటిల్లుచున్నది.

అత్యంతవిచారమున చూచినట్టయిన పుణ్యపాపాదిధర్మములు కేవలబుద్ధియందున్నవి; ఆభాసునియందును లేవు; బుద్ధిసంయోగమువలన ఆభాసునియందు ప్రతీతమగుచున్నవి. చూడుము—జలసహితమైన ఘటము పొరలును, ఏటిపాలగును, సరిగానుండును, పోవును, వచ్చును; ఇట్లుండఁగా తత్సంబంధమువలన వ్యోమాభాసము సంపూర్ణక్రియలను చేయుచున్నట్లు కనఁబడును; అయినను అది స్వతంత్రముగా ఏమియు చేయదు. అట్లు కామకర్మరూపమైన జలమువలన పూరితమయిన బుద్ధిరూపఘటము పుణ్యపాపాది సంపూర్ణవికారమును ధరించుచుండఁగా తత్సంబంధమువలన చిదాభాసుఁడు ధరించినట్లు కనఁబడును. కూటస్థుఁడో, సర్వవికారరహితుఁడుగా నున్నాఁడు. ఎట్లు జలపూరితఘటసంబంధ సకలవికారరహితముగా ఘటాకాశ

మున్నదో, తన్నాశ్రయమున కూటస్థుఁడు బుద్ధిరూపఘటసంబంధి సకలవికారరహితుఁడుగా నున్నాఁడు; అని తెలియవలెను.

ఈరీతిగా జీవత్వముయొక్క సకలధర్మములు చిదాభాసునియందు స్థూలదృష్టివలన కనఁబడుచున్నవి; కూటస్థునియందో, కేవలభ్రాంతివలన [1] ప్రతీతమగుచున్నవి. [కూటస్థునియందు జీవత్వధర్మము చూచుటకన్న గొప్పభ్రాంతి ఎక్కడను లేదు. చిదాభాసునియందు జీవత్వధర్మము కనఁబడుటకు సామాన్యభ్రాంతి చాలు.]

[అన్యప్రకారముచే జీవస్వరూపము]

పైన ఏ జీవస్వరూపము వర్ణింపఁబడెనో, దానియందు ప్రాజ్ఞునియొక్క హాని యగును. ఏలయన—సుషుప్త్యభిమానియగు జీవుని పేరు ప్రాజ్ఞుఁడు; ఆసుషుప్తియందు బుద్ధికి అభావమగుచున్నది; దానివలన అచ్చట ఆబుద్ధియందు ఆభాసము ఘటిల్లదు; అప్పుడు ప్రాజ్ఞస్వరూప ప్రతిపాదకమైన శాస్త్రమునకు విరోధమగును; ఇందుకొఱకు జీవునిస్వరూపము వేఱుప్రకారమున ప్రతిపాదించుచున్నాము—

---

1 ఎట్లు లోహకటాహమునందలి కాచినతైలమునందు ఆకాశప్రతిబింబమగును; అచ్చట అగ్నితాపము తైలమునకే అగుచున్నది; తద్గతమైన ఆకాశప్రతిబింబమునకు కానేరదు; అప్పుడు తైలపూరితకటాహస్థితమైన ప్రతిబింబముయొక్క అధిష్ఠానరూపమైన బింబాకాశమునకు ఎచ్చటనుండి యగును? అట్లు పుణ్యపాపాదిరూపమైనసంసారము కేవలబుద్ధియందున్నది; ఆభాసునందును లేదు; అప్పుడు వీనియధిష్ఠానమైన కూటస్థునియందు ఎచ్చటనుండియగును? కూటస్థునియందు ప్రతీతియగుట కేవలభ్రాంతియే.

అజ్ఞానాంశమునకు పేరు వ్యష్ట్యజ్ఞానము, సంపూర్ణాజ్ఞానమునకు పేరు సమష్ట్యజ్ఞానము; ఆ అజ్ఞానాంశమందుండు చిదాభాసుఁడు మఱియు అజ్ఞానాంశాధిష్ఠానమైనకూటస్థుఁడు ఈ రెంటికిని పేరు జీవుఁడు; ఈపక్షమందు ప్రాజ్ఞాభావము గానేరదు. ఏలయన—సుషుప్తియందు అజ్ఞానమున్నది; అదియే జాగ్రత్తయందు ప్రతిబింబసహితబుద్ధిరూపమును పొందుచున్నది; ఆ చిదాభాససహితబుద్ధియందు పుణ్యపాపాదిసంసారము ప్రతీతమగుచున్నది. ఈయభిప్రాయముచేతనే శాస్త్రంబునందు జీవుని యుపాధి బుద్ధియని వర్ణింపఁబడినది; విచారదృష్టిచేతనో, జీవుని యుపాధి అజ్ఞానముగా నున్నది.

## 118. ఈశ్వరస్వరూపవర్ణనము

మాయయందుండు [1] చిదాభాసుఁడు, మాయాధిష్ఠానచైతన్యము ఈ రెండునుగూడి ఈశ్వరుఁడందురు. ఆయీశ్వరుఁడు

---

1 మాయయందుండు బుద్ధివాసనయందుఁ గలుగు చైతన్యప్రతిబింబము ఈశ్వరుఁడని శ్రీవిద్యారణ్యస్వాములు చెప్పియున్నారు. ఈశ్వరుఁడు మేఘాకాశముతో సమానమగుటయందు మేఘమునకు సమానము మాయ, మేఘజలసమానము బుద్ధివాసన, ఆ బుద్ధివాసనారూపజలమునందుండు ఆకాశప్రతిబింబసమానము చైతన్యప్రతిబింబము దానిని ఈశ్వరుఁడని చెప్పుటవలన ఏదోషము లేదు. ఏలయన—మాయారూపాజ్ఞానమే ఈశ్వరభావమునకు ఉపాధియైనను బుద్ధివాసన ఆయజ్ఞానమునందు అంతర్గతమై ఉన్నది. సర్వజ్ఞత్వమునకు కారణము అజ్ఞానముయొక్క సత్త్వగుణము. ఆసత్త్వగుణమే జ్ఞానరూపమైన బుద్ధికిని ఉపాదానకారణమగుటవలన సుషుప్తిరూపమయిన ప్రళయమునందు ఈశ్వరునిబుద్ధి సత్త్వగుణద్వారమున పరమోపాదానమైన అజ్ఞానమునందు లయమై ఉపాదానరూపమయ్యేయున్నది. ఉపాదానరూపమై

మేఘాకాశముతో సమానుఁడు; ఆయీశ్వరుఁ డంతర్యామి; ఏల యన— సర్వముయొక్క అంతరమును ప్రేరణ చేయుచున్నాఁడు. ఆయీశ్వరుఁడు సదాముక్తుఁడు; ఏలయనఁగా— వానికి తన స్వరూపమందు ఆవరణము లేమివలన జననమరణాదిబంధప్రతీతి లేదు. ఆయీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు; [సర్వపదార్థముల నెఱిఁగిన వాఁడు] ఏలయనఁగా— ఈశ్వరవిశేషణమైనమాయయందు శుద్ధ సత్త్వగుణమున్నది.

తమోగుణరజోగుణములచే తగ్గునట్టి సత్త్వగుణము శుద్ధసత్త్వము గాదు; మఱేమనఁగా— రజోగుణతమోగుణము లను దమించునట్టి సత్త్వగుణము [1]శుద్ధసత్త్వమనఁబడును. సత్త్వ గుణమువలన జ్ఞానోత్పత్తి యగును; గనుక సత్త్వగుణము ప్రకాశస్వభావము గలదిగా నున్నది; ఇట్టి సత్త్వగుణవంతమగు మాయయందుండు చిదాభాసునకు స్వరూపమునందు, లేక అన్య పదార్థములందు ఆవరణము సంభవింపదు; అందువలన వాఁడు నిత్యముక్తుఁడు, వాఁడు సర్వజ్ఞుఁడు. [స్వరూపమునందు ఆవ రణము లేమివలన నిత్యముక్తుఁడు, ఇతరపదార్థములందు ఆవర ణము లేమివలన సర్వజ్ఞుఁడు ]

---

యందుండునదే సూక్ష్మసంస్కార మనఁబడును ; ఈసంస్కారమే వాసన యనఁ బడును. ఈవిధముగా అజ్ఞానమందుండు సత్త్వాంశమునకు అన్యమైన వాసన లేమివలన బుద్ధివాసనాశబ్దమువలన అజ్ఞానమందుండు సత్త్వాంశమే గ్రహింపఁ దగినది.

1 ఎట్లు బ్రాహ్మణుఁడైన ఒకరాజు క్షత్రియశూద్రజాతివారైన ఇద్దఱు మంత్రులచేత తాను అడఁగిపోఁడో, మఱేమనఁగా— వారినిద్దఱిని తా నడఁచునో, అట్లు రజోగుణతమోగుణములచేత అడఁగిపోక ఈరెంటిని తాను అడఁచునట్టి ఏసత్త్వగుణము గలదో, అది శుద్ధసత్త్వగుణ మనఁబడును.

అధిష్ఠానమైనచైతన్యమో, జీవునియందును, ఈశుని యందును బంధమోక్షభేదరహితముగాను, ఆకాశన్యాయమున ఏకరసముగాను ఉన్నది. అయినను ఆభాసాంశమందు బంధమోక్షములు ఉన్నవి; అవి ఆభాసునకు భ్రాంతిబలముచే అధిష్ఠానమందు ప్రతీతము లగుచున్నవి. వీనియందు ఇంత భేదమున్నది—ఏ చిదాభాసునియందు ఆవరణమున్నదో; వాని యందు బంధమున్నది. మఱియు నెవనియందావరణము లేదో, వానియందు మోక్షమున్నది.

ఈశ్వరునియందు ఆవరణము లేమివలన ఈశ్వరసంబంధి చిదాభాసుఁడు నిత్యముక్తుఁడు, జీవునియందు ఆవరణముండుట వలన జీవసంబంధి చిదాభాసుఁడు బద్ధుఁడు ఏలయన— ఏ అవిద్యాంశమందుండు చైతన్యాభాసుని జీవుఁడందురో, ఆ అవిద్యకు ఆవరణస్వభావము గలదు. యద్యపి మాయ, అజ్ఞానము, అవిద్య ఈ పేళ్లు ఒకేవస్తువునకు ఉన్నవి; తథాపి శుద్ధసత్త్వగుణము యొక్క ప్రధానతవలన మాయ యందురు; మలినసత్త్వగుణ ప్రధానతవలన అజ్ఞానము, లేక అవిద్యయందురు.

రజోగుణతమోగుణములచేత ప్రతిబద్ధమైన సత్త్వగుణమును [1] మలినసత్త్వగుణ మందురు; అందువలన తమోగుణ రజోగుణము అధికమగుటవలన అవిద్యయందు ఏ జీవరూపాభాసాంశము గలదో, దానికి అవిద్య స్వరూపావరణము చేయుచున్నది.

---

1 ఎట్లు శూద్రజాతివారైన ఇద్దఱు రాజపుత్రులచేత బ్రాహ్మణజాతి వాఁడు ఒకఁడు మంత్రి అడఁగిపోవునో, అట్లు రజోగుణతమోగుణములచేత అడఁగిన సత్త్వగుణమును మలినసత్త్వగుణ మనఁబడును.

ఈప్రకారముగా జీవునియందు బంధమున్నది; ఈశుని యందు లేదు.

అధిష్ఠానచైతన్యసహితమైన మాయయందు ఏ ఆభాస రూపుఁడైన ఈశ్వరుఁడుగలఁడో, వాఁడు "తత్" పదమునకు వాచ్యుఁడు; మఱియు కేవలాధిష్ఠానచైతన్యము "తత్" పదమునకు లక్ష్యము.

ఆయీశ్వరుఁడే జగదుత్పత్తిపాలనసంహారములకు కర్తగా నున్నాఁడు. ఇట్లు సకలశాస్త్రంబునందు చెప్పఁబడియున్నది; దాని కభిప్రాయ మేమనఁగా—ఈశ్వరసంబంధిచైతన్యాంశము ఆకాశ న్యాయమున అసంగము; ఆభాసుఁడు జగదుత్పత్త్యాదికమునకు కర్తగానున్నాఁడు. వాఁడే సర్వజ్ఞుఁడు, వాఁడే భక్తజనులమీఁద అనుగ్రహము చేయువాఁడు; మఱియును ఏ ఐశ్వర్యమున్నదో, అది కేవలాభాసునియందే యున్నది. చైతన్యాంశము సదా ఏక రసము, అసంగము దానియందు సత్తాస్ఫూర్తిమాత్రముదప్ప వేఱే ఐశ్వర్యము లేనేలేదు.

## 119. బ్రహ్మస్వరూపవర్ణనము

బ్రహ్మాండమునకు అంతరమందు, బాహిరమందు మహా కాశన్యాయమున ఏ పరిపూర్ణచైతన్యమున్నదో, దానిని బ్రహ్మ మందురు. ఆ బ్రహ్మము సమీపము గాదు; దూరమును గాదు. వలయనఁగా—ఏవస్తువు తనకన్న భిన్నముగునో, మఱియు, దేశ రూపోపాధియుంతముగునో, దానిని సమీపము, లేక దూర మన వలయును; బ్రహ్మమో, తనకన్న భిన్నము గాదు; మఱియు సర్వ మునకు ఆత్మ యగుటవలన దేశాదిపరిచ్ఛేదోపాధిరహితముగనున్నది. అందువలన దానిని సమీపము, లేక దూరము అనుట ఘటిల్లదు.

బ్రహ్మశబ్దమునకు వాచ్యము సోపాధికము. ఏలయన— వ్యాపకవస్తువునకు పేరు బ్రహ్మము; ఆ వ్యాపకత రెండువిధము లుగానున్నది— మొదటిది ఆపేక్షికవ్యాపకత, రెండవది నిరపేక్ష వ్యాపకత—

(1) ఏవస్తువుకొన్ని పదార్థములయొక్క అపేక్షవలన వ్యాప కమగునో, మఱియు కొన్నిటియొక్క అపేక్షవలన పరి చ్ఛిన్నమగునో; దానియందు ఆపేక్షికవ్యాపకతచెప్ప బడినది. ఎట్లనఁగా—పృథివ్యాదులయొక్క అపేక్ష వలన మాయ వ్యాపకము; మఱియు చైతన్యాపేక్ష వలన పరిచ్ఛిన్నముగ నున్నది.

(2) ఏవస్తువు సర్వాపేక్షచేత వ్యాపకమగునో, దాని యందు నిరపేక్షవ్యాపకత చెప్పఁబడినది. చైతన్య ముతో సమానములేక చైతన్యమునకన్న అధికము ఇతరపదార్థము వ్యాపకము లేదు; ఏలయనఁగా— చైతన్యమేసర్వమునకన్న అధికవ్యాపకముగనున్నది.

ఇట్టి రెండుప్రకారములవ్యాపకతతోఁగూడిన వీవస్తువు న్నదో, అది బ్రహ్మపదమునకు వాచ్యము; ఆరెండుప్రకారముల వ్యాపకత మాయావిశిష్టచైతన్యమందున్నది. ఏలయన—విశిష్ట మందు ఏ మాయాంశమున్నదో,దానియందు సాపేక్షవ్యాపకత, మఱియు చైతన్యాంశమందు నిరపేక్షవ్యాపకత యున్నది.

యద్యపి మాయ చైతన్యమునకు [1] ఏకదేశమందున్నది; మాయావిశిష్టచైతన్యముకన్న శుద్ధచైతన్యముయొక్క వ్యాపక

---

1 ఘటమును పుట్టించునట్టి శక్తి సకలమృత్తికయందును లేదు ; ఏక

కత అధికము; అందువలన శుద్ధచైతన్యమందే నిరపేక్షవ్యాపకత సిద్ధమగుచున్నది; మాయావిశిష్టమందు లేదు; తథాపి ఆమాయా విశిష్టచైతన్యముపరమార్థదృష్టివలనశుద్ధచైతన్యముకన్నభిన్నము గాదు. అది శుద్ధరూపమే; ఈయభిప్రాయమువలన మాయావిశిష్ట మందుండు చైతన్యాంశమందు నిరపేక్షవ్యాపకత చెప్పఁబడినది. [ఉక్తాభిప్రాయముదక్క ప్రకారాంతరమున అర్థము చేసి, మాయావిశిష్టమందుండు చైతన్యాంశమునందు నిరపేక్షవ్యాప కత అనుట ఉపహాసాస్పదముగ నున్నది.]

ఈవిధముగా మాయావిశిష్టచైతన్యము బ్రహ్మపదము నకు వాచ్యము, మఱియు శుద్ధచైతన్యము బ్రహ్మపదమునకు లక్ష్యముగ నున్నది.

ఉక్తప్రకారముగాఁ జూచినయెడల ఈశ్వరశబ్దము, మఱియు బ్రహ్మశబ్దము ఈరెంటికిని సమానముగానె అర్థప్రతీతి యగుచున్నది; భిన్నార్థప్రతీతి గానేరదు. మఱియు పురాణము నందు పలుమాఱు ఈయభిప్రాయమువలననె ఈశ్వరస్థానంబునందు బ్రహ్మశబ్దవ్యవహారము చేయఁబడినది; అట్లయినను బ్రహ్మశబ్దము నకు ఇది స్వభావము—అది అధికస్థానంబునందు లక్ష్యార్థమును, న్యూనస్థానంబునందు వాచ్యార్థమును బోధించుచున్నది; ఈశ్వర శబ్దమున కిది స్వభావము—అది అధికస్థానంబునందు వాచ్యార్థ

---

దేశమందు [జిగటమంటియందు] మాత్రము గలదు. దీనివలె మాయయుఁ బ్రహ్మంబునందు సర్వత్రవ్యాపింపక ఏకదేశమునం దున్నది.

[ఆ ఏకదేశస్థితమయిన మాయాచక్రంబునందే ఒక ఈశ్వరుఁడును అనేకజీవులును, ఘటపటాదిసకలప్రపంచమును అన్నియుఁ వర్తించుచున్నవి; అని ఎఱుఁగవలెను.]

మును, న్యూనస్థానంబునందు లక్ష్యార్థమును బోధించుచున్నది. ఈ భేదమువలన వాచ్యార్థలక్ష్యార్థన్యూనాధికబోధకశక్తిచే బ్రహ్మశబ్దార్థము ఈశ్వరశబ్దార్థముకన్న భిన్నముగా చెప్పఁబడినది. ఇది కేవలశబ్దమాహాత్మ్యమే. 1.

---

1. సంగ్రామమునందు విజయియై లంకాపట్టణమువదలి సముద్రమును దాటి శ్రీరామేశ్వరమునకు వచ్చినవెనుక ఒకనాఁడు భగవంతుఁడైన శ్రీరామచంద్రుఁడు ఏకాకిగా విహారార్థము సముద్రతటమునఁ దిరుగుచుఁ దిరుగుచు సముద్రజలముమీఁద రచితమైన సేతుబంధసముఁ జూచి, విస్మయావిష్టుఁడై తనమనస్సులో అనుచున్నాఁడు—ఆహాహా! నా నామమాహాత్మ్యము ఎంత ఉండవలయును! స్వభావముగ జలమునందు మునుగునట్టి రాళ్లు జలముమీఁద తేలుచున్నవి; నా నామమాహాత్మ్యము ఇంత ఉండినపుడు నాహస్తమాహాత్మ్యము ఎంతఉండవలెను? నానామముకన్నను ఎక్కువగా ఉండవలెను; నామమాహాత్మ్యముచే రాళ్లుతేలి జలముతో సంలగ్నముగ నున్నవి; హస్తమాహాత్మ్యముచే నీళ్లపైన పదిబారలు ఉండవలెనేమొ ప్రత్యక్షానుభవము చూడవలెనని మనస్సులో నిశ్చయించి, ఒకచిన్నరాయి చేతితో తీసికొని, సముద్రమునందు విడిచెను; విడుచుటయు ఆ రాయి తత్కాలము మునుగుచున్నది; అపుడు పరమలజ్జితుఁడై ఈచరిత్రము ఎవ్వఁడేని చూచుచున్నాఁడేమోయని తనచుట్టునలువంకలను జూచెను; చూడగా ఆంజనేయుఁడు వెనుకనే యున్నాఁడు. అప్పుడు శ్రీరాముఁడు ఖిన్నముఖముచే ఆంజనేయుని ఇట్లడిగెను—అయ్యా! ఆంజనేయా! ఇప్పుడు ఏచరిత్రము నీవు చూచితివో, అది ఎవ్వనికైన చెప్పెదవా యేమి? అంతట ఆంజనేయుఁ డనుచున్నాఁడు—ఔనౌను నేను చెప్పెదను! మరల శ్రీరాముఁడు అడుగుచున్నాఁడు—ఏమని చెప్పెదవు? ఆంజనేయుఁ డనుచున్నాఁడు—శ్రీరాముని, చేతితో వేయఁబడిన రాయి మునుగుచున్నది. శ్రీరాముఁడు దీనముఖముచే ప్రార్థించుచున్నాఁడు; అయ్యా! అట్లు చెప్పినట్టయిన నాకు అపకీర్తి యగును; అపుడు బుద్ధిమద్వ

**120.** 108 గతప్రశ్నకుత్తరము—120—121
కూటస్థుఁడు ప్రకాశవంతుఁడు ఆభాసుఁడుభోగి.

ఓశిష్యుఁడా! ఇప్పుడు నాల్గువిధములుగా చైతన్యము

---

రిష్ఠుఁడైన ఆంజనేయుఁడు శ్రీరాముని దీనముద్రఁ జూచి పరమభక్తితో అనుచున్నాఁడు—

ఓరామభద్రా! నీకపకీర్తిగాక నీవువిడిచినవానికి అపకీర్తి యగునట్టి ప్రకారముగ ప్రసిద్ధము చేసెదను; శ్రీరాముఁ డడుగుచున్నాఁడు—ఎట్లు? ఆంజనేయుఁ డనుచున్నాఁడు—నా శ్రీరాముఁడు తనచేతితో ఎవ్వని విడుచుచున్నాఁడో, వాఁడు సముద్రమునందు మునుగుచున్నాఁడు.

తనభక్తజనులను, తనశత్రుజనులను పరమాత్మ ఉద్ధరించుచున్నాఁడను నీసంగతి పురాణమునందు ప్రసిద్ధముగ నున్నది; గాని, ఉదాసీనజనులను ఉద్ధరించుచున్నాఁ డనువార్తమాత్రము ఎక్కడను వినఁబడలేదు; దానివలన తెలియఁబడినదేమనఁగా—ఉదాసీనుని మాత్రము పరమాత్మ చేతితో విడుచుచున్నాఁడు; వాఁడు భవసముద్రమునందు మునుఁగుచున్నాఁడు. [ఆశీర్వాదనిమిత్తముచే భక్తునితో హస్తసంబంధము, మఱియుఁ దాడననిమిత్తముచే శత్రువుతో హస్తసంబంధము కలుగుచున్నది; ఉదాసీనునితో ఏప్రకారమును చేతను హస్తసంబంధము సంభవింపదు; కనుక పరమాత్మునియొక్క హస్తము జాఱువిడిచినట్లు ఉదాసీనుని విడుచునట్లు ఉన్నది; వాఁడు క్షారసముద్రమున జాఱువలె భవసముద్రమున మునుఁగుచున్నాఁడు.

ఈయాంజనేయుని బుద్ధిచాతుర్యముఁజూచి, శ్రీరాముఁడు హర్షనిర్భరుఁడై ఆంజనేయుని స్తుతిచేయ నారంభించెను.

సారాంశము—అర్థము ఒకటిగా నుండినను శబ్దమాహాత్మ్యముచే అభిప్రాయము వేఱుగా కనఁబడుచున్నది; మాయావిశిష్టచైతన్యమను అర్థము ఒక్కటిగా నుండినను బ్రహ్మశబ్దమాహాత్మ్యముచే, ఈశ్వరశబ్దమాహాత్మ్యముచే పైఁజెప్పినప్రకారముగ అభిప్రాయము వేర్వేఱుగ కనఁబడుచున్నది.

ఏది చెప్పఁబడినదో, వానిలో జీవస్వరూపమందు ఏ మిథ్యాభాసాంశము గలదో, అదే పుణ్యపాపములకు కర్త, మఱియు వాని ఫలమగు సుఖదుఃఖములకు భోక్తగా నున్నది; కూటస్థుఁడైన చైతన్యము కేవలశివరూపముగానే యున్నది; అందువలన "బుద్ధిరూపవృక్షమునందు పక్షులు రెండు గలవు; మొదటిది పరమాత్మ, రెండవది జీవుఁడు." అనునీ ప్రకారముగ నీవు ఏ ఆక్షేపము చేసితివో, దానికి ఉత్తరము ఇట్లు ఎఱుఁగుము—ఈస్థానమందు పరమాత్మయొక్కయు, జీవునియొక్కయు గ్రహణము చేయఁగూడదు; మఱేమనఁగా—కూటస్థునియొక్కయు, ఆభాసునియొక్కయు గ్రహణము చేయవలయును; వానిలో కూటస్థుఁడు ప్రకాశవంతుఁడు; ఆభాసుఁడు భోగి.

### 121. ఆభాసుఁడు కర్మచేయువాఁడు ఆభాసుఁడు ఫలమిచ్చువాఁడు.

జీవునిస్వరూపమందు ఏ ఆభాసాంశముగలదో, అదే కర్మమునకు కర్త, అదే తత్ఫలమునకు భోక్తగా నున్నది; మఱియు ఈశ్వరునిస్వరూపమందు ఏ ఆభాసాంశము గలదో, అదే కర్మఫలమునకు దాతగా నున్నది. దేహళీదీపన్యాయమున [కడపమీఁదనుంచినదీపము అంతర్బహిర్దేశములందు ప్రకాశించును; ఆదృష్టాంతముగా] ఆభాసుఁడే కర్త, ఆభాసుఁడే దాత. అనఁగా—రెంటికిని చైతన్యాంశమందైననో, కర్తృత్వ దాతృత్వ భోక్తృత్వరూప యోగ్యత ఏమియు లేదు. [జీవస్థచైతన్యమందు కర్తృత్వ భోక్తృత్వయోగ్యత లేదు; ఈశ్వరస్థచైతన్యమందు దాతృత్వయోగ్యత లేదు.]

ఆయాచైతన్యమునందు ఎవఁడు కర్తృత్వభోక్తృత్వ దాతృత్వ మంగీకరించునో, వాఁడు మూర్ఖుఁడు. ఏలయన—భిన్న భిన్న యోగ్యత అయినప్పుడు ఉభయచైతన్యమునందు పరస్పర భేదము సిద్ధమగును. చైతన్యమో, రెంటియందును అసంగము, ఏకరూపము. చైతన్యమందు భేదము ఎచ్చటను లేదు; ఇట్లుండఁగా ఎవ్వఁడు జీవచైతన్యముతో ఈశ్వరచైతన్యమునకు, లేక ఈశ్వరచైతన్యముతో జీవచైతన్యమునకు భేద మంగీకరించునో, వాఁడు కుజనుఁడు. వాఁడే నిందనీయుఁడుగా నున్నాఁడు.

ఇట్లు చెప్పుటచే నీవుచేసిన ఇంకొక్క ప్రశ్నకును ఉత్తరము అగుచున్నది. ఆ ప్రశ్న యేమనఁగా—"జీవేశ్వరులకు ఏకత అంగీకరించుటవలన కర్మోపాసనా ప్రతిపాదకమైన వేదము నిష్ఫలమగును?" పై జెప్పినరీతిగా జీవేశ్వరులకు చైతన్యభాగమందు అభేదముండినను ఆభాసభాగమందు పరస్పర భేదముండుట వలన రెండు ప్రకారములమాటయు సిద్ధమగుచున్నది.

### 122. 109 గత ప్రశ్నకుత్తరము—జీవబ్రహ్మల లక్ష్యార్థమున కభేదము

శిష్యుఁడా! నీవుచేసిన ఇంకొక ప్రశ్న యేమనఁగా— "ఒకవృక్షముమీఁద రెండుపక్షులున్నవి; మొదటిది భోగి, రెండవది అసంగము. ఇట్టి ఆ జీవబ్రహ్మలయేకత ఘటిల్లదు?" దానికి సమాధాన మేమనఁగా—ఈస్థానమందు జీవబ్రహ్మల గ్రహణము చేయఁగూడదు; మఱేమనఁగా—కూటస్థాభాసుల యొక్క గ్రహణము చేయవలయును. అదే తమలోతాము ఘటాకాశము, ఆకాశప్రతిబింబము న్యాయమున పరస్పరభిన్నములుగా నున్నవి.

నీవు చెప్పిన రెండవ ప్రశ్నయేమనఁగా—“జీవుఁడు కర్మో పాసన చేయువాఁడు, మఱియు పరమాత్మ ఫలమిచ్చువాఁడు; వీరికి ఏకత ఘటిల్లదు?” దానికి చెప్పిన యుత్తరమేమనఁగా—కర్మ చేయువాఁడు జీవుఁడుగాఁడు, మఱియు ఫలమిచ్చువాఁడు ఈశ్వరుఁడుగాఁడు; కర్త, దాత లైయెనవో, వారియందుండిన ఆభాసాంశములుగా నున్నవి; చైతన్యాంశములందు ఘటాకాశ మహాకాశన్యాయమున కర్తృత్వముయొక్కయు, దాతృత్వము యొక్కయు, పరస్పర భేదముయొక్కయు లేశమును లేదు.

ఓశిష్యుఁడా! ఉక్తప్రకారముగా జీవబ్రహ్మాలయేకత ఘటిల్లినది; కనుక ఓవివేకచూడామణీ! “అహం బ్రహ్మాస్మి” అని నీ వెఱుఁగుము; దానిలో “అహం” శబ్దమునకు లక్ష్యార్థము ఘటాకాశముతో సమానమైన కూటస్థుఁడని ఎఱుఁగుము; మఱియు “బ్రహ్మ” శబ్దమునకు లక్ష్యార్థము మహాకాశముతో సమానమైన వ్యాపకచైతన్యమని ఎఱుఁగుము. అహం శబ్దముయొక్కయు, బ్రహ్మశబ్దముయొక్కయు వాచ్యార్థమునందు పరస్పరాభేదము లేమియు గలదు; అయినను లక్ష్యార్థమందు అభేదముగలదు.

ఓశిష్యుఁడా! ఎదివఱకు నీవు “అహం బ్రహ్మాస్మి” అని ఎఱుఁగవో, అదివఱకు నీవు నిన్ను దీనుఁడని ఎంచుకొందువు, దుఃఖి యనుకొందువు; మఱియు పరమాత్మను నీకన్న భిన్నముగా తెలియుదువేని వాఁడు నీకు భయహేతువగును; కాఁబట్టి నేను బ్రహ్మకన్న భిన్నుఁడగాను బ్రహ్మముగానే యున్నాను అని ఎఱుఁగుము.

**123. ప్రశ్న—అహం బ్రహ్మమనుజ్ఞానమెవ్వనికగును?**

ఓభగవంతుఁడా! నీవు కృపచేసి, తెలుపుము—అహం

బ్రహ్మాస్మి అనుజ్ఞాన మెవ్వనికగును? ఈస్థానమందు శిష్యుని చిత్తమున ఈగూఢాభిప్రాయము గలదు—

నేను బ్రహ్మము; ఇట్టి జ్ఞానము కూటస్థునకగునా? లేక బుద్ధిసహితాభాసునకగునా? కూటస్థునికి చెప్పినయెడల కూటస్థుఁడు వికారియగును, మఱియు బుద్ధిసహితాభాసునకు చెప్పినయెడల వానికి నేను బ్రహ్మము అనునిట్టి జ్ఞానము భ్రాంతిరూపమగును. ఏలనఁగ—మీరు పూర్వము అనియుంటిరి—కూటస్థునకును, బ్రహ్మమునకును ఏకత యున్నది; ఆభాసుఁడుమాత్రము భిన్నుఁడు; కావున బ్రహ్మముకన్న భిన్నుఁడైన ఏ ఆభాసుఁడు గలఁడో, వానియొక్క అహంబ్రహ్మారూపజ్ఞాన మేదిగలదో, అది భ్రాంతిరూపమగును.ఎట్లనఁగా—రజ్జువుకన్న భిన్నమైన సర్పమునకు తానురజ్జురూపమనుజ్ఞానము భ్రాంతిరూపమగును.మఱియు ఒకానొకప్పుడు "అహంబ్రహ్మాస్మి" అను భ్రాంతిరూపజ్ఞానమును మీరు అంగీకరించినయెడల ఈభ్రాంతిరూపజ్ఞానమువలన జగన్నివృత్తి గానేరదు; అది యథార్థజ్ఞానమువలనఁ గావలయును; ఎట్లనఁగా— రజ్జువుయొక్క యథార్థజ్ఞానమువలన మిథ్యాసర్పముయొక్క నివృత్తి యగుచున్నది.

## 124. 123 గతప్రశ్నకుత్తరము—ఆభాసుని సప్తావస్థలనామములు. 121—129

ఓశిష్యుఁడా! ఆభాసునకు సప్తావస్థలున్నవి—మొదటిది అజ్ఞానము, రెండవది ఆవరణము, మూఁడవది భ్రాంతి, నాలుగవది పరోక్షజ్ఞానము, ఐదవది అపరోక్షజ్ఞానము; ఆఱవది శోకనాశము, ఏడవది అతిహర్షము. ఈసప్తావస్థలందు ఏ అవస్థయు

కూటస్థునిది గాదు; "అహంబ్రహ్మాస్మి" అనుజ్ఞానమును ఈవిధింటికి లోనై[1] గలదు.

---

1 దశమునికథయందు సప్తావస్థలను చూడఁడుము—

(1) దశముఁడు తన్నువిడిచి, తక్కిన తొమ్మండ్రను గణించి, తాను దశముఁడని యెఱుఁగకుండుట అజ్ఞానము.

(2) దశముఁడు లేఁడు ; దశముఁడు కనఁబడఁడు ; అనునది రెండు ప్రకారములుగలది ఆవరణము.

(3) దశముఁడు చచ్చెనని యెంచి,రోదనముచేయుట శోకము. ఇదియే భ్రాంతి, లేక విక్షేపము.

(4) దశముఁడు చావలేదు ; ఉన్నాఁడు ; అని ఆప్తుని వచనమువలన దశముఁడున్నాఁడని తెలియుట పరోక్షజ్ఞానము.

(5) నీవే దశముఁడని ఆప్తునిచే చెప్పఁబడినపుడు తాను దశముఁడని ఎఱుఁగుట అపరోక్షజ్ఞానము.

(6) నేను దశముఁడని తెలిసినపిమ్మట రోదనము నిలుపుట భ్రాంతి నాశము.

(7) తాను దశముఁడని ఎఱుఁగుటవలన అయినసంతోషము అతిహర్షము.

ఈరీతిగా దృష్టాంతమునందు చెప్పఁబడిన దశముని సప్తావస్థలు చిదాభాసవిషయమై మూలగ్రంథమునందు చెప్పఁబడినవి; అచ్చట చెప్పినదానికి ఇచ్చట వివరము చేయఁబడినది. కూటస్థుఁడు అసంగుఁడై, నిర్వికారుఁడై యుండుటవలన ఈ అన్ని అవస్థలు చిదాభాసునకు చెప్పఁబడినవి. ఈసప్తావస్థలందు అజ్ఞానావరణవిక్షేపములు ఈమూఁడు వానికి బంధమునకు కారణములుగాని, మిగిలిననాల్గు మోక్షమునకు కారణములని తెలియవలెను.

## 125. అజ్ఞానావరణముల స్వరూపము

ఓశిష్యుఁడా! "నేను బ్రహ్మమును ఎఱుఁగను" అను వ్యవహారమునకు హేతువు అజ్ఞానము. "బ్రహ్మము లేదు, మఱియు భాసించుటలేదు." అనువ్యవహారమునకు హేతువు ఆవరణము. ఏలయనగా—అజ్ఞానశక్తి రెండువిధములుగనున్నది—మొదటిది అసత్త్వాపాదకము, రెండవది అభానాపాదకము. ఈ రెంటికిని ఆవరణమందురు [వస్తువు లేదు; ఇట్టి ప్రతీతిగలిగించు ఇట్టిశక్తి అసత్త్వాపాదకము; మఱియు వస్తువుయొక్క భానము లేదు; ఇట్టి ప్రతీతి చేయించుశక్తి అభానాపాదకము].

## 126. భ్రాంతివర్ణనము

జన్మము మొదలుకొని ఏ సంసారము గలదో దానికి నిజస్వరూపమందు అనఁగా కూటస్థునియందు ఏ ప్రతీతి గలదో, అది వేదంబునందు భ్రాంతి[1] యని చెప్పఁబడినది; దానినే శోక మందురు.

## 127. పరోక్షాపరోక్ష ద్వివిధజ్ఞానవర్ణనము

"బ్రహ్మము లేదు" అను ఆవరణాంశమును "బ్రహ్మమున్నది" అనునిట్టిపరోక్షజ్ఞానమునశింపఁజేయును. ఏలయన—

---

1 దేహము ప్రాణము, ఇంద్రియములు, అంతఃకరణసహితచిదాభాసము, మఱియు వీనియొక్క జన్మాదికమయిన కేవలధర్మములయొక్క, లేక ధర్మసహితధర్మియొక్క, లేక సంబంధసహితసంబంధియొక్క ఆత్మయందు స్వవిషయసహితప్రతీతి ఏది గలదో, అట్టి ఆత్మసంబంధియైన తాదాత్మ్యసంబంధముయొక్క, లేక సత్తత్వాదిధర్మసంబంధముయొక్క అనాత్మయందు స్వవిషయసహితప్రతీతి ఏది గలదో, దానిని అధ్యాస మందురు. దానినే భ్రాంతి, విక్షేపము, మఱియు శోకము అని యందురు.

"సత్యజ్ఞానానందరూపముగు [1] బ్రహ్మమున్నది" అనునిట్టి జ్ఞానమునకు పేరు పరోక్షజ్ఞానము; అది "బ్రహ్మము లేదు" ఇట్టి ప్రతీతికి విరోధిగా నున్నది; ఇతరమునకుఁ గాదు.

"నేను బ్రహ్మము" ఇట్టి ఏ అపరోక్షజ్ఞానము గలదో అది సకలావిద్యాజాలమునకు విరోధిగా నున్నది; అందువలన "నేను బ్రహ్మము నెఱుఁగను" ఇది అజ్ఞానము; "బ్రహ్మము లేదు; భానము గాదు" ఇది ఆవరణము. "నేను బ్రహ్మముగాను మఱేమనఁగా— పుణ్యపాపములకర్తయు, సుఖదుఃఖములకు భోక్తయు నగు జీవుఁడను" ఇది భ్రాంతి యింతటి ఏ అవిద్యాజాలము గలదో, దానిని నశింపఁజేయుచున్నది.

### 123. భ్రాంతినాశవర్ణనము

నాయందు జన్మమరణములు లేవు, సుఖదుఃఖములయొక్క లేశమును లేదు; సంసారధర్మ మేదియు నాయందు లేదు. ఏలయన—అజన్ముఁడను అనఁగా జన్మరహితుఁడైన ఏ కూటస్థుఁడు గలఁడో, [2] వాఁడే నేను. ఓశిష్యుఁడా! ఈరీతిగా చేయఁబడిన

---

1 చాందోగ్యోపనిషత్తులో భూమవిద్యాప్రసంగమునందు నారదులను గూర్చి శ్రీసనకాదికగురువులు చెప్పియున్నారు—"ఏది భూమయో [పరిపూర్ణమో] అది సుఖరూపము. అల్ప [పరిచ్ఛిన్న] మందు సుఖము లేదు." ఈరీతిగా మహాప్రమాణముచేత సిద్ధమయినది—ఏది అనంతరూపమో, అది భూమయనఁబడును; మఱియు ఏది భూమయో, అది ఆనందరూపమని తెలియవలెను. [ప్రథమతరంగముయొక్క పదియవటిప్పణమునందు బ్రహ్మము ఆనందరూపమని విస్తరముగ ప్రతిపాదింపఁబడియున్నది.]

2 కూటస్థునియందు జన్మనిషేధమగుటచే సకలానర్థముల నిషేధము తెలియవలెను. ఏలయనఁగా—జన్మప్రతీతికి ఉపరంతరమే సకలానర్థముల ప్రతీతి కలుగుచున్నది.

సర్వానర్థనిషేధమే భ్రాంతినాశముయొక్క స్వరూపముగ నున్నది; దానినే శోకనాశ మని యందురు.

## 129. అతిహర్షనిరూపణము

ఓశిష్యుఁడా! ఎప్పుడు నీకు "నేను అద్వయ బ్రహ్మరూపుఁడను" అను నీస్వరూపముయొక్క సంశయరహితమైన జ్ఞానమగునో, అప్పుడు నీకు కలిగెడు ఏ మోదముగునో, దానినే అతిహర్ష మని [1] తెలిసికొనుము.

---

1. ఈహర్షమును శ్రీవిద్యారణ్యస్వాములు నిరంకుశతృప్తి యనుచున్నారు. ఏతృప్తికి పిదప ఇచ్ఛ జనింపదో, దానిని నిరంకుశతృప్తి అనవలయును. విషయానందము ప్రాప్తమయినను అది న్యూనమగుటవలనను, అనిత్యమగుటవలనను దానియందు పలుమారు ఇచ్ఛ అగుటవలన దానిచేత అయినట్టి తృప్తి సాంకుశముగా నున్నది. బ్రహ్మానందముకన్న శ్రేష్ఠమయిన ఇంకొక్క ఆనందము లేమివలనను, అది నిత్యమగుటవలనను దానిచేత అయినట్టితృప్తి నిరంకుశముగా నున్నది. శ్రీపంచదశితృప్తిదీపమునందు బ్రహ్మానందము పొందిన వాఁడైన విద్వాంసుఁ డనుచున్నాఁడు—

కృతకృత్యతయా తృప్తః ప్రాప్తప్రాప్యతయా పునః
తృప్యన్నేవం స్వమనసా మన్యతేఽసౌనిరంతరమ్ 291

భావార్థము—ఈజ్ఞాని పూర్వోక్తప్రకారము కృతకృత్యత్వముచేత తృప్తిని బొందినవాఁడగుచు, ఇఁకఁ జెప్పఁబోయెడి ప్రకారము ప్రాప్తప్రాప్యత్వముచేత తృప్తుఁడగుచు, తనమనస్సుచేత సర్వదా ఈ క్రింద చెప్పబోయెడి ప్రకారముగాఁ దలఁచుచున్నాఁడు—

ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి,
ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మేస్పష్టమ్.

## 130. 123 గత ప్రశ్నకు గూఢాభిప్రాయము ఆభాసునకు నేను బ్రహ్మ మను జ్ఞానము మిథ్య యగును?

అహం బ్రహ్మామనుజ్ఞాన మెవ్వని కగును? అని ప్రశ్నము నూటయిరువదిమూఁడవ యంకమునందు శిష్యుఁడు చేయు

---

భావార్థము—ఆ జ్ఞాని తనమనస్సుచేత నేమితలఁచునో చెప్పుము?

ఉత్తరము—సర్వదా నాయొక్క నిజరూపమగు దేశాకాలాద్యనవచ్ఛిన్నప్రత్యగాత్మను సాక్షాత్తుగా నెఱిఁగితిని; అందువలన నేను కృతార్థుఁడైతిని; అని జ్ఞాని తలఁచుచున్నాఁడు. ఇది ఆత్మలాభనిమిత్తకమగు తృప్తి యగును. మఱియుం బ్రహ్మస్వరూపమగు ఆనందము నాకు స్పష్టముగాస్ఫురించుచున్నది; అందువలన నేను కృతార్థుఁడైతిని, నేను కృతార్థుఁడైతిని; అని జ్ఞాని తలఁచుచున్నాఁడు. ఇది ఆత్మజ్ఞానఫలలాభనిమిత్తకమగుతృప్తియగునని తెలియవలెను.

అవతారిక—ఇట్లు జ్ఞానికి ఇష్టప్రాప్తియందు తృప్తిని తెలిపి, అనిష్టము నివర్తించుటచేఁగూడ తృప్తిని బొందుచున్నాఁడని ఇప్పుడు చెప్పుటకు ఆరంభించుచున్నాఁడు—

> ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య,
> ధన్యోఽహంధన్యోఽహం స్వస్యాజ్ఞానంపలాయితంక్వాపి.

భావార్థము—మఱియుం ఇప్పుడు దుఃఖస్వరూపమగు సంసారమును నేను జూచుచున్నవాఁడను గాను; అందుచేత నేను కృతార్థుఁడైతిని, నేను కృతార్థుఁడైతిని; దుఃఖము తోఁపమికి కారణ మేమనఁగా—నాయొక్క అనేకకర్మవాసనాసమూహముగల అజ్ఞానము నశించెను; అందుచే నేను కృతార్థుఁడైతిని; నేను కృతార్థుఁడైతిని; అని జ్ఞాని తలఁచుచున్నాఁడు.

అవతారిక—ఇప్పుడు అజ్ఞాననివృత్తిఫలంబును, కృతకృత్యత్వంబును, ప్రాప్తప్రాప్యత్వంబును జూపుచున్నాఁడు—

చున్నాఁడు; ఆప్రశ్నయొక్క అభిప్రాయము కొంచెముగా ఆయంకమందే వ్రాసి, దానియొక్క ఉత్తరము ఇదివరకు వ్రాయఁ

ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్.

భావార్థము—మఱియు నాకు చేయఁదగిన కర్మోపాసనాదికము కొంచెమైనను లేనందున నేను కృతార్థుఁడైతిని; నేనుకృతార్థుఁడైతిని;మఱియు పొందఁదగిన ఫలవర్గమంతయు ఇపుడు నాచే పొందఁబడినట్లాయెను; కనుక నేనుకృతార్థుఁడైతిని; నేనుకృతార్థుఁడైతిని; అని జ్ఞాని తలఁచుచున్నాఁడు.

అవతారిక—ఇపుడు కృతకృత్యత్వాదికముచేఁ గలిగిన తృప్తికి నిరతిశయత్వమును జెప్పుచు ఈతృప్తికి మఱియొకటి ఉపమ చెప్పఁదగినది కనఁబడమివలన తృప్తియే సర్వదా స్ఫురించుచున్నదని చూపుచున్నాఁడు—

ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే,
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః.

భావార్థము—మఱియు నాయొక్క తృప్తికిసమానమైన వస్తువెద్దియు లోకమందు లేదు; అందువలన నాతృప్తికి ఉపమ దొరకదు; ఇంత నిరుపమ తృప్తిచే నేను కృతార్థుఁడైతిని; నేను కృతార్థుఁడైతిని. ఈతృప్తికంటె మఱియొకతృప్తి కనఁబడమిచేత నేను కృతార్థుఁడైతిని; నేను కృతార్థుఁడైతిని; అని జ్ఞాని తలఁచుచున్నాఁడు.

అవతారిక—ఈచెప్పఁబడిన సర్వశుభములకును కారణభూతమగు పుణ్యరాశిపరిణామమును స్మరించి, సంతోషించుచున్నాఁడని ఇపుడు చెప్పుటకు ఆరంభించుచున్నాఁడు—

అహో పుణ్యమహో పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్,
అస్య పుణ్యస్య సంపత్తేరహో వయమహో వయమ్. 296

బడినది; ఇపుడు ఆ ప్రశ్నయొక్క పరిశేషమైన గూఢాభిప్రాయము ఈయంకమునందు వ్రాయుచున్నాను. శిష్యుఁ డనుచున్నాఁడు.

---

భావార్థము—అహో! మాపుణ్యము దృఢముగా ఫలించెను; అహో! మాపుణ్యము దృఢముగా ఫలించెను. ఓహో! మేమే! ఓహో! మే మని ఆశ్చర్యముగా జ్ఞాని తలఁచుచు, సంతోషించుచున్నాఁడు.

అవతారిక—ఇపుడు బ్రహ్మజ్ఞానసాధనమగు వేదాంతశాస్త్రంబును ఆశాస్త్రము నుపదేశించినట్టి ఆచార్యుని స్మరించి, సంతోషించుచు, మరల శాస్త్రజన్యజ్ఞానంబును, తత్సుఖములను దలంచి, సంతోషించుచున్నాఁడు—

అహో శాస్త్రమహో శాస్త్ర మహో గురురహో గురుః,
అహో జ్ఞానమహోజ్ఞానమహో సుఖమహో సుఖమ్.

భావార్థము—వేదాంతశాస్త్రము ఓహో! ఎంతమనోహరము! వేదాంతశాస్త్రము ఓహో! ఎంతమనోహరము! ఓహో! మాగురువెంత వాఁడు! ఓహో! మాగురువెంతవాఁడు! ఓహో! అద్వైతాత్మతత్వజ్ఞాన మెంతమంచిది! అని ఇట్లు జ్ఞాని ఆశ్చర్యముగాఁ దలంచుచు, సంతోషించుచున్నాఁడని తెలియవలెను.

"ఆదరాద్ద్విరుక్తిః" "విస్మయాద్ద్విరుక్తిః" అనునీ ప్రకారముగ శాస్త్రంబునందు రెండుస్థలములందు ద్విరుక్తి చెప్పఁబడినది ; కాని ఈరెండుద్విరుక్త లందు పరస్పరము మహాదంతరము వర్తించుచున్నది. చూడుము—ఆదర స్థలమునందు ద్విరుక్తి చెప్పువానియొక్క బుద్ధి స్థిరముగా నుండుటవలన అది ప్రమాణాశ్రితముగ నున్నది. దానివలన ఆదరస్థలమునందు సర్వదా ప్రమాతృ జ్ఞానమే కలుగుచున్నది ; విస్మయస్థలము అట్లుకాదు. విస్మయస్థలమునందు సర్వజ్ఞునిబుద్ధిగూడ స్థిరముగ నుండదు. చూడుము—గోపులవాసిజనులయొక్క భాగ్యమును జూచి, సర్వజ్ఞుఁడైన బ్రహ్మదేవుఁడు విస్మయావిష్టుఁడై నిస్త్రప ముగ వర్తనము చేయుచున్నాఁ డనుసంగతి శ్రీమద్భాగవతమునందు ప్రసిద్ధ ముగ నున్నది—

శ్రీభగవంతుఁడా! మీరు పూర్వము చెప్పితిరి—"కూట
స్థుఁడును, బ్రహ్మమును ఇద్దఱునొక్కటియె; ఆభాసుఁడు బ్రహ్మము

---

అహో భాగ్యమహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్,
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మసనాతనమ్. 1

సారాంశము—విస్మయస్థలమునందు బుద్ధి స్థిరముగామివలన నది ప్రమాణాశ్రితముగ నుండదు; అందువలన విస్మయస్థలమునందు సర్వదా సాక్షిభాస్యజ్ఞానమే కలుగుచున్నది.

మఱియును ఆదరస్థలమునందు సామాన్యాదర ముండినపుడు చేయుము, చేయుము, ఇత్యాదిప్రకారముగ ద్విరుక్తియగుచున్నదని, అత్యంతాదరప్రసంగమునందు చేయుము, చేయుము, చేయుము, ఇత్యాదిప్రకారముగ త్రిరుక్తియగుచున్నదని నియమము గలదు; విస్మయస్థలమందో, ఉక్తియొక్క ఆవృత్తిసంఖ్యకు నియమము కలుగదు.

జీవన్ముక్తవిద్వాంసునకు సంసారదశయందు ఎప్పుడును అనుభవము లేనటువంటిది, ఎప్పుడును వినఁబడనటువంటిది అగు ఉత్తమోత్తమబ్రహ్మానందము ననుభవించుటవలన, జన్మకైదికి అకస్మాత్తుగ సింహాసనముమీఁద కూర్చుండఁబెట్టి, రాజ్యాభిషేకము చేసినట్లు పరమవిస్మయమగుచున్నది. వాఁడు విస్మయావిష్టుఁడై, ద్విరుక్త్యాదికముయొక్క విచారము వదలి, లౌకికలజ్జవదలి, తన అనుభవానుసారముగ, కావలసినట్లు బడబడ [వాక్కుయొక్క ప్రలాపము] చేయుచున్నాఁడు. ఇంకొక్క సర్వజ్ఞుఁడు ఆ ప్రలాపమునకె విద్యానందమని పేరు పెట్టుచున్నాఁడు. ఈ ప్రలాపముమీఁదనే నిరంకుశతృప్తి తెలియఁబడుచున్నది.

వ్యవహారవిద్వాంసులనుగుఱించి, గ్రంథకర్త అనుచున్నాఁడు— ఒక అద్భుతమైన తమాషావచ్చినపుడు రెండురూపాయలు టిక్కెటువెల చేసినను, తాము దరిద్రులుగానుండినను ఆ టిక్కెటు తీసుకొని, తమాషాచమత్కారము

కన్న భిన్నుఁడు;" ఆబ్రహ్మముకన్న భిన్నుఁడైన ఆభాసునకు "నేను బ్రహ్మము" అను బ్రహ్మరూపజ్ఞానము ఘటిల్లదు. నాయధిష్ఠానమగు కూటస్థుఁడు బ్రహ్మరూపుఁడు అనుజ్ఞానము ఆభాసునకయినయెడల అది యథార్థమగును; అయినను నేను బ్రహ్మమను జ్ఞానము ఆభాసునకు అయినయెడల యథార్థముగాదు. ఏలయన—అహం అను తనస్వరూపమునకు వేరు [భాషాభేదముచే నేను అనుచున్నారు] ఆయాభాసునియొక్క స్వరూపము మిథ్య; అందువలననే బ్రహ్మభిన్నమైనది; ఇట్లు బ్రహ్మముకన్న భిన్నుఁడైన ఆభాసునకు నేను బ్రహ్మమని జ్ఞానమయినయెడల ఆ జ్ఞానము [1]మిథ్యయగును. ఎట్లనఁగా—రజ్జువుకన్న భిన్నమైన సర్పము

---

చూచుజనులు, ఏ చమత్కారముఁ జూచి, జీవన్ముక్తవిద్వాంసుఁడు నిర్లజ్జ విస్మయావిష్టుఁడై ధన్యోఽహం, ధన్యోఽహం అనుచు నర్తనము చేయుచున్నాఁడో, ఆచమత్కారము చూచుటకు కోరరు; ఇదే నాకు ఒకవిస్మయము గనఁబడుచున్నది.

శ్రీతుకారామాఖ్యసాధువు మహారాష్ట్రభాషలో అనుచున్నాఁడు—

సుఖపాతాంఅణుపాడెం, దుఃఖపర్వతాఏవఢెం. 1
త్యాచిచాడమూఢజనా, పూర్ణసుఖాతేంపాహేనా. 2

భావార్థము—అణువంతసుఖము, పర్వతమంతదుఃఖము గలది ఏ విషయసుఖమో, దానియొక్క ఆసక్తి మూఢజనులకగును; గాని, నిరంకుశతృప్తి చేయఁగట్టిది ఏ పూర్ణసుఖము అనఁగా బ్రహ్మసుఖము గలదో, దానియందు వారు అలక్ష్యము చేయుచున్నారు.

1. ఇచ్చట ప్రశ్నకర్తయగు శిష్యునిగూర్చి ప్రతిప్రశ్న—బ్రహ్మజ్ఞానస్వరూపము మిథ్యాసంసారాంతర్గతమైన మిథ్యాచిదాభాసాశ్రితమగుటవలన మిథ్యగా నున్నది; కనుక ఈ మిథ్యాజ్ఞానమువలన మృగజలముచేతతృషా

నకు నేనురజ్జు వనుజ్ఞానము మిథ్యయనఁగా భ్రాంతిరూపమగునట్లు ఈరీతిగా "నేనుబ్రహ్మము" అనుజ్ఞానము ఆభాసునకు అయిన యెడల ఆబ్రహ్మజ్ఞానము భ్రాంతిరూపమే యగును; యథార్థము కాదు.

---

నివృత్తివలె సంసారనివృత్తి ఎట్లగును; అట్లుండదేని? లేక తత్త్వజ్ఞానవిషయమైన ఏజీవబ్రహ్మైక్యము గలదో, అది సర్పరజ్జ్వైక్యమువలె మిథ్యగా నున్నది. కనుక ఈ మిథ్యావిషయముయొక్క జ్ఞానమును మిథ్యయే; ఆ మిథ్యాజ్ఞానమువలన సంసారనివృత్తి ఎట్లగును అట్లుండదేని?

వీనిలో—జ్ఞానరూపము మిథ్య; ఈమాట నేను అంగీకరించుచున్నాను; అయినను ఆ మిథ్యాజ్ఞానమువలన సంసారనివృత్తి ఘటిల్లుచున్నది. ఏలయన—"యక్షానురూపో హి బలిః" ఎంత దయ్యమో, అంత దానికి బలి ఈయవలెను; ఈసంగతి లోకప్రసిద్ధముగానే యున్నది; ఆప్రకారముగా ఎట్లు సంసారము మిథ్యయో, అట్లు తన్నివృత్త్యర్థము జ్ఞానమును మిథ్యయే కావలయును. లేక "సమానసత్తగలపదార్థములు తమతమయందు సాధకబాధకములుగా నున్నవి." ఈవిషయముచేతను మిథ్యాజ్ఞానమువలననే మిథ్యాసంసారనివృత్తి సంభవించుచున్నది. మృగజలము, మఱియు తృష సమసత్తగాదు; కనుక ప్రాతిభాసికమైన మృగజలమువలన వ్యావహారికమయిన తృషానివృత్తి సంభవింపదు. [ఈసంగతి పంచమతరంగమందు చెప్పఁబడును.]

మఱియును జీవబ్రహ్మైక్యజ్ఞానముయొక్క విషయము మిథ్య; కనుక దానిజ్ఞానమును మిథ్యయే. ఈద్వితీయపక్షము నీవుగ్రహించినయెడల ఆ పక్షము ఘటిల్లదు; ఈసంగతి మూలగ్రంథముయొక్క 131 అంకమందు ప్రతిపాదించినారము.

## 131. 130 గత ప్రశ్నకుత్తరము—ముఖ్య సామానాధికరణ్యము, బాధసామానాధికరణ్యము,

ఓశిష్యుఁడా! యత్యపి "నేను బ్రహ్మము" అనునిట్టి జ్ఞానము బుద్ధిసహితాభాసున కగును; కూటస్థునకుఁగాదు. తథాపి ఆయాభాసుఁడు ఈకూటస్థుఁడును, తనస్వరూపమును రెంటిని చేర్చి తనఆత్మ యని ఎఱుఁగును; నేను శబ్దమువలన ఆయాత్మ యొక్క గ్రహణ మగును; ఇదియే అహంశబ్దమునకు అర్థము.

ఆయహంశబ్దమునందు భాసమానుఁడైన ఏ కూటస్థుఁడు గలఁడో, వానికి బ్రహ్మముతో సదా అభేదము గలదు. కాఁబట్టి కూటస్థునకు బ్రహ్మముతో ముఖ్య [1] సామానాధికరణ్యము శాస్త్రమునందు చెప్పఁబడినది.

---

1. సమానవిభక్తియొక్క బలముచేత సమాన మనఁగా ఏకము, అధికరణమనఁగా అర్థరూపాశ్రయము - వేనికిఁ గలవో, అట్టి ఏ రెండుశబ్దములు గలవో, వానిని సమానాధికరణమందురు; ఈరెండుశబ్దములయొక్క ఏ పరస్పరసంబంధము గలదో, అది సామానాధికరణ్యము [ఏకార్థత్వము] అనఁబడును.

ఉక్తసామానాధికరణ్యరూపసంబంధము జీవేశ్వరులయొక్క ఏకతాబోధకమయిన ఏకవిభక్తిగలపదములచేతఁ గూడిన నాలుగువేదములయొక్క నాలుగుమహావాక్యములందు, మఱియు అన్యములైన లౌకికవైదికవాక్యములందు తెలియవలయును. వీనిలో—

(1) ఏకసత్త, ఏకస్వరూపముగల వగుటవలన వాస్తవభేదరహితములైన రెండుఅర్థములబోధకమైన వాక్యగతములగు రెండుపదములకు ఏకవిభక్తిబలముచేత ముఖ్యసామానాధికరణ్యము చెప్పఁబడి

[ఏవస్తువునకు ఏవస్తువుతో సదా అభేదమగునో, ఆవస్తువునకు ఆవస్తువుతో ముఖ్యసామానాధికరణ్యమందురు. ఎట్లనఁగా- సదా పరస్పరాభేదమగుటవలన ఘటాకాశమునకు మహాకాశముతో ముఖ్యసామానాధికరణ్యము చెప్పఁబడినది].

నేననుశబ్దమునందు భాసమానుఁడైన ఏ ఆభాసుఁడు గలఁడో, వానికి బ్రహ్మముతో తనస్వరూపముయొక్క బాధ చేసి, అభేదమగును. కాఁబట్టి శాస్త్రమునందు ఆభాసునకు బ్రహ్మముతోడ బాధసామానాధికరణ్యము చెప్పఁబడినది.

---

యేయున్నది. ఎట్లనఁగా—"ఘటాకాశము మహాకాశముగా నున్నది" ఈ వాక్యాంతర్గతమైన ఘటాకాశపదమునకు, మఱియు మహాకాశపదమునకు అట్లే "కూటస్థుఁడు బ్రహ్మముగా నున్నాఁడు" ఈ వాక్యాంతర్గతమైన కూటస్థపదమునకు, మఱియు బ్రహ్మపదమునకు ముఖ్యసామానాధికరణ్యము గలదు.

(2) భిన్నసత్తగల రెండుపదార్థములయొక్క ఏకవిభక్తిబలముచేత ఏకతాబోధకమైన వాక్యగతపదద్వయమునకు బాధసామానాధికరణ్యము చెప్పఁబడియున్నది. ఎట్లనఁగా—"పురుషుఁడు స్థాణువుగా నున్నాఁడు" ఈవాక్యాంతర్గతమైన పురుషపదమునకును, స్థాణుపదమునకును అట్లే "జగత్తు బ్రహ్మముగా నున్నది" ఈ వాక్యాంతర్గతమైన జగత్పదమునకును, బ్రహ్మపదమునకును అట్లే ప్రతిబింబము బింబముగా నున్నది" ఈవాక్యాంతర్గతమైన బింబపదమునకును, ప్రతిబింబపదమునకును బాధసామానాధికరణ్యము గలదు.

ఈసామానాధికరణ్యవిచారము జీవబ్రహ్మైక్యవిచారమునందును, జగద్బ్రహ్మైక్యవిచారమునందును చాల ఉపకారముగ నున్నది; అందువలన ఇది జిజ్ఞాసువునకు అత్యంతగ్రాహ్యముగ నున్నది.

[ఏవస్తువునకు తనస్వరూపబాధచే ఏవస్తువుతో అభేద మగునో, ఆవస్తువునకు దానితో బాధసామానాధికరణ్య మం దురు. ఎట్లనఁగా—ముఖప్రతిబింబమునకు ముఖముతో తన స్వరూపముయొక్క బాధచే అభేద మగును; లేక స్థాణువందు పురుషభ్రమప్రసంగమున స్థాణుజ్ఞానానంతరము "పురుషుఁడు స్థాణువు" ఈరీతిగా పురుషునకు స్థాణువుతో తనస్వరూపము యొక్క బాధచే అభేదమగును; కనుక వీనికి పరస్పరబాధసామా నాధికరణ్యము చెప్పఁబడినది.]

ఓశిష్యుఁడా! ఈప్రకారముచే అహంశబ్దమునందు భాస మానుఁడైన కూటస్థునికి బ్రహ్మముతో ముఖ్యాభేదము; మఱి యు ఆభాసునికి బ్రహ్మముతో తనస్వరూపబాధపూర్వకముగా అభేదమున్నది.

**132. ప్రశ్న—కూటస్థాభాసులభానము క్రమముగానా? క్రమరహితముగానా?**

ఓభగవంతుఁడా! మీరు చెప్పితిరి— "అహంవృత్తి యందు కూటస్థుఁడు, మఱియు ఆభాసుఁడు ఈరెంటియొక్క భానమగుచున్నది" అని దానియందు నాకొక్కసంశయమున్నది; అదేమనఁగా—అహంవృత్తియందు ఆరెంటియొక్క భానము క్రమముగా నగునా? క్రమములేక యగునా? [భిన్నభిన్నకాల ములందగునా? లేక ఏకకాలమందగునా?]

**133. 132 గతప్రశ్నకుత్తరము—133—146 ఒకేసమయమునందు రెంటియొక్కభానము.**

ఓశిష్యుఁడా! అహంవృత్తియందు సాక్షియొక్కయు,

ఆభాసునియొక్క [1] భానము ఒకేకాలమందు అగుచున్నది. వానిలో—అంతఃకరణసహితుఁడైన ఆభాసుఁడు చైతన్యరూపుఁడైన సాక్షియొక్క విషయమగుటవలన సాక్షికి భానమగును; సాక్షియో, సాభాసాంతఃకరణవృత్తికి విషయముగాదు. ఇట్టి ఆసాక్షియొక్క భానము స్వయంప్రకాశముచే నగుచున్నది.

బాహ్యములయిన ఘటాదిపదార్థములందు భానముయొక్క ప్రకారము ఇట్టిదిగా నున్నది—ఎప్పుడు ఇంద్రియము ఘటముతో సంయోగము పొందునో, అప్పుడు అంతఃకరణవృత్తి ఇంద్రియద్వారమున బయలువెడలి ఘటముతో సమానాకారమును పొందును. ఎట్లనఁగా—మూషయందు [2] పడిన ప్రగలిత తామ్రరసము ఎట్లు మూషాకారమగునో, అట్లు ఘటమును పొందిన యంతఃకరణవృత్తియు ఘటాకారమగును. ఆవృత్తి ఆభాససహితముగానే యున్నది. ఏలయన—వృత్తి అంతఃకరణముయొక్క పరిణామము; అంతఃకరణము సత్త్వగుణకార్యమగుటవలన స్వచ్ఛము; కనుక దానియందు చైతన్యముయొక్క ఆభాసమగును. అట్లు అంతఃకరణకార్యమైన వృత్తి స్వచ్ఛమగుటవలన దానియందు చైతన్యాభాసమగును. లేక ఏయేవృత్తి ఉద్భవించునో, ఆయావృత్తి సాభాసాంతఃకరణముచేతనే ఉద్భవించును; కనుక వృత్తియందు ఆభాసము సహజముగానే యున్నది.

1. ఆభాసశబ్దముచే అంతఃకరణసహితాభాసునియొక్కయు అంతఃకరణశబ్దముచే సాభాసాంతఃకరణముయొక్కయు గ్రహణము ప్రసంగానుసారముగా చేయవలెను.

2. మూషయనఁగా లోహారచితము, లేక మృత్తికారచితము అయిన అచ్చు.

## 134. అజ్ఞానమునకాశ్రయము విషయము, చైతన్యము.

విషయమైనఘటము అది తమోగుణకార్యముగుటవలన స్వరూపముచే జడము, దానియందు అజ్ఞానము, మఱియు తదావరణము కల దనువిషయమునందు సందేహము పుట్టుచున్నది. అ దేమనఁగా—అజ్ఞానమును, ఆవరణమును విచారదృష్టిచే చూచినట్టయిన చైతన్యమం దున్నవి; ఘటమందు లేవు. ఏల యన—అజ్ఞానము చైతన్యమునకాశ్రితమై చైతన్యమును విషయము చేయుచున్నది; ఇది వేదాంతసిద్ధాంతము.

ఆభాసునిసప్తావస్థలు చెప్పెడుప్రసంగమునందు అజ్ఞానమునకాశ్రయము అంతఃకరణసహితాభాసుఁడని ఏది చెప్పఁబడెనో, అది ఆభాసుఁడు అజ్ఞానమునకు అభిమాని యని అభిప్రాయముచే చెప్పఁబడినది.

యద్యపి "నేను అజ్ఞానిని" ఇట్టి అభిమానము అంతఃకరణ సహితాభాసునకగుటవలన అతఁడు అజ్ఞానమునకాశ్రయమని సప్తావస్థల ప్రసంగమునందు చెప్పఁబడెను; తథాపి ముఖ్యాశ్రయము [1] చైతన్యముగా నున్నది; ఆభాసుఁడుగాఁడు, ఏల యన సాభాసాంతఃకరణము అజ్ఞానముయొక్క కార్యము; ఏది దేనికార్యమగునో, అది దానికి ఆశ్రయముగాఁజాలదు. కాఁబట్టి

---

1 ఎట్లు ధనమునకు ముఖ్యాశ్రయము కోశముగా [పెట్టెమొదలయిన ధనము పెట్టుకొనుతావు] నుండునో, మఱియు నేను ధనవంతుఁడను ఇట్టి ధనాభిమానిరూపమయిన ఆశ్రయము పురుషుఁడుగా నున్నాఁడో, అట్లు అజ్ఞానమునకు ముఖ్యాశ్రయము చైతన్యము, మఱియు అభిమానిరూపాశ్రయము సాభాసాంతఃకరణముగ నున్నది.

చైతన్యమే అజ్ఞానమునకు అధిష్ఠానరూపమయిన ముఖ్యాశ్రయ ముగ నున్నది. మఱియు ఆచైతన్యమునే అజ్ఞానము విషయము చేయుచున్నది.

స్వరూపావరణము చేయుటయే అజ్ఞానముయొక్క విషయము చేయుట; ఆ అజ్ఞానకృతావరణము జడవస్తువునందు ఘటిల్లదు. ఏలయన—పైఁజెప్పిన ప్రకారముగా జడవస్తువు స్వరూపముచే ఆవృతము; దానిలో నూతనావరణముచే ఏ యుపయోగము లేదు; కనుక అజ్ఞానమునకాశ్రయమును, విషయమును ఒకటేచైతన్యముగా నున్నది. ఎట్లనఁగా—గృహమధ్యస్థితమైన అంధకారము గృహమధ్యమును ఆవరించుచున్నది.

ఈరీతిగా ఘటమునందు అజ్ఞానము, మఱియు తదావరణము ఘటిల్లదు? [ఈ ఆక్షేపము ఉత్తరమునకు అంతర్గతమే యున్నది; దీనిసమాధానము ఉత్తరాంశమునందు వ్రాయఁబడును

## —{ 135. బాహ్యపదార్థములందు వృత్త్యాభాసునియొక్క ఉపయోగము. }—

పూర్వాంశమందలి ఆక్షేపమునకు సమాధానము— ఎట్లు చైతన్యముకన్న భిన్నమై సదసద్విలక్షణమైన అజ్ఞానము చైతన్యమునాశ్రయముచేసికొని,చైతన్యమునేఆచ్ఛాదించునో, అట్లు ఘటస్వరూపముకన్న భిన్నమైన అజ్ఞానము యద్యపి ఘటమును ఆశ్రయించుట, లేక ఆచ్ఛాదించుట ఘటిల్లదు; తథాపి ఆయజ్ఞానముచేతనే ఘటాదికములు ప్రకాశరహితజడస్వరూపములై రచింపఁబడినవి; అందువలన ఎల్లప్పుడును అంధునివలె ఆవృతములుగా నున్నవి. ఆఘటాదులయొక్క ఆవృతస్వభావము

అజ్ఞానముచేతనే చేయఁబడినది. ఏలాగున ననఁగా—తమోగుణ ప్రధానమైన అజ్ఞానమువలన భూతోత్పత్తిద్వారమున ఘటాదిక ములు ఉత్పన్నములైనవి ; ఆ తమోగుణము ఆవరణస్వభావము గలదగుటవలన ఘటాదులు ప్రకాశరహితములైనవి ; ఈరీతిగా అంధకారరూపమైన అజ్ఞానకృతావరణము ఘటాదికమునందు స్వభావసిద్ధముగా నున్నది. మఱియు ఘటాదులయొక్క అధి ష్ఠానచైతన్యాశ్రితమైన అజ్ఞానము చైతన్యాచ్ఛాదనప్రసంగము నందు చైతన్యము నాచ్ఛాదించి, స్వభావముచే ఆవృతమైన ఘటాదులనుగూడ ఆచ్ఛాదించుచున్నది. స్వభావముచే ఆవృత మైన పదార్థావరణమందు ఏప్రయోజనము లేకపోయినను ఆవ రణకర్త ప్రయోజనాపేక్ష లేకయు నిరావరణపదార్థన్యాయమున సావరణపదార్థముంగూడ ఆవరించుచున్నది. ఈసంగతి లోక మందు ప్రసిద్ధమే.

[వ్యవసాయభూమిమీఁదను, కూపతటాకాదిజలాశయ ముందును పర్జన్యవృష్టికి ఉపయోగము గలదు; ఇంటిమీఁదను, అంగడిమీఁదను వృష్టికి ఉపయోగములేదు; వ్యత్యస్తముగ అపకారము మాత్రము గలదు; ఇట్లుండఁగా మేఘరాజు వృష్టి అంతటను చేయుచున్నాఁడు.]

ఈప్రకారముగా అజ్ఞానావృతఘటమునందు ప్రాప్తమైన ఏ సాభాసాంతఃకరణముయొక్క ఘటాకారవృత్తి గలదో, దాని యందుండు వృత్తిభాగము ఘటముయొక్క ఆవరణమును భంగించుచున్నది; మఱియు ఆభాసభాగము తత్ప్రకాశము చేయుచున్నది.

ఈరీతిగా బాహ్యపదార్థములందు వృత్త్యాభాసములు రెంటికి నుపయోగము గలదు.

## 136. ఉక్తసంగతియొక్క దృష్టాంతసహిత కథనము

అంధకారమందు మృత్పాత్రము, లేక లోహపాత్రము ఒకబానచే మూయఁబడినది; అచ్చట దండముచే బానను పగులఁగొట్టినను వెనుక దీపములేక ఆ నిరావరణమైన లోహపాత్రముయొక్క ప్రకాశము గానేరదు; ఏమనఁగా — దీపముచేతనే ప్రకాశమగుచున్నది. అట్లు వృత్తి అజ్ఞానావృతమైన ఘటముయొక్క ఆవరణభంగము చేసినను, చిదాభాసుఁడు లేక ఘటముయొక్క ప్రకాశము గానేరదు. ఏలయన — ఘటము స్వరూపముచే జడము, వృత్తియును జడమే; ఆవరణభంగముమాత్రము వృత్తియొక్క ప్రయోజనముగాని, దానివలన ప్రకాశము గానేరదు; కనుక ఘటప్రకాశకుఁడు ఆభాసుఁడే.

నేత్రమునకు ఏది విషయమో,[1] దానియొక్క ప్రత్యక్షజ్ఞానమునకు ఈరీతి చెప్పఁబడెను; మఱియు శ్రవణాదికములకు ఏది విషయమో, తత్ప్రత్యక్షజ్ఞానమునకును ఈరీతియే ఎఱుఁగవలెను.

వృత్తి, మఱియు ఘటము రెండు నొకస్థలమం దుండుట వలన ఘటముయొక్క జ్ఞానము ప్రత్యక్షమందురు. ఇదిగాక వృత్తి ఘటదేశమునొందక అంతరమునందే ఘటాకారమగుఁ

1. రూపజ్ఞానప్రసంగమందు నేత్రవృత్తి బాహిరము పోయినది; అట్లు శబ్దజ్ఞానప్రసంగమందును శ్రోత్రవృత్తి బాహిరము పోయినది; కనుక నేత్రశ్రోత్రముల జ్ఞానము ఒకటేరీతిగా నున్నది; అయినను అవశేష మయిన త్వక్కు ఘ్రాణము రసన ఈమూఁడు ఇంద్రియములయొక్క జ్ఞానరీతి కొంచెము విలక్షణముగా నున్నది. వీనియొక్క విశేషవిచారము ఈతరంగమునందే ముందు వ్రాయఁబడును.

వలన ఏజ్ఞానమగునో, అది పరోక్షమందురు. "ఈఘటమున్నది" ఇట్టిది అపరోక్షజ్ఞానముయొక్క ఆకారము [శబ్దవ్యవహారము] మఱియు "ఘటమున్నది" లేక "ఆఘటమున్నది" ఇట్టిది పరోక్ష జ్ఞానముయొక్క ఆకారము.

యద్యపి స్మృతిజ్ఞానమును పరోక్షమే; తథాపి స్మృతి జ్ఞానము సంస్కారజన్యము, మఱియు అనుమిత్యాదికమైన, పరోక్షజ్ఞానము ప్రమాణజన్యము; రెంటియందు ఇంతభేదము గలదు.

## 137. మతమతాంతరములందు అధికాధిక ప్రమాణాంగీకారము

ఓశిష్యుఁడా! ఇప్పుడు ప్రమాణప్రసంగము వచ్చినది; అందువలన మేము ప్రమాణనిరూపణము చేయుచున్నాము, వినుము—మొదటిది ప్రత్యక్షము, రెండవది అనుమానము; మూఁడవది శబ్దము, నాల్గవది ఉపమానము, ఐదవది అర్థాపత్తి, ఆఱవది అనుపలబ్ధి ఈయాఱు ప్రమాణములుగా నున్నవి.

వీనిలో—చార్వాకుఁడు[నాస్తికశిరోమణివిరోచనుఁడు] [1]ఒకప్రత్యక్షప్రమాణమునే యంగీకరించును; అన్యప్రమాణముల నంగీకరింపఁడు.

1. ఎవనిమతమందు ఆకాశాది పంచభూతముల అంగీకారము గలదో, అట్టి దేహాత్మవాదిని లోకాయతికుఁ డందురు. ఎవనిమతమందు ఆకాశముదప్ప నాల్గుభూతములయొక్క అంగీకారము గలదో, అట్టిదేహాత్మవాదిని చార్వాకుఁ డందురు.

వైశేషికశాస్త్రకర్తయగు కణాద [కణభుక్] మునియు, సుగత[1] మతానుసారులును రెండవదగు అనుమానప్రమాణమును అంగీకరింతురు. దానియందు హేతువేమనఁగా—అభుక్త భోజనమందు తృప్తికి హేతుత ప్రత్యక్షప్రమాణముచేతసిద్ధము గాదు; భుక్తభోజనమందు అనుభూతమైన తృప్తియొక్క ఏ హేతుతగలదో, ఆ హేతుత అభుక్తభోజనమందు అనుమాన ప్రమాణమువలన తెలిసి, తృప్త్యర్థికి భోజనమందు ప్రవృత్తి యగుచున్నది; ఒకటేప్రత్యక్షప్రమాణముచే నిర్వాహము గానేరదు; అని తెలిసి, కణాదాదులు ప్రత్యక్షానుమానముల రెండుప్రమాణములను అంగీకరించుచున్నారు.

సాంఖ్యశాస్త్రకర్తయగు కపిలముని మూఁడవదైన శబ్ద ప్రమాణమును అంగీకరించెను; దానియందు హేతువేమనఁగా- ప్రత్యక్షము, అనుమానము ఈరెండుప్రమాణములనే అంగీకరించినయెడల దేశాంతరమందు ఎవనితండ్రి చనిపోయెనో, వానితో నొకయథార్థవక్త "నీతండ్రిచనిపోయెను" అని చెప్పినపుడు వానికి పితృమరణనిశ్చయము గాఁగూడదుగదా! ఏల యన—దేశాంతరమందుండు పితృమరణజ్ఞానము పూర్వోక్తమైన రెండుప్రమాణములవలన ఘటిల్లదు; కనుక కపిలమతానుసారులు ప్రత్యక్షము మొదలు శబ్దమువఱకు మూఁడుప్రమాణములను అంగీకరించుచున్నారు.

న్యాయశాస్త్రకర్తయగు గౌతమముని ఉపమానమను నాలుగవప్రమాణమును అంగీకరించెను. దానియందు హేతువేమనఁగా—ఏపురుషునిచేత గవయము[2] చూడఁబడలేదో

---

1. సుగతమతమునందు అనేకబౌద్ధమతముల సమావేశము గలదు.
2. పశువిశేషము, హిందూస్థానిమాటలో రోజయందురు. [అడవిఆవు]

వనవాసిపురుషునిచేతమాత్రము ఆవుపలెనే గవయ ముండునని వినెనో, ఆపురుషుఁడు అరణ్యములో పోవుచుండఁగా గవయ మును జూచినపుడు వానికి వనవాసిపురుషుఁడు చెప్పినవాక్యార్థముయొక్క స్మరణ మగును; ఆస్మృత్యనంతరము ఈపశువు గవ యము, అనుజ్ఞానమగుచున్నది; ప్రత్యక్షాదిమూఁడు ప్రమాణము లనే యంగీకరించినయెడల అట్టిజ్ఞానము గాఁగూడదుగదా! అని విచారముచేసి, న్యాయమతానుసారులు ఇట్టి విలక్షణజ్ఞానము నకు హేతువగు నాలుగవదైన ఉపమానప్రమాణమును అంగీక రించుచున్నారు

పూర్వమీమాంసైకదేశి ప్రభాకరమతానుసారులు ఐదవ దైన అర్థాపత్తిప్రమాణమును అంగీకరించుచున్నారు. దాని యందు హేతువేమనఁగా— దినమందు భోజనము చేయని పురుషుని స్థూలత్వమును జూచి, ఈపురుషుఁడు రాత్రియందు భుజించుచున్నాఁడనిజ్ఞానమగుచున్నది; అచ్చట రాత్రిభోజనము లేక దినాభోజియందు స్థూలత ఘటిల్లదు; కనుక స్థూలత రాత్రి భోజనమునకు సంపాదకముగాను, రాత్రిభోజనము సంపాద్య ముగాను ఉన్నది; సంపాద్యమైన రాత్రిభోజనజ్ఞానమునకు హేతువు ఏ స్థూలత్వజ్ఞానము గలదో, దానిని అర్థాపత్తి ప్రమాణ మందురు; పూర్వోక్తములగు నాలుగుప్రమాణముల చేత ఇట్టిజ్ఞానము ఘటిల్ల దని తెలిసి, ప్రభాకరమతానుసారులు ఐదవదైన అర్థాపత్తిప్రమాణమును అంగీకరించిరి.

పూర్వమీమాంసకభట్టమతానుసారులుఆఱవదైనఅనుప లబ్ధిప్రమాణమును అంగీకరించుచున్నారు; మఱియు వేదాంత శాస్త్రంబునందును ఈషట్ప్రమాణములయొక్క అంగీకారము

చేయఁబడినది. గృహాదికమందు ఘటాదుల అభావముయొక్క జ్ఞానముగుచున్నది; అచ్చట ఏపదార్థముయొక్క ప్రతీతిగాదో, తదభావముయొక్క జ్ఞానముగుచున్నది. ఘటముయొక్క అప్రతీతి ఏదిగలదో, దానివలన ఘటాభావముయొక్క నిశ్చయముగును; ఇట్లు పదార్థాభావనిశ్చయమునకు హేతువయిన పదార్థముయొక్క ఏయప్రతీతి గలదో, దానిని అనుపలబ్ధిప్రమాణ మందురు. ఇట్టి జ్ఞానము పూర్వోక్తమైన ఐదుప్రమాణములచేతఁ గాదనియెఱిఁగి, భట్టాచార్యాదులు ఆఱవదైన అనుపలబ్ధిప్రమాణమును అంగీకరించుచున్నారు.

కొన్ని వేదాంతగ్రంథములందు ఒకఐతిహ్యము, ఒకక్రమము అని రెండుప్రమాణములు అధికముగా గణించి, అష్టవిధప్రమాణము లని వ్రాయఁబడినది. ఇతరభాషలందును అష్టవిధప్రమాణములు ప్రసిద్ధముగ నున్నవి; కన్నడమాటలో కొన్నిగ్రంథములందు ఎనిమిది, కొన్నిటిలో పదిరెండు, కొన్నిటిలో పదునాఱు ప్రమాణములు వ్రాయఁబడియున్నవి. ఎంతెంత అధికాధికప్రమాణములయొక్క అంగీకారమో, అంతంత తన గ్రంథమునకు అధికాధికయథార్థత వచ్చుచున్నదని ఎఱుఁగుచున్నాఁడేమో! ఎన్నిప్రమాణములు వ్రాసినను వానిలక్షణములు పైఁజెప్పిన షట్ప్రమాణాంతర్గతమే యైయున్నవి; అందువలన భగవంతుఁడైన భాష్యకారునిచేతఁగూడ ప్రమాణసంఖ్యావిషయమునందు ఎవ్వనితో వివాదము చేయఁబడలేదు.

## 138. ప్రమాణప్రమేయముల లక్షణములు

ప్రమాణజ్ఞానమునకేది కరణము గలదో, దానిని ప్రమాణమందురు. స్మృతికన్నభిన్నమైఅబాధితమైన అర్థమును విషయము

చేయునట్టి విజ్ఞానము గలదో, దానిని ప్రమ యందురు. స్మృతి జ్ఞానము ప్రమ గాదు. ఏలయన—ప్రమాజ్ఞానము ప్రమాతనాశ్రయించినది. స్మృతిజ్ఞానము ప్రమాతనాశ్రయించినదిగాదు; మఱేమనఁగా—అది సాక్షినాశ్రయించినదిగా నున్నది. మఱియు భ్రాంతిజ్ఞానమును సంశయజ్ఞానమును సాక్షిని ఆశ్రయించినవిగా నున్నవి. అందువలన వానినిగూడ ప్రమ యనఁగూడదు.

స్మృత్యాదిజ్ఞానత్రయము అవిద్యావృత్తిరూపముగ నున్నది; అంతఃకరణవృత్తిరూపము గాదు; కనుక ప్రమాతనాశ్రయించినది గాదు; మఱేమనఁగా— సాక్షినాశ్రయించినదిగా నున్నది. అంతఃకరణవృత్తిరూపజ్ఞానము ఏది గలదో, అది ప్రమాతనాశ్రయించినదిగా నున్నది; దానినే ప్రమ యందురు.

ఉక్తమయిన స్మృత్యాదిజ్ఞానత్రయమందు భ్రాంతిసంశయ జ్ఞానములు ప్రమగావను విషయమందు ఎవ్వనికిని వివాదము లేదు. స్మృతిజ్ఞానవిషయమందు మాత్రము వివాదముగా నున్నది. అయినను విచారదృష్టివలన చూచినయెడల భ్రాంతి సంశయములవలె స్మృతిజ్ఞానముకూడ అంతఃకరణవృత్తిరూపము గామివలన ప్రమాత్రాశ్రితము గాదు; కనుక అది ప్రమగాదు.

కాఁబట్టి ప్రమాలక్షణమందు స్మృతికన్న భిన్న మని చెప్పవలయును. స్మృతిజ్ఞానముకూడ అబాధితార్థమును విషయము చేయునట్టిది యగును; అయినను స్మృతిజ్ఞానము స్మృతికన్న భిన్నము గాదు. కావున అబాధితార్థమును విషయముచేయు నట్టిదై స్మృతికన్న భిన్నమైన జ్ఞానమునే ప్రమ [1] యనవలయును. ఈ ప్రమాలక్షణమందు ఏదోషమును లేదు.

1. "యథార్థానుభవము ప్రమ" ఈప్రమాలక్షణమును స్మృతికన్న భిన్నమే. "యథార్థజ్ఞానము ప్రమ" ఈప్రమాలక్షణములో స్మృతివిష

[ఇచ్చట ప్రమాణముయొక్కయు, ప్రమయొక్కయు విచారము విస్తరభయముచే అతిసంక్షిప్తముగ వ్రాయఁబడినది; కనుక అధికజిజ్ఞాస అయినపుడు, వేదాంతపరిభాషావృత్తిప్రభాకరాదిగ్రంథములందు చూడవలెను]

## 139. స్మృతివిచారపూర్ణత

ఒకరు స్మృతిజ్ఞానమును ప్రమారూపమని అంగీకరించియున్నారు; వారిమతప్రకారముగా ప్రమాలక్షణమందు స్మృతికన్న భిన్న మనఁగూడదు; మఱేమనఁగా—అబాధితార్థమును విషయముచేయు జ్ఞానమునే ప్రమయనిచెప్పవలయును. భ్రాంతిజ్ఞాన మేది గలదో, అది అబాధితార్థమును విషయము చేయదు; బాధితార్థమునే విషయము చేయుచున్నది; కనుక దానియందు ప్రమాలక్షణము లేదు.

ఎవనిమతములో స్మృతిజ్ఞానమందు ప్రమావ్యవహారము గలదో, వానిమతమందు స్మృతిజ్ఞానమును అంతఃకరణవృత్తి యందురు; అవిద్యావృత్తి అనరు. మఱియు సాక్ష్యాశ్రితమనియు అనరు. దానిని ప్రమాత్రాశ్రితమనియే యందురు. ఏలయన—ఎవరిమతమందును అంతఃకరణవృత్తికి ఆశ్రయము ప్రమాతయే యగును. సాక్షి గాదు.

ఈరీతిగా స్మృతిజ్ఞానము ఎవ్వనిమతమందు అంతఃకరణవృత్తిరూపమో, తన్మతమునందు ప్రమారూపమగును, ఎవని మతమందు అవిద్యావృత్తిరూపమో, తన్మతమునందు ప్రమారూపము గాదు. భ్రాంతిజ్ఞానము, సంశయజ్ఞానము ఈ రెండును

---

యమునందు ప్రమావ్యభిచారము గలదు. [ఈలక్షణములో స్మృతిజ్ఞానమునందు ప్రమాలక్షణము ఒకప్పుడు ఉండును; ఒకప్పుడు ఉండదు.]

పర్యాయతములందును అవిద్యావృత్తి యగుటవలనసాక్షికి ఆశ్రిత మని యనుచున్నారు. వానిలో ఎవ్వరికిని వివాదము లేదు.

విచారముచేఁ జూచినయెడల స్మృతిజ్ఞానముగూడ అవిద్యావృత్తిగాను, సాక్ష్యాశ్రితముగాను ఉన్నది; ప్రమా రూపము గాదు. ఏలయన—వేదాంతసంప్రదాయవేత్తలగు ఆచార్యులు ప్రమాజ్ఞానము షట్ప్రకార మని చెప్పియున్నారు; ఆషట్ప్రకారములందును స్మృతిజ్ఞానము లేదు. మధుసూదన స్వాములవారిచేతఁగూడ స్మృతిజ్ఞానము సాక్ష్యాశ్రితమని చెప్పఁ బడియున్నది; కనుక అది ప్రమ [1] గాదు;

---

1. ఇచ్చట ఈవివేకము గలదు—భ్రమరూపానుభవముయొక్క సంస్కారజన్యమయిన స్మృతి ఏది గలదో, అది బాధితార్థమును విషయము చేయునట్టిదే యగుటవలన అయథార్థముగా నున్నది; కనుక నది అవిద్యావృత్తియే; అంతఃకరణవృత్తి గాదు. మఱియునది సాక్ష్యాశ్రితముగ నున్నది; ప్రమాత్రాశ్రితము గాదు. యథార్థానుభవముయొక్క సంస్కారజన్యస్మృతి జ్ఞానము ఏది గలదో, అది అబాధితార్థమును విషయము చేయునట్టిది యగుటవలన యథార్థముగా నున్నది; కనుక అది అంతఃకరణవృత్తియే; అవిద్యావృత్తిగాదు; మఱియు నది ప్రమాత్రాశ్రితముగ నున్నది; సాక్ష్యాశ్రితము గాదు. ఈలక్షణప్రకారము చూచినట్టయిన యథార్థానుభవముయొక్క సంస్కారజన్యస్మృతిజ్ఞానమందు ప్రమాలక్షణమే స్పష్టముగా కనఁబడుచున్నది; అయినను స్మృతిజ్ఞానమందు ప్రాచీనాచార్యులు ప్రమావ్యవహారము చెప్పలేదు; అందువలన రెండుప్రకారములయు స్మృతి అప్రమ యనఁబడును. వీనిలో అయథార్థస్మృతి అయథార్థాప్రమ; మఱియు యథార్థస్మృతి యథార్థాప్రమ ఇంతభేదము గలదు.

## 140. ప్రమ, కారణము, కరణము వీని విచారము

ప్రత్యక్షము, అనుమితి, శాబ్ది, ఉపమితి, అర్థాపత్తి, అనుపలబ్ధి అని ప్రమ ఆఱువిధములుగా నున్నది. పూర్వము చెప్పిన ప్రత్యక్షాది షట్ప్రమాణములు క్రమముగా వీనికి కరణములుగా నున్నవి. ఎట్లనఁగా—ప్రత్యక్ష ప్రమయొక్క కరణము ప్రత్యక్ష ప్రమాణము. ఈవిధముగా ఆయా ప్రమయొక్క కరణము ఆయా ప్రమాణ మనఁబడును.

అసాధారణకారణమును కరణ[1] మందురు. ఏది సర్వ కార్యములకు కారణమగునో, దానిని సాధారణకారణమందురు.

---

1. కేవలము అసాధారణకారణమును కరణమని చెప్పినట్టయిన ఎచ్చట రెండు అసాధారణకారణములుండునో, అచ్చట ఏకారణము కరణమగునో, అది నిశ్చయము గా సేరదు; కనుక రెండుకారణములలో ఒకటిని వ్యాపార రూప మని అంగీకరించి, అవశేషమయిన రెండవదైన వ్యాపారవంతమగు అసాధారణకారణమును కరణ మని చెప్పవలయును.

ఏకారణము కార్యమును ఇతరద్వారమున ఉత్పన్నము చేయునో, దానిని వ్యాపారవంతమగు కారణమందురు; అదియే కరణము. ఎట్లనఁగా—కపాలద్వయము సంయోగద్వారమున ఘటమునకు వ్యాపారవంతమగు కారణముగా నున్నది; అదియే కరణము.

ఏకారణము కార్యమును ఇతరద్వారమున ఉత్పన్నము చేయదో, సాక్షాత్తు తానే యుత్పన్నము చేయునో, అది కేవలకారణముగాని కరణము గాదు. ఎట్లనఁగా—కపాలద్వయసంయోగము ఘటమును సాక్షాత్తుగా నుత్పత్తి చేయును; ఆ సంయోగము ఘటమునకు కేవలకారణముగాని కరణముగాదు.

ఉక్తకరణలక్షణము ప్రత్యక్షము, అనుమానము, శబ్దము ఈ మూఁడు ప్రమాణములందు ఘటిల్లుచున్నది; అయినను ఉపమానము, అర్థాపత్తి, అనుప

అట్టివి ధర్మాధర్మములు మొదలయినవి. ఏది సర్వకార్యములకు కారణముగాదో, అయినను కొన్ని విశేషకార్యములకు మాత్రము కారణమగునో; దానిని అసాధారణకారణమందురు. ఎట్లనఁగా—చక్రదండాదులు. ఆచక్రదండాదులు ఘటాదులకు అసాధారణకారణమగుటవలన వానిని ఘటాదులకు కరణమందురు.

అట్లు ప్రత్యక్షప్రమకు ఈశ్వరుఁడు, ఈశ్వరేచ్ఛ మొదలగునవి [1] సాధారణకారణములుగా నున్నవి. ఏలయన—ఈశ్వరాదులులేక ఏకార్యమును ఘటిల్లదు. నేత్రములు మొదలుకొని ఏ యింద్రియములు గలవో, అవి ప్రత్యక్షప్రమకు అసాధారణకారణములుగా నున్నవి; అవి ప్రత్యక్షప్రమకు కరణములగుచున్నవి; కాఁబట్టి ఆ నేత్రాదీంద్రియములను ప్రత్యక్షప్రమాణ మందురు.

## 141. చైతన్యచతుష్కము

యద్యపి వేదాంతసిద్ధాంతమునందు ఇంద్రియములకు

---

లబ్ధి ఈమూఁడుప్రమాణములు ఉపమిత్యాదిప్రమలకు నిర్వ్యాపారకారణములగుటవలన వీనిలో ఉక్తకరణలక్షణమునకు అవ్యాప్తి యగును; కాఁబట్టి వ్యాపారముకన్న భిన్నమైన అసాధారణకారణము కరణమని చెప్పఁబడినది. ఈకరణలక్షణము నిర్దోషము; ఏలయన—కొన్నిచోట్ల వ్యాపారమున్నది; కొన్నిచోట్ల వ్యాపారము లేదు; రెండుస్థానములందును "వ్యాపారముకన్న భిన్నత" కరణలక్షణము ఘటిల్లుచున్నది.

1 ఇచ్చట "మొదలు" శబ్దముచేత ఈశ్వరజ్ఞానము, ఈశ్వరప్రయత్నము, కాలము, దేశము అదృష్టము, ప్రాగభావము, ప్రతిబంధకాభావము అను ఏడింటియొక్క గ్రహణము చేసి, పైఁజెప్పిన ఈశ్వరుఁడు, ఈశ్వరేచ్ఛ ఇవి రెండునుచేరి, తొమ్మిది సాధారణకారణములు అని ఎంచఁగవలెను.

ప్రమాజ్ఞానముయొక్క కారణత ఘటిల్లదు. ఏలాగుననఁగా—
చైతన్యమునకు నాల్గుభేదము లున్నవి—మొదటిది ప్రమాతృ
చైతన్యము, రెండవది ప్రమాణచైతన్యము, మూఁడవది ప్రమితి
చైతన్యము, [ప్రమాచైతన్యము]నాల్గవది ప్రమేయచైతన్యము.
[విషయచైతన్యము] ఈరీతిగా చైతన్యమునకు పేరు ప్రము యనఁ
బడును; ఆచైతన్యము నిత్యము; ఇంద్రియజన్యము గాదు;
కనుక ఇంద్రియములు దానికి కారణములుగావు: తథాపి ప్రమా
చైతన్యమునందు ప్రమావ్యవహారసంపాదకమైన వృత్తియును
ప్రమయందురు; దానికి ఇంద్రియములు కరణములుగా నున్నవి.
నాలుగుచైతన్యముల లక్షణములు ఇట్లున్నవి:—

(1) దేహమందున్న అంతఃకరణముచేతఅవచ్ఛిన్నచైతన్య మైన ప్రమాతను ప్రమాతృచైతన్య మందురు.

(2) అంతఃకరణము నేత్రాదీంద్రియద్వారమున బయలు వెడలి, ఎంతదూరము ఘటాదివిషయముండునో, అంతదూరము పరిణామమును పొందును; పిమ్మట విషయములయిన ఘటాదులతోఁ గూడి ఘటాదుల యొక్క ఆకార మెంతయగునో, అంత ఆకారమును పొందును. ఎట్లు పీఠాహ [తొట్టి] మందు నింపఁబడిన జలము ఛిద్రద్వారమున వెడలి, దీర్ఘకుల్యయై ఆరామముయొక్క కేదారమును బొంది, కేదారము వంటి యాకారమును పొందునో, అట్లు శరీరరూప మైన పీఠాహమందు నింపఁబడిన అంతఃకరణరూపమైన జలము ఇంద్రియరూపచ్ఛిద్రమువలన వెడలి, ఘటాది విషయరూపమగు కేదారమును పొందును.

అచ్చట శరీరము మొదలుకొని ఘటాదివిషయము వఱకు ఏ అంతఃకరణముయొక్క కుల్యాసదృశదీర్ఘ పరిణామమగునో, దానిని ప్రమాణవృత్తి యందురు; ఆప్రమాణవృత్తిచేత అవచ్ఛిన్నమైన ఏచైతన్యము గలదో, దానిని ప్రమాణచైతన్య మందురు.

(3) తదనంతరము అంతఃకరణరూపజలముయొక్క ఘటాది విషయరూపకేదారాకారమైన ఏ పరిణామమగునో, దానిని ప్రమావృత్తియందురు. దానిచేత అవచ్ఛిన్నమైన ఏచైతన్యము గలదో, దానిని ప్రమాచైతన్య మందురు.

(4) జ్ఞానవిషయమైన కేదారరూపఘటాదికమును ప్రమేయ [విషయ] మందురు; దానిచేత అవచ్ఛిన్నమగు చైతన్యమును ప్రమేయచైతన్యము, లేక విషయచైతన్యము అందురు.

ఇది వేదార్థము నెఱిఁగినవారలైన ఆచార్యులయొక్క పరిభాషగా నున్నది.

## { 142. అవచ్ఛేదవాదమురీతిగా ప్రమాత, సాక్షి విశేషణము, ఉపాధి వీని లక్షణములు }

పైఁజెప్పఁబడిన చైతన్యలక్షణములందు ఇన్ని భేదము లున్నవి—ఎవఁడు అవచ్ఛేదవాదము నంగీకరించునో, వాని మతమందు అంతఃకరణవిశిష్టచైతన్యమే ప్రమాతగాను, అదియే కర్తయు, భోక్తయునుగా నున్నది. మఱియు అంతఃకరణోపహిత చైతన్యమే సాక్షిగాను, అది అకర్తయు, అభోక్తయునుగా

నున్నది. ఒకచో అంతఃకరణము ప్రమాతకు విశేషణముగాను, సాక్షికి ఉపాధిగాను ఉన్నది. చూడుము—

ఇతరపదార్థములకన్న భిన్నముచేసి, వస్తువుయొక్క స్వరూపమును ఏది చూపుచున్నదో, దానిని వ్యావర్తక మందురు. దానినే అవచ్ఛేదకమును, పరిచ్ఛేదకమును అందురు. మఱియు ఇతరపదార్థములకన్న భిన్నముచేసి దేనిని చూపుచున్నదో, దానిని వ్యావర్త్య మందురు. దానినే అవచ్ఛేద్యమనియు, పరిచ్ఛేద్య మనియూ అందురు.

స్వరూపమందు దేని ప్రవేశము గలదో, ఇట్టి యే వ్యావర్తకవస్తువు గలదో, దానిని విశేషణమందురు. మఱియు ఆవిశేషణము ఇతరపదార్థములకన్న భిన్నముచేసి, దేనిని చూపుచున్నదో, దానిని విశేష్య మందురు. ఎట్లనఁగా—

"నీలఘటమున్నది" ఈస్థానంబునందు నీలత ఘటమందు ప్రవేశించి, శ్వేతపీతాదిఘటములకంటె భిన్నముచేసి, నీలవర్ణ ఘటమును చూపుచున్నది; కనుక ఆనీలత ఘటమునకు విశేషణముగా నున్నది. మఱియు శ్వేతపీతాదిఘటములకంటె భిన్నతచేత తెలియఁబడునట్టిఘటము విశేష్యముగా నున్నది;

"దండిపురుషుఁడున్నాఁడు" ఈస్థానంబునందును దండము పురుషునియొక్క విశేషణముగా నున్నది.

ఆప్రకారముగా "అంతఃకరణవిశిష్టమైన ఏ చైతన్యము గలదో, అది ప్రమాతగా నున్నది." ఈస్థానంబునందు ప్రమాతృస్వరూపమునందు అంతఃకరణము ప్రవేశించి, ప్రమేయాదిచైతన్యములకంటె భిన్నముచేసి, ప్రమాతయొక్కస్వరూపమును చూపుచున్నది; కనుక ఆయంతఃకరణము వ్యావర్తకముగాను, ప్రమా-

తకు విశేషణముగాను ఉన్నది. మఱియు ప్రమేయాదిచైతన్యములకంటె భిన్నతచేత తెలియఁబడునట్టి ప్రమాతృచైతన్యము వ్యావర్త్యముగాను విశేష్యముగాను ఉన్నది.

ఏవస్తువు స్వరూపమందు ప్రవేశము చేయకయే వ్యావర్తకముగా నుండునో, దానిని ఉపాధి యందురు. మఱియు ఆయుపాధిద్వారమున భిన్నతచేత ఏది చూపఁబడునో, దానిని ఉపహిత మందురు. ఎట్లనఁగా—

న్యాయమతమందు కర్ణశష్కుల్యవచ్ఛిన్నమయిన ఏయాకాశము గలదో, దానిని శ్రోత్రమందురు. ఈస్థానంబునందు కర్ణశష్కులి శ్రోత్రవృత్త్యాకాశముయొక్క స్వరూపమందు ప్రవేశము చేయకయే జలాకాశాదులకంటె భిన్నముచేసి, శ్రోత్రాకాశమును చూపుచున్నది; కనుక ఆకర్ణశష్కులి శ్రోత్రమునకు ఉపాధిగా నున్నది. మఱియు జలాకాశాదులకంటె భిన్నతచేత తెలియఁబడినట్టి శ్రోత్రవృత్త్యాకాశము ఉపహితముగా ఉన్నది.

"ఘటాకాశమున్నది" ఈస్థానమందును ఘటము ఆకాశమునకు ఉపాధిగా నున్నది.

ఆప్రకారముగా "అంతఃకరణోపహిత చైతన్యము సాక్షిగానున్నది" ఈస్థానంబునందు అంతఃకరణము సాక్షిస్వరూపమందు ప్రవేశము చేయకయే ప్రమేయాదిచైతన్యములకంటె భిన్నముచేసి, సాక్షిస్వరూపమును చూపుచున్నది, కనుక ఆయంతఃకరణము సాక్షికి ఉపాధిగా నున్నది. మఱియు ప్రమేయాదిచైతన్యములకంటె భిన్నతచేత తెలియఁబడునట్టి సాక్షిచైతన్యము ఉపహితముగా నున్నది.

ఈరీతిగా ఒక్కటేయంతఃకరణము సాక్షికి ఉపాధిగాను, ప్రమాతకు విశేషణముగాను ఉన్నది. కాఁబట్టి అంతఃకరణోపహితచైతన్యము సాక్షిగాను, అంతఃకరణ విశిష్టచైతన్యము ప్రమాతగాను ఉన్నది. [ఉపాధిగలదానిని ఉపహితమని, విశేషణము గలదానిని విశిష్టమని యందురు.] ఆయంతఃకరణవిశిష్టచైతన్యమైన ప్రమాతయే కర్త, భోక్త, సుఖి, దుఃఖి, సంసారి యగు జీవుఁడుగా నున్నాఁడు. ఇది అవచ్ఛేదవాదముయొక్క మార్గమని ఎఱుఁగవలెను.

### 143. ఆభాసవాదమురీతిగా జీవసాక్షులలక్షణములు

ఆభాసవాదమందు సాభాసాంతఃకరణము జీవునికి విశేషణముగాను, సాభాసాంతఃకరణము సాక్షి కుపాధిగాను ఉన్నది; కనుక సాభాసాంతఃకరణవిశిష్టచైతన్యము జీవుఁడుగాను, సాభాసాంతఃకరణోపహితచైతన్యము సాక్షిగాను ఉన్నది.

యద్యపి రెండుపక్షములందు విశేషణసహితచైతన్యమే జీవుఁడుగా నున్నది; ఆ జీవుఁడే సంసారిగానున్నాఁడు; విశేష్యభాగమైన చైతన్యమునందు జననమరణాది సంసారముయొక్క సంభవము లేదు; తథాపి విశేషణమాత్రవృత్తి ఏ సంసారము గలదో, ఆసంసారము విశిష్టచైతన్యమునందు ప్రతీతమగుచున్నది.

కొన్ని స్థలములందు విశేషణధర్మమునకు విశిష్టమందు, కొన్ని స్థలములందు విశేష్యధర్మమునకు విశిష్టమందు, కొన్ని స్థలములందు విశేషణవిశేష్యముల రెంటిధర్మములకును విశిష్టమందు వ్యవహార మగుచున్నది. ఉదాహరణములు—

(1) "దండముచే ఘటాకాశముయొక్క నాశమగును." ఈ స్థానంబునందు విశేషణమైన ఘటమునకు దండముచే

నాశమగును; విశేష్యమైన ఆకాశమునకు దండముచే నాశము ఘటిల్లదు; అయినను విశిష్టమయినఘటాకాశమునందు నాశవ్యవహారమగుచున్నది.

(2) "కుండలవంతుఁడైన పురుషుఁడు నిద్రించుచున్నాఁడు." ఈస్థానంబునందు కుండలము విశేషణము, పురుషుఁడు విశేష్యము; విశేషణమయిన కుండలమందు నిద్రించుట ఘటిల్లదు; విశేష్యుఁడైన పురుషునియందే నిద్రించుట ఘటిల్లును; అయినను కుండలవంతుఁడైన పురుషుఁడు నిద్రించుచున్నాఁడని విశిష్టమందు నిద్రావ్యవహారమగుచున్నది.

(3) "శస్త్రియైన పురుషుఁడు యుద్ధమునకు పోయెను." ఈస్థానంబునందు విశేషణమయిన శస్త్రము, విశేష్యమైన పురుషుఁడు రెండును యుద్ధమునకు పోయినవి; కనుక రెంటియొక్క ధర్మములకు విశిష్టమందు వ్యవహారమగుచున్నది.

ఈస్థానమందు అవచ్ఛేదవాదమురీతిగా అంతఃకరణము విశేషణముగాను, ఆభాసవాదమురీతిగా సాభాసాంతఃకరణము విశేషణముగాను, రెండుపక్షములందును చైతన్యము విశేష్యముగాను ఉన్నది. దానియందు జన్మాదిసంసారము ఘటిల్లదు. మత్తేమనఁగా—విశేషణమైన ఏయంతఃకరణము లేక సాభాసాంతఃకర్ణము గలదో, దానిధర్మమైన జన్మాదిసంసారమునకు విశిష్ట[1]

1. అవివేకిజనులచే భ్రాంతిబలమువలన అంతఃకరణరూపమయిన యే విశేషణము గలదో, తద్ధర్మమైన సంసారముయొక్కయు భ్రాంతికథనరూప వ్యవహారము విశిష్టచైతన్యమందు చేయఁబడుచున్నది.

చైతన్యమందు వ్యవహారముగున్నది. [ప్రతీతి, మఱియు కథనము కూడి వ్యవహార మనఁబడును.]

ఈరీతిగా ఆభాసవాదమునకును, అవచ్ఛేదవాదమునకును పరస్పర భేద ముండినను రెండుమతములందును విశేషణధర్మమయిన సంసారముయొక్క వ్యవహారము విశిష్టమందే యగుచున్నది.

## 144. ఆభాసవాదముయొక్క శ్రేష్ఠత. 144—145

ఆభాసవాదమందు అంతఃకరణము ఆభాససహితము, అవచ్ఛేదవాదమందు అంతఃకరణము ఆభాసరహితము; ఈ రెండు పక్షములందు ఆభాసవాదము శ్రేష్ఠము. ఏల యన—బ్రహ్మసూత్రభాష్యాదిగ్రంథములందు భాష్యకారుఁడు ఆభాసవాదము నంగీకరించియున్నాఁడు.

మఱియు అవచ్ఛేదవాదమందు విద్యారణ్యస్వామి దోషమును చెప్పియున్నాఁడు. ఏమనఁగా—ఆభాసరహితాంతఃకరణవిశిష్టచైతన్యమును ప్రమాత యనినపుడు ఘటవిశిష్టచైతన్యమును ప్రమాతగావలయును. ఏలయన—ఎట్లు అంతఃకరణము భూతములయొక్క కార్యమో, అట్లు ఘటమును భూతముల కార్యము; మఱియు ఎట్లు అంతఃకరణము చైతన్యమునకు అవచ్ఛేదకమో, అట్లు ఘటమును చైతన్యమునకు అవచ్ఛేదకము; కాఁబట్టి అంతఃకరణవిశిష్టన్యాయమున ఘటవిశిష్టమును ప్రమాతగావలయును.

అంతఃకరణమందు ఆభాసమును అంగీకరించుటవలన పైదోషము కలుగదు. ఏలాగుననఁగా—అంతఃకరణము భూతముల సత్త్వగుణకార్యమగుటవలన స్వచ్ఛము; శరీరఘటాదులు

భూతములు తమోగుణకార్యమగుటవలన స్వచ్ఛముగాదు; ఏది స్వచ్ఛపదార్థమో, అదియే ఆభాసమునకు యోగ్యము; మలిన పదార్థము యోగ్యముగాదు. ఎట్లు కాచము, మృత్తికయు రెండును పృథ్వీకార్యములు, వానియందు కాచము స్వచ్ఛమగుటవలన దానిలో ముఖాభాసము గలుగును. మృత్తిక మలినమగుటవలన ఆభాసము కలుగదు; అట్లు అంతఃకరణము స్వచ్ఛమగుటవలన దానియందు చైతన్యాభాసమగును; ఘటశరీరాదులు మలినమగుటవలన వానిలో చైతన్యాభాసము గానేరదు.

**145. అంతఃకరణమునందు ద్వితీయ ప్రకాశము గలుగుటవలన అదియె ప్రమాత.**

పూర్వోక్తరీతిగా అంతఃకరణమందు ద్వివిధ ప్రకాశము గలదు. మొదటిది వ్యాపకచైతన్యముయొక్క, రెండవది ఆభాసముయొక్క; శరీరఘటాదులందు వ్యాపకచైతన్యముయొక్క ప్రకాశము ఒకటే గలదు; రెండవది ఆభాసముయొక్క ప్రకాశము లేదు; కావున ద్వివిధప్రకాశసహితమయిన అంతఃకరణ విశిష్టచైతన్యమునే ప్రమాతయందురు; ఏకప్రకాశసహితమైన శరీరఘటాదివిశిష్టచైతన్యమును ప్రమాత యనరు.

ఎవరిమతమున అంతఃకరణమందు ఆభాసము లేదో, వారిమతమందు ఘటాదిన్యాయమున అంతఃకరణమందును ఆభాసునియొక్క రెండవ ప్రకాశము లేదు; వ్యాపకచైతన్యముయొక్క ప్రకాశము ఒకటిమాత్రము గలదు; అదే వ్యాపకచైతన్య ప్రకాశము ఘటాదులందును గలదు; కాబట్టి అంతఃకరణవిశిష్ట

న్యాయమున ఘటవిశిష్టము, లేక శరీరవిశిష్టము, లేక భిత్తివిశిష్టము అయిన చైతన్యము గూడ ప్రమాత గావలయును.

ఆభాసవాదమందో, అంతఃకరణమునందు ఆభాసముయొక్క ద్వితీయప్రకాశము గలదు; అందువలన అవచ్ఛేదవాదముకన్న ఆభాసవాదము శ్రేష్ఠముగ [1] నున్నది.

## 146. చతుర్విధచైతన్యస్వరూపము, సాక్షిసాక్షాత్కారము.

మొదటిది అంతఃకరణవిశిష్టచైతన్యమును, లేక సాభాసాంతఃకరణవిశిష్టచైతన్యమును ప్రమాతృచైతన్య మందురు. రెండవది ఘటాదిప్రమేయావచ్ఛిన్నచైతన్యమును ప్రమేయచైతన్య మందురు. మూఁడవది కేవలవృత్తివిశిష్టచైతన్యమును, లేక సాభాసవృత్తివిశిష్టచైతన్యమును ప్రమాణచైతన్యమందురు, నాలుగవది ఘటాదివిషయాకారవృత్తియందు ఆరూఢచైతన్యమును ప్రమాచైతన్య మందురు.

ప్రమాచైతన్యమునకు సాధనమైన ఇంద్రియమును ప్రమాణమందురు. యద్యపి చైతన్యముస్వరూపముచేనిత్యము; దానియందు ఇంద్రియజన్యత్వాభావమువలన ప్రమాచైతన్యమునకు సాధనము ఇంద్రియమనఁగూడదు; తథాపి నిరుపాధికచైత

1. ఆభాసవాదమందు ఆభాసముయొక్క కల్పన అధికముగ నున్నది. అవచ్ఛేదవాదమందు లేదు; కనుక ఆభాసవాదమందు గౌరవము, [విస్తారము] అవచ్ఛేదవాదమందు లాఘవము [సంకోచము] ఉన్నది; అట్లయినను మందబుద్ధిగల జిజ్ఞాసుబుద్ధియందు ఆభాసవాదముయొక్క ఆరోపము బాగుగా నిలుచుచున్నది; ఈయభిప్రాయమువలన ఇచట ఆభాసవాదముయొక్క స్తుతి చేసినాఁడు. భాష్యకారాదులకును ఇదియే అభిప్రాయము.

న్యమందు ప్రమావ్యవహారము ఘటిల్లదు; మఱేమనఁగా—విషయాకారవృత్త్యుపహితచైతన్యమందు ఘటిల్లినది. కనుక చైతన్యమునందు ప్రమావ్యవహారప్రవృత్తికొఱకు విషయాకారవృత్తి ఉపాధిగా నున్నది; ఆయుపాధియైనవృత్తి ఇంద్రియజన్యమగుటవలన తదుపహితమైన ప్రమాచైతన్యము ఇంద్రియజన్యమని చెప్పఁబడును; ఆలాగు ఇంద్రియము ప్రమకు సాధనమని చెప్పఁబడినది.

అట్లయినను అంతఃకరణముయొక్క పరిణామము సమగ్రమును ప్రమ యనఁగూడదు; మఱేమనఁగా—శరీరమునుంచి ఘటాదికమువఱకు అంతఃకరణపరిణామము ప్రమాణమనఁబడును; అదే పరిణామము విషయముతోఁ గూడి తదాకారమైనపుడు ఎంతపరిణామము విషయాకార మగునో, అంతపరిణామమే ప్రమ యనఁబడును. కాబట్టి ప్రమాప్రమాణములందు పరస్పరభేదము అల్పముగానే యున్నది; అధికము లేదు.

ఈరీతిగా బాహ్యపదార్థప్రత్యక్షజ్ఞాన ప్రసంగమందు అంతఃకరణము ఇంద్రియద్వారమున బయలువెడలి, ఘటాది విషయసమానాకారమును ధరించుచున్నది.

శరీరాంతస్థితుఁడైన ఏయాత్మగలఁడో, తత్ప్రత్యక్షజ్ఞాన ప్రసంగమందు అంతఃకరణవృత్తి వెలుపలకుపోక, శరీరమునకు లోపలనే ఆత్మాకార మగుచున్నది. ఆయాత్మాకారవృత్తివలన ఆత్మాశ్రితమైన ఆవరణము దూరమై, ఆవృత్తియందు ఆత్మ స్వతః ప్రకాశరూపముగా ప్రకటమగుచున్నాఁడు. ఈకారణమువలన వృత్తికి విషయము ఆత్మ యని చెప్పఁబడుచున్నది; అయినను

వృత్తియందు ఏ చిదాభాసమైన ఫలము గలదో, తద్విషయము ఆత్మ గాఁడు.

ఈరీతిగా సాక్షియైనఆత్మ స్వయంప్రకాశరూపముగా భాసమానుఁడగుచున్నాఁడు; అని సిద్ధమయినది.

**147.** ప్రశ్న—147—151 అహంబ్రహ్మాస్మి అనుజ్ఞానము ప్రత్యక్ష మెట్లగును?

బ్రహ్మాపరోక్షజ్ఞానమువలన సకలావిద్యాజాలనాశమగునని, అది పరోక్షజ్ఞానముచేఁ గాదని పూర్వము చెప్పఁబడినది; దానియందు శంక కలుగుచున్నది. అ దేమనఁగా—బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షమగుట ఘటిల్లదు. ఏలయన—ఇంద్రియజన్యజ్ఞానము ప్రత్యక్షము; బ్రహ్మజ్ఞానమో, ఇంద్రియజన్యము గాదు. ఏలాగున ననఁగా—

**148.** బ్రహ్మము నేత్రమునకు అవిషయము, రామకృష్ణాదులశరీరములు బ్రహ్మము గావు?

నేత్రేంద్రియమువలన నీలపీతాదిరూపముయొక్కయు, రూపవంతమగు ఘటాదిపదార్థముయొక్కయు జ్ఞానమగుచున్నది; బ్రహ్మమో, అటువంటిది కాదు; కనుక బ్రహ్మవిషయకమగు నేత్రేంద్రియజన్యజ్ఞానము సంభవింపదు. రామకృష్ణాదులయొక్క మనుష్యాకారమూర్తులు రూపవంతములైనను ఆమూర్తులు మాయారచితములగుటవలన మిథ్యగా నున్నవి; ఆమూర్తులు బ్రహ్మము గావు. పురాణమందు రామకృష్ణాదులకు ఏబ్రహ్మ

రూపత చెప్పఁబడినదో, అది రామకృష్ణాదుల [1] శరీరరూప మూర్తులు బ్రహ్మరూపమను నభిప్రాయముచే చెప్పఁబడలేదు;

1. నామముయొక్క ఉచ్చారణము పలుమారు కాఁగూడ దను నభిప్రాయముచే సర్వనామముయొక్క ఉపయోగము వ్యాకరణశాస్త్రమునందు చెప్పఁబడినది. ఈస్థానంబునందు విచారయోగ్యమైన ప్రశ్నములు ఇట్లున్నవి—

(1) నామముయొక్క ఉచ్చారణము పలుమారు ఎందుకు కాఁగూడదు?

(2) వ్యాకరణాచార్యులు నాస్తికులా?

వానియందు ప్రథమప్రశ్నయొక్క సమాధానమేమనఁగా—బ్రహ్మభిన్నపదార్థములును వానినామములును అన్నియు అవిద్యాకల్పితమై మిథ్యగా నున్నవి. ఆమిథ్యాపదార్థములయొక్క మిథ్యానామములు పలుమారు ఉచ్చరించుట అవిద్యావృద్ధికి హేతువుమాత్రమగును; కాని దానియందు ఏదొక్క లాభము కనఁబడదు. ఈయభిప్రాయమున అవిద్యాకల్పితపదార్థముల నామోచ్చారణమందలిఅసహ్యదృష్టిచే సర్వనామముయొక్క ఉపయోగము వ్యాకరణశాస్త్రమందు చెప్పఁబడినది. కాని, చైతన్యేత్యాది బ్రహ్మబోధకనామములు రామకృష్ణనారాయణాదిఈశ్వరవాచకనామములు. వీనియొక్కఉచ్చారణము పలుమారు కాఁగూడదని వ్యాకరణాచార్యుల అభిప్రాయము కానేరదు. ఎందుకనఁగా—బ్రహ్మనామోచ్చారణముచేతను, ఈశ్వరనామోచ్చారణముచేతను సకలపాపములునాశనమై, అంతఃకరణశుద్ధియై దానివలన పురుషుఁడు అధికారియై, బ్రహ్మజ్ఞానము సంపాదించి, భవసముద్రము నుల్లంఘించుచున్నాఁడనుసంగతి వేదమందును, శాస్త్రమందును, పురాణమందును ప్రసిద్ధముగ నున్నది.

అన్నినామములయొక్క ఉచ్చారణము పలుమారు చేయఁగూడదను నభిప్రాయముచేతనే వ్యాకరణమునందు సర్వనామముయొక్క ఉపయోగము చెప్పఁబడినది; ఆ నామములు అవిద్యాకల్పితపదార్థములయొక్కగానీ, లేక

ముతేమనఁగా—రామకృష్ణాదులశరీరముల కధిష్ఠానము బ్రహ్మ మను నభిప్రాయముచే చెప్పఁబడియున్నది.

---

విద్యాకల్పితపదార్థములయొక్కగానీ; అని ఈప్రకారముగ ఎవ్వఁడేని దురాగ్రహము చేసినపుడు "వ్యాకరణాచార్యులు నాస్తికులా!" అను నీ ద్వితీయ ప్రశ్నయొక్కవిచారము చేయవలెను.

పాణినిమొదలగు కరుణాసాగరులై, సర్వజ్ఞులైన ఆచార్యులచే, వేద శాస్త్రముయొక్క అర్థము తెలిసి, అజ్ఞానిజనులు భవసాగరము దాఁటవలెనని కరుణాబుద్ధిచే శబ్దశాస్త్రము నిర్మింపఁబడినది; వారేమి నాస్తికులా? వారేమి ఈశ్వరనామమాహాత్మ్యము నెఱుఁగనివారా? వారేమి జనులహితము కోరని వారా? ఈశ్వరనామలోపాభిప్రాయము ఏల కలిగియుందురు? అట్లుకాదు. అందువలనవారియభిప్రాయము అట్లుకాదు. అనఁగా భగవన్నామోచ్చారణము దక్క అవిద్యాకల్పితములైన సకలపదార్థములయొక్క నామోచ్చారణము పలుమారు కాఁగూడదనియే వారియభిప్రాయము.

పదార్థముయొక్క బోధ నామముచే ఎట్లగునో, సర్వనామముచేతను అట్లే యగును; పదార్థబోధమునందు భేదము లేదు; ఈవిధముగాఁ జూచినట్ట యిన నామసర్వనామోచ్చారములందు ఫలవిషయకమగు భేదము కనఁబడదు; ఇట్లుండఁగా అవిద్యాకల్పితపదార్థనామమనియు, విద్యాకల్పితపదార్థనామ మనియు నామములందు రెండుతరగతులు చేసి, ఒకతరగతికొఱకుమాత్రమే సర్వ నామోపయోగము, రెండవతరగతికొఱకు లేదు; అనుట సరికాదు? ఇట్టి ఆక్షేపము ఎవ్వఁడేని చేసినపుడు దానికి సమాధానము —

ఒకనికి తనశత్రువుయొక్క పేరు ఉచ్చరించుటచే మనస్సులో మహా తాపమగుచున్నది. వాఁడు ఆశత్రువుయొక్క సంగతి ఎవ్వనికైన చెప్పవలసిన అతఁడు, ఇతఁడు, దుర్జనుఁడు ఇత్యాది సంజ్ఞామాత్రముచే శత్రుబుద్ధిచే వాని నామముయొక్క సందిగ్ధోచ్చారము చేయుచున్నాఁడు. అపుడు వానికి స్పష్ట

ఈవిషయమందు దిట్టిశంక గలుగును—సర్వశరీరములకు అధిష్ఠానము బ్రహ్మమే; కనుక అధిష్ఠానాభిప్రాయముచే రామ

---

నామోచ్చారఫలముకన్న అల్పఫలమగుచున్నది. [నామసర్వనామఫలము లందు ఇంకను విలక్షణత సిద్ధమగుచున్నది.] ఈప్రకారముగ నామోచ్చారముయొక్క ఫలము సర్వనామోచ్చారమునందు ఘటిల్లదు. కనుక అవిద్యాకల్పితములగు, విద్యాకల్పితములగు పదార్థములయొక్క నామములందు రెండు తరగతులు చేసి, ఒకతరగతికొఱకు సర్వనామోపయోగము చూపి, రెండవతరగతి కొఱకు లేదనుట ఉచితమే.

ఉక్తవిచారపూర్వకముగఁ జూచినట్లయిన అసత్యమై, మిథ్యయైన అవిద్యాకల్పితపదార్థములయొక్క నామోచ్చారము పలుమారు కాఁగూడ దను నభిప్రాయముచేతనే కరుణాసాగరులై, సర్వజ్ఞులైన వ్యాకరణాచార్యులచే సర్వనామోపయోగము చెప్పఁబడియున్నది. కాని పవిత్రమై, ప్రియమైన భగవన్నామోచ్చారముయొక్క సంక్షేపముకొఱకు సర్వనామోపయోగము చెప్పఁబడలేదని సిద్ధమగుచున్నది.

ఇచ్చట మూలగ్రంథములో బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షము గా నేరదను ప్రకరణమునందు అత్యంతపవిత్రప్రియములైన రామకృష్ణాదులపేర్లు పెక్కు తడవలు వచ్చుచున్నవి. ఆయాస్థానంబునందు సర్వనామోపయోగము చేసి నపుడు నారామకృష్ణనామములయొక్క లోపము బహుధా యగుచున్నది; జనులయొక్క అంతఃకరణశుద్ధికొఱకును, నామరసాస్వాదముకొఱకును పలు మారు రామకృష్ణనామకీర్తనముయొక్క అత్యంతావశ్యకత యున్నది. కావున నీప్రకరణమునందు ఎక్కడను సర్వనామోపయోగము చేయక, ఇంకను ఏ విధముగానైనను రామకృష్ణనామములయొక్క సంక్షేపము చేయక నారామ కృష్ణనామములు అట్లే ఉంచుచున్నాను.-రామకృష్ణ! రామకృష్ణ! రామకృష్ణ! రామకృష్ణ! రామకృష్ణ! రామకృష్ణ! రామకృష్ణ! రామకృష్ణ! రామకృష్ణ!

కృష్ణాదులకు బ్రహ్మరూపత చెప్పినపక్షమందు సర్వశరీరములకును అధిష్ఠానము బ్రహ్మమగుటవలన మనుష్యపశుపక్ష్యాది సమస్త శరీరములు బ్రహ్మరూపమే; వీనితో సమానులే రామకృష్ణాదు లగుదురు; కాబట్టి రామకృష్ణాదులకు అధిష్ఠానము బ్రహ్మ మను నభిప్రాయమున బ్రహ్మరూపత యుక్తముగాదు; మఱేమనఁగా–రామకృష్ణాదులకు ఇతరజీవులకన్న విశేషరూపతాసిద్ధికొఱకే రామకృష్ణాదులశరీరములు బ్రహ్మమని యంగీకరించుట యోగ్య మను నభిప్రాయముచే రామకృష్ణాదులకు బ్రహ్మరూపత చెప్పఁ బడియున్నది?

ఈమాటఘటిల్లదు. ఏలయన—శరీరబాధచేసి, రామ కృష్ణాదులశరీరములను బ్రహ్మరూపమని యంగీకరించినయెడల సర్వశరీరములబాధచే సర్వశరీరములును బ్రహ్మరూపములే. మఱియు బాధచేయకుండిననో, అన్యశరీరముల న్యాయమున హస్తపాదాద్యవయవ సహితములయి, రూపవత్ సక్రియముల యిన రామకృష్ణాదులశరీరములకు నిరవయవనిరూపనిష్క్రియ మగు బ్రహ్మముతోడ అభేదము ఘటిల్లదు; కనుక రామకృష్ణా దులశరీరములు బ్రహ్మముగావు;

అయినను రామకృష్ణాదులశరీరములకు, ఇతరశరీరములకు ఇంతభేదముగలదు–జీవుల శరీరములుపుణ్యపాపములకధీనములు భూతకార్యములు; మఱియు జీవులకు దేహాద్యనాత్మపదార్థము లందు అవిద్యాబలమువలన అహమ్మమాధ్యాసము గలదు; ఆచా ర్యోపదేశమువలన దానికి నివృత్తి యగును; రామకృష్ణాదుల శరీరములు పుణ్యపాపములరచితములు గావు; భూతకార్యము లును గావు; మఱేమనఁగా—సృష్టియొక్క ఆదియందు ప్రాణుల

కర్మము భోగమునిచ్చుటకొఱకై సమ్ముఖమైనప్పుడు ఆ ప్రకాశముకలదైన ఈశ్వరునియందు ప్రాణులకర్మానుసారము "నేను జగదుత్పత్తి చేయవలయును" ఇట్టి సంకల్పమగును; ఆ సంకల్పమువలన జగదుత్పత్తి యగుచున్నది; సృష్ట్యనంతరము "నేను జగత్పాలనము చేయవలయును" ఇట్టి సంకల్పమగును; ఆ సంకల్పమువలన జగత్పాలనమగుచున్నది;[కర్మానుసారముగా సుఖదుఃఖభోగముల నిచ్చుట పాలనమందురు.] ఆపాలనసంకల్పమందు ఉపాసక పురుషుల ఉపాసనాబలమువలన, మఱియు దుష్టజనుల దుష్కృత బలమువలన ఈశ్వరున కిట్టిసంకల్ప మగుచున్నది—"రామకృష్ణాదినామసహితమూర్తులు సర్వులకు ప్రతీతము కావలయును" ఆ ఈశ్వరసంకల్పమువలన విశేషనామరూపరహితమైన ఈశ్వరుని యందు రామకృష్ణాది నామములుగల శ్యామసుందర పీతాంబర ధారిరూపములగు విగ్రహములు ఉత్పత్తియగును. ఆవిగ్రహములు జీవునిశరీరమువలె కర్మాధీనములు గావు.

యద్యపి రామకృష్ణాదులవిగ్రహములచే సాధ్యసాధుపురుషులకు క్రమముగా సుఖదుఃఖము లగుచున్నవి; ఏవి దేనిసుఖదుఃఖములకు హేతువో, అది దానిపుణ్యపాపములచేత రచితము; అందువలన పుణ్యపాపాధీనమందురు. ఈరీతిగా అవతారశరీరములు సాధుపురుషులకు సుఖహేతు వగుటవలన వీరిపుణ్యసముదాయముచేత, అసురాదులగు అసాధుపురుషులకు దుఃఖహేతువగుటవలన వీరి పాపసముదాయముచేత రచితమని చెప్పవలెను; కాఁబట్టి అవతారశరీరములు పుణ్యపాపముల కధీనములుగావనుట సంభవింపదు; తథాపి జీవునిచేత పూర్వశరీరమందు కృతమైన పుణ్యపాపకర్మములయొక్క ఫలము ఉత్తరజన్మము

నందు వానికి సుఖదుఃఖరూపముచేత ప్రాప్తమగును; అచ్చట శరీరాభిమానియైన జీవునియొక్క యుత్తరశరీరము పూర్వశరీరకృత పుణ్యపాపాధీన మని చెప్పుదురు; అట్లు రామకృష్ణాదుల శరీరములు సాధ్యసాధుపురుషుల పుణ్యపాపములకు అధీనములయినను, వారికి సుఖదుఃఖహేతువులైనను రామకృష్ణాదులయొక్క స్వపుణ్యపాపములచేత రచితమైనవి గావు. మఱియు రామకృష్ణాదులకు తమశరీరముచేత సుఖదుఃఖోపభోగమును కలుగదు; కనుక రామకృష్ణాదులశరీరములు తమపుణ్యపాపముల కధీనము గా వనుట సంభవించినది.

మఱియును రామకృష్ణాదిశరీరములు పంచీకృతభూతపరిణామమును గావు మఱేమనఁగా—చైతన్యాశ్రితమాయయొక్క సాత్త్వపరిణామములుగ నున్నవి. అవి పంచీకృతభూతపరిణామ మనినయెడల కృష్ణశరీరమందు రజ్జుబంధనాద్యశక్యత శాస్త్రమందు చెప్పుట అసంగతమగును.

యద్యపి పంచభూతరచితమైన సిద్ధయోగిశరీరమందును బంధనాదికము గానేరదు. తథాపి యోగిశరీరమందు ప్రథమ బంధనాదికముయొక్క సంభవము గలదు; తరువాత యోగాభ్యాసరూపపురుషార్థమువలన బంధనాదియోగ్యతయొక్క నాశ మగుచున్నది; రామకృష్ణాదులశరీరములందు యోగివ్యాయమున ఏదోకపురుషార్థమువలన బంధనాదులయొక్క అభావము సంభవింపదు; మఱేమనఁగా—రామకృష్ణాదులశరీరములు సహజముగానే బంధనాదులకు యోగ్యములు గావు; అందువలన భూతపరిణామములుగావు.

మాండూక్యభాష్యటీకయందు ఆనందగిరిచేత రామకృష్ణా

దులశరీరములు భూతములపరిణామ మని చెప్పఁబడినది; అది స్థూలదృష్టివలన ఇతరశరీరములతో సమానముగా ప్రతీతమగు నను నభిప్రాయముచే చెప్పఁబడియున్నది. పూజ్యచరణశంకరా చార్యునిచే గీతాభాష్యమునందు ఇట్లు చెప్పఁబడినది—"జీవుల ననుగ్రహించుటకొఱకు శరీరధారిన్యాయమున మాయాబలము వలన పరమాత్మ కృష్ణరూపుఁడుగా ప్రతీతుఁడయ్యెను; వాఁడు జన్మాదిరహితుఁడుగా నున్నాఁడు; వానియొక్క జన్మము వసు దేవునిద్వారమున దేవకీజఠరమందు మాయచేతనే ప్రతీత మైనది." ఈరీతిగా భాష్యకారునిచేత కృష్ణశరీరము మాయా కార్య మని చెప్పఁబడినది.

జీవునకు దేహాదికమునందు ఆత్మభ్రాంతి కలదు; అది రామకృష్ణాదులకు లేదు. ఏలయన—జీవునియొక్క ఉపాధి అవిద్య, మలినసత్త్వగుణముగలదిగాను, రామకృష్ణాదులయొక్క ఉపాధి మాయ, శుద్ధసత్త్వగుణము గలదిగాను ఉన్నది; అందు వలన జీవునకు అవిద్యాకృతభ్రాంతి గలదు; రామకృష్ణాదులకు మాయాకృతసర్వజ్ఞత గలదు.

జీవునకు అజ్ఞానకృతావరణనాశముకొఱకును, భ్రాంతి నాశముకొఱకును ఆచార్యద్వారమున మహావాక్యోపదేశ జన్యజ్ఞానాపేక్ష కలుగును; అట్లు రామకృష్ణాదులకు ఆవరణము లేదు, భ్రాంతియు లేదు; కనుక ఉపదేశజన్యజ్ఞానాపేక్షయు లేదు.

జీవునకు అంతఃకరణవృత్తిరూపజ్ఞానన్యాయమున ఈశ్వరు నకు మాయావృత్తిరూపమైన ఆత్మజ్ఞానము ఉపదేశము లేకయు గలదు; అయినను అజ్ఞానమువలన ఈశ్వరునకు ఆవరణభంగము చేయుట, లేక ఆత్మప్రకాశముచేయుట ఏప్రయోజనము సిద్ధిం

పదు. జీవునకు ఘటాదిజ్ఞానప్రసంగమునందు అంతఃకరణవృత్తి ద్వారమున ఘటాదివిషయముయొక్క ఆవరణభంగమును, తత్ప్రకాశమును అగును; మఱియు ఆత్మజ్ఞానప్రసంగమందు అహంబ్రహ్మాస్మి అను అంతఃకరణవృత్తివలన ఆత్మయొక్క ఆవరణభంగమగును; ఆత్మ స్వయంప్రకాశుఁడగుటవలన వృత్తిచే తత్ప్రకాశముమాత్రము ఘటిల్లదు; ఈప్రకారముగా జీవునకు ఒకఆత్మప్రకాశమును వదలి, తక్కిన సకలప్రయోజనసిద్ధి వృత్తిజ్ఞానమువలన నగుచున్నది. ఈశ్వరునిఆత్మ నిరావరణస్వయంప్రకాశుఁడగుటవలన మాయావృత్తిరూప మయిన "అహంబ్రహ్మాస్మి" అను ఈశ్వరజ్ఞానమునకు ఆవరణభంగాది ఏప్రయోజనము ఘటిల్లదు. ఎట్లు జీవన్ముక్తవిద్వాంసునకు నిరావరణుఁడైన ఆత్మను విషయముచేయునట్టి అహంబ్రహ్మాస్మిరూపమైన అంతఃకరణవృత్తి, ఆవరణభంగాది ప్రయోజనరహితముగా నున్నదో అట్లు ఈశ్వరునకును ఆవరణభంగాది ప్రయోజనరహితమగు మాయావృత్తిరూపమయిన అహంబ్రహ్మాస్మి అనుజ్ఞానము ఉపదేశాదికము లేకయుఁ గలదు.

ఈరీతిగా రామకృష్ణాదులకు జీవులకన్న విలక్షణత్వ మఱియు ఈశ్వరత గలదు. అట్లయినను రామకృష్ణాదులశరీరములు మాయారచితములుగా నున్నవి; అవి బ్రహ్మము గావు. నేత్రేంద్రియము రూపమును, తదాశ్రయమగుపదార్థమును విషయము చేయును; [1] ఆప్రకారముగ మాయారచితములైన

---

1. నేత్రవృత్తి తనగోలకమును విడిచి, బాహిరముపోయి, రూపవత్పదార్థజ్ఞానము చేయును; శ్రోత్రవృత్తియును తనగోలకమును విడిచి, బాహిరముపోయి, శబ్దజ్ఞానము చేయును; త్వక్కు, రసన, ఘ్రాణము ఇవి

**హస్తపాదాద్యవయవసహితములగు, రూపసహితములగు అవతారశరీరములను విషయము చేసినను, నిరాకారరూపరహితమగు బ్రహ్మమును నేత్రేంద్రియము విషయము చేయదు?**

---

మూఁడు తమగోలకములను విడిచి బాహిరము పోవు; మఱేమనఁగా— శరీరక్రియచేతఁగాని, విషయక్రియచేతఁగాని గోలకపర్యంతము ప్రాప్తమయిన స్పర్శము, రసము, గంధము వానిలో ఏ విషయము గలదో, దానిజ్ఞానమును ఆయాయింద్రియము చేయుచున్నది. ఆయావిషయజ్ఞానప్రసంగమందు అంతఃకరణవృత్తి ఆయాయింద్రియమువరకువచ్చి, ఆయాయింద్రియద్వారమున ఆయావిషయముయొక్క ఆవరణభంగము చేయుచున్నది; మఱియు చిదాభాసుఁడు ఆయావిషయముయొక్క ప్రకాశము చేయుచున్నాఁడు.

ఈరీతిగా నేత్రశ్రోత్రములవృత్తి బాహిరము పోవుచున్నది; మఱియు త్వగాదులవృత్తి బాహిరముపోదు; వీనిలో ఇంత పరస్పరవిలక్షణత గలదు.

ఘ్రాణేంద్రియముయొక్క విషయమైన ఏగంధముగలదో, దాని ఆశ్రయమైన ఏపుష్పాదిపదార్థము గలదో, అది నాసికకంటె దూరమైనను గంధజ్ఞానము ఘటిల్లినది; ఆప్రసంగమందు పుష్పాదికముయొక్క సూక్ష్మపరమాణువులు ఘ్రాణేంద్రియపర్యంతము ప్రాప్తమగునని తెలియవలెను.

విద్యమానకాలమునఁ గొన్నిమతములలో, ఘ్రాణమాదిగాఁగల మూఁడు ఇంద్రియములవలెనే నేత్రేంద్రియవృత్తియు శ్రోత్రేంద్రియవృత్తియు బాహిరముపోవు; తమతమస్థానంబులందే యుండఁగా నేత్రేంద్రియశ్రోత్రేంద్రియములచేత విషయజ్ఞానమగుచున్నది.

రూపవత్పదార్థముకన్న వ్యత్యస్తమగు దాని ప్రతిబింబము నేత్రేంద్రియముయొక్క బహిఃప్రదేశమునందగుచున్నది; మరల దానియొక్క సమానప్రతిబింబము అంతఃప్రదేశమునందగుచున్నది; ఈపరంపరగా రూపవత్పదార్థముయొక్క జ్ఞానము అంతఃకరణమునకు అగుచున్నది.

## 149. బ్రహ్మమునకు త్వగాదీంద్రియముల యొక్క అవిషయత.

అట్లు త్వగింద్రియము స్పర్శమును, స్పర్శాశ్రయమును విషయము చేయును; బ్రహ్మమో, స్పర్శముగాదు; స్పర్శాశ్రయ

---

శబ్దము పుట్టఁగానే తచ్ఛబ్దదేశస్థితవాయువునకు ఆశబ్దముయొక్క ఆఘాతమయి ఆవాయువుయొక్క ప్రతిసారణమగుచున్నది; తద్వాయుసన్నిహితవాయువునకు పూర్వవాయువుయొక్క ఆఘాతమగుచున్నది; ఈవిధముగ వాయువుయొక్క ప్రతిసారణము చేసిచేసి, శబ్దము శ్రోత్రేంద్రియమువరకు పొందుచున్నది. లేక శబ్దము పుట్టినవెంటనే దానియొక్క ప్రతిధ్వని సన్నిహితవాయువునందు అగుచున్నది; ఈవిధముగ ప్రతిధ్వనిపరంపరచేత శబ్దము శ్రోత్రేంద్రియమువరకు పొందుచున్నది.

ఈమార్గమునందు దోషముండనీ, లేకపోనీ దీనియందు దూషణభూషణము వ్రాయుట, ఆవశ్యకతలేమివలన ఇచ్చట వ్రాయలేదు; "బ్రహ్మజ్ఞానము ఇంద్రియజన్యముగాదు" అనునీ అర్థముమీఁద వేదాంతముయొక్క అంతరంగతాత్పర్యము, మఱియు "ఎపుడు ఏవిషయముయొక్క జ్ఞానమగుచున్నదో, అపుడు అంతఃకరణవృత్తిచేత ఆవిషయముయొక్క ఆవరణభంగమై చిదాభాసునిచేత ఆవిషయముయొక్క ప్రకాశమగుచున్నది." అనునీ అర్థముమీఁద బహిరంగతాత్పర్యము; ఉక్తమైనరెండుఅర్థములమీఁదదక్క ఇంద్రియజ్ఞానవ్యవస్థయందు వేదాంతముయొక్క తాత్పర్యము ఇంకొక్కఅర్థముమీఁద లేదు. ఉక్తతాత్పర్యమునకు సాధకమయినట్టి ఇంద్రియజ్ఞానవ్యవస్థ వేదాంతమునందు చెప్పఁబడియున్నది. ఉక్తతాత్పర్యసాధకతదప్ప ఇంద్రియజ్ఞానవ్యవస్థయొక్క ప్రయోజన మేమియు లేదు; అట్లయినను వేదాంతమందు ఏ ఇంద్రియజ్ఞానపద్ధతి చెప్పఁబడినదో, అది సర్వథా నిర్దోషముగ నున్నది.

అన్యమతానుసారి ఒకానొకఁడు అనుచున్నాఁడు—వేదాంతమునందు

మును గాదు; కాఁబట్టి బ్రహ్మము త్వగింద్రియమునకు విషయము గాదు!

---

చెప్పఁబడిన ఇంద్రియజ్ఞానవ్యవస్థ మిథ్యగా నున్నది. వానిని అడుగవలెను—అహ్యా! ఇంద్రియములు సత్యమై వానిజ్ఞానవ్యవస్థమాత్రము మిథ్యయా? లేక ఇంద్రియములును మిథ్య, జ్ఞానవ్యవస్థయును మిథ్యయా?

వాఁడు ఇంద్రియములును మిథ్య, జ్ఞానవ్యవస్థయును మిథ్య: అనినపక్ష మందు ఈమాట నేను అంగీకరించుచున్నాను; ఎందు కనఁగా—బ్రహ్మభిన్నములగు సకలపదార్థములును మిథ్య; ఇదే వేదాంతముయొక్క అభిప్రాయము.

ఇట్లుగాక ఇంద్రియములు సత్యము; ఇంద్రియజ్ఞానవ్యవస్థమాత్రము మిథ్య; అనినపుడు ఆమాట ఘటిల్లదు. ఎందుకనఁగా—ఒక బ్రహ్మజ్ఞానముదక్క ఇంకనే జ్ఞానముచేతను ఏది బాధితము గాదో, అది వ్యావహారికసత్యమందురు; శరీరేంద్రియాదిజగత్తు బ్రహ్మజ్ఞానముదక్క విజ్ఞానముచేతను బాధితముగాదు; అందువలన దానిని వ్యావహారికసత్య మందురు; అట్లు వేదాంతవిచారమును బ్రహ్మజ్ఞానముదక్క ఇంకొక్కజ్ఞానముచేత బాధితము గాదు; అందువలన దానినిగూడ వ్యావహారికసత్య మందురు; ఇట్లుండగా నింద్రియాదిజగత్తు మాత్రము సత్యము, వేదాంతవిచారము మిథ్య; అనుట విచారశీలపురుషునకుఁ హాస్యజనకముగ నున్నది.

ఇపుడు అట్లు కాదు; ఒక బ్రహ్మజ్ఞానముచేత మాత్రము బాధితమైన దానికి వ్యావహారికసత్య మనవలెయును; వేదాంతవిచారమో, అన్యవిచారము చేతఁగూడ బాధితమగుచున్నది; అందువలన అది సత్యముకాదు; మిథ్యయే. ఇట్లనినపక్షమందు ఆమాట ఘటిల్లదు. ఎందుకనఁగా—వేదాంతవిచారము శ్రుతివలనను, యుక్తివలనను, సర్వజ్ఞజనులయొక్క అనుభవమువలనను అబాధితముగ నున్నది. [బ్రహ్మము నిరపేక్షాబాధితము, వేదాంతవిచారము సాపేక్షాబాధితము.]

అట్లు రసనమువలన రసముయొక్క, ఘ్రాణమువలన గంధముయొక్క, శ్రోత్రమువలన శబ్దముయొక్క జ్ఞానమగును; బ్రహ్మమో, రసగంధశబ్దములకన్న విలక్షణముగ నున్నది; అందు వలన బ్రహ్మము రసనాదులకు విషయము గాదు.

**150.** బ్రహ్మమునకు కర్మేంద్రియములయొక్క అవిషయత.

కర్మేంద్రియములు జ్ఞానమునకు సాధనములు గావు; అవి వచనాదిక్రియకే సాధనములుగ నున్నవి; కనుక వానిచేత ఘట పటజ్ఞానముకూడఁ గానేరదు; వానికి బ్రహ్మజ్ఞాన మెట్లగును? [కానేర దని అభిప్రాయము.]

**151.** బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షముగావను ఆక్షేపమునకు సమాప్తి.

ఉక్తప్రకారముగా ఏ ఇంద్రియమువలనను బ్రహ్మజ్ఞానము ఘటిల్లదు; మఱియు ఇంద్రియజన్యజ్ఞానమునే ప్రత్యక్షమనఁగా అపరోక్ష మందురు; కాఁబట్టి బ్రహ్మవిషయమునందు అపరోక్షజ్ఞానము ఘటిల్లదు. బ్రహ్మజ్ఞానమో, శబ్దముచే ఘటిల్లినది; ఏజ్ఞానము శబ్దముచే నగునో, అది పరోక్షమనవలయును. కనుక శబ్దజన్యమైనట్టి బ్రహ్మజ్ఞానమును పరోక్షమే?

**152.** 147—151 గతప్రశ్నకుత్తరము 152, 153 పరోక్షాపరోక్షజ్ఞానముల విభాగము

పూర్వపక్షి చెప్పెను—"ఇంద్రియసంబంధము లేక ప్రత్యక్ష జ్ఞానము గానేరదు." ఈనియమము లేదు. చూడుము—సుఖ దుఃఖములయొక్క జ్ఞానము ఇంద్రియజన్యము కాకపోయినను,

ప్రత్యక్ష మగును; కనుక ఇంద్రియజన్యత ప్రత్యక్షజ్ఞానమునకు హేతువగుట నియమము లేదు; [1] మఱేమనఁగా—విషయము నకును, వృత్తికిని సంబంధమువలన విషయాకారవృత్తి ఎచ్చట నగునో, అచ్చట ప్రత్యక్షజ్ఞాన మందురు.

1. విషయచైతన్యమునకు వృత్తిచైతన్యముతో అభేదమగుటయే ప్రత్యక్షజ్ఞానముయొక్క లక్షణము. ఆ అభేదము కొంతస్థలమందు ఇంద్రియ ద్వారమును, కొంతస్థలమందు శబ్దద్వారమును, కొంతస్థలమందు ఇంద్రియాది బాహ్యనిమిత్తము లేకయుం శరీరాంతరమందు ఉత్పన్నమైన కేవలవృత్తివలన నగుచున్నది; అచ్చటచ్చట ప్రత్యక్షజ్ఞానమని తెలియవలెను.

చైతన్యమునకు స్వరూపముచేత ఎచ్చటను భేదములేదు; మఱే మనఁగా—విషయరూపమైన, వృత్తిరూపమైన యుపాధులచేత చేయఁబడిన భేదముగలదు. ఆయుపాధులు ఎప్పుడు భిన్నభిన్నదేశమందు ఉన్నవో, అప్పుడు ఆయుపాధివంతములగు చైతన్యములయొక్క భేదము చెప్పవలెను; ఎప్పుడు వృత్తి విషయాకారమగునో, అప్పుడు రెండు ఉపాధులు ఏకదేశమం దుండును; అందువలన ఆయుపాధివంతములైన విషయ చైతన్యమునకును, వృత్తిచైతన్యమునకును అభేదము చెప్పఁబడినది; ఆయభేదమే ప్రత్యక్షజ్ఞాన మందురు. దానికే అపరోక్షజ్ఞానమును, సాక్షాత్కారమును అందురు.

ఈప్రత్యక్షజ్ఞానలక్షణము ఇంద్రియజన్యమైన బాహ్యఘటాదుల ప్రత్యక్షజ్ఞానమందు, మఱియు మహావాక్యజన్యమైన బ్రహ్మముయొక్క ప్రత్యక్షజ్ఞానమందు మఱియు బాహ్యనిమిత్తములేక అంతర్దేశమునందుత్పన్న ములయిన సుఖదుఃఖముల ప్రత్యక్షజ్ఞానమందు, మఱియు మాయావృత్తిరూప మైన ఈశ్వరజ్ఞానమందు, మఱియు అవిద్యావృత్తిరూపమైన రజ్జుసర్పాది భ్రాంతిజ్ఞానమందు అనుగతముగా నున్నది.

ఆవిషయముతోడ వృత్తికి సంబంధము కొన్నిస్థలములందు ఇంద్రియద్వారమున; కొన్నిస్థలములందు శబ్దద్వారమున అగుచున్నది. ఉదాహరణము—ఎప్పుడు "దశముఁడవు నీవున్నావు" అను నీ శబ్దముచే అంతఃకరణవృత్తికి దశముఁడైనతనకు సంబంధమగుటవలన వృత్తి దశమాకారమగునో, అపుడు శబ్దజన్యమైన దశమునిజ్ఞానమును ప్రత్యక్షమందురు.

అట్లు ఎప్పుడు ప్రమాతయందు సుఖదుఃఖాదు లగునో, మఱియు వీనితో వృత్తికి సంబంధమై వృత్తి సుఖదుఃఖాకారమగునో, అప్పుడు ఆ సుఖదుఃఖాదులజ్ఞానమును ప్రత్యక్షమందురు.

ఇదిగాక పూర్వోత్పన్నసుఖదుఃఖము నష్టమైన వెనుక ఎప్పుడు పురుషునకు స్మరణమగునో, అప్పుడు వృత్తి సుఖదుఃఖాకారమగును; అయినను వృత్తికి పూర్వోత్పన్నసుఖదుఃఖముతో సంబంధము లేదు; అందువలన ఆ జ్ఞానము స్మృతిరూపముగానున్నది; దానిని ప్రత్యక్ష మనరు. మఱేమనఁగా—పరోక్షమందురు.

యద్యపి అంతఃకరణధర్మమైన సుఖదుఃఖములు అంతఃకరణవృత్తికి విషయములుగావు; ప్రమాతకును విషయములుగావు; కనుక అవి సాక్షిభాస్యములుగా నున్నవి; తథాపి సుఖదుఃఖాకారాంతఃకరణవృత్తివలన సాక్షి సుఖదుఃఖములయొక్క ప్రకాశము చేయును; వృత్తిలేక ప్రకాశము చేయఁడు.

ఏది సాక్షిభాస్యపదార్థముగలదో, దానిని సాక్షి వృత్త్యపేక్షవలననె ప్రకాశింపఁజేయును. ఎట్లనఁగా—శుక్తిరజతము సాక్షిభాస్యము; అచ్చట అవిద్యావృత్త్యపేక్షవలన సాక్షి రజత

మును ప్రకాశింపఁజేయును; అచ్చట అవిద్యావృత్తి సాక్షికి సహాయముగా నున్నది. సుఖదుఃఖములు సాక్షిభాస్యములు; అచ్చట అంతఃకరణవృత్త్యపేక్షచే సాక్షి సుఖదుఃఖములను ప్రకాశింపఁజేయును; అచ్చట అంతఃకరణవృత్తి సాక్షికి సహాయముగా నున్నది. ఈరీతిగా సాక్షిభాస్యజ్ఞానమందు ఆయావృత్తినను సరించి, సాక్షి పదార్థములను ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

ఆ వృత్తి ఎచ్చట ఇంద్రియాదిబాహ్యసాధనమువలన నగునో, అచ్చట తద్విషయమును సాక్షిభాస్య మనఁగూడదు; [అది ప్రమాతృవిషయము] సుఖదుఃఖములను విషయముచేయు వృత్తియందు బాహ్యేంద్రియాదులు హేతువులు గావు. మత్తే మనఁగా—ఎప్పుడు సుఖదుఃఖాదులు ఉత్పన్నములగునో,అపుడు అన్యసాధనాపేక్ష లేక అంతఃకరణవృత్తి సుఖదుఃఖాకారమగును; ఆవృత్తియందారూఢుఁడైనసాక్షి సుఖదుఃఖములను ప్రకాశింపఁజేయును; కనుక సుఖదుఃఖములు సాక్షిభాస్యము లందురు.

సాక్షిభాస్యజ్ఞానము పరోక్షాపరోక్షముల రెండువిధముల నగును; ఎచ్చట విషయమునకు "ఆ, అది, వాఁడు" అను సర్వనామప్రయోగ మగునో, అచ్చట జ్ఞానము పరోక్షమగును; మఱియు ఎచ్చట విషయమునకు "ఈ, ఇది, నేను, నీవు" అను సర్వనామప్రయోగమగునో, అచ్చట జ్ఞానము అపరోక్షమగును. సుఖదుఃఖములు సన్నిహితముగా నుండుటవలన "ఈ" అను ప్రయోగమగును; కనుక సుఖదుఃఖములజ్ఞానము అపరోక్షము.

## 153. బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షమగును

బాహ్యమైన ఘటాదికముతో అంతఃకరణవృత్తికి సంబంధము నేత్రాదీంద్రియద్వారమున నగును; కనుక ఘటాదికము

ప్రత్యక్షము; సుఖదుఃఖాదులజ్ఞానప్రసంగమందు వృత్తి వెలుపలికి పోవకయే అంతఃకరణములోపల సుఖదుఃఖాదులతో సంబంధము పొందును; కనుక సుఖదుఃఖాదులజ్ఞానముకూడ ప్రత్యక్షము; నీవు దశముఁడని శబ్దప్రేరితమైన దశమునిజ్ఞానమును ప్రత్యక్షము. ఆప్రకారముగా బ్రహ్మాకారమగునట్టి [1] అంతఃకరణవృత్తి వెలుపలికిపోవక శరీరాంతరమందే బ్రహ్మముతో సంబంధము పొందును; ఆ బ్రహ్మజ్ఞానమును సుఖదుఃఖజ్ఞానమువలె ప్రత్యక్షముగానే యగును.

అయినను సుఖదుఃఖాకారవృత్తియందు బాహ్యసాధనాపేక్ష లేమివలన ఆ జ్ఞానము సాక్షిభాస్యమందురు; అట్లు బ్రహ్మజ్ఞానము సాక్షిభాస్యముగాదు; [2] ఏలయనఁగా బ్రహ్మాకార

---

1. చక్షువుమీఁద అంగుళి ఉంచినపుడు ఆ స్వల్పావరణముచే ఆచ్ఛాదితమై బ్రహ్మాండవర్తియగు సూర్యప్రకాశమగుపడదు; ఆ యంగుళియొక్క తిరస్కారమైనపుడు అనాయాసముగ సూర్యప్రకాశమగుపడును. అట్లు సాక్షియైన ఆత్మయొక్క ఉపాధియగు నంతఃకరణము ఆత్మను ఆచ్ఛాదించుటవలన ఆ యల్పావరణముచే సర్వత్రపరిపూర్ణబ్రహ్మము కనఁబడదు; ఆయావరణముయొక్క భంగమైనపుడు అనాయాసముగ బ్రహ్మము కనఁబడుచున్నది. మఱియు నపుడే గృహగతాకాశముయొక్క అసంగతాదిజ్ఞానముచే మహాకాశముయొక్క అసంగతాదిజ్ఞానన్యాయమున సర్వత్రపరిపూర్ణబ్రహ్మమునకు అంతఃకరణస్థితమైన యాత్మతో అభేదము తెలియఁబడుచున్నది.

2. ఎట్లు బ్రహ్మము సాక్షిభాస్యము గాదో, అట్లు బ్రహ్మము ప్రమాతయొక్క విషయమునుగాదు. [బ్రహ్మమో, అన్యదీపాపేక్షారహితమై కేవలనేత్రముయొక్క విషయమైన దీపమువలె "అహం బ్రహ్మాస్మి" ఈయాకారముగల కేవలాంతఃకరణవృత్తికే విషయముగా నున్నది. అట్లయినను

వృత్తియందు గురుముఖద్వారమున వేదవచనముయొక్క శ్రోత్ర సంబంధరూపమగు బాహ్యసాధనము కావలసియున్నది.

ఈరీతిగా ఎచ్చట విషయముతో వృత్తికి సంబంధమగునో, అచ్చట ప్రత్యక్షజ్ఞానము చెప్పఁబడినది; "అహం బ్రహ్మాస్మి" అను వృత్తికి విషయమైన బ్రహ్మముతో సంబంధము గలదు. కాఁబట్టి బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షమే.

ఎచ్చట ధూమముఁజూచి, అగ్నిజ్ఞానమగునో, అచ్చట ధూమజ్ఞానము ప్రత్యక్షముగాని, అగ్నిజ్ఞానము ప్రత్యక్షము గాదు, ఏలయన—నేత్రద్వారమున అంతఃకరణవృత్తికి ధూమముతో సంబంధము గలదు; కనుక ధూమజ్ఞానము ప్రత్యక్షము. అగ్నిజ్ఞానప్రసంగమందో, అనుమానమువలన అంతఃకరణవృత్తి అగ్నియొక్క ఆకారమును ధరించెను; కాని, అగ్నికిని, వృత్తికిని సంబంధము లేదు. కనుక అగ్నిజ్ఞానము ప్రత్యక్షము గాదు.

---

తద్వృత్తిస్థితుఁడైన చిదాభాసునికి విషయముగాదు. కనుక బ్రహ్మము ప్రమాకృభాస్యముగాదు.] మఱేమనఁగా—తన ప్రకాశమందు అన్యప్రకాశముయొక్క అపేక్ష లేనిదై సర్వమునకు ప్రకాశకమై స్వయంప్రకాశముగా నున్నది.

అవృత్తియును, వస్త్రమలమును సబ్బుకారమువలె బ్రహ్మముయొక్క ఆవరణమును బోఁగొట్టుచున్నది; అదియే వృత్తివిషయమని చెప్పినమాటకు అర్థము; వేఱుప్రకారముగా బ్రహ్మమును విషయముచేయుట వృత్తికి ఘటిల్లదు. మఱియు "అహంబ్రహ్మాస్మి" అనునట్టి వృత్తిరూపమైన తత్త్వజ్ఞానమును బాహ్యసాధనాపేక్షలేకయే సాక్షి ప్రకాశింపఁజేయుచున్నాఁడు; అందువలన ఆ తత్త్వజ్ఞానము సాక్షిభాస్యముగా నున్నది.

ఈప్రకారముగా ఎచ్చట వృత్తివిషయముతో సంబంధ మగునో, అచ్చట ప్రత్యక్షజ్ఞానము, మఱియు ఎచ్చట వృత్తికి విషయముతో సంబంధము లేదో, విషయము బాహ్యమై దూర మగునో, లేక భూతమగునో లేక భవిష్యత్తుగునో, అందు వలన అనుమానాదిప్రమాణమువలన లేక అస్తితావబోధక శబ్దమువలన విషయాకారవృత్తి అంతరముందగునో, అచ్చట ఆజ్ఞానము పరోక్షమగును.

ఈరీతిగా అన్నియు జ్ఞానసంప్రదాయములఁ జూచినట్టి యైన ఇంద్రియజన్యజ్ఞానమే ప్రత్యక్షమగునను నియమము లేదు; ఎట్లు సుఖదుఃఖములజ్ఞానము ఇంద్రియజన్యముగాకున్నను ప్రత్యక్షమగునో, ఎట్లు దశమపురుషునిజ్ఞానము శబ్దజన్యముగా నున్నను, ప్రత్యక్షమగునో, అట్లు గురుముఖద్వారమున శ్రవణముచేసిన ఏ మహావాక్యరూపవేదశబ్దము గలదో, దానివలన ఉత్పన్నమైన బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షమగుట సిద్ధించినది.

[ఉత్తమాధికారికి గ్రంథకర్తయొక్క ప్రార్థన]

దానశూరుఁడైన కర్ణమహారాజు, వాఁడు నిజముగా కుంతి పుత్రుఁడైయుండఁగా అజ్ఞానమువలన జనులు వానిని రాధా పుత్రుఁడనిరి; జనులమాటవిని, వాఁడును నేను రాధాపుత్రు డనెను; ఒకసారి శ్రీసూర్యనారాయణుఁడు, నీవు నావీర్యముచే కుంతిజఠరమందు పుట్టితివని చెప్పెను; అప్పుడు వాఁడు నేను కుంతి పుత్రుఁ డనెను, వాఁడు ఎదివరకు నేను రాధాపుత్రుఁడన

నో, అదివరకు నేను నీచకులస్థుఁడనని ఎఱిఁగి, ఖిన్నమనస్కుఁడై యుండెను; ఎప్పటినుండి నేను కుంతిపుత్త్రుఁడ నెనో, అప్పటినుండి నేను సత్కులస్థుఁడనని ఎఱిఁగి, ప్రసన్నచిత్తుఁడై యుండెను. రాధాపుత్త్రుఁడనుటవిడిచి కుంతిపుత్త్రుఁడనుటయందు వానికి ఆయాసమేమి? ఏమియు లేదు. చూడుము—

నేను రాధాపుత్త్రుఁ డనుకాలమందు వానికి ఏ శరీర ప్రాణాదిసంఘాతము గలదో, ఆసంఘాతమే యుత్తరకాలమం దును గలదు; మార్పు ఏమియు కాలేదు. ఇట్లుండఁగా వాఁడు, నేను కుంతిపుత్త్రుఁడ ననుటచే మహానందమును బొందును.

అయ్యా! నేనుబ్రాహ్మణుఁడను, నేనుశూద్రుఁడను అని యెందుకు అనుచున్నావు? నేను బ్రాహ్మణుఁడననువరకు భిక్షచింత యుండనేయున్నది; నేనుశూద్రుఁడ ననువరకు పరిచర్యచింత యుండనేయున్నది; నేను బ్రహ్మమనుమా! దానియందు నీకు ఆయాసమేమిచెప్పుమా! ఇప్పుడు "నేనుబ్రాహ్మణుఁడున్నాను" "నేను శూద్రుఁడున్నాను" అనుచున్నావు; "నేను బ్రహ్మము న్నాను" అనుము; నేను బ్రాహ్మణుఁడున్నాననుటయందు, లేక నేనుశూద్రుఁడున్నాననుటయందు, "ఉన్నాను" అనుస్థితి ఏదిగల దో, అది ఇపుడు నేను బ్రహ్మమున్నా ననుటయందుఁగూడ సిద్ధ మైయున్నది; దానియందు మార్పుచేయవలసినపని ఏమియు లేదు; ఇట్లుండఁగా నేను బ్రహ్మమున్నాననుటయందు నీకు ఆయాస మేమి? ఏమియు లేదు; సహస్రకాపములందు ఎందుకు కాల హరణము చేయుచున్నావు? నేను బ్రహ్మమున్నాను అని,

తత్కాలము పరమానందమును బొంది, ధన్యోఽహం ధన్యోఽహ మ్మనుచు, నర్తనము చేయుమా! అనుము!

ఈ ప్రకారముగా ఈతరంగమునందు తత్వదృష్టికి అహం బ్రహ్మాస్మి అనువృత్తివలన నిరావరణముగు బ్రహ్మజ్ఞానమైనది. ఇట్టి ఈవిచారాబ్ధియొక్క చతుర్థతరంగము ఎవఁడు జిజ్ఞాసువైనపురుషుఁడు శ్రద్ధాపూర్వకముగా శ్రవణము లేక పఠనముచేయునో, వానికి శ్రీగురువనుగ్రహామువలన ఆత్మసాక్షాత్కార మగును.

ఇది శ్రీ ఉత్తమాధికార్యుపదేశనిరూపణ మను చతుర్థతరంగము సంపూర్ణము.





# శ్రీవిచారసాగరము

## పంచమతరంగము

### మధ్యమాధికార్యుపదేశనిరూపణము

**154.** వేదగురువులు సత్యముగ నుండనీ, మిథ్యగా నుండనీ అద్వైతసిద్ధి ఘటిల్లదు.

పూర్వతరంగమునందు చెప్పఁబడినది—"గురుముఖద్వారమున శ్రవణముచేసిన ఏ వేదాంతవాక్యముగలదో, దానిచేత బ్రహ్మసాక్షాత్కారమగును." ఆమాటవిని, అదృష్టదృష్టినామకుడైన ద్వితీయశిష్యుఁడు ఆక్షేపము చేయుచున్నాఁడు—

వేదగురువులు సత్యమనినపక్షమందు అద్వైతహాని యగును; మిథ్యయనినపక్షమందు పురుషార్థప్రాప్తి ఘటిల్లదు; రెండువిధములచేతను వేదగురువులవలన అద్వైతసిద్ధి ఘటిల్లదు. ఈ హేతువువలననె ప్రబుద్ధులైన బుధ్వాదులచే అశుద్ధమైనట్టి శంకరమతముయొక్క త్యాగము చేయఁబడినట్లు కనఁబడుచున్నది?

{ 155, 156 గత ప్రశ్నకు ఉత్తరము—శంకరమతము యొక్క ప్రామాణ్యము. 155—161 }

అదృష్టదృష్టియొక్క భాషణమును విని, సర్వజ్ఞుఁడైన శ్రీ గురుమూర్తి పలికెను—ఓశిష్యుఁడా! శంకరమతమే ప్రమాణము; మధ్వాదుల భేదమతము అప్రమాణము. చూడుము—

వ్యాసభగవానునిచే పురాణమందు [1] చెప్పఁబడినది—"ఎప్పుడు కలియుగమునందు వేదార్థమును నానాప్రకారములచే ప్రతిపాదింతురో, అప్పుడు శ్రీశంకరుఁడు శంకరనామధారకుఁడై అవతారమును గ్రహించి, బదరీనాథమూర్తిని దేవనదిలోనుండి యుద్ధరించి, స్వస్థానమందు స్థాపించును; మఱియు జైనబౌద్ధమతములయొక్క ఖండనము చేసి, వేదముయొక్క యథార్థవ్యాఖ్యానము చేయును." అను వ్యాసవచనమువలన శ్రీశంకరమతమే ప్రమాణము; మధ్వాదుల భేదమతము అప్రమాణము.

యద్యపి ఉపనిషత్తులు, గీత, బ్రహ్మసూత్రములు ఈప్రస్థానత్రయమునకు మధ్వాదులచే బలవంతముగా అర్థము శాకర్షించి యాకర్షించి, స్వస్వమతానుసారముగ వ్యాఖ్యానము చేయఁబడియున్నది; తథాపి వ్యాసవచనమువలన శ్రీశంకరకృత వ్యాఖ్యానమే యథార్థముగా నున్నది.

ఆదికవియైన సర్వజ్ఞ వాల్మీకిమహర్షిచే ఉత్తరరామాయణ వాసిష్ఠనామధేయగ్రంథము చేయఁబడినది; అచ్చట అద్వైతమతమందు ప్రధానమైన దృష్టిసృష్టివాదమే అనేకేతిహాసరూపముగా ప్రతిపాదింపఁబడినది; ఈవిధముగా వాల్మీకివచనాను

1. వాయుకూర్మాది పురాణములందు.

పారమైన అద్వైతమతమే ప్రమాణము; వాల్మీకివచనమునకు విరుద్ధమైన భేదమతము అప్రమాణముగా నున్నది.

ఈరీతిగా సర్వజ్ఞమహర్షివచనవిరోధమువలన ఎట్లు భేదమతము అప్రమాణమో, అట్లు యుక్తివలనను భేదమతము అప్రమాణముగా నున్నది. ఇది ఖండనాదిగ్రంథములందు శ్రీహర్షాదులచే [1] ప్రతిపాదింపఁబడినది. ఆయుక్తులు కఠినములగుటవలన ఇచ్చట వ్రాయఁబడలేదు. మఱియు మునివచనవిరోధమువలన భేదమతమునందు జైనమతమునందువలె అప్రామాణ్యనిశ్చయమైనవెనుక ఆస్తికుఁడైనఅధికారికి యుక్తిచేత ఖండనమునందు అపేక్ష లేదు.

అట్లు వేదవచనముచేతను భేదమతము విరుద్ధముగా నున్నది; కఠోపనిషత్తునందు శ్రీయమధర్మరాజు నాచికేతుఁడను రాజపుత్రునిగుఱించి పలికెను—

"మృత్యోస్స మృత్యుమాప్నోతి యఇహ నానేవ పశ్యతి[2]" "ద్వితీయాద్వై భయం భవతి[3]" "అన్యోఽసావన్యోఽహమస్మీతి నసవేద యథాపశురేవ సదేవానామ్[4]"

---

1. శ్రీసరస్వతియొక్క కృపాపాత్రుఁడైన శ్రీహర్షమిశ్రాచార్యులచేత ఖండనఖండఖాద్య నామకగ్రంథమందు భేదమతముయొక్క ఖండనము అనేకయుక్తిప్రకారముగా చేయఁబడినది.

2. మృత్యువుచేత మృత్యువును పొందుచున్నాఁడు; ఎవ్వఁడు ఒకపరమాత్మయందు నానాత్వము చూచుచున్నాఁడో, వాఁడు.

3. ఎచ్చట ద్వితీయబుద్ధి ఉన్నదో, అచ్చట భయము ఉండనే యుండును.

4. జ్ఞేయము, లేక ధ్యేయము అయిన పరమాత్మను తనకన్న భిన్నతఁము చేత ఎవ్వఁడు ఎఱుఁగునో, వాఁడు దేవపశువు. [ఎట్లుదు యజ్ఞభూతాదులగు

ఓశిష్యుఁడా! ఈప్రకారముగా ఖేదవచనము సర్వథా త్యాజ్యముగా నున్నది. అందువలన ఎన్నఁడైనను ఖేదవచనము వినియుండువేని, దానిని ధిక్కారపూర్వకముగా విస్మరించుకొమ్ము. ఏల యన—అది ఎదివరకు నీఅంతఃకరణమం దుండునో, అదివరకు నీకు అద్వైతబోధ సఫలము గానేరదు; దాని దృష్టాంతముకొఱకు ఒకకథ చెప్పుచున్నాను వినుము—

## 156. భర్చుకథారంభము

ఒకానొకరాజునొద్ద భర్చువనుపేరుగల అత్యంత ప్రియుండైన మంత్రి సకలగుణసంపన్నుఁడు; శౌర్యధైర్యగాంభీర్యౌదార్యాదిసద్గుణవిరాజమానుఁ డుండెను. వానియందు ఒకదుష్టస్వభావముండుటవలన చిన్నవారిని, పెద్దవారిని సకలరాజపురుషులను తుచ్ఛముగాఁజూచుచు, సర్వుల ననేకవిధముల పీడించుచు, గోడుగుడుపుచుండెను. అతఁడు రాజునకు ప్రియుఁడగుటవలన వాని నిగ్రహించువారును, తన్ను రక్షించువారును లేరైరి. ఇట్లుండఁగా అధికృతులైనసర్వులు నొక్కటిగాఁగూడి, వానినడంచుటకు ఉపాయాన్వేషణము సర్వదా చేయుచుండిరి.

---

క్షుద్రదేవతలకు బలియిచ్చుటకొఱకు పశువును దీసుకొని పోదురో, అప్పుడు ఆపశువును అభ్యంగస్నానము చేయించి, దానికి మృష్టపక్వాన్నముఁ దినిపించి, దానిమెడలో మాలవేసి, దానిలలాటమున కుంకుమ అంటించి, మంగళవాద్యసమారంభముచే తీసుకొనిపోదురు. ఆసమారంభముచూచి, ఆపశువు ఇట్లు ఎఱుఁగును—ఈదినము నాకు పెండ్లియౌన్నది. అయిన సామాధకపశువు ఇట్లు ఎఱుఁగదు—ఈదినము నాకంఠచ్ఛేదనము కాఁగలదు. ఇట్టి యేమాధకపశువు గలదో, దానిని దేవపశువు అందురు.]

ఒకనాఁడు రాజపురుషులందరు నొకచోట నాలోచించి, తాము బయటపడక ఇతరముఖమున రాజ్యమందు క్షోభ [బందిపోటులు మొదలగునవి] గలిగించిరి. ఆ క్షోభవర్తమానము విని, రాజు సర్వరాజపురుషులను బిలిపించి, ఆజ్ఞాపించెను—మీరు పోయి, క్షోభ మాన్పి, క్షోభగలిగించినవారిని పట్టుకొనిరండు. ఆ రాజాజ్ఞవిని, మొదలే ఆలోచించి సిద్ధులైన రాజపురుషులు విన్నవించిరి—ఓరాజా! రాజ్యకార్యసంబంధములైన చిన్నగొప్ప విచారమందు ఎవరినడుగకయే భర్తృవభిప్రాయముచేతనె సర్వకార్యములగుచున్నవి; రాజ్యభారవిషయమందు మేమందఱము జీవప్రేతులైతిమి; ఇట్టిమరణప్రసంగమందుమాత్రము మమ్ముల నాజ్ఞాపించుచున్నావేమి? భర్తృవు శూరుఁడుగాఁడా? చేతులకు గాజులుతొడిగి [1] యున్నాఁడా?

ఆమాటవిని, రాజు నిశ్చేష్టుఁడాయెను; అయినను భర్తృవు సమీపముననే కూర్చుండెను; అతఁడామాట విని, తత్కాలము లేచి, రాజునెదుట నిలచి, సాంజలిబద్ధుఁడై విన్నవించెను—ఓరాజా! నేను ఇచ్చట నుండఁగా-ఈకించిత్కార్యముకొఱకు ఇతరులను ఆజ్ఞాపించు ప్రయోజనమేమి? నాకు ఆజ్ఞాపించిన నేనిప్పుడె పోయి,సకలక్షోభములు మాన్పి, కృతాగసులఁ [అపరాధుల] బట్టితెచ్చెదను. భర్తృవుప్రార్థన విని, రాజు సంతోషముచే సన్మానించెను. తరువాత భర్తృవు తనసేననుగూర్చుకొని, క్షోభను మాన్పుటకు పోయెను.

తరువాత కొన్నిదినములకు సర్వరాజపురుషులు నొకచోటఁగూడి, భర్తృవు చనిపోయె నని అబద్ధపువర్తమానము

---

1. స్త్రీయాయేమి!

రాజునకు నివేదించిరి. అదివిని, భర్మువు పరమప్రియుండగుట వలన రాజు బహుళముగా శోకించెను. రాజుతోఁగూడ తాము శోకించిరి. తరువాత రాజును అనేకప్రకారములుగా సమాధానపఱచి, తమలోనొక్కరుని ప్రతినిధిగా నియమింపఁ జేసిరి. అయినను సర్వులకు ఎంతభయ మున్నదనఁగా—భర్మువునకు రాజదర్శనమయినట్టయిన వాఁడు ఒకక్షణమందే మనుష్యుల సమూహాలనాశము చేయును.

పిమ్మట ఒకనాఁడు రాజు సభలోనుండఁగా ఆ రాజపురుషులు తమలోతాము మాటలాడుకొనుటకు ప్రారంభించిరి—వినుఁడీ! భర్మువు ఎంతఉత్తమపురుషుఁడుగా నుండె; అయినను జన్మాంతరపాపముండెనేమో! అతని కేమిదుర్గతి వచ్చెను! హారి హారి! అదివిని, రాజడిగెను—ఏమిది? వారిలో నొకఁడనెను—భర్మువు బ్రహ్మరాక్షసుఁడై, సర్వాంగవిభూతిచర్చితుఁడై అరణ్యమందు సంచరించుచున్నాఁడు. ఎవ్వఁడేని అగుపడిన మధుర మధురభాషణములతో వానిని చేరంబిలిచి; వచ్చినవాని నట్టే మ్రింగివేయును.

ఇంకొకఁడనెను—ఏమిచెప్పవలెను! మొన్నమొన్న మామామ గ్రామమునుండి వచ్చుచు, అచ్చట ఒకచెట్టుక్రింద భర్మువును జూచి, పాఱి పోఱుచు నిల్లుసేరెను; వాఁడిదివరకు జ్వరితుఁడై యున్నాఁడు.

మూఁడవవాఁడనెను—భర్మువు నాస్వప్నములో ఒకటి రెండుమారులు వచ్చెను; ఆస్మృతిచే ఇదివరకు నాకు భయకంపమగుచున్నది.

ఈప్రకారముగా అనేకజనులచే అనేకదుర్భాషణములు

వినివిని, అవి సత్యములని యెంచి, రాజునకు భర్ప్రవిషయమందు ప్రేతత్వబుద్ధి స్థిరమాయెను.

అప్పుట భర్ప్రవు శత్రుసంహారము చేసి, అత్యంతహర్ష ముతో కృతాగసుల పట్టుకొని, రాజదర్శనమునకు వచ్చుచుండెను; అప్పు డందఱుఁగూడి, ద్వారపాలకుని లోఁబఱచుకొని, రాజు నొద్దకు భర్ప్రవునకు ప్రవేశము లేనట్టుగా కట్టుబఱచిరి; దర్శన ప్రతిబంధము మాత్రముగాక భర్ప్రవు బ్రతికివచ్చినవృత్తాంతము రాజునకు తెలియకుండునట్లు దిట్టము చేసిరి. భర్ప్రవు రాజదర్శన ప్రయత్న మెల్లఁ జేసె; పత్రికలు వ్రాసె; సర్వము నిష్ఫల మాయెను. పిమ్మట భర్ప్రవనుకొనెను—ఇదంతయు ఈ రాజపురు షుల కృత్రిమముగాని వేఱుగాదు. తుదకు భర్ప్రవు పరితపించు చుండెను.

[భర్ప్రవుయొక్క అనుతప్త కాలమందలి విచారము.]

ఇట్టి అనుతాపకాలమందు భర్ప్రవు తనమనస్సులో అను చున్నాఁడు—హా! హా! నే నెంతమూర్ఖుఁడను చూడు—నేటి వరకు ఇట్టి మూర్ఖరాజును సేవించుచుంటిని; దానికన్న ఈశ్వర సేవ చేసియుందునేని, నాకన్న భాగ్యవంతుఁడు ఎవఁడు ఉండఁడు. ఎవరికొఱకు మూర్ఖసేవాంగీకారము చేయుదునో, ఆ స్త్రీపుత్త్రాది కము త్యాజ్యమే; శరీరపోషణార్థమనిన, ఈశరీరము మనకు సాక్షాచ్ఛత్రువు; ఇదివరకు దీనిసంగతివలన అనేకదుఃఖోపభోగ ములు చేసితిని; ఈదుష్టశరీరమునకు ఎంతెంత పోషణాద్యుప కారము చేయుదుమో, అంతంత దేహాభిమానద్వారమున దుఃఖదాయక మగును; ఎట్లనఁగా—కృష్ణసర్పమునకు ఎంతెంత పాలు ద్రావింతుమో, అంతంత విషమును గ్రక్కును.

ఇట్టి ఈ దుష్టశరీరముయొక్క తర్పణవిధి వదలి, నే నెప్పుడు మహారణ్యమును తోఁటగాను, పర్వతగుహను మేడ గాను, పత్రఫలాదులను పక్వాన్నముగాను ఎఱిఁగి, అర చేతిపాత్రచే నదిలో నీళ్లు త్రాగి, శిలాశయ్యపైన పండుకొందునో, అప్పుడు నా కెంతసుఖమగును! ఆహాహా! రాజు మొదలు బ్రహ్మ దేవునివరకు ఏసుఖమున్నదో, ఆసుఖమంతయు నాసుఖమున కేల సమాన మగును!

[సుఖనిర్ణయము]

చూపుమతి! ఆరోగ్యబలవంతతముఁడై, సకలవిద్యా ప్రవీణుఁడై, సార్వభౌమచక్రవర్తియైన రాజునకే సుఖము అగునో, దానికన్న మనుష్యగంధర్వుఁడు[1], దేవగంధర్వుఁడు[2], పితరుఁడు[3], అజానదేవుఁడు[4], కర్మదేవుఁడు[5], ముఖ్య

1. ఈకల్పమునందు మనుష్యుఁడై, పుణ్యవిశేషముచేత గంధర్వపద మును పొందినవాఁడు మనుష్యగంధర్వుఁడు.

2. పూర్వకల్పమునందు చేసిన పుణ్యవిశేషముచేత ఈకల్పారంభమందు గంధర్వభావమును పొందినవాఁడు దేవగంధర్వుఁడు.

3. కర్మలోకమునందు బహుకాలపర్యంతము వసించు అగ్నిష్వాత్త మొదలైనవారు పితరులు.

4. పూర్వకల్పమందు చేసిన పుణ్యవిశేషముచేత ఈకల్పప్రారంభమందు దేవభావమును పొందినవారు అజానదేవతలు.

5. ఈకల్పమునందు అశ్వమేధాదికర్మములను జేసి అధికైశ్వర్య మును పొంది, అజానదేవతలచేత సేవచేయించుకొనువారు కర్మదేవతలు.

దేవుఁడు[1], ఇంద్రుఁడు, బృహస్పతి, ప్రజాపతి, బ్రహ్మదేవుఁడు వీరికుత్తరోత్తరము ఒక్కొక్కరికి శతాధికముగా సుఖమున్నది; ఈప్రమాణమువలన చక్రవర్తి భూపతికన్న సహస్రపరార్ధము బ్రహ్మదేవునకు సుఖమున్నది. అట్టి ఆ బ్రహ్మదేవునిసుఖమునకు నిష్కాముఁడై, ఏకాంతవాసియైన పురుషునిసుఖము నెదుట లెక్కయే లేదు; అట్లు తైత్తిరీయోపనిషత్తులో చెప్పఁబడి యున్నది.[2]

ఆహాహా! ఏసుఖమున్నదో, అది అసంగైకాంతవాసమునందే యున్నది; స్త్రీధనపుత్త్రాదులందు సుఖము లేదు; కేవల దుఃఖమే యున్నది. ఎట్లు ధనాశచేత యాచకజనులు ధనికగర్దభమును ఆశ్రయింతురో, అట్లు స్త్రీలోలురై కామాంధకవులు అనేకవిధములుగా ఉత్తమోత్తమోపమలు చెప్పుచు స్త్రీలను భూషింతురు; అట్లయినను విచారశీలుఁడు ఇట్టి నింద్యస్థానమందు

1. యముఁడు, అగ్ని, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, ఇంద్రుఁడు, రుద్రుఁడు మొదలయినవారు ముఖ్యదేవతలు. కొందరు యముఁడు మొదలుకొని బ్రహ్మపర్యంతము ముఖ్యదేవతలని చెప్పుదురు. కొందరు అష్టవసువులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు గూడి ముఖ్యదేవతలని చెప్పుదురు. మఱికొందరు ఇంద్రియాభిమానిదేవతలను ముఖ్యదేవత లందురు.

2 "శ్రోత్రియస్య చాకామహతస్య" ఇది తైత్తిరీయోపనిషద్గతమైన ఆనందవల్లియొక్క వచనము. అచ్చట శ్రోత్రియశబ్దమునకు బ్రహ్మనిష్ఠార్థము చెప్పఁబడియున్నది; కనుక ఇచ్చట "ఏకాంతవాసి" శబ్దమునకు బ్రహ్మనిష్ఠార్థము చెప్పవలయును. [అద్వైతభావన లేకుండినపక్షమందు ఏకాంతవాసమే ఘటిల్లదు; అయద్వైతభావనయే ఇచ్చట బ్రహ్మనిష్ఠారూపమని ఎఱుఁగవలెను.]

ఎప్పుడు మోహితుఁడుగాఁడు; నావంటిమూర్ఖపశువుమాత్రము మోహితుఁడై తననాశమును తెచ్చుకొనును.

[కామాంధ[1] కపికృతకామినిస్తోత్రము]

చూడుచూడు! ఒక కామాంధుఁడు అనుచున్నాఁడు— కదళీస్తంభములవలె ఊరువు లున్నవిదేనికి, శుండాదండము[2] వలె హస్తములున్నవిదేనికి, సింహము[3] వంటి నడుమున్నది దేనికి, కనకకలశములవలె కుచములున్నవిదేనికి, కంబువు[4] వలె కంఠమున్నదిదేనికి, పికము[5] వంటి స్వరమున్నదిదేనికి, చంద్రునివలె ముఖము, కుందకుట్మలముల[6] వలె దంతములు, విద్రుమము[7] వలె అధరోష్ఠము, చంపకకుసుమమువలె నాసిక, మృగమీనములవలె నయనములు, ధనుస్సువంటి కనుబొమలు, ఖంజరీటము[8] వంటివర్ణము; హంసగతి గజగతి యున్నదిదేనికి. ఈప్రకారముగా ఒకకామాంధుఁడు తనప్రేమరంగమునందు స్త్రీయొక్క సౌందర్య వైభవమును వర్ణించెను. [9]వాని ప్రక్కనే ఇంకొక్క కామాంధుఁ డుండెను; వాని కావర్ణనము స్త్రీసౌందర్యముముందర ఏమియు లెక్కకు రా లేదు; అతఁడు ప్రథమకామాంధునితో అనుచున్నాఁడు—

---

1. మదనుఁడు సంచారము చేయుటవలన ఎవ్వనిబుద్ధి భ్రష్టమగు చున్నదో, వాఁడు కామాంధుఁడు.

2. ఏనుఁగుతొండమువలె. 3. పశువిశేషము. 4. శంఖము. 5. పక్షి విశేషము. 6. పుష్పవిశేషము. 7. ప్రవాళము. పగడము. 8. పక్షివిశేషము.

9. హిందూస్థానిదోహా— "నయనపరమృగమీనవారో బవనపర చంద్రమా భోయీఁపరధనకధారివారో బరనపరఖంజరీ. 1"

ఓరీమూర్ఖుఁడా! నీకు స్త్రీవైభవమే తెలియదు; నీవేమి సుందరికి మృగలోచనయందువా? మీనలోచనయందువా? ఓరీ! సుందరీనయనములు ఎట్లున్నవి? వానిమీఁద మృగమీనములు చుట్టివైచుము. కనుబొమలు ధనుస్సువలె నున్నవంటివి? వానిపై ధనుర్గుణలను చుట్టివైచుము. వదనమేమిచంద్రుఁడా? చంద్రుని దృష్టితీసివేయుము, ఇట్టి సౌందర్యశాలినియైన కామినిని నింద్య నింద్యపదార్థములతో పోల్చి, నిందచేయుచున్నావావేమి? అను మాటలు విని, ప్రథమకామాంధుఁ డనుచున్నాఁడు—

ఓరీ! నారీవదనము చంద్రునివంటి దనిన దానిలో నింద ఏమి! స్తుతియేగదా! ఎట్లు చంద్రుని జూచిన మనస్సునకు ఆహ్లాద మగునో, అట్లు నారీవదనముఁజూచిన ఆహ్లాదమగును. ఆహ్లాదాంశ మున నారీముఖమునకు చంద్రదృష్టాంతము యోగ్యమే. ఇట్లి ద్దరు వాదించుచుండఁగా తృతీయకామాంధుఁడు ఆమార్గముగా వచ్చెను; వాని కాభాషణము సరిపడక వాఁడనెను—

ఓరి వెఱ్ఱివాఁడా! కామినివదనమునకు చంద్రోపమ చెప్పు వాఁడు నీవు చంద్రుని అవగుణము ఎఱుఁగుదువా? ఓరి! వాఁడు సర్వదా అపూర్ణుఁడు, నెలకొకనాఁడే సంపూర్ణుఁడై యుండును; అప్పుడు వానిని గ్రసించుటకు కేతువు సిద్ధముగానే యుండును; వానిముఖము మీఁద ఎల్లప్పుడు కళంక ముండనేయున్నది; చూడుము—వాఁడు ఎంతనిర్దయుఁడు! పతివిరహితస్త్రీ, లేక స్త్రీవిరహితపతి వారేస్వయముగా విరహాగ్నితో కాలుచుండఁగా ఈదుష్టుఁడు వారిప్రాణములు తీయుటకు సిద్ధపడును. ఓరీ! వీఁడు పాపి, వీనిముఖము చూడఁగూడదు; అందుకే భాద్రపదశుక్ల చతుర్థినాఁడు వానిముఖమును ఎవ్వఁడు చూడఁడు; ఇట్టి సకల

దోషసహితుఁడైన చంద్రునితో ఉపమ, దోషరహితమైన స్త్రీ ముఖమునకుఁ జెప్పుదువావేమి? నీకు సహస్రజన్మములకును స్త్రీ దర్శనమే కాఁగూడదు. ఇట్లు తృతీయకామాంధుఁడు కోపముతో భాషింపఁగా వానిని ప్రథమకామాంధుఁడు వినయముతో అనుచున్నాఁడు—

ఔను, సోదరుఁడా! నీవన్నదంతయు నిజము; చంద్రుఁడో, సర్వప్రకారములను దూషితుఁడే; భామినివదనమో, సర్వప్రకారములను నిర్దోషము; కనుక భామినివదనమునకు చంద్రోపమ యోగ్యముగాదు; అయినను చంద్రుని అమృతకరుఁడందురు; వానియొద్ద అమృతమున్నది; ఇది ఉత్తమగుణముకాదా? ఇట్లిద్దరు భాషించుచుండఁగా నాల్గవకామాంధుఁడు దూరమున నుండి వినెను; వాఁడీమాట సహింపక ఇట్లనియె—

ఓరిమూర్ఖుఁడా! నీవేమి నిజమనుకొంటివా? చంద్రునియొద్ద అమృతమున్నదా? నిజముగానుండిన చంద్రునికేల క్షయరోగముండును? ఓరి? ఎట్లు మూఢవేదాంతులు మోక్షమును అమృతమందురో, అట్లు కర్మవాదులు చంద్రుని అమృతకరుఁడందురు. ఓరి! మోక్షమమృతముగానుండిన జీవన్ముక్తవిద్వాంసుఁడు నీళ్లునీళ్లు అని ఏల ప్రాణము విడుచును? ఓరిపిచ్చివాఁడా! బిచ్చగాఁడు తనకొడుకునకు రాజని పేరుపెట్టఁగానె ఆదరిద్రుఁడు రాజగునావేమి! అట్లె కర్మివేదాంతజనులచే పేరుపెట్టఁబడిన ఆ క్షయరోగచంద్రుఁడును, శూన్యరూపమోక్షమును అమృతమగునావేమి? సర్వులకు ప్రత్యక్షానుభవమైన సంగతి నారియొక్క అధరోష్ఠమందుమాత్రము అమృతము నిస్సంశయముగా నున్నది. చూడుమతి! మనస్సునకును, శరీర

మునకును ఎంతతాపముగానీ, స్త్రీముఖచుంబనము చేయఁగానె సకలసంతాపశాంతిరై, అప్పుడే అజరామరకాయమగును.

[సుజ్ఞకవికృతనారీశరీరవర్ణనము]

ఈరీతిగా కామాంధులైనకవులు ఒకరికన్న నొకరు ఉత్తమోత్తమోపమలు చెప్పుచు, నారికి సౌందర్యమును తెప్పుటకు చూచుచున్నారు; అయినను అచ్చట ఉన్నదివేమి ? శ్రీభర్తృహరి చెప్పెను—

స్తనౌ మాంసగ్రంథీ కనకకలశావిత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపి చ శశాంకేన తులితమ్,
స్రవన్మూత్రక్లిన్నం కరివరశిరస్స్పర్ధి జఘనమ్
ముహుర్నింద్యం రూపం కవిజనవిశేషైర్గురుకృతమ్. 1
చర్మఖండం ద్విధా భిన్న మపానోద్గారధూపితమ్,
యే రమంతి నరాస్తత్ర కృమితుల్యాః కథన్నతే. 2
స్రవన్మాంసాస్రదుర్గంధం లోమలూతావితానితమ్,
నారీగుహ్యం విమూఢాత్మా వరమిత్యభినందతి.[1] 3

చూడుమతి ! ఈప్రకారముగా సుజ్ఞజనులచే నింద్యమైన నారీశరీరమునందు రమమాణుఁడైన కామాంధునకును, నాకును ధిక్కారముండని.

[అంగనాపేక్షా[2] పూర్వకముగా అలంకారలక్షణము.]

చూడుడు ! ఏపదార్థము సహజముగానె సుందరమో,

---

1 ఈ మూఁడుశ్లోకములయొక్క అర్థము సులభమగుటవలనను, బీభత్సమగుటవలనను వ్రాయఁబడలేదు.

2 ఇచ్ఛ.

దానికి బాహ్యాలంకారముతో పనిలేదు; నారికి ఎంత అలంకారము చేసినను అంతయు తక్కువే. దానిచేత సిద్ధమైనదేమి? నారి యనునది చాలకురూపిణియే. ఏలయన—అలంకారమున కిది స్వాభావము—అది ఏస్థానమందుండునో, ఆస్థానముయొక్క కురూపత్వమును ఆచ్ఛాదించి, తనసౌందర్యప్రభావము లోకదృష్టి యందు నిండించును; దానివలన కురూపపదార్థము సుందరము వలె కనఁబడును. కనుక కురూపమనుష్యునకే అలంకారోపయోగము గలదు; సుందరమనుష్యునకు లేదు; వ్యత్యస్తముగ వానిసౌందర్యమునకు అలంకారము ఆచ్ఛాదకమగును. చూడుఁడి! షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన పరమాత్మయొక్క సౌందర్యవర్ణన ప్రసంగమునందు ఒకఉత్ప్రేక్షారూపమైన కథ ఇట్లున్నది—

[జగద్గురుకృతమైన అలంకారోద్ధారము]

ఒకానొకపుడు త్రైలోక్యసుందరుఁడైన కామునితండ్రియగు భగవంతుఁడైన విష్ణువు సింహాసనాసీనుఁడై యుండఁగా, సకలాలంకారములు సమ్ముఖమందు నిలిచి, శరణాగతులై ప్రార్థించిరి—ఓభగవంతుఁడా! నీవు కరుణాసాగరుఁడవు; నీవు మాయందు కృపయుంచి, ఇట్టి ఉత్తమజన్మము నిచ్చితివి. అదేమనఁగా— మాసహవాసముచే కురూపపదార్థములన్నియు సురూపములుగ కనఁబడుచున్నవి; దూషితపదార్థములన్నియు భూషితములుగ కనఁబడుచున్నవి; ఈవిధముగ సకలకురూపదూషితపదార్థములను ఉద్ధరించువార మేమయితిమి; అయినను ఓభగవంతుఁడా! మమ్ములను శోభితముచేసి, మమ్ముల నుద్ధరించువారినెవ్వరిని సృజింపవైతివి; దాసానుదాసులమీఁద ఇంత నిర్దయ చేయవచ్చునా? మేము అనాథులము; మమ్ముల నుద్ధరించు

టకు నాథుఁడు నీవు తప్ప వేఱులేఁడు. ఈరీతిగా చరణకముల శరణుపొందిన అలంకారముల ప్రార్థనవిని, భక్తకార్యకల్పద్రుముఁడై సర్వజ్ఞుఁడైన భగవంతుఁడు వారిమనోగతార్థము నెఱిఁగి, ఆశీర్వదించి, ఇట్లనియె—

ఓపరోపకారులైన అలంకారములారా! మీరు ధన్యులు-
పరోపకారాయ ఫలంతి వృక్షాః పరోపకారాయ వహంతి నద్యః,
పరోపకారాయ దుహంతి గావః పరోపకారాయ సతాంశరీరమ్.

ఓయలంకారములారా! మీరుసాధులరు. చూడుఁడు— పరోపకారముకొఱకు మీరు శరీరమును క్షీణముచేసికొందురు; ఇప్పుడు మీరు మీయుద్ధారవిషయమునందు చింత చేయవలదు; నేనె మిమ్ముల నత్యంతశోభితము చేసి, ఉద్ధరించుచున్నాను. ఇట్లని పరమాత్ముఁడు నూపురకింకిణీకటకకేయూరాదులైన ఒక్కొక్కయలంకారమును తన దేదీప్యమానాత్యంతసుందరమైన శరీరమందు ధారణము చేయసాగెను. ఆప్రసంగమందు ఎప్పుడెప్పుడు ఏయేయలంకారమును ఏయేస్థానమందు ధరించుటకు ప్రారంభించెనో, అప్పుడప్పుడు ఆయాయలంకారముక్రిందఁబడి భగవంతునిసుందరాంగము ఆచ్ఛాదితమగుటకును,దాని ప్రక్కలనుండు పరమాత్మునిసుందరాంగము తానె ఆయలంకారమునకు అలంకారమగుటకును ఆరంభించెను; దానిచేత ఆయాయలంకారము అత్యంతశోభితముగా అగుపడెను. ఈరీతిగా జగద్గురువైనపరమాత్మచేత అలంకారములయొక్క ఉద్ధారము చేయఁబడెను.

[స్త్రీలజ్జించుటకు హేతువు.]

సారాంశము—అలంకారమో, కేవలము కురూపత్వాచ్ఛాదకపదార్థము; స్త్రీయో,ఎప్పటికిని అలంకారముచేనిండియు,

అలంకారేచ్ఛతో నిండియున్నది. తల్లి, తండ్రి, మామ, మగఁడు, కొడుకు మొదలైనవారలకు అలంకారమునకై స్త్రీచే సదా బాధకలుగును; ఈసంగతి ఎల్లరు నెఱిఁగినదే. స్త్రీసహజముగానె సుందరియైన దానికి అలంకారస్పృహ యుండదు. [ఎట్లు అలంకారము కురూపత్వాచ్ఛాదకమో, అట్లు సుగంధము దుర్గంధాచ్ఛాదకము; స్త్రీకి ఎట్లు అలంకారాపేక్షయున్నదో, అట్లు పుష్పచందనాదిపరిమళాపేక్షయున్నది; అలంకారాపేక్షచే స్త్రీ ఎట్లు కురూపిణియనిసిద్ధమగునో, అట్లు సుగంధాపేక్షచే దుర్గంధి యని సిద్ధమగును; అందువలన సుగంధనిరూపణము పృథక్కుగా చేయలేదు.]

చూడు—ఎప్పుడు పురుషుఁడు ప్రేమచేత స్త్రీయొక్క సమీపసమీపమునకు పోవునో, అప్పు డది సిగ్గుచేత వెనుక వెనుకకు జరుగును; అంగమును సంకోచించును; పలుమారు వస్త్రముచే నాచ్ఛాదించుకొనును; ఎట్లయినను తప్పించుకొనఁ జూచును; దీపమునార్పును; దీని అభిప్రాయమేమి?

స్త్రీ మనస్సులో అనుకొనును—"నేను అత్యంతకురూపిణిని, దుర్గంధముచే నిండియున్నాను; కురూపత్వము, దుర్గంధత్వము ఇవియే నాకుఁగల ఐశ్వర్యము; వీని నెదివరకు పతి గనుఁగొనఁడో, అదివరకె నాకు సత్కారము గలదు; అదివరకె మగనిశిరముపై మిరియాలునూరుటకు[1] నాకధికారము చెల్లును; ఒకవేళ దుర్లక్షణసహితమగు నాస్థితిని మగఁడెఱిఁగెనా నాకు కుక్క కున్నంతయును సన్మానము జరుగదు; నాముఖమును మగఁడు

1 శిరముపై మిరియాలు నూరుట అనఁగా ఎక్కువ అవమానము కలుగఁజేయుట.

చూడఁడు; విసిగి, దేశాంతరమునకైన పోవును; లేక సన్యాసి యైన అగును. నాకు జగత్తులో అపకీర్తి దెచ్చును; పిదప శుక్లయైన నాసమీపమునకు రాదు; అంతట నే నెవరితలమీఁద మిరియాలు నూరుదును! నాతలమీఁదనె అందరు నూరుదురు." ఈభయము అహోరాత్రము స్త్రీమనస్సులో నుండనే యుండును.

ఆప్రసంగమందు పతి ఇట్లనుకొనును—ఆహాహా! నా భార్య ఎంతసుందరి! వస్త్రాలంకారములచే సర్వాంగమాచ్ఛాదితముగ నుండఁగానె అస్పష్టముగా శరీరప్రదేశముయొక్క అంశాంశము నాభాగ్యోదయమందు దర్శనమయినపుడు నాకెంత ఆహ్లాదమాయెను! అహో! ఇదే యిట్లుండఁగా వస్త్రారహితముగ నిరావరణసాక్షాత్కారమైనపుడు! నాకెంత ఆనంద మగును!! ఆహాహా నాభార్య ఎంతసౌందర్యవతి! అయిన నాభార్య కృపణముగా నున్నది. తనసమగ్రసౌందర్యము నాకు స్పష్టముగా చూపదు; ఏరీతిగానైనను మనస్సు వశపఱచుకొని, ఎప్పుడు దానిసమగ్రసౌందర్యమును స్పష్టముగా చూడఁగలను! ఈరీతిగా మూఢుఁడైనపతి అహోరాత్రము మనస్సులో చింతించును.

[దుర్గుణదర్శనపూర్వకముగా నారీత్యాగముయొక్కసూచన.]

ఇట్టి సౌందర్యశాలినైన నారియందు గుణము ఏరీతిగా నుండును; చూడు—ఎప్పుడు బ్రహ్మదేవుఁడు నారీమూర్తిని సృజించుటకు ప్రారంభించునో, అప్పుడు సామగ్రియొక్క అనను కూలతవలన కొన్నిదినములు విధాతృకార్యము విఘ్నితమగును. ఇట్టి ఆస్త్రీమూర్తికొఱకు సామగ్రి ఏమికావలయుననఁగా—

అనృతం సాహసం మాయా మూర్ఖత్వమతిలోభతా,
అశౌచత్వం నిర్దయత్వం స్త్రియాం దోషాస్స్వభావజాః

ఈయేడుదోషములు నారీరూపకార్యమునకు ఉపాదాన సామగ్రి; వీనిలో ఒకదోషము తక్కువైన నారీరూపకార్యము ఘటిల్లదు. కనుక ఈయేడుదోషములుజన్మారభ్యముగా నుండుట వలన స్వభావసిద్ధములుగా నున్నవి. జన్మముతరువాత స్వసంపాదితదోషములు ప్రత్యేకముగా దానియొక్క పరాక్రమము ననుసరించి న్యూనాధికములుగా నుండును. ఎట్లనఁగా—పిత్రార్జితద్రవ్యము సహస్రసంఖ్య దొరకినపిమ్మట పరాక్రమవంతుఁడగు పుత్త్రుఁడు లక్షసంఖ్య చేయును, న్యూనపరాక్రమవంతుఁడు సహస్రమును రెండుసహస్రములు చేయును.

ఈప్రకారముగ స్త్రీ కేవలదుర్గుణఖనియే. కనుక వేదమందు తత్త్యాగము మూఁడుమాఱులు [బహిరంగసాధనత్యాగ ప్రసంగమందు, వైరాగ్యప్రసంగమందు, ఉపరతిప్రసంగమందు] చెప్పఁబడియున్నది. వ్యవహారమందు సాధారణపుమాటకొకసారి, అవశ్యప్రసంగమునందు రెండుసారులు, అత్యంతావశ్య ప్రసంగమునందు మూఁడుసారులు ఉచ్చారణమగుచున్నది. అట్లె వేదముచే ముమ్మారు చెప్పఁబడుటవలన స్త్రీత్యాగము అత్యంతావశ్యకమని వేదముయొక్క అభిప్రాయము గనఁబడుచున్నది.

కృపాళులైనబుధులు వివాహకాలమందు "సావధాన సావధాన" అని గట్టిగాచెప్పి, జనులను హెచ్చరించుచున్నారు. అయినను రామదాసస్వామివంటి విచారశీలుఁడుమాత్రము అట్టి ప్రసంగమునుండి తప్పించుకొనును; స్వాములకథ ఇట్లున్నది—

సజ్జనగడలోనుండిన రామదాసస్వామి వివాహమునకు నిలిచియుండఁగా అంతరపటము పట్టినపుడు బ్రాహ్మణులు "అతి

మానభంగము ఇత్యాది పురాణోక్తకథలు మనస్సులోవచ్చినట్టి యున సుగుణసుందరీస్త్రీక్లేశము తెలియనగును.

[యువతీసంగమువలన ధననాశము]

దేవభక్తుఁడు దేవపూజ ఒకదినము విడిచినను విడుచును; ఒక ఉపచారము తప్పినను తప్పును; అయిన స్త్రీభక్తుఁడు స్త్రీపూజ తప్పుటలేదు; సంకోచించుటలేదు. తండ్రిశ్రాద్ధము నిలచిననిలువనీ, భార్యాలంకారమందు న్యూనతచేయఁడు. ఈరీతిగా స్త్రీప్రీతికొఱకు మృష్టమృష్టపదార్థములందును, వస్త్రాలంకారాదులందును ధననాశము ప్రసిద్ధమే.

{యువతీసంగతివలన స్వాతంత్ర్యనాశము, బుద్ధినాశము, ధర్మనాశము}

యువతీరూపియైన కాఁపుది స్నేహరూపపాశరజ్జువును పతిరూపవృషభముముక్కునఁదగిల్చి తనయిచ్ఛవచ్చినట్లు త్రిప్పును. పంజరపుచిలుకవలె నేర్పఁబడినట్లు పురుషుఁడు మాటలాడును. ఎట్లు మయూరము నటించె, మయూరీమనోరంజనము చేయునో, అట్లు పతిరూపమయూరము చిత్రవిచిత్రవేషములు ధరించి, కాంతామనోరంజనము చేయును.

ఎపుడు కామాంధులగుదురో, అపుడు ఇద్దఱు వికలులై అమంగళనగ్నరూపమును ధరించి, నటింతురు. అపుడు ఆస్త్రీ స్వీయగానీ, పరకీయగానీ, వేశ్యగానీ, చండాలిగానీ దాని యెంగిలి అధరామృతమని నాకుటకు వెనుకఁదీయఁడు.

ఈరీతిగా స్త్రీసంగతి ధర్మనాశద్వారమున కేవల నరకపాత్రిగా నుండును.

[స్త్రీసంగతివలన వీర్యనాశము]

నానావిధభోజనమువలన వీర్యముపుట్టును. ఆవీర్యరూప బింద్వాధీనముగా సకలజీవనబిందువు లున్నవి; ఎప్పుడు మనస్సు మలమందు నివాసము చేయునో, అప్పుడు తమోగుణప్రభావము వలన ఉదాసపురుషుఁడుగూడ శోకము చేయును; ఎప్పుడు మనస్సు రుధిరమందు నివాసము చేయునో, అప్పుడు రజోగుణప్రభావము వలన అనేకవిధకల్పనాచింతలు చేయును. ఎప్పుడు మనస్సు బిందువునందు నివాసము చేయునో, అప్పుడు సత్త్వగుణప్రభావము వలన సకలశోకచాంచల్యనాశమై తన్ను బలవంతుఁడనుకొని, శుభకర్మమునందు ప్రసన్నుఁడై యుండును.

బింద్వాధిక్యమువలన సుందరకాంతి యగును ఎవ్వనికి బిందునాశము లేదో, వానికి వలీపలిత [1|2] రోగములు పుట్టవు. యోగి, ఖేచరీముద్రచే [3] ఏ బిందువుయొక్క రక్షణముచేయునో, ఏ బిందువుయొక్క ఆధిక్యమువలన యోగి అష్టమహాసిద్ధుల కధికారి యగునో, ఆయుత్తమోత్తమమైన బిందువును ఆకర్షణ శక్తివలన స్త్రీ తనయందు బలముచే ఆకర్షించుకొనును. ఎట్లు గానుఁగ చెఱకుయొక్కరసమునుపిండుకొనియూపిప్పినివిడువదో, అట్లు స్త్రీ భుజరూపపాశముచే కట్టుకొని, తనగుహ్యాంగరూప ఘటము నిండినను మగనిని విడువదు.

---

1, 2. ఏరోగముచేత శరీరముయొక్క చర్మము ముడతలు పడునో దానిని వలి, దేనిచేత రోమము శ్వేతమగునో, దానిని పలితమందురు.

3. లంబికాయోగస్థితికిని కొందరు ఖేచరీముద్ర యందురు. కొన నాలుకను తాలురంధ్రముకొనికి చేర్చుటను లంబికాయోగ మందురు. ఈ యోగముకొఱకు నాలుక పృష్ఠమూలమందు కొంచెము కత్తిరించుట ప్రాప్త మగును.

స్త్రీయొదుట తద్జ్ఞుఁడైన విద్వాంసుని దీగతి; అవిద్వాంసునిగతి నేమిచెప్పవలెను? ఇట్టి స్త్రీమోహితపురుషుఁడు భవదుఃఖమునుండి ఎన్నఁడు తొలఁగును? ఎన్నఁడును తొలఁగఁడు.

ఆహా! స్త్రీసంగతివలన ఇదివరకు ఎవ్వనికైన హితమైనదా యేమి? ఎవ్వనికిని కాలేదు. సంగతియో, దూరముగానుండనీ; పరాక్రమశాలులైన సుందోపసుందులు, భస్మాసురుఁడు, రావణుఁడు, దుర్యోధనుఁడు మొదలగువారు కేవల స్త్రీవాంఛవలననే సమూలనాశమును బొందిరి. కనుక కురూపిణిగానీ, సుందరిగానీ, స్వీయగానీ, పరకీయగానీ, లేక వేశ్యగానీ స్త్రీ సర్వప్రకారములను త్యాజ్యమే.

[పుత్రదుఃఖవర్ణనము]

పుత్త్రుఁడు లేనిచో నొకదుఃఖము, పుట్టిన నొకదుఃఖము, చచ్చిన నొకదుఃఖము, బ్రతికిన నొకదుఃఖము, సారాంశము—భావస్థానమందుండనీ, అభావస్థానమందుండనీ పుత్త్రుఁడు దుఃఖహేతువే. చూడు! గర్భధారణమైనపుడు ఈగర్భము నిలుచునా పడునా? నిలిచిన ఇదేమి పుత్త్రుఁడా, పుత్త్రికయా? ఇట్లు చింతచేయుచునుండి చేయుచు తొమ్మిదినెలలునిండిన సూతికచింత, నిర్విఘ్నప్రసవచింత, ఆఱవదినమువరకు షష్ఠిచింత, విషమస్థానవృత్తిగ్రహచింత, తల్లికిపాలు లేనిచో ధాత్రిచింత, శిశువు స్తనపానము చేయకుండిన చింత, దంతోద్గమనచింత, ఔషధము నూరుచింత.

తాను కర్మనిష్ఠబ్రాహ్మణుఁడుగానీ, గొప్పదీక్షితుఁడుగానీ పుత్త్రునికొఱకు తనకులధర్మమును విడిచి, దృష్టితీయించుటకొఱకును, మంత్రోపచారముకొఱకును హీనజాతులను ప్రార్థనా

పూర్వకముగ ఇంటికిఁ దెచ్చుట, ఎల్లమ్మగొల్లమ్మ మ్హసోబా మొదలగు క్షుద్రదేవతలకు బూజించుట, ధానకునిచే[1] డక్కలను గొట్టించుట, పశుపక్ష్యాదుల బలియిచ్చుట, అభక్ష్యపదార్థముల భక్షించుట మొదలైన అధర్మములు చేయుచున్నాఁడు.

దానినుండి బ్రతికిన బడికిపోవుచింత, బడిలో నెవ్వరో కొట్టిన చింత, ఎవ్వరినో కొట్టినచింత; మందబుద్ధియై విద్వాంసుఁడుగాక యుండినచింత, విద్వాంసుఁడై వ్యవహారదక్షుఁడు గాకుండిన చింత, ద్యూతము మద్యపానము స్త్రీలోలత మొదలైన దుర్వ్యసనచింత.

ఈ ప్రకారముగా అనంతానర్థములచే రక్షణము చేయఁగా చేయఁగా ఒకానొకప్పుడు లోకాంతరగతుఁడైన ఆ దుఃఖము మృతపుత్రునకే తెలియును; జీవత్పుత్రపుత్రికల తర్కము లోనె రాదు. ఎట్లనఁగా—ప్రసూతిదుఃఖము వంధ్యాతర్కముందె రాదు.

ఒకవేళ సర్వదుఃఖములుగడచి, తారుణ్యమువరకు బ్రతికిన అప్పుడు ఆదుఃఖము వేఱుగానెయున్నది—ఎవరు ఆజన్మదుఃఖము ననుభవించి, లాలనపాలనము చేసిరో, వారికి తృప్తియైన నీళ్ళిచ్చుటయే కష్టము. అత్తమామలు తిట్టుదురని రాత్రి చెప్పిన భార్య మాటవిని, సుపుత్రుఁడైనచో తల్లితండ్రులముఖముచూడకయే అట్లే లేచిపోవును. కుపుత్రుఁడైన ప్రాతఃకాలమున లేచి, తలి

1. ధానకుఁడు అనఁగా కుమ్మరవాఁడు, వేఁటకాఁడు; దయ్యము ప్రకటమగుటకొఱకు డమరకమును వాయించువాఁడు. గర్భిణిస్త్రీ చచ్చినవెనుక దానికడుపునందు ఏ గర్భము గలదో, తచ్చర్మముచేత సిద్ధమైన డమరకము వాయించునపుడు దయ్యము ప్రకటమగుచున్నది; ఆ డమరకమునకు డాంక మనుచున్నారు. ఈసంగతి మహారాష్ట్రదేశమందు ప్రసిద్ధము.

దండ్రులను తిట్టికొట్టి, ధనధాన్యములఁ దీసికొని, వేఱొకచోటికి పోయియుండును. తలిదండ్రులు క్షుధచేత చచ్చినను మరల ముఖమును జూడఁడు.

ఒకానొకఁడు ఇట్లనుగును—తలిదండ్రులను సేవించునట్టి సద్గుణసంపన్నుఁడైన సుపుత్త్రుఁడు ఎవ్వఁడైననుండఁడా ఏమి? ఉండును; ఉండిన వానిదుఃఖము ఎల్లరిదుఃఖముకన్న అధికము. చూడు— జీవవంతుఁడుగానుండిన క్షణభంగురసంసారానుభవముగుటవలన తలిదండ్రులకు వానిమరణవిషయమందు సామాన్య చింత ఉండఁజేయుండును. ఏదేని గ్రామాంతరమునకుఁబోయిన వచ్చువరకు వియోగదుఃఖము సహింపను; రోగముతోఁ పడిన అన్నపానాదులు రుచింపవు; స్వప్నమందు వానిప్రేతమే ఎదురగును; రోగమందే పరలోకవాసియైన వానిదుఃఖము వర్ణించుటకు సహస్రముఖుఁడైన శేషుఁడును సమర్థుఁడుగాఁడు, దాని దృష్టాంతమునకొఱకు శ్రీమద్రామాయణమునందు అత్యంతసుపుత్త్రుఁడైన శ్రావణునిమరణకథ జ్ఞాపకమునకుఁ దెచ్చుకొన్నఁ జాలును. ఈప్రకారముగా విచారముచేతఁ జూచినట్టయిన కుపుత్త్రుఁడుగానీ, సుపుత్త్రుఁడుగానీ, లేక అత్యంతసుపుత్త్రుఁడుగానీ పుత్త్రుఁడో సదా దుఃఖరూపుఁడే.

అట్టి పుత్త్రకథవిని, యొకఁడాక్షేపించెను—పుత్త్రుఁడు దుఃఖదాతయనిన కన్యవలన దుఃఖమేమియు లేదుగదా? వాఁడిట్లు తెలియవలయును— పుత్త్రికాతాపము పుత్త్రతాపముకన్న దశాధికముగా నున్నది; దానియందు తల్లిదండ్రులకు సర్వత్రానుభవముండనేయున్నది. "పుత్త్రాద్దశగుణా కన్యా" అని పురాణ వచనమున్నది. దానిస్పష్టతకొఱకు జగద్గురువైన శ్రీకృష్ణపరమా

త్తుఁడు షోడశసహస్రస్త్రీలకు ప్రత్యేకముగా ఒక్కొక్కతెకు పదుగురుపుత్త్రులను, ఒకకన్యను ఇచ్చెను. ఈరీతిగాఁ జూచిన కన్యయొద్ద లేక పుత్త్రునియొద్ద సుఖేచ్ఛఁగలవానిని మూర్ఖశిరోమణి యనవలయును.

[ధనదుఃఖవర్ణనము]

విద్యారణ్యస్వాములు చెప్పియున్నారు—

"అర్థానామార్జనే క్లేశ స్తథైవ పరిపాలనే,
నాశే దుఃఖం వ్యయే దుఃఖమ్ ధిగర్థాః క్లేశ కారిణః." 1

శ్రీమద్భాగవతైకాదశస్కంధమున కదర్యవ్యాఖ్యానమందు చెప్పఁబడియున్నది— పంచదశానర్థములచే ఒకయర్థము ప్రాప్తమగును; [1] దానిసంపాదనముకొఱకును, రక్షణముకొఱకును అనేకకష్టములు, అధర్మములుచేయవలసివచ్చును; పోయినయెడల ఏడ్చుచుఁ గూర్చుండవలసివచ్చును; ఇట్టి సర్వానర్థములకు కారణమైనది ధనము.

[భర్తృవుయొక్క అరణ్యగమనము.]

ఈప్రకారముగా భర్తృవు మనస్సులో విచారించి, స్త్రీధనపుత్త్రాదిత్యాగము చేసి, కౌపీనము ధరించి, సర్వాంగముభస్మము చర్చుకొని, ఏకాంతవనమునకు పోయి, ఒకవృక్షముక్రింది భగవద్ధ్యానము చేయుచుఁగూర్చుండెను.

---

1. ధనమునందు పంచదశానర్థములు ఇట్టున్నవి—

(1) ధనప్రాప్తికొఱకు— i చౌర్యము ii హింస iii అసత్యభాషణము iv దంభము v లోభము vi క్రోధము.

(2) ప్రాప్తధనమందు— i గర్వము ii అభిమానము iii స్నేహత్యాగము iv ద్వేషము v అవిశ్వాసము vi అసూయ vii స్త్రీవ్యసనము viii మద్యపానము ix జూదము.

[రాజునకు భర్తృదర్శనము.]

తరువాత కొన్ని దినములకు రాజు మృగయావినోదమున అరణ్యమున సంచరించుచుండఁగా ఒకవృక్షముక్రింద విభూతి చర్చితుఁడై, ధ్యానసనిష్ఠోపవిష్టుఁడైన భర్తృవును స్వనేత్రముల తోనె అవలోకించెను; ఇంతలో భర్తృవు ప్రేతయైనాఁడను పూర్వ శ్రుతకల్పితకథాస్మృతియై, "వీఁడుప్రేతుఁడు; నన్నిపుడు భక్షించును" అనుకొని, రాజు పలాయనముచేసెను.

[పూర్వసంగతి గురూపదేశము.]

ఏమిఆశ్చర్యము! వంచక [1] జనులప్రతారణశక్తి యేమని చెప్పనగును! పంచకజనులమాట విశ్వసించి, ఇంద్రియజన్యజ్ఞాన మైన రాజు బ్రతికియున్న భర్తృవును భూతమనుకొని పలా యనముచేసెను. ఈరీతిగా భేదవాదిపామరజనులమీఁద విశ్వాస ముంచి, వారిమాటలు సత్యములని తలంచుజనులుఅద్వైతమగు సచ్చిదానందసుఖమును అంతరించుకొని, జన్మమరణరూపమగు దుఃఖములను ఉపభోగింతురు.

అందువలన ఓశిష్యుఁడా! ఇట్టి భేదవాదిజనులసంగమే చేయకుము; దుర్దైవమువలన నెప్పుడేని సంభవించిన వారిమాట వినకుము; ఒకానొకప్పుడు చెవులందుపడిన, ఎట్లు అజ్ఞానమువలన విషముతిన్న వాఁడు తత్కాలమౌషధము తీసికొని క్రక్కి వేయునో, అట్లుధిక్కారపూర్వకముగా వారిమాటలత్యజింపుము ఎదివరకు భేదవచనసంస్కారము అంతఃకరణమందుండునో, అది వరకు అద్వైతబ్రహ్మజ్ఞాన మగుటయే లేదు. ఈప్రకారముగా

---

1 శఠుఁడు, మోసగాఁడు.

భేదవచనయోగ్యత, జైనవచనయోగ్యతకన్న నీచముగా నున్నది; కనుక భేదవచనము పరిత్యజించినవానికే సద్గురుకృప వలన మహావాక్యార్థజన్య బ్రహ్మజ్ఞానము ప్రాప్తమగును. ఇతరునకుఁగాదు.

ఈస్థానమందు ఎవ్వఁడేని ఆక్షేపించును—"మహావాక్యమునకు గురుముఖమున శ్రోత్రసంబంధము ఐనయెడల తత్కాలమందే బ్రహ్మజ్ఞానము తానె యగును." అనునీసంగతి పూర్వము ద్వితీయతరంగమందు ప్రతిపాదింపఁబడినది; ఇచ్చట భేదవచనసంస్కారరహితపురుషునకే బ్రహ్మజ్ఞానమగును; ఇతరునకుఁగాదని చెప్పితిరి; దానివలన రెండువచనములందు పరస్పరవిరోధ మగుచున్నది; లేక పూర్వోక్తి బాధితముగా నగపడుచున్నది?

దానికి సమాధానము—భేదవచనసంస్కారసహితపురుషునకు మహావాక్యమువలన బ్రహ్మజ్ఞానమైనను అది దృఢాపరోక్షజ్ఞానము గామివలన వానికి భర్భుదృష్టరాజునకువలె మరల అసంభావనావిపరీతభావనలు పుట్టును; భేదసంస్కారరహితపురుషునకుమహావాక్యముచేత దృఢాపరోక్షజ్ఞానమగును; కనుక అట్టి దృఢజ్ఞానమైనవెనుక అసంభావనాదులు పుట్టవు. ఈ విధముగ రెండువచనములకు పరస్పరవిరోధము లేదు; ఏవచనమును బాధితముగాదు. నిరర్థకమును గాదు. మరేమనఁగా—రెండువచనములును పరస్పరావిరోధములు, అబాధితములు, సార్థకములుగా నున్నవి.

[157. మిథ్యయొక్క నాశము మిథ్యవలన.]

శిష్యుఁడా! నీవు అడిగితివి—వేదగురువులు మిథ్య

యనిన వారిచే భవదుఃఖముయొక్క ఛేదము ఎట్లగును? ఓయి! మిథ్యాభవదుఃఖముయొక్క నాశము మిథ్యావేదగురువులచేతనే కాఁగలయును; సత్యవేదగురువులవలన కాఁజాలదు. దీనికిదృష్టాంతము ఒకకథ చెప్పెదను వినుము—

స్వర్గమందు సురేంద్రునివలె భూమండలమునందు సకలైశ్వర్యసంపన్నుఁడు, అత్యంతపరాక్రమవంతుఁడు అయిన ఒక రాజుండెను. అత్యున్నతమును అతిసుందరమును అగు వాని గృహముచుట్టు భీమపరాక్రములైన కావలివారు కాచుచుండిరి. అందువలన రాజాజ్ఞ లేక ఒకపక్షియైన లోపల ప్రవేశించుటకు అసాధ్యమై యుండెను. ఇట్టినగరిలో, హంసతూలికాతల్పముపై రాజు నిజకాంతాసహితుఁడై శయనించి యుండెను.

అప్పుడుస్వప్నములో రాజుయొక్క పాదమును ఒకజంబుకము గట్టిగా కఱచి పట్టుకొనెను. ఎవ్వరైనవచ్చి జంబుకమును చంపుఁడోయని రాజు ఘోషించెను; అయిన నెవ్వరును రాలేదు. అప్పుడు రాజు దానిశిరముపై తానె యొకకట్టెపట్టుకొని,గట్టిగా కొట్టెను. దానివలన జంబుకముమాత్రము చచ్చెనుగాని దాని కాటువలన గాయమై రక్తము కాఱుచుండెను. అప్పుడు రాజు కుంటుచుకుంటుచు దానిమాన్పుకొనుటకు ఒకవైద్యునియొద్దకు పోయెను. వైద్యుఁడు ఒకకాని ఇచ్చిన మందిత్తుననెను. అయిన నను రాజునొద్ద కాని లేకపోయెను. దానికై ఇల్లిల్లుభిక్షమెత్తుచు పోయెను. అయిన వానికెవ్వరును ఇయ్యరైరి. అంతట రాజు వైద్యునే ధర్మార్థముగా మందియ్యరాయని బహుప్రకారముల యాచించెనుగాని వాఁడు వానిని ధిక్కరించెను.

పిమ్మట రాజు ఆశాభంగుఁడై తనలో తానను కొనెను—

మాతాపితలుగాని, దారాపుత్త్రులుగాని అందఱును తమ తమ యుక్తమైననె ఆప్తులు. స్వార్థసాధనము గాకున్న ఎవరి కెవరు? అందులో అన్యుఁడైన ఈ వైద్యుఁడు స్వార్థసాధనముగాక దాక్షిణ్యమేల కలిగియుండును? తనకర్మమును తానె యుప భోగింపవలెను అని విచారించి, దుఃఖించుచు పోయెను. మార్గములో నొకబైరాగి, దీనుఁడైనరాజును గని కరుణించి, యొకఆకు పసరు ఆ గాయమునకు పూసెను; వెంటనే గాయము మానెను.

ఇంతలో రాజు మేలుకొనెను. కనుదెఱచిచూడ జంబుకము లేదు, దండము లేదు, గాయము లేదు, బైరాగి లేఁడు, మందు లేదు; తాను తనసుందరతల్పముమీఁద శయనించియుండెను.

ఓశిష్యుఁడా! చూడుము—స్వప్నమందు ఎప్పుడు రాజు సమీపము మిథ్యాజంబుకము పొందెనో, అప్పుడు ఆ జంబుకము సత్యయోధునివలన అడ్డగింపఁబడలేదు; దానినికొట్టుటకు సత్యశస్త్రసహితసత్యయోధులు వచ్చుటకొఱకు రాజు అఱచెను. ఎవఁడును సత్యయోధుఁడువచ్చి, సత్యశస్త్రచేత దానిని కొట్ట లేదు; రాజు ఒకమిథ్యాదండముచేతనే దానిని కొట్టెను; రాజునకు కలయందు కల్లగాయమైనపుడు సత్యమైన వ్రణవైద్యుఁడేని దానిని మానుపలేదు; రాజే మిథ్యావ్రణవైద్యునొద్దకు పోయెను; వాఁడొకకానియడిగెను; సత్యయుగుఅనంతకోశముండినను రాజునకు ఒకకానియును చిక్కలేదు. తుదకు భిక్షమెత్తినను ఒకకాని దొరకలేదు; అపుడు రాజున కొకమిథ్యాముని మిథ్యౌషధ మిచ్చెను; దానిచే గాయము మానెను.

ఇటువంటి స్వప్నము అందఱికిని అనుభవసిద్ధమే. జాగ్రత్పదార్థము స్వప్నమందు ఎవ్వరికిని ఎన్నఁడేని ఉపయుక్తము

గాదు. అట్లు మిథ్యయైన సంసారదుఃఖముయొక్క నాశము మిథ్యా వేదగురువులవలన అగుచున్నది; సత్యవేదాపేక్ష లేదు, సత్యగుర్వపేక్షయు లేదు. [యథానురూపోహి బలిః]

## 158. మృగజలము, తృష వీని కందు సత్తయొక్క భేదము.

వేదగురువులు మిథ్య యని యంగీకరించి, వారివలన సంసారదుఃఖముయొక్క నాశము అంగీకరించినపక్షమందు మృగజలమువలన తృషానాశము గావలయును? అని శంక శిష్యుని చేత చేయఁబడినది. దానికి శ్రీగురువు సమాధానము చెప్పనారంభించెను—

ఓశిష్యుఁడా! మృగజలమువలన నీరువట్టు శమింపకున్నను మిథ్యావేదగురువులవలన మిథ్యాభవదుఃఖనాశము ఘటిల్లును; ఈస్థానమందు నీదృష్టాంతము యోగ్యము గాదు; విషమముగా నున్నది. ఏలాగుననఁగా—మృగజలము, తృష వీనిసత్తయందు భేద మున్నది; అట్లు వేదగురువులు, సంసారదుఃఖము వీనిలో సత్తాభేదము లేదు.

## 159. సమసత్తగల [1] పదార్థములకు తమలోతమకు సాధకబాధకత

భవదుఃఖమునకును, వేదగురువులకును సమసత్తయనఁగా ఏకసత్త అగుటవలన వేదగురుద్వారమున భవదుఃఖముయొక్క

1. ఇచ్చట ఈశంక యున్నది—సమసత్తగలపదార్థములే తమలో తాము సాధకబాధకములుగా నుండును; ఈనియమము లేదు; విషమసత్తగల పదార్థములును కొన్నికొన్నిస్థలములందు సాధకబాధకములుగా నుండును. ఏల యన—సర్పత్రారోపము [అధ్యాసము] యొక్క సత్త అధిష్ఠానముకన్న విష

ఛేదకమగును. దేనికి దేనితో సమసత్తగలదో, దానికి దానిచేత సాధకబాధకతలు ఘటిల్లును. ఎట్లనఁగా—మృత్తికయును, ఘటము

---

మయుగా నున్నది. తత్సాధకత [కారణత] అధిష్ఠానమందున్నది. ఎట్లనఁగా—కల్పితరజతముయొక్క అధిష్ఠానమైనశుక్తికి వ్యావహారికసత్తగలదు; మఱియు రజతమునకు ప్రాతిభాసికసత్త గలదు; ఈ ప్రాతిభాసికసత్తగల రజతముయొక్క సాధకత శుక్తియందున్నది. లేక జగత్తునకు అధిష్ఠానము బ్రహ్మము; దానికి పరమార్థసత్త గలదు; జగత్తునకు వ్యావహారికసత్తగలదు; ఈవ్యవహారసత్తగల జగత్తుయొక్క సాధకత బ్రహ్మమందున్నది; ఇచ్చట విషమసత్తగలదియును సాధకమగును; మఱియు అంతఃకరణవృత్తిరూపమగు శుక్తియొక్క యథార్థజ్ఞానమువలన జ్ఞానసహితరజతముయొక్క బాధయగును; అచ్చట జ్ఞానసహిత రజతమునకు ప్రాతిభాసికసత్త గలదు; శుక్తిజ్ఞానమునకు వ్యవహారసత్త గలదు; ఇట్లు విషమసత్తగలదియును బాధకమగును. కనుక ఉక్తనియమము అసంగతము!

దానికిది సమాధానము—కేవలశుక్తి, లేక బ్రహ్మము క్రమముగా రజతముయొక్క, లేక జగత్తుయొక్క కల్పితాధిష్ఠానము గాదు; మఱేమనఁగా—తూలావిద్యాసహితమైన శుక్తి, లేక మూలావిద్యాసహితమైన బ్రహ్మచైతన్యము అధిష్ఠానమగుచున్నది. కొన్నిస్థలములందు విశేషణధర్మమునకు విశిష్టమందు వ్యవహారమగును; ఈనియమముచేత ప్రాతిభాసికతూలావిద్యాసహితమైన శుక్తి, లేక శుక్త్యవచ్ఛిన్న [విశిష్ట] చైతన్యమును ప్రాతిభాసికమందురు; వ్యావహారికమూలావిద్యావచ్ఛిన్న [విశిష్ట] బ్రహ్మచైతన్యమును వ్యావహారికమందురు. [ఇచ్చట అవిద్య ఉపాధిగాని, విశేషణము గాదు; అట్లయినను అవివేకిజనులదృష్టిచేత విశేషణమువలె ప్రతీతమగుటవలన విశేషణమందురు. మఱియు ఆవిశేషణముచేత విశిష్టచైతన్యమందురు.] ఆ అవిద్యాధర్మమైన ప్రాతిభాసికతను, మఱియు వ్యావహారికతను తమతమవిశేష్య [ఆశ్రయ] మైన శుక్తియందు మఱియు బ్రహ్మమందు వ్యవహారమగుచున్నది; కనుక ఇచ్చట విషమసత్తగలది సాధకము గాదు; సమసత్తగలదియే సాధకముగా నున్నది.

నకును సమసత్తగలదు; కనుక మృత్తిక ఘటమునకు సాధకము. అగ్నికిని, కాష్ఠమునకును సమసత్తగలదు; కనుక అగ్ని కాష్ఠము నకు బాధకము. [సాధకమనఁగా కారణము; బాధకమనఁగా నాశ

పంచపాదికాకారులరీతిగా తూలావిద్య మూలావిద్యకన్న భిన్నము గాదు; గనుక తన్నివృత్తి శుక్తిజ్ఞానమువలనఁ గాదు; బ్రహ్మజ్ఞానమువలననే అగును; అయినను వ్యావహారికాంశగకరణవృత్తిరూపమైన శుక్తియొక్క యథార్థజ్ఞానమువలన శుక్తివిష్ఠతూల విద్యయొక్క తిరస్కారమగును; కనుక దానికార్యమైన జ్ఞానసహితరజతముయొక్కయు తిరస్కారమగును: కాఁబట్టి ఇచ్చట విషమసత్తగలది బాధకము గాదు.

ఈ సమాధానము ప్రసంగానుసారముగ నున్నది. విచారదృష్టిచేత చూచినట్టయిన అధిష్ఠానరూపసాధకమో, విషమసత్తగలదియే యగును; సమ సత్తగలది గాదు. ఇది ఒకనియమము. మఱియు మిథ్యాజ్ఞానముగూడ మిథ్యా వస్తువునకు బాధకమగును; ఇది ఒకనియమము. అధిష్ఠానజ్ఞానరూపబాధకమందు నియమము లేదు; అది కొన్నిస్థలములందు విషమసత్తగలది యగును; కొన్ని స్థలములందు సమసత్తగలదియగును. చూడు—

(1) శుక్తిరజతమునకు బాధకము శుక్తిజ్ఞానము; స్వప్నజగత్తునకు బాధకము జాగ్రద్జ్ఞానము; ఇచ్చట విషమసత్తగలదు.

(2) వ్యావహారికమైన జగత్తునకు బాధకము వృత్తిరూపబ్రహ్మజ్ఞానము; ఇచ్చట సమసత్తగలదు.

అందువలన ఇచ్చట చెప్పిననియమము ఏది గలదో, [సమసత్తయందు సాధకతబాధకత; ఈనియమము] అది అధిష్ఠానరూపసాధకపదార్థమును, జ్ఞాన రూపబాధకపదార్థమును [అధిష్ఠానవివర్తముగలపదార్థములను] విడిచి, అవ శేషమైన సకల [ఆరంభమును, పరిణామమును] పదార్థములను విషయము చేయునది మాత్ర మని తెలియవలెను.

కము.] మృగజలమునకును; తృషకును సకుసత్త లేదు; కాఁబట్టి మృగజలము తృషకు బాధకము గాదు.

ఈస్థానమున దీరవాక్యము గలదు—చైతన్యమందు పరమార్థసత్త యొకటియే గలదు. మఱియు చైతన్యభిన్నమైన సకల మిథ్యాపదార్థములందు ద్వివిధసత్త గలదు—మొదటిది వ్యావహారికము, రెండవది ప్రాతిభాసికము.

## 160. సత్తాత్రయవిచారము

ఏ పదార్థమునకు బ్రహ్మజ్ఞానములేక బాధ గానేరదో, బ్రహ్మజ్ఞానమువల్లనే బాధయగునో, ఆపదార్థమందు వ్యవహారసత్త చెప్పఁబడియున్నది; ఆ వ్యవహారసత్త ఈశ్వరసృష్టియందుఁ గలదు; ఏలయన—దేహేంద్రియాదిప్రపంచరూపమైన ఏ యీశ్వరసృష్టి గలదో, దానికి బ్రహ్మజ్ఞానములేక బాధ గానేరదు; బ్రహ్మజ్ఞానముచేతనే బాధ యగును. [ఈశ్వరసృష్ట పదార్థములకు బ్రహ్మజ్ఞానములేక నాశమయినను బ్రహ్మజ్ఞానము లేక బాధ గానేరదు.]

బాధయనఁగా అపరోక్షమిథ్యానిశ్చయము; ఆ నిశ్చయము ఈశ్వరసృష్టపదార్థములందు బ్రహ్మజ్ఞానముకన్న మొదలు ఎవరికిని గాఁజాలదు; బ్రహ్మజ్ఞానానంతరమే గాఁజాలును; కనుక మూలావిద్యాకార్యమైన ఈశ్వరసృష్ట జాగ్రత్పదార్థములు ఏవి గలవో, వానియందు వ్యవహారసత్త గలదు. [జన్మమరణబంధమోక్షాది వ్యవహారము చేయునట్టి సత్తయనఁగా అస్తిత్వము ఏది గలదో అది వ్యవహారసత్త.]

బ్రహ్మజ్ఞానములేకయు దేనికి బాధయగునో, ఆపదార్థమందలిసత్తను ప్రాతిభాసికమందురు. ఎట్లనఁగా—బ్రహ్మజ్ఞానము

లేకయు శుక్తిరజ్జ్వాదుల జ్ఞానమువలన రజతసర్పాదుల యొక్క బాధయగును; కనుక వీనియందు ప్రాతిభాసికసత్త యున్నది. [ప్రాతిభాసిక మనఁగా ప్రతీతిమాత్రము; సత్త యనఁగా అస్తిత్వము] ఈతూలావిద్యా[1] కార్యమైన రజతాదిపదార్థములకు

1. ఘటాదిజగత్పదార్థోపహితచైతన్యమును ఆచ్ఛాదనము చేయుచున్నదైన అవిద్యనే తూలావిద్య యందురు. దానిని అవస్థాజ్ఞానము, లేక అంశాది దోషము గల అవిద్య యని చెప్పుదురు. ఆ తూలావిద్య అంశభేదమువలన నానాగా నున్నది; మఱియు భిన్నభిన్న నానాపదార్థముల ఆవరణము చేయుచున్నది. యద్ఘటాదిపదార్థాకారము అంతఃకరణవృత్తి యగునో, తత్పదార్థాచ్ఛాదకమైన తూలావిద్యయొక్క అంశము నష్టమగును. ఎప్పుడు వృత్తి అన్యదేశమందు పోవునో, అప్పుడు అచ్చట మరల ఆయవిద్యాంశము ఉత్పన్నమగును. ఈతూలావిద్యానాశమునకు బ్రహ్మజ్ఞానాపేక్ష లేదు; అది ప్రాతిభాసికసత్తగలదగుటవలన ఘటాదికముయొక్క జ్ఞానమువలన తన్నాశమగుచున్నది.

పద్మపాదాచార్యులనెను— మూలావిద్యయే తూలావిద్య; భిన్నము గాదు. వీరిమతమందు లోకసమూహముయొక్క మధ్యమందు పిడుగుపడుటచేత సర్వలోకము వెనుకకు జరుగును; మరల నొకటిగా చేరును. అట్లు విపదార్థాకారము అంతఃకరణవృత్తి యగునో, తత్పదార్థాకారమైన అవిద్య దానిచేత తిరోహితమగును [వెనుకఁబడును.] మఱియు నెప్పుడు వృత్తి అన్యదేశమందు పోవునో, అప్పుడు ఆయవిద్య మరల అచ్చట చేరును. ఆ మూలావిద్య బ్రహ్మజ్ఞానములేక నాశము గానేరదు; అయిన స్వప్నపదార్థము, మఱియు కల్పితసర్పాదిపదార్థము అవిద్యానాశములేకయు విరోధిపదార్థముయొక్క జ్ఞానమువలన మూలావిద్యయందు లయరూపనాశమును పొందును.

ఇది ప్రసంగానుసారముగా చెప్పఁబడిన తూలావిద్యావర్ణనము.

ప్రతీతికాలమందుమాత్రము అస్తిత్వ మగుటవలన వీనిసత్తను ప్రాతిభాసిక మందురు.

దేనికి మూఁడుకాలములందును బాధకానేరదో, దాని సత్తను పారమార్థిక మందురు. చైతన్యముయొక్క బాధ ఎప్పుడును ఏరీతిచేతను గానేరదు; కనుక చైతన్యమందు పరమార్థ సత్తలగదు. [రజ్జుసర్పాదులకును, స్వప్నపదార్థములకును ప్రాతిభాసికసత్త; ఈశ్వరసృష్టపదార్థములకు వ్యవహారసత్త; ఒక్క చైతన్యమునకుమాత్రము పరమార్థసత్త]

**161. వేదగురు భవదుఃఖములు సమసత్తగల వగుటవలన వేదగురువులచే భవదుఃఖనాశము**

ఉక్తప్రకారముగా వేదగురువులును, సంసారదుఃఖమును ఏకమైన వ్యవహారసత్తగలవగుటవలన సమసత్తగలవిగా నున్నవి; అందువలన మిథ్యావేదగురువులచే [1] మిథ్యాభవదుఃఖనాశము ఘటిల్లినది. క్షుత్పిపాసలు ప్రాణధర్మమై, ప్రాణమునకును, తద్ధర్మ

1. యద్యపి మిథ్యావేదగురువులవలన మిథ్యాభవదుఃఖనాశము సంభవించినది. మఱియు ఇట్లంగీకరించుటవలన సిద్ధాంతమునకు హానియుంలేదు. తథాపి వేదగురురూపమైన ఇష్టపదార్థమును మిథ్య యనిచెప్పుట అయోగ్యము. మఱియు జగత్సత్యత్వవాదులయొక్క ఉపహాసమునకు విషయమగును; మందబుద్ధి జిజ్ఞాసువులకు విచిత్రతకును కారణమగును, కనుక మిథ్యోక్తి ఖండనము చేసినను సిద్ధాంతభంగము గానట్లు అన్యోక్తి చెప్పుచున్నాము—

వేదగురువులను మిథ్యయనువారలను అడుగవలయును—శిష్యునిదృష్టిచేత వేదగురువులు మిథ్యయా? లేక గురుదృష్టివలననా? శిష్యదృష్టివలననని చెప్పినపుడు ఆశిష్యుఁడు జ్ఞానియా? అజ్ఞానియా?

ములకును బ్రహ్మజ్ఞానము లేక బాధగామివలన వానిలో వ్యవహారసత్త గలదు; మృగజలమునకు బ్రహ్మజ్ఞానము లేకయు ముఱు

---

జ్ఞాని యనిన వానికి శిష్యత్వము సంభవింపదు; యద్యపి ఉపదేష్ట్రు గుర్వపేక్షవలన సర్వజ్ఞానులకు శిష్యత్వము గలదు; తథాపి వానికి జ్ఞానాధికార మగుటవలన శిక్షకు యోగ్యమైన శిష్యత్వము గాదు.

ఆ శిష్యుఁడు అజ్ఞాని యనినప్పుడు వానికి మిథ్య యని ఎఱుఁగఁబడిన వేదగురువులందు శ్రద్ధాపూర్వకముగ ప్రవృత్త్యసంభవమువలన బోధప్రాప్తి దుష్కరము. లేక అజ్ఞానిపురుషునకు వేదాంతశ్రవణముకన్న మొదలు ఏ జగత్పదార్థమునందు మిథ్యాత్వబుద్ధి సంభవింపదు. ఈరీతిగా శిష్యునిదృష్టివలన వేదగురువులు మిథ్య యనుట సంభవింపదు.

గురుదృష్టివలన వేదగురువులు మిథ్యయనినప్పుడు ఆగురువు జ్ఞానియా! లేక అజ్ఞానియా ?

అజ్ఞానియనినప్పుడు వానిని గురువనుట విరుద్ధము. యద్యపి ఎందఱో, అజ్ఞానపురుషులును జగత్తునందు మూర్ఖులదృష్టివలన గురువులనిపించుకొందురు; తథాపి వేదవేత్తలగు విద్వాంసులదృష్టివలన వారు గురుశబ్దమునకు విషయము గారు. ఈసంగతి తృతీయతరంగమందు స్పష్టముగా నిరూపింపఁబడినది. ఆ యజ్ఞానపురుషదృష్టివలననో, వేదగురువులు మిథ్యయనుట సంభవింపదు: ఏలనఁగా—వేదగురువులును, జగత్తును సత్య మని వానినిశ్చయము.

గురువు జ్ఞాని యనునెడ ఆ జ్ఞానికి వేదగురువులును, సకలజగత్తును బ్రహ్మముకన్న భిన్నముగా ప్రతీతమైనదా? లేక అభిన్నముగా ప్రతీతమైనదా ?

ప్రథమపక్షముచెప్పిన, ఆ భేదవాదిని జ్ఞానియనుట, లేక గురువనుట అయుక్తము. రెండవపక్షముచెప్పిన సకలజగత్తును, తన్నును పరమార్థసత్తారూపమైన బ్రహ్మముగా ఎఱుఁగునట్టి అద్వైతవాదిగురువుయొక్క దృష్టివలన వేదగురువులు మిథ్య యనుట ఘటిల్లదు. ఏలనఁగా—బ్రహ్మరూప మనుట ఘటిల్లును.

భూమిజ్ఞానముచే బాధయగుటవలన దానిలో ప్రాతిభాసికసత్త గలదు. ఈరీతిగా తృషకును, మృగజలమునకును సమసత్తగలుగమిచే మృగజలమువలన తృషానాశము గానేరదు.

ఈప్రకారముగా దార్ష్టాంతికమందు బాధకమైన వేదగురువులు, బాధ్యమైన సంసారదుఃఖము వీనికి ఏకసత్తగలదు; దృష్టాంతమందు మృగజలమునకును, తృషకును సత్తాభేదము గలదు; కాబట్టి యీదృష్టాంతము విషమమనఁబడియె; దార్ష్టాంతికమునకు సమానముగాదు.

## { 162. శుక్తిరజతాదులు, సంసారదుఃఖము వీని బాధయందు భేదము ఎందువలన? }

ఓ ప్రభువా! తామో, బ్రహ్మముకన్న భిన్నమైన సకలమును మిథ్య యనుచున్నారు; ఈమిథ్యాపదార్థములందు శుక్తిరజతాదులకు బ్రహ్మజ్ఞానముకన్న మున్నే, సంసారదుఃఖమునకు బ్రహ్మజ్ఞానానంతరము బాధ చెప్పుచున్నారు; ఈ భేదము ఏహేతువువలన ఉంచుచున్నారు?

---

అందువలన వేదగురువులను మిథ్య యనువాఁడు అజ్ఞుఁడును గాఁడు; తద్జ్ఞుఁడును గాఁడు; మఱేమనఁగా—అర్థదగ్ధకాష్ఠమువలె వేదాంతశ్రవణమననము చేయుచువాఁడైన అర్థప్రబుద్ధపురుషుఁడు, లేక బాహ్యాభ్యంతరత్యాగరహితుఁడైన బహిర్ముఖజ్ఞానిగా నున్నాఁడు.

ఈరీతిగా వేదగురువులు సత్యమను పక్షము అద్వైతహానిలేకయుయుక్తిసహితముగా నున్నది.

**163. 152 గతశంకకుత్తరము — దేనియజ్ఞానమువలన దేనిప్రతీతియో, దానిజ్ఞానమువలన దానిబాధ.**

ఓశిష్యుఁడా! యద్యపి బ్రహ్మముకన్న భిన్నమైనసకలము అజ్ఞానకార్యమగుటవలనమిథ్య; దానిలో అణుమాత్రమైనను తత్త్వము లేదు; తథాపి దేనియజ్ఞానమువలన ఏది పుట్టుచున్నదో, దానిజ్ఞానమువలన తద్బాధ యగును. శుక్తిరజ్జ్వాదులయొక్క అజ్ఞానమువలన రజతసర్పాదులు పుట్టుచున్నవి; తద్బాధ శుక్తిరజ్జ్వాదిజ్ఞానమువలన నగును. బ్రహ్మముయొక్క అజ్ఞానముచే జన్మమరణాదిసంసారదుఃఖము పుట్టుచున్నది. తద్బాధ బ్రహ్మజ్ఞానమువలన నగుచున్నది.

**164. సంసారోత్పత్తికి క్రమ మేది?**

ఓభగవంతుఁడా! బ్రహ్మముయొక్క అజ్ఞానమువలన సంసారోత్పత్తి చెప్పితిరి; ఆసంసారోత్పత్తికి క్రమము ఎట్లున్నది?

**165. 164 గతప్రశ్నకుత్తరము — 165 195 క్రమము లేక జగద్భానము.**

ఓశిష్యుఁడా! మిథ్యయైనస్వప్నము ఎట్లు క్రమము లేకయే భాసిల్లునో, అట్లు మిథ్యయైనజగత్తు క్రమము లేకయే భాసించుచున్నది; దానియందు క్రమమడుగుటయేమి? ఓశిష్యుఁడా! ఎవ్వఁడు జగత్తునకు క్రమమడుగునో, వాఁడు వంధ్యాపుత్త్రునివస్త్రము మృగజలమందు తడిపి పిండవలెను.

అనేకోపనిషత్తులలో జగదుత్పత్తి అనేక ప్రకారములుగా చెప్పఁబడియున్నది — ఛాందోగ్యమునందుసద్రూపపరమాత్మ

వలన అగ్నిజలపృథ్వీక్రమముగా ఉత్పత్తి చెప్పఁబడియున్నది. తైత్తిరీయమందు ఆకాశవాయ్వగ్నిజలపృథ్వీక్రమమున ఉత్పత్తి చెప్పఁబడియున్నది. మఱియు నెచ్చటనో, సర్వమును పరమేశ్వరుఁడు ఉత్పత్తిచేసినట్లు చెప్పఁబడియున్నది. ఇట్లు అనేకప్రకారములుగా జగదుత్పత్తి చెప్పుటయందు వేదముయొక్క అభిప్రాయము—జగత్తు మిథ్య. జగత్తు సత్యపదార్థమైనప్పుడు తదుత్పత్తిని వేదము అనేకప్రకారములుగా చెప్పదు.

అనేకప్రకారములుగా జగదుత్పత్తి చెప్పుటవలన ఇట్లు సిద్ధించుచున్నది— జగదుత్పత్తి ప్రతిపాదనమందు వేదముయొక్క అభిప్రాయములేదు. అయితేను జగన్నిషేధద్వారమున అద్వైతబ్రహ్మబోధకొఱకు పరీతిగానో, మిథ్యాజగత్తుయొక్క ఆరోపము వేదముచేత చెప్పఁబడినది. ఎట్లు వినోదనిమిత్తము ఎగిరించుటకు చేయఁబడిన వారువాస్త్రియొక్క పుచ్ఛము వంకరయైనప్పుడు చక్కచేయుటకొఱకు ఎవ్వఁడు ప్రయత్నముచేయఁడో, అట్లు ప్రపంచనిషేధద్వారమున అద్వైతబోధకొఱకు చెప్పఁబడిన ప్రపంచారోపమునందు వేదము ఉత్పత్తిక్రమమును ఏకరూపముచే చెప్పుటయందు ప్రయత్నము చేయదు.

### 166. జగదుత్పత్తియందు ఏకరూపతాప్రతిపాదకమగు భాష్యకారుని యభిప్రాయము

బ్రహ్మసూత్రభాష్యకారులు ద్వితీయాధ్యాయమందు ఉత్పత్తిప్రతిపాదకమైన శ్రుతివచనములయొక్క విరోధము దూరముచేసి, ఒకరూపముచే [తైత్తిరీయశ్రుత్యనుసారము] సకలోపనిషత్తులయొక్క అభిప్రాయము ఏదిచెప్పిరో, అది మందబుద్ధిజిజ్ఞాసువులనిమిత్తము; ఏలాగుననఁగా—ఏమందబుద్ధిజిజ్ఞా

సువు ఉత్పత్తివాక్యములయొక్క పూర్వోక్తాభిప్రాయము నెఱుఁగఁడో, వాఁడు ఉపనిషత్తులందు నానాప్రకారములుగా జగదుత్పత్తికథనము చూచి, తనలోతాను ఉపనిషత్తులను విరోధము గలదను భ్రాంతిపొందును; తత్పరిహారార్థము సర్వోపనిషత్తులందు ఏకరూపముచే జగదుత్పత్తిప్రతిపాదనప్రకారము చెప్పఁబడినది.

మఱియు బుద్ధిమాంద్యాదిదోషమువలన ఎవనికి బ్రహ్మవిచారముచే యథార్థజ్ఞానము గానేరదో, వాఁడు ఉత్పత్తిక్రమముకన్న విపరీతక్రమముచే లయచింతనము చేయవలయునను అభిప్రాయముచే క్రమసహితముగా జగదుత్పత్తి చెప్పఁబడియున్నది. ఆలయచింతనముచే అద్వైతబ్రహ్మమునందు మంద బుద్ధికి స్థితి కలుగును.

ఆ లయచింతనప్రకారము పంచీకరణముయొక్క వార్త్తికకారులైన సురేశ్వరాచార్యులు చెప్పియున్నారు. ఈగ్రంథమో, ముఖ్యముగా ఉత్తమజిజ్ఞాసువుల [1] నిమిత్తము; కనుక ఉత్పత్తిలయప్రకారము ఇచ్చుట విశేషించి వ్రాయలేదు. ఆ ఉత్పత్తిలయప్రకారమో, సాగరరూపము; కనుక దానిలో లేశమాత్రము ఇచ్చుట చూపుచున్నాము.

శుద్ధబ్రహ్మమువలన జగదుత్పత్తి గాలేదు. ఏలయన— శుద్ధబ్రహ్మము అసంగము, అక్రియము; దానియందు జగదు

1. దృష్టిసృష్టివాదమురీతిగా బ్రహ్మమునందు ప్రపంచారోపము చేసి, మరల అపవాదపూర్వకముగా పంచమభూమికయందు ఆరూఢుఁడగుటకు యోగ్యుఁడై, ఉత్తమసంస్కారవంతుఁడైన ఏ జిజ్ఞాసువు గలఁడో, వానినిచ్చట ఉత్తమజిజ్ఞాసు వందురు.

త్పత్తియోగ్యత లేదు. అందువలన మాయావిశిష్టుఁడయిన[1] ఈశ్వరునిచే జగదుత్పత్తి చెప్పవలయును. ఆమాయయొక్కయు, ఈశ్వరునియొక్కయు స్వరూపము ప్రతిపాదించుచున్నాము—

## 167. మాయాస్వరూపప్రతిపాదనము

మాయ, జీవేశ్వరభేదరహితమైన శుద్ధచైతన్యమును ఆశ్రయించుకొని యుండును. ఆ మాయ అనాది అనఁగా ఉత్పత్తిరహితము. ప్రపంచమువలన మాయోత్పత్తియగునని యెడల, పుత్త్రునివలన తండ్రియొక్క ఉత్పత్తి కావలయును; అది ఘటిల్లదు. ఎందుకనఁగా—పుత్త్రుఁడు తండ్రియొక్క కార్యము; అట్లు ప్రపంచమును మాయాకార్య మగుటవలన ప్రపంచమువలన మాయోత్పత్తి యగుఁగూడదు.

అపుడు చైతన్యమువలననే మాయోత్పత్తి యంగీకరింప వలసివచ్చును; ఆచైతన్యము త్రివిధము; అందు జీవభావమును,

1. యద్యపి జగత్తుయొక్క వివర్తోపాదానమగు అధిష్ఠానము మాయోపహితచైతన్యముగా నున్నది; మాయావిశిష్టము గాదు; తథాపి మాయావిశిష్టమును వివర్తోపాదాన మని అంగీకరించి, దానివలన జగదుత్పత్తి యనుట అవివేకిపురుషులయొక్క దృష్ట్యనుసారముగా నున్నది. వివేకిపురుషులదృష్టి వలననో, జగత్తుయొక్క పరిణామ్యుపాదానత, లేక వివర్తోపాదానత మాయావిశిష్టచైతన్యమందు లేదు; మఱేమనిన జగత్తుయొక్క పరిణామ్యుపాదానత కేవలమాయయందు, మఱియు వివర్తోపాదానత మాయోపహితచైతన్యమందు నున్నది. అవివేకిజనులకు రెండుధర్మములును మాయావిశిష్టచైతన్యమందు భ్రాంతిచేత ప్రతీతమగుచున్నవి, శాస్త్రకారునిచే ఇచ్చట అవివేకిజనుల దృష్టియొక్క అనువాదము మాత్రము చేయఁబడినది.

ఈశ్వరభావము విననో, మాయా కార్యమగుటవలన మాయ యొక్క సిద్ధిలేక జీవేశ్వరులస్వరూపమే అసిద్ధము; కనుక వారి వలన మాయోత్పత్తి అనఁగూడదు. శుద్ధచైతన్యమో, నిర్వి కారము; దానివలన మాయోత్పత్తి అంగీకరించినయెడ, చైత న్యము వికారియగును. మఱియు శుద్ధచైతన్యమువలన ఉత్పత్తి యంగీకరించినయెడ, మోక్షదశయందు మాయ పునరుత్పన్న మగును; దానివలనమోక్షమసిద్ధమై, మోక్షసాధనములునిష్ఫల మగును.

ఈరీతిగా మాయ ఉత్పత్తిరహితము. అందువలన అనాది.

మఱియు నామాయ ఏకము [రెండవమాయ లేమివలన] సాంతము [జ్ఞానముచే అంతవంత మగుటవలన] మఱియు నామాయ సదసద్విలక్షణము—దేనికి త్రికాలమందు బాధ లేదో, దానిని సత్తందురు; ఇట్టిది చైతన్యము; మాయ జ్ఞాన ముచే బాధితమగుటవలన సత్తుకన్న విలక్షణము. దేనియొక్క ప్రతీతి త్రికాలమందును గాదో, అట్టి శశశృంగవంధ్యాపుత్రా దులను అసత్తందురు. బ్రహ్మాజ్ఞానముకన్న మొదలు కార్యసహిత మాయ ప్రతీతమగుటవలన అసత్తుకన్నను విలక్షణము; ఏలాగున ననఁగా—జాగ్రత్తయందు "నేనజ్ఞానిని; బ్రహ్మము నెఱుఁగను" ఈరీతిగా మాయ ప్రతీత మగుచున్నది. స్వప్నమందు ఏనా నాపదార్థములు ప్రతీతము లగునో, వీని కుపాదాన కారణము మాయ. మఱియు సుషుప్త్యనంతరము ఏమియు నెఱుఁగనను స్మృతి గలదు; ఆ స్మృతియొక్క విషయమైనమాయ సుషుప్తి యందుఁ గలదు. ఈ ప్రకారముగా మూఁడవస్థలయందును

మాయయొక్క ప్రతీతి యగుచున్నది; కనుక మాయ అసత్తు కన్న విలక్షణము.

సదసద్విలక్షణమైన మాయయొక్క కార్యమును సదసద్విలక్షణముగా నున్నది. [సదసద్విలక్షణమునే అద్వైతమతమందు మిథ్యయనియు, అనిర్వచనీయమనియు అందురు.] అందువలననే మాయచేతను, తత్కార్యముచేతను ద్వైతసిద్ధి గానేరదు. ఎట్లు చైతన్యము సద్రూపమో, అట్లు మాయ, మఱియు తత్కార్యము సద్రూపముయినయెడల ద్వైతసిద్ధి యగును; అవి రెండూ, మిథ్య; మిథ్యాపదార్థముచే ద్వైతము గానేరదు. ఎట్లనఁగా— స్వప్నపదార్థములును, శుక్తిరజతాదులును మిథ్యయగుటవలన వానిచేత ద్వైతసిద్ధి గానేరదు.

## 168. అజ్ఞానముయొక్క స్వాశ్రయస్వవిషయత

ఆ మాయ జీవేశ్వరవిభాగరహితమైన శుద్ధబ్రహ్మము నాశ్రయించి, శుద్ధబ్రహ్మమునే ఆచ్ఛాదించుచున్నది. ఎట్లనఁగా—గృహము నాశ్రయించిన అంధకారము గృహమునే ఆచ్ఛాదించుచున్నది. ఈ పక్షమును స్వాశ్రయస్వవిషయపక్షమందురు. [స్వ అనఁగా శుద్ధబ్రహ్మము అదే ఆశ్రయము, మఱియు స్వ అనఁగా శుద్ధబ్రహ్మము అదే విషయము.] సంక్షేపశారీరము, వివరణము, వేదాంతముక్తావళి, అద్వైతసిద్ధి, అద్వైతదీపిక ఇత్యాదిగ్రంథకారులచే స్వాశ్రయస్వవిషయాజ్ఞానమే అంగీకరింపఁబడినది.

## 169. వాచస్పతియొక్క మతము

వాచస్పతియొక్క మతము ఇట్లున్నది—అజ్ఞానము జీవునకాశ్రితమై, బ్రహ్మమును విషయము చేయును. "నే నజ్ఞానినిః

బ్రహ్మము నెఱుఁగను." అనునీప్రతీతివలన నేనను శబ్దమునకర్థము జీవుఁడు, అజ్ఞానినని చెప్పుటవలన వాఁడు అజ్ఞానమునకు ఆశ్రయమని భానమగును; బ్రహ్మమును ఎఱుఁగనని చెప్పుటవలన అజ్ఞానమునకు విషయము బ్రహ్మము కనఁబడును. ఈరీతిగా అజ్ఞానము జీవుని కాశ్రితమై, బ్రహ్మమును విషయము చేయును.

ఆ యజ్ఞానము ఒకటికాదు; అనంతము. ఒకటే యజ్ఞానము నంగీకరించినపక్షమున ఒకజీవుని జ్ఞానమువలనఆ ఒక్క యజ్ఞానము నివృత్తమైన వెనుక ఇతరజీవులకు అజ్ఞానముగాని, తత్కార్యమైనసంసారముగాని ప్రతీతము గాఁగూడదు. మఱియు నేటి వరకు ఎవనికిని జ్ఞానముగా లేదనినపక్షమందు ముందును ఎవనికి జ్ఞానము గలుగనేరదు; దానివలన శ్రవణాదిసాధనములు నిష్ఫలమగును; కనుక ఇట్లనవలయును—అనంతజీవుల కాశ్రితమైన అజ్ఞానములు అనంతములు; అనంతజీవులచే అనంతాజ్ఞానకల్పితులైన ఈశ్వరులు అనంతులు; బ్రహ్మాండములనంతములు. ఏ జీవునికి జ్ఞానమగునో, వానియొక్క అజ్ఞానము; ఈశ్వరుఁడు, బ్రహ్మాండము వీనియొక్క నివృత్తి యగును; ఎవనికి జ్ఞానము గలుగదో, వానికి బంధముండనేయుండును.

ఇది వాచస్పతిమతము; ఇది సమీచీనముగాదు.

## 170. 169 గతమతముయొక్క అసమీచీనత

"ఈశ్వరుఁడు జీవునియొక్క అజ్ఞానమువలనకల్పితుఁడు." అనుమాట శ్రుతిస్మృతిపురాణములకు విరుద్ధము; ఈశ్వరుఁడనంతుఁడు, ప్రత్యేకజీవునకు వేఱేవేఱేసృష్టి యనుటయు విరుద్ధము; ఈరీతిగా నానాజ్ఞానము అంగీకరించుట అసంగతము. మఱియు నానాఅజ్ఞానముఅంగీకరించి, ఈశ్వరుని, సృష్టినిఒకటిగా

నంగీకరించుట ఘటిల్లదు; ఏలయన—జీవుఁడు, ఈశ్వరుఁడు, ప్రపంచము అజ్ఞానకల్పితములు; అనంతాజ్ఞానములు అంగీకరించుటవలన ఒక్కొక్కజీవునిన్యాయమున ఒక్కొక్కయజ్ఞానముచే కల్పితమైన ఈశ్వరులును, ప్రపంచములును అనంతములుగా నుండవలెను. అందువలననె వాచస్పతి అనంతేశ్వరులను, అనంత సృష్టులను చెప్పెను. ఈరీతిగా అనంతాజ్ఞానమతముఅసంగతము; మఱేమనఁగా—ఏకాజ్ఞానమతమే [1] సమీచీనము.

## 171. స్వాశ్రయస్వవిషయపక్షముయొక్క అంగీకారము.

ఆ యొకయజ్ఞానము జీవాశ్రితము గాదు; అది శుద్ధ

---

1. దీని కివి యభిప్రాయము—అంశిరూపాంధకార మొకటైనను దాని అంశరూపములైన నానాంధకారములు ప్రతిగృహమందుఁ గలవు. ఏగృహమందు దీపమున్నదో, తద్గృహమందుండిన అంశరూపమైన అంధకారము యొక్క నాశమగును; అట్లు అంశియజ్ఞానము ఒకటి; దాని అంశరూపములైన నానాయజ్ఞానములు నానాంతఃకరణదేశగతసాక్షిచైతన్యమందు ఉన్నవి; ఏయంతఃకరణదేశమందు జ్ఞానమగునో, ఆయంతఃకరణదేశమందుండిన యజ్ఞానాంశముయొక్క నాశ మగును; అవశేషమైన అజ్ఞానాంశములు ఉండనే యుండును; కనుక ఒకపురుషునికి జ్ఞానమగుటవలన సర్వులకు అజ్ఞాననివృత్తి గానేరదు.

ఈరీతిగా ఒకయజ్ఞానముయొక్క అంగీకారము చేయుటవలన బంధమోక్షవ్యవస్థ ఘటిల్లును. మఱియు జీవునియజ్ఞానమువలన కల్పితులయిన ఈశ్వరులు అనంతులు. జీవులందు సృష్టిభేదము అను శ్రుతిస్మృతిపురాణ విరుద్ధమైన పక్షముయొక్క అంగీకారమును ఘటిల్లదు; కాఁబట్టి ఏకాజ్ఞాన పక్షము సమీచీనము.

బ్రహ్మాశ్రితమే. ఏలయన—జీవభావము అజ్ఞానముయొక్క కార్యము; ఆయజ్ఞానము స్వతంత్రముగా నెప్పుడును ఉండదు; ఈరీతిగా నిరాశ్రయమైన అజ్ఞానముచేతనో, జీవభావము ఘటిల్లదు. మొదలు దేనినేని అజ్ఞానమాశ్రయించినవెనుక అజ్ఞానకార్యమగు జీవభావమగును; జీవభావమువలె ఈశ్వరభావమును అజ్ఞానకార్యమే; తదాశ్రితము అజ్ఞాన మెట్లగును? అది శుద్ధబ్రహ్మాశ్రితమే.

ఈరీతిగా అనాదియైనచైతన్యము, మఱియు అనాదియైన అజ్ఞానము వీనిసంబంధమును అనాదిగా నున్నది. ఆ యనాది సంబంధమువలన జీవభావమును, ఈశ్వరభావమును అనాదిగా నున్నవి. అయినను జీవేశ్వరభావములు అజ్ఞానాధీనము లగుటవలన వానిని అజ్ఞానకార్యములందురు. "నేనజ్ఞానిని" ఈరీతిగా జీవునకాశ్రితమైనట్టి అజ్ఞానముయొక్క ప్రతీతి అయినను జీవునకు "నేనజ్ఞానిని" అను నభిమానమగుచున్నదిగాని, శుద్ధబ్రహ్మము నాశ్రయించిన ఏ యజ్ఞానముగలదో, తత్కార్యమగుటవలన జీవుఁడు ఆ యజ్ఞానమునకు అధిష్ఠానరూపాశ్రయుఁడగుట ఘటిల్లదు. శుద్ధబ్రహ్మమే అధిష్ఠానరూపాశ్రయము.

శుద్ధబ్రహ్మాశ్రితమైన ఏ యజ్ఞానము [1] గలదో, ఆయజ్ఞానము మొదలు బ్రహ్మము నాచ్ఛాదించును; పిమ్మట "నేనజ్ఞానిని"

1. "నేను అజ్ఞానిని" అనునీ అనుభవమువలన వాచస్పతిచేత అజ్ఞానమునకాశ్రయము జీవుఁడని చెప్పఁబడినది; అది సుగమరీతిగా ముముక్షుబుద్ధికి బోధయగుటకొఱకే చెప్పఁబడినది; కాని దానియందు వాచస్పతియొక్క గూఢాభిప్రాయము ఇట్లున్నది—నేను శబ్దమునకు వాచ్యుఁడయిన ఏజీవుఁడు [అంతఃకరణవిశిష్టచైతన్యము] గలఁడో, వానియొక్క విశేష్యభాగమయిన

ఈరీతిగా అజ్ఞానాభిమానమైన ఆశ్రయము జీవుఁడగును. ఈ ప్రకారముగా అజ్ఞానము స్వాశ్రయమై, స్వవిషయముగా నున్నది.

## 172. ఏకాజ్ఞానపక్షమందు బంధమోక్షవ్యవస్థ

యద్యపి ఆ యజ్ఞానమొక్కటియై జ్ఞానమువలన నివృత్తమగును; తథాపి ఎవ్వని అంతఃకరణమందు జ్ఞాన మగునో, వాని అంతకరణావచ్ఛిన్నచైతన్యమందుండునట్టిఅజ్ఞానాంశముయొక్క నివృత్తియగును. వాఁడే ముక్తుఁడగును. ఏయంతఃకరణమందు జ్ఞానము గాలేదో, ఆయంతఃకరణమందు అజ్ఞానము ఉండనే యుండును; అచ్చట బంధ ముండును. ఈరీతిగా ఏకాజ్ఞానపక్షమందు బంధమోక్షవ్యవహారము ఘటిల్లినది.

వాచస్పతిరీతివలన నానా అజ్ఞానవాదమందు బుద్ధియొక్క ప్రవేశమయినయెడల ఇదియును అద్వైతజ్ఞానముయొక్క ఉపాయమే; తత్ఖండనమందు ఏమాగ్రహము లేదు. ఏరీతిగానో 1 జిజ్ఞాసువునకు అద్వైతబోధమగునట్టి బుద్ధియొక్కస్థితి చేయవలయును.

---

సాక్షిచైతన్యము బ్రహ్మముగా నున్నది; అదియే అజ్ఞానమునకాశ్రయము; దానియొక్క [విశేష్యముయొక్క] వ్యవహారము విశిష్టమందగుచున్నది.

1. ఇచ్చట నైష్కర్మ్యసిద్ధికారువచనము ఇట్లున్నది—

యయా యయా భవేత్పుంసామ్ వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని,
సాసైవ ప్రక్రియేహ స్యాత్ సాధ్వీ సా చ వ్యవస్థితిః. 1

భావార్థము—పురుషునకు ఏయేప్రక్రియచేత ప్రత్యగాత్మయందు బోధమగునో, ఆయాప్రక్రియ ఇచ్చట [వేదాంతసిద్ధాంతమందు] శ్రేష్ఠము, అదియే వ్యవస్థగానున్నది. [అభిప్రాయ మేమనఁగా దానియందు ఖండనమందు ఆవశ్యకత లేదు.]

శుద్ధబ్రహ్మాశ్రితమైన మాయను అవిద్య, లేక అజ్ఞాన మందురు. అచింత్యశక్తిగలదైనను యుక్తిచే సంహరింపఁబడుట వలన మాయ యందురు. విద్యవలన నశించుటవలన అవిద్య యందురు. స్వరూపాచ్ఛాదనము చేయుటవలన అజ్ఞానమందురు. ఏ చైతన్యము నాశ్రయించి, అజ్ఞానము గలదో; ఆచైతన్యము సామాన్య మనఁబడును; ఆ చైతన్యము తద్విరోధిగాదు; ఏ దేమనఁగా—ఆసామాన్యచైతన్యము సత్తాస్ఫూర్తినిచ్చుటవలన అజ్ఞానమునకు సాధకముగా నున్నది; విశేషచైతన్యము మాత్రము దానికి విరోధిగా నున్నది. [వృత్త్యారూఢచైతన్యమును, లేక చైతన్యసహితవృత్తిని విశేషచైతన్య మందురు.]

## 173. ఈశ్వరస్వరూపము, ద్వివిధకారణలక్షణము

శుద్ధసత్త్వగుణసహితమై మాయ, మాయాధిష్ఠానమైనచైతన్యము, మాయయందలి చైతన్యముయొక్క ఆభాసము ఇవన్నియుఁగూడి ఈశ్వరుఁడందురు. ఆయీశ్వరుఁడుసర్వజ్ఞుఁడు, వాఁడే జగత్తునకు కారణముగా నున్నాఁడు.

కారణము ద్వివిధము—మొదటిది ఉపాదానము [1] రెండవది నిమిత్తము [2]—

---

1. కార్యముయొక్క ఉత్పత్తి, స్థితి, లయము ఈమూఁడింటికి ఏది కారణమో, అది ఉపాదానకారణము. ఇదియును ఉపాదానకారణము యొక్క లక్షణాంతరముగ నున్నది.

2. కార్యోత్పత్తికి మాత్రము ఏది కారణమో, అది నిమిత్తకారణము. ఇదియును నిమిత్తకారణముయొక్క లక్షణాంతరముగ నున్నది; ఈ నిమిత్తకారణము అనేకప్రకారములుగా నున్నది.

(1) దేనికి కార్యముయొక్క స్వరూపమందు ప్రవేశము గలదో, ఏది లేక కార్యముయొక్క స్థితి ఘటిల్లదో, దానిని ఉపాదానకారణమందురు. ఎట్లనఁగా — ఘటస్వరూపమందు మృత్తికా ప్రవేశము గలదు; మృత్తిక లేక ఘటస్థితి గానేరదు; కనుక ఘటమునకు ఉపాదానకారణము మృత్తిక.

(2) దేనికి కార్యస్వరూపమందు ప్రవేశము లేదో, ఏది తాను కార్యముకన్న భిన్నముగానుండి, కార్యమును చేయునో, దేనినాశమువలన కార్యము చెడదో, దానిని నిమిత్తకారణ మందురు. ఎట్లనఁగా — ఘటస్వరూపమందు కులాలదండచక్రాదులకు ప్రవేశము లేదు; అవి ఘటముప్రక్కనుండి, ఘటోత్పత్తి చేయును; ఘటమైన వెనుక వానినాశమైనను ఘటము చెడదు; కనుక కులాలదండాదులు ఘటమునకు నిమిత్తకారణము.

జగత్తునకు ఉపాదానము, మఱియు నిమిత్తము ఈ రెండు ప్రకారములచేతను ఈశ్వరుఁడే కారణము. ఎట్లనఁగా — ఒక లే ఊర్ణనాభి[1] జాలమునకు ఉపాదానము, మఱియు నిమిత్తము.

ఒకానొకఁడిట్లు శంకించును — ఊర్ణనాభియొక్క జడశరీరము జాలమునకు ఉపాదానకారణము; దానిశరీరమందలి చైతన్యభాగము నిమిత్తకారణము. ఒకయీశ్వరుని నిమిత్తకారణమును, ఉపాదానకారణమును అని అంగీకరించుటకు ఏదృష్టాంతమును లేదు!

1. లూత, సాలెపురుగు.

దీనికి సమాధానము—ఊర్ణనాభివలె [1] ఈశ్వరశరీరమైన జడమాయ జగత్తునకు ఉపాదానకారణము; చైతన్యభాగము నిమిత్తకారణము. ఈరీతిగా ఒకఁడేయీశ్వరుఁడు జగత్తునకు ఉపాదానకారణమును, నిమిత్తకారణమునుగా నున్నాఁడు. అందులో ఊర్ణనాభిదృష్టాంతము యోగ్యము; ముఖ్యదృష్టాంతమో, స్వప్నము. [2]

ఎప్పుడు జీవునియొక్క కర్మము ఫలమునిచ్చుటకు సమ్ముఖముగాదో, అప్పుడు ప్రలయ మగును; మఱియు నెప్పుడు

1. ఇట్లు ఊర్ణనాభియొక్క శరీరము జాలమునకు ఉపదానకారణమో, మఱియుం అంతఃకరణసహితచైతన్యభాగము నిమిత్తకారణమో, అట్లు తమఃప్రధానప్రకృతియైనమాయ జగత్తునకు ఉపాదానకారణము, మఱియుం శుద్ధసత్త్వప్రధానమాయాసహితచైతన్యభాగము నిమిత్తకారణముగానున్నది. కేవలచైతన్యభాగమందు కారణత లేదు; ఇది అభిప్రాయము.

2. న్యాయమతమునందు ఘటముతో ఈశ్వరునియొక్క సంయోగమందు ఈశ్వరుని అభిన్ననిమిత్తోపాదానకారణమందురు; మఱియుం జీవాత్మగత జ్ఞానాదిగుణమందు జీవాత్మను అభిన్ననిమిత్తోపాదానకారణమందురు. శ్రీమద్భాగవతమునందు ఎప్పుడు బ్రహ్మదేవుఁడు వత్సవత్సపాలకుల హరణము చేసెనో, అప్పుడు శ్రీకృష్ణపరమాత్ముఁడు వత్సవత్సపాలాది సర్వరూపములను తానే ధరించెను; అచ్చట శ్రీకృష్ణపరమాత్ముఁడు వానియొక్క అభిన్ననిమిత్తోపాదానకారణమైయుండెను. మఱియుం ఒకచిత్రకారుఁడు నఖరూపలేఖినిచేత స్వశరీరముపై చిత్తరువు వ్రాయుచున్నాఁడు; ఆచిత్రమునకు ఆచిత్రకారుఁడు అభిన్ననిమిత్తోపాదానకారణముగా నున్నాఁడు; మఱియుం సాక్షిచైతన్యము స్వప్నప్రపంచమునకు అభిన్ననిమిత్తోపాదానకారణముగా నున్నది; అట్లు ఈశ్వరుఁడు జగత్తునకు అభిన్ననిమిత్తోపాదానకారణముగా నున్నాఁడు.

ఫలమునిచ్చుటకు సమ్ముఖమగునో, అప్పుడు సృష్టియగును. ఈ రీతిగా సృష్టి జీవునికర్మాధీనముగా నున్నది.

## 174. జీవస్వరూపవర్ణనము

మలినసత్త్వగుణసహితమైన అజ్ఞానాంశమందు చైతన్యాభాసము, అజ్ఞానము, తదధిష్ఠానకూటస్థుఁడు ఇవన్నియుఁగూడి జీవుఁ డనఁబడును. ఆజీవుఁడు శుభాశుభకర్మములకు కర్తయునై యు తత్ఫలమైన సుఖదుఃఖములకు భోక్త.

## 175. ఈశ్వరునియందు విషమదృష్టి, క్రూరత లేవు

జీవకర్మానుసారము ఉత్తమాధమభోగములకొఱకు ఈశ్వరుఁడు సృష్టిని రచించినాఁడు; అందువలన ఈశ్వరునియందు విషమదృష్టి, క్రూరత లేవు.

ఒకఁడిట్లననగు—సర్వముకన్న ప్రథమము ఏ సృష్టి గలదో, ఆసృష్టికన్న మున్ను కర్మము లేదు. ఇట్లుండఁగా ప్రథమసృష్టియందు ఉత్తమాధమశరీరములు,భోగములురచించినాఁడు; కాఁబట్టి ఈశ్వరుఁడు విషమదృష్టిగా నున్నాఁడు? ఈమాట ఘటిల్లదు; ఏలయన—సంసారము అనాది; ఉత్తరోత్తరసృష్టియందు పూర్వపూర్వసృష్టియొక్కకర్మము హేతువు; సర్వముకన్న మొదట సృష్టియనునది ఘటిల్లదు; కనుక ఈశ్వరునియందు ఏదోషము లేదు.

## 176. జీవునిభోగమునిమిత్తము ఈశ్వరునకు జగదుత్పత్తిచ్ఛ.

ఎప్పుడు జీవునికర్మము భోగమునిచ్చుటయందు ఉదాసీనమగునో; అప్పుడు ప్రలయమగును; ప్రలయమందు సర్వపదార్థ

ములయొక్క సంస్కారములు మాయయందుండును; అప్పుడు అవశేషమయిన జీవకర్మముగూడ సూక్ష్మమయి, మాయయందుం డును; ఎప్పు డాకర్మము భోగమునిచ్చుటకు సమ్ముఖమగునో, అప్పుడు ఈశ్వరునకు ఈయిచ్ఛ[1] యగును—జీవుని భోగముం కొఱకు జగత్తును సృజింపవలయును.

---

1. ఇచ్చట ఈశంక యున్నది—దుఃఖముయొక్కయు, దుఃఖసాధనముయొక్కయు నివృత్తినిమిత్తము, లేక సుఖముయొక్కయు, సుఖసాధనముయొక్కయు ప్రాప్తినిమిత్తము ఇచ్ఛ యగును; అన్యవస్తువుయొక్క ఇచ్ఛ గానేరదు; ఇదినియమము. ఈశ్వరునకు దుఃఖముయొక్కయు, దుఃఖసాధనము యొక్కయు అభావముగలదు; కనుక ఈశ్వరునకు తన్నివృత్తీచ్ఛ ఘటిల్లదు. ఎందువలన ఈశ్వరుఁడు పూర్ణకాముఁడుగా నున్నాఁడో, అందువలన వానికి సుఖేచ్ఛయు, సుఖసాధనేచ్ఛయు ఘటిల్లదు?

దానిమీఁద ఒకానొకఁడిట్లనును.—"బాలకునకు వినోదమువలె ఈశ్వరునకు జగద్రచనారూపమైన వినోదేచ్ఛ నిర్నిమిత్తమే అగును." ఈమాటయుం ఘటిల్లదు; ఏలయన—ఎట్లు బాలకునకు చిత్తాహ్లాదనిమిత్తము ఇచ్ఛయగునో, అట్లు సచ్చిదానందరూపుఁడై, పూర్ణకాముఁడైన ఈశ్వరునకు అహ్లాదరూప సుఖప్రాప్తీచ్ఛ ఘటిల్లదు?

సమాధానము—ఎట్లు కల్పవృక్షము అన్యపురుషులయొక్క సంకల్పరూపనిమిత్తమువలన స్వస్వభావముచే వాంఛితఫలము నిచ్చుచున్నదో, అట్లు ఈశ్వరుఁడు ఫలము నిచ్చుటకొఱకు సమ్ముఖమయిన జీవుని అదృష్టరూపనిమిత్తమువలన స్వస్వభావముచేతనే ఇచ్ఛాజ్ఞానప్రయత్నములు చేయును. ఆ ఈశ్వరేచ్ఛాదికముయొక్క ఒక్కొక్కవృత్తి సృష్ట్యారంభకాలమందు పుట్టుచున్నది; మఱియు ప్రలయమువరకు నిలుచుచున్నది; కనుక అది నిత్యము కాదు. మఱియు నావృత్తి భూతభవిష్యద్వర్తమానకాలగతములైన సకలపదార్థ

## 177. సూక్ష్మసృష్టినిరూపణము-177-181 గుణసహితముగ పంచభూతోత్పత్తి.

ఆ ఈశ్వరేచ్ఛవలన మాయ తమోగుణ [1] ప్రధాన మగుచున్నది; ఆ తమోగుణప్రధానమాయవలన నభస్సు, వాయువు, తేజస్సు, జలము, భూమి ఈపంచభూతములు రచింపఁబడినవి. ఈభూతములందు క్రమముగా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ఇవి అయిదును గుణములు కలవు. ఈయైదుగుణములందు ప్రత్యేకముగా ఒక్కొక్కగుణము స్వాభావికము [స్వతస్సిద్ధము]; మఱియు ఒకటివలననొకటి

---

ములను విషయము చేయుచున్నది; కనుక సార్వకాలము సృష్టి, లేక ప్రళయము, లేక శీతము, ఉష్ణము, లేక వృష్టి కలుగదు; సమయానుసారము గానే కలుగుచున్నది.

1. స్వపతియొక్క శుక్రరూపబీజమును ధరించి, పుత్రరూపగర్భమును ధరించిన గర్భవతిస్త్రీ ప్రసవమునకుమునుపు సంతతిలాభమైన నిమిత్తము వలన ప్రసన్నముగా నుండును; కనుక సత్త్వగుణప్రధానమువలె ఉండును. వెనుక ప్రసవకాలమందు వేదనారూపనిమిత్తముచే ప్రసన్నతయొక్క తిరోధానమై శూన్యచిత్తురాలగుటవలన తమోగుణప్రధానమువలె నుండును.

లేక పూర్వము శ్వేతవర్ణముగల అభ్రము, వర్షాకాలమందు శ్యామవర్ణమగును; అట్లు సృష్టికన్నమొదలు బ్రహ్మముయొక్క ప్రతిబింబరూపమయిన జగద్బీజమును ధరించునట్టిది, మఱియు అనంతజీవులను ధరించునట్టిది, గర్భవతియగు శుద్ధసత్త్వప్రధానమాయయున్నది; ఆమాయ సృష్ట్యారంభకాలమందు శుద్ధసత్త్వప్రధానమయిన తనస్వరూపముయొక్క తిరోధానముచేసి, సృష్టియోగ్యమైన తమోగుణప్రధానమగు ప్రకృతిరూపమును ధరించుచున్నది.

ఉత్పన్నమగుటవలన కారణగుణమును కార్యమందు వచ్చును; ఈగుణమును ఆనుషంగిక మందురు. ఈప్రకారముగఁ జూచి నపుడు ఆకాశమందు ఒకటి, వాయువునందు రెండు, తేజస్సునందు మూఁడు, జలమునందు నాల్గు, పృథ్వియందు అయిదు గుణములున్నవి చూడు—

(1) ఆకాశమందు ప్రతిధ్వనిరూపశబ్దము.
(2) వాయువునందు బీశిబీశిశబ్దము, శీతోష్ణమృదుకఠోరతలకన్న విలక్షణమైన స్పర్శము.
(3) తేజస్సునందు భుగుభుగుశబ్దము, ఉష్ణస్పర్శము, ప్రభారూపము.
(4) జలమునందు బులుబులుశబ్దము, శీతస్పర్శము, శుక్లరూపము, మధురరసము.
(5) పృథ్వియందు కటకటశబ్దము, ఉష్ణశీతములకన్న విలక్షణమైన కఠినస్పర్శము, శ్వేతపీతాదిసప్తవిధరూపము, మధురామ్లాదిషడ్విధరసము, సుగంధదుర్గంధరూపమైన ద్వివిధగంధము.

ఈవిధముగా భూతములందు గుణము లున్నవి. సర్వభూతములకు మూలకారణము ఈశ్వరుఁడు; వానియందు మాయ, మఱియు చైతన్యము అని రెండుభాగములు గలవు; అందువలన మిథ్యాత్వము మాయది, సత్తాస్ఫూర్తి చైతన్యముది; ఈ రెండును సర్వభూతములందు పరిపూర్ణముగా నిండియున్నవి.

### 178. అంతఃకరణోత్పత్తి

పంచభూతములయొక్క సత్త్వగుణాంశములుచేరి అంతః

కరణము పుట్టుచున్నది. అంతఃకరణము జ్ఞానమునకు హేతువు; జ్ఞానోత్పత్తి సత్త్వగుణముచేత నని అంగీకరింపఁబడినది; కనుక అంతఃకరణము భూతములసత్త్వగుణకార్యమని సిద్ధించినది.పంచ భూతములకార్యములైన పంచజ్ఞానేంద్రియములకు సాహాయ్య మగుటవలన పంచభూతముల మిశ్రసత్త్వగుణమువలన అంతః కరణోత్పత్తి చెప్పఁబడినది. దేహములోపలస్థితమై, జ్ఞానమునకు సాధనము [కరణము] అగుటవలన దానిని అంతఃకరణ మందురు. మఱియు భూతముల సత్త్వగుణకార్యమగుటవలన దీనిని సత్త్వ మనియు అందురు.

అంతఃకరణముయొక్క పరిణామము [కార్యము] ఏది గలదో, అది వృత్తియందురు. ఆవృత్తి నాలుగువిధములుగలది–

(1) పదార్థములయొక్క మేలుకీడులస్వరూపము నిశ్చ యము చేయువృత్తిని బుద్ధి యందురు.
(2) సంకల్పవికల్పవృత్తిని మన స్సందురు.
(3) చింతనవృత్తిని చిత్త మందురు.
(4) అహమ్మను నభిమానవృత్తిని అహంకార మందురు.

## 179. ప్రాణపంచకోత్పత్తి

పంచభూతములయొక్క మిశ్రరజోగుణాంశమువలన ప్రాణోత్పత్తి అగుచున్నది. ఆప్రాణము క్రియాభేదమువలన, స్థానభేదమువలన అయిదుప్రకారములు గలది—

(1) దేనికి హృదయముస్థానమో, క్షుత్పిపాసలు కర్మమో, దానిని ప్రాణ మందురు.
(2) దేనికి గుదముస్థానమో, మలమూత్రాధోనయనము కర్మమో, దానిని అపాన మందురు.

(3) దేనికి నాభి స్థానమో, భుక్తపీతాన్న జలముల సమీకరణము కర్మమో, దానిని సమాన మందురు.

(4) దేనికి కంఠముస్థానమో, శ్వాసోచ్ఛ్వాసములు కర్మమో, దానిని ఉదాన మందురు.

(5) దేనికి సర్వశరీరము స్థానమో, రసమేలనము కర్మమో దానిని వ్యాన మందురు.

మఱియు నొక్కొక్కచోట నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము ఈపంచకమును ఉపప్రాణములని ఎక్కువగా చెప్పఁబడియున్నది; ఉద్గారము, నిమేషోన్మేషములు, క్షుతము, జృంభణము, మృతశరీరము నుబ్బించుట ఇవి క్రమముగా వీనిక్రియ లని చెప్పఁబడియున్నది; పంచభూతముల పృథక్పృథగ్రజోగుణమువలన ఒక్కొక్కదానియొక్క ఉత్పత్తి చెప్పఁబడియున్నది; మఱియు పైఁజెప్పిన పంచప్రాణములకును పృథగంశమువలన ఉత్పత్తి చెప్పఁబడియున్నది; అయినను అద్వైతసిద్ధాంతమందు ఈప్రక్రియ లేదు. చూడు—విద్యారణ్యస్వామిచేత, అట్లే వార్తికకారునిచేత సూక్ష్మశరీరమందును, పంచకోశములందును నాగకూర్మాదులయొక్క గ్రహణము చేయ లేదు. వారు ప్రాణాదులయొక్క ఉత్పత్తి మిశ్రరజోగుణాంశములచే నని చెప్పియున్నారు.

ప్రాణము విక్షేపరూపము; మఱియు విక్షేపస్వభావము రజోగుణమందుఁ గలదు; కనుక భూతముల రజోగుణాంశము వలన ప్రాణోత్పత్తి చెప్పియున్నారు.

## 180. దశేంద్రియములయొక్క ఉత్పత్తి.

ఒకొక్కభూతముయొక్క పృథక్పృథక్సత్త్వగుణాంశమువలన పంచజ్ఞానేంద్రియములు, రజోగుణాంశమువలన పంచకర్మేంద్రియములు రచింపఁబడినవి. చూడుము—

(1) ఆకాశముయొక్కసత్త్వగుణాంశమువలనశ్రోత్రము, రజోగుణాంశమువలన వాక్కు.

(2) వాయువుయొక్క సత్త్వగుణాంశమువలన త్వక్కు, రజోగుణాంశమువలన చేయి.

(3) తేజస్సుయొక్క సత్త్వగుణాంశమువలన నేత్రము, రజోగుణాంశమువలన పాదము.

(4) జలముయొక్క సత్త్వగుణాంశమువలన రసన, రజోగుణాంశమువలన ఉపస్థము.

(5) పృథ్వియొక్క సత్త్వగుణాంశమువలన ఘ్రాణము, రజోగుణాంశమువలన గుదము.

జ్ఞానము సత్త్వగుణముచే, క్రియ రజోగుణముచే అగుట వలన భూతములసత్త్వగుణాంశమువలన జ్ఞానేంద్రియములు, రజోగుణాంశమువలన కర్మేంద్రియములుపుట్టినవని చెప్పఁబడినది.

## 181. సూక్ష్మసృష్టిసంపూర్ణత

అపంచీకృతభూతములు, మఱియు వీనికార్యములగు అంతఃకరణము,పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు,పంచ కర్మేంద్రియములు ఇవి యిరువదియొకటితత్త్వములుగూడి సూక్ష్మసృష్టి యనఁబడును.

సూక్ష్మసృష్టియొక్కజ్ఞానము జ్ఞానేంద్రియములవలన గానేరదు. నేత్రనాసికాదిగోలకములు ఇంద్రియములయొక్క

విషయములైనను ఆ గోలకములయందున్న యింద్రియములేవి గలవో, అవి ఏయింద్రియములకును విషయము గానేరవు.

సూక్ష్మసృష్టియొక్క ఉత్పత్తియైనపిదప ఈశ్వరేచ్ఛవలన స్థూలసృష్టికొఱకు భూతములయొక్క పంచీకరణమైనది.

## 182. పంచీకరణము

పంచభూతములుచేర్చి ఏకభూతముచేయుటకు పేరు పంచీకరణము. దేనియొక్క పంచీకరణము చేయఁబడినదో, దానిని శాస్త్రమందు పంచీకృతమందురు.

పంచీకరణము రెండువిధములుగా చెప్పఁబనది. వీనిలో—

ఆకాశము. వాయువు. తేజస్సు. జలము. పృథ్వి.

ప్రథమ ప్రకారము: $\frac{1}{2}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}=1$ ఆకాశం

ద్వితీయ ప్రకారము: $\frac{21}{25}+\frac{1}{25}+\frac{1}{25}+\frac{1}{25}+\frac{1}{25}=1$ ,, [1]

ఈప్రకారముగా అవశేషములైన నాలుగుభూతముల యందును తెలియవలెను. [నానాగ్రంథములందు భూతములవివ

1. పంచీకరణముయొక్క ప్రథమరీతివలన సర్వభూతములయందు అర్ధార్ధభాగము తమదితమదిగాను, అర్ధభాగము మిగత నాల్గుభూతములదిగాను ఉన్నది; కనుక అన్యభూతములయొక్క నాల్గుభాగములచేత తన అర్ధభాగము తిరోధానమగుటవలన ఆకాశాది ప్రత్యేకభూతముయొక్క పృథక్పృథగ్భానము గాఁగూడదుగదా ? అది అగుచున్నది; కనుక ఉక్తపంచీకరణముయొక్క రీతి అసంభావ్యము ; ఇట్టిశంక కొన్నిముముక్షువుయొక్క చిత్తమందగును ; తన్నివారణార్థము ఇచ్చట ప్రకారాంతరమును చెప్పఁబడినది.

రము నానాప్రకారముగ వ్రాయఁబడినను పంచీకరణప్రకార ములు ఈరెంటికన్న ఎక్కువగా వ్రాయఁబడలేదు]

## 183. స్థూల బ్రహ్మాండాదికముయొక్క ఉత్పత్తి.

పంచీకృతభూతములవలన ఇంద్రియములయొక్క విషయ మైన స్థూలబ్రహ్మాండము అయినది. ఆ బ్రహ్మాండములోపల భూలోకము, భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము; ఈయేడు ఊర్ధ్వలోకము లైనవి. మఱియు అతలము, వితలము, సుతలము, పాతాలము, రసాతలము, తలాతలము, మహాతలము ఈయేడు అధోలోకము లైనవి.

ఈచతుర్దశలోకములందు జీవులకు భోగయోగ్యము లగు అన్నాదులును, భోగస్థానమైన దేవమనుష్యపశ్వాది స్థూల శరీరములును అయినవి. ఈప్రకారము సంక్షేపముగా సృష్టి నిరూపణము చేసినారము. మాయాకార్యమైన ఒకపదార్థము యొక్క విస్తారనిరూపణము చేయుటకు కోటిబ్రహ్మల ఆయువు కలిగినను పూర్ణముగా నేరదు. ఈసంగతి వాల్మీకిఋషిచేత అనేకేతిహాసదృష్టాంతములవలన యోగవాసిష్ఠమునందు నిరూపింపఁ బడినది.

## 184. పంచకోశవివేకము. 184—195

పైఁజెప్పిన మాయయందును, తత్కార్యమందును మూఁడుశరీరములు, పంచకోశములు ఉన్నవి. శుద్ధసత్త్వగుణ సహితమైనమాయ ఈశ్వరునకు కారణశరీరము. మలినసత్త్వ గుణసహితావిద్యాంశము జీవునకు కారణశరీరము. ఉత్తరశరీర ముల కారంభకమైన పంచసూక్ష్మభూతములు, మనోబుద్ధిచిత్తా

హంకారములు, పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు గూడి జీవుని యొక్క సూక్ష్మశరీరము. సర్వజీవుల యొక్క సూక్ష్మశరీరములు గూడి ఈశ్వరుని సూక్ష్మశరీరము. సంపూర్ణస్థూలబ్రహ్మాండము ఈశ్వరుని స్థూలశరీరము. జీవునిస్థూలశరీరము ప్రసిద్ధము.

ఈమూఁడుశరీరములందు పంచకోశము లున్నవి. కారణ శరీరము, ఆనందమయకోశము; విజ్ఞానమయము, మనోమయము, ప్రాణమయము ఈమూఁడుకోశములు సూక్ష్మశరీరమందున్నవి. [పంచజ్ఞానేంద్రియములును, బుద్ధియు విజ్ఞానమయకోశము; పంచజ్ఞానేంద్రియములును, మనస్సును మనోమయకోశము; పంచకర్మేంద్రియములును, పంచప్రాణములను ప్రాణమయ కోశము] స్థూలశరీరమును అన్నమయకోశమందురు. ఈరీతిగా మూఁడుశరీరములందు పంచకోశములున్నవి.

ఈశ్వరుని [1] శరీరమందు ఈశ్వరకోశములు, జీవశరీర

1. సమష్ట్యజ్ఞానరూపమాయ ఈశ్వరునకు కారణశరీరము, అదే ఈశ్వరునకు ఆనందమయకోశము. మఱియు జీవుని సూక్ష్మశరీరముయొక్క సమష్టియైన హిరణ్యగర్భుఁడు ఈశ్వరునియొక్క సూక్ష్మశరీరము, దానిలో విజ్ఞానమయమనోమయప్రాణమయములు ఈశ్వరునకు మూఁడుకోశములుగా నున్నవి. వానిలో—దిక్పాలురు, వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్విని కుమారులు ఈయయిదు ఈశ్వరునకు జ్ఞానేంద్రియములు, ఇవన్నియు మఱియు సమష్టిబుద్ధియైన మహత్తత్త్వరూపము ఈశ్వరుని విజ్ఞానమయకోశము. లేక ఉక్త దేవతారూపేంద్రియములు, మఱియు సర్వబుద్ధుల యొక్క అభిమానియైన బ్రహ్మ అను ఈశ్వరునిబుద్ధి చేరి, ఈశ్వరుని విజ్ఞానమయకోశము. ఉక్త దేవతారూపపంచజ్ఞానేంద్రియములు, మఱియు సమష్టిమనస్సు గూడి, ఈశ్వరుని మనోమయకోశము. లేక సర్వులమనస్సులకు అభిమానియైన చంద్రుఁడు,

ముందు [1] జీవకోశములు ఉన్నవి. [కోశ మనఁగా ఒర, ధన భాండాగారము, కోశకారమనుపురుగునిల్లు.] ఒర మొదలైన వానివలె పంచకోశములు ఆత్మస్వరూపమును ఆచ్ఛాదించుచున్నవి; కాబట్టి అన్నమయాదులకు కోశ మనిపేరు.

అనేకమందమతిపురుషులు పంచకోశములందు ఏయనాత్మపదార్థములు గలవో, వానిలో ఒకపదార్థమును ఆత్మయని

మఱియు ఉక్తజ్ఞానేంద్రియములు గూడి, ఈశ్వరుని మనోమయకోశము. అగ్ని, ఇంద్రుఁడు, ఉపేంద్రుఁడు, ప్రజాపతి, యముఁడు, ఈశ్వరునకు కర్మేంద్రియములైన ఈయైదును, మఱియు సమష్టిప్రాణము ఈశ్వరునకు ప్రాణమయకోశము. లేక ఉక్తదేవతారూపకర్మేంద్రియములు, మఱియు ప్రాణాభిమానియైనదేవత వాయువు, లేక సూత్రాత్మ గూడి, ఈశ్వరుని ప్రాణమయకోశము. మఱియు సమష్టిస్థూలసృష్టిరూపవిరాట్టు ఈశ్వరుని స్థూలశరీరము, అదియే ఈశ్వరుని అన్నమయకోశము.

జీవునిశరీరములందు జీవునికోశము లున్నవి; మఱియు అవి జీవునినిజరూపమైన ప్రత్యగాత్మను ఆచ్ఛాదించుచున్నవి; అట్లు ఈశ్వరునిశరీరములందు ఈశ్వరుని కోశము లున్నవి; ఆకోశములు ఈశ్వరునిదృష్టివలన నిజరూపబ్రహ్మమును ఆచ్ఛాదించినవిగాకున్నను, జీవునిదృష్టివలన బ్రహ్మమును ఆచ్ఛాదించినట్లు కనఁబడుచున్నవి; కనుక జీవుని వ్యష్టిపంచకోశములకన్న భిన్నమైన ప్రత్యగాత్మయొక్క వివేచనము జీవునకు ఎట్లు చేయఁదగినదిగా నున్నదో, అట్లు సమష్టిపంచకోశములకన్న భిన్నమైన బ్రహ్మముయొక్క వివేచనమును జీవునకే చేయఁదగినదిగా నున్నది. ఈశ్వరునకు ఆవరణాభావమువలన ఏదియును చేయఁదగినదిలేదు [ఎవనికడుపునందు నొప్పియో, వానికే ఔషధోపచారప్రయత్నము.]

1 జీవశరీరములవర్ణనము—

స్థూలసూక్ష్మకారణములకు, శీర్ణమైపోవుటవలన శరీర మనియుం, దహింపఁబడుటవలన దేహ మనియుం పేరు. రోమము, చర్మము, నరము, మాంసము, అస్థి, క్రొవ్వు ఈయారును స్తంభమువలె ప్రత్యక్షముగా అగుపడుటవలన స్థూలదేహమని పేరు. ఈస్థూలదేహము ఐదుతత్త్వములచేత నేర్పడుచున్నది. ఆతత్త్వములు ఈక్రిందికోష్ఠకము నందు వివరింపఁబడినవి.

| ముఖ్యతత్త్వములు | వీటిఅంశములు ఏముఖ్యతత్త్వమందు మిశ్రమగుచున్నవో, అవి తత్వములు. | | | | |
|---|---|---|---|---|---|
| | పృథ్వి | జలము | తేజస్సు | వాయువు | ఆకాశము |
| పృథ్వి | అస్థి | మాంసము | నరము | చర్మము | రోమము |
| జలము | రక్తము | శుక్లము | మూత్రము | చెమట | జొల్లు |
| తేజస్సు | ఆలస్యము | కాంతి | ఆకలి | తృష | నిద్ర |
| వాయువు | ఆకుంచనము | చలనము | వలనము | పరుగిడుట | విస్తరిల్లుట |
| ఆకాశము | భయము లేక కటిప్రదేశము | మోహము<br>ఉదరము | క్రోధము<br>హృదయము | కామము<br>కంఠము | శోకము<br>శిరము |

అంగీకరించి, ముముక్షుసాక్షియైన ఆత్మస్వరూపమునందు విముఖులుగా నున్నారు.

---

పైశ్లోకమునందు పృథ్వీముఖ్యతత్త్వమందు పృథ్వ్యంశము ఎముక, జలాంశము మాంసము, తేజాంశము నరము, వాయ్వంశము చర్మము, ఆకాశాంశము రోమము. దీనివలెనే మిగిలినభూతములయందును తెలియవలసినది. పైఁజెప్పిన యిరువదియైదుతత్త్వములందు క్రిందవ్రాయు ప్రకారముగ పంచభూతలక్షణము లని తెలియవలెను.

ఆకాశమునందు—

(1) భయమగునపుడు పృథ్వివలెనే శరీరము జడమగుటవలన భయము పృథ్వ్యంశ మని ఎఱుఁగవలెను.

(2) పుత్రాదులందు మోహము కలుగునపుడు నేత్రమందు జలము ప్రసరించుటవలన మోహము జలాంశ మని ఎఱుఁగవలెను.

(3) అగ్నివలెనే దహించుటవలన క్రోధము తేజోంశ మని ఎఱుఁగవలెను.

(4) కామానారూపవ్యాపారము వాయువువలెనే చలించుటవలన కామము వాయ్వంశమని ఎఱుఁగవలెను.

(5) శోకము కలుగునపుడు ఆకాశమువలె దేహము శూన్యమై యుండుటవలన శోకము ఆకాశసంబంధముఖ్యాంశ మని ఎఱుఁగవలెను.

వాయువునందు—

(1) పృథ్వివలె సంకోచముపడుటవలన సంకోచము పృథ్వ్యంశ మని ఎఱుఁగవలెను.

(2) జలమువలె చలించుటవలన చలనము జలాంశమని ఎఱుఁగవలెను.

(3) తేజస్సువలె ఎండించుటవలన చలనము తేజోంశ మని ఎఱుఁగవలెను.

(4) వాయువు పారుసటులనుండుటవలన పరుగిడుట వాయుసంబంధ ముఖ్యాంశ మని యెఱుఁగవలెను.

(5) ఆకాశమువలె విస్తరిల్లుటవలన ప్రసరణము ఆకాశాంశ మని యెఱుఁగవలెను.

తేజస్సునందు—

(1) ఆలస్యము పృథ్వివలె జడస్వభావమగుటవలన ఆలస్యము పృథ్వ్యంశమని యెఱుఁగవలెను.

(2) మాలిన్యము పోఁగొట్టి కాంతినిచ్చుట జలధర్మమగుటవలన కాంతి జలాంశమని యెఱుఁగవలెను.

(3) తేజమువలె భుజించినదానిని పచనముచేయుటవలన ఆకలి తేజస్సంబంధముఖ్యాంశమని యెఱుఁగవలెను.

(4) ఆర్ద్రవస్త్రమును శుష్కించుట వాయుధర్మమగుటవలన కంఠము శుష్కించుటచే దప్పిక వాయ్వంశ మని యెఱుఁగవలెను.

(5) నిద్రవచ్చునపుడు ఆకాశమువలె శరీరము శూన్యమగుటవలన నిద్ర ఆకాశాంశ మని యెఱుఁగవలెను.

జలమునందు—

(1) పృథ్వి కొన్నిప్రదేశములందు ఆరక్తవర్ణముగా నుండుటవలన రక్తము పృథ్వ్యంశమని యెఱుఁగవలెను.

(2) శ్వేతమై సస్యోత్పత్తికి కారణమైన జలమువలె శ్వేతమై గర్భహేతుశుక్లము జలసంబంధముఖ్యాంశమని యెఱుఁగవలెను.

(3) తేజస్సువలె నుష్ణమైయుండుటవలన మూత్రము తేజోంశమని యెఱుఁగవలెను.

(4) వ్యజన మొదలగువాని వ్యాపారక్రమముచేకలుగు వాయువువలె వ్యాపారక్రమముచే కలుగునట్టిచెమట వాయ్వంశ మని యెఱుఁగవలెను.

(5) ఆకాశమువలె పైకి క్రిందికిపోవుటవలన జొల్లు ఆకాశాంశమని యెఱుఁగవలెను.

పృథ్వియందు—

(1) పృథ్వి కఠినము గానుండుటవలన అస్థి పృథ్వీసంబంధముఖ్యాంశమని యెఱుఁగవలెను.

(2) జలమువలె తేమయుండుటవలన మాంసము జలాంశమని యెఱుఁగవలెను.

(3) నరముచే జ్వరపరీక్ష కలుగుటవలన నరము తేజోంశమని యెఱుఁగవలెను.

(4) శీతోష్ణస్పర్శజ్ఞానముగుటచే చర్మము వాయ్వంశమని యెఱుఁగవలెను.

(5) రోమమును తీసినయెడల శూన్యరూపమైన ఆకాశమువలె దుఃఖశూన్యముగానుండుటవలన రోమము ఆకాశాంశమని యెఱుఁగవలెను.

మునుపుచెప్పిన ధీయము మొదలగునవి సూక్ష్మదేహముయొక్క ముఖ్యధర్మములుగా నున్నవి; జలపూర్ణఘటముయొక్క బహిఃప్రదేశమందలి అంతస్థితజలముయొక్క శీతలత్వము అగుపడుటవలె అవి స్థూలశరీరమందు అగుపడుటవలన స్థూలదేహముయొక్క సామాన్యధర్మములుగా నున్నవి; అందువలన స్థూలదేహముయొక్క తత్త్వములందు చేర్పబడినవి.

ఈయిరువదియైదు తత్త్వములసముదాయమునకు స్థూలదేహమని పేరు. నామము, జాతి, ఆశ్రమము, వర్ణము [రంగు] ఆకారము, జననము, మరణము మొదలైనవి స్థూలదేహముయొక్క ధర్మములు.

"అన్నమయంహిసౌమ్యమనఆపః ప్రాణః తేజోవాక్" శ్రుతి.

ఇత్యాది శ్రుత్యనుసారముగ భుజింపఁబడు అన్నముయొక్క స్థూలభాగమువలన అమేధ్యము, మధ్యభాగముచే మాంసము, సూక్ష్మభాగముచే

మనస్సు కలుగుచున్నవి. త్రాగిన జలముయొక్క స్థూలభాగముచే మూత్రము, మధ్యభాగముచే రక్తము, సూక్ష్మభాగముచే ప్రాణము కలుగుచున్నవి. భుజింపఁబడు తేజఃపదార్థముల స్థూలభాగమువలన ఎముక, మధ్యభాగమువలన మెదడు, సూక్ష్మభాగమువలన వచనము కలుగుచున్నవి. తల్లియొక్క రక్తముచే రక్తము, మాంసము, చర్మము కలుగుచున్నవి; జనకునివీర్యముచే ఎముక, నరము, క్రొవ్వు, వీర్యము కలుగుచున్నవి.

స్థూలశరీరము చతుర్విధము:— మొదటిది జరాయుజము, రెండవది అండజము, మూఁడవది స్వేదజము, నాల్గవది ఉద్భిజ్జము—

(1) గర్భమునుండికలుగు మనుష్యులు, మృగములు జరాయుజములు.

(2) గ్రుడ్డునందు ఉత్పత్తియగు పక్షి, సర్పము మొదలగునవి అండజములు.

(3) చెమటవలనపుట్టు పేను, పురుగు మొదలగునవి స్వేదజములు.

(4) బీజములచే భూమినిచీల్చి పెరుఁగు వృక్షములు మొదలగునవి ఉద్భిజ్జములు.

సూక్ష్మశరీరము:—ఐదుప్రాణములు, ఐదుకర్మేంద్రియములు, ఐదుజ్ఞానేంద్రియములు, ఒకమనస్సు, ఒకబుద్ధి ఇట్టి అపంచీకృతభూతముల పదునేడుతత్త్వములుగూడి అయినది. కొందఱు ఈపదునేడుతత్త్వములందు ఒకబుద్ధిని విడిచి, అవశేషములగు షోడశకలాత్మకలింగశరీరమందురు. మఱికొందఱు అంతఃకరణచతుష్టయసహితముగా పందొమ్మిదితత్త్వములని యెంచుచున్నారు. మఱికొందఱు అంతఃకరణపంచకమంగీకరించి, ఇరువదితత్త్వములు ఎంచుచున్నారు. అయినను విరోధములేదు. శుభాశుభక్రియలను చేయునది, సుఖదుఃఖములను అనుభవించునది, ఇహలోకమునకువచ్చునది, పరలోకమునకుపోవునది, రాగద్వేషాదులు, శమదమాదులు, అంధమందాదులు ఇవన్నియు సూక్ష్మశరీరముయొక్క ధర్మములు. స్థూలశరీరముకన్న సూక్ష్మముగా కనిపించుటవలన సూక్ష్మశరీరమని చెప్పఁబడినది; శబ్దాదివిషయములను తెలియుటవలనను,

## 185. విరోచనుని[1] సిద్ధాంతము: అన్నమయకోశమే ఆత్మ.

కొందఱుపామరులు విరోచనమతానుసారులు స్థూలశరీరరూపమగు అన్నమయకోశమును ఆత్మ యందురు. మఱియు

---

ఆత్మలక్షణము తెలియుటవలన లింగశరీరమనియు లింగదేహమనియు పేరు కలిగినది. ఇది బ్రహ్మవిచారముచే శీర్ణమగుటవలనను, తత్త్వజ్ఞానముచే దగ్ధమగుటవలనను శరీరమనియు, దేహమనియు పేరుపొందుచున్నది.

కారణశరీరము — స్థూలలింగదేహములకు అజ్ఞానము కారణమగుటవలన అది కారణశరీరమని, కారణదేహమని చెప్పబడుచున్నది. [అజ్ఞానముయొక్క స్వరూపము మునుపే చతుర్థతరంగమందును, ఈతరంగమందును చెప్పబడినది.] తత్త్వజ్ఞానముచే దహింపబడుటవలన కారణమైన అజ్ఞానమునకు దేహమను పేరు. మఱియు బ్రహ్మవిచారముచే శీర్ణమగుటవలన దానికే శరీరమని పేరు.

1. విరోచనాదులమతముల ఖండనము

దేహాత్మవాదులైన విరోచనమతఖండనము—

(1) నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను, నేను మాటలాడుచున్నాను; అనెడు దానియందు ఇంద్రియము నేననుటకు విషయముగా నున్నది; కనుక స్థూలదేహము ఆత్మ కాదు.

(2) నాదేహమనుటవలన దానియందు మమకారము అగపడుచున్నది దానివలన నాదేహమనుట అహంకారమునకు విషయము కాజాలదు; కనుక దేహము ఆత్మ కాదు.

(3) స్త్రీ మొదలైనవారికన్న దేహమునందు అధికప్రీతిచూచుటను దేహముకంటె ఇంద్రియములందు అధికప్రీతి కనబడుచున్నది;

ఈయుక్తి చెప్పుచున్నారు— దేనియందు అహంబుద్ధి యగునో, దానిని ఆత్మ యనవలయును; ఆయహంబుద్ధి స్థూలశరీరమునందగును. "నేను మనుష్యుఁడను, నేను బ్రాహ్మణుఁడను" అను

---

అందువలన స్థూలదేహమునందే అధికప్రీతి యనుట సరికాదు; కనుక దేహము ఆత్మ కాదు.

(4) స్థూలశరీరమునకు జననమరణాదులున్నవి. కనుక జన్మమునకు పూర్వమందును, మరణమునకు అనంతరమందును శరీరము లేదు. అయినను ఆత్మ యున్నాఁడు. పూర్వోత్తరమందు ఆత్మ లేఁడనిన యెడల కృతనాశాకృతాభ్యాగమదోషము [చేసినశుభాశుభకర్మమునకు ఫలము లేక నిరర్థకత, మఱియు శుభాశుభము చేయకనే సుఖదుఃఖాదులపొందుట] సంభవించును; కాఁబట్టి దేహము ఆత్మ కాదు.

(5) దేహమును అలంకరించుట, పోషించుట మొదలైన భోగములే పురుషార్థమని చెప్పినది సరికాదు. ఎందుకనఁగా— సకలపురుషులకు ఇష్టవిషయమైనది పురుషార్థ మందురు; సుఖప్రాప్తియందును, దుఃఖనివృత్తియందును అందఱికిని ఇష్టముగుటవలన అదియే పురుషార్థము. అది మోక్షమునందున్నది; భోగములందుండదు; భోగములందైననో, దోషములు, దుఃఖములు పరిపూర్ణముగా నిండియున్నవి; కనుక ఆభోగములు పురుషార్థము కాదు.

(6) దేహమే ఆత్మయైనచో మరణానంతరము దేహము దహింపఁబడుటవలన మోక్షమునకు అస్పదమే లేదు; కనుక దేహమే ఆత్మ యనుట అత్యంతానుచితముగ నున్నది.

(7) అనుమానము, శబ్దము మొదలగు ప్రమాణములు అందఱికి వ్యవహారగ్రాహ్యమగుటవలన ఒకప్రత్యక్షముదప్ప ఇంకప్రమాణములు గావనిచెప్పినది కేవలహఠవాదము.

ప్రతీతి అందరికిని అగును; మనుష్యత్వమును, బ్రాహ్మణత్వమును స్థూలశరీరమందే యున్నది; ఈవిధముగా అహంబుద్ధి విషయమగుటచే స్థూలశరీరమే ఆత్మ.

---

ఈమతమునందు ప్రలాపమాత్రము అధికముగా నున్నది. రహస్యమేమియును లేదు: దాని ఖండనమును అనావశ్యకము.

చార్వాకమతఖండనము—

పైఁజెప్పిన వివేచనమునకు మరొక్క నాస్తికమతము చార్వాకమతముగా నున్నది. చార్వాకుఁడనుచున్నాఁడు—ఒక ఆకాశము దప్ప వాయ్వాది నాల్గు జడములైన భూతములే ఆత్మ. ఇందుపైన ఎవ్వరైన ఆక్షేపింతురు—దేహమందు చైతన్యవ్యవహారము అనుభవమునకు వచ్చుచున్నది; అది ఎక్కడ నుండి వచ్చినది?

దానికి సమాధానము చెప్పుచున్నాఁడు—తమలపాకులు, పోకలు, సున్నము మొదలయినవి త్రయోదశపదార్థముల మిశ్రణముచేత ఒక తాంబూలమగుచున్నది; ఆ త్రయోదశపదార్థములందు అరక్తవర్ణముగల పదార్థము ఏదియును లేదు; అయినను ఆ సకలపదార్థముల మిశ్రణముచేత అరక్తవర్ణము ఉద్భవించుచున్నది; ఆ ప్రకారముగా భూతకార్యమైన నానాజడపదార్థముల మిశ్రణముచేత స్థూలశరీరమగుటవలన దీనిలో చైతన్యము ప్రతీతమగుచున్నది; ఆ చైతన్యము సకలపదార్థముల మిశ్రణముచేత అయినదగుటవలన నాల్గుభూతములకన్న భిన్నమైన చైతన్యమనుట లేనే లేదు.

ఆ మూర్ఖుఁడు ఇట్టివిచారము చేయఁడు; ఏమనఁగా—ఎట్లు దేహము భూతకార్యమైన నానాపదార్థముల మిశ్రణముచేత అగుచున్నదో; అట్లు ఘటపటాదులును భూతకార్యమైన నానాపదార్థముల మిశ్రణముచేత అగుచున్నవి. వానియందు చైతన్యము ఎందుకు కనఁబడదు? లేక ఏదేహమందు భూతకార్యమైన నానాపదార్థముల సంయోగముచేత చైతన్యముద్భవించినదో

లేక దేనియందు ముఖ్యప్రీతి యగునో, అదియే ఆత్మ యనవలయును; స్త్రీపుత్త్రధనాదులు స్థూలశరీరమునకు ఉపకారకము లైనయెడల వానియందు ప్రీతియగును; శరీరమునకు ఉప

---

ఆదేహమందును సుషుప్తి, మూర్ఛ లేక మృత్యుకాలమందు చైతన్యము ఎందుకు కనఁబడదు ?

ఇంద్రియాత్మవాదిమతఖండనము—

(1) ఏపదార్థము లేకపోవుటవలన శరీర ముండుటలేదో, దానిని ఆత్మ యని చెప్పవలయును ; నేత్రాదీంద్రియములు లేకయుండినను శరీర మున్నది; కనుక ఇంద్రియము ఆత్మ కాదు ;

(2) నేను చూచుచున్నాను, నేను అనుచున్నాను ; ఈరీతిగా నేను నేననుటచేత ఇంద్రియము కరణ మని సిద్ధమగును ; ఇచ్చట నేత్రవంతుఁడగు నేను చూచుచున్నానను నభిప్రాయము; గాని నేను నేత్రరూపుని అభిప్రాయము కాదు ; అందువలన నేనను శబ్దముయొక్క విషయము ఇంద్రియముకన్న భిన్నమే సిద్ధమగుచున్నది. మఱియు "నాదృష్టి మందమైనది" అనుటచేత ఇంద్రియము మమత్వమునకు విషయమగుట సిద్ధమగుచున్నది ; అహంకారమునకు విషయము సిద్ధము కాదు; కనుక ఇంద్రియము ఆత్మ కాదు.

(3) ఎవ్వఁడు ఎవ్వని చూచుచున్నాఁడో, వాఁడు వానికన్న భిన్నుఁడుగా నుండవలెను ; ఘటద్రష్ట ఘటమునకన్న భిన్నుఁడగుచున్నాఁడు. ఆన్యాయమున ఇంద్రియముయొక్క మందతీవ్రతాదిగుణమును చూచినవాఁడే ఆత్మ; వాఁడు ఇంద్రియముకన్న భిన్నుఁ డని సిద్ధము.

(4) మనస్సు వ్యాకులమైనప్పుడు ఏదియు నేత్రమునకు కనఁబడదు,

కారకము గానియెడల ప్రీతి గానేరదు. దేనినిమిత్తము అన్య పదార్థములందు ప్రీతియగునో, అట్టి స్థూలశరీరమందే ముఖ్య ప్రీతి గలదు; అందువలన స్థూలశరీరమే ఆత్మ.

---

శ్రోత్రమునకు వినఁబడదు; కనుక ఇంద్రియము జడము; అది ఆత్మ కాదు.

(5) మతముచే ఇంద్రియము చైతన్యమనినయెడల వానినిట్లు అడుగవలయును—ఒక్కొక్క ఇంద్రియము చైతన్యమా? లేక సకలేంద్రియములుకూడి చైతన్యమా? లేక ప్రత్యేకప్రత్యేకేంద్రియమును సకలేంద్రియములును చైతన్యమా?

ప్రథమపక్షము సంభవింపదు; ఏయింద్రియము చైతన్యమని యనుచున్నావో, ఆయింద్రియము లేకపోయినను జ్ఞానము, మఱియు జీవుఁడు ప్రతీతులగుచున్నారు. కనుక ఇంద్రియము చైతన్యమనుట ఘటిల్లదు. ద్వితీయపక్షమందు ఒకయింద్రియము నష్టమైనప్పుడు సముదాయమునకు హాని కలుగుటవలన చైతన్యము, జీవుఁడు ఎవ్వరు నుండఁగూడదుగదా? అనుభవమందో, అట్లు కనఁబడదు; కాఁబట్టి సముదాయము చైతన్యము కాదు. తృతీయపక్షముకూడ యోగ్యము కాదు; ఏలయన—ఇంద్రియము ప్రత్యేకప్రత్యేకమాత్రయు ఆత్మయైనపుడు ఒకశరీరమందు పదియాత్మలగుచున్నవి; మఱియు ఒక్కొక్క ఆత్మయొక్క ఇచ్ఛ పృథక్కు పృథక్కగుటవలన ఒకకదళీవృక్షమునిం పదియేనుఁగులు పడినపిమ్మట ఆ కదళీవృక్షము నశించునట్లుగా శరీరనాశము గావలెను! ఈప్రకారముగా ఇంద్రియము అచేతనమగుటవలన ఏరీతిచేతనైనను అది ఆత్మ కాదు.

దానికి వస్త్రభూషణాంజనమజ్జననానావిధభోజనశృంగార పోషణాదికమే పరమపురుషార్థము; మరణమే మోక్షము; ప్రత్యక్షమే ప్రమాణము; ఇది అసురస్వామియైన విరోచనుని సిద్ధాంతము.

---

(6) శ్రుతియందుచెప్పఁబడిన ఇంద్రియసంవాదము ఇంద్రియాభిమాని దేవతను ఉద్దేశించినదగుటవలన ఆసంవాదముచే ఇంద్రియము చైతన్య మనుట సంభవింపదు.

ఈరీతిగా ఇంద్రియమాత్మ యని చెప్పువారిమతము సరికాదు.

ప్రాణాత్మవాదిమతఖండనము—

(1) బాహ్యవాయువువలె ప్రాణమును వాయువుగా నుండుటవలన ప్రాణము ఆత్మకాదు.

(2) ప్రాణము ప్రతీతముకానపుడు మరణము సిద్ధించుట నియమము గాదు—వృక్షమునందు ప్రాణము ప్రతీతముగాకున్నను అది సజీవముగ నున్నది. అట్లు మూర్ఛాసమయమున ప్రాణము ప్రతీతముకానపుడు మృతినొందెనని చెప్పరు. ఈవిధముగా జీవన మరణముల ప్రతీతియో, కేవలము ప్రాణప్రతీత్యధీనమనుట ఘటిల్లదు; కనుక ప్రాణము ఆత్మకాదు.

(3) నిద్రచేయునపుడు ప్రాణము జాగ్రత్తైయుండినను మిత్రుఁడు వచ్చిన ఆదరము చేయదు; దొంగ వస్తువును తీసుకొనిపోయిన అడ్డపడదు; ఇట్లు ప్రాణము జడము; అది ఆత్మకాదు.

(4) ప్రాణము వెలుపలపోవుటవలననే దేహము మృతమనుట అసంగతము; ఎందుకనఁగా—జఠరాగ్ని బయటికిపోవుటవలనను మరణమగును; ఇట్లే ప్రాణము ఆత్మకాదు.

(5) శ్రుతియందు ప్రాణమును శ్రేష్ఠముగా చెప్పినది ప్రాణోపాసనయందు ప్రవృత్తి కలుగునిమిత్తము; లేక సకలేంద్రియములకంటె

ప్రాణము శ్రేష్ఠము; ఈయభిప్రాయమువలన చెప్పఁబడినది; గాని అందఱికంటె ప్రాణము శ్రేష్ఠము; కనుక ప్రాణమే ఆత్మ యను నభిప్రాయమువలన చెప్పలేదు.

(6) శ్రుతియందు ప్రాణమయాది కోశములను ఆత్మ యని చెప్పుటకు తాత్పర్యముస్థూలారుంధతీన్యాయమున అధిష్ఠానమయిన ప్రత్యగభిన్నాత్మను ఎఱుఁగవలెను; ఇదిగాక ప్రాణమే ఆత్మ యనునభిప్రాయము కాదు.

(5) శ్రుతియందు ప్రాణేంద్రియకలహము ఉత్ప్రేక్షారూపముగాను, తదభిమానిదేవతనుద్దేశించినదిగాను ఉన్నది. ప్రాణము చైతన్యము; అదియే ఆత్మ; ఈయభిప్రాయము లేదు.

ప్రాణేంద్రియముల కలహము ఇట్లున్నది—

ఒకనాఁడు ప్రాణేంద్రియములకు తమలోతమకు ఇట్టి వివాదము కలిగెను—మనయందు శ్రేష్ఠః డెవ్వఁడు? అప్పుడు సర్వులుగూడి తమస్వామియైన ప్రజాపతికడకుపోయి, ప్రార్థించిరి—ఓభగవంతుఁడా! మాలో శ్రేష్ఠుఁడెవ్వఁడో? మీరు కృపచేసి నిర్ణయింపుఁడు.అపుడు ప్రజాపతి పలికెను—మీరందఱు నొకశరీరమందు ప్రవేశింపుఁడు: వెనుక ఒక్కొక్కఁడుగా బయలువెడలుఁడు; ఎవఁడు బయలువెడలుటవలన శరీరము అమంగళమై పడునో, మఱియు మరణవ్యవహారము జరుగునో, వాఁడు మీలో శ్రేష్ఠుడని ఎఱుఁగుఁడు.

ఈప్రకారముగా ప్రజాపత్యాజ్ఞవిని, అందఱు నొకశరీరమందు ప్రవేశించిరి;పిమ్మట ఒక్కొక్కఁడుగా బయలువెడలుటకుప్రారంభించిరి;

మొదట నేత్రేంద్రియము బయటపోయెనో, అపుడు జనులు

అంధుఁడనఁటకు ప్రారంభించిరి; కాని, మృతుఁ డనరు. పిమ్మట శ్రవణేంద్రియముఁబోవుటవలన బధిరుఁ డనసాగిరి.

ఈరీతిగా ఏయేయింద్రియము బయటపోయెనో, దానిదాని అభావసూచకమైన ఒక్కొకనామముమాత్రము ప్రాప్తించినది; ఆయాయింద్రియముయొక్క వ్యవహారముతప్ప నితరములగు సర్వవ్యవహారములును జరిగెను; శరీరము అమంగళము కాలేదు; చచ్చెనని ఎవ్వరును జెప్పరైరి; పిమ్మట ప్రాణము వెడలిపోయెను; తోడనే శరీరము అమంగళమై భయంకరముగా భూమిమీఁద వ్రాలెను; అప్పుడు చచ్చినాఁడని ఏడ్చిరి. అప్పుడు ఇంద్రియములు తెలిసికొనెను—మాలో ప్రాణుఁడే శ్రేష్ఠుఁడు; వాఁడే మాస్వామి.

(8) క్షుధవలన నాప్రాణము పోవుచున్నది; భోజనమువలన నాప్రాణము తృప్తమగుచున్నది; ఈవిధముగా ప్రాణము మమకారమునకు విషయమగుటవలనను అహంకారమునకు విషయముగామివలనను ప్రాణము ఆత్మ కాదు.

(9) శ్వాసోచ్ఛ్వాసవ్యవహారప్రసంగమునందు తనప్రాణము బయటపోవుటయు, లోపలవచ్చుటయుం అనుభవసిద్ధమగుటవలన ప్రాణమును తెలుసుకొనుఆత్మ ప్రాణముకన్న అన్యుఁడుగా నున్నాఁడు.

ఈరీతిగా ప్రాణాత్మవాదిమతము సమీచీనముగాదు.

మనఆత్మవాదిమతఖండనము—

(1) బాడిస, ఉలి, పీటవలె మనస్సు కరణముగా నుండుటవలన అది ఆత్మ కాదు.

(2) సుషుప్తియందు మనస్సులేకయుండినను సామాన్యచైతన్యమున్నది, మనస్సులేనియెడ చైతన్యములేదనుట సిద్ధింపదు; కనుక వ్యభిచారియైనమనస్సు ఆత్మ కాదు.

(3) తామనస్సు అన్యస్థలమందు పోయియుండెననియు, ఇప్పుడు వచ్చెననియు చెప్పుటవలన మనస్సు చమత్కారమునకు విషయమగుటయే గాక అహంకారమునకు విషయము కాదు; గనుక మనస్సు ఆత్మ కాదు.

(4) మనస్సుయొక్క స్థిరత్వమును అస్థిరత్వమును తెలియుంనది ఆత్మ మనస్సుకన్న అన్యుఁడుగా నున్నాఁడు.

(5) ఆభాసములో కూడియుండుటవలన మనస్సుకర్తభోక్తగానున్నది; తానుమాత్రము కర్తభోక్తగాదు. కనుక మనస్సు జడమే, అది ఆత్మకాదు.

"మనఏవ మనుష్యాణామ్ కారణం బంధమోక్షయోః,
బంధాయవిషయాసక్తమ్ ముక్త్యైర్నిర్విషయం స్మృతమ్" శ్రు,

వాక్యార్థము—మనుష్యునకు బంధమోక్షములకు కారణము మనస్సే; విషయాసక్తమైనమనస్సు బంధమునకు, విషయవాసనారహితమైనమనస్సు మోక్షమునకు హేతువుగా నున్నది. దానికి అభిప్రాయము—బంధమోక్షముల అధ్యాసములకు హేతువు మనస్సుగాని; మనస్సు ఆత్మయని అభిప్రాయము గాదు.

లేక విషయాసక్తమనస్సు మలినమగుటవలన పాపోత్పత్తిద్వారమున బంధమునకు హేతువు; మఱియు విషయవాసనారహితమయినమనస్సు శుద్ధమగుటవలన జ్ఞానద్వారమున మోక్షమునకు హేతువు; అని పైవచనమునకు అభిప్రాయముగాని మనస్సుఆత్మయని అభిప్రాయము గాదు.

మనోమయకోశమే ఆత్మ; యని చెప్పుశ్రుతియొక్క తాత్పర్యము స్థూలారుంధతీన్యాయమున అధిష్ఠానమయిన ప్రత్యగభిన్నపరమాత్మను తెలుపునిమిత్తముగాని, మనస్సుఆత్మ; యనునది కాదు.

ఈరీతిగా మనఆత్మవాదిమతము సమీచీనముగాదు.

విజ్ఞానవాదిమతఖండనము

(1) రూపాదిజ్ఞానమునకు నేత్రాదీంద్రియములు సాధనములుగా నుండు నటుల నిశ్చయరూపజ్ఞానమునకు బుద్ధి సాధనముగా నున్నది; ఆ బుద్ధి ఇంద్రియమువలె స్వయముగ జడమై ఆత్మప్రకాశమును తీసికొని, ఘటపటాదిపదార్థనిశ్చయము చేయుచున్నది; భాస్య భాసకభేదముండుటవలన స్వచ్ఛమైనబుద్ధికి భాసకుఁడైనఆత్మ అన్యుఁడుగా నున్నాఁడు. దీపాదిప్రకాశము ఘటాదులందుచేరి, ఆయాకారము ధరించి, మిశ్రభావముచే ప్రకాశించినను వాస్త వముగా అన్యముగా నుండునట్లు జ్ఞానస్వరూపుఁడైనఆత్మ బుద్ధి వృత్తితోఁగూడి, దానియాకారమును ధరించి ప్రకాశించినను, మఱియు ఆప్రసంగమందు ఆత్మబుద్ధులకు మిశ్రభావము ప్రతీత మైనను, ఆత్మ అన్యుఁడుగా నున్నాఁడు.

(2) అపంచీకృతభూతకార్యమయిన యంతఃకరణము నిశ్చయవృత్తి వలన బుద్ధి యనియు, సంకల్పవికల్పవృత్తివలన మనస్సనియు చెప్పఁబడుచున్నది; బుద్ధికార్యమైయుండుటవలన దేహేంద్రియ మనస్సులవలె అనాత్మగా నున్నది.

(3) కఠవల్ల్యుపనిషత్తునందు ఆత్మరథికుఁడుగాను; శరీరము రథముగాను బుద్ధిసారథిగాను చెప్పఁబడినది; రథికునికన్న సారథి అన్యుఁడగుట వలన సారథియగు బుద్ధి ఆత్మకాదు.

(4) నాబుద్ధి మందమయినది; నాబుద్ధి తీక్ష్ణమైనది; అనుటయందు బుద్ధి మమకారమునకు విషయముగాఁ గనఁబడుచున్నది; గాని అహంకారమునకు విషయముగా కనఁబడదు; గనుక బుద్ధి ఆత్మకాదు.

ఆత్మ క్షణికరూపమని చెప్పుటయు సరికాదు; ఎందుకనఁగా— ఆత్మక్షణికమైననో, పూర్వసంవత్సరమునందు అప్పిచ్చినవాఁడు

ఈసంవత్సరమునందు అను గూడదుగదా; మఱియు ప్రథమ క్షణమునందు భుజించినవాఁడు ద్వితీయక్షణమునందు తానుదున భోజనానంతరము నేను తృప్తినొందితినని చెప్పఁగూడదు. అట్లు అనుగుటవలనను; చెప్పుటవలనను ఆత్మ క్షణికరూపమనుట సిద్ధింపదు. మఱియు ఆత్మ క్షణికరూపమైనచో, మోక్షసాధనములు వ్యర్థమగును.

ఈరీతిగా విజ్ఞానవాదిమతము అసంగతము.

ఆత్మజడచైతన్యమను భట్టమతముయొక్క ఖండనము.

అంధకారము ప్రకాశము ఒకచోట చేరనటుల ఒకేఆత్మయందు జడచైతన్యములు చేరవు; రెండంశములందు ఒకటి గోచరము, ఒకటి అగోచరము అనుట సరికాదు. దండమును పురుషుని ఒకచోట చూచినయెడల ఒకదండము మాత్రము వచ్చుచున్నదను జ్ఞానము కలుగదు; మఱేమనఁగా—దండసహిత పురుషుఁడు వచ్చుచున్నాఁడని జ్ఞానము కలుగుచున్నది. ఈరీతిగా ఒకపదార్థమునందు ఒకయంశము జ్ఞాతము, ఒకయంశము అజ్ఞాత మనుట ఘటిల్లదు. [విశేషణసహితపురుషునియందు ఘటిల్లదు; అది విశేషణరహితాత్మయందు ఎట్లు ఘటిల్లఁగలదు?]

హాతముచే నంగీకరించినయెడల వానిని అడుగవలెను—రెంటికి సమవాయసంబంధమా? తాదాత్మ్యసంబంధమా? విషయవిషయిభావసంబంధమా?

ప్రథమపక్షమందు రెండు ద్రవ్యములందే సమవాయసంబంధమగుట వలన ఆత్మద్రవ్యమునకు అనిత్యమగును. రెండవపక్షమందు చిజ్జడాంశములు ఒకేస్వరూపమందుండుటవలన చిత్తు జడమగుచున్నది; జడము చిత్తగుచున్నది. తృతీయపక్షమునందు రెండంశములును అనాత్మయగుచున్నవి.

శ్రుతియందు ఆత్మవిజ్ఞానఘనమని చెప్పినందున ఒకభాగము జడమనుట విరుద్ధము. సుషుప్తినుండి మేలుకొన్నవానిస్మరణమో, ఆత్మయొక్క జడత్వ

మును విషయము చేయలేదు ; అయినను సుషుప్తియందుండు జ్ఞానాంశమును విషయము చేయుచున్నది.

ఈరీతిగా భట్టమతము అసంగతము.

శూన్యవాదిమతఖండనము.

అంతయును శూన్యము ; శూన్యమే పరమతత్త్వము; అని చెప్పువాఁడైన మాధ్యమికబౌద్ధుని యభిప్రాయ మేమనఁగా—సుషుప్తియందుండు అజ్ఞానరూపానందమయకోశమే ఆత్మ ; వాని నిట్లు అడుగవలెను—శూన్యము సాక్షిసహితముగా నున్నదా ? లేక సాక్షిరహితముగా నున్నదా ? లేక శూన్యము స్వయంప్రకాశ మనుచున్నాఁడా?

సాక్షియున్నయెడల శూన్యమునకు అన్యమైన సాక్షియే ఆత్మ. సాక్షిరహితమైనచో, శూన్యము అసిద్ధము. ఏలయనఁగా—అనుభవములేక ఏ పదార్థముండుటలేదు; ఇది నియమము. శూన్యము స్వయంప్రకాశమని చెప్పిన యెడల, పరబ్రహ్మమునకు మఱియొక పేరు గలుగుచున్నది; గాని, శూన్యము లేకపోవును.

"అసద్వా ఇదమగ్ర ఆసీత్" అనుశ్రుతికి అసత్తుండెనని యర్థము చెప్పఁగూడదు ; సదసత్తులకు విరోధమగుటవలన సద్రూపమైన అధిష్ఠానచైతన్యమందు నామరూపాత్మకప్రపంచనిషేధము ఈశ్రుతియొక్క యభిప్రాయము.

ఈరీతిగా శూన్యవాదిమతము అసంగతము.

ప్రాభాకరన్యాయమతఖండనము—

సుషుప్తియందు జ్ఞానము లేకయుండుటవలన ఆత్మ జడమనుట సరి కాదు ; ఎందుకనఁగా—"నేను సుఖముగా నిద్రచేసితిని ; ఏదియును తెలియ లేదు" అను స్వానుభవము నిద్రనుండిలేచినపురుషుఁడు చెప్పుచున్నాఁడు ; ఆత్మ జడమైనచో, సుషుప్తియందుండు ఆనందముయొక్క స్మరణము గలుగ గూడదుగదా? అదికలుగుటవలన ఆత్మ జడముకాదని సహజముగానే సిద్ధమగుచున్నది.

ఈరీతిగా ప్రాభాకరన్యాయమతములు అసంగతములు.

వేదాంతబాహ్యమతములు ఎన్నియున్నవి? అని ఎవఁడేని అడిగినప్పుడు

## 186. ఇంద్రియాత్మవాదిమతము

కొందఱు ఇట్లు చెప్పుదురు—స్థూలశరీరము ఆత్మగాదు. ఎట్లనఁగా—స్థూలశరీరమందు ఎవఁడుండుటవలన జీవితవ్యవహారము, ఎవఁడు లేకుండుటవలన మరణవ్యవహారము అగునో, వాఁడే ఆత్మ; వాఁడు స్థూలశరీరముకన్న భిన్నుఁడు. జీవితమరణములు ఇంద్రియాధీనములు, ఎంతకాలము శరీరమం దింద్రియముండునో, అంతకాలము జీవితముందురు; ఎప్పుడు ఒకయింద్రియమైన నుండదో, అప్పుడు మరణముందురు. "నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను" అను నీఅహంబుద్ధి ఇంద్రియములం దగును; కాఁబట్టి ఇంద్రియములే ఆత్మ.

## 187. హిరణ్యగర్భుని నుపాసించువారి యొక్క మతమున ప్రాణమే ఆత్మ

హిరణ్యగర్భోపాసకులు ప్రాణమును ఆత్మయందురు. వానిలో నీయుక్తి చెప్పుదురు—మృత్యుకాలమందు ఎప్పుడు మూర్ఛయగునో, అప్పుడు పుత్రాదులు ప్రాణశేషముండినవఱకు జీవితవంతుఁ డందురు, ప్రాణశేషము లేకుండిన మృతుఁడందురు, లేక శరీరమందు నేత్రేంద్రియము లేకుండిన అంధుఁడందురు; శ్రోత్రము లేకుండిన బధిరుఁ డందురు; వాక్కు లేకుండిన మూకుఁడందురు. ఇట్లు ఏయేయింద్రియము లేకపోవునో, తద్వ్యాపారము లేకున్నను ఇతరేంద్రియములవ్యాపారము జరుగును; శరీరమును సుందరముగ కనఁబడును; ప్రాణము లేకుండిన తత్కాలము ప్రేతరూపామంగళమై, భయంకరమై శరీరము పడుచున్నది.

---

సంఖ్యచెప్పుట అశక్యముగ నున్నది. వానియొక్క ఖండనము భేదధిక్కారాదిగ్రంథములందు విస్తరముగ చేయఁబడినది. ఇచ్చటనో, దిగ్దర్శనమాత్రము.

"నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను" ఈ ప్రతీతివలన ఇంద్రియములకన్న భిన్నుఁడై యాత్మ సిద్ధించును. లయిన—"నేత్రరూపముకు నేను చూచుచున్నాను; శ్రవణరూపముకు నేను వినుచున్నాను" అనునిట్టి ప్రతీతియైనపక్షమందు ఇంద్రియములు ఆత్మయనుట సిద్ధించును. "నేత్రవంతుఁడైన నేను చూచుచున్నాను; శ్రోత్రవంతుఁడైన నేను వినుచున్నాను;" అనునిట్టి ప్రతీతి యగుచున్నది; కాఁబట్టి ఇంద్రియములకన్న ఆత్మ భిన్నుఁడే యని సిద్ధించినది.

సుషుప్తియందు సర్వేంద్రియములయొక్క అభావము లేదు; అయినను ప్రాణముండుటవలన జీవితవ్యవహారము అగుచున్నది. అట్లు జీవనమరణములును ఇంద్రియాధీనములుగావు; ఎటులనఁగా—స్థూలశరీరమునకును, ప్రాణమునకును వియోగము మరణ మందురు; ఈరీతిగా జీవనమరణములును ప్రాణాధీనములే.

శ్రుతియందు ప్రాణేంద్రియముల కలహము చెప్పఁబడినది; దానివలనను ప్రాణమే ఆత్మయని సిద్ధమగుచున్నది.

## 188. మనఆత్మవాదిమతము

మనఆత్మవాది ఇట్లనెను—ప్రాణము జడము, గనుక ఘటన్యాయమున అనాత్మగా నున్నది. బంధమోక్షములు మనస్సునకు అధీనములు; మూఢు—విషయాసక్తమనస్సు బంధమునకు హేతువు; నిర్విషయమనస్సు మోక్షమునకు హేతువు. మనస్సంబంధమువలననే ఇంద్రియములు జ్ఞానమునకు హేతువు; మనస్సంయోగము లేనియెడల ఇంద్రియములచే జ్ఞానము గానే

రదు; కాఁబట్టి సర్వవ్యవహారములకు హేతువు మనస్సు; అదియే ఆత్మ.

## — 189. విజ్ఞానవాదిమతము బుద్ధి ఆత్మ —

క్షణికవిజ్ఞానవాది ఇట్లనెను—మనోవ్యాపారము బుద్ధి కధీనము; బుద్ధియొక్క పరిణామమే మనస్సైనది; క్షణికవిజ్ఞాన రూపమైన బుద్ధియే ఆత్మ; మనస్సు గాదు.

దీని యభిప్రాయము—సంపూర్ణ పదార్థములు విజ్ఞాన కార్యములు; ఆ విజ్ఞానము ప్రకాశరూపము; ప్రతిక్షణమును ఆ విజ్ఞానముయొక్క ఉత్పత్తినాశనములగును; పూర్వవిజ్ఞానముతో సమానమైన అన్యవిజ్ఞానముయొక్క ఉత్పత్తి, పూర్వవిజ్ఞానముయొక్క నాశనమును అగుచున్నది; అట్లు తృతీయ విజ్ఞానోత్పత్తియు, ద్వితీయవిజ్ఞాననాశమును అగుచున్నది; ఈరీతిగా నదీప్రవాహ న్యాయమున విజ్ఞానముయొక్క ధార సర్వకాలము నడుచుచున్నది.

ఆవిజ్ఞానధార రెండువిధములు—మొదటిది ఆలయ విజ్ఞానధార; అదియే బుద్ధియనఁబడును; రెండవది ప్రవృత్తివిజ్ఞాన ధార అదియే మనస్సనఁబడును. "అహం, అహం" అను అహంకారవృత్తిరూపమయిన విజ్ఞానధారకు ఆలయవిజ్ఞానధార యందురు; "ఈఘటమున్నది, ఈశరీరమున్నది" అనునిట్టి ఇదం తావృత్తిరూపమయిన విజ్ఞానధారకు ప్రవృత్తివిజ్ఞానధార యందురు; మఱియు ఆలయవిజ్ఞానధారచేత ప్రవృత్తివిజ్ఞానధార యొక్క ఉత్పత్తి యగుచున్నది; కాఁబట్టి మనస్సునకు కారణమైన ఏ బుద్ధిగలదో, అదియే ఆత్మయని చెప్పుచున్నాఁడు.

ఆలయవిజ్ఞానధారయందు ప్రవృత్తివిజ్ఞానధారయొక్క బాధచింతనమువలన నిర్విశేషమైన క్షణికవిజ్ఞానధారయొక్క స్థితియే వానిమతమందు మోక్షమందురు.

ఈరీతిగా విజ్ఞానవాది బుద్ధినే క్షణికరూపము, మఱియు స్వయంప్రకాశరూపము అని కల్పనచేసి, దానిని ఆత్మయని ఎఱుఁగుచున్నాఁడు.

## 190. పూర్వమీమాంసైకదేశిభట్టమతము ఆనందమయకోశము ఆత్మ

పూర్వమీమాంసావార్త్తికకారుఁడైన భట్టాచార్యుఁడు ఇట్లనెను—విద్యన్న్యాయమున ఆత్మ క్షణికరూపవంతుఁడు గాఁడు; మఱేమనఁగా—ఆత్మ స్థిరస్వరూపుఁడై జడచైతన్య రూపుఁడు.

దానికిది అభిప్రాయము—సుషుప్తినుండి జాగ్రత్తనొందిన పురుషుఁడు ఇట్లనును—"నేను జడుఁడనై నిద్రించితిని" అను నీ స్మృతివలన ఆత్మ జడరూపుఁడని సిద్ధించినది. ఈస్మృతి జాగ్రదవస్థయందగుచున్నది; అజ్ఞాతపదార్థముయొక్క స్మృతియో, గానేరదు; ఆత్మస్వరూపమునకన్న భిన్నమైన సుషుప్తియందు జ్ఞానమునకు వేఱొక్కసాధనమేమియు లేదు; కాఁబట్టి స్మృతిహేతువైన సుషుప్తియందు ఏజ్ఞానమున్నదో, అది ఆత్మస్వరూపమే యున్నది. ఈరీతిగా ఖద్యోతన్యాయమున ఆత్మ ప్రకాశాప్రకాశరూపుఁడుగా నున్నాఁడు. [జ్ఞానరూపుఁడగుటవలన ప్రకాశరూపుఁడు, మఱియు జడరూపుఁడగుటవలనఅప్రకాశరూపుఁడు.]

ఇట్టిప్రకాశాప్రకాశరూపము ఆనందమయకోశము; ఏలయన—సుషుప్తియందు చైతన్యాభాససహితమైన అజ్ఞానమునకు

ఆనందమయకోశమందురు; అప్పుడు ఆభాసుడు ప్రకాశరూపుఁడు; అజ్ఞానము అప్రకాశరూపము; ఈరీతిగా భట్టమతముందు ఆనందమయకోశమే ఆత్మ యని ఎఱుఁగుచున్నాఁడు.

### 191. మాధ్యమికబౌద్ధుఁడైన శూన్యవాది మతము ఆనందమయకోశము ఆత్మ

శూన్యవాదియగు బౌద్ధుఁ డిట్లనెను—నిరంశుఁడైనయొక యాత్మనే ప్రకాశరూపుఁడనుట, అప్రకాశరూపుఁడనుట సరి కాదు; ఖద్యోతమను కీటకమునందు ఏకాంశము ప్రకాశరూపము, ఏకాంశము అప్రకాశరూపము ఉండునట్లు అంశరహితాత్మ యందు ఉభయరూపము చెప్పుట అయుక్తము; కాఁబట్టి ఉభయ రూపసిద్ధికొఱకు ఆత్మను అంశసహితుఁడని చెప్పవలసివచ్చును; అంశవంతములగు ఘటాదులు ఉత్పత్తినాశములు గలవి; అట్లు ఆత్మయు అంశసహితుఁడని చెప్పుటవలన ఉత్పత్తినాశములు గల వాఁడుగా అంగీకరింపవలసివచ్చును; ఏది ఉత్పత్తినాశములుగల పదార్థమగునో, అది ఉత్పత్తికన్న పూర్వము, నాశమున కనంతరము అసత్తగును; మఱియు ఏది ఆద్యంతములందు అసత్తగునో, అది మధ్యమందుమాత్రము సత్తుగా నేరదు. మతేమనఁగా— అసత్తేయగును; అందువలన ఆత్మ అసద్రూపుఁడు, అట్లు ఆత్మకన్న భిన్నమైన సంపూర్ణపదార్థములును ఉత్పత్తినాశములుగల వగుట వలన అసద్రూపములుగా నున్నవి.

ఈరీతిగా ఆత్మయు, అనాత్మయు సమగ్రవస్తువులును అసద్రూపములగుటవలన శూన్యమే పరమతత్త్వము.

ఇది శూన్యవాదిబౌద్ధునిమతము. వాఁడును అజ్ఞానరూపా నందమయకోశమును ప్రతిపాదించుచున్నాఁడు. ఏలయన— అజ్ఞానము మూఁడురూపములచేత ప్రతీతమగును—

(1) అద్వైతశాస్త్రసంస్కారరహితుఁడైన మూఢునికి జగద్రూపపరిణామప్రాప్తమైన అజ్ఞానము సత్యరూపముచే ప్రతీతమగును.

(2) అద్వైతశాస్త్రానుసారి యుక్తినిపుణుఁడైన పండితునకు సదసద్విలక్షణరూపముచే ప్రతీతమగును. [సదసద్విలక్షణమును అనిర్వచనీయ మందురు.]

(3) జ్ఞాననిష్ఠుఁడైన జీవన్ముక్తవిద్వాంసునకు తుచ్ఛరూపముగా ప్రతీతమగును [తుచ్ఛము, అసత్తు, శూన్యము ఈమూఁడు ఏకార్థవాచకములైన పర్యాయశబ్దము.]

ఈరీతిగా జీవన్ముక్తవిద్వాంసునకు తుచ్ఛరూపముగా ప్రతీతమైనట్టి అజ్ఞానమందు మోహితుఁడైన శూన్యవాది పరమపురుషార్థము నెఱుఁగఁడు. మఱేమనఁగా—తుచ్ఛరూపమైన ఆనందమయకోశమును ఆత్మయని యెఱిఁగి, అదే పరమపురుషార్థమని చెప్పుచున్నాఁడు.

## 192. ప్రభాకరనైయాయికులమతము ఆనందమయకోశము ఆత్మ

పూర్వమీమాంసైకదేశి ప్రభాకరుఁడు, మఱియు నైయాయికుఁడు ఇట్లనెను—ఆత్మ శూన్యరూపుఁడు గాఁడు. ఎవఁడు ఆత్మను శూన్యరూపముగా సంగీకరించునో, వాని నిట్లడుగవలయును—శూన్యరూపమును నీవు అనుభవించితివా? లేదా?

వాఁడిట్లుచెప్పును—శూన్యరూపముయొక్క అనుభవము చేయలేదు; అట్లనినపక్షమందు శూన్యము లేదని సిద్ధమగును. మఱియు శూన్యముయొక్క అనుభవము చేసితిని; అని చెప్పె నేని, ఆ పక్షమందు ఎవ్వఁడు శూన్యానుభవము చేసినాఁడో, వాఁడే ఆత్మ. ఆయాత్మ శూన్యముకన్న విలక్షణ మని సిద్ధించినది.

ఆ యాత్మయందు మనస్సంయోగమువలన జ్ఞానము కలుగుచున్నది; ఆజ్ఞానగుణమువలన ఆత్మ చైతన్య మనఁబడు చున్నది; అయినను స్వరూపము చే ఆత్మ జడమే; వానియందు సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నధర్మాధర్మగుణములున్నవి.

ఈమతమందును ఆనందమయకోశమే ఆత్మగా నున్నది; మఱియును విజ్ఞానమయకోశమందు ఏ బుద్ధి గలదో, దానిని ఆత్మయొక్క జ్ఞానగుణ మందురు. ఆనందమయకోశమందు చైతన్యము గూఢము; వివేకహీనునకు ప్రతీతముగానేరదు; కనుక ప్రాభాకర నైయాయికులు సుషుప్తియందు ఆత్మను జ్ఞానహీనుఁ డని తెలిసికొని; స్వరూపముచేతనే జడ మందురు. ఆత్మయందు స్వరూపభూతమయిన నిత్యజ్ఞానము అంగీకరింపరు; అనిత్యజ్ఞానమునే అంగీకరింతురు. వేదాంతసిద్ధాంతమందైననో, ఆ యనిత్యజ్ఞానము అంతఃకరణవృత్తియైన బుద్ధిరూపముగా నున్నది.

## 193. ఆచ్ఛాదకమైనజీవపంచకోశన్యాయమున ఈశ్వరుని పంచకోశములు.

జ్ఞానముకన్న భిన్నమైన ఘటాదిజడవస్తువులు ఏవి గలవో, అవి అనిత్యములు. అట్లు ఆత్మయును జ్ఞానస్వరూపుఁడు గాఁడేని ఘటాదులవ్యాయమున జడముగుటవలనఅనిత్యమగును. ఆత్మ అనిత్యమైనప్పుడు మోక్షసాధనములు నిష్ఫలము లగును.

ఈరీతిగా వేదాంతవాక్యములందు విశ్వాసహీనులైన అనేకబహిర్ముఖపురుషులు పంచకోశములందు ఏదో ఒకపదార్థమును ఆత్మగా అంగీకరించి, ముఖ్యాత్మస్వరూపమైన సాక్షిని ఎఱుఁగకున్నారు. ఈరీతిగా అన్నమయాదులు ఆత్మను ఆచ్ఛాదించుటవలన వానిని కోశ మని చెప్పుదురు.

ఎట్లు జీవుని వ్యష్టిపంచకోశములు జీవునియొక్క యథార్థస్వరూపమైనసాక్షిని [1] ఆచ్ఛాదించునో, అట్లు ఈశ్వరునియొక్క సమష్టిపంచకోశములు ఈశ్వరునియొక్క యథార్థస్వరూపమైన ఈశ్వరసాక్షిని ఆచ్ఛాదించుచున్నవి. ఏలాగున ననఁగా—ఈశ్వరునియొక్క యథార్థస్వరూపమైననో, తత్పదలక్ష్యార్థమగు శుద్ధచైతన్యము; దానినివిడిచి కొందఱుమాయారూపానందమయకోశవిశిష్టమై తత్పదవాచ్యమైన ఏయంతర్యామిగలఁడో వానిని పరమతత్వ మందురు.

కొందఱిచేత హిరణ్యగర్భవైశ్వానరబ్రహ్మవిష్ణుమహేశగణేశదేవీసూర్యులు, మొదలు అశ్వత్థకుద్దాలకార్కవంశపర్యం

1. ఆత్మకు సత్తు చిత్తు, ఆనందము, అద్వైతము ఈనాల్గు విశేషణములు; [లక్షణములు] అహంకారదేహాదులకు అసత్తు అచిత్తు [జడము] దుఃఖము, ద్వైతము ఇవినాల్గు విశేషణములు; వీనియందు ఆత్మయొక్క సచ్చిద్రూపవిశేషణములు దేహాదుల అసజ్జడరూపములను ఆవరించుచున్నవి;కనుక దేహాదులు సచ్చిద్రూపములవలె ప్రతీతమగుచున్నవి. దేహాదుల దుఃఖద్వైతరూపవిశేషణములు ఆత్మయొక్క ఆనందాద్వయరూపములను ఆవరించుచున్నవి;కనుక ఆత్మ దుఃఖిగాను, ద్వైతముగాను ప్రతీతమగుచున్నాఁడు. ఈవిధముగా ఆత్మకును పంచకోశములకును పరస్పరము అధ్యాసముగలదు; కావుట్టి ముముక్షువైనవాఁడు పంచకోశవివేకము అవశ్యముగా చేయవలెను.

తము లైన పదార్థములందు పరమాత్మభ్రాంతి చేయఁబడినది. సకలపదార్థములందు లక్ష్యభాగము పరమాత్మకన్న భిన్నము గానిదయినను, ఆయాయుపాధితోఁ గూడినదానిని పరమాత్మగా నంగీకరించుట అది భ్రాంతియే.

ఈరీతిగా పంచకోశములవలన ఆవృతమయిన ఏ జీవేశ్వరుల పరమార్థస్వరూపము గలదో, దానికి విముఖులయి, దేహాదికమునందు ఆత్మభ్రాంతి చేసికొని, పుణ్యపాపకర్మములు చేయుదురు. మఱియు అంతర్యామి మొదలు వంశముపర్యంతము ఈశ్వరరూప మని అంగీకరించి, ఆరాధనముచేసి, సుఖమును గోరుదురు.

వారు ఎట్టెట్టి ఉపాధియొక్క ఆరాధనము చేయుదురో, తదనుసారముగా ఫలమును పొందుదురు; ఏలయన—కారణ సూక్ష్మస్థూలసకలప్రపంచము ఈశ్వరునియొక్క మూఁడుశరీరములకు అంతర్భూతములు; దానిలో ఉపాసనానుసారము ఫలమును లభించుచున్నది; గాని, బ్రహ్మజ్ఞానములేక మోక్షము గానేరదు. అట్లు పంచకోశవివేకములేక బ్రహ్మజ్ఞానము ఘటిల్లదు; కాఁబట్టి మోక్షేచ్ఛ గలిగినవాఁడు వివేకమువలన జీవేశ్వరులస్వరూపమును పంచకోశములకన్న వేఱె చేయవలయును.

ఉదాహరణము—ముంజమును [1] ఇషీకయు కూడియున్నవి. ఎట్లు వీనిని వేఱు వేఱుచేసి, ఇషీక తీసికొందురో, అట్లు వివేకమువలన జీవేశ్వరులస్వరూపమును పంచకోశములకన్న వేఱుగా తెలియవలెను.

---

1. ముంజనామకతృణవిశేషముయొక్క లంబపర్ణములందు గుప్తమైన ఇషీక యనఁగా పుల్ల.

## 194 పంచకోశవ్యతిరేక[1] ప్రకారము.

స్వప్నావస్థయందు స్థూలదేహముయొక్క భానముగాదు; ఆత్మ ద్రష్టృరూపమై భాసిల్లును. అట్లు సుషుప్తియందు సూక్ష్మ

1 పంచకోశవివేచనముకొఱకు శరీరత్రయావస్థాత్రయవివేచనము—

స్థూలదేహవివేచనము—

స్థూలదేహముయొక్క ఉత్పత్తికి పూర్వమందును,మరణమునకు ఉత్తరమందును ఒకటేయాత్మ యుండుటవలన ఘటముకన్న ఆకాశము భిన్నముగాను, అవ్యభిచారిగాను ఉండునట్లు ఆత్మ స్థూలదేహముకన్న భిన్నముగాను, అవ్యభిచారిగాను ఉన్నాఁడు. ఘటమువలె ఉత్పత్తికి పూర్వమందు, మరణమునకు ఉత్తరమందు లేనందువలనను, అనేకములుగా నుండుటవలనను ఆత్మకన్న దేహము అన్యముగాను వ్యభిచారిగాను ఉన్నది.

[ఏది సర్వదేశమందును, సర్వకాలమందును ఉన్నదో, అది అవ్యభిచారి యనఁబడును.] ఆత్మ సర్వశరీరములందు, ఒకటే యుండుటవలనను, సర్వావస్థలయందును, త్రికాలములందును బాధింపఁబడకుండుటవలన అవ్యభిచారిగా నున్నాఁడు.

[ఏది కొంతదేశమందు, కొంతకాలమందు ఉన్నదో, అది వ్యభిచారి యనఁబడును.] ఘటమువలె దేహము పరిచ్ఛిన్నమై క్షణికమై యుండుటవలన వ్యభిచారిగా నున్నది.

ఈరీతిగా ఆత్మయు, దేహమును క్రమముగా అవ్యభిచారిగాను, వ్యభిచారిగాను ఉండుటవలన రెంటికి భేదము సిద్ధించుచున్నది; కాఁబట్టి నేను దేహము కాను; దేహము నాదికాదు; అయిన పంచీకృతపంచభూతములది; నేను స్థూలదేహముకానందున స్థూలదేహమునకు చెప్పినవామము, జాతి; ఆశ్రమము, రంగు, ఆకారము మొదలైనధర్మములు నేనుకాను; అవి నావికావు; వీటిని చూచినవాఁడు నేను వీనికి అన్యుఁడుగా నున్నాను.

శరీరకము యొక్క భానముగాదు; ఆత్మ సుఖస్వరూప ప్రకాశరూప ముచే భాసిల్లును. [నేను సుఖముగా పరుండియుంటి ననుస్మృతి జాగ్రత్తయందగుటవలన సుషుప్తియందు సుఖప్రకాశాత్మసిద్ధి

---

సూక్ష్మదేహవివేచనము—

మరణము, మూర్ఛ, సుషుప్తి, ప్రళయము, బ్రహ్మజ్ఞానము ఈయైదు అవస్థలందు లింగదేహమునకు లయమగుటవలన ఇది వ్యభిచారిగా, మిథ్యగా నున్నది. ఆత్మ సర్వకాలములందును, సర్వావస్థలందును విద్యమానుఁడై యుండుటవలన అవ్యభిచారిగా, సద్రూపుఁడుగా నున్నాఁడు. ఆత్మ సద్రూపుఁడగుట వలన లింగదేహముకాఁడు; లింగదేహము ఆత్మకాదు; ఇది అపంచీకృతపంచ మహాభూతముల కార్యముగా నున్నది.

నేను లింగదేహము కానందున కర్తృత్వము, భోక్తృత్వము మొదలైన లింగదేహముల ధర్మములు నేనుకాను; అవి నావికావు; వీనిని తెలిసికొను వాఁడను; వీనికి అన్యుఁడుగా నున్నాను.

కారణదేహము అజ్ఞానరూపము; ఇది నేను కాను; అది నాదికాదు; కాఁబట్టి కారణదేహముయొక్క ఆవరణవిక్షేపములు నేనుకాను; అవి నావి కావు; వీనినన్నిటిని చూచువాఁడను నేను వీనికి పృథక్కుగా నున్నాను.

స్వప్నసుషుప్తులకన్న భిన్నమైన జాగ్రదవస్థావివేచనము—

స్వప్నము, సుషుప్తి ఈరెండవస్థలకు భిన్నమై ఇంద్రియజన్యజ్ఞానమునకును, దానిసంస్కారమునకును ఆధారముగానుండు కాలము జాగ్రదవస్థయనఁబడును. దీనియందు పదునాలుగుత్రిపుటులచే వ్యవహారము కలుగుచున్నది. ఈయవస్థయొక్క సామగ్రి వివరించఁగా—జీవునకు నేత్రము స్థానము, [శరీర మంతయును జీవుఁడు వ్యాపించినను, నేత్రము ముఖ్యస్థానము.] క్రియాశక్తి, వైఖరీ వాణి, భోగము స్థూలము, రజోగుణము, అభిమానియొక్క నామము విశ్వుఁడు. జాగ్రత్తయందు స్వప్నసుషుప్తులు లేవు; స్వప్నసుషుప్తులందు జాగ్రత్తలేదు;

ముగును.] మఱియు ఆయాత్మ నిర్వికల్పసమాధియందు నిరావరణ ముగాభాసిల్లును. అచ్చట అజ్ఞానరూపకారణశరీరము భాసిల్లదు. ఈరీతిగా మూఁడుశరీరములు వ్యభిచారులు; అవి ఒకయవస్థ

---

వీనికి సాక్షిభూతుఁడైన ఆత్మ మూఁడవస్థలందు ఉన్నాఁడు; కనుక ఆత్మ జాగ్ర దవస్థకన్న భిన్నుఁడుగా నున్నాఁడు.

జాగ్రత్సుషుప్తులకన్న భిన్నమైన స్వప్నావస్థావివేచనము—

ఇంద్రియములసాహాయ్యము లేక హితనాడియందుండు జాగ్రత్తు యొక్క సంస్కారముచే విషయములు తెలియఁబడునది స్వప్నావస్థయనఁ బడును. ఈయవస్థయందు సామగ్రి ఏమనఁగా—కంఠస్థానము, జ్ఞానశక్తి, మధ్యమవాణి, భోగము సూక్ష్మము, సత్త్వగుణము, నామము తైజసుఁడు. జాగ్రత్సుషుప్తులందు స్వప్నములేదు, స్వప్నమందు జాగ్రత్సుషుప్తులు లేవు; ఆత్మ మూఁడవస్థలందును సాక్షిగానుండుటవలన ఆత్మ స్వప్నముకన్న వేఱుగ నున్నాఁడు.

జాగ్రత్స్వప్నములకన్నభిన్నమైన సుషుప్త్యవస్థావివేచనము—

ఏయవస్థయందు కేవలసుఖము, అజ్ఞానము ఉన్నదో, అది సుషుప్త్యవస్థ యనఁబడును. దీనిసామగ్రి ఏదియనఁగా—హృదయస్థానము, ద్రవ్యశక్తి [క్రియారూపమగు, జ్ఞానరూపమగు వ్యవహారములు లేకయే కేవలాజ్ఞానరూపద్రవ్యము.] పశ్యంతీవాణి, ఆనందభోగము, తమోగుణము, నామము ప్రాజ్ఞుఁడు. జాగ్రత్స్వప్నములందు సుషుప్తిలేదు; సుషుప్తియందు జాగ్రత్స్వప్నములు లేవు; ఆత్మ మూఁడవస్థలకు సాక్షిగానుండుటవలన సుషుప్తికన్న భిన్నుఁడుగా నున్నాడు.

[కొందఱు జాగ్రత్తయందు సత్త్వగుణముజ్ఞానశక్తియని, స్వప్నమందు రజోగుణము క్రియాశక్తి యని చెప్పుచున్నారు. పూర్వము చెప్పినరీతిగ క్రమరహితసృష్టియందు నియమమెక్కడవచ్చును?]

యందలివి రెండవయవస్థయందు భాసిల్లవు; ఆత్మ సర్వావస్థలందు భాసిల్లుటవలన అవ్యభిచారిగా నున్నాఁడు. ఈవివేకమువలన మూఁడుశరీరములకన్న ఆత్మను వేఱని తెలియవలెను.

స్థూలశరీరము అన్నమయకోశము; కారణశరీరము ఆనందమయకోశము; సూక్ష్మశరీరము ప్రాణమయమనోమయ విజ్ఞానమయకోశములు. అందువలన శరీరత్రయవివేకమువలన పంచకోశములవివేకము కలుగును. ఎట్లు జీవునిస్వరూపము వ్యష్టిపంచకోశములకన్న వేఱుగా నున్నదో, అట్లు ఈశ్వరుని స్వరూపము సమష్టిపంచకోశములకన్న వేఱుగా నున్నది.

[చతుర్థతరంగమందు చతుర్విధాకాశదృష్టాంతమువలన జీవేశ్వరుల లక్ష్యస్వరూపములయొక్క వివేకము విస్తరముగా చేయఁబడియున్నది. మఱియు ఉత్తరతరంగములో అస్తిభాతిప్రియరూపనిరూపణమునందు, అట్లే ఇప్పుడు మహావాక్యార్థనిరూపణమందు ఆత్మయొక్క పరమార్థస్వరూపప్రతిపాదనమునందు చేయుటయున్నది, కాఁబట్టి ఇచ్చట ఆత్మవివేకముసంక్షేపముగా చెప్పఁబడినది.]

### 195. మహావాక్యార్థోపదేశము.

పంచకోశములకన్న ఆత్మను వేఱని తెలియుటవలనను కృతకృత్యుఁడుగాఁడు; జీవబ్రహ్మలయొక్క అభేదనిశ్చయము కొఱకు మరల విచారము చేయవలసినది; కాఁబట్టి కర్తవ్యాభావరూపమైన కృతకృత్యతాసిద్ధికొఱకు మహావాక్యార్థోపదేశము చేయుచున్నాము—

ఓశిష్యుఁడా! పంచకోశములకన్న ఆత్మను భిన్నుఁడని యెంచి, ఆయాత్మ బ్రహ్మరూపుఁడని ఎఱుఁగుము.

**196.** ప్రశ్న—కర్తభోక్తయగుఆత్మకు బ్రహ్మముతో ఏకత ఘటిల్లదు?

ఓభగవంతుఁడా! ఆత్మయో, పుణ్యపాపములకు కర్త; మఱియు వానిఫలమైన స్వర్గనరకజన్మమృత్యుసుఖదుఃఖములకు భోక్త; వానికి అకర్త, అభోక్తయగు బ్రహ్మముతో ఏకత ఘటిల్లదు?

**197.** 196 గతప్రశ్నకుత్తరము—197—227 అకర్త అభోక్తయగుయాత్మకు బ్రహ్మముతో అభేదము

ఓశిష్యుఁడా! ఆబ్రహ్మరూపుఁడైన ఆత్మకన్న భిన్నముగా చూడఁబడిన ఘటపటాదులు, మఱియు శాస్త్రమువలనవినఁబడిన స్వర్గనరకములు, పుణ్యపాపములు ఏవి గలవో, అవి సంపూర్ణము భ్రమముగా తెలియుము; ఆభ్రమరూపమగు మిథ్యావస్తువులచే సత్యరూపాధిష్ఠానము చెడదు. ఎట్లనఁగా—స్వప్నమందు భిక్షమెత్తుటవలన భూపతి దరిద్రుఁడు గాఁడు. మిథ్యామృగజలమువలన మరుభూమి ఆర్ద్రము గాదు; మిథ్యాసర్పము వలన రజ్జువు విషసంయుక్తము గాదు.

ఈరీతిగా అసంగాత్మయైన నీవు శుభాశుభములయిన సంపూర్ణక్రియలకును కర్తగానుండినను, అకర్త యనవలయును; ఏలాగుననఁగా—పరమార్థమువలన కర్త గావు. అట్టి నీస్వరూపము ఆశ్చర్యరూపముగాను, ఉపమారహితముగాను ఉన్నది. అభిప్రాయము—బ్రహ్మముకన్న అభిన్నమయిన నీస్వరూపమందు స్థూలసూక్ష్మశరీరములు, మఱియు వీని శుభాశుభ

క్రియలు, మఱియు తత్ఫలమయిన జన్మమరణస్వర్గనరకాదులు సంపూర్ణములును అవిద్యవలన కల్పితములుగా నున్నవి.

ఆ కల్పితసామగ్రివలన నీబ్రహ్మభావము చెడదు; అందువలన జ్ఞానమునకు పూర్వముకూడ ఆత్మ బ్రహ్మస్వరూపుడుగానే ఉన్నాడు; వానియందు త్రికాలమందును శరీరముల యొక్కయు, తద్ధర్మములయొక్కయు, సంబంధము లేదు; మఱేమనగా—ఆత్మ నిత్యముక్తుడు. వానికి బ్రహ్మముతో ఎప్పుడును భేదము లేదు. [బ్రహ్మముతో భేదము లేమివలన త్రికాలమందును ఆత్మ జననమరణాదిరహితుడుగానే యున్నాడు.]

## 198. జీవన్ముక్తనిశ్చయము; వేదాంతశ్రవణఫలము

ఒకానొక దిట్టమును—ఆత్మ ఎప్పుడును నిత్యముక్త బ్రహ్మస్వరూపుడయినపుడు శ్రవణాదిజ్ఞానసాధనములు నిష్ఫలము లగును? తత్సమాధానము—జీవన్ముక్తవిద్వాంసుని యొక్క దృష్టియందు అజ్ఞానము, మఱియు తత్కార్యము తుచ్ఛము. ఆ జీవన్ముక్తవిద్వాంసుని నిశ్చయమును చూపుచున్నాము—

ఓశిష్యుడా! ఈ ప్రపంచము ఖపుష్పమువంటిది; [త్రికాలాభావరూపము.] గనుక తత్కర్త ఈశ్వరుడును లేడు. సాక్షివిషయమైన అజ్ఞానాదికము సాక్ష్యమందురు; అసాక్ష్యము నుండదు; కనుక సాక్షియు లేడు. అట్లు దృశ్యముయొక్క ప్రకాశకము దృక్కు [ద్రష్ట] అందురు; అప్రకాశ్యమైన దేహాదికము దృశ్యమందురు; ఆ దృశ్యము లేదు; కనుక తత్ప్రకాశకుడైన దృక్కును లేడు.

యద్యపి కేవలకూటస్థచైతన్యమును సాక్షి, మఱియు ద్రష్ట యందురు; తన్నిషేధము ఘటిల్లదు. తథాపి సాక్ష్యము యొక్క అపేక్షవలన సాక్షినామము, మఱియు దృశ్యము యొక్క అపేక్షవలన ద్రష్టృనామము; ఆ సాక్ష్యముయొక్కయు దృశ్యముయొక్కయు అభావమున్నది; అందువలన సాక్షి ద్రష్టృ నామములయొక్క నిషేధము చేయఁబడినది; సాక్షిద్రష్టృస్వరూప మైన చైతన్యముయొక్క నిషేధము చేయఁబడలేదు.

బంధ ముండినయెడ బంధనివృత్తిరూపమైన మోక్ష మగును; బంధము లేదేని, మోక్షమును లేదు. అజ్ఞాన మున్న యెడ జ్ఞానమువలన తన్నాశ మగును; అజ్ఞానము లేదేని, జ్ఞానమును లేదు. [సద్రూపమైన చైతన్యమునకు అసద్రూపపదార్థాపేక్ష చే అనేకనామములు బోధముకొఱకు భావింపఁబడినవి.]

ఇట్లు తెలిసికొని, కర్తవ్యబుద్ధి త్యజింపుము. [నాకిది చేయుటకు యోగ్యము; నాకిది చేయుటకు యోగ్యము; ఇట్టిబుద్ధి ఏది గలదో, తత్త్యాగము చేయుము.] ఏలయన — ఈలోకము, లేక పరలోకము తుచ్ఛము; దీనికొఱకు ఏమియు కర్తవ్యము లేదు; ఆత్మయందు బంధము లేదు; కనుక మోక్షనిమిత్తమును ఏకర్తవ్యము లేదు; ఈరీతిగా ఆత్మను నిత్యముక్త బ్రహ్మరూప మని ఎఱిఁగి, ఎప్పుడు నిశ్చింతుఁడవగుదువో, [సమస్తకర్తవ్యాభావము చేయుదువో] అప్పుడు నిశ్చలాక్రియ బ్రహ్మస్వరూప మైన విదేహమోక్షమును పొందుదువు.

దీని కిదియభిప్రాయము — ఆత్మజ్ఞానముకన్న పూర్వమును నిత్యముక్త బ్రహ్మస్వరూపుఁడవై యున్నాఁడవు; అట్లయినను, జ్ఞానమునకు ముందు ఆత్మను కర్త భోక్త యని యంగీకరించి,

మగఖనివృత్తికొఱకును, సుఖప్రాప్తికొఱకును అనేకసాధనములు చేయును; వానివలన క్లేశప్రాప్తి యగును; మఱియు ఎప్పుడు ఉత్తమాచార్యులు లభింతురో, అప్పుడు వేదాంతతత్త్వోపదేశము చేతురు; దీని శ్రవణమువలన ఇట్టి జ్ఞాన మగును— నేను కర్తను భోక్తను గాను; నేను బ్రహ్మస్వరూపుడను; నాకు కొంచెమైనను కర్తవ్యము లేదు. ఇట్లు తెలియుటచే శ్రవణాదికములకు ఫలము; బ్రహ్మప్రాప్తి శ్రవణాదికములకు ఫలముగాదు; ఏలయన— బ్రహ్మమో, తనస్వరూపము; అదియో, నిత్య ప్రాప్తమె.

## 199. జ్ఞానియొక్కయు అజ్ఞానియొక్కయు చిహ్నము

ఏదైనను కర్తవ్యమని అంగీకరించుట అజ్ఞానియొక్క చిహ్నము. కర్తవ్యబుద్ధ్యభావముండుట మఱియు భవితవ్యతాభావ ముండుట [అన్యరూపముకావలెనను ఇచ్ఛ లేకుండుట] జ్ఞానియొక్కచిహ్నము.

## 200. గోప్యతత్త్వోపదేశము

ఒక్కటియగు అఖండము, అసంగము, అజన్యము, అరూపమగు బ్రహ్మంబునందు మూలాజ్ఞానము లేదు; తూలాజ్ఞానము లేదు; స్థూలసూక్ష్మములు లేవు; వ్యష్టిసమష్టులు లేవు; సూత్రవిరాట్టులు లేరు; ప్రాజ్ఞతైజసవిశ్వులు లేరు; భోగము లేదు; రోగము లేదు; బంధము లేదు; మోక్షము లేదు; మఱియేదియును అణుమాత్రము లేదు. ఇట్టి స్వయంజ్యోతిఃపూర్ణమయిన బ్రహ్మంబునందు జాగ్రతాద్యవస్థలు, మఱియు వానిలో ప్రతీయమానమగు ప్రపంచము అదియంతయు బుద్ధివిలాసముగా [వినోదముగా] నున్నది. నిద్రాస్థానమందు తానొకఁడె యుండి

నను, బాహ్యపదార్థము లేకయే స్వప్నమందు చిత్రవిచిత్రపదార్థములును, వానిజ్ఞానమును అగుచున్నది. మఱియు సుషుప్తియందో యనిన, బాహ్యపదార్థ మేదియు లేదు; అంతరపదార్థ మేదియు లేదు; ఇంద్రియసహితబుద్ధియును లేదు; ఆత్మ ఏకరసముగా నుండుటవలన భేదభయాదులయిన భిన్నపదార్థములు ఏవియు లేవు. ఇట్లుండఁగా తదుత్తరమైన జాగ్రత్కాలమందు బుద్ధియును, నానాపదార్థములును కనఁబడుచున్నవి; అవి ఏమి? బుద్ధిప్రకాశకుఁడైన ఆత్మయే.

ఈప్రకారముగా ఎవ్వనికి ఆత్మానుభవజ్ఞానముచే అజ్ఞానాంధకారనాశమగునో, వానికి బాహ్యాంతరవ్యాపకమైనట్టి అసంగైకరసబ్రహ్మరూపానుభవజ్ఞానమగును. వాఁడే జీవన్ముక్తుఁడు. ఆజీవన్ముక్తవిద్వాంసుఁడు ఇట్లు ఎఱుఁగును:—జగత్తు పూర్వము లేదు, ఇప్పుడు లేదు; ముందును లేదు. జగత్తనుట కేవలమనోరథమాత్రమే. దానియొక్క ప్రవృత్తివలన నాకేమి హానియు లేదు; నివృత్తివలన నాకేమిలాభమును లేదు; నేను సర్వత్ర పరిపూర్ణసముద్రుఁడనుగా నున్నాను. ఎట్లనఁగా— తరంగముల ప్రవృత్తివలన సముద్రమునకు ఏమిహానియు లేదు; నివృత్తివలన నేమిలాభమును లేదు.

ఈప్రకారమెఱిఁగినజ్ఞాని యో, అంతయుఁ జూచి, ఏమియు చూడఁడు. అంతయు విని, ఏమియు వినఁడు; అన్ని ఇంద్రియములచే క్రియచేసియు, భోగముచేసియు ఏమియు చేయఁడు; ఏమియు నుపభోగింపఁడు.[1]

---

1. ఇచ్చట శ్రీభగవద్గీతయొక్క పంచమాధ్యాయమందు 7, 8, 9 శ్లోకములు—

దీనియభిప్రాయ మేమనఁగా—ఇంద్రియములు తమతమ విషయములలో వర్తించుచున్నవి; ఆయింద్రియములు నేనుగాను;

---

"యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే"  7

భావార్థము—కర్మయోగముచేత, లేక జ్ఞానయోగముచేత యుక్తుఁడు దానిచే శుద్ధుఁడు; [రాగద్వేషరహితమనస్సుగలవాఁడు] దానిచే జితేంద్రియుఁడు; [విషయములనుండి విముఖీకృతేంద్రియములుగలవాఁడు] దానిచే విజితాత్మ; [జయింపఁబడిన బాహ్యాకారస్వరూపస్వభావముగలవాఁడు] దానిచే ఆబ్రహ్మస్తంబపర్యంతము సర్వభూతములను ఆత్మస్వరూపముగా భావించినవాఁడు; ఇట్టిసర్వాత్మభావమును పొందినవాఁడైన బ్రహ్మవిత్తముఁడు గలఁడో, వాఁడు కర్మమువలన లిప్తుఁడు గాఁడు; అనఁగా—కర్మమందు అకర్తృత్వాదృష్టి వలన కర్మసంబంధమును పొందఁడు; అదియు ఆ కర్మము శరీరనిర్వాహకము గానీ, లౌకికముగానీ, వైదికముగానీ.

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్.
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్.  9

భావార్థము—పూర్వశ్లోకోక్తమైన యోగయుక్తాది పంచలక్షణములచే సంపన్నుఁడైన విద్వాంసుఁడు చూచుచు, వినుచు, తాకుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, నడచుచు, నిద్రించుచు, శ్వాసోచ్ఛ్వాసము చేయుచు, మాటలాడుచు, మలమూత్రముల త్యాగము చేయుచు, గ్రహించుచు, మఱియు నిమేషోన్మేషములు చేయుచు, ఇంద్రియార్థమందు ఇంద్రియములు వర్తించుచున్న వని వృత్తిని ధరించి, నేను ద్రష్టను, శ్రోతను మొదలగువాఁడను కాను; ఆయాక్రియలకు సాక్షియగుటవలన నిష్క్రియరూపముగా ఊరకున్నాను;

మఱియు ఇంద్రియములు నావిగావు; ఇంద్రియములకు, నాకు ఏవిధమైన సంబంధము లేదు; కనుక ఆయింద్రియములు విషయ

ఇట్లు భావించును. [ఉక్తవ్యాపారమందు "నేనుసాది" అనుభావన విద్వాంసు నకు గానేరదు.]

---

ఇచ్చట ఈరహస్యముగలదు—దేనివలన జ్ఞానికి నేను అక్రియుండను అను నిట్టి నిశ్చయమగునో, దానివలన జ్ఞాని వాస్తవముగా ఏక్రియను చేయఁడు. ప్రారబ్ధబలమువలన ఇంద్రియాదులచే దర్శనాదివ్యాపారమగును; అయినను ఆయావ్యాపారఫలభోగమందు ఏ ఆసక్తిరూపరాగము గలదో, ఆ రాగము ఇంద్రియములచేఁగానేరదు. [ఇంద్రియములు దర్శనాదిక్రియామాత్రమువల ననే కృతార్థములగును.] ఆ రాగము ఆత్మచేతను గానేరదు. [ఆత్మ, సర్వసాధా రణనిర్వికారప్రకాశకతవలననే కృతార్థుఁడగును.] మిగిలినది విషయములగుణ దోషవిచారమగునట్టి మనస్సు, దానికి అనుకూలజ్ఞానమువలన రాగమగు నన వలయుం ననఁగా జ్ఞానియొక్క అంతఃకరణము శాంతము; దానియందు రాగ జనకయోగ్యత లేదు; ఈవార్త "రాగము అబోధమునకు లింగము" ఇత్యాది సంగతులు చిత్సుఖివాక్యమునందు స్పష్టముగా చెప్పఁబడియున్నవి.

యద్యపి సర్వథా రాగాభావమైనవెనుక భోజనాదిశరీరయాత్రకు హేతువైన వ్యాపారమందును ప్రవృత్త్యభావమువలన జ్ఞానికి ప్రారబ్ధభోగము ఘటిల్లదు; ఈశ్వరసంకల్పవిషయమైనట్టి ప్రారబ్ధభోగముయొక్క అభావము జ్ఞానికిని సంభవింపదు; తథాపి విచారముచే దుర్నివారమైనట్టి రోగాదికమువలె ప్రారబ్ధజనితరాగము జ్ఞానికిని కలుగును. [అహంకారముయొక్కయుం, చిదాత్మ యొక్కయుం భ్రమజన్యతాదాత్మ్యము ఏది గలదో, దానియభావమువలన ఆరాగము అదృఢ మనఁగా ఆభాసరూపముగ కలుగును.] ఆయదృఢరాగము దగ్ధబీజమువలె నిష్ఫల మగుటవలన దేహనిర్వాహమునకు మాత్రము హేతు వన్నది; వ్యసనోత్పాదకమైన నిషిద్ధభోగమునకు హేతువు గాదు.

త్యాగముచేయనీ, లేక ఉపభోగముచేయనీ నాకు లేశమును అంటదు; ఏలయన — నేనో, అసంగాలిప్తకూటస్థసాక్షిగా నున్నాను; ఇట్టిది జీవన్ముక్తవిద్వాంసుని నిశ్చయము.

---

లేక జ్ఞానికి విషయములందు సత్యత్వాభిమానము లేనందున, మిథ్యాత్వబుద్ధిజన్యదృఢమైన వైరాగ్యభావమువలనను దృఢరాగము గాజాలదు. ఈయర్థము ముందు షష్ఠతరంగమందు చెప్పఁబడును.

లేక ఖడ్గముమీఁదనుండు దొమ్మరిచిత్తము అగ్రదేశమందు సంలగ్నమైనట్టుగా, లేక పరస్పరవార్తాలాపము చేయుచు నీరుతెచ్చు అమ్మలతలమీఁద జలభాండముపై సంలగ్నచిత్తముగల జ్ఞానియొక్క అంతఃకరణము సామాన్యముగా విషయములందు ప్రవృత్తమైనను విశేషముగా స్వరూపమందు సంలగ్నమగుటవలనను, వాని బాహ్యేంద్రియములు ప్రారబ్ధఫలభూతమైన దర్శనాది క్రియచేతనే కృతార్థమగుటవలనను జ్ఞానికి విషయభోగమందు దృఢరాగము సంభవింపదు.

యద్యపి ప్రారబ్ధముగల జ్ఞానియొక్క మనోరూపగజము విషయాటవియందు కించిద్విక్షేపమును పొందును; వివేకరూప [విషయములందు దోషదృష్టి లేక మిథ్యాత్వదృష్టిరూపమైన] సింహము జాగ్రత్తుగా నుండుటవలన ఆ మనోరూపగజము శీఘ్రముగా విక్షేపమును వదలి, శాంత మగును.

జ్ఞానియొక్కచిత్తమందు దృఢరాగము లేకపోయినను, భోగహేతువైన ప్రారబ్ధముండుటవలన ఆ జ్ఞాని కాకాక్షిన్యాయమున, లేక గంగామగ్నార్ధకాయన్యాయమున ముఖ్యతచే స్వరూపసుఖమందు రమించుచుండఁగా అముఖ్యతచే క్లేశమును పొంది, తీవ్రప్రారబ్ధఫలమును సుఖభోగించి, శిథిల ప్రారబ్ధఫలమును, నిషిద్ధవిషయమును ప్రయత్నముగా విడుచుచున్నాఁడు.

"జ్ఞానియైన పురుషుఁడు యెంవలె సుఖభోగించినను, నిత్యసన్న్యాసి" అను గ్రంథాంతరవచన మున్నది; దానియభిప్రాయము — త్యాగియైనజ్ఞాని

## { 201. లయచింతనము 201—203 సర్వప్రపంచమునకు ఈశ్వరత. }

ఈరీతిగా గోప్యతత్త్వోపదేశము చేయఁబడినను, శిష్యుని ముఖము ప్రసన్నముగామినిజూచి, శ్రీగురు విట్లు తలఁచెను—

---

కైననో, స్త్రీసంగతి ఘటిల్లదు. వానికి ఉపభోగప్రసంగము ఎక్కడ వచ్చును? ఇట్లుండఁగా ఎవ్వఁడేని త్యాగియైనను స్త్రీభోగమందు ప్రవృత్తుఁడగునో, వాఁడు వాంతాశి [వమనభక్షకుఁడు]; వానిని త్యాగి అనఁగూడదు; ఎందుకనఁగా వాఁడు త్యాగివేషధారి నటుఁడుగా నున్నాఁడు. ఇప్పుడు గృహస్థజ్ఞానికి స్త్రీభోగప్రాప్తియయినను, ఘృతభక్షణాభ్యాసికి తైలభక్షణన్యాయమున శాస్త్రమర్యాదవలన ఋతుకాలమందు వాఁడు స్వకీయస్త్రీసంగము చేయుచున్నాఁడు; గాని, అదియును విషయాసక్తివలన చేయఁడు. ఒకానొకగృహస్థుఁడు విషయాసక్తుఁడుండినపుడు వాఁడు వేదాంతవార్తానిపుణుఁడై యుండినను, వానిని జ్ఞాని యనఁగూడదు; ఎందుకనఁగా రాగరూపమైన అజ్ఞానిచిహ్నము వానికిఁ గలదు. [ఇచ్చట స్త్రీవిషయవిచారము ఏది చెప్పఁబడినదో, అది సకలవిషయవిచారమునకును, రాగవిచారము ద్వేషవిచారమునకును ఉపలక్షణ మని తెలియవలెను.]

---

కొన్నిగ్రంథములందు ఈయర్థము వ్రాయఁబడియున్నది; గాని, ఇచ్చట విచారము చేయఁదగినది—ప్రారబ్ధభోగము దుర్నివార మనుట, మరల దానియందు తీవ్రశిథిలములను రెండుతరగతులు చేసి, తీవ్రమునుమాత్రము ఉపభోగించుచు, శిథిలమును విడుచును, అనుట ఒకచమత్కారముగ కనఁబడుచున్నది. భగవంతుఁడైన భాష్యకారుఁడు, జ్ఞాని వ్యవహారమందు వచ్చినపుడు పశువత్తుగా వర్తించుచున్నాఁడని చెప్పుచున్నాఁడు; పైఁజెప్పిన తీవ్రశిథిలప్రారబ్ధముయొక్కయు, రాగవిరాగములయొక్కయు విచారవ్యవస్థ పశువుచేత నగునా? కర్తవ్యబుద్ధిలేనివాఁడైన విద్వాంసుఁడు శిథిలప్రారబ్ధమును, నిషిద్ధవిషయమును విడుచు ప్రయత్నము చేయుచున్నాఁడా?

శిష్యుఁడు కృతార్థుఁడుగా లేఁడు. కృతార్థుఁడయినయెడల వాని [1] ముఖము ప్రసన్నమై యుండును. పిమ్మట శ్రీగురువు స్థూలరీతిగా ఉపదేశము చేయుటకు లయచింతనవిధిని [2] పలుక నారంభించెను—

ఎట్లు మృత్తికాకార్యముయొక్క బాహ్యాంతరమందు మృత్తికయుండుటవలన మృత్తికయొక్క సర్వకార్యములు మృత్తికాస్వరూపమో, తరంగబుద్బుదఫేనాదులు జలకార్యమగుటవలన జలస్వరూపమో, అట్లు దేని కేది కార్యమో, అది దానికారణస్వరూపముకన్న భిన్నము గాదు; మఱేమనఁగా— కారణస్వరూపము. అట్లే సకలప్రపంచమునకు మూలకారణము ఈశ్వరుఁడు; కనుక కార్యమైన సకలప్రపంచము ఈశ్వరునికన్న వేఱుగాదు; మఱేమనఁగా—ఈశ్వరస్వరూపము. ఆయీశ్వరుఁడు నేనుగా నున్నాను.

ఈరీతిగా లయచింతనము నీవు అవలంబింపుము.

---

1. వాంఛితపదార్థప్రాప్తివలన చిత్తచాంచల్యహేతువయిన ఇచ్ఛారూపవృత్తియొక్క నాశరూపనిమిత్తమువలన స్థిరదర్పణమునందువలె అంతర్ముఖోదితమైన సాత్త్వికవృత్తియందు స్వరూపానందముయొక్క ప్రతిబింబమగును. ఆ యానందానుభవముచేత ముఖము ప్రసన్నమగును. శిష్యునకు జ్ఞానద్వారమున వాంఛితమైన అవిద్యానివృత్తిపరమానందప్రాప్తిరూప మోక్షము ఏది గలదో, అది సిద్ధముగా లేదు; కనుక ఇచ్ఛానివృత్తిగామివలన ఆ ప్రతిబింబానందాభావమువలన ముఖము ప్రసన్నముగా లేదు. అప్రసన్నతారూప లింగమువలన ఇష్టవస్తువుయొక్క అప్రాప్తిరూపమైన అకృతార్థతయొక్క అనుమాన మగుచున్నది.

2. కార్యమును కారణరూపమని ఎఱిఁగి, ఏచింతనముగలదో, దానిని లయచింతనమనఁబడును.

## 202 సకలసూక్ష్మసృష్టియొక్క అపంచీకృతత

సకలస్థూలబ్రహ్మాండము పంచీకృతభూతముల కార్యము; అచ్చట ఏది పృథ్వీకార్యమో, అది పృథ్వీరూపము; జలకార్యము జలస్వరూపము; ఈరీతిగా ఏదిఏభూతము యొక్క కార్యమగునో, అది దానియొక్క స్వరూపము. ఈవిధముగా సకలస్థూలబ్రహ్మాండము పంచీకృతభూతస్వరూపముగా నున్నది. అట్లే పంచీకృతభూతములును, అపంచీకృతభూతముల కార్యమగుటవలన అపంచీకృతభూతస్వరూపములుగా నున్నవి; భిన్నములు గావు.

అంతఃకరణాదికమైన సూక్ష్మసృష్టియును అపంచీకృతభూతకార్యమగుటవలన అపంచీకృతభూతస్వరూపముగా నున్నది. దానియందు అంతఃకరణము సకలభూతముల సత్త్వగుణకార్యమగుటవలన సత్త్వగుణస్వరూపము. ప్రాణములు రజోగుణకార్యమగుటవలన రజోగుణస్వరూపములు. అట్లు జ్ఞానేంద్రియములు పృథక్పృథగ్భూతములయొక్క సత్త్వగుణకార్యమగుటవలన ఆయాభూతములయొక్క సత్త్వగుణస్వరూపములు. అట్లే కర్మేంద్రియములు రజోగుణకార్యమగుటవలన ఆయాభూతములయుక్క రజోగుణస్వరూపములు.

ఈరీతిగా సకలసూక్ష్మసృష్టి అపంచీకృతభూతస్వరూపమని తెలియవలెను.

## 203. బ్రహ్మాంబునందు సకలపదార్థములయొక్క లయచింతనము

ఈచింతనము చేసి, అపంచీకృతభూతములయొక్కయు లయచింతనము చేయవలయును—పృథ్వీజలకార్యమగుటవలన

జలస్వరూపము. అట్లే జలము, తేజస్సు, వాయువు తమతమ కారణపరంపరవలన ఆకాశస్వరూపములుగాను, ఆకాశాకాశ మును, తమోగుణప్రధానప్రకృతికార్యమగుటవలన ప్రకృతి స్వరూపముగాను ఉన్నది. ఆప్రకృతి మాయయొక్క అవస్థా విశేషముగుటవలన మాయారూపముగా నున్నది. ఏలయన— ఒకవస్తువునకు ప్రధానము, ప్రకృతి, మాయ, అవిద్య, అజ్ఞా నము, శక్తి యని పేరు—

(1) సర్వకార్యములు తనయందు లయము చేసికొని, ప్రలయమందుండు ఉదాసీనస్వరూపమును ప్రధాన మందురు.

(2) సృష్టికి ఉపాదానయోగ్యమయిన తమోగుణప్రధాన స్వరూపమును [1] ప్రకృతి యందురు.

(3) ఎట్లు దేశకాలాదిసామగ్రి లేక దుర్ఘటపదార్థమును ఇంద్రజాలము పుట్టించునో, [లోకములో ఇంద్ర జాలమును మాయయందురు.]అట్లు అసంగాద్వితీయ బ్రహ్మంబునందు దుర్ఘటములైన ఇచ్ఛాదులను పుట్టించుటవలన మాయ యందురు.

(4) స్వరూపము నాచ్ఛాదించుటవలన అజ్ఞాన మందురు.

---

1. "ప్ర, కృతి" అనఁగా దేనిప్రకర్షముచే సర్వజగత్తు చేయఁ బడునో; ఇట్టిమేని సృష్టికి ఉపాదానకారణమయిన శక్తి గలదో అది, ప్రకృతి. లేక "ప్ర" అనఁగా సత్త్వగుణము, "కృ" రజోగుణము, వీనిఁ గూడిన "తి" తమోగుణము ఇట్టి యే తమోగుణప్రధానశక్తిగలదో, అది ప్రకృతి యనఁబడును.

(5) బ్రహ్మవిద్యవలన నశించును; కాఁబట్టి అవిద్య యందురు.

(6) ఎప్పుడును స్వతంత్రముగా నుండదు; చైతన్యాశ్రితమై యుండును; అందువలన శక్తి[1] యందురు.

ఈరీతిగా ప్రకృత్యాదులు ప్రధానమునకే యుపభేదములు; కనుక నవి ప్రధానరూపములుగానున్నవి. ఆప్రధానము బ్రహ్మచైతన్యముయొక్క శక్తిగానున్నది. ఎట్లు పురుషునియందు సామర్థ్యరూపమైనశక్తి పురుషునికన్న భిన్నము గాదో, అట్లు చైతన్యమందు ప్రధానరూపమైనశక్తి చైతన్యముకన్న భిన్నము గాదు; మఱేమనఁగా—చైతన్యస్వరూపముగానె యున్నది.

ఈప్రకారముగా సకలానాత్మపదార్థములకు బ్రహ్మంబునందు లయచింతనము చేసికొని, ఆయద్వయబ్రహ్మము నేన ని చింతనము చేయవలయును.

---

1. బ్రహ్మశక్తి బ్రహ్మముకన్న భిన్న మనిన, అద్వైతశ్రుతికి విరోధమగును; అభిన్న మనిన, అది బ్రహ్మరూపమగుటవలన బ్రహ్మముకన్న భిన్నమని యింకొక్క శక్తి యనుట వ్యర్థ మగును. కనుక శక్తికి బ్రహ్మముతో భేదాభేదములు రెండును చెప్పవలసివచ్చును; భేదాభేదములో, పరస్పరవిరుద్ధములగుటవలన తమఃప్రకాశములవలె ఏకాశ్రయమందుండదు; కాఁబట్టి శక్తికి బ్రహ్మముతో రజ్జుసర్పసంబంధమువలె కల్పితభేదమై వాస్తవాభేదరూపమైన [అనిర్వచనీయమైన] తాదాత్మ్యసంబంధము సిద్ధమగును. ఏప్రమాణముచేతను భిన్నప్రతీతియొక్క అభావము దోఁచుటవలన ఆశక్తి బ్రహ్మముకన్న భిన్నము గాదు. మఱేమనఁగా—ఎట్లు కల్పితసర్పము పరమార్థముచే రజ్జురూపమగునో అట్లు శక్తియును పరమార్థముచే బ్రహ్మరూపముగా నున్నది.

## 204. ధ్యానజ్ఞానాంతర్భేదము, అహంగ్రహధ్యానము.

ఎవనికి మహావాక్యవిచారము చేసియు,బుద్ధిమాంద్యాదులందు [1] ఏదో ఒక ప్రతిబంధమువలన అపరోక్షజ్ఞానము గానేరదో, వానికి ఇచ్చట లయచింతనరూపధ్యానము చెప్పఁబడినది.

ధ్యానమునకును, జ్ఞానమునకును ఇట్టి భేదము గలదు— జ్ఞానమో, [2] ప్రమాణప్రమేయములకధీనము; విధినిషేధాదుల

---

1. ఇచ్చట 'ఆది' శబ్దముచే బుద్ధిమాంద్యసహవర్తియైన విషయాసక్తి, కుతర్కము, విపర్యయదురాగ్రహము ఈ త్రివిధమైన వర్తమానప్రతిబంధకములయొక్కయు; మఱియు ధనపుత్రాదిప్రియవస్తునాశము వలనైనను తదనుసంధాన [అనుస్మరణ] రూపమగు భూతప్రతిబంధకముయొక్కయు; మఱియు బ్రహ్మలోకేచ్ఛ, లేక జన్మాంతరహేతువగు శేషప్రారబ్ధరూపమగు భవిష్యత్ప్రతిబంధకముయొక్కయు గ్రహణము చేయవలయును. [ఈప్రతిబంధకనివారణము పంచదశిలో ధ్యానదీపమందును, పదార్థమంజూషయందు చేయఁబడుచున్నది.]

2. ఇచ్చట ఈరహస్యము గలదు—భ్రాంతిజ్ఞానము, స్మృతిజ్ఞానము, ప్రమాజ్ఞానము ఈభేదములవలన జ్ఞానము త్రివిధము. వీనిలో—

భ్రాంతిజ్ఞానము కేవలవస్తువునకు [భ్రమరూపవిషయమునకు] అధీనముగానున్నది. స్మృతిజ్ఞానమో, తనవిషయముతో సదృశవస్తుజ్ఞానముచేత, లేక తత్సంబంధమైన విషయజ్ఞానముచేత, లేక తనవిషయము [పూర్వదృష్టవస్తువు] యొక్క చింతనముచేత ఉదయమైన పూర్వదృష్టవస్తువుయొక్క మనోమయాకారమునకు అధీనముగా నున్నది. మఱియు ప్రమాజ్ఞానాంతర్గతమైన సుఖాదికముయొక్క జ్ఞానమైననో, న్యాయమతమందు, వాచస్పతిమతమందు మనోరూపప్రమాణమునకు, మఱియు సుఖాదిరూపప్రమేయమునకు అధీనముగా నున్నది. అయిన వేదాంతమందు మనస్సునకు ప్రమాణతయొక్క అసంగీకా

కధీనముగాదు. ధ్యానమో, విధి, పురుషేచ్ఛ, విశ్వాసము, హారము వీనికి అధీనముగా నున్నది. ఎట్లనఁగా—

---

రముపలన సుఖాదికముయొక్క జ్ఞానము కేవలజ్ఞేయమైన సుఖాదివస్తువునకు అధీనముగా నున్నది.

మఱియుం తదితరమయిన ఏప్రమాజ్ఞానము కలదో, అది ప్రత్యక్షాను మానాదిప్రమాణములయొక్కయుం, ప్రమేయరూపవస్తువుయొక్కయుం వీసం బంధము కలదో, దానికధీనముగా నున్నది. వీనిలో—శబ్దప్రమాణజన్యమగు బ్రహ్మజ్ఞానరూపమయిన ఏ శాబ్దిప్రమ గలదో, అది మహావాక్యరూపశబ్ద ప్రమాణముయొక్క, మఱియుం ప్రత్యగభిన్నబ్రహ్మరూపప్రమేయముయొక్క లక్షణావృత్తిరూపమయిన ఏపరంపరాసంబంధముగలదో, తద్జ్ఞానమునకు అధీనముగా నున్నది. మఱియుం ఇతరమైన లౌకికపదార్థముయొక్క శాబ్దిప్రమారూపమయిన ఏజ్ఞానము గలదో, అది కొన్నిచోట్ల శక్తివృత్తిరూప సంబంధజ్ఞానమునకు అధీనముగాను, కొన్నిచోట్ల లక్షణావృత్తిరూపసంబంధ జ్ఞానమునకు అధీనముగాను ఉన్నది.

ఈరీతిగా కొంతజ్ఞానము జ్ఞేయరూపవస్తుమాత్రాధీనము, కొంతజ్ఞానము ప్రమాణప్రమేయరూపవస్తుసంబంధాధీనము, లేక తత్సంబంధజ్ఞానమునకు అధీనము.

భ్రమప్రమాసాధారణజ్ఞానముయొక్క విషయమును జ్ఞేయ మందురు; వానిలో కేవలప్రమాజ్ఞానముయొక్క విషయమును ప్రమేయ మందురు; దానిలో జ్ఞేయత్వమును గలదు; అయినను జ్ఞేయపదార్థమునందు నియమముచే ప్రమేయత్వము గలుగదు. అనఁగా కొన్నిచోట్లఁ గలుగుచు; కొన్నిచోట్లఁ గలుగదు.

ఇచ్చట. వస్తుశబ్దము చేత ఈశ్వరరచితపదార్థము, లేక మనోమయ పదార్థము, [పరోక్షజ్ఞానముయొక్కవిషయము] లేక భ్రమరూపపదార్థము,

ప్రత్యక్షజ్ఞానమందు [1] ప్రమాణము నేత్రము; ప్రమేయము ఘటాదికము; అచ్చట నేత్రమునకును ఘటమునకును సంబంధమైనప్పుడే పురుషేచ్ఛ లేకయును ఘటముయొక్క ప్రత్యక్షజ్ఞానమగును. చూడు— భాద్రపదశుద్ధచతుర్థినాడు చంద్రదర్శనముయొక్క నిషేధము గలదు; విధి లేదు; మఱి ఏ పురుషునకు "నాకు నేఁడు చంద్రదర్శనము గాకూడదు." అని ఇచ్ఛయును గలదు; అయినను ఏరీతిగానో నేత్రరూపప్రమాణమునకు

---

లేక శక్తసవార్థనులతోడ వృత్తియొక్క సంబంధము, వీరియొక్క గ్రహణము గలదు. ఆవృత్తిసంబంధము సాక్షాత్తుగాని, లేక ప్రమాణద్వారమునగాని.

ఈరీతిగా జ్ఞానము విధ్యాదికములకు అధీనము గాదు; మఱియు ధ్యానము వస్తువుయొక్క అధీనము గాదు; మఱేమనఁగా— కర్తామలకు అధీనముగ నున్నది. ధ్యానము మనస్సుయొక్క వృత్తిరూపము, ఆవృత్తి పురుషుని ఇచ్ఛాధీనముగ నున్నది; వస్త్వధీనము గాదు; కాఁబట్టి ధ్యానము మానసజ్ఞానము గాదు; మఱేమనఁగా— మానసక్రియారూపముగ నున్నది.

1. బ్రహ్మముయొక్క ప్రత్యక్షజ్ఞానప్రసంగమందు 'ప్రత్యగభిన్నబ్రహ్మము ప్రమేయము, మహావాక్యమే ప్రమాణము; ప్రమాతయైనశిష్యుఁడు ప్రమాణమైన మహావాక్యమును గురుముఖద్వారమున శ్రవణముచేయుటవలన ఆప్రమాణముచే ప్రమేయమయిన బ్రహ్మమును విషయముచేసి, సాక్షాత్కారజ్ఞానమును పొందుచున్నాఁడు; దానియందు విధిమొదలయిన వానియొక్క అపేక్ష లేదు. మహావాక్యరూపప్రమాణములేక కేవలము జిజ్ఞాసువుయొక్క ఇచ్ఛవలననైనను, పాఠమువలననైనను, గురువునందు విశ్వాసముననైనను జ్ఞానోదయము కలుగదు. మఱియు ఉపాసనమయినచో, విధిమొదలయిన వానిని అపేక్షించుచున్నది; విధ్యాదికములేక ఉపాసన గానేరదు. జ్ఞానోపాసనలయందు పరస్పరము ఇంతభేదము గలదు.

ప్రమేయమైన చంద్రునితో సంబంధమయినట్టయిన చంద్రుని యొక్క ప్రత్యక్షజ్ఞానము అవశ్యముగా నగుచున్నది. ఈరీతిగా జ్ఞానము ప్రమాణప్రమేయములకధీనముగా నున్నది. విధీచ్ఛాదుల కధీనము కాదు.

సాలగ్రామము విష్ణురూపముగా నున్నది; ఇట్లు ధ్యానము చేసినవానికి ఉత్తమఫలప్రాప్తి యగును; ఇచ్చట శాస్త్రప్రమాణమువలననైననో, విష్ణువు చతుర్భుజమూర్తి శంఖ చక్రగదాపద్మలక్ష్మీసహితుఁడని యెఱుఁగఁబడును; మఱియు నేత్ర ప్రమాణమువలన సాలగ్రామము శిలగా నెఱుఁగఁబడును. అట్లయినను విధివిశ్వాసాదికమువలన సాలగ్రామము విష్ణు వని ధ్యానమగుచున్నది.

ఆధ్యానము నానాప్రకారములు—కొన్నిస్థలములందు అన్యరూపముచే అన్యవస్తువును ధ్యానింతురు. ఎట్లనఁగా— సాలగ్రామమును విష్ణురూపముగా ధ్యానింతురు. దీనిని ప్రతీక ధ్యానమందురు. మఱియు కొన్నిస్థలములందు వైకుంఠలోక వాసియైన విష్ణువును శంఖచక్రాదిసహితముగ చతుర్భుజమూర్తి రూపముగా ధ్యానింతురు. దానిని ధ్యేయానుసారధ్యాన మం దురు. అచ్చట అన్యరూపముచేత అన్యముయొక్క ధ్యానము లేదు; ఏలయన—వైకుంఠవాసియగు విష్ణుస్వరూపమో, ప్రత్యక్షముగా లేదు; కేవలశాస్త్రమువలన తెలియఁదగినది; శాస్త్రముచేతనో, శంఖచక్రాదిసహితముగా విష్ణుస్వరూపము చెప్పఁబడియున్నది.

విధివిశ్వాసేచ్ఛాధీనములు లేక ధ్యానము గానేరదు. చూడుము—

(1) ఇచ్ఛట "ఈరీతిగా ఉపాసన చేయవలయును." ఇట్టి పురుషుని ప్రేరేపించు వేదవచనరూపమగు విధి కావలెను.

(2) తద్వచనమందలి శ్రద్ధారూపమగు విశ్వాసము కావలెను.

(3) అంతఃకరణముయొక్క కామనారూపమయిన రజోగుణవృత్తిరూపమగు ఇచ్ఛ కావలెను.

(4) ధ్యానమందు వృత్తిస్థిరము చేయునట్టి ఆగ్రహరూపమగు హఠము కావలెను. [నిరంతరము ధ్యేయాకారమైన చిత్తవృత్తిని ధ్యానమందురు; వృత్తియందు విక్షేపము కలుగునపుడు హఠముచే చిత్తవృత్తి స్థిరము చేయవలసినది; కావున ధ్యానమునందు హఠాపేక్ష గలదు. జ్ఞానరూపాంతఃకరణవృత్తివలన తత్కాలము ఆవరణభంగమైనవెనుక వృత్తిస్థితియొక్క ఆవశ్యకత లేదు; కావున జ్ఞానమందు హఠాపేక్ష లేదు.]

ఇవి నాల్గుహేతువులు ధ్యానమునందుఁ గలవు; జ్ఞానమునందు లేవు.

వైకుంఠవాసి చతుర్భుజవిష్ణుధ్యానన్యాయమున "నేను బ్రహ్మము" ఈధ్యానమును ధ్యేయానుసారముగా నున్నది; ప్రతీకముగాదు. అయినను ఇది అహంగ్రహధ్యానముగా నున్నది. [ధ్యేయస్వరూపమునకు తనస్వరూపముతో అభేదచింతనమును అహంగ్రహధ్యాన మందురు.] ఏపురుషునకు బుద్ధిమాంద్యాది దోషప్రతిబంధమువలన అపరోక్షజ్ఞానము గానే

రదో, వాఁడు వేదాజ్ఞానుసారవిధియందు విశ్వాసముంచి, హర్షముచే నిరంతరము "నేను బ్రహ్మము" అను వృత్తిస్థితిరూపముగా అహంగ్రహాధ్యానము చేసినయెడ[1] వానికిని జ్ఞానద్వారమున మోక్షప్రాప్తి యగును.

## 205. ప్రణవముయొక్క ఉపాసన

మఱియొకతీరున అహంగ్రహోపాసన చెప్పుచున్నాము-ఓశిష్యుఁడ! ప్రణవరూపముయొక్క యనఁగా ఓంకారస్వరూపముయొక్క అహంగ్రహాధ్యానము మాండూక్యప్రశ్నాది శ్రుత్యనుసారముగ సురేశ్వరాచార్యులచేత చెప్పఁబడియున్నది; అది నీవు చేయుము. తత్సంక్షేపప్రకార మిట్లున్నది—"ప్రణవాక్షరము బ్రహ్మస్వరూపము; ఆప్రణవరూపబ్రహ్మము నేను"

1. ఎట్లు సంవాదిభ్రాంతిచేత ప్రవృత్తుఁడైనపురుషునకు యథార్థజ్ఞానద్వారమున ఇష్టవస్తువుయొక్క లాభ మగునో, అట్లు "నేను బ్రహ్మము" అను నీవృత్తియొక్క స్థితిరూపమయిన అహంగ్రహధ్యానము చేయువానికిని జ్ఞానద్వారమున మోక్షప్రాప్తి యగును. యద్యపి ఇచ్చట ధ్యానవిషయమయిన వి బ్రహ్మముగలదో, అది పరమార్థరూపముగాదు; మనఃకల్పిత మగుటచే భ్రమరూపము; కనుక దానిని విషయముచేయుంపట్టి వృత్తిరూపజ్ఞానమును భ్రాంతిజ్ఞాన మేయగును; యదార్థజ్ఞానము గాదు; తథాపి మణిప్రభయందు మణిబుద్ధిరూపమగు సంవాదిభ్రాంతి చేసుకొని, దానియొద్దకుఁ బయిగెత్తుపురుషునకు మణిజ్ఞానముద్వారమున మణిప్రాప్తివలె ఉక్తమగుధ్యానద్వారమున బ్రహ్మజ్ఞానమయి, మోక్షప్రాప్తియగును. సంవాదిభ్రమవర్ణనము పంచదశిధ్యానదీపారంభమందు వ్రాయఁబడినది.

"దీపప్రభామణిభ్రాంతిర్విసంవాదిభ్రమో మతః,
మణిప్రభామణిభ్రాంతిస్సంవాదిభ్రమ ఉచ్యతే!"

ఈరీతిగా క్షణమాత్రము అంతరాయరహితముగ వృత్తిని ధరించుటయు. దీనికిసమానము అన్యధ్యానము లేదు. ఈ ధ్యానముయొక్క విశేషప్రకారము సురేశ్వరకృతపంచీకరణ చతుర్థపాదమందు స్పష్టముగ చెప్పఁబడినది.

### 206. నిర్గుణసగుణోపాసనలయొక్క ఫలసహితకథనము

ప్రణవోపాసన అనేకోపనిషత్తులందుండినను, మాండూక్యమునందు [1]విశేషముగా నున్నది. తద్వ్యాఖ్యానమందు భాష్యకారులచేతను, ఆనందగిరిచేతను తద్రీతి స్పష్టముగా వ్రాయఁబడియున్నది. ఆ రీతియే వార్తికకారునిచేత పంచీకరణమందు వ్రాయఁబడియున్నది. అట్లయినను తద్గ్రంథవిచారమందు ఎవనిబుద్ధి సమర్థముగాదో, వానికొఱకు ఆయుపాసనప్రకారము మేము వ్రాయుచున్నాము—

రెండుప్రకారములచేత ప్రణవచింతనము ఉపనిషత్తులందు చెప్పఁబడియున్నది— మొదటిది పరబ్రహ్మరూపమున, రెండవది అపరబ్రహ్మరూపమున. [నిర్గుణబ్రహ్మమును పరబ్రహ్మమందురు; సగుణబ్రహ్మమును అపరబ్రహ్మమందురు] పరబ్రహ్మరూపమున ప్రణవచింతనము చేయువానికి మోక్షప్రాప్తి యగును; అపరబ్రహ్మరూపమున చేయువానికి బ్రహ్మలోకప్రాప్తి యగును.

ఈరీతిగా నిర్గుణసగుణభేదమువలన ప్రణవోపాసన ద్వివిధము.

---

1. ఇచ్చట "మాండూక్య" శబ్దముచేత గౌడపాదాచార్యకృత మాండూక్యోపనిషత్కారికలకును గ్రహణము గలదు.

## 207. నిర్గుణప్రణవోపాసనప్రకారము

ఎవనికి బ్రహ్మలోక కామన ఉండునో, వానికి నిర్గుణోపాసన చేసియు, కామనారూప ప్రతిబంధకమువలన మోక్షహేతు జ్ఞానము గానేరదు; కనుక మోక్షము గానేరదు; బ్రహ్మలోకము ప్రాప్తమగును.

అచ్చట హిరణ్యగర్భునితో సమానముగా భోగముల నుపభోగించి, తరువాత జ్ఞానద్వారమున మోక్షము పొందును. ఎవ్వనికి బ్రహ్మలోకకామన లేదో, వానికి ఈలోకమందే జ్ఞానమయి మోక్షమగును. ఈరీతిగా సగుణోపాసనా ఫలము నిర్గుణోపాసనాఫలమునందు అంతర్భూతముగా నున్నది; కాబట్టి నిర్గుణోపాసనప్రకారము చెప్పుచున్నాము—

కారణకార్యరూపమైన ఏప్రపంచము గలదో, అది ఓంకారరూప మగుటవలన సర్వస్వరూపము ఓంకారము. సర్వపదార్థములందు నామము, రూపము ఇవి రెండుభాగములు; అచ్చట రూపభాగము నామభాగముకన్న వేఱుగాదు; ఏలయన—పదార్థముయొక్క రూపము అనఁగా ఆకారము నామనిరూపణద్వారమున గ్రహణమును, లేక త్యాగమును పొందును; నామమెఱుఁగక కేవలాకారమువలన వ్యవహారసిద్ధి కానేరదు; కనుక నామమే సారము. ఘటనాశానంతరము మృత్తిక శేషముగా నుండును; అచ్చట ఘటము మృత్తికకన్న వేఱుగాదు. అట్లు పదార్థాకారము నశించిన వెనుక శేషించిన నామముకన్న ఆకారము వేఱుగాదు; మఱేమనఁగా—నామరూపముగానే యున్నది.

లేక ఎట్లు ఘటశరావాదికములు [1] పరస్పరవ్యభిచారు లగుటవలన మిథ్యయో, మఱియు వీనియందనుగతమైన మృత్తిక [2] సత్యమో, అట్లు ఘటాకారములు అనేకము లుండినను, అవి పరస్పరవ్యభిచారు లగుటవలన మిథ్య; సర్వాకారములందుండు నట్టి ఘటమనుపేరు ఒకటి సత్యము [3]. ఆ సత్యనామముకంటె మిథ్యయైన ఆకారములు వేఱుగావు; అవి నామస్వరూపములే.

ఈరీతిగా సర్వపదార్థముల ఆకారము తనతననామము కన్న వేఱుగాదు; మఱి యాసకలనామములు ఓంకారముకన్న భిన్నములుగావు. ఏలయన— వాచకశబ్దములను నామములందురు; లౌకికవైదికసకలశబ్దములు ఓంకారమువలన ఉత్పన్నములయిన వని శ్రుతియందు ప్రసిద్ధము. కార్యమో, కారణస్వరూపముగా నుండును; కనుక ఓంకారకార్యమైనట్టి వాచకశబ్దరూపములైన నామములు అన్నియు ఓంకారస్వరూపములుగా నున్నవి. పూర్వము చెప్పినరీతిగా ఆకారము నామస్వరూపము; సర్వనామములు ఓంకారస్వరూపము; కనుక సర్వపదార్థములును ఓంకారరూపములుగా నున్నవి.

### 208. ఓంకారమునకును బ్రహ్మమునకును అభేదము

ఎట్లు సర్వస్వరూపము ఓంకారమో, అట్లు సర్వస్వరూ

1. కుండ మొదలైనవి.

2. ఘటశరావాదికములయొక్క అపేక్షవలన మృత్తిక చిరకాలస్థాయి యగుటవలన దీనిని ఆపేక్షికసత్య మందురు.

3. ఘటాపేక్షవలన "ఘటము" అను రెండక్షరములుగల పేరు బహుకాలస్థాయిగానున్నది. ఎట్లు దేవతలు మృత్యుగ్రస్తులైనను బహుకాలస్థాయు లగుటచే అమరులనఁబడుదురో, అట్లు ఘటనామమును సత్యము [నిత్యము] అనఁబడును.

పము బ్రహ్మము; కనుక ఓంకారము బ్రహ్మరూపము. లేక ఓంకారము బ్రహ్మమునకు వాచకము; బ్రహ్మము వాచ్యము; వాచ్యవాచకములకు అభేద మగుటవలనను, ఓంకారము బ్రహ్మరూపముగా నున్నది. విచారదృష్టివలననో, ఓమ్ అక్షరము బ్రహ్మంబునందు అధ్యస్తము; బ్రహ్మము దీనికి అధిష్ఠానము; అధ్యస్తముయొక్క స్వరూపము అధిష్ఠానమునకన్న వేఱుగాదు; కాబట్టి ఓంకారము బ్రహ్మరూపమని ఎఱిఁగి, చింతనము చేయవలయును.

### 209. పాదచతుష్టయ[1] కథనపూర్వకముగా ఆత్మకు బ్రహ్మముతో విశ్వునితో విరాట్టుతో అభేదము.

ఆ బ్రహ్మరూపమైన ఓంకారమునకు ఆత్మతో అభేదచింతనము చేయవలెను; ఏలయన—ఆత్మకు బ్రహ్మముతో ముఖ్యాభేదము—బ్రహ్మమునకు నాలుగు పాదములు ఎట్లున్నవో, అట్లు ఆత్మకును నాలుగుపాదము లున్నవి. విరాట్టు, హిరణ్యగర్భుఁడు, అంతర్యామి, [ఈశ్వరుఁడు] తత్పదలక్ష్యమైన ఈశ్వరసాక్షి [మాయోపహితచైతన్యము]. ఈనాలుగుపాదములు బ్రహ్మవిగాను, విశ్వుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు, త్వంపదలక్ష్యమైన జీవసాక్షి [తురీయుఁడు] ఈనాలుగుపాదములు ఆత్మవిగాను ఉన్నవి.

సమష్టి స్థూలప్రపంచసహితచైతన్యమును విరాట్టందురు. వ్యష్టిస్థూలాభిమానిని విశ్వుఁ డందురు. విరాట్టుయొక్కయు,

1. ఇచ్చట "పాద" శబ్దము ధాన్యముయొక్క పాదమువలె విభాగరూపార్థమును బోధించును; గోవుపాదమువలె అవయవ [అంగ] రూపార్థబోధకము గాదు.

విశ్వునియొక్కయు ఉపాధి స్థూలమగుటవలన విశ్వుఁడు విరాట్ప్రూపముగా నున్నాఁడు; ఆ విరాట్ప్రూపవిశ్వునకు ఏడు అంగము లున్నవి—

1. స్వర్గలోకము మూర్ధము, 2. సూర్యుఁడు నేత్రము, 3. వాయువు ప్రాణము, 4. ఆకాశము కటిమైన కధోభాగము, 5. సముద్రాదిజలము మూత్రస్థానము, 6. పృథ్వి పాదము, 7. హోమాగ్ని ముఖము.

[యద్యపి మాండూక్యమందు స్వర్గాదికములు విరాడంగములని చెప్పఁబడియున్నవి; విశ్వాంగములని చెప్పలేదు; తథాపి ఆ విరాట్టునకు, విశ్వునకు అభేదమగుటవలన ఆ యంగములు ఇచ్చట విశ్వునకును చెప్పఁబడియున్నవి].

అట్లు విరాట్టయినవిశ్వునకు పందొమ్మిదిముఖములు గలవు—పంచప్రాణములు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, అంతఃకరణచతుష్టయము ఈ పందొమ్మిది ముఖ్యముమున భోగసాధనమగుటవలన వానిని ముఖములందురు. ఈపందొమ్మిదిముఖములచే స్థూలశబ్దాదివిషయములను బాహ్యవృత్తిద్వారమున జాగ్రదవస్థయందు భోగముచేయును; కనుక విరాట్ప్రూపవిశ్వుఁడు స్థూలమునకు భోక్త, మఱియు [1] బాహ్యవృత్తి యందురు. జాగ్రదవస్థగలవాఁడనియు అందురు. [2]

---

1. బహిఃప్రజ్ఞ.

2. బహుశబ్దసంగ్రహమైన టిప్పణము.

సకలజీవులకు కర్మానుసారముగా ఫలమును ఇచ్చుటవలన ఈశ్వరుఁడని పేరు; సకలసూక్ష్మశరీరమందు నేననునట్టి అభిమానియైనచైతన్యమునకు పేరు హిరణ్యగర్భుఁడు. సకలప్రాణులశరీరమందు "నేను నేను" అనెడి అభిమానమును

## 210. చతుర్దశ త్రిపుటి

ప్రాణాదికములయిన పందొమ్మిది భోగసాధనములందు పంచప్రాణములను విడిచి, అవశేషమైన ఇంద్రియాంతఃకరణాదులయిన చతుర్దశముఖములు తమతమవిషయములయొక్కయు, తమతమ దేవతలయొక్కయు సాహాయ్యము గోరుచున్నవి. దేవతావిషయసాహాయ్యము లేక కేవలముఖములచేతభోగముగానేరదు. మూఁడుపదార్థములసముదాయమును త్రిపుటి యందురు. ఆ త్రిపుటి—

| అధ్యాత్మము | అధిభూతము | అధిదైవతము |
|---|---|---|
| 1. శ్రోత్రేంద్రియము | శబ్దము | దిగ్దేవత |
| 2. త్వగింద్రియము | స్పర్శము | వాయువు |
| 3. నేత్రేంద్రియము | రూపము | సూర్యుఁడు |
| 4. రసనేంద్రియము | రసము | వరుణుఁడు |
| 5. ఘ్రాణేంద్రియము | గంధము | అశ్వి దేవతలు లేక పృథ్వి |

ధరించుటవలన ఈశ్వరుని వైశ్వానరుఁడని చెప్పుదురు. ఈవైశ్వానరుఁడు అనేకవిధములుగా ప్రతీతుఁడగుటవలన వానిని విరాట్టు అని చెప్పుదురు.

ప్ర+అజ్ఞ=ప్రాజ్ఞ సుషుప్తియందు స్వప్రకాశమైన ఆత్మానందము అజ్ఞానవృత్తి కూడియుండుటవలన సుషుప్త్యభిమానియైన జీవునికి ప్రాజ్ఞుఁడని పేరు.

తేజశ్శబ్ద వాచ్యమైన అంతఃకరణముతోను, ప్రాణేంద్రియములతోను గూడియుండు స్వప్నాభిమానియైన జీవునికి తైజసుఁడని పేరు.

సూక్ష్మదేహముయొక్క అభిమానమును విడనాడక స్థూలదేహమందు "నేను నేను" అనెడి అభిమానమును స్వీకరించుటవలన జాగ్రదభిమానియయిన జీవునికి విశ్వుఁ డని పేరు.

| | | | |
|---|---|---|---|
| 6. | వాగింద్రియము | వచనము [1] | అగ్ని |
| 7. | హస్తేంద్రియము | దానపరిగ్రహములు- | ఇంద్రుఁడు[మనుఁడు |
| 8. | పాదేంద్రియము | గమనము | ఉపేంద్రుఁడు లేక వా |
| 9. | ఉపస్థేంద్రియము | గ్రామ్యధర్మము | ప్రజాపతి |
| 10. | గుదేంద్రియము | మలోత్సర్గము | యముఁడు లేక నిరృతి |
| 11. | మనస్సు | మననవిషయము | చంద్రుఁడు |
| 12. | బుద్ధి | బోద్ధవ్యవి॥ | బృహస్పతి లేక బ్రహ్మ |
| 13. | చిత్తము | చింతనవి॥ | క్షేత్రజ్ఞుఁడు లేకసాక్షి [2] |
| 14. | అహంకారము | అహంకారవిషయము | రుద్రుఁడు |

ఈచతుర్దశత్రిపుటులును పంచప్రాణములును కూడి పందొమ్మిది విరాడ్రూపవిశ్వునకు ముఖములు.

### 211. విశ్వవిరాడకారములకభేదము

విరాడ్విశ్వాభేదమువలె ఓంకారముయొక్క ప్రథమమాత్రయైన అకారమునకును విరాడ్రూపవిశ్వునకును అభేదము

---

1. వచనక్రియయొక్క విషయమును వక్తవ్య మందురు. అది వచనక్రియాద్వారమున వాగింద్రియమునకు అధిభూతముగా నున్నది. ఆప్రకారముగా ఏయే ఇంద్రియములకు, ఏయేవిషయము గలదో, ఆయావిషయము ఆయాయింద్రియములకు తమతమక్రియాద్వారమున అధిభూతముగా నున్నది. ఒక్కొక్కచోట వచనాదిక్రియను అధిభూత మందురు; అది స్థూలదృష్టి జనుల బోధార్థమే.

2. సాక్షిచైతన్యము చిత్తమునకు ఆశ్రయమగుటవలన దానిని చిత్తమునకు అధిదైవతమందురు. అందువలననె కొందఱు ఆచార్యులు చింతనయొక్క స్మృతిజ్ఞానము సాక్షికాశ్రితమందురు. కొన్నిచోట్ల చిత్తమును వసుదేవుఁ డందురు; మఱియుం చిత్తమును అధిదైవతము వాసుదేవుఁ డందురు.

గలదు; ఏలయన—బ్రహ్మముయొక్క నాల్గుపాదములలో ప్రథమపాదము విరాట్టు, ఆత్మయొక్క నాలుగుపాదములలో ప్రథమపాదము విశ్వుఁడు; అట్లు ఓంకారముయొక్క మాత్రారూపములయిన నాలుగుపాదములందు ప్రథమపాదము అకారము. ఈప్రకారముగా ప్రథమత మూఁడింటియందు సమాన ధర్మ మగుటవలన విశ్వవిరాడకారములకు అభేదచింతనము చేయావలయును.

## —॰ 212. విశ్వతైజసులయొక్క పరస్పరవిలక్షణత ॰—

ఏసప్తాంగములు, పందొమ్మిదిముఖములు విశ్వునకుచెప్పితిమో, అవి తైజసునకును గలవని తెలియవలెను; అయిన ఇన్ని భేదములు గలవు—విశ్వునియొక్క అంగముఖములు ఈశ్వర రచితములు, బాహ్యములు; తైజసునియొక్క అంగముఖంబులు జీవరచితములు; [మనోమయములు] విశ్వునియొక్క భోగము స్థూలము, తైజసునిభోగము సూక్ష్మము.

యద్యపి భోగమనఁగా సుఖదుఃఖములయొక్క జ్ఞానము; కాఁబట్టి దానియందు స్థూలతాసూక్ష్మతలు ఘటిల్లవు; తథాపి బాహ్యమైన శబ్దాదివిషయసంబంధమువలన ఏ సుఖదుఃఖముల సాక్షాత్కారము గలదో, దానిని స్థూలమందురు; మానసికమైన శబ్దాదులసంబంధమువలన ఏ భోగ మగునో దానిని సూక్ష్మమందురు.

అట్లు విశ్వునిబుద్ధి బాహిరము పోవును; తైజసునిబుద్ధి పోదు; ఈకారణమువలన విశ్వుఁడు స్థూలమునకు భోక్త యని బహిఃప్రజ్ఞుఁడని, తైజసుఁడు సూక్ష్మమునకు భోక్త యని అంతఃప్రజ్ఞుఁ డని శ్రుతియందు చెప్పఁబడినది.

### 213. తైజసహిరణ్యగర్భోకారముల కభేదము

పూర్వపద్ధతిగా తైజసుఁడు, హిరణ్యగర్భుఁడు, ఉకారము ఈమూఁడింటిని ఏకరూప మని తెలియుము; ఏలయన—ఆత్మ యొక్క ద్వితీయపాదము తైజసుఁడు; బ్రహ్మమునకు ద్వితీయ పాదము హిరణ్యగర్భుఁడు; ఓంకారమునకు ద్వితీయపాదము ఉకారము. ద్వితీయత మూఁడింటియందు సమానధర్మముగా నున్నది.

### 214. ప్రాజ్ఞేశ్వరమకారములకు అభేదము [1]

ప్రాజ్ఞుఁడు, ఈశ్వరుఁడు, మకారము ఈ మూఁడును ఏక రూప మని యెఱుంగుము; ఏలయన—ప్రాజ్ఞుఁడు ఆత్మకు తృతీ యపాదము; ఈశ్వరుఁడు బ్రహ్మమునకు తృతీయపాదము; మకా రము ఓంకారమునకు తృతీయపాదము; తృతీయత మూఁడింటి యందు సమానధర్మముగా నున్నది.

### 215. విశ్వాదులగు ముగ్గురికి ఏకత తురీయేశ్వరసాక్షుల ఏకత.

విశ్వాదిత్రయమునందు భేదప్రతీతి ఏది యగునో, అది ఉపాధిదృష్టివలన నగును. ఏలయన—విశ్వునకు స్థూలసూక్ష్మ

1. ఎట్లు పిష్టము జలముతో కలిపి ముద్దచేసిన ఏకరూపమగునో, వృష్టియొక్క అనంతబిందువులు తటాకమందు ఏకరూపమగునో, అట్లు జాగ్రత్స్వప్నజ్ఞానము సుషుప్తియందు ఏకావిద్యారూపమగును. ఆ యవిద్య యందుండు అధిష్ఠాన కూటస్థసహితముగానైన తత్ప్రతిబింబరూపప్రాజ్ఞనామము గల జీవుఁడు "ప్రజ్ఞానఘనుఁడు" అనఁబడినది. విశ్వతైజసులభోగమునకువలె ప్రాజ్ఞునిభోగమునకు త్రిపుటిగలదు—చిత్ప్రతిబింబసహితావిద్య అధ్యాత్మము; అజ్ఞానావృతమగు ఆత్మానందము అధిభూతము, ఈశ్వరుఁడు అధిదైవతము.

జ్ఞానములను మూఁడు ఉపాధులు; తైజసునకు సూక్ష్మాజ్ఞానములను రెండు ఉపాధులు; ప్రాజ్ఞునకు అజ్ఞానము ఒకటే యుపాధి గలదు. ఈరీతిగా ఉపాధులన్యూనాధికతలవలన ముగ్గురుకి భేదము కనఁబడుచున్నది; పరమార్థదృష్టివలన భేదము లేదు.

ఈమూఁడింటియందు అనుగతమైన చైతన్యము పరమార్థమువలన మూఁడు ఉపాధులయొక్క సంబంధము లేక యున్నది. ఈమూఁడుపాధులయొక్క అధిష్ఠానమగునట్టి తురీయ చైతన్యము, బహిఃప్రజ్ఞము గాదు; అంతఃప్రజ్ఞము గాదు; ప్రజ్ఞానఘనము గాదు; జ్ఞానేంద్రియములకుఁగాని, కర్మేంద్రియములకుఁగాని శబ్దమునకుఁగాని, లేక బుద్ధికిఁగాని విషయము గాదు. అట్టి యే తురీయము గలదో, దానిని పరమాత్మయొక్క చతుర్థపాదమైన ఈశ్వరసాక్షి శుద్ధబ్రహ్మరూపమని ఎఱుఁగుము.

## 216. ఓంకారమునకు ఆత్మకు బ్రహ్మమునకు మాత్రాపాదములవలన అభేదము.

పూర్వోక్తరీతిగా రెండుప్రకారములచే ఆత్మస్వరూపము చెప్పినారము; మొదటిది పరమార్థరూపము; రెండవది అపరమార్థరూపము; వీనిలో విశ్వాదిమూఁడుపాదములు అపరమార్థరూపములు; నాల్గవదైన తురీయపాదము పరమార్థరూపము.

ఎట్లు ఆత్మకు రెండురూపము లున్నవో, అట్లు ఓంకారమునకును రెండురూపము లున్నవి. వానిలో అకారాదిమకారాంత త్రిమాత్రారూపమైన వర్ణము అపరమార్థరూపము; మఱియు త్రిమాత్రలందు వ్యాపకమయి అస్తిభాతిప్రియరూప

మయిన అధిష్ఠానచైతన్యము పరమార్థరూపము. ఓంకారము యొక్క పరమార్థరూపమునకు శ్రుతియందు అమాత్రమందురు. [మాత్రావిభాగరహితము అమాత్ర మనఁబడును.] ఈరీతిగా రెండురూపములుగల ఓంకారమునకు రెండురూపములుగల ఆత్మతో అభేద మెఱుఁగుము.

ప్రథమపాదమగుటవలన సమష్టివ్యష్టి స్థూలసృష్టిసహిత మగు విరాడ్విశ్వాకారములకు అభేదము నెఱుఁగవలయును. ద్వితీయపాదమగుటవలన సమష్టివ్యష్టి సూక్ష్మసృష్టిసహితమగు హిరణ్యగర్భతైజసోకారములకు అభేదము నెఱుఁగవలయును. తృతీయపాద మగుటవలన సమష్టివ్యష్టి కారణోపాధిసహితేశ్వర ప్రాజ్ఞమకారములకు అభేదము నెఱుఁగవలయును. చతుర్థ పాదమగుటవలన సాక్షితురీయామాత్రలకు అభేదము నెఱుఁగ వలయును.

## 217. లయచింతనమునకు అనువాదము ఒక్కొక్క మాత్రారూపమునకు అన్యమాత్రారూపత

విరాడ్విశ్వమైన అకారము హిరణ్యగర్భతైజసమయిన ఉకారముకన్న భిన్నముగా దని తెలిసి, ఆహిరణ్యగర్భతైజస రూపోకారముయొక్క లయము ఈశ్వర ప్రాజ్ఞరూపమకార మందు చేయవలయును, అట్లు ఆ ఈశ్వర ప్రాజ్ఞరూపమకారము యొక్క లయము ఈశసాక్షితురీయరూపమైన అమాత్రయందు చేయవలయును. ఏలయన—స్థూలమునకు సూక్ష్మమందు, సూక్ష్మ మునకు కారణమందు లయములు అగుచున్నవి. ఆ కారణము,

శుద్ధచైతన్యమందు కల్పితము; ఏది దేనియందు కల్పితమో, అది దానియొక్క స్వరూపముగానే యున్నది; వేఱు గాదు.

ఈరీతిగా సర్వకల్పితాధిష్ఠానమై పరమార్థరూపచతుర్థపాదమైన ఈశసాక్షీతురీయామాత్రచైతన్యమందు సమష్టివ్యష్టులు, స్థూలసూక్ష్మకారణప్రపంచములు, ఈశ్వరహిరణ్యగర్భవిరాట్టులు, ప్రాజ్ఞతైజసవిశ్వులు, అకారోకారమకారములు, సర్వములును కల్పితము లగుటవలన లయము పొందుచున్నవి. ఇట్టి యే అమాత్రరూపశుద్ధచైతన్యము గలదో, అది నేను; అట్లు ఏకాగ్రచిత్తమువలన చింతనము చేయవలయును.

స్థావరజంగమరూపమై, నిత్యముక్తాసంగపరబ్రహ్మమైన ఓంకారముయొక్క పరమార్థస్వరూపము ఏది గలదో, అది నేనుగా నున్నాను, ఇట్లు చింతనము చేయుటవలన జ్ఞానోదయ మగుచున్నది; కాబట్టి ఈ ఓంకారముయొక్క నిర్గుణోపాసన జ్ఞానద్వారమున ముక్తిరూపఫలము నిచ్చునట్టిదిగా నున్నది; ఇది ఇతరమైన సకలోపాసనలకన్న ఉత్తమము.

## 218. ఓంకారచింతనమందు పరమహంసాధికారము

పూర్వరీతిగా ఓంకారస్వరూపము నెఱింగినవాఁడెవ్వఁడో, వాఁడు ముని; ఎఱుఁగనివాఁడు ముని గాఁడు. ఏలయన— మననము చేయువాఁడే ముని యనవలయును. ఇచ్చట ఓంకారచింతనము మననరూపముగా నున్నది; కాబట్టి ఎవనికి ఓంకారచింతనరూపమననము లేదో; వాఁడు ముని గాఁడు. ఇది మాండూక్యోపనిషచ్ఛ్రుతినిబట్టి ఓంకారచింతనము సంక్షేపముగా జెప్పఁబడినది. మఱియును నృసింహతాపనీయాద్యుపనిషత్తులందు ఇది అన్యప్రకారముగా వర్ణింపఁబడినది.

ఓంకారచింతనము పరమహంసునియొక్క గోప్యధనము గా నున్నది. బహిర్ముఖపురుషునకు దీనియం దధికారములేదు; అత్యంతాంతర్ముఖునకు అధికారము గలదు. గృహస్థునకు అధికారములేదు; ధనపుత్రస్త్రీసంగాదిరహితుఁడైన పరమహంసునికే యధికారము.

## 219 ప్రణవోపాసనచేయువానికి ఫలము

పూర్వప్రకారముగా ఓంకారమును బ్రహ్మరూపముచే ధ్యానము చేయుటవలన జ్ఞానద్వారమున మోక్షమగును; అయిన ఏపురుషుఁడు ఈలోకభోగములందు, లేక బ్రహ్మలోకభోగము లందు కామన కలుగుటవలన తీవ్రవైరాగ్యము లేకున్నను, హఠముచే కామనను అణఁచి,ధనపుత్రాదికమును త్యజించి,పరమహంసగురూపదేశమువలన ఓంకారరూప బ్రహ్మధ్యానము చేయునో, వానికి భోగకామనజ్ఞానమునకు ప్రతిబంధక మగుట వలన జ్ఞానము గలుగదు; ధ్యానముచేయుచుండి శరీరత్యాగా నంతరము అన్యశరీరము పొందును.

ఎవఁడు ఈ లోకభోగకామన నణఁచి, ధ్యానమందు నిమగ్నుఁడగునో, వానికి ఈలోకమందు అత్యంతవిభూతిగల పవిత్రవత్కులమునందు జన్మమగును. అచ్చట పూర్వకామనానుసారముగ సకలభోగములు ప్రాప్తములగును. మఱియు పూర్వజన్మకృతధ్యానసంస్కారముచేపునరపి విచారమందు లేక ధ్యానమందు ప్రవృత్తియగును. తదనంతరము జ్ఞానమై మోక్షమగును.

ఎవ్వఁడు బ్రహ్మలోకభోగకామనను అణఁచి, ఓంకారరూపబ్రహ్మధ్యానమందు నిమగ్నుఁ డగునో, వాఁడు శరీర

త్యాగానంతరము బ్రహ్మలోకమునకు పోవును. అచ్చట మనుష్యులకు, పితరులకు, దేవతలకు దుర్లభమయిన ఏ స్వాతంత్ర్యానందము గలదో, దానిని ఉపభోగించును. ఎన్ని సత్యసంకల్పాదికములయిన హిరణ్యగర్భుని విభూతు లున్నవో, అవి సకలము వానికి ప్రాప్త మగును.

### 220. బ్రహ్మలోకముయొక్క మార్గ[1] క్రమము

ఏమార్గమువలన బ్రహ్మలోకమునకు పోదురో, ఆ మార్గముయొక్క క్రమ మిది— ఏ పురుషుఁడు బ్రహ్మోపాసనయందు తత్పరుఁ డగునో, వాని మరణసమయమందు ఇంద్రియాంతఃకరణాదు లన్నియు మూర్ఛితము లగును; ఎచ్చటికిపోవుటకును సమర్థములు[2] గావు. మఱియు లింగశరీరమును తీసికొనిపోవు యమభటులును వానిదగ్గఱకు రారు; అట్లయినను అగ్న్యభిమానిదేవత మరణసమయమందు స్థూలశరీరమునుండి వానిని వెడలించి, తనలోకమునకు తీసికొనిపోవును.

ఆయగ్నిలోకమునుండి క్రమముగానే దినాభిమానిదేవత, శుక్లపక్షాభిమానిదేవత, ఉత్తరాయణాభిమానిదేవత, సంవత్సరాభిమానిదేవత, దేవలోకాభిమానిదేవత, వాయు

1. ఈమార్గముయొక్క క్రమము శుక్లయజుర్వేదములో ఈశావాస్యోపనిషదంతమందు వ్రాయఁబడినది.

2. మరణసమయమందు స్థూలలింగశరీరముల పరస్పరవియోగమువలన ఉపాసకునియొక్క ఇంద్రియాంతఃకరణములు అన్యప్రాణులవలె మూర్ఛితము లగును; అందువలన స్వయముగా ఎచటనుపోవ సమర్థములుగావు. మఱియు క్రియాశక్తిగలప్రాణములు జ్ఞానహీనములగుటచే ఇచ్ఛాభావమువలన వానికి గమనము సంభవింపదు.

దేవత, సూర్యదేవత, చంద్రదేవత, విద్యుద్దేవత, తనతనలోకమునకు తీసికొనిపోవును.

విద్యుల్లోకమందో, హిరణ్యగర్భాజ్ఞచే దివ్యరూపుఁడై, హిరణ్యగర్భలోకవాసియై, హిరణ్యగర్భసమానపురుషుఁడు ప్రణవోపాసకున కెదురువచ్చును. ఆపురుషుఁడు విద్యల్లోకము నుండి వరుణలోకమునకు తీసికొనిపోవును. విద్యుద్దేవత తోడ వచ్చును. ఈక్రమముగా వరుణలోకమునుండి ఇంద్రలోకమునకుఇంద్రలోకమునుండి ప్రజాపతిలోకమునకు తీసికొనిపోవును.

అక్కడనుండి ముందటికి వీరిద్దఱితోఁగూడ ప్రజాపతి, బ్రహ్మలోకమునకు పోవుటకు సమర్థుఁడు గాఁడు; అందువలన ఆ దివ్యపురుషునితోడ ఆయుపాసకుఁడు బ్రహ్మలోకమును పొందును.

ఆ బ్రహ్మలోకమున కధిపతి హిరణ్యగర్భుఁడు; సూక్ష్మసమష్టియొక్క అభిమానిచైతన్యము హిరణ్యగర్భుఁ డందురు; వానినే కార్యబ్రహ్మ మందురు. కార్యబ్రహ్మముయొక్క నివాసస్థానమును బ్రహ్మలోకము, లేక సత్యలోకము అందురు.

## 221. సాయుజ్యమోక్షవర్ణనము

యద్యపి పూర్వరీతిగా ఓంకారముయొక్క యుపాసన శుద్ధబ్రహ్మరూపముచే చెప్పఁబడినది; అందువలన ఆ యుపాసకునకు శుద్ధబ్రహ్మప్రాప్తి గావలయును; తథాపి శుద్ధబ్రహ్మప్రాప్తి జ్ఞానమువలననే యగును; ఉపాసనవలన కానేరదు; కామనారూపప్రతిబంధమువలన నెవనికి జ్ఞానము పొడమలేదో, వానికి కార్యబ్రహ్మప్రాప్తిరూపమగు సాయుజ్యమోక్ష మగును.

బ్రహ్మలోకమును పొందినయుపాసకునకు హిరణ్యగర్భునితో సమానముగా విభూతి లభించును; సత్యసంకల్ప మగును; ఏయేశరీరము గోరునో, ఆయాశరీరము లభించును; ఏయేభోగమును వాంఛించునో, ఆయాసకలభోగములు సంకల్పమాత్రముచే తత్కాలమున లభించును; ఏకసమయమందు సహస్రశరీరములచే వేర్వేఱ భోగింపఁగోరునేని, అపుడు సహస్రశరీరములును తద్భోగమునకు వేర్వేఱ సామగ్రియు నుత్పన్నమగును; పెక్కులేల ఏసంకల్పముచేసిన, అది తత్కాలమె సిద్ధమగును; అయినను జగదుత్పత్తిపాలనసంహారములు విడిచి, మిగిలిన సకల విభూతులు ఈశ్వరునితో సమానముగా పొందును. దీనినె [1] సాయుజ్యమోక్ష మందురు.

ఈ ప్రకారముగా హిరణ్యగర్భునితో సమానుఁడయి, అనేకకాలము సంకల్పసిద్ధిదివ్యపదార్థోపభోగముచేసి, ప్రలయకాలమందు ఎపుడు హిరణ్యగర్భలోకనాశమగునో, అపుడు జ్ఞానోదయమయి;ఆయుపాసకునకువి దేహమోక్షప్రాప్తియగును.

---

1. చతుర్విధముక్తులలో i. రాజుయొక్క రాష్ట్రమునందు ప్రజలవలె ఈశ్వరునిలోకమందు వసించుటకు సాలోక్యముక్తియని పేరు. ii. రాజుయొక్క సేవకులవలె ఈశ్వరసమీపమందుండుటకు సామీప్యముక్తియని పేరు. iii. రాజుయొక్క అనుజులవలె ఈశ్వరుని సమానరూపప్రాప్తికి సారూప్యముక్తియని పేరు. iv. రాజుయొక్క జ్యేష్ఠపుత్త్రునివలె ఈశ్వరునితో సమానముగా సత్యసంకల్పాద్యైశ్వర్యప్రాప్తికి సార్ష్టిముక్తి యనిపేరు. ఈరీతిగా శాస్త్రమునందు ఫలరూపమై, శ్రేష్ఠశ్రేష్ఠమగునట్టి చతుర్విధముక్తి చెప్పఁబడియున్నది; వీనిలో అంత్యమైనసార్ష్టిముక్తి అత్యంతశ్రేష్ఠము. దీనినే సాయుజ్యమోక్ష మనియు అందురు.

## 222. అహంగ్రహోపాసనమువలన బ్రహ్మలోకప్రాప్తి

ఎట్లు ప్రణవోపాసనచేయువాఁడు బ్రహ్మలోకద్వారమున మోక్షమును పొందునో, అట్లు ఉపనిషత్తులలో చెప్పిన అన్యమైన బ్రహ్మోపాసన చేయువాఁడు కూడ పూర్వోక్తఫలమును పొందును;అయినను అహంగ్రహోపాసన లేక అన్యోపాసనవలన బ్రహ్మలోకప్రాప్తి గానేరదు. ఈసంగతి సూత్రభాష్యకారులచే చతుర్థాధ్యాయమందు ప్రతిపాదింపఁబడినది.

నర్మదేశ్వరుని శివరూపముగాను, సాలగ్రామమును విష్ణు రూపముగాను, మనస్సును బ్రహ్మరూపముగాను, ఆదిత్యుని బ్రహ్మరూపముగాను ధ్యానించుట చెప్పఁబడినది; అది ప్రతీక ధ్యాన మనఁబడును. అహంగ్రహముగాదు; అందువలన వాని చేత బ్రహ్మలోకప్రాప్తి గానేరదు. సగుణబ్రహ్మమును, లేక నిర్గుణబ్రహ్మమును తనకన్న అభిన్నముగా నెఱింగి, చింతనము చేయుట అహంగ్రహధ్యాన మందురు; దానివలననె బ్రహ్మలోక ప్రాప్తి యగును.

## 223. ఉత్తరాయణమార్గమువలన అపునరావృత్తి

పూర్వోక్తమార్గమును ఉత్తరాయణమార్గము, లేక దేవ యానమార్గము అందురు. ఆ దేవమార్గముద్వారమున ఏయుపా సకుఁడు బ్రహ్మలోకమునకు పోవునో, వాఁడు మరల సంసారము పొందఁడు; జ్ఞానముకలిగి, వానికి విదేహమోక్షప్రాప్తియగును.

అచ్చట జ్ఞానసాధనమైనగురూపదేశముయొక్క యపేక్ష లేదు; గురూపదేశాది సాధనము లేకయు జ్ఞానమగును. ఏలయన బ్రహ్మలోకమందు తమోగుణరజోగుణముల లేశమును లేదు;

కేవలసత్త్వగుణప్రధానముగా ఆలోకమున్నది. తమోగుణము లేనందున జడతాలస్యాదికములు లేవు; రజోగుణము లేనందున కామక్రోధాదివిక్షేపములు లేవు; కేవల సత్త్వగుణ ముండుట వలన సత్త్వగుణకార్యమైన జ్ఞానరూపప్రకాశము ప్రధానముగా వర్తించును.

## 224. హిరణ్యగర్భలోకవాసికి బ్రహ్మాత్మజ్ఞానమందు హేతుత

ఎప్పుడు పూర్వకాలమందు బ్రహ్మారూపమువలన ఓంకారముయొక్క యుపాసనము చేసెనో, అప్పుడు వాఁడు ఓంకారమాత్రలయొక్క అర్థము ఈరీతిగా నెఱుఁగును—స్థూలోపాధిసహితచైతన్యము విరాడ్విశ్వాకారములకు వాచ్యము, సూక్ష్మోపాధిసహితచైతన్యము హిరణ్యగర్భతైజసోకారములకు వాచ్యము, కారణోపాధిసహితచైతన్యము ఈశ్వరప్రాజ్ఞమకారములకు వాచ్యము. ఇట్టి యీయర్థము వాఁడు పూర్వము చింతనము చేసెనో, దానియొక్క స్మృతి వానికి బ్రహ్మలోకముం దగుచున్నది.

మఱియు అచ్చట సత్త్వగుణప్రభావమువలన ఇట్టి వివేచనమగుచున్నది—స్థూలోపాధిదృష్టివలన చైతన్యమునందు విరాట్త్వవిశ్వతలు ప్రతీతములగును. [స్థూలసమష్టిదృష్టివలన విరాట్త్వత స్థూలవ్యష్టిదృష్టివలన విశ్వత] ఆదృష్టి లేక విరాడ్విశ్వభావములు ప్రతీతములు గానేరవు. అట్లు సమష్టివ్యష్టిరూపమైన సూక్ష్మోపాధిదృష్టి లేక హిరణ్యగర్భతైజసభావములు, అట్లె సమష్టివ్యష్టిరూపమయిన కారణోపాధిదృష్టి లేక ఈశ్వరప్రాజ్ఞ

భావములు ప్రతీతములు గానేరవు; చైతన్యమాత్రమే ప్రతీతమగును.

ఏవస్తువు దేనియందు అన్యదృష్టివలన ప్రతీతమగునో, ఆవస్తువు దానియందు పరమార్థముచేత నుండదు; దేనియొక్క ఏరూపము అన్యదృష్టిలేక ప్రతీతమగునో, అది దానియొక్క పరమార్థరూపము. ఎట్లనఁగా ఒకపురుషునియందు పితృదృష్టివలన పుత్రత, పితామహదృష్టివలన పౌత్రత ప్రతీతమగును; అదిపరమార్థరూపముగాదు; అన్యదృష్టిలేక ప్రతీతమగు పురుషపిండమే పరమార్థరూపము.

ఆప్రకారముగా స్థూలసూక్ష్మకారణోపాధిదృష్టివలన ప్రతీతమయిన విరాడ్విశ్వాదిరూపములు మిథ్య; మఱియు నుపాధిదృష్టిలేక ప్రతీతమయిన ఏచైతన్యమాత్రము గలదో, అదియే సత్యము; సకలభేదములును ఉపాధిదృష్టివలన కనఁబడు చున్నవి; ఉపాధిదృష్టిలేకుండిన ఆచైతన్యమో, సకలభేదరహితముగా నున్నది.

ఇట్లు ఓంకారలక్ష్యమైనసకలభేదరహితాసంగనిత్యముక్తమగు స్వయంప్రకాశ పరబ్రహ్మరూపాత్మ ఉపాసకునకు అచ్చుట భాసమానుఁడగుటవలన హిరణ్యగర్భలోకవాసియగు ప్రణవోపాసకునకు మరల సంసారము గానేరదు; జ్ఞానద్వారమున మోక్షమే యగును.

## 225. ఓంకారమహావాక్యములందు అర్థమొక్కటె

యద్యపి మహావాక్యవివేకములేక జ్ఞానము గానేరదు; కనుక ప్రణవోపాసకునకు జ్ఞానము గాఁగూడదు; తథాపి

ఓంకారవివేకమే మహావాక్యవివేకమగుటవలన వానికి జ్ఞానమగు చున్నది. ఆ వివేకప్రకారము—

స్థూలోపాధిసహితచైతన్యము అకారమునకువాచ్యము; స్థూలోపాధినివిడిచి,చైతన్యమాత్రముఅకారమునకులక్ష్యము. సూక్ష్మకారణోపాధి సహితచైతన్యము ఉకారమకారములకు వాచ్యము; ఆయాయుపాధులను విడిచి, చైతన్యమాత్రము ఉకారమకారములకు లక్ష్యము. నామరూపసకలోపాధిసహిత చైతన్యము ఓంకారమునకు వాచ్యము; సకలోపాధిరహిత చైతన్యము ఓంకారమునకు లక్ష్యము.

ఈవిధముగా ఓంకారమందును, మహావాక్యమందును అర్థమొక్కటె, కనుక ఓంకారవివేకమువలనను అభేదజ్ఞాన మగు చున్నది.

## 226. అదృష్టదృష్టికి పురుషార్థసిద్ధి

పూర్వోక్తప్రకారముగా వివేకము ఆచార్యులముఖము వలన విని, అదృష్టదృష్టినామకుఁడయిన మధ్యమశిష్యుఁడు ప్రణవోపాసనయందు ప్రవృత్తుఁడయి, జ్ఞానద్వారమున పరమ పురుషార్థరూపమగు మోక్షమును పొందెను.

## 227. నిర్గుణోపాసనయందు అనధికారికి కర్తవ్యము.[1]

ఓపురుషుఁడా! పైఁజెప్పిన ప్రణవముయొక్క నిర్గుణరూప ధ్యానము నీచేతఁ గానియెడల, నీవు సగుణరూప ధ్యానము

1. ఇచ్చట ఇది యభిప్రాయము—ఏజిజ్ఞాసువునకు వేదాంతముయొక్క శ్రవణమననరూపవిచారమందు ప్రవృత్తియగునో, వానికి ఆ విచారముతప్ప అన్యసాధనము కర్తవ్యముగాదు. ఒకానొకప్పుడు ఆ విచారశీలపురుషుఁడు విచారమువదలి, అన్యసాధనములందు ప్రవృత్తుఁడైనయెడల; వాఁడు ఆరూఢ

చేయుము. నీకు సగుణోపాసన [1] మును శక్యముగానియెడల నీవు నిష్కామకర్మ [2] ద్వారమున పరమాత్మయొక్క భజనము

---

ఫలితుఁడగును; అప్పుడు వానికి కరతలగతమైన లడ్డుపారవైచి, వట్టిచేతినినాకుట సంభవించును; కనుక ఆ విచారశీలపురుషుఁడు దృఢబోధమగువఱకు విచారమునే చేయవలయును. మఱియు ఎవ్వనికి విచారమందు ప్రవృత్తిగాదో, వాఁడు నిర్గుణోపాసన చేయవలయును. మఱియు ఎవనికి నిర్గుణోపాసనయందు అధికారములేదో, వాఁడు "ఉపవాసముకన్న భైక్షము శ్రేష్ఠము" అనురీతిగా సగుణోపాసనాదికము చేయవలయును.

1. మాయావిశిష్టచైతన్యమైన కారణబ్రహ్మము, లేక వానియుపలక్షణమైన హిరణ్యగర్భవైశ్వానర హరిహరగౌరిగణేశసూర్యులు, మఱియు వీని అవతారరూపకార్యబ్రహ్మము, లేక వీనిప్రతిమారూపప్రతినిధి వానిని ఇచ్చట సగుణబ్రహ్మమందురు. ఉక్తోపాసనలందు పూర్వపూర్వులు శ్రేష్ఠులు, ఉత్తరోత్తరులు అశ్రేష్ఠులు.

యద్యపి మాయావిశిష్టచైతన్యమైన కారణబ్రహ్మమే ఈశపదమునకు ముఖ్యార్థము; అదే యుపాస్యము; తథాపి "మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్" అను శ్రుతియొక్క అభిప్రాయముచొప్పున మాయావిశిష్టచైతన్యముకన్న భిన్నపదార్థము లేదు. తదనుసారముగ విద్యారణ్యస్వాములు సర్వమతములకు అవిరుద్ధమైన ఈశ్వరునియొక్క నిరూపణము చిత్రదీపమందు చేసియున్నారు; తదనుసారముగ హిరణ్యగర్భాదులు ఈశులని ఇచ్చట చెప్పఁబడినది.

2. ఫలకామనారహితమైన స్వవర్ణాశ్రమకర్మము ఈశ్వరార్పణబుద్ధిచే చేసి, దానితోడ నామసంకీర్తనాదులచే రాముని భజింపుము; లేక నిష్కామకర్మము చేసి, రామార్పణము చేయుము; ఫలకామనారహితమై రామార్థముగా చేయఁబడిన ఏ శుభకర్మము గలదో, అదియుఁ రామప్రసన్నతకు హేతువగుట వలన రామభజనమే.

చేయుము. నీకు నిష్కామకర్మము శక్యముగాదేని, అపుడు నీవు సకామశుభకర్మము చేయుచుండుము. నీకు సకామశుభకర్మము సాధ్యముగాదేని, అప్పుడు ఓశఠుఁడా! నీవు వారం వారము పుట్టుము గిట్టుము. భళీ! నిన్ను వలదనువాఁడెవ్వఁడు లేఁడు.

ఈవిధముగా అహంగ్రహోపాసనాది ప్రతిపాదకమైన ఈవిచారాబ్ధియొక్క పంచమతరంగమందు ఓంకారార్థమును ఎఱిఁగి, మధ్యమశిష్యుఁడయినఅదృష్టదృష్టియనువాఁడు కృతార్థుఁడాయెను. ఏజిజ్ఞాసువైనపురుషుఁడు శ్రద్ధాపూర్వకముగా ఇట్టి శుభతరంగముయొక్క శ్రవణపఠనము చేయుచున్నాఁడో; వానిపై శ్రీగురుమూర్తి కృపాదృష్టి చేయుచున్నాఁడు.

ఇది శ్రీగురువేదాది వ్యావహారిక ప్రతిపాదననామము,
అట్లు మధ్యమాధికారిసాధనవర్ణననామము అగు పంచమతరంగము
సంపూర్ణము.

---

నిష్కామమనఁగానేమి? కామనారహితమగునది నిష్కామమా? మోక్షకామన నిష్కామమా? మొదలయినవికల్పములుజేసి, నిష్కామశబ్దార్థములందు శాస్త్రకారులయొక్క భవతి నభవతి అనేకప్రకారములుగా జరుగుచున్నది; విస్తారభయముచే ఇచ్చట వ్రాయను; సిద్ధమైన ఒకముఖ్యార్థము మాత్రము చూపుదును—"నిష్కామమైన ఏ మోక్షము గలదో, తత్కామము నిష్కామ మనఁబడును" అనునీ ఒకటే యర్థమునప్పు ఇతరములన్నియుం గౌణార్థములే.



# శ్రీవిచారసాగరము

## షష్ఠతరంగము



### గురువేదాదిమిథ్యాత్వనిరూపణము

### 228. ఉపోద్ఘాతము

చతుర్థతరంగమందు ఉత్తమాధికారికిని, పంచమతరంగమందు మధ్యమాధికారికిని ఉపదేశప్రకారము చెప్పితిమి; ఇపుడు ఈతరంగమందు కనిష్ఠాధికారియొక్క ఉపదేశప్రకారము చెప్పుచున్నాము. ఎవనికి శంక విశేషముగా పుట్టుచున్నదో, వాని బుద్ధి తీవ్రమైనను ఆబుద్ధి, కుతర్కదూషితమగుటవలన వాఁడు కనిష్ఠాధికారిగా నున్నాఁడు; ఈతరంగము యుక్తిప్రధానమై యుండుటవలన విన్న అర్థములో నెవ్వానికి కుతర్కము పుట్టునో, వానికి ఈతరంగమునందు ఉపయోగము గలదు.

పంచమ తరంగములో ప్రణవోపాసనాప్రకరణమునందును, జగదుత్పత్తినిరూపణమందును చెప్పఁబడినది—"చైతన్యముకన్న భిన్నమైన అజ్ఞానమును, తత్కార్యమును అనాత్మయందురు; ఆ యనాత్మపదార్థములన్నియు స్వప్నమువలె మిథ్య"

ఈవార్తను విని, అన్నలిద్దఱు ప్రశ్నచేయక మిన్నకుండుటను చూచి, తమ్ముఁడైనతర్కదృష్టి ప్రశ్నచేయ నారంభించెను—

**229. తర్కదృష్టియొక్క ప్రథమప్రశ్న— స్వప్నదృష్టాంతముచే జాగ్రత్పదార్థము మిథ్యయనుట సంభవింపదు ?**

ఓభగవంతుఁడా, నాకిది తోఁచుచున్నది; ఏమనఁగా— పూర్వమందు అత్యంతాజ్ఞాతమైన పదార్థముయొక్క జ్ఞానము స్వప్నమందు కానేరదు; జాగరితమందు దేనియొక్క జ్ఞానమగునో దానిస్మృతి స్వప్నమందగును; స్మృతిజ్ఞానవిషయమైన జాగ్రత్పదార్థము సత్యమగుటవలన దానిస్మృతిజ్ఞానమును సత్యమే; కాఁబట్టి స్వప్నదృష్టాంతముచే జాగ్రత్పదార్థములను మిథ్యయనుట సంభవింపదు? [1]

**230. ద్వితీయప్రశ్న—స్వప్నము మిథ్యగాదు?**

అన్యప్రకారమువలన స్వప్నసత్యత ప్రతిపాదించుచున్నాఁడు—స్వప్నావస్థయందు స్థూలశరీరమునువదలి, లింగశరీరము బయలుదేఱి, సత్యగిరిసముద్రాదులను చూచుచున్నది?

**231. 229—30 గతప్రశ్నకుత్తరము 31—45 జాగ్రత్పదార్థస్మృతి స్వప్నమందు లేదు.**

పూర్వజ్ఞాతపదార్థములయొక్క జ్ఞానము, స్మృతియగును. ఎట్లనఁగా—పూర్వదృష్టగజమునుగుఱించి "ఆగజము" అను

1. నైయాయికులు స్వప్నమును జాగ్రదనుభూతపదార్థస్మృతిరూపమైన మానసవిపర్యాసమందురు; వానిమతానుసారముగ శిష్యుఁడు ప్రశ్నచేయుచున్నాఁడు.

నట్టిస్మృతి యగును; "ఈగజము సమ్ముఖమందున్నది" ఇట్టి జ్ఞానము స్మృతిగాదు; స్వప్నమందో, "ఈగజ మెదుటనున్నది, ఇది పర్వతము, ఇది నది; అనునిట్టి జ్ఞానమగును; కాఁబట్టి అది జాగ్రత్పదార్థస్మృతిగాదు; అది ప్రత్యక్షజ్ఞానమే.

మఱియు నీవు ఇట్లుచెప్పితివి—"జాగ్రత్తయందు ఎఱిఁగిన పదార్థముయొక్క జ్ఞానమే పరంపరగ స్వప్నమునకు హేతు వగును;ఏలాగుననఁగా—జాగ్రత్పదార్థజ్ఞానసంస్కారమువలన స్వప్నజ్ఞానోత్పత్తి యగును; సంస్కారజన్యజ్ఞానమే స్మృతి యందురు." ఆశంక ఘటిల్లదు; ఏలయన ప్రత్యక్షజ్ఞానము ద్వివిధము—మొదటిది అభిజ్ఞాప్రత్యక్షము. రెండవది ప్రత్యభిజ్ఞాప్రత్యక్షము—

(1) కేవలేంద్రియసంబంధమువలన పుట్టినజ్ఞానమును అభిజ్ఞాప్రత్యక్ష మందురు; ఎట్లనగా "ఇది గజము"అను నిట్టిజ్ఞానము.

(2) పూర్వసంస్కారమువలనను,ఇంద్రియసంబంధమువల నను పుట్టినజ్ఞానమును ప్రత్యభిజ్ఞాప్రత్యక్ష [1] మందురు; ఎట్లనఁగా పూర్వము చూచిన "ఆగజము ఇది" అను నిట్టి జ్ఞానము [ఈస్థలమునందు పూర్వదృష్టగజ

1. ప్రత్యక్షజ్ఞానసామగ్రీసహితమయిన సంస్కారజన్యజ్ఞానమును ప్రత్యభిజ్ఞాప్రత్యక్షమందురు; దానిని "సంస్కారసహితము ఇంద్రియసంబంధమువలన జన్యము" అనిన, ఆ లక్షణము బాహ్యప్రత్యభిజ్ఞాప్రత్యక్షమందో, ఘటిల్లును; అయిన ఆ లక్షణమునకు ఆంతరప్రత్యభిజ్ఞాప్రత్యక్షమందు అవ్యాప్తి యగును; కనుక ప్రథమముచెప్పిన లక్షణమే నిర్దోషము. [బాహ్యాంతరసాధారణము.]

జ్ఞానసంస్కారము, నేత్రవృత్తికి గజముతో సంబంధము ఈ రెండును గలవు.]

సంస్కారజన్యజ్ఞానము స్మృతియే యగు నని నియమము లేదు; ఒక్కొక్కచోట అది ప్రత్యభిజ్ఞాప్రత్యక్షము నగును; అయినను, ఇంద్రియసంబంధము లేక కేవల సంస్కారజన్యజ్ఞానము స్మృతియగు నని నియమము [1]గలదు.

స్వప్నమందు హస్త్యాదికముయొక్క జ్ఞానము కేవల సంస్కారజన్యము గాదు; నిద్రాదోషసహితావిద్యవలన జన్యముగా నున్నది. హస్త్యాదులవలె స్వప్నమందు కల్పితేంద్రియములును గలవు; కనుక స్వప్నపదార్థజ్ఞానము ఇంద్రియజన్యమను టయు ఘటిల్లినది; యద్యపి స్వప్నపదార్థము సాక్షిభాస్యము; ఇంద్రియజన్యజ్ఞానమునకు విషయము గాదు; తథాపి అవివేకి దృష్టివలన స్వప్నజ్ఞానము ఇంద్రియజన్యమందురు; ఏవిధిచేనయినను స్వప్న పదార్థజ్ఞానము జాగ్రత్పదార్థజ్ఞాన సంస్కారజన్యము గాదు.

---

1. ఇచ్చట ఈవిచారముగలదు—సంస్కారజన్యజ్ఞానమును స్మృతి యనిన, ప్రత్యభిజ్ఞాజ్ఞానమును సంస్కారజన్యము, దానియందు స్మృతిలక్షణమునకు అతివ్యాప్తి యగును; తన్నివారణార్థము స్మృతిలక్షణమందు మాత్రపదముయొక్క నివేశము [ప్రవేశము] చేయవలసియున్నది. సంస్కారమాత్రజన్యజ్ఞానమును స్మృతియనిన, సంస్కారమాత్రసామగ్రి అనుభవనాశానంతరము సదావిద్యమానమగుటవలన సదాస్మృతి గావలయును; ఈదోషనివారణార్థము స్మృతిలక్షణమందు ఉద్భూతపదముయొక్క నివేశము చేయవలయును. ఈరీతిగా ఉద్భూతసంస్కారమాత్రజన్యమైన జ్ఞానము స్మృతి యనఁబడును. ఈస్మృతిలక్షణము నిర్దోషము.

లేక నిద్రనుండి లేచినపురుషుఁడు ఇట్లనును.—"నేను స్వప్నమందు హస్త్యాదికమును చూచితిని." అజ్ఞానము స్మృతియైనయెడల జాగ్రత్పురుషుఁడు ఇట్లనవలయును—"నేనుస్వప్నముఁదు హస్త్యాదికముయొక్క స్మరణము చేయుచుంటిని" ఇట్లెవ్వఁడు అనఁడు; కనుక జాగ్రత్పదార్థస్మృతి స్వప్నమందు లేదు.

జాగ్రత్పదార్థజ్ఞానమే స్వప్నమం దగు నని నియమము లేదు; జాగ్రదజ్ఞాతపదార్థములయొక్క అనఁగా—పూర్వము ఎప్పుడును చూడనట్టి, విననట్టి విలక్షణపదార్థజ్ఞానమును ఒకానొకప్పుడు స్వప్నమం దగును.

మఱియు నిట్లనును—"ఈజన్మమునందలి పదార్థజ్ఞానసంస్కారమే హేతువని నియమము చెప్పను; జన్మాంతరసంస్కారమును హేతువగును; ఏలయన అనుకూలజ్ఞానమువలన ప్రవృత్తి యగును; బాలకునకు స్తన్యపానమందు ప్రథమప్రవృత్తి ఏది యగునో, అది బాలకునకు స్తన్యపానము నాకు అనుకూలము అను జ్ఞానసంస్కారముచే ఉద్భవించును; ఎట్లు జన్మాంతరజ్ఞానసంస్కారమువలన బాలకునకు స్మృతియగునో, అట్లు ఈజన్మమందు పదార్థము అజ్ఞాతమయినను, జన్మాంతరపదార్థజ్ఞానసంస్కారమువలనను, స్వప్నమందు స్మృతి సంభవించుచున్నది."?

ఈయాశంక యుక్తముగాదు; ఏలయనఁగా—ఏజన్మము యొక్క జాగ్రత్తునందు సంభవింపనిజ్ఞానమును స్వప్నమందగును; ఎట్లనఁగా—తనశిరశ్ఛేదమును తానే కన్నులతో స్వప్నమందు చూచును; అట్లు తనశిరశ్ఛేదమును తననేత్రముచే జాగ్రత్తయందు ఏజన్మమందును చూచియుండఁడు.

ఇది మొదలుకొని, స్వప్నము స్మృతిరూపమనుట యొక్క ఖండనమందు అనేకయుక్తులు అనేకగ్రంథకారులు చెప్పి యున్నారు; అయినను, స్వప్నము స్మృతియనుటచు ఖండించుట యందు పూర్వోక్తదూషణము మిగులప్రబలము; ఏమనఁగా— స్మృతిజ్ఞానవిషయము సమ్ముఖమందు ప్రతీతముగాదు. స్వప్న మందో, హస్త్యాదికము సమ్ముఖమందు ప్రతీతమగును.

## 232. స్వప్నమందు లింగశరీరము బాహిరము వెడలి జాగ్రత్పదార్థములను చూడదు

లింగశరీరము బాహిరము వెడలి, సత్యగిరిసముద్రాదిక మును చూచును; ఈశంకయును ఘటిల్లదు; ఏలయన— స్థూల శరీరమును వెడలినదై, లింగశరీరము వెలుపటికి పోయినపుడు స్థూలశరీరము అమంగళము, భయంకరము గావలయును; ప్రాణరహితప్రేతసమానము గావలయును; స్వప్నావస్థయందు అట్లుగాదు. జాగ్రత్తవలె సుందరమంగళముగానే యుండును.

ఇట్లు చెప్పుదువు—"స్వప్నావస్థయందు ప్రాణము బయ టికిపోదు; అంతఃకరణమును, ఇంద్రియములును పోవును; కనుక స్థూలశరీరము ప్రేతమువలె భయంకరముగా కనఁబడదు; ప్రాణముపోవుటచే ప్రయోజనమును లేదు; ఏలయన ప్రాణమందు జ్ఞానశక్తి లేదు; క్రియాశక్తి గలదు. దానిచే బహిఃపదార్థ జ్ఞానము గానేరదు. ప్రాణమునందువలె కర్మేంద్రియములందును జ్ఞానశక్తి లేదు; కనుక సప్రాణకర్మేంద్రియములు శరీరమం దుండును; దానివలన ప్రేతమువలె శరీరము భయంకరముగాదు; జనులు తీసికొనిపోయి కాల్పరు; దేనియందు జ్ఞానశక్తిగలదో, అట్టి అంతఃకరణేంద్రియములు మాత్రము బయలువెడలి, సత్య

గిరిసముద్రాదికములుచూచి, ప్రాణకర్మేంద్రియములయొద్దకువచ్చి చేరెను?"

ఆయాక్షేపమును ఘటిల్లదు; ఏలయన—స్థూలసూక్ష్మ సముదాయంబునందు సర్వమునకుస్వామి ప్రాణము, ప్రాణములేని శరీరమును చూచి, క్షణమాత్రము నుండనియ్యరు; బాహిరము తీసికొనిపోయి, దహించివైతురు; తాకిన, స్నానము చేయు దురు. కనుక స్థూలశరీరమునకు సారము ప్రాణము; అట్లు సూక్ష్మ శరీరమందును ప్రధానము [1] ప్రాణము; ఎదివఱకు శరీరమందు ప్రాణముండునో, అదివఱకు సకలేంద్రియ సముదాయముండును; ప్రాణము వెడలిపోయిన సకలము వెడలిపోవును; ఈరీతిగా సూక్ష్మసమాజమునకురాజు [2] ప్రాణము; అది బయలువెడలుటకు మునుపు అంతఃకరణజ్ఞానేంద్రియములు పోవు.

లేక అంతఃకరణజ్ఞానేంద్రియములు సత్త్వగుణకార్య ముగుటవలన వానియందు జ్ఞానశక్తిగలదు; ప్రాణము రజోగుణ కార్యముగుటవలనదానియందు క్రియాశక్తి గలదు; దానిబలము వలన మరణసమయమందు లింగశరీరము స్థూలశరీరమువదలి, లోకాంతరమునకు పోవును; ప్రాణబలమువలననే ఇంద్రియ ద్వారమున అంతఃకరణవృత్తి బహిర్ఘటాదుల సమీపమునకు పోవును; ప్రాణసాహాయ్యము లేనియెడ అంతఃకరణాదులకు

---

1. ప్రాణేంద్రియములకలహామై ప్రాణమునకు శ్రేష్ఠత సిద్ధమాయెను. ఈసంగతి పంచమతరంగమందు వ్రాయఁబడినది.

2. "ఓసౌమ్యుఁడా [ప్రియదర్శనుఁడా]! ప్రాణరూపస్తంభమందు పక్షి వలె నిబద్ధముగానున్నది; ఇట్టిది మనస్సు" అనునీ శ్రుతిప్రామాణ్యముచేత మనస్సు ప్రాణమునకు అధీనముగా నున్నది.

బహిర్గమనముగూడ సంభవింపదు. ఈకారణమువలననే యోగ శాస్త్రమందు చెప్పఁబడినది—"ప్రాణనిరోధముగాక మనోనిరోధముగాదు; ప్రాణసంచారనిరోధములవలన మనస్సంచారనిరోధములు గలుగును; కనుక మనోనిరోధరూపరాజయోగేచ్ఛ గల్గినవాఁడు ప్రాణనిరోధరూప హఠయోగానుష్ఠానము చేయవలెను." ఈప్రకారముగ అంతఃకరణగమనము ప్రాణాధీనమగును; అది వెడలక అంతఃకరణజ్ఞానేంద్రియములు బాహ్యము వెడలవు. స్వప్నావస్థయందు స్థూలశరీరము ప్రాణసమేతమే ప్రతీతమగును; దానివలన స్వప్నమందు బహిస్థితములైన సత్యగిరిసముద్రాదులయొక్క దర్శనమునుట ఘటిల్లదు.

లేక ఏపురుషుఁడు తనసంబంధిని స్వప్నమందు సంధించి వ్యవహారము చేయునో, వాఁడు జాగ్రత్తయందు సంధించినంతట ఇట్లనవలయును—"మిమ్ములను రాత్రి నేను చూచితిని; మీరు నేను కలిసి, ఈలాటివ్యవహారము చేసితిమి." ఆ సంబంధి యెూ, ఏమియు చెప్పఁడు; సిద్ధాంతమందో, సంబంధియు, వానితో సంధించుటయు, వ్యవహారమును అన్నియు అంతరమందే కల్పితములు.

లేక బాహిరము వెడలి సత్యపదార్థములను చూచుపక్షమున రాత్రియందు నిద్రపోయినపురుషుఁడు హరిద్వారమందు, మధ్యాహ్న సూర్యుని, హరిద్వారము గంగకుపూర్వమందును, నీలగిరి గంగకుపశ్చిమమందును చూచును; అచ్చట రాత్రియందు మధ్యాహ్న సూర్యుఁడు లేఁడు; గంగకుపూర్వమందు హరిద్వారపురము లేదు; గంగకుపశ్చిమమందు నీలపర్వతమును లేదు.

## 233. సిద్ధాంతము-జాగ్రత్స్వప్నముల-తుల్యత త్రిపుటీసమాజము స్వప్నమందు క్రొత్త

స్వప్నమందు జాగ్రత్పదార్థస్మృతిగాని, లింగశరీరము యొక్క బహిర్గమనముగాని సంభవింపదు. జాగ్రత్తయందువలె జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపమగు సకలత్రిపుటి స్వప్నములో కంఠస్థితమగు హితనాడియందు క్రొత్తగా ఉత్పన్నమగును. ఇట్లు సకల ప్రమాణమూర్ధన్యమగు వేదము పలికెను.

ఉపనిషత్తు[1] లందు ఈప్రసంగము గలదు—"జాగ్రత్పదార్థము స్వప్నమందు ప్రతీతము గాదు, రథాశ్వమార్గాది అన్నియు క్రొత్తగా ఉత్పన్నము లగును." ఆప్రకారముగా పర్వత సముద్ర నదీ వన గ్రామ పురీ చంద్రసూర్యాదులు, వాని జ్ఞానసాధనములగు ఇంద్రియాంతఃకరణాదులు ఏవేవి స్వప్న మం

1. "న తత్ర రథా న రథయోగా న పంథానో,
భవంత్యథ రథాన్ రథయోగాన్ పథస్సృజతే"

అర్థము—ఇచ్చట [స్వప్నమందు] రథము లేదు; అశ్వములు లేవు; మార్గము లేదు; అయిన స్వప్నమునకధిష్ఠానమైన సాక్షిచైతన్యముగాను, లేక బ్రహ్మచైతన్యముగాను ఉన్నది. స్వప్నమందే రథము, అశ్వములు, మార్గము కూడ క్రొత్తగ సృజింపఁబడుచున్నవి. ఈశ్రుతియందు, స్వప్నకాలమందు రథాదిత్రయముచేత ఉపలక్షితమయిన సకలజగత్తుయొక్క నూతనోత్పత్తి చెప్పఁబడి యున్నది.

"సంధ్యేసృష్టిరాహహి" ఈశ్రుతియందును జాగ్రత్సుషుప్తులసంధియందు సృష్టిచెప్పఁబడినది. ఈశ్రుత్యర్థముపలన పూర్వశ్రుత్యర్థము సుదృఢమగుచున్నది. కాఁబట్టి స్వప్నమందు జాగ్రత్పదార్థస్మృతి, లేక లింగశరీరముచే బాహ్యగిరిసముద్రాదులయొక్క దర్శనము సంభవింపదు.

దగుపడునో, అనంతయు క్రొత్తగా ఉత్పన్నమగును. ఉత్పన్నము గానియెడల వాని ప్రత్యక్షజ్ఞానము గాఁకూడదుగదా! ఏలయన—విషయముతో ఇంద్రియసంబంధము, లేక వృత్తిసంబంధము, ప్రత్యక్షజ్ఞానమునకు హేతువు; జాగ్రదింద్రియాదులో, ఆకాలమందు నిశ్చేష్టితములు.

యద్యపి స్వప్నపదార్థము శుక్తిరజతాదికమువలె సాక్షిభాస్యము; స్వప్నజ్ఞానమందు అంతఃకరణేంద్రియములయొక్క ఉపయోగము లేదు, కనుక జ్ఞేయమైనపర్వతాదికముయొక్క ఉత్పత్త్యంగీకారము యోగ్యముగాని, జ్ఞాతృజ్ఞానేంద్రియోత్పత్త్యంగీకారము యోగ్యముగాదు; తథాపి స్వప్నమందు ఎట్లు పర్వతాదికము ప్రతీతమగునో; అట్లు ఇంద్రియాంతఃకరణప్రాణసహితమగు స్థూలశరీరమును ప్రతీతమగును; కనుక ఇంద్రియాదులయొక్కయు ఉత్పత్త్యంగీకారము ఉచితము.

లేక స్వప్న పదార్థములందు నేత్రాదికముయొక్క విషయత భానమగును. వ్యావహారికనేత్రాదులవిషయతయో, స్వప్న మందలి ప్రాతిభాసికపదార్థములందు ఘటిల్లదు. ఏలయన—సమస్తగలపదార్థములు తమలోతాము సాధకబాధకములు; ఈసంగతి పంచమతరంగమందు వ్రాయఁబడినది; తదనుసారముగా వ్యావహారికనేత్రాదికములు శరీరమం దుండినను వీనివలన విషమసత్తగల స్వప్నస్థపర్వతాదిపదార్థజ్ఞానము ఘటిల్లదు.

లేక వ్యావహారికములైన ఇంద్రియములు తమతమ గోళకమును వదలి, కార్యము చేయుటయందు సమర్థములుగావు;స్వప్నమందు హస్తపాదవాగ్గోళకములు ఇతరులకు నిశ్చలముగా కనఁ

బడుచు; పురుషుఁడో, హస్తమందు ద్రవ్య ముంచుకొని, అటు చూచు పరుగిడును; దానివలన స్వప్నమందు ఇంద్రియాద్యుత్పత్తి అవశ్యముగా అంగీకరింపవలయును. అట్లు సుఖదుఃఖములు, వీని జ్ఞానము, తదాశ్రయమైన ప్రమాత స్వప్నమందు ప్రతీత మగును; లేనిపదార్థములయొక్క ప్రతీతియే గాదు; కాఁబట్టి అచ్చట సకలత్రిపుటీసమాజము ఉత్పత్తిగలదిగా అంగీకరింప వలయును.

అనిర్వచనీయఖ్యాతిరీతిగా ఎన్ని భ్రమజ్ఞానములు గలవో, వాని సకలవిషయములు అనిర్వచనీయములై ఉత్పన్నము లగును; విషయము లేక ఏ జ్ఞానమును గానేరదు; ఇతరశాస్త్ర మతమందో, అన్యపదార్థముయొక్క అన్యరూపభావమును భ్రమ మందురు; సిద్ధాంతమందో, ఎట్లు పదార్థముగునో, అట్లు జ్ఞాన మగును; అప్పుడు ఆ పదార్థము సత్యముగానీ, మిథ్యగానీ; తదనుసారముగా స్వప్నమందు సకలత్రిపుటీసమాజముయొక్క ఉత్పత్తియే అంగీకరింపవలయును.

## 234. స్వప్నమందు పదార్థోత్పత్తిశంక

పూర్వోక్తసంగతియందు ఈశంక గలుగును—స్వప్న ప్రతీతమయిన పదార్థముయొక్క ఉత్పత్తిని అంగీకరించినయెడ, ఎట్లు స్వప్నదృష్టాంతమువలన జాగ్రత్పదార్థము మిథ్య యని చెప్పఁబడినదో, అట్లు జాగ్రత్పదార్థమువలె ఉత్పత్తిమంతమగుట వలన స్వప్నపదార్థమును సత్యము గావలయును; స్వప్నప్రతీత పదార్థోత్పత్తి అంగీకరింపకుండిన ఈ దోషము కలుగదు; ఏల యన—జాగ్రత్పదార్థము ఉత్పన్నమై ప్రతీతమగును; స్వప్న పదార్థము ఉత్పన్నముగాకయే ప్రతీతమగును?

## 235. 234—గతోక్తశంకకు సమాధానము స్వప్నమందుత్పత్త్యంగీకారము యోగ్యము

ఏ వస్తువుయొక్క ఉత్పత్తియందు ఎంత దేశకాలాది సామగ్రి కావలయునో, అంతసామగ్రిలేక ఉత్పన్నమైన పదార్థమును మిథ్యయందురు; అట్లు స్వప్నస్థహస్త్యాదికోత్పత్తికి కావలసిన దేశకాలాదులు లేవు; దీర్ఘకాలమందు, విస్తీర్ణదేశమందు ఉత్పత్తియోగ్యములైన హస్త్యాదులు క్షణమాత్రకాలమందు, సూక్ష్మమయిన కంఠదేశమందు ఉత్పన్నమగుచున్నవి; కనుక అవి మిథ్య.

యద్యపి స్వప్నావస్థయందు దేశకాలాదులును అధికములుగా ప్రతీతములగును తథాపి అన్యపదార్థములవలె ఆ యధికదేశకాలాదులును అనిర్వాచనీయముగా ఉత్పన్నములగును; ఏలయన—విషయములేక జ్ఞానము కానేరదు; స్వప్నమందైననో, అధికదేశకాలజ్ఞానమగును; వ్యావహారికదేశకాలములు న్యూనములుగా నుండును; అవి హస్త్యాదులకు కారణములు గావు.

మఱియును కారణము మొదలేయుండును; కార్యము వెనుక పుట్టును; స్వప్నముయొక్క దేశకాలాదులును, హస్త్యాదులును ఒకేసమయమందు పుట్టును.

ఇదియునుగాక—మాతాపిత్రాదిగజోత్పత్తిసామగ్రియు స్వప్నమందు లేదు. యద్యపి స్వప్నమందు ప్రాణిపదార్థములయొక్క తల్లిదండ్రులును ప్రతీతులగుదురు; తథాపి ఆ స్వప్నమందలి తల్లిదండ్రులు పుత్రోత్పత్తికి హేతువులుగారు; ఏల

యన—తల్లిదండ్రులును, పుత్త్రుఁడును తోడనే పుట్టుదురు; వానికి కార్యకారణభావము ఘటిల్లదు. ఏ నిద్రాసహితావిద్యవలన స్వప్నపదార్థములు పుట్టునో, ఆ యవిద్యయే వానికి తల్లిదండ్రులుగా నున్నవి. ఏది దోషసహితావిద్యవలన జన్మించునో, అది శుక్తిరజతమువలె మిథ్యయగును. ఈ ప్రకారముగా స్వప్నపదార్థము మిథ్య.

ఆ మిథ్యాపదార్థమునకు ఉపాదానకారణము అంతఃకరణము, లేక సాక్షాదవిద్యగా నున్నది; ప్రథమపక్షమందు స్వప్నమున కధిష్ఠానము సాక్షిచైతన్యముగాను, ద్వితీయపక్షమందు బ్రహ్మచైతన్యముగాను [1] ఉన్నది. ఈరీతిగా అంతఃకరణముయొక్క, లేక అవిద్యయొక్క పరిణామము, మఱియు చైతన్యముయొక్క వివర్తము ఇట్టిది స్వప్నముగా నున్నది.

---

1. ఇచ్చట కొంతవిశేషవిచారము గలదు—అంతఃకరణావచ్ఛిన్నకూటస్థచైతన్యము పారమార్థికజీవుఁడు; మఱియు ఆ కూటస్థచైతన్యమందు కల్పితుఁడై, చిదాభాసరూపుఁడైన వ్యావహారికజీవుఁడు మఱియు ఆ వ్యావహారికజీవరూపాధిష్ఠానమందు కల్పితుఁడై నిద్రాదోషసహితావిద్యావృతుఁడైన ప్రాతిభాసికజీవుఁడు, ఈ భేదములవలన జీవుఁడు మూఁడువిధములుగా నున్నాఁడు. ఏతద్వాదులైన విద్యారణ్యస్వామి మొదలగువారు స్వప్నమునకధిష్ఠానము వ్యావహారికజీవుఁడు, మఱియు జగత్తనుచున్నారు; దీనియందు స్వప్నజీవుని [ద్రష్టయొక్క] అధిష్ఠానము జాగ్రత్తయొక్క జీవుఁడు గాను, జగత్తునకు [దృశ్యమునకు] అధిష్ఠానము జాగ్రత్తయొక్క జగత్తుగాను ఉన్నది. మఱియు స్వప్నాధ్యాసమునకు ఉపాదానము, వ్యావహారికజీవునకు మఱియు జగత్తునకు ఆవరకమైన నిద్రారూపావస్థాజ్ఞానము [తూలాజ్ఞానము] నున్నది. వ్యావహారికద్రష్టయు దృశ్యమును జడమగుటవలన వానియందు అధ్యస్తపదార్థమునకు సత్తాస్ఫూర్తి ఇయ్యఁదగినది అధిష్ఠానత సంభవించదు; కనుక అహం

## 236. ద్వితీయపక్షమందు ప్రథమశంక — బ్రహ్మజ్ఞానముదప్ప స్వప్ననివృత్తిగాఁగూడదు

ఉక్తప్రకారమందు ఇట్టిశంకగలిగినది — అధిష్ఠానజ్ఞానము వలన కల్పితముయొక్క నివృత్తియగును; ద్వితీయపక్షమందు

---

కారావచ్ఛిన్నచైతన్యము, లేక అహంకారానవచ్ఛిన్నచైతన్యము స్వప్నమున కధిష్ఠానముగా చెప్పఁబడినది; ఇవి రెండుమతములును సమీచీనములుగా నున్నవి.

వీనియందు ప్రథమమతమంగీకరించిన, అహంకారావచ్ఛిన్న చైతన్యము యొక్క ఆచ్ఛాదకమైన తూలాజ్ఞానమే స్వప్నమునకు ఉపాదానమగుట సంభవించును; జాగ్రత్తయొక్క బోధవలన బ్రహ్మజ్ఞానము లేక తన్నివృత్తియు సంభవించును; మఱియు అవిద్యయందు ప్రతిబింబరూపమైన జీవచైతన్యము, లేక బింబరూపమైన ఈశ్వరచైతన్యము వివరణకారుని రీతిగా వ్యాపకమగుట వలన అది అహంకారానవచ్ఛిన్న చైతన్యముగా నున్నది; దానిని స్వప్నము నకు అధిష్ఠానమనిన, తదాచ్ఛాదకమైన మూలాజ్ఞానమే స్వప్నమునకు ఉపాదానము ఘటిల్లినది. ఈ ద్వితీయపక్షమందు జాగ్రద్బోధవలన స్వప్నము యొక్క బాధరూపనివృత్తి గాఁజేరదు! మఱేమనఁగా — ఉపాదానమందు విలయరూపనివృత్తి యగుచున్నది.

అయినను అహంకారానవచ్ఛిన్నచైతన్యము స్వప్నమునకు అధిష్ఠానమని నను; శరీరాంతర్దేశస్థచైతన్యమే అధిష్ఠానమగును: బాహ్యదేశస్థచైతన్యము గాదు; అవిద్యయందు ప్రతిబింబమైన జీవచైతన్యము, లేక బింబమైన ఈశ్వరచైతన్యము రెండును అహంకారానవచ్ఛిన్నములయి, వ్యాపకములగుట వలన శరీరములోపలఁగూడనున్నవి. వానిలో అంతర్దేశస్థచైతన్యమందే అధిష్ఠానత్వమంగీకరించి, దానికి అంతఃకరణము అవచ్ఛేదకమనిన, అహంకారావచ్ఛిన్నమునకు అధిష్ఠానత సిద్ధమగును; మఱియు అంతఃకరణము అవచ్ఛేదక మంగీకరింపకుండిన, అహంకారానవచ్ఛిన్నమునకు అధిష్ఠానత సిద్ధమగును.

అహంకారానవచ్ఛిన్నమయిననో, అవిద్యాప్రతిబింబము, బింబము ఇవిరెండును గలవు. మతభేదమువలన రెండింటికిని స్వప్నాధిష్ఠానత చెప్పఁబడి

స్వప్నమున కధిష్ఠానము బ్రహ్మమగుటవలన బ్రహ్మజ్ఞానముగాక అజ్ఞానికి జాగ్రత్తయందు స్వప్ననివృత్తి గాకుండవలసివచ్చును?

**237.** అన్యశంక—జాగ్రత్స్వప్నములు రెంటికిని ఒకసత్త గావలయును.

ఎట్లు స్వప్నమున కధిష్ఠానము బ్రహ్మము, మఱియు ఉపాదానకారణము అవిద్యగా నున్నదో, అట్లు వేదాంతసిద్ధాంతమందు జాగ్రత్తయొక్క వ్యావహారికపదార్థములకును అధిష్ఠానము బ్రహ్మము, మఱియు ఉపాదానకారణము అవిద్యగా నున్నది; కనుక జాగ్రత్పదార్థములు వ్యావహారికములు, స్వప్నపదార్థములు ప్రాతిభాసికములు అనుభేదము ఉండఁగూడదు గదా! రెండును వ్యావహారికములు గావలయును? లేక రెండును ప్రాతిభాసికములు గావలయును ?

**238.** 236 గతోక్తప్రథమశంకకు సమాధానము నివృత్తిద్వివిధము

నివృత్తి రెండుప్రకారములగలదని పూర్వము ఖ్యాతి

---

వది; అట్లయినను, వానిలో అవిద్యయందు ప్రతిబింబరూపమైన జీవచైతన్యమునకు అధిష్ఠానత స్థూలదృష్టిచే కనఁబడినను, ఆ ప్రతిబింబము స్వయముగ కల్పితమగుటవలనవిచారదృష్టిగా దానికి అధిష్ఠానతకు యోగ్యతలేదు; కాఁబట్టి అంతఃకరణోపహితము, లేక అవిద్యోపహితము అగు సాక్షిచైతన్యమే అధిష్ఠానమనుట ఉచితము.

ఇవన్నియుం సత్తాత్రయవాదులయొక్క మార్గములుగా నున్నవి: దృష్టిసృష్టివాదముననో, సకలానాత్మపదార్థములకు ఒకప్రాతిభాసిక సత్తయే యగుటవలనజాగ్రత్స్వప్నముల రెండింటికికూడ బ్రహ్మచైతన్యమే అధిష్ఠానముగ అంగీకరింపఁబడును;

నిరూపణమందు వ్రాయఁబడినది; తదనుసారముగ కారణసహిత కార్యవినాశరూపమైన స్వప్నముయొక్క అత్యంతనివృత్తియో, జాగ్రత్తయందును బ్రహ్మజ్ఞానముగాక ఘటిల్లదు; అయిన దండ ప్రహారముచే ఘటమునకు మృత్తికయందు లయమగునట్లు స్వప్న హేతువైన నిద్రాదోషము నశించుటవలన, లేక స్వప్న విరోధియైన జాగ్రత్తయొక్క ఉత్పత్తివలన అవిద్యయందు స్వప్నముయొక్క లయరూపనివృత్తి బ్రహ్మజ్ఞానముగాకయు సంభవించుచున్నది.

## { 239. 237.—గతోక్తద్వితీయశంకకు సమాధానము స్థూలదృష్టిచే భిన్న సత్తానిరూపణము }

"జాగ్రత్స్వప్నములు రెండు సమానములు గావలయును." అదియును ఘటిల్లదు. ఏలయన—జాగ్రత్పదార్థోత్పత్తి యందో, అన్యదోషరహితమైన కేవలానాద్యవిద్యయే ఉపాదాన కారణము; స్వప్న పదార్థమందో నిద్రాదోషము అవిద్యకు సాహాయ్యముగ నున్నది; కనుక అన్యదోషరహితావిద్యాజన్యమును వ్యావహారికమందురు; దోషసహితావిద్యాజన్యమును[1] ప్రాతిభాసిక మందురు.

ఈరీతిగా స్వప్న పదార్థమందు జాగ్రత్పదార్థముకన్న విలక్షణతగలదు; అయిన ఈసంపూర్ణ ప్రతిపాదనము త్రివిధసత్తనంగీకరించి, స్థూలదృష్టిచే చెప్పఁబడినది; విచారదృష్టిచేతనో, త్రివిధసత్త ఘటిల్లదు; జాగ్రత్స్వప్నములయొక్క పరస్పర విలక్షణతయును ఘటిల్లదు.

---

1. తూలావిద్యాజన్యమైన.

వేదాంతపరిభాషాది గ్రంథములందు పూర్వప్ర[illegible]
వ్యావహారిక ప్రాతిభాసికపదార్థములయొక్క పరస్పర భేదము
చెప్పఁబడినది. వానిలో మూఁడుసత్తల అంగీకారము గలదు.
అట్లు విద్యారణ్యస్వామిచేతను మూఁడుసత్తలు అంగీకరింపఁ
బడినవి. వారిచే ఈ ప్రసంగము వ్రాయఁబడియున్నది—
దేహాదికపదార్థములు రెండువిధములు— మొదటిది ఈశ్వర
సంకల్పరచితములు; అవి బాహ్యములు, రెండవది జీవసంకల్ప
రచితములు; అవి ఆంతరములు [మనోమయములు.]

ఈ రెండింటియందు జీవరచితమైన ఆంతరములు సాక్షి
భాస్యములుగాను, ఈశ్వరరచితములైన బాహ్యములు ప్రమా
తృప్రమాణవిషయములుగాను ఉన్నవి. వానిలో ఆంతరమైన
మనోమయదేహాదులు జీవునిసుఖదుఃఖములకు హేతువులు
గాని, బాహ్యమయిన ఈశ్వరరచితములు జీవుని సుఖదుఃఖ
ములకు హేతువులు గావు. కాఁబట్టి మనోమయపదార్థముల
నివృత్తి ముముక్షువునకు అపేక్షితముగాని, బాహ్యపదార్థముల
నివృత్తి అపేక్షితము గాదు.

చూడుము—ఇద్దఱుపురుషుల కొడుకులిద్దఱు విద్యా
భ్యాసముకొఱకు విదేశమునకు పోయిరి. వీరిలో నొక్కఁడు చని
పోయెను. ఇంకొక్కఁడు విద్య సంపాదించి, విశేషైశ్వర్యము
సంపాదించి, సుఖముగా నుండెను. ఆ బ్రతికినవాఁడు తనదేశము
నకు ఎవ్వఁడో పోవుచుండఁగా వానితో తనతండ్రికి చెప్పి
పంపెను— తాను సుఖముగా సకలైశ్వర్యములతో నున్న
వాఁడనియు, తనతోవచ్చినయితరుఁడు మృతినొందెననియు చెప్పి
పంపెను. ఆ వంచకపురుషుఁడు యథార్థము చెప్పక వ్యత్యస్త

ముగా చెప్పెను— బ్రతికినవానితండ్రితో కొడుకు చచ్చెననియు, మృతునితండ్రితో కొడుకు సుఖముగా సంపద్యుక్తుఁడై యున్నవాఁడనియు, అల్పదినములలో గజారూఢుఁడై నీదర్శనముకొఱకు వచ్చుననియు చెప్పెను. అపుడు బ్రతికినవానితండ్రి యేడ్వసాగెను. మృతునితండ్రి హర్షనిర్భరుఁడాయెను.

ఈకథయందు చూడుము—దేశాంతరమందు ఈశ్వరరచితపుత్త్రుఁడు జీవించియుండియు, మనోమయపుత్త్రుఁడు చనిపోయెను; కనుక దుఃఖమాయెను; ఈశ్వరరచితపుత్త్రుఁడు బ్రతికినను, సుఖముగాలేదు. అట్లు ఇతరుని ఈశ్వరరచితపుత్త్రుఁడు చనిపోయినను, వానికి దుఃఖముగాలేదు; మనోమయపుత్త్రుఁడు జీవితవంతుఁడుగా నుంటవలన వానికి సుఖమయినది. ఈరీతిగా జీవసృష్టియె సుఖదుఃఖములకు హేతువుగాని, ఈశ్వరసృష్టి సుఖదుఃఖములకు హేతువు గాదు.

ఈప్రకారముగా విద్యారణ్యస్వాములచే సృష్టి రెండుప్రకారములని చెప్పఁబడినది. అచ్చట జీవసృష్టి ప్రాతిభాసికము; ఈశ్వరసృష్టి వ్యావహారికము. అట్లు ఇతర గ్రంథకారులచేతను సత్త త్రివిధముగా చెప్పఁబడినది. వానిలో చైతన్యమునకు ఒకటి పరమార్థసత్త, చైతన్యభిన్నమైన జడపదార్థములకు సత్త ద్వివిధము— మొదటిది వ్యావహారికము, రెండవది ప్రాతిభాసికము. ఈశ్వరసంకల్పముచేత ఉత్పన్నమైన కేవలావిద్యాకార్యములగు పంచభూతములు, మఱియు వీనికార్యములు వీనికి వ్యావహారికసత్తగలదు. దోషసహితావిద్యాకారమైన స్వప్నపదార్థములకును, శుక్తిరజతాదులకును ప్రాతిభాసికసత్త గలదు. ఈరీతిగా జాగ్రత్పదార్థములకు వ్యావహారికసత్తయును, స్వప్నపదార్థములకు ప్రాతిభాసికసత్తయును తెలియునది.

అట్లుయనను విచారదృష్టివలన చూచినట్టయిన సకలానాత్మపదార్థములకును ప్రాతిభాసికసత్త గలదు. కాబట్టి సత్త ద్వివిధముగానే యున్నది; వానిలో నొకటి చైతన్యమునకు పరమార్థసత్త, చైతన్యభిన్న పదార్థములకు ప్రాతిభాసికసత్త జాగ్రత్స్వప్నపదార్థములందు కించిన్మాత్రమును విలక్షణత సిద్ధింపదు. ఈయుక్తమసిద్ధాంతమును ఇప్పుడే ప్రతిపాదించుచున్నాము—

దేశకాలాది సామగ్రి లేక స్వప్నమునందు హస్తిపర్వతాదికములు పుట్టుటవలన వానిని మిథ్యయందురు. అట్లు ఆకాశాది ప్రపంచసృష్టి ఏబ్రహ్మమువలన పుట్టుచున్నదో, ఆబ్రహ్మంబునందు దేశకాలాదులయొక్క లేశమును లేదు. స్వప్నమందు హస్త్యాదులకు యోగ్యమైన దేశకాలాదికము లేకుండినను, అల్పముగా నున్నది; ఆకాశాద్యుత్పత్తియందో, అల్పమును లేదు. ఏలయన దేశకాలరహిత పరమాత్మవలన సృష్టి చెప్పఁబడినది.

తైత్తిరీయ శ్రుతియందును ఆకాశాదికమును క్రమముగా సృష్టి చెప్పఁబడినది; గాని, దేశకాలములచే సృష్టి చెప్పఁబడలేదు. భాష్యకారులచేతను దేశకాలములచే సృష్టి చెప్పఁబడలేదు. దానియందు శ్రుతియొక్కయు, భాష్యకారులయొక్కయు అభిప్రాయ మేమనఁగా—ఆకాశాది [1] ప్రపంచోత్పత్తి దేశకాలాదిసామగ్రి లేకయు అగును. కనుక అది స్వప్నమువలె మిథ్య.

---

1. ఇచ్చట ఈరహస్యము గలదు— ఇద్దఱు బలశాలులైన పురుషులు కాన్యసమందు తమతమబలమునుగురించి వాదించి, స్వస్వబలపరీక్షకొఱకు "ఇతరునికొట్టినవాఁడు బలిష్ఠుఁడు" ఇట్టిప్రతిజ్ఞ చేసి, ఉభయకోటియందు శక్తిని [శక్తియనఁగా రెండుప్రక్కలవాఁడిగలశస్త్రము] మధ్యపెట్టుకొని దాని

యద్యపి మధుసూదనస్వాములు దేశకాలములు సాక్షాదవిద్యాకార్యములని చెప్పియున్నారు. దానివలన ఇట్లు కనఁబడుచున్నది—మాయావిశిష్టపరమాత్మవలన మొదలుమాయాపరిణామములగు దేశకాలములు పుట్టి, తరువాత ఆకాశాది

---

ఒక్కొక్కొనను ఒక్కొక్కని హృదయమునకు తాఁకించి, యొక్కొక్కరును ఎదురెదురు నెట్టుకొనుచు చచ్చిరి.

అట్లు బ్రహ్మరూపశూన్యవనంబునందు జాగ్రత్ప్రపంచస్వప్నప్రపంచరూపులు ఇద్దఱు బలిష్ఠులైనవీరులు, తమలోతాము పరస్పరదృష్టాంతమువలన పరస్పరప్రహారము పొందును; కావున దృష్టాంతము శస్త్రరూపముగా నున్నది. "దేశకాలాదిసామగ్రి లేక ఏది పుట్టుచున్నదో, అది మిథ్య" ఇది యిద్దఱికి ప్రతిజ్ఞావాక్యము.

ఎట్లు దేశరూపసామగ్రిపూర్ణముగా నుండఁగానె కాలరూపసామగ్రీన్యూనతవలనఁ బుట్టిన యీకెలపావురాయి, బోకివలనరూపాయి, చర్మమయమైన పాము ఇత్యాదులైన ఐంద్రజాలికపదార్థములు మిథ్యయందురో, అట్లు హితయనుకంఠనాడీరూపమైన అల్పదేశమందు మఱియు అల్పకాలమందు పుట్టిన ఏ స్వప్నప్రపంచముగలదో, అది మిథ్య; దానిదృష్టాంతమువలన జాగ్రత్ప్రపంచము మిథ్య ఇట్లు స్వప్నముయొక్క దృష్టాంతమువలన జాగ్రత్ప్రపంచమునకు ప్రహారమగును. అట్లే దేశకాలరూపమగు సామగ్రీలేశరహితమయిన బ్రహ్మంబునందు జాగ్రత్ప్రపంచము ప్రతీతమగుచున్నది; అందువలననది మిథ్య; ఈజాగ్రత్ప్రపంచదృష్టాంతమువలన స్వప్నప్రపంచమునకు ప్రహారమగును. యద్యపి తత్తత్కార్యమునకు యోగ్యమైనట్టి దేశకాలములు జాగ్రత్ప్రపంచమునందు కనఁబడుచున్నవి; తథాపి ఆదేశకాలములు జాగ్రత్ప్రపంచమునందే అంతర్గతమగుటవలన అధిష్ఠానమగు బ్రహ్మంబునందు చేర్పఁబడినవి కావు.

ప్రపంచోత్పత్తిఅగుచున్నది. ఈవిధముగ చూచినపుడు యోగ్య దేశకాలములవలన ఆకాశాదిప్రపంచోత్పత్తి కనఁబడుచున్నది; తథాపి స్వాములయొక్క అభిప్రాయము ఇట్లుగాదు— [దేశ కాలములు ప్రథమమగును, ఆకాశాదికము ఉత్తరమగును.]

---

ఒకానొకఁడిట్లనును—"జాగ్రత్ప్రపంచముకన్న భిన్నమైన దేశకాలములు ప్రపంచమునకు కారణముగ నున్నవి" వానినిట్లడుగవలయును—ఆ దేశకాలములు బ్రహ్మముకన్న అభిన్నములా? భిన్నములా? అభిన్నములనిన, బ్రహ్మముకన్న భిన్నములగు దేశకాలాభావమువలన దేశకాలరహితమైన బ్రహ్మంబునందే ప్రపంచప్రతీతి సిద్ధము. మఱియు దేశకాలములు బ్రహ్మముకన్న భిన్నములనిచెప్పిన, వానినడుగవలయును—దేశకాలములు సత్యములా? మిథ్యయా? సత్యమనినపుడు, అద్వైతశ్రుతితో విరోధమగును; మిథ్యయనిన, ఇవియును ప్రపంచమువలె కార్యమగుటవలన వీనికిని కారణమైన దేశకాలములను చెప్పవలయును. ఆ దేశకాలములు తమకుతామే కారణమనిన, ఆత్మాశ్రయదోషమగును; ప్రథమదేశకాలములకు కారణము ద్వితీయము, ద్వితీయమునకు కారణము ప్రథమము; అనిన, అన్యోన్యాశ్రయదోషమగును; ద్వితీయమునకు తృతీయము, తృతీయమునకు చతుర్థము, చతుర్థమునకు పంచమము, ఇట్లు చెప్పుచుపోయిన, అనవస్థాదోషమగును; దానివలన ఏ దేశకాలములును కారణమనుట సిద్ధింపదు.

ఈరీతిగా దేశకాలరహితబ్రహ్మమువలన జాగ్రజ్జగదుత్పత్తి అయినది, కావున జాగ్రత్ప్రపంచము మిథ్య. లేక జాగ్రత్కాలమందు స్వప్నపదార్థస్మృతి యగును; స్వప్నమందు ప్రాయికముగా జాగ్రత్పదార్థస్మృతి గాదు; అందువలనను జాగ్రత్ప్రపంచము మిథ్య. దానిదృష్టాంతమువలన స్వప్నప్రపంచమును మిథ్య.

మఱియు ఎప్పుడు జాగ్రత్తయొక్క అభావము గలదో, అప్పుడు తదంతర్గతమైన సమాధియొక్కయు అభావము గలదు. ఎప్పుడు జాగ్రత్స్వప్నా

ఏలయన— అతీత కాలముండైనది. ప్రథమము, లేక పూర్వ మందురు; భవిష్యత్కాలమండైనది పశ్చిమము, లేక ఉత్తర మందురు; "ఆకాశాద్యుత్పత్తికన్న మొదలు దేశకాలము లుత్పన్నములగును" ఇట్లు చెప్పుటవలన ఆకాశాద్యుత్పత్తి కాలము కన్న మొదలు దేశకాలోపహితపరమాత్మ దేశకాలములకు అధిష్ఠానముగా నున్నాఁడని సిద్ధమగును. దానివలన దేశకాలోత్పత్తియందును మొదలు కాలముయొక్క అపేక్ష యగును. కాలోత్పత్తిలేకయో, పూర్వకాలము అసిద్ధము.

స్వాములయభిప్రాయము ఇట్లు ఎఱుఁగవలెను—ఎట్లు భూతభౌతికప్రపంచము ప్రతీతమగునో, అట్లు దేశకాలము లును ప్రతీతములగును; ఆత్మకన్న భిన్నమో, ఏ పదార్థమును సత్యముగాదు; కనుక దేశకాలములును సత్యములు గావు. మఱియు అనుత్పన్నముయొక్క ప్రతీతిగానేరదు; దేశ కాల ములో, ప్రతీతమయినవి; కాబట్టి ఆకాశాదికమువలె దేశకాల ములును ఉత్పత్తిగలవియే. ఆ దేశకాలములు మాయాపరిణా మముగాను, చైతన్యవివర్తముగాను ఉన్నవి.

ఏది తాను వివర్తమగునో, అది ఇంక దేనికిని కారణము గాదు; కనుక ఆకాశాదిప్రపంచోత్పత్తియందు దేశకాలములకు కారణత ఘటిల్లదు. లేక కారణము మొదటిది, కార్యము వెనుక

---

భావముగలదో, అప్పుడు రెండవస్తులందు విద్యమానమయిన బుద్ధియొక్క అభావమువలన దానియొక్క విలయరూపమైన సుషుప్తి, మఱియు సుషుప్త్యం తర్గతములగు మరణమూర్ఛలు వీనికిని బ్రహ్మంబునందు అభావము గలదు. ఈరీతిగా బ్రహ్మంబునందు సకలప్రపంచముయొక్క అసిద్ధివలన అజాతవాదమే సిద్ధమగుచున్నది.

టిది ఉండవలయును. పైఁజెప్పినరీతిగా ఆకాశాదిప్రపంచము కన్న దేశకాలములు మొదటివిగావు; అందువలన దేశకాలములకు కారణత ఘటిల్లదు. మఱేమనఁగా—స్వప్నమందు తలిదండ్రులు, పుత్త్రులువలె దేశకాలసహితాకాశాదిప్రపంచము మాయావిశిష్టపరమాత్మచే ఉత్పన్నమని ఎఱుఁగవలెను.

ఏ పదార్థము ఏ దేశమందు ఏ కాలమందు ఉత్పన్నమగునో, ఆ పదార్థము అన్యదేశమందు అన్యకాలమందు ఉత్పన్నము గానేరదు; అట్లు సకలపదార్థములు సృష్టికాలమందు ఉత్పన్నము లయినవి; ప్రలయకాలమందుఁ గావు. కనుక దేశకాలములకు, కారణత ప్రతీతమయినను, ఏ మాయవలన దేశకాలసహితప్రపంచోత్పత్తి యగునో, ఆ మాయవలననే దేశకాలములందు కారణత, మఱియు ఇతరప్రపంచమందు కార్యత ప్రతీతమగుచున్నది. వాస్తవముగా ఆకాశాదిప్రపంచమునకు దేశకాలములు కారణములుగావు.

### 240. దేశకాలప్రతీతియందు అన్యథాఖ్యాత్యంగీకారశంక, మఱియు తత్సమాధానము.

ఇచ్చట ఇట్టిశంక యగును—సిద్ధాంతమందును అనుత్పన్నపదార్థప్రతీతియొక్క అంగీకారము లేదు; అనుత్పన్నముయొక్క ప్రతీతి అంగీకరించిన, అసత్ఖ్యాతియొక్క అంగీకారమగును. మఱియు ఇట్లనుటచే అనుత్పన్నములైన వంధ్యాపుత్త్రశశవిషాణములయొక్కయు ప్రతీతి గావలయును; అది యొట్లుగానేరదు; కాఁబట్టి దేశకాలములందు కారణత లేకుండినపక్షమున మాయాబలమువలనను కారణత ప్రతీతము గాఁగూడదు.

అది ప్రతీతమగుచున్నది. దానివలన కనఁబడుచున్న దేమనఁగా. దేశకాలములందు కారణత యుండ నేయున్నది?

సిద్ధాంతి ఇట్లనును—"సర్వప్రపంచమునకు కారణము బ్రహ్మము, ఆ బ్రహ్మముయొక్క కారణత దేశకాలములంద ప్రతీత మగుచున్నది; స్వభావముచే దేశకాలములందు కారణ లేదు" ఆ వార్త ఘటిల్లదు; ఏలయన—ఎట్లు దేశకాలములక అధిష్ఠానము బ్రహ్మమో, అట్లు సర్వప్రపంచమునకును అధి ష్ఠానము బ్రహ్మము; కనుక దేశకాలములవలె ప్రపంచమందున కారణతా ప్రతీతి గావలయును; అట్లుండఁగా దేశకాలము యందుమాత్రము బ్రహ్మముయొక్క కారణతా ప్రతీతి, అన్య మందు తదప్రతీతి, యనుటయందు ఏ హేతువును కనఁబడదు

లేక అన్యరూపముచే అన్యవస్తుప్రతీతిని అన్యథాఖ్యాతి యందురు; దేశకాలములు కారణములు గావు; కారణముకన్న అన్యము అకారణము; ఆ యకారణముయొక్క అన్యరూపము అనఁగా కారణరూపముచే ప్రతీతిని అంగీకరించుటవలన అన్యథా ఖ్యాతియొక్క అంగీకారమగును; సిద్ధాంతమందో, అన్యథా ఖ్యాత్యంగీకారము లేదు; మఱియు ఈస్థానమందు అన్యథా ఖ్యాతిని అంగీకరించినట్టయిన, శుక్తియందు అనిర్వచనీయరజతో త్పత్తి సిద్ధాంతమందు అంగీకరింపఁబడినది నిష్ఫలమగును; ఏలా గుననఁగా—అన్యథాఖ్యాతి యందు రెండుమతములు గలవు.

(1) అన్యదేశమందు అన్యదేశస్థిత పదార్థముయొక్క ప్రతీతి, ఎట్లనఁగా—శుక్తిదేశమందు కాంతాకర స్థితరజత ప్రతీతి.

(2) అన్యరూపముచే అన్యపదార్థముయొక్క ప్రతీతి. ఎట్లనఁగా—రజతరూపముచే శుక్తియొక్క ప్రతీతి.

ఈరీతిగా సకలభ్రమస్థానంబునందు అన్యథాఖ్యాతిచేత నిర్వాహము సంభవించుచున్నది; కాఁబట్టి అనిర్వచనీయరజతాద్యుత్పత్తికథనము నిష్ఫలమగును?

మఱియు సిద్ధాంతి ఇట్లనును—"జ్ఞానము విషయముతో సమానాకారమగును; అన్యవస్తువుయొక్క అన్యరూపముచేత జ్ఞానము సంభవింపదు; కనుక అనిర్వచనీయోత్పత్తియే యంగీకరించుటయోగ్యము." ఇట్లనినయెడ నేను [పూర్వపక్షి] ఇట్లనుచున్నాను—అనుత్పన్నమైన కారణతయొక్క, లేక బ్రహ్మమందున్న కారణతయొక్క భానము సంభవింపదు; స్వభావముచే దేశకాలములందు కారణత గలదు; తత్కారణతాభానమే దేశకాలమందగుచున్నది; ఇట్లుండుటవలన, ఆకాశాదిప్రపంచమునకు దేశకాలములు కారణములు గావు; అను సిద్ధాంతివచనము అసంగతము.

ఈశంకఘటిల్లదు; ఏలయన—బ్రహ్మముయొక్కయే కారణత దేశకాలములందు ప్రతీతమగుచున్నది; చూడుము—

ఎట్లు జపాకుసుమసంబంధియైన రక్తత స్ఫటికమందు ప్రతీతమగునో, అట్లు స్ఫటికమందు అనిర్వచనీయరక్తోత్పత్త్యంగీకారము లేదు; పుష్పముయొక్క రక్తత స్ఫటికమందు ప్రతీతమగుటవలన శ్వేతస్ఫటికము రక్తరూపముగా ప్రతీతమగుచున్నది; ఆరక్తతయొక్క జ్ఞానమందు అన్యథాఖ్యాతి యంగీకరింపఁబడుచున్నది; అట్లు స్వప్నస్థమిథ్యాపదార్థమందు సత్యతాప్రతీతిస్థలములో అనిర్వచనీయసత్యత ఆపదార్థమందు ఉత్పన్న

మగుచున్నదనుపక్షమున "మిథ్య, సత్యముగా నున్నది" యను నట్లు వ్యాఘాతదోషము కనఁబడును. మఱియు అనుత్పన్నవ యొక్క ప్రతీతియే గానేరదు; కనుక అచ్చట స్వాప్నాధిష్ఠా చైతన్యముయొక్క సత్యత స్వప్నస్థమిథ్యాపదార్థమందు ప్రతీ మగుచున్నదని చెప్పఁబడినది; ఆ ప్రసంగమందుకూడ సత్యత జ్ఞానమందుమాత్రము అన్యథాఖ్యాతి అంగీకరింపఁబడినది. అట్లు దేశకాలములయందు అధిష్ఠాన బ్రహ్మముయొక్క కారణతాప్ర తీతియు అన్యథాఖ్యాతివలన అంగీకరింపఁబడినది. ఉక్తస్థానముల దప్ప ఇతరస్థానమం దంగీకారము లేదు.

మఱియు పూర్వపక్షి ఇట్లనును—"ఇన్నిస్థానములంద అంగీకరించిన, సకలభ్రమస్థానములందును అన్యథాఖ్యాతి యంగీకరింపవలయును?" ఆశంక ఘటిల్లదు; ఏలయన—ఉ స్థానమం దన్యథాఖ్యాత్యంగీకారమైనను, శుక్తిరజతాదిస్థా మందు అన్యథాఖ్యాత్యంగీకారము అయోగ్యము.

చూడుము—విషయముకన్న విలక్షణముగుజ్ఞానమ ఘటిల్లదు; ఎచ్చట స్ఫటికమందు రక్తతాజ్ఞాన మగునో, అచ్చట ఆరక్తమైన దాసనిపుష్పమునకు స్ఫటికముతో సంబంధమగుట వలన స్ఫటికసంబంధపుష్పముయొక్క రక్తత స్ఫటికమందు సంక్ర మించుచున్నది; ఆప్రసంగమందు అంతఃకరణ వృత్తియొక్క విష యము రక్తపుష్పసంబంధియైన స్ఫటికమగుటవలన ఆ పుష్పము యొక్క రక్తత స్ఫటికమందు ప్రతీతమగుచున్నది; అట్లు రజత రూపముచే శుక్తియొక్క జ్ఞానము సంభవింపదు; ఏలయన— శుక్తిదేశమందు అనిర్వచనీయరజతముదప్ప వ్యావహారికమైన రజతాంగీకారము అన్యమతమందును లేదు; మతేమనఁగా—

కేవలశుక్తి యున్నది; ఆ శుక్తిసంబంధమువలన శుక్తితో సమానాకారమే అంతఃకరణవృత్తి గావలయును; రజతాకారము కాఁగూడదు; కాబట్టి ఆస్థానమందు రజతము మఱియు తద్జ్ఞానము రెండును అనిర్వచనీయములే ఉత్పన్నములగునని యంగీకరింపవలయును; స్ఫటికమందు రక్తతాప్రతీతిచోటనో, వృత్తియొక్క సంబంధము స్ఫటికము, రక్తపుష్పము రెండింటికిని అగును; ఆప్రసంగమందు రక్తపుష్పసంబంధమువలన ఏ రక్తాకారవృత్తి గలదో, ఆ వృత్తికి స్ఫటికముతో సంబంధమగుట వలనను, స్ఫటికమందు రక్తతయొక్క ఛాయయుండుటవలనను పుష్పధర్మమైన రక్తత స్ఫటికమందు ఆ వృత్తికి విషయముగా నున్నది.

ఈరీతిగా ఎచ్చట రెండుపదార్థములయొక్క సంబంధము గలదో, అచ్చట ఒకవస్తువుయొక్కధర్మము రెండవవస్తువునందు ప్రతీతమగుట సంభవించును; అచ్చట అన్యథాఖ్యాతి సంభవించును; గాని, ఎచ్చట రెండుపదార్థములయొక్క సంబంధము లేదో, అచ్చట అన్యథాఖ్యాతి సంభవింపదు; అనిర్వచనీయఖ్యాతియే సంభవించు.

ఎట్లు పుష్పసంబంధియైన స్ఫటికమందు పుష్పధర్మమైన రక్తత ప్రతీతమగునో, అట్లు స్వప్నస్థహస్తిపర్వతాదులకును అధిష్ఠానచైతన్యముతో సంబంధమగుటవలన చైతన్యధర్మమైన సత్యతయు హస్త్యాదులందు ప్రతీతమగును; అచ్చట అన్యథాఖ్యాతియే సంభవించినది. అట్లు అధిష్ఠానచైతన్యధర్మమైన కారణత అధిష్ఠానచైతన్యసంబంధియైన దేశకాలములందు ప్రతీతి

ప్రసంగమందును అన్యథాఖ్యాతి యంగీకరించుట యోగ్య ముగా నున్నది.

### 241. 240—గతశంకాసమాధానమునకు పరిశేషము జాగ్రత్ప్రపంచము స్వప్నసమానము మిథ్య

పూర్వము ఆంశక చేయఁబడినది—"అన్యథాఖ్యాతివలన సంబంధిధర్మము అన్యమందు ప్రతీతమగునని చెప్పినయెడ అధిష్ఠానచైతన్యసంబంధము సర్వప్రపంచముతో నుండుటవలన చైతన్యము యొక్క కారణత సర్వప్రపంచమందు ప్రతీతము గావలయును!"

ఆశంక ఘటిల్లదు; ఏలయన—స్వప్నమందు రెండుశరీర ములు ప్రతీతము లగుచున్నవి—మొదటిది పితృరూపము, రెండవది పుత్త్రరూపము; ఈ రెండు శరీరములకును స్వప్నాధిష్ఠానచైతన్యముతో సంబంధము గలదు; అట్టియెడ పితృశరీర మందు అధిష్ఠానచైతన్యముయొక్క కారణత ప్రతీతమగును; పుత్త్రశరీరమందు కారణత ప్రతీతము గాదు; మఱేమనఁగా—పితృజన్యుఁడు పుత్త్రుఁ డని కార్యత ప్రతీత మగును. అట్లు అధిష్ఠానచైతన్యముతో సంబంధము సర్వమునకుఁ గలిగినను, దేశ కాలములందు చైతన్యధర్మమైనకారణత, మఱియు ఇతర పదార్థములందు కార్యత ప్రతీత మగుచున్నది.

లేక అధిష్ఠానచైతన్యము అసంగము; అది దేనికిని పరమార్థముచే కారణము గాదు; మాయాస్థితాభాసము కారణమైనను ఆ యాభాసస్వరూపము మిథ్య; ఏది తాను మిథ్య యగునో, అది రెండవదానికి కారణము గానేరదు; పరమాత్మ

యందు కారణత అయినయెడల ఆకారణతకు దేశకాలములందు భ్రాంతిబలములన ప్రతీతసంభవ మగును; పరమాత్మయందో, కారణత లేదు; పరమాత్మ కారణతాదిధర్మరహితుఁడు, అసంగుఁడు; వానియొక్క కారణత దేశకాలములందు ప్రతీత మగు ననిచెప్పుట సంభవింపదు; మతేమనఁగా—మాయాకృత మైన అనిర్వచనీయ దేశకాలములు అనిర్వచనీయ కారణతా వంతము లగుచున్నవి; పరమార్థముచేతనో, దేశకాలములు కారణములుగావు.

చూడుము—పుత్రహీనుఁడయినవాఁడు స్వప్నమందు పుత్త్రపౌత్త్రులనిద్దఱిని చూచుచున్నాఁడు; అచ్చట పుత్త్రపౌత్త్ర శరీరములు అనిర్వచనీయములై, పుత్త్రశరీరమందు పౌత్త్రశరీరముయొక్క అనిర్వచనీయ కారణత యున్నది. అచ్చట పరమార్థముచేత పుత్త్రశరీరమునకును, పౌత్త్రశరీరమునకును పరస్పర కారణకార్యభావము లేదు. అట్లు అనిర్వచనీయ కారణమైన దేశకాలములును ప్రతీతము లగుచున్నవి. అచ్చటఁగూడ పరమార్థముచేత దేశకాలములకును, ఆకాశాదిప్రపంచమునకును కారణకార్యభావము లేదు.

ఈరీతిగా దేశకాలసామగ్రి లేక జాగ్రత్ప్రపంచము యొక్క ఉత్పత్తియగును; కనుక స్వప్నప్రపంచమువలె జాగ్రత్ప్రపంచమును మిథ్యగా నున్నది. ఎట్లు స్వప్నమందలి స్త్రీపుత్త్రాదులు స్వప్నమందే సుఖదుఃఖములకు హేతువులై యుండఁగా జాగ్రత్తయందు వానియొక్క అభావము గలదో, అట్లే జాగ్రత్పదార్థములయొక్కయు స్వప్నమందు అభావము గలదు; కాఁబట్టి రెండును సమానములే.

## 242. ఒకజాగ్రత్తయందలి పదార్థము అన్యజాగ్రత్తయం దుండఁగూడ దని శంకయు తత్సమాధానమును

ఒకానొకఁ డిట్లు చెప్పెను—జాగ్రత్తనుండి స్వప్నావస్థ కలిగి, మరల జాగ్రత్తయైనప్పుడు మొదటిజాగ్రత్తయందలి పదార్థము రెండవజాగ్రత్తయందు కనఁబడును; అట్లు ప్రథమ స్వప్నము యొక్క పదార్థము రెండవస్వప్నమందు కనఁబడదు; కనుక స్వప్నపదార్థముకన్న జాగ్రత్పదార్థము విలక్షణము?

ఈ శంకయు సిద్ధాంతమును తెలియని మూఢదృష్టికి అగుచున్నది; ఆ మూర్ఖులయొక్కదృష్టి ఇట్టిది—"సంసారప్రవాహము అనాది, దానిలో జీవునకు జాగ్రత్స్వప్నసుషుప్తులు గలవు; జాగ్రత్కాలమందు స్వప్నసుషుప్తులు నష్టములగును; స్వప్నకాలమందు జాగ్రత్సుషుప్తులు నష్టములగును; సుషుప్తి కాలమందు జాగ్రత్స్వప్నములు నష్టములగును. అయిన స్వప్న సుషుప్తులయినప్పుడు జాగ్రత్కాలముయొక్క స్త్రీపుత్రపశుధనాదులు దూరము గానేరవు. మఱేమనఁగా—అట్లే యుండును; వానిజ్ఞానము మాత్రము దూరమగును; మరల జాగ్రత్తయైనప్పుడు ప్రథమజాగ్రత్తయందు స్థితపదార్థములయొక్క జ్ఞానముదయించెను."

ఇది సిద్ధాంతము—సకలపదార్థములు చైతన్యముయొక్క వివర్తములుగాను, అవిద్యకు పరిణామములుగాను ఉన్నవి. కావున శుక్తిరజతమువలె ఏకాలమందు ఏపదార్థము ప్రతీతమగునో, ఆకాలమందే అధిష్ఠానచైతన్యాశ్రితావిద్యకు ద్వివిధ పరిణామములు అగును. అవిద్యాసంబంధతమోగుణాంశము

విషయరూపపరిణామము, మఱియు అవిద్యాసంబంధ సత్త్వ గుణాంశము జ్ఞానరూపపరిణామము.

యద్యపి చైతన్యమును జ్ఞాన మందురు; అందువలనసత్త్వ గుణముయొక్క పరిణామము జ్ఞాన మనుట ఘటిల్లదు; తథాపి సకలవ్యాపకచైతన్యము జ్ఞానముగాదు; మఱేమనఁగా—సాభాస వృత్తియందారూఢచైతన్యమును ఇచ్చట జ్ఞాన మందురు. ఎందు కనఁగా చైతన్యమందు జ్ఞానవ్యవహారసంపాదకమగు సాత్త్విక వృత్తి గలదు; ఆవృత్తియందు జ్ఞానశబ్దముయొక్క ప్రయోగ మగుచున్నది.

లోకమునం దిట్లు చెప్పుదురు—"ఘటముయొక్క జ్ఞానము ఉత్పన్నమయినది; పటముయొక్క జ్ఞానము నష్టమయినది." అచ్చట వృత్త్యారూఢచైతన్యమునకో, ఉత్పత్తినాశములు సంభవింపవు. వృత్తికి ఉత్పత్తినాశములు సంభవించినవి; ఇట్లుండఁగా వ్యవహారమందు జ్ఞానమునకు ఉత్పత్తినాశములు చెప్పఁబడిరి. ఈరీతిగా వృత్తియందు జ్ఞానశబ్దముయొక్క ప్రయోగ మగు చున్నది. ఆవృత్తియందు చైతన్యముయొక్క ఆభాసమగును; ఘటాదివిషయమందుఁ గానేరదు.

విషయము, మఱియు వృత్తి రెండును ఒకే అవిద్య యొక్క పరిణామమైనను, ఘటాదివిషయము తమోగుణపరి ణామ మగుటవలన దానియందు ఆభాసము గానేరదు. వృత్తి సత్త్వగుణపరిణామమై, స్వచ్ఛమగుటవలన దానియందు ఆభాస మగును. ఈరీతిగా వృత్తికి చైతన్యముయొక్క ఆభాసగ్రహణ యోగ్యతవలన వృత్త్యవచ్ఛిన్నచైతన్యమును జ్ఞాన మందురు; మఱియు సాక్షియ నందురు. ఘటాదులకు ఆభాసగ్రహణ

యోగ్యత లేమివలన ఘటావచ్ఛిన్నచైతన్యమును జ్ఞాన మనరు; సాక్షియు ననరు.

ఈప్రకారముగ జాగ్రత్పదార్థము, తద్జ్ఞానము రెండును ఒకేకాలమందు ఉత్పన్నములై, ఒకేకాలమందు నష్టములగుచున్నవి; ఇది వేదముయొక్క గూఢసిద్ధాంతము; కావున ఒక జాగ్రత్పదార్థము రెండవజాగ్రత్తయందు దున్న దని చెప్పుట ఘటిల్లదు.[1]

## 243. జాగ్రత్పదార్థములకు కారణకార్యభావము లేదనుటయందు శంక

ఒకానొకఁ డిట్లు శంకించును—స్వప్నమునుండి జాగ్రతుఁడైన పురుషునకు ఇట్టి ప్రత్యభిజ్ఞ యగును. "ముందుండినపదార్థ మేదిగలదో, అదియే ఈపదార్థము." కనుక జాగ్రత్పదార్థమునకును, తద్జ్ఞానమునకును సమకాలోత్పత్తినాశమనుట ఘటిల్లదు; ఆపదార్థము జ్ఞానమునకు పూర్వమునుండి విద్యమానమై యుండును; మఱియు జ్ఞాననాశకాలానంతరమందును ఉండును?

ఈశంక ఘటిల్లదు; ఏలయనఁగా—స్వప్నపదార్థము జ్ఞానకాలముతోడనే ఉత్పన్నమైనను ఇట్టి ప్రతీతి యగుచున్నది— "నాజన్మమునకన్న మునుపు ఈగిరిసముద్రాదులు ఉత్పన్నములై

---

1. జాగ్రత్పదార్థములయొక్క "పూర్వజాగ్రత్తయందు ఏపదార్థము చూచుచున్నానో, ఆ పదార్థము ఇదిగా నున్నది." అనునియాకారముగల ప్రత్యభిజ్ఞాజ్ఞానము నిద్రనుండిలేచినపురుషునకుఁ గలుగును. నదీప్రవాహము, దీపశిఖ తారామండలము, మఱియుం వృక్షఫలము వీనియొక్క ప్రత్యభిజ్ఞవలె, ఆ జ్ఞానము భ్రమరూపముగా నున్నది. అందులో ముఖ్యదృష్టాంతము స్వప్నము.

ఉండెను." అచ్చట తత్కాలోత్పన్నపదార్థములందు బహుకాలస్థిరతాభ్రాంతి ఉత్పన్నమగుచున్నది. అచ్చట ఏయవిద్యచేత గిరిసముద్రాదికములు ఉత్పన్నములాయెనో, ఆయవిద్యవలననె బహుకాలస్థిరతయు, స్థిరతాప్రతీతియు అనిర్వచనీయమై ఉత్పన్నమగును. అట్లు జాగ్రత్పదార్థములందును బహుకాలస్థిరత సత్యముగా ఉండుటలేదు; మఱేమనఁగా—అవిద్యాబలమువలన మిథ్యయగు బహుకాలస్థిరతయు పదార్థములతోఁడనే ఉత్పన్నములై ప్రతీతమగును.

మఱియు నొకఁ డిట్లనును—స్వప్నపదార్థము సాక్షాదవిద్యాపరిణామము; జాగ్రత్పదార్థము సాక్షాదవిద్యాపరిణామముగాదు. ఘటముయొక్క ఉత్పత్తి కులాలదండచక్రాదులచేత నగును; అట్లు సర్వపదార్థములయొక్క ఉత్పత్తియు తమతమ కారణములచేత నగును; సాక్షాదవిద్యచేతఁ గాదు. సాక్షాదవిద్యాపరిణామమైనట్టయిన ఆకాశాదిక్రమమువలన పంచభూతోత్పత్తియు, పంచీకరణమును, దానివలన బ్రహ్మాండోత్పత్తియు శ్రుతియందు చెప్పఁబడినదిసర్వము అసంగతమగును. స్వప్నపదార్థములైననో, సాక్షాదవిద్యాపరిణామములగుటవలనను, ఒకఅవిద్యమాత్రము దానికి ఉపాదానముగాఁ గలుగుటవలనను ఆ పదార్థములకును తద్జ్ఞానమునకును ఒకేకాలమందు ఉత్పత్తినాశములు సంభవించును. ఈశ్వరసృష్ట జాగ్రత్పదార్థములు భిన్నభిన్న కారణములవలన ఉత్పన్నమగుటచే కార్యముకన్న మొదలు కారణమగును. కారణమందు కార్యముయొక్క లయమగును, అందువలన ఘటోత్పత్తికన్న మొదలు మఱియు ఘటనాశానంతరము మృత్పిండము ఉండును. ఈరీతిగా కొన్ని

పదార్థము లల్పకాలస్థాయులు; కొన్ని బహుకాలస్థాయులు, కొన్ని కార్యరూపములు, కొన్ని కారణరూపములుగా నున్నవి. అట్లు స్వప్నపదార్థములు గావు.

## 244. 243—గతశంకకు సమాధానము—స్వప్నమందును కార్యకారణభావప్రతీతి.

ఆశంక ఘటిల్లదు; ఏలయన—జాగ్రత్పదార్థములయందు వలె స్వప్నపదార్థములయందును కారణకార్యభావములు ప్రతీతము లగుచున్నవి. ఎట్లనఁగా ఒకానొకనికి స్వప్నమగును—నా గోవునకు వత్సము జనించెను. లేక నాభార్య పుత్రుని గనెను. అచ్చోట గోస్త్రీలయందు కారణత, బహుకాలస్థాయిత ప్రతీత మగును; మఱియును వత్సపుత్రులయందు కార్యత, అల్పకాలస్థాయిత ప్రతీత మగును; విచారముచే చూచినట్లయిన సకలము నేకకాలమునందే ఉత్పన్న మగుచున్నది; ఏదియు దేనికిని కారణమును గాదు; ఏదియు దేనికిని కార్యమును గాదు; ఒక అవిద్యోపాదానమువలన ఉత్పత్తిమంతమైన అనేకపదార్థములు అనేకప్రకారములుగా, కారణకార్యరూపములుగా అగపడుచున్నవి. అట్లు జాగ్రత్తయందును కొన్నిపదార్థములు అధికకాలస్థాయులై కారణరూపమువలన, మఱియు కొన్ని పదార్థములు న్యూనకాలస్థాయులై కార్యరూపమువలన స్వప్నతుల్యముగా ప్రతీత మగుచున్నవి; ఏదియు దేనికిని కారణమును గాదు; ఏదియు దేనికిని కార్యమును గాదు; మఱేమనఁగా—సకలపదార్థములు సమకాలోత్పన్నములై, సాక్షాదవిద్యకు కార్యములుగా నున్నవి.

శ్రుతియందు ఎచ్చట క్రమముగా సృజింపఁబడినట్లు

చెప్పఁబడినదో, అచ్చట సృష్టిప్రతిపాదనమందు శ్రుతియొక్క యభిప్రాయము లేదు; మఱేమనఁగా—అద్వైతబోధనమందు ఉన్నది. సకలపదార్థములు పరమాత్మవలన పుట్టినవి; కనుక వాని వివర్తములు; ఏది దేనికి వివర్తమగునో, అది దానియొక్క స్వరూపమే యగును; ఈలాగున నామరూపసహితములగు సకలపదార్థములు బ్రహ్మముకన్న పృథక్కులుగావు. ఈయర్థము బోధించుటకొఱకే సృష్టి చెప్పఁబడినది; వేరేమియు ప్రయోజనము లేదు; అచ్చట క్రమబద్ధరీతికథనము ఏదిగలదో, అది స్థూలదృష్టిపురుషునకు విపరీతక్రమముగా లయచింతననిమిత్తము; ఇంకను శ్రుతియందు ఎచ్చట కార్యకారణభావము పూర్వోత్తరభావము చెప్పఁబడినదో, అదియును లయచింతననిమిత్తమే; దానికిని అద్వైతబోధమందే ప్రయోజనము గలదు; వేఱొక్క ప్రయోజనము లేదు. నిజముగ సృష్టియందు క్రమము లేదు; జాగ్రత్పదార్థములకు పరస్పరకారణకార్యభావము లేదు; పూర్వోత్తరభావమును లేదు.

## 245. దృష్టిసృష్టివాదముయొక్క అంగీకారము

సకలపదార్థములు శుక్తిరజతమువలె, లేక స్వప్నపదార్థమువలె అవిద్యాకార్యములు; అవిద్యోపహిత సాక్షివలన వానియొక్క ప్రకాశమగుచున్నది; కనుక సకలపదార్థములు సాక్షిభాస్యములుగా నున్నవి, మఱియు జ్ఞానాకారమగు, జ్ఞేయాకారమగు అవిద్యాపరిణామమై, సమకాలమం దుత్పన్నమయి, సమకాలమందే నష్టమగుచున్నవి.

ఈరీతిగా ఎప్పుడు పదార్థముయొక్క ప్రతీతియగునో, అప్పుడే ఆ ప్రతీతివిషయమైన పదార్థము ఉత్పన్నమగును; పూర్వ

కాలముకొండి ఉండదు. దీనిని [1]దృష్టిసృష్టివాద మందురు. ఈ పక్షమందు పదార్థమునకు అజ్ఞాతసత్త ఉండదు; జ్ఞాతసత్తయే యున్నది; అద్వైతవాదమందు ఇది సిద్ధాంతపక్షము. ఈపక్షమందు రెండుసత్తలు గలవు; మూఁడు సత్తలు లేవు.

ఈ పక్షమందు అనాత్మపదార్థములన్నియు స్వప్నమువలె ప్రాతిభాసికములు. ప్రతీతికాలముకన్న భిన్నకాలమందు అనాత్మపదార్థములకు సత్త లేదు; కనుక మూఁడవదైన వ్యావహారికసత్త లేదు. ఈపక్షమందు సకలాత్మపదార్థములు సాక్షిభాస్యములు; ప్రమాతృప్రమాణవిషయ మేదియును లేదు. ఏలయన—అంతఃకరణవిశిష్టమైన ప్రమాత, ఇంద్రియము, అర్థే ఘటాదివిషయము సకలత్రిపుటియు, తద్జ్ఞానమును స్వప్నమువలె ఏకకాలమందే ఉత్పన్నమగుచున్నది; వీనికి పరస్పరవిషయవిషయిభావము ఘటిల్లదు.

ఘటాదివిషయము, నేత్రాదీంద్రియము, అంతఃకరణము ఇవి జ్ఞానముకన్న మొదట ఉండినపక్షమందు నేత్రాదిద్వారమున ప్రమాణజన్యమైన అంతఃకరణవృత్తిరూపజ్ఞానము అగును; ఆయంతఃకరణేంద్రియవిషయములు మూఁడును జ్ఞానముకన్న పూర్వకాలమం దుండవు; స్వప్నమువలె జ్ఞానసమకాలమందే సకలత్రిపుటి ఉత్పన్నమగుచున్నది; త్రిపుటీజన్యజ్ఞానము ఏదియు లేదు; అట్లయినను జాగ్రద్జ్ఞానమందు స్వప్నజ్ఞానమునందువలె త్రిపుటీజన్యత ప్రతీత మగుచున్నది. ఈ ప్రకారముగా జాగ్రత్పదార్థములు స్వప్నపదార్థములవలె మిథ్యగా నున్నవి.

---

1. దృష్టియనఁగా అవిద్యావృత్తిరూపజ్ఞానము, దానియొక్క సమసమయమందే సృష్టి యనఁగా ప్రపంచోత్పత్తి, దానియొక్కకథనము దృష్టిసృష్టివాదము.

లేక జాగ్రత్తయందు ఎన్ని పదార్థములు మిథ్యారూపము చేత, ఎన్ని సత్యరూపముచేత ఎఱుఁగఁబడినవి; ఎన్ని అనాదిపదార్థము లున్నవి; వీనిలో నేవి నష్టములైనవి; మఱియు వానితో సమానము ఏవి ఉత్పన్నములైనవి; ఇట్టి ఏ ప్రపంచధార గలదో, తదుచ్ఛేదము ఎన్నటికిని గానేరదు. ఎవ్వనికి బ్రహ్మజ్ఞానమగునో, వానికి ప్రపంచము ప్రతీతముకాదు; ఇతరులకు ప్రతీతమగును. ఆ జ్ఞానమునకు సాధనము వేదగురువులు; వీని వలన పరమసత్యమైన పరబ్రహ్మముయొక్క ప్రాప్తియగును. ఇట్టి ప్రతీతి జాగ్రత్తయం దగును. అచ్చట ఏపదార్థమందు మిథ్యాత్వము, దేనియందు నాశము, దేనియం దుత్పత్తి, వేదగురువుల వలన పరమపురుషార్థసిద్ధి, ఇవన్నియు అవిద్యాకృతస్వప్నమువలె మిథ్యగా నున్నవి.

యోగవాసిష్ఠమందు ఇట్టి ఇతిహాసములు అనంతములుగ చెప్పఁబడియున్నవి. క్షణమాత్రస్వప్నమందు బహుకాలప్రతీతి వలె జాగ్రత్తయందు స్థాయిపదార్థములయొక్క బహుకాలభోగ ప్రతీతి గలుగుచున్నది; కనుక జాగ్రత్పదార్థములకు స్వప్న పదార్థములకన్న కొంచెమైనను విలక్షణత లేదు. ఆత్మభిన్నమైన సర్వము [1] మిథ్యగా నున్నది.

1. ఇది దృష్టిసృష్టివాదముయొక్క సారముగా నున్నది. ఈపక్షమునకు ప్రతిపాదనము బృహదారణ్యముయొక్క వ్యాఖ్యానమందు భాష్యకారులు మఱియు వార్తికకారులు వ్రాసియున్నారు. అట్లే మాండూక్యభాష్యమందు, మఱియు ఆనందగిరికృతమాండూక్యభాష్యటీకయందు, యోగవాసిష్ఠ వేదాంత ముక్తావల్యాత్మపురాణాదులందును చేయఁబడియున్నది; వేదాంతదీపికవృత్తి ప్రభాకర మను హిందూస్థానిభాషాగ్రంథములందును దీని ప్రతిపాదనము చేయఁబడియున్నది.

**246. ప్రశ్న స్వప్నమువలె స్వల్పకాల స్థాయి సంసార మగిన బహుకాలికబంధము గాఁగూడదు.**

ఓభగవంతుఁడా!-ఈశ్వరసృష్టి అనంతకల్పములనుండి అనాదిగా నున్నది; దానిలో జ్ఞాని ముక్తుఁ డగును; అజ్ఞానికి బంధమున్నది; సృష్టి స్వప్నసమాన మయినప్పుడు ఎట్లు స్వప్నము ఒక క్షణము, లేక గడియ, లేక యామము ఉండునో, అట్లు సంసారముకు ఒకక్షణము, గడియ, లేక యామము లేక కించిదధిక కాలముగా నుండవలయును? మఱియు స్వప్నమువలె స్వల్పకాలికసంసార మయినట్టయిన అనాదికాలము[1] యొక్క బంధము గాఁకూడదు? మఱియు అట్లయినప్పుడు బంధనివృత్తి మోక్ష

---

1 కాలనిర్ణయము—

(1) రెప్పపాట్లు పంచదశ—కాష్ఠ 1

(2) కాష్ఠలు ముప్పది—కళ 1

(3) కళలు ముప్పది—ముహూర్తము 1

(4) ముహూర్తములు ముప్పది—అహోరాత్రదినము 1

(5) దినములు పంచదశ—పక్షము 1

(6) పక్షములు రెండు—మాసము 1

(7) మాసములు రెండు—ఋతువు 1

(8) ఋతువులు మూఁడు—అయనము 1

(9) అయనములు రెండు—సంవత్సరము 1

(10) సంవత్సరములు పదునేడులక్షలు ఇరువదియెనిమిదివేలు—కృతయుగము 1

(11) సం...పండ్రెండులక్షలుతొంభదిఆఱువేలు—త్రేతాయుగము 1

ప్రాప్తినిమిత్తము వేదమందు శ్రవణాదిసాధనములు చెప్పఁబడి నవి నిష్ఫలమగును.

యద్యపి పూర్వోక్తసిద్ధాంతమందు బంధమోక్ష[1] వేద

---

(12) సం...ఎనిమిదిలక్షలు అరువది నాలుగు వేలు—ద్వాపరయుగము 1

(13) సం...నాలుగులక్షలు ముప్పదిరెండు వేలు—కలియుగము 1

(14) సం—నలుబదిమూఁడులక్షలు ఇరువది వేలు లేక నాలుగుయుగములు—మహాయుగము 1

(15) సం...ముప్పదికోట్లు అరువదియేడులక్షలు ఇరువది వేలు లేక ఇరువదియొకటి మహాయుగములు—మన్వంతరము 1

(16) సం...నాలుగుఅబ్జములు ఇరువదితొమ్మిదికోట్లు నలుబదిలక్షలు ఎనబది వేలు లేక తొమ్మన్నూటతొంభైనాలుగు మహాయుగములు చేరి—మన్వంతరములు 14

(17) సం...రెండుకోట్లు యాబదితొమ్మిదిలక్షలు ఇరువది వేలు లేక ఆరుమహాయుగములు చేరి—సంధులు 2

(18) సం...నాలుగుఅబ్జములు ముప్పదిరెండుకోట్లు లేక వేయి మహాయుగములు చేరి కల్పము అథవా బ్రహ్మయొక్క పగలు 1

(19) సం...ఎనిమిదిఅబ్జములు అరువది నాలుగుకోట్లు—బ్రహ్మదినము 1 [అహోరాత్రము]

(20) సం...మూఁడుమహాపద్మములు పదకొండుఖర్వములు నలబది కోట్లు లేక బ్రహ్మదేవుని మున్నూటఅరువది దినములు—బ్రహ్మ సంవత్సరము 1

(21) సం...మూఁడుజలధులు ఒకశంకు ఒకమహాపద్మము నాలుగు ఖర్వములు—బ్రహ్మదేవుని ఆయుష్యము అథవా మహాకల్పము.

1. ఇచ్చట ఈయభిప్రాయము గలదు—ఈదృష్టిసృష్టివాదమందు ఒక జీవుని అంగీకారమగుటవలన అన్యజీవరూపగురువుయొక్క, శిష్యునియొక్క

గురువుల యంగీకారము లేదు; చైతన్యము నిత్యముక్తము; అవిద్యయొక్క పరిణామమై చైతన్యమందు నానావివర్తము లగుచున్నవి; దానివలన ఆత్మరూపమునకు కించిన్మాత్రమును హాని లేదు; ఆత్మ సదా అసంగుఁడు; ఏకరసుఁడు; నేటివరకు ఎవ్వఁడు ముక్తుఁడు గాలేఁడు ముం దెవఁడును గాఁడు; మతమనఁగా— చైతన్యము నిత్యముక్తము; చైతన్యముతోడ ఏకాలమందును అవిద్యయొక్కగాని, తత్పరిణామముయొక్కగాని సంబంధము లేదు; కావున బంధమోక్షములు, వేదగురువులు, శ్రవణాది సాధనములు, సమాధి వీనియొక్క ప్రతీతియు స్వప్నమువలె అవిద్యాజన్యమగుటవలన మిథ్య; వీనియందు బహుకాలస్థాయిత యును అవిద్యాజన్యముగా నున్నది; తథాపి ఈసిద్ధాంతము

యంగీకారము లేదు; స్వప్నగతమయిన ఒకముఖ్యజీవునికంటె భిన్నమైన అన్య జీవాభాసమువలె జాగ్రత్తయందును అన్యజీవాభాసము ప్రతీతమగును. అట్లే ఆభాసరూపగురువునందు ఆభాసరూపశిష్యుఁడు ఈశ్వరభావపూర్వకముగా భక్తి చేయుచున్నాఁడు; అదియును స్వప్నస్థగురుభక్తివలె మిథ్యగా నున్నది.

ఈపక్షమందు జీవేశ్వరాదులగు షట్పదార్థములు స్వరూపముచే అనాదులుగా అంగీకరింపఁబడును. వీనిలో ఒకబ్రహ్మమునకు పరమార్థసత్త, మఱియుబ్రహ్మముకన్న భిన్నమయిన ఈశ్వర జీవావిద్యాభేదసంబంధరూపమైన కారణప్రపంచమునకు వ్యావహారికసత్త గలదు. మఱియు ప్రవాహరూపముచే అనాదియైనసకలకార్యప్రపంచమునకు ప్రాతిభాసికసత్త గలదు. కనుక ఉత్తరోత్తరాధ్యాసమునకు కారణము పూర్వపూర్వాధ్యాసజ్ఞానజన్యసంస్కారము యొక్క ఆశ్రయభూతమైన అవిద్య, మఱియు ఈశ్వరుఁడు విద్యమానము లగుటవలన క్షణికవిజ్ఞానమతముయొక్క లేక అనీశ్వరమతముయొక్క అంగీకారము మొదలగు దోషములు లేవు. ఈయర్థము అద్వైతసిద్ధియందు మధుసూదనస్వాములవారిచే వ్రాయఁబడినది.

నెఱుఁగక పైనవ్రాసిన ప్రశ్నము శిష్యుఁడు స్థూలదృష్టిచే చేసినాఁడు.

## 247. 246—గతప్రశ్నకుత్తరము
## అగృథదేవుని స్వప్నప్రతీతి

ఓశిష్యుఁడా! నిద్రాదోషమువలన స్వప్నమందు అధ్యాపనాధ్యయనవేదశాస్త్రపురాణకులు, అధ్యయనకర్త, కర్మము, మఱియు వీనిఫలప్రతీతి, అట్లే ఈ సర్వపదార్థములందు సత్యతాభ్రాంతి అయినను, అవి సకలపదార్థములును ఎట్లు మిథ్యయో, అట్లు జాగ్రత్తయొక్క సకలపదార్థములును మిథ్యగా నున్నవి; వీనిలో సత్యతాప్రతీతి భ్రమమాత్రముగానున్నది. నేనుగురువు ప్రతీతుఁడగుచున్నాను; మఱియు వేదార్థముయొక్క బంధవిఘాతుకార్థము నుపదేశించుచున్నాను; ఇట్టి నీకు ప్రతీతి ఏది గలదో, అది మిథ్యగా నున్నది. ఎట్లు అగృథదేవునకు స్వప్నమందు మిథ్యాప్రతీతివిషయమైన గురువేదాదికములు అనిర్వచనీయముగ పుట్టినవో, అట్లు నీప్రతీతివిషయము నేను మొదలుకొని సకలము అనిర్వచనీయముగా నున్నది. ఆయగృథదేవుని 15 స్వప్నము చెప్పుచున్నాను.

---

15 గృధ యనఁగా ఇచ్ఛ, తద్రహితుఁడైన దేవుఁడనఁగా స్వప్రకాశుఁడు; అట్టి శుద్ధచైతన్యమో, అది ఇచ్చుట అగృథదేవుఁడను పదమునకు గూఢార్థము; వానికి అవిద్యారూపమగు అనాదినిద్రచే కల్పితమైన ఈప్రతీయమానప్రపంచరూపమగు స్వప్నమాయెను. ఆస్వప్నప్రపంచమందు విలక్షణతాభావమువలన జాగ్రదాద్యవస్థాభేదముయొక్క అభావము గలదు; కనుక ఆయొకటేస్వప్నప్రపంచమునకు యద్యపి దృష్టాంతరూపత. మఱియుఁ దార్ష్టాంతికరూపత చెప్పుట ఘటిల్లదు; తథాపి ఆయర్థమును గోప్యముగానుంచి, ఒకటే చైతన్యమందు దృష్టాంతదార్ష్టాంతికభావారోపము చేయఁబడినది.

ఒకఁడు అగృధదేవుఁ డనువాఁడుండెను; అతఁడు అనాది కాలమునుండి నిద్రించుచుండెను; నిద్రలో స్వప్నము గనెను; ఆస్వప్నమందు ఇట్టి ప్రతీతి ఆయెను—నేను చండాలుఁడను, [1] మహాదుఃఖిని, అస్థిమజ్జారుధిరమాంసమేదోవీర్యత్వఛారూపము లయిన సప్తధాతువులచే నాముఖము నిండియున్నది; మఱియు ఘోరసర్పవ్యాఘ్రాద్యుక్తవనమునందు [2] నేను తిరుగుచున్నాను; ఈప్రకారముగా భ్రమించుచు భ్రమించుచు ఆవనమునందు అనంతస్థానములు చూచుచుండెను.

ఎచ్చటనో, [3] నానాప్రకారములైన భయంకరప్రాణులు సమ్ముఖముగా భక్షించుటకు పరుగెత్తివచ్చుచున్నవి; ఎచ్చటనో, చీమురక్తములచే నిండినగుంటలు గలవు; వీనిలోఁబడినప్రాణులు హాహాకారము చేయుచున్నవి; ఎచ్చటనో, లోహమయతప్తస్తంభము లున్నవి; వీనికి కట్టినపురుషులు ఏడ్చుచున్నారు; ఎచ్చటనో, తప్తవాలుకాయుక్తమార్గములయందు నగ్నపాదపురుషులు నడుచుచున్నారు; ఈ పురుషులను రాజభటులు లోహదండములచేఁ గొట్టుచున్నారు; ఈరీతిగా నానాప్రకారములైన భయంకరవనములను ఆయగృధదేవుఁడు చూచుచుండెను; ఒకానొకప్పుడు తాను అపరాధముచేసి, ఈదుఃఖములు అనుభవించెను.

కొన్నిచోట్ల [4] దివ్యస్థానములు చూచెను; ఆస్థానము

1. దేహద్వయమునకు అభిమానినైన జీవుఁడుగా నున్నాను.

2. సంసారమునందు.

3. ఇచ్చటనుంచి నరకముయొక్క వర్ణనము.

4. ఇచ్చటనుంచి స్వర్గలోకముయొక్క వర్ణనము.

లందు ఉత్తమదేవతలు దివ్యభోగము లుపభోగించుచుండిరి; అమృతదర్శనమాత్రముచేతనే వారికి తృప్తిగలిగెను, క్షుత్తృషాదులు గలుగ లేదు; వారిశరీరములు మలమూత్రరహితప్రకాశమానములై యుండెను; ఆదేవతలు ఉత్తమవిమానము లందు సంచరించుచుండిరి; ఆ విమానములు వారియిచ్ఛానుసారముగ నడుచుచుండెను.

కొన్నిచోట్ల ఊర్వశిమొదలైన అప్సరసలు నృత్యము చేయుచుండిరి; వీరి సంపూర్ణాంగములు దోషరహితములు; సంపూర్ణ స్త్రీగుణ [1]యుక్తములు; కామోత్తేజకసుగంధము వీరి దేహములనుండి ప్రసరించుచుండెను. కొన్ని చోట్ల వారితో దేవతలు రమించుచుండిరి; ఒకసమయమునందు తానును దేవభావమును పొంది, వారితో బహుకాలమువరకు రమించుచుండెను; ఒకప్పుడు అప్సరసలతో రమించి రమించి, అకస్మికముగా [2] రుధిరములపూరితమైన గోతియందు దిగఁబడెను.

ఒకచోట ఈపర్వమునకు అధిపతియైన [3] పురుషుఁ డుండెను; వానియనుచరులు [4] వానియెదుట నిలిచియుండిరి; కొందఱుపురుషులకు [5] ఆయధిపతియు, అనుచరులును సౌమ్యరూపులుగా ప్రతీతులయిరి; కొందఱికి [6] భయంకరరూపులుగా

1. కావ్యాలంకారాదిసాహిత్యగ్రంథములందు చెప్పఁబడిన సౌందర్యము మొదలైన ముప్పదిరెండు గుణములచే యుక్తమైనట్టి

2. పుణ్యాస్తమాయెను; పాపోదయమాయెను.

3. యమధర్మరాజు. 4. యమదూతలు.

5 పుణ్యవంతులకు. 6. పాపిష్ఠజనులకు.

ఒకఁడు అగృధదేవుఁ డనువాఁడుండెను; అతఁడు అనాది కాలమునుండి నిద్రించుచుండెను; నిద్రలో స్వప్నము గనెను; ఆస్వప్నమందు ఇట్టి ప్రతీతి ఆయెను—నేను చండాలుఁడను,[1] మహాదుఃఖిని, అస్థిమజ్జారుధిరమాంసమేదోవీర్యత్వచాయాపము లయిన సప్తధాతువులచే నాముఖము నిండియున్నది; మఱియు ఘోరసర్పవ్యాఘ్రాద్యుక్తవనమునందు[2] నేను తిరుగుచున్నాను; ఈప్రకారముగా భ్రమించుచు భ్రమించుచు ఆవనమునందు అనంతస్థానములు చూచుచుండెను.

ఎచ్చటనో,[3] నానాప్రకారములైన భయంకరప్రాణులు సమ్ముఖముగా భక్షించుటకు పరుగెత్తివచ్చుచున్నవి; ఎచ్చటనో, చీమురక్తములచే నిండినగుంటలు గలవు; వీనిలోఁబడినప్రాణులు హాహాకారము చేయుచున్నవి; ఎచ్చటనో, లోహమయతప్తస్తంభము లున్నవి; వీనికి కట్టినపురుషులు ఏడ్చుచున్నారు; ఎచ్చటనో, తప్తవాలుకాయుక్తమార్గములయందు నగ్నపాదపురుషులు నడుచుచున్నారు; ఈ పురుషులను రాజభటులు లోహదండములచేఁ గొట్టుచున్నారు; ఈరీతిగా నానాప్రకారములైన భయంకరవనములను ఆయగృధదేవుఁడు చూచుచుండెను; ఒకానొకప్పుడు తాను అపరాధముచేసి, ఈదుఃఖములు అనుభవించెను.

కొన్నిచోట్ల[4] దివ్యస్థానములు చూచెను; ఆస్థానము

1. దేహద్వయమునకు అభిమానియైన జీవుఁడుగా నున్నాను.
2. సంసారమునందు.
3. ఇచ్చటనుంచి నరకముయొక్క వర్ణనము.
4. ఇచ్చటనుంచి స్వర్గలోకముయొక్క వర్ణనము.

లందు ఉత్తమదేవతలు దివ్యభోగము లుపభోగించుచుండిరి; అమృతదర్శనమాత్రముచేతనే వారికి తృప్తిగలిగెను, క్షుత్తృషాదులు గలుగ లేదు; వారిశరీరములు మలమూత్రరహిత ప్రకాశమానములై యుండెను; ఆదేవతలు ఉత్తమవిమానములందు సంచరించుచుండిరి; ఆ విమానములు వారియిచ్ఛానుసారముగ నడుచుచుండెను.

కొన్నిచోట్ల ఊర్వశిమొదలైన అప్సరసలు నృత్యము చేయుచుండిరి; వీరి సంపూర్ణాంగములు దోషరహితములు; సంపూర్ణ స్త్రీగుణ[1]యుక్తములు; కామోత్తేజకసుగంధము వీరి దేహములనుండి ప్రసరించుచుండెను. కొన్ని చోట్ల వారితో దేవతలు రమించుచుండిరి; ఒకసమయమునందు తాను దేవభావమును పొంది, వారితో బహుకాలమువరకు రమించుచుండెను; ఒకప్పుడు అప్సరసలతో రమించి రమించి, ఆకస్మికముగా[2] రుధిరములపూరితమైన గోతియందు దిగఁబడెను.

ఒకచోట ఈసర్వమునకు అధిపతియైన[3] పురుషుఁడుండెను; వానియనుచరులు[4] వానియెదుట నిలిచియుండిరి; కొందఱుపురుషులకు[5] ఆయధిపతియు, అనుచరులును సౌమ్యరూపులుగా ప్రతీతులయిరి; కొందఱికి[6] భయంకరరూపులుగా

---

1. కావ్యాలంకారాదిసాహిత్యగ్రంథములందు చెప్పఁబడిన సౌందర్యము మొదలైన ముప్పదిరెండు గుణములచే యుక్తమైనట్టి

2. పుణ్యాస్తమాయెను; పాపోదయమాయెను.

3. యమధర్మరాజు. 4. యమదూతలు.

5 పుణ్యవంతులకు. 6. పాపిష్ఠజనులకు.

ప్రతీతులయిరి; ఆపురుషుఁడు ఆవనస్థితపురుషులకు కర్మానుసార ఫలము నిచ్చుచున్నాఁడు.

కొన్నిచోటుల [1] బ్రాహ్మణులు వేదధ్వని చేయుచుండిరి. కొన్నిచోట్ల యజ్ఞశాలయందు యజ్ఞకర్మములు చేయుచుండిరి; ఉత్తమోత్తమపవిత్రమైన నదులందు జనులు స్నానము చేయుచుండిరి; కొన్నిచోట్ల జ్ఞానవంతులగు ఆచార్యులు శిష్యులకు బ్రహ్మవిద్యోపదేశము చేయుచుండిరి; శిష్యులు బ్రహ్మవిద్యను పొంది, ఆవనమునుండి బయలువెడలిరి.

ఈరీతిగా స్వప్నమందు అగ్రృథదేవుఁడు క్షణమాత్రమందు ఆశ్చర్యములగు నానాపదార్థములను ఆవనమున చూచెను; వానికి స్వప్నమందీప్రతీతి యయినది—నేను అనంతకాలమునుండి ఈవనమునందే యున్నాను; ఈవనముయొక్క ఉచ్ఛేదము ఎన్నఁడునుగాదు.

ఈవనపాలకుఁడు [2] ఒకప్పుడు నాలుగుముఖములతో నానావిధ [3] మైన బీజములువెడలించి, వనోత్పత్తిచేయును; మఱియొకప్పుడు జలసేచనమువలన [4] పాలనము చేయును; ఇంకొకప్పుడు ఘోరవేషము [5] చేయుచు నోటినుండి నిప్పులు గ్రక్కి, వనదాహము చేయుచు; వనోత్పత్తితోడనే నాయుత్పత్తి

1. ఇచ్చటనుండి మృత్యులోకగతభరతఖండవర్ణనము.

2. బ్రహ్మవిష్ణుశివరూపములచేత జగదుత్పత్తిస్థితిసంహారములను చేయు ఈశ్వరుఁడు.

3. జీవునియొక్క పరిపక్వాదృష్టరూపమగు బీజము.

4. కర్మానుసారము సుదుఃఖానుభవరూపమగు భోగమిచ్చుట.

5. ప్రళయము.

గలుగును; దహనముతోడనే నాదహనమగును; ఈవిధముగా సకలవనము దహించి, ఆవనపాలకుఁడొక్కఁడే యుండును; వానిశరీరమందు వనబీజము లున్నవి; ఈ ప్రతీతి స్వప్న వేదము యొక్క శ్రవణమువలన ఆ యగ్గృధ దేవునకు స్వప్నమందే గలిగెను.

### 248. అగ్గృధదేవుఁడు స్వప్నమందు గురువును సంధించుట.

అపుడు పలుమాఱు జననమరణములు విని, ఆ యగ్గృధ దేవుఁడు విచారము చేసెను—నేను ఏప్రకారముగా ఈవనము నుండి బయలువెడలిపోదును? లేక వనము వెడలిపోకపోయినను, ఈచండాలభావము[1] దూరమై, దేవభావము[2] పొందుదును? ఇందుకొఱకు వేఱేమి ఉపాయము దోఁపకున్నది; ఒక బ్రహ్మ విద్యోపదేశాచార్యుఁడు తనశిష్యులను వనమునుండి వెలుపలికి పోఁజేయును; ఈ విచారముచేసి, స్వప్నకాలమందే అగ్గృధ దేవుఁడు ఆ యాచార్యునకు సమిత్పాణియై, విధిపూర్వకముగా శరణుపొందెను; విధిపూర్వక ప్రాప్తుఁడైన శిష్యుఁడగు అగ్గృధ దేవునకు ఆ మిథ్యాచార్యుఁడు దేవవాణీరూపమగు మిథ్యా గ్రంథోపదేశము చేయనారంభించెను—

### 249. మిథ్యాచార్యునిమిథ్యాశిష్యునకుమిథ్యా గ్రంథోపదేశమునకు మంగళాచరణము.

ఆ మిథ్యాచార్యుఁడు మిథ్యాశిష్యునకు ఉపదేశము చేయుటకు సంస్కృతగ్రంథముయొక్క[3] మంగళాచరణము.

---

1. జీవభావము. 2. బ్రహ్మభావము.

3. ఇచ్చట అనేకసంస్కృతగ్రంథములయొక్క ప్రమాణము.

చేయ నారంభించెను; ఏలయన—మంగళము చేయుటవలన గ్రంథ సంపూర్ణతకు ప్రతిబంధకములయిన విఘ్నములు నాశమగును. విఘ్నమనఁగా పాపము, పాపముచేత శుభకార్యముయొక్క సంపూర్ణత గానేరదు. ఆ పాపముయొక్క నాశము మంగళాచరణముచేత అగును. పాపరహితపురుషుఁడును గ్రంథారంభమందు మంగళాచరణము అవశ్యముగా చేయవలయును. మంగళాచరణము చేయఁడేని, గ్రంథకర్తయందు అన్యపురుషునకు నాస్తికభ్రాంతియై, తద్రచితగ్రంథమందు ప్రవృత్తిగలుగును.

ఆ మంగళము త్రివిధము: మొదటిది వస్తునిర్దేశరూపము, రెండవది నమస్కారరూపము, మూఁడవది ఆశీర్వాదరూపము-

(1) సగుణుఁడయిన, లేక నిర్గుణుఁడయిన పరమాత్మ, వస్తువని చెప్పఁబడినది; తత్కీర్తనము వస్తునిర్దేశమనఁబడును.

(2) తననికృష్టతను, గురుదేవాది పూజ్యపదార్థముల యుత్కృష్టతను తెలుపునట్టి మనోవాక్శరీరక్రియ నమస్కారమనఁబడును. [1]

---

1. ఉత్తమమధ్యమకనిష్ఠభేదముచే నమస్కారము త్రివిధము; వానిలో మనోనమస్కారము ఉత్తమము, అదే బీజము; వాక్కులనమస్కారము మధ్యమము, అదే యంకురము; శారీరనమస్కారము కనిష్ఠము, అదే వృక్షము. నమస్కారముచే దేవగుర్వాదీష్టపదార్థములయొక్క ప్రసన్నతారూపఫలము ప్రాప్తమగును.

తననికృష్టతను, పూజ్యుఁడగువానియుత్కృష్టతను చూపుట నమస్కారమందు రహస్యము గలదు. నమస్కారమువంటి తారకమంత్రము ఇంకొకటియుం లేదు; నమస్కారము సాక్షాచ్ఛత్రువుయొక్క శత్రుభావమును పోగొట్టుచున్నది. నమస్కారముచే సకలార్థసిద్ధి యగుచున్నది.

(3) తనయొక్క, లేక శిష్యునియొక్క వాంఛితార్థమును ప్రార్థించుట ఆశీర్వాద మనఁబడును.

గణేశునకును, సరస్వతికిని పురాణమునందు ఈశ్వరత ప్రసిద్ధము; కనుక తచ్చింతనము ఈశ్వరచింతనముగా నున్నది. పురాణమందు విఘ్నేశ్వరాదుల జన్మ మున్నదే యనిన, ఆ జన్మము జీవునివలె కర్మఫలముగాదు; రామకృష్ణాదులవలె భక్త జనానుగ్రహముకొఱకును, దుష్టజననికృంతనముకొఱకును పరమాత్మయొక్క ఆవిర్భావముగ నున్నది; ఇది వ్యాసభగవానుని పరమాభిప్రాయము.

ఈస్థానమం దీరహస్యముగలదు—పరమార్థదృష్టిచే జీవుఁడును పరమాత్మకన్న భిన్నుఁడుగాఁడు; అయిన ఆత్మయందు జననమరణాదిబంధముఁయొక్క యధ్యాసమేది గలదో, అది జీవునియొక్క జీవత్వముగా నున్నది; ఆ జన్మాదిబంధము గణేశాదులకు ఆత్మయందు ప్రతీతము గానేరదు; గనుక గణేశాదులు జీవులుంగారు. ఈరీతిగా గణేశాదులకు ఈశ్వరత గలుగుట వలన గ్రంథారంభమందు వారిచింతనముచేయుట యోగ్యము.

నానారూపములవలన ఈశ్వరునియొక్క కథన మేది గలదో, అది సర్వులకు సర్వేశ్వరభావమును ద్యోతనము చేయుటకొఱకై యున్నది; అట్లు ఈశ్వరభక్తి, గురుభక్తి విద్యాప్రాప్తికి ముఖ్యసాధనముగా నున్నవనునర్థమును ద్యోతనము చేయుటకొఱకై యున్నది.

## 250. వస్తునిర్దేశాదిమంగళప్రకారము

నిర్గుణవస్తునిర్దేశరూపమంగళము—ఏవిభు ప్రకాశరూపుఁడయిన పరమాత్మ, తనప్రకాశముచే రవిచంద్రాగ్న్యాదులను

(3) తనయొక్క, లేక శిష్యునియొక్క వాంఛితార్థమును ప్రార్థించుట ఆశీర్వాద మనఁబడును.

గణేశునకును, సరస్వతికిని పురాణమునందు ఈశ్వరత ప్రసిద్ధము; కనుక తచ్చింతనము ఈశ్వరచింతనముగా నున్నది. పురాణమందు విఘ్నేశ్వరాదుల జన్మ మున్నదే యనిన, ఆ జన్మము జీవునివలె కర్మఫలముగాదు; రామకృష్ణాదులవలె భక్తజనానుగ్రహముకొఱకును, దుష్టజననికృంతనముకొఱకును పరమాత్మయొక్క ఆవిర్భావముగ నున్నది; ఇది వ్యాసభగవానుని పరమాభిప్రాయము.

ఈస్థానమం దీరహస్యముగలదు—పరమార్థదృష్టిచే జీవుఁడును పరమాత్మకన్న భిన్నుఁడుగాఁడు; అయిన ఆత్మయందు జననమరణాదిబంధముఁయొక్క యథ్యాసమేది గలదో, అది జీవునియొక్క జీవత్వముగా నున్నది; ఆ జన్మాదిబంధము గణేశాదులకు ఆత్మయందు ప్రతీతము గావేరదు; గనుక గణేశాదులు జీవులుగారు. ఈరీతిగా గణేశాదులకు ఈశ్వరత గలుగుట వలన గ్రంథారంభమందు వారిచింతనముచేయుట యోగ్యము.

నానారూపములవలన ఈశ్వరునియొక్క కథన మేది గలదో, అది సర్వులకు సర్వేశ్వరభావమును ద్యోతనము చేయుటకొఱకై యున్నది; అట్లు ఈశ్వరభక్తి, గురుభక్తి విద్యాప్రాప్తికి ముఖ్యసాధనముగా నున్నవనునర్థమును ద్యోతనము చేయుటకొఱకై యున్నది.

## 250. వస్తునిర్దేశాదిమంగళప్రకారము

నిర్గుణవస్తునిర్దేశరూపమంగళము—ఏవిభు ప్రకాశరూపుఁడయిన పరమాత్మ, తనప్రకాశముచే రవిచంద్రాగ్న్యాదులను

సరలసుబుద్ధిశిష్య కంజపునితోఁరిగేరి,
సూలనమెఫెరత ఫిరతఫేరిఫారికే. 2
వేఖసుపథికభగవానజాని అనుచిత,
అంకమేబతాయఃథ్యాయ వ్యాసరూపధారికే. 3
సూత్రకో బనాఇజాల బనకోవిభాళకిహ్నా,
కరతప్రనామతాహి నిశ్ఫలపుకారికే. 4

వాయువు, వనమునందు వ్యాపించి, వృక్షమూలము శాడించి, వానికంటకములను ప్రసరింపఁజేసి, సుందరపుష్పములను తనస్థలములనుండి వెల్లగించి, కంటకములందు భ్రమణము చేయిం చుచుండఁగా ఆ భ్రమించుపుష్పములను జూచి, సుజ్ఞుఁడైన పథి కునిచిత్తమందు విచారము గలుగును—ఈసుందరపుష్పములు ఈస్థానమునకు యోగ్యములుగావు; మఱేమనఁగా—ఉత్తమ స్థానమునకు యోగ్యములు; ఈవిచారము చేసి, ఆ పుష్పములను తీసుకొని, మరల విచారము చేసెను; ఏమనఁగా—పవనము ముందును పుష్పములను వెల్లగించి, కంటకములందు భ్రమణము చేయింపఁగూడదు; ఈవిచారము చేసి, సూత్రజాలము చేత కంటక వృక్షములను విభజించి, ఆ జాలముచేత పుష్పములకు కంటకము లందు ప్రవేశము గాఁజాలనట్టి ఏర్పాటును చేయుచున్నాఁడు.

అట్లు భేదవాదాచార్యుఁడైన వాయువు వేదరూపవనము నందు వాదరూపమైన [అర్థవాదరూపములగు] సకంటకవృక్ష

స్కారరూపమంగళము గ్రంథకారుఁడు చేసియున్నాఁడు. ఇచ్చట గురుశిష్య సంవాదనిమిత్తమున గ్రంథకర్త ఏ మంగళము చేసియున్నాఁడో, అది "శాస్త్ర మధ్యమందును మంగళము చేయువలయును." ఈవిధ్యనుసారముగ నున్నది. [గ్రంథముయొక్క ఆద్యంతమధ్యములందు మంగళము శిష్టసంప్రదాయము.]

ములయొక్క సకామకర్మరూపకంటకములను ప్రసరింపఁజేసి, సర
ళుఁడైన [కపటరహితుఁడైన] శుద్ధుఁడైన [రాగాదిదోషరహితుఁ
డైన] శిష్యరూపపుష్పమును శమాదిరూపమైన స్వస్థానమునుండి
వెల్లగించి, సకామకర్మరూపకంటకములందు భ్రమింపఁజేయుటను
జూచి, దధికసమానుఁడైన వ్యాపకవిష్ణువు విచారముచేయును-
-ఈశుద్ధపురుషుఁడు ఈస్థానమునకు యోగ్యుఁడుగాఁడు; నాస్వ
రూపప్రాప్తికే పాత్రుఁడు; ఈవిచారముచేసి, వ్యాసరూపము
ధరించి, ఆ శిష్యుని ఉపదేశరూపమైన తనయంకమునందు స్థాపిం
చెను. ఎట్లు పురుషుని అంకమందుండు పుష్పములను వాయువు
ఎగిరించుటకు సమర్థముగాదో, అట్లు బ్రహ్మనిష్ఠాచార్యోపదేశ
మందుండు పురుషుని భేదవాది చలింపజేయుటకు సమర్థుఁడు
గాఁడు.

మఱియును వ్యాసభగవానుఁడు విచారము చేసెను—
ముందును భేదవాదిరూపమయిన ఝంఝూవాతము ఇతరపురుష
రూపపుష్పములను కంటకములందు భ్రమింపజేయును; కాఁబట్టి
ముందును శిష్యుఁడెవ్వఁడును భ్రమింపనట్టి యుపాయము చేయ
వలెను; తరువాత వ్యాసభగవానులచేత బ్రహ్మసూత్రరూప
జాలముచే వేదవాక్యరూపవృత్తులు విభాగింపఁబడినవి.

సకంటక నిష్కంటక భేదముచే వనమునందు ద్వివిధవృత్తు
ములుగలవు; జాలమువలన పుష్పములకు సకంటకవృత్తులందు
ప్రవేశముగాదు, అట్లు వేదమునందు ద్వివిధవాక్యములు
గలవు—ఒకటి కర్మమును స్తుతించి, బహిర్ముఖపురుషుని కర్మ
మందు ప్రవర్తింపఁజేయుచున్నది; ఇంకొకటి కర్మఫలమును
అనిత్యమని బోధించి, పురుషుని నివర్తిల్లఁజేయుచున్నది.

వేదవ్యాసుఁడు పైఁజెప్పినరీతిగా విభాగముఁ జేసి, సూత్రములచే ఈయర్థమును బోధించెను— సర్వవేదవాక్యముల యొక్క తాత్పర్యము నివృత్తియందుఁ గలదు; ప్రవృత్తియందు ఏవాక్యముయొక్కయు తాత్పర్యము లేదు; ప్రవృత్తిబోధక వాక్యముల అభిప్రాయమిది—పురుషుఁడు తనయందు స్వాభావికముగు నిషిద్ధకర్మప్రవృత్తి ఏది గలదో, దానినుండి నివృత్తుఁడై, విహితకర్మప్రవృత్తికలిగి, అంతఃకరణశుద్ధియైన తరువాత విహితకర్మప్రవృత్తినుండియు నివృత్తుఁడై, జ్ఞాననిష్ఠుఁడు గావలయును.

అర్థవాదవాక్యములచేత ఏకర్మఫలబోధనము చేయఁబడెనో, అదియును గుడజిహ్వాన్యాయమున [1] చేయఁబడినది; వానికిని ఫలమునందు తాత్పర్యము లేదు; ఈయర్థము శ్రీవ్యాసభగవానులచే బ్రహ్మసూత్రద్వారమున ప్రతిపాదింపఁబడియున్నది. ఎట్లు తంతుజాలము పుష్పములను కంటకములనుండి నిరోధము చేయునో, అట్లు వ్యాసభగవానుల సూత్రములు పురుషులను సకామకర్మమునుండి నిరోధము చేయుచున్నవి.

---

1. తల్లి బాలకునకు జిహ్వమీఁద గుడాంగుళి రాచి, చేఁదుమందులో మధురరసబుద్ధిని పుట్టించి, చేదుఔషధమును త్రాగించును; దానిని శాస్త్రమందు గుడజిహ్వాన్యాయమందురు. దానివలె శ్రుతిరూపమాత, పామరజీవరూపుఁడగు తనబాలకునకు కర్మఫలస్తుతియుక్తవచనరూపమైన అర్థవాదవాక్యరూపగుడాంగుళిరాచి, కర్మముయొక్క స్వర్గాదిప్రాప్తిరూపమగు ఫలబోధనముచేసి, కర్మమందు ప్రవృత్తి చేయించును. అయిన తల్లికి ఎట్లు బాలకుని రోగనివృత్తియందు తాత్పర్యము గలదో, గుడరుచియందు లేదో, అట్లు శ్రుతిరూపమాతకు పాపనివృత్తిద్వారమున చిత్తశుద్ధియందు తాత్పర్యము గలదు; గాని స్వర్గాదిఫలములందు లేదు.

### 252. అగృథదేవుని ప్రశ్న—నే నెవ్వఁడను? సంసారమునకు కర్త ఎవ్వఁడు? ముక్తికి హేతువు జ్ఞానమా? కర్మమా? ఉపాసనయా? లేక రెండునా? లేక మూఁడునా?

ఓభగవంతుఁడా! నే నెవ్వఁడను? దేహస్వరూపుఁడనా? దేహముకన్న భిన్నుఁడనా? నేను మనుష్యుఁడను, మఱియు నాశరీరము ఈరెండును నాకు ప్రతీత మగును; దానిచే నాకు సంశయము గలదు; దేహముకన్న భిన్నుఁ డనిన, నేను కర్త, భోక్తనా? లేక అకర్త, అభోక్తనా? మీరు అకర్తయనిన, నేను సకలశరీరములందు ఒక్కఁడనా? అనేకుఁడనా? ఇది ప్రథమ ప్రశ్న కభిప్రాయము.

ఈసంసృతియొక్క కర్త ఎవ్వఁడు? వానికిని యభిప్రాయము: ఈసంసారమునకు కర్త ఎవ్వఁడైనఁ గలఁడా? లేక తానుగా నైనదా? కర్త గలఁ డనిన, జీవుఁడు కర్తయా? లేక ఈశ్వరుఁడు కర్తయా? ఈశ్వరుఁ డనిన, ఆయీశ్వరుఁడు ఏకదేశస్థితుఁడా? వ్యాపకుఁడా? వ్యాపకుఁడనిన, వ్యాపకాకాశముకన్న జీవుఁడు భిన్నుఁడైనట్లు ఆ ఈశ్వరునికన్న జీవుఁడు భిన్నుఁడా? అభిన్నుఁడా? ఇది ద్వితీయప్రశ్న కభిప్రాయము.

ముక్తికి హేతువు జ్ఞానమా? కర్మమా? ఉపాసనయా? లేక ఈమూఁడునా? లేక రెండా? రెం డనిన, అవి జ్ఞానకర్మములా? జ్ఞానోపాసనలా? లేక కర్మోపాసనలా? ఇది తృతీయ ప్రశ్న కభిప్రాయము.

## 253. 252—గత ప్రథమప్రశ్నకు త్తరము— ఆత్మ సంఘాతమునకు సాక్షి

స్వప్నస్థగురువు "నే నెవ్వాఁడను" అను ప్రశ్నకు త్తరము చెప్పనారంభించెను—ఓయిగృథా! నీవు సచ్చిదానందస్వరూపుఁ డవు. ఇట్లు చెప్పుటవలన దేహముకన్న భిన్నుఁడని తెలుపఁబడినది; ఏలయన—దేహము అసద్రూపము, జడరూపము మఱియు దుఃఖరూపము; నీవు కర్తభోక్తగావు; ఏలయన—ఎవ్వనియందు దుఃఖముగలదో, సుఖాభావము గలదో, వాఁడు దుఃఖనివృత్తి కొఱకును, సుఖప్రాప్తికొఱకును క్రియ చేయును; వానినే కర్త యందురు; నీవు ఆనందస్వరూపుఁడవు; నీయందు దుఃఖమును లేదు; సుఖభావమును లేదు; కనుక దుఃఖనివృత్తికొఱకును, సుఖప్రాప్తికొఱకును నీవు ఏక్రియకును కర్తవుగావు;ఎవ్వాఁడు కర్త యగునో, వాఁడే భోక్తయగును; ఎందువలన నీవు కర్తగావో, అందువలన నీవు భోక్తయును గావు; పుణ్యపాపజనకమైన కర్మమునకు కర్తయు, సుఖదుఃఖములకు భోక్తయు స్థూలసూక్ష్మ సంఘాతముగా నున్నది; నీవు గావు; నీవు సంఘాతమునకు సాక్షిగా నున్నావు.

## 254. ఆత్మ సుఖదుఃఖరహితుఁడు ఒక్కఁడు.

ఆత్మ యొక్కఁడు, నానా కాఁడు—ఆత్మ కర్త, భోక్త యనిన, ఒకఁడు సుఖి, ఒకఁడు దుఃఖి ఈభేదమువలన నానా యగును;అకర్త, అభోక్తయని యంగీకరించుటవలన నానాయని సిద్ధింపదు; ఒక్కఁడే యని సిద్ధమగును.

ఏది కర్త, అది భోక్త; కనుక ఆత్మ కర్తయై యొక్కఁడనిన, ఒకనిసుఖదుఃఖములవలన సర్వులకు సుఖదుఃఖములు సిద్ధమగును;

అకర్త యని యంగీకరించుటవలన భోక్త యేగాఁడు; దానివలన ఉకఁడే యని సిద్ధమగును.

## 255. సాంఖ్యమతోక్తాత్మమతఖండనము

సాంఖ్యమతమందు ఆత్మ కర్తభోక్త యని యంగీకరింపక, నానాయనుచున్నారు; అది అత్యంతవిరుద్ధము; ఏలాగున ననఁగా ఇది సాంఖ్యసిద్ధాంతము.

సత్త్వరజస్తమోగుణములయొక్క సమానావస్థకు పేరు ప్రధానము; ఆ ప్రధానము ప్రకృతిగాని, వికృతిగాదు; ప్రకృతి యనఁగా ఉపాదానకారణము, వికృతి యనఁగా పరిణామ కార్యము; ఆప్రధానము మహత్తత్త్వమునకు ఉపాదానకారణ మగుటవలన ప్రకృతి యగును; అనాదియగుటవలన వికృతిగాదు; మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు; ఈ యేడు తత్త్వములు ప్రకృతివికృతులు; [ఉత్తరోత్తరముయొక్క ప్రకృతులు, పూర్వపూర్వముయొక్క వికృతులు;] పంచభూతములు, దశేంద్రియములు, మనస్సు ఈపదునాఱు వికృతులుగాని, ప్రకృతులుగావు; పురుషుఁడో, దేనియొక్క ప్రకృతియుఁగాఁడు, దేనియొక్క వికృతియుఁగాఁడు; కనుక అసంగుఁడు. ఈరీతిగా సాంఖ్యమతమందు పంచవింశతితత్త్వములు గలవు.

సాంఖ్యమతమందు ఈశ్వరుని అంగీకారము [1] లేదు; స్వతంత్రప్రకృతి జగత్తునకు కారణము; పురుషుని భోగమోక్ష

1. సేశ్వరసాంఖ్యనిరీశ్వరసాంఖ్యభేదముచేత సాంఖ్యమతము ద్వివిధము—కర్దమదేవహూతి పుత్త్రుఁడయిన భగవదవతారమగు కపిలదేవునిచేత సేశ్వరసాంఖ్య మంగీకరింపఁబడినది; ఇంకొక్క కపిలుఁ డున్నాఁడు; వానిచేత

ములనిమిత్తముగు ప్రకృతియే ప్రవర్తించుచున్నది; పురుషుఁడు ప్రవర్తింపఁడు; ప్రకృతియొక్క విషయరూపపరిణామమువలన

నిరీశ్వరసాంఖ్య మంగీకరింపఁబడినది; వానిమతమందు ఈశ్వరాని అంగీకారము లేదు; ప్రధానమును జగత్కారణమని అంగీకరించి, ఆప్రధానమే పురుషునకు భోగమోక్షములకు హేతు వని యంగీకరింపఁబడినది. అది ఘటిల్లదు—

ఏలయన—ప్రళయకాలమందు సత్త్వాదిగుణములయొక్క సామ్యావస్థను [మిళితావస్థను] ప్రధాన మని చెప్పెదరు. అది ఎప్పుడు సృష్టికాలమందు సామ్యావస్థను విడిచెనో, అప్పుడు జగదుత్పత్తి యగును; ఆప్రధానము ఎందువలన తాను స్వతః జడమో, అందువలన స్వతః సామ్యావస్థాత్యాగమందు సమర్థముగాదు; వానిమతమందు చైతన్యరూపపురుషుఁడో, అసంగుఁడగుటవలన వానికి ప్రధానముతో సంబంధము లేదు; చైతన్యసంబంధములేక జడముచేత కార్యోత్పత్తి గా నేరదు. కాఁబట్టి జడమైన ప్రధానముచేత జగదుత్పత్తి ఘటిల్లదు. కనుక మాయావిశిష్టుఁడయిన ఈశ్వరుని అంగీకరించి, వాఁడే జగత్కర్త యని యంగీకరించుట యోగ్యము.

మఱియు సాంఖ్యమతమందు ఆత్మనానాత్వముయొక్క, ప్రకృతినిత్యత్వముయొక్క అంగీకారము అయుక్తము; మఱియు ఆత్మయందు సజాతీయవిజాతీయసంబంధప్రాప్తివలన నానాత్మలకు అసంగత్వకథనము వ్యాఘాతదోషయుక్తముగా నున్నది.

మఱియును ఒకవ్యాపకాత్మయొక్క అంగీకారముచే, నానాంతఃకరణములచేత భోగాదికముయొక్క అసంకరమునకు వ్యవస్థ యగును; అభోగవ్యవస్థకొఱకు నానాత్మాంగీకారము చేయుటవలన ఏమియు ప్రయోజనము గాదు; ఆత్మయొక్క నానాత్వాంగీకారమువలన అద్వైతశ్రుతితో, క్రిందచెప్పిన ములో చెప్పిన భేదబాధకయుక్తితో విరోధమువచ్చు అన్యఫలము దొరకదు.

ఈరీతిగా సాంఖ్యమతము అసంగతము.

పురుషునకు భోగ మగుచున్నది; మఱియు వివేకరూపపరిణామమువలన మోక్ష మగుచున్నది.

పురుషుఁడు అసంగుఁ డగుటవలన వానియందు భోగమోక్షములు ఘటిల్లవు; జ్ఞానసుఖదుఃఖరాగద్వేషములు మొదలుకొని ఇవి బుద్ధియొక్క పరిణామములు; ఆ బుద్ధికి ఆత్మవిషయమందు అవివేక ముండును, వివేకము గాదు; ఉక్తప్రకారముగా అవివేకసిద్ధభోగము ఆత్మయందుఁ గలదు; దానివలన ఆత్మను భోక్తయందురు; పరమార్థముచే ఆత్మ భోక్త గాదు; మతే మనఁగా— బుద్ధియే భోక్త; ఆబుద్ధి ఆత్మకన్న భిన్నము; ఈజ్ఞానమునకు పేరు వివేకము, తదభావమునకు పేరు అవివేకము; ఈ రీతిగా సాంఖ్యమతమందు ఆత్మ అసంగుఁడు; సుఖాదికములు బుద్ధియొక్క ధర్మములు.

ఇట్లనుట, ఆత్మ నానా యనుట అత్యంతవిరుద్ధము; ఏల యన— సుఖదుఃఖములు ఆత్మయొక్క ధర్మములైనపుడు ప్రతిశరీరమందు సుఖదుఃఖభేద మగుటవలన ఆత్మభేద మగుచుండెను; ఆ మతప్రకారముగ సుఖదుఃఖములు ఆత్మధర్మములు గావు, అవి బుద్ధిధర్మములు; కావున సుఖదుఃఖభేదమువలన బుద్ధిభేదము సిద్ధమగును; కాని, ఆత్మభేదము సిద్ధింపదు. ఎట్లు ఒకటే వ్యాపకమైనఆకాశమందు నానోపాధిధర్మములు ఉపాధియొక్కయు, ఆకాశముయొక్కయు అవివేకమువలన ప్రతీతమగునో, అట్లు ఒకఁడే వ్యాపకుఁడైన ఆత్మయందు నానాబుద్ధియొక్క నానా ధర్మములు అవివేకమువలన ప్రతీతమగుచున్నవి; ఈసంగతి సాంఖ్యమతమందు అంగీకరించుట ఉచితము, ఆత్మను అసంగుఁడని యంగీకరించి, నానాత్వాంగీకారము అనుచితము.

మఱియు కొన్ని ఆత్మలు ముక్తులు, కొన్ని ఆత్మలు బద్ధులు ఈవిధముగ బంధమోక్షభేదముచే ఆత్మభేదాంగీకారము చేయుటయు ఘటిల్లదు; ఏలయన—బంధమోక్షములు ఆత్మయందంగీకారము చేసినట్టయిన, ఆ బంధమోక్షభేదముచే ఆత్మభేదము సిద్ధమగును; ఆబంధమోక్షములు సాంఖ్యమతమందు అసంగాత్మయందు అంగీకరింపఁబడలేదు; మఱేమనఁగా—బుద్ధియొక్క అవివేకావివేకములవలన అంగీకరింపఁబడినవి; ఏవస్తువు అవివేకముచే ప్రతీతమగునో, వివేకముచే దూరమగునో, ఆవస్తువు రజ్జుసర్పమువలె మిథ్య; అట్లు బంధమోక్షములును మిథ్య.

ఈవిధముగా మిథ్యయైన బంధమోక్షములు ఏకాకాశన్యాయముచే ఏకాత్మయందు ఘటిల్లవు; మఱియు వీనిభేదము వలన ఆత్మయందుభేదము సిద్ధము గానేరదు. ఈప్రకారముగా సాంఖ్యమతమందు ఆత్మభేదాంగీకారము [1] అసంగతము.

---

1. ఇచ్చట భేదబాధకయుక్తి ఇట్లున్నది—ఏకాత్మయొక్క భేదము అన్యాత్మయందుచెప్పు ప్రతివాదిని అడుగవలయును—ఆభేదమేమి భేదరహితాత్మయందున్నదా? భేదసహితాత్మయందున్నదా?

ప్రథమపక్షము చెప్పిన, వ్యాఘాతదోషమగును; ఏలయన—భేదాశ్రయమైన ఆత్మను భేదరహితమని చెప్పెను; మఱియు వానియందు భేదమున్నదనియు చెప్పెను; కనుక "నాతండ్రి బాలబ్రహ్మచారిగా నున్నాడు" ఈవాక్యమువలె ఉక్తవచనము వ్యాఘాతదోషయుక్తమగును.

మఱియు ద్వితీయపక్షము చెప్పిన ఈభేదముతోసహితుఁడైన ఆత్మయందు భేదమున్నది యను వానిని ఇట్లడుగవలయును—ఆ భేదము, మఱియు ఈభేదము ఏమి పరస్పరము ఒక్కటా? రెండా? ఒక్కటనిచెప్పిన తనతోఁ గూడినఆత్మయందు తానేవర్తించుటవలన ఆత్మాశ్రయదోషమగును.

## — 256. త్రివిధన్యాయమతఖండనము —

న్యాయమతమందును ఆత్మభేదాంగీకారము అసంగతము; ఏలయన న్యాయముయొక్క సిద్ధాంత మిది.

సుఖదుఃఖ జ్ఞానేచ్ఛాద్వేష ప్రయత్న ధర్మాధర్మ సంస్కార సంఖ్యాపరిమాణ పృథక్త్వసంయోగ విభాగములు ఈ చతుర్దశ

---

మఱియుం ఒక భేదముతోఁ గూడిన ఒక ఆత్మయున్నాఁడు; ఆ యాత్మయొక్క విశేషణరూపమైన నూతనభేదము మఱియుం ఏ భేదముతోఁ గూడిన ఆత్మయున్నాఁడో, ఆ పూర్వభేదము ఈ రెండుభేదములు పరస్పరభిన్నములుగా నున్నవి; ఇట్లు చెప్పిన, ఆత్మయొక్క విశేషణరూపమగు ఈనూతనభేదమును భేదరహితాత్మయం దుండుటసంభవింపదు. అది భేదసహితాత్మయందే చెప్ప వలయును. వాదికూడ భేదసహితాత్మయందే యనెను; కనుక ఆత్మయందు ప్రథమభేదస్థితికొఱకు విశేషణరూపమగు నూతనమైన ద్వితీయభేదము చెప్ప వలయును; అట్లు చెప్పిన, మరల అద్వితీయభేదస్థితికొఱకు విశేషణరూపమగు ప్రథమభేదమును చెప్పినయెడల పరస్పరస్థిత్యర్థము పరస్పరాపేక్ష యగుటవలన అన్యోన్యాశ్రయ దోషమగును.

మఱియుం ద్వితీయభేదస్థిత్యర్థము తృతీయభేద మంగీకరించి, ఆతృతీయ భేదస్థిత్యర్థము మరల ప్రథమభేద మంగీకరించిన చక్రక దోషమగును.

మఱియుం తృతీయభేదస్థిత్యర్థము చతుర్థము, చతుర్థస్థిత్యర్థము పంచ మము. ఈరీతిగా ధారాప్రవాహము నడిపించినపుడు అనవస్థాదోషమగును.

కాఁబట్టి ఆత్మను నానాయని యంగీకరించి, ఆత్మలందు పరస్పరభేద మనుట అసంగతము. ఇది భేదబాధకయుక్తి నైయాయికాదిసర్వభేదవాదులకు సమ్మతమైనది; అభిప్రాయ మేమనఁగా—ఈయుక్తిచే సర్వభేదవాదులతోటి నడ వదు.

గుణములు జీవాత్మయందుఁగలవు; సంఖ్యాపరిమాణ సంయోగ విభాగజ్ఞానేచ్ఛాప్రయత్నములు ఈ యెనిమిదిగుణములు ఈశ్వరునియందుఁ గలవు.

వీనియందు ఇన్ని భేదములు గలవు; ఈశ్వరునియొక్క జ్ఞానేచ్ఛాప్రయత్నములు నిత్యములు; జీవునియొక్క మూఁడును అనిత్యములు; ఈశ్వరుఁడు ఒకఁడు, వ్యాపకుఁడు, నిత్యుఁడు; జీవుఁడు నానా, వ్యాపకుఁడు, నిత్యుఁడు; జీవునియొక్కజ్ఞానము అనిత్యము; కనుక ఎప్పుడు జ్ఞానగుణము గునో, అపుడు జీవుఁడు చైతన్యరూపుఁడు; జ్ఞానగుణనాశ మగునేని, జీవుఁడు జడరూపుఁడు.

జీవేశ్వరులవలె ఆకాశ కాలదిఙ్మనస్సులు ఇవి నిత్యములు; అట్లు పృథ్వీజలతేజోవాయువులయొక్క పరమాణువులు నిత్యములు; [గవాక్షమునుండి ప్రసరించు ఎండలోఁ గనఁబడు రజఃకణము నాఱవభాగమునకు పేరు పరమాణువు] మఱియును జాతిమొదలుకొని కొన్నిపదార్థములు న్యాయమతమందు నిత్యములు. [వేదవిరుద్ధసిద్ధాంతము చాలవ్రాయుట అయోగ్యము.]

"నేను మనుష్యుఁడను, నేను బ్రాహ్మణుఁడను" అట్టి దేహమందలి ఆత్మభ్రాంతివలన రాగద్వేషములు జనించును; ఆరాగద్వేషములవలన ధర్మాధర్మములకొఱకు ప్రవృత్తియగును; దానివలన శరీరసంబంధము ద్వారమున సుఖదుఃఖములగుచున్నవి. ఈరీతిగ న్యాయమతమునందు ఆత్మకు సంసారహేతువు భ్రాంతిజ్ఞానమని చెప్పఁబడియె.

దేహాది సంపూర్ణపదార్థములకన్న ఆత్మ భిన్నుఁడు. అను నిశ్చయమునకు పేరు తత్త్వజ్ఞానము; ఆ తత్త్వజ్ఞానమువలన [1] "నేను మనుష్యుఁడను, నేను బ్రాహ్మణుఁడను" అను భ్రాంతి

---

1. ఇచ్చట ఈవిచారము గలదు—నైయాయికమతమునందు తత్త్వజ్ఞానమునకు హేతువు మననమని చెప్పఁబడినది. "ఆత్మ ఇతరపదార్థములకన్న భిన్నుఁడు. ఆత్మయగుటవలన, ఏది ఇతరపదార్థములకన్న భిన్నముగాదో, అది ఆత్మ గాదు. ఎట్లనఁగా—ఘటము." ఈవ్యతిరేకానుమానమువలన ఆత్మయందు ఇతరపదార్థముల భేదముయొక్క అనుమితిజ్ఞానమైనది; దానిని మనన మందురు. మఱియు ఇతరపదార్థముల జ్ఞానములేక, ఆత్మయందు ఇతరపదార్థములయొక్క భేదజ్ఞానమునట సంభవింపదు; ఏలయన—దేనియందు భేదమగునో, అది భేదమునకు ప్రతియోగి యగును; ఆప్రతియోగియొక్క జ్ఞానములేక భేదజ్ఞానము ఘటిల్లదు; ఈరీతిగ ఆత్మయందు ఇతరపదార్థముల భేదముయొక్క అనుమితిరూపమననమునకు ఉపయోగియయిన ఇతరపదార్థములనిరూపణము మననముద్వారమున తత్త్వజ్ఞానమునకు ఉపయోగిగా నున్నది.

ఇట్లు నైయాయికులు అంగీకరించుచున్నారు; అది సంభవింపదు; ఏలయన—శ్రవణముచేసిన అర్థముయొక్క నిశ్చయమునకు అనుకూలమైన ప్రమేయగతసందేహనివర్తకయుక్తులు గలవో, వానిచింతనమును వేదమందు మననమందురు. భేదజ్ఞానమువలననో, అనర్థమైనది; చూడుము—"సర్వం ఖల్విదంబ్రహ్మ" ఇత్యాదివాక్యములచేత సకలవేదములకును అభేదమందు తాత్పర్యము గలదు; "ద్వితీయాద్వై భయం భవతి" "మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవపశ్యతి" ఇత్యాదివేదవాక్యములచే భేదజ్ఞానముయొక్క నిందచేయఁబడినది; కనుక సాక్షాత్తుగాఁ గాని, తత్త్వజ్ఞానముద్వారమునఁ గాని భేదజ్ఞానమునకు పురుషార్థజనకత సంభవింపదు. మఱియు మననపదమువలనను, భిన్న ఇతరపదార్థములయొక్క భేదప్రతీతిరూపమైన అర్థము గానేరదు;

దూరమగుచున్నది; భ్రాంతినాశమువలన రాగద్వేషముల యొక్క అభావము, దానివలన ప్రవృత్త్యభావము, దానివలన

---

చింతనమాత్రము అర్థమగుచున్నది. ఏప్రకారముచేతను ఆత్మకన్న ఇతరపదార్థములభేదము మననశబ్దార్థము సంభవింపదు.

లేక ఇతరపదార్థములయొక్క జ్ఞానమువలననే మోక్షసాధనమైన తత్వజ్ఞానముయొక్క ప్రాప్తి అయినట్టయిన సకలపురుషులకును తత్వజ్ఞానప్రాప్తి గావలయును; లేక ఎవ్వనికిని గాఁకూడదు. ఏలాగుననఁగా—ఇతరపదార్థములయొక్క సామాన్యజ్ఞానము, తత్వజ్ఞానమందు అపేక్షితమయిన, అసామాన్యజ్ఞానము సకలపురుషులకుఁ గలదు; దానివలన ఇతరపదార్థజ్ఞానపూర్వకమైన ఇతరపదార్థముల భేదజ్ఞానమువలన సర్వులకు తత్వజ్ఞానము గావలయును. మఱియు సర్వపదార్థములయొక్క అసాధారణధర్మమగు విశేషరూపముచేత ఇతరపదార్థములజ్ఞానము తత్వజ్ఞానమందపేక్షితమైనట్టయిన సర్వజ్ఞుఁడైన ఈశ్వరునకు తప్ప సకలపదార్థములయొక్క అసాధారణధర్మజ్ఞానము ఎవనికిని సంభవింపదు.

కాఁబట్టి నైయాయికమతమందు అంగీకరించిన ఏకాత్మకు అన్యాత్మతోఁ మఱియు అనాత్మతో భేదజ్ఞానరూపమైన మననము సంభవింపదు.

మఱియు దానివలన [భేదజ్ఞానముచేత] దేహాదికమందు ఆత్మభ్రాంతియొక్క అభావము, దానివలన రాగద్వేషాభావము, దానివలన ధర్మాధర్మనిమిత్తప్రవృత్త్యభావము, దానివలన శరీరసంబంధరూపజన్మాభావము, దానివలన ఇరువదియొకటి దుఃఖములయొక్క నాశరూపమోక్షము నైయాయికానుసారికిఁ గానేరదు. అయిన మహావాక్యరూపమై శ్రుత్యర్థగోచరమైన అభేదజ్ఞానమే కారణసహితానర్థనివృత్తిపూర్వకముగా పరమానందప్రాప్తిరూపమోక్షమునకు హేతువుగా నున్నది.

శరీరసంబంధరూపముయిన జన్మముయొక్క అభావమగుచున్నది; మఱియు భోగమువలన ప్రారబ్ధనాశ మగుచున్నది.

శరీరసంబంధాభావమువలన ఇరువదియొక్క దుఃఖముల నాశమగుచున్నది; ఆ దుఃఖనాశరూపమే న్యాయమతమునందు మోక్షమందురు. శరీరము, మఱియు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణమనస్సులు ఈ షడింద్రియములు, మఱియు షడింద్రియముల షడ్విషయములు, షడ్జ్ఞానములు, మఱియు సుఖదుఃఖములు ఇవన్నియుఁగూడి, ఇరువదియొక్క దుఃఖములని తెలియఁబడినది; శరీరాదికములు సంబంధద్వారమున, స్వర్గాదిసుఖము లు నాశద్వారమున దుఃఖజనకములగుటవలన దుఃఖములందురు.

యద్యపి న్యాయమతమందు శ్రోత్రమనస్సులు నిత్యములు, వానియొక్క నాశము ఘటిల్లదు; తథాపి వీరూపముచే శ్రోత్రమనస్సులు దుఃఖహేతువో, ఆరూపముయొక్క నాశమగుచున్నది; పదార్థజ్ఞానోత్పత్తిద్వారమున శ్రోత్రమనస్సులు దుఃఖహేతువులు, ఆ పదార్థజ్ఞానము మోక్షకాలమందు శ్రోత్రమనస్సులు చేయవు; ఏలయన కర్ణగోళకమం దుండునాకాశము శ్రోత్రమందురు; ఆ కర్ణగోళకము మోక్షకాలమం దుండదు. ఆకాశరూపముగు శ్రోత్రేంద్రియ ముండియు, గోళకాభావము వలన దానికి జ్ఞానము గానేరదు; మఱియు ఆత్మతో మనస్సంయోగమువలన జ్ఞానమగును; ఆ మనస్సంయోగము ఒకని క్రియ చేత, లేక ఇద్దఱి క్రియచేత నగును; ఎట్లు పక్షికి వృక్షముతో సంయోగము ఒకపక్షి క్రియవలన, మఱియు రెండుపొట్టేళ్ళకు సంయోగము రెండింటి క్రియవలన నగుచున్నది; అట్లు విభువైన ఆత్మయందో, క్రియ ఎన్నటికిని ఘటిల్లదు; మనస్సుండి

నను, దానికి మోక్షకాలమందు క్రియ ఘటిల్లదు; ఈలాగు మోక్షకాలమందు దుఃఖహేతువైన శ్రోత్రేంద్రియమనస్సులయొక్క అభావము అంగీకరింపఁబడినది [1|2]

---

1.2. న్యాయమతమందు శ్రోత్రమును ఆకాశరూపమని యెంచి, నిత్యమని అంగీకరించినారు; అది ఘటిల్లదు. ఏలయన— శ్రుతియందు తేజాదులవలన నేత్రాదులకు వలె ఆకాశమువలన శ్రోత్రమునకు ఉత్పత్తి చెప్పఁబడియున్నది; ఉత్పత్తిమంతమగు వస్తువునకు నిత్యత సంభవింపదు.

కర్ణగోళకమందుండు ఆకాశమును న్యాయమతమందు శ్రోత్రమందురు; అది అయుక్తము; ఏలయన—కర్ణగోళకవృత్తియైన ఆకాశము విద్యమానముగ నుండుటవలన ఎప్పటికిని శ్రవణముయొక్క మందత, లేక అభావము గాఁగూడదు; అది యయినది; అందువలన పంచీకృతభూతమైన కర్ణగోళకవృత్త్యాకాశముకన్న భిన్నమైనట్టి అపంచీకృతభూతాకాశకార్యమగు శ్రోత్రేంద్రియము గలదని సిద్ధమగును. ఉత్పత్తినాశవంతమగుటవలన నది అనిత్యము. ఈమతము సమీచీనము.

లేక దుర్జనతోషతో న్యాయముగా దానిని ఆకాశరూపమని అంగీకరించినను, దానికి నిత్యత సంభవింపదు; ఏలయన—"ఆత్మన ఆకాశస్సంభూతః" [ఆత్మవలన ఆకాశమాయెను] ఈ తైత్తిరీయవాక్యమందు ఆకాశముయొక్క ఉత్పత్తిచెప్పి, అనిత్యతాసూచనము చేయఁబడినది. ఎప్పుడు సంపూర్ణమయిన ఆకాశము అనిత్యమని ఏమిచెప్పవలయును?

అట్లు న్యాయమతమందు మనస్సునకును నిత్యత చెప్పఁబడినది సంభవింపదు; ఏలయన—మనస్సును పరమాణురూపమని ఎంచి నిత్యమనిన, వాని నడుగవలయును—మనస్సు నిరవయవమా? సావయవమా?

నిరవయవమనిన, దీనియందు అవయవరూపదేశాభావమువలన దీనికి ఆత్మతో సంయోగము సంభవింపదు; కనుక జడుఁడని యంగీకరించిన ఆత్మ

యందు మనస్సంయోగజన్యమయిన జ్ఞానగుణోత్పత్తియొక్క అభావమువలన జగదంధతాప్రసంగమగును; మఱియు మనస్సును సావయవమనిన, దీనియందు ఘటాదులవలె అనిత్యత నిర్వివాదముగా సిద్ధించును. లేక మనస్సు నిత్యమనిన, సుషుప్తియందు విశేషజ్ఞానజనకమయిన ఏలింగము గలదో, తదభావగమ్యమయిన తన ఉపాదానరూపాజ్ఞానమందు మనస్సునకు లయము గాఁగూడదు; లయమగుటవలనను, మనస్సు అనిత్యమని సిద్ధము.

మఱియు నైయాయికుఁడు చెప్పుచున్నాఁడు—ఆత్మమనస్సంయోగము జ్ఞానమునకు హేతువు; ఆసంయోగము ఒకటియొక్క క్రియవలన లేక రెంటియొక్క క్రియవలన అగును; విభువైనఆత్మయందో, క్రియ ఎప్పుడును గాదు; మఱియు మోక్షకాలమందు, లేక సుషుప్తికాలమందు భోగసమ్ముఖమయిన అదృష్టముయొక్క అభావమువలన మనస్సునందును క్రియ గాదు; కనుక ఆత్మతో మనస్సంయోగాభావమువలన సుషుప్త్యాద్యవస్థలందు విశేషమయిన జ్ఞానము గాదు.

ఆవార్తయు సంభవింపదు; ఏలయన—ఏది వ్యాపకవస్తువు గలదో, దానియందు సర్వవస్తువులయొక్క క్రియ లేకయు సదాసంయోగము గలదు; ఎట్లు వ్యాపకాకాశముతో క్రియారహితములగు పర్వతవృక్షపాషాణాదికములకు సదాసంయోగము గలదో, అట్లు మోక్షమందు, లేక సుషుప్తియందు క్రియారహితమనస్సునకు విభువైనఆత్మతో సంయోగసిద్ధివలన విశేషజ్ఞానము గావలయును; అది కానేరదు; మామతములో, సుషుప్తియందు మనస్సుయొక్క విలయము చెప్పఁబడినది; జాగ్రత్కాలమందు దానియొక్క ఉత్పత్తి స్పష్టముగా తెలియఁబడుచున్నది.

ఈరీతిగా ఉత్పత్తి నాశవంతమగుటవలన మనస్సు అనిత్యము; దానినిత్యతాకథనము, ప్రలాపమాత్రముగా నున్నది.

న్యాయమతైకదేశి త్వక్కుతో మనస్సంయోగము జ్ఞానమునకు హేతువు, [1] ఆత్మమనస్సంయోగము గాదని చెప్పుచున్నాఁడు. సుషుప్తికాలమందు పురీతతినాడియందు మనస్సు

---

ఆత్మతో మనస్సంయోగమువలన జ్ఞానమగునెడ సుషుప్తియందు దీని సంయోగాభావమయినవెనుక జాగ్రత్తులో సుఖాజ్ఞానములస్మృతియైయో దానివలన మూలభూతానుభవము సిద్ధమగుచున్నది; అది గాఁగూడదుగదా!

లేక ఆత్మతోఁడ మనస్సంయోగమువలన జ్ఞానమైనట్టయిన, న్యాయమతమునందు మనస్సును అణురూపముగా అంగీకరించినారు; కనుక తత్సంయోగజన్యజ్ఞానమును శరీరముయొక్క ఏకదేశమందును; సకలశరీరమందగుట లేదు; అందువలన సకలశరీరమందైన కంటకవేధయొక్క పీడానుభవము గాఁగూడదుగదా!

మఱియును ఆత్మసంయోగమువలన జ్ఞానముగలమనస్సును వేదాంతమతమువలె సకలశరీరమందుండునదిగా అంగీకరించినను, సకలశరీరమందు పీడయొక్క అసంభవము లేదుగాని, సుషుప్తియందు సుఖముయొక్కయును, అజ్ఞానముయొక్కయును సామాన్యజ్ఞానము గలదు; దానియొక్క అసంభవమగును; కాఁబట్టి ఆత్మతో మనస్సంయోగమువలన జ్ఞానము సిద్ధింపదు; కావునఁగా—ఆత్మయొక్క స్వరూపభూతమై ఉత్పత్తినాశరహితమై, నిత్యమగు జ్ఞానము అంగీకరించుటయే యోగ్యమని సిద్ధమగును.

1. ఒకానొకఁడు న్యాయైకదేశి, త్వక్కుతో మనస్సంయోగము జ్ఞానమునకు హేతువని చెప్పినాఁడు; అదియును అసంగతము; ఏలయన—ఎట్లు మనస్సుతో ఆత్మయొక్క సంయోగము జ్ఞానహేతువగుటకుఁ ఏ ప్రమాణము లేదు, అట్లు త్వక్కుతో మనస్సంయోగము జ్ఞానహేతువనుటయందును శ్రుత్యాదికమేదియుం ప్రమాణము లేదు. ఏ ప్రమాణము లేకయుం స్వకపోలకల్పితార్థము నంగీకరించుట యోగ్యమైనట్టయిన, "నేను మృగజలమందు

ప్రవేశించును, ఆకాలమందు త్వక్కుతో మనస్సంయోగము లేదు; కనుక జ్ఞానము గానేరదు. వానిమతమందు త్వక్సంయోగముగు మనస్సే జ్ఞానముద్వారమున దుఃఖహేతువుగాని, కేవల మనస్సు దుఃఖహేతువుగాదు. మోక్షకాలమందు త్వక్కుయొక్క నాశముగుటవలన దానితోడ మనస్సుయొక్క సంయోగము గలుగదు; ఈలాగే మోక్షకాలమందు మనస్సున్నను, దుఃఖహేతుజ్ఞానజనకమైన త్వక్సంయోగముగల మనస్సుయొక్క అభావము చెప్పబడినది.

ఈప్రకారముగా మోక్షకాలమునందు పరమాత్మకన్న భిన్నుడై, దుఃఖసంబంధహేతుడైన వ్యాపకాత్మ జడరూపముగా [1] నుండును. ఎందు కనగా జ్ఞానగుణమువలన ఆత్మ

స్నానము చేసి, ఆకాశపుష్పముకుటము చేసి, శశశృంగధనువు చేసి, వంధ్యాపుత్రుడు యుద్ధమందు పోవుచుండగా చూచితిని." ఈవచనార్థమును అంగీకరించుట యోగ్యమగును.

లేక సుషుప్తియందు త్వక్కుతో మనస్సంయోగాభావమయిన వెనుకను, విద్వాంసులబుద్ధిచేత సుఖముయొక్కయు, అజ్ఞానముయొక్కయు సామాన్యజ్ఞానమగుచున్నది; అది కాగూడదు. ఈరీతిగా త్వక్కుతో మనస్సంయోగము జ్ఞానమునకు హేతువు గాదు; ఆత్మయొక్క స్వరూపమే జ్ఞానముగ నున్నది.

1. న్యాయమతమందాత్మను వ్యాపకమని యంగీకరించి, జడమని యంగీకరించినారు; అది శ్రుతికి విరుద్ధము—స్వప్నమందు "ఈపురుషుడు స్వయంజ్యోతిగా నున్నాడు." అనునీ శ్రుత్యర్థమందు సూర్యాదిజ్యోతులయొక్క అభావమువలన ఆత్మ స్వయంప్రకాశుడనుట స్పష్టముగా తెలియుచున్నది; ఏలాగుననగా—ఇచ్చట "యఏషహృద్యంతర్జ్యోతిఃపురుషః [హృద

యొక్క ప్రకాశమగును. జీవుని సంపూర్ణజ్ఞానము ఇంద్రియజన్యముగుటవలన అనిత్యము, ఆయింద్రియజన్యజ్ఞానము యొక్క నాశము మోక్షకాలమందగును. ఇది న్యాయమతైకదేశిసిద్ధాంతము.

న్యాయమతమందు పూర్వోక్తప్రకారముగా సుఖదుఃఖములు, బంధమోక్షములు ఆత్మకగుచున్నవి; కాఁబట్టి ఆత్మ నానాగాను, వ్యాపకుఁడుగాను ఉన్నాఁడు. సర్వాల్పపదార్థములతో సంయోగమే న్యాయమతమందు వ్యాపకలక్షణము, సజాతీయవిజాతీయస్వగతభేదాభావము వ్యాపకలక్షణముగాదు; [1]న్యాయమతమందు ఆత్మ నిరవయవుఁడగుటవలన స్వగతభేదముయొక్క అభావముండినను, సజాతీయవిజాతీయభేదముల

---

యందు స్వయంప్రకాశరూపుఁడయి పురుషుఁడున్నాఁడు]" మఱియు "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" ఇత్యాద్యనేక శ్రుతివాక్యములందు వ్యాపకాత్మయొక్క చైతన్యరూపత వినఁబడినది; [దానియందు యుక్తియుఁగలదు; అది ముందుమూలగ్రంథము 259 అంకమునందు చెప్పఁబడును] కాఁబట్టి 'ఆత్మ స్వరూపముచేత జడము;" అను న్యాయముయొక్క వచనము అసంగతము.

1. వేదాంతమందు సజాతీయవిజాతీయస్వగతభేదముల అభావము వ్యాపకలక్షణమని చెప్పఁబడినది "ఏకమేవాద్వితీయంబ్రహ్మ" అను ఛాందోగ్యషష్ఠాధ్యాయవచనానుసారముగా నున్నది. ఇచ్చట ఏకపదముచే సజాతీయభేదముయొక్క, ఏవపదముచే విజాతీయభేదముయొక్క, అద్వితీయపదముచే స్వగతభేదముయొక్క నిషేధము గలదు.

ఈలక్షణానుసారము దేశకాలవస్తుకృతమయిన అంతముచే రహితమగు వ్యాపకముయొక్క లక్షణమును సిద్ధమగుచున్నది. ఇచ్చట ఏకపదముచే దేశకృతమయిన అంతముయొక్క నిషేధము గలదు; ఏలయనఁగా—ఏవస్తువు

యొక్క అభావము లేదు; మఱేమనఁగా— సజాతీయమైన వేఱొక్క ఆత్మయొక్క, విజాతీయమైన ఘటాదికముఁయొక్క భేదము ఆత్మయందుఁ గలదు.

దీనియందొకానొకఁడు శంకించును— న్యాయమతము నందు ఆత్మవలె ఆకాశకాలదిశలును వ్యాపకములు; పరమాణువో, సూక్ష్మము, నిరవయవము; దీనితో సర్వవ్యాపకపదార్థములయొక్క సంయోగము ఘటింపదు. పరమాణువు సావయవముగా నుండినపుడు కొంతదేశమందు ఆత్మయొక్క, కొంతదేశమందు అన్యవ్యాపకపదార్థముయొక్క సంయోగమగును; అతిసూక్ష్మమగు పరమాణువుతో ఒకేదేశమందు సర్వవ్యాపకపదార్థములయొక్క సంయోగమగుననుట ఘటిల్లదు; ఏలయన— ఒకదానియొక్క సంయోగమువలన నిరుద్ధమైన ఏదేశముగలదో, ఆదేశమందన్యపదార్థముయొక్క సంయోగము ఘటిల్లదు?

---

పరిచ్ఛిన్నమో, అది నానా; ఏది వ్యాపకమో, అది నానా గాదు; అది ఆకాశమువలె ఏకముగా నున్నది; ఆత్మ ఎందువలన ఒక్కఁడో, అందువలన పరిచ్ఛిన్నుఁడు; మఱేమనఁగా—వ్యాపకుఁడుగా నున్నాఁడు. మఱియు నిశ్చయవాచకమయిన ఏవపదముచే ఆత్మయొక్క నిరపేక్ష వ్యాపకతాకథనము వలన ఆత్మయందు కాలకృతమయిన అంతముయొక్క నిషేధము చేయఁబడినది. మఱియు అద్వితీయపదముచే భేదప్రతియోగి [నిరూపకము] యైన అన్యవస్తువుయొక్క నిషేధమువలన ఆత్మయందు వస్తుకృతమయిన అంతముయొక్క నిషేధము చేయఁబడినది. ఈరీతిగా సిద్ధాంతమందు చెప్పఁబడిన ఉభయవిధవ్యాపకలక్షణము శ్రుత్యనుసారముగా నున్నది.

మఱియును న్యాయమతమందు 'ఆత్మ, నానా వ్యాపకుఁడుగా చెప్పఁబడినది; అవార్త, అద్వైతశ్రుతికిని, ఇచ్చట చెప్పఁబడిన యుక్తికిని, లోకానుభవమునకును విరుద్ధముగా నున్నది.

నైయాయికుఁ డిట్లనుచున్నాఁడు—ఈశంక ఘటిల్లదు; ఏలయన—సావయవవస్తువుయొక్క సంయోగము అవ్యాప్యసంయోగమునకు విరోధియగును. ఎట్లనఁగా—పృథ్వియొక్క ఏ దేశంబునందు హస్తసంయోగమయినదో, ఆ దేశంబునందు పాదసంయోగము గానేరదు; నిరవయవముయొక్క సంయోగము స్థానము నడ్డగింపదు; కావున అది అన్యముయొక్క సంయోగమునకు విరోధిగాదు; ఈసంగతి అనుభవసిద్ధమే. ఎట్లనఁగా—ఘటముయొక్క ఏ దేశమందు ఆకాశమునకు సంయోగము గలదో, ఆ దేశమందే కాలముయొక్కయు, దిశయొక్కయు సంయోగము గలదు; ఘటముయొక్క ఒకానొక దేశము ఆకాశకాలాదుల నుండి బాహిరమయినపక్షంబునందు ఆ దేశమందు ఆకాశకాలాదులయొక్క సంయోగము గాకుండవలసియుండెను; దానికి బాహిరమగు ఏ దేశమును లేదు; సర్వపదార్థములయొక్క సర్వ దేశములు ఆకాశకాలాదులందే యున్నవి; ఆ సర్వపదార్థములయొక్క సర్వదేశములందు ఆకాశకాలాదులయొక్క సంయోగము గలదు; ఈరీతిగా పరమాణువునందును ఒకే దేశమునందు నానానిరవయవవిభువులైన పదార్థములయొక్క సంయోగము ఘటిల్లినది; దీనియందు ఏదోషము లేదు. ఈవిధముగా ఆత్మ నానాయై, సంపూర్ణవ్యాపకుఁడని సిద్ధమగుచున్నది.

"సర్వవ్యాపకపదార్థములకుచిన్న పెద్దసర్వపదార్థములతో సంయోగము గలదు!" అనునీ న్యాయముయొక్క సిద్ధాంతము సమీచీనము గాదు; ఏలయన—వ్యాపకాత్మ నానాయని అంగీకరించినపుడు, సర్వశరీరములందు సర్వాత్మలయొక్క సంబంధము అంగీకరింపవలసివచ్చును; అట్లు అంగీకరించిన, ఈశరీరము ఈ

యాత్మది అను నిశ్చయము గలుగనేరదు; ఒక్కొక్కాత్మకు సర్వశరీరము లగును; మఱియు ఒక్కొక్క శరీరమునకు సర్వాత్మలు నగుదురు.

నైయాయికుఁ డనును—"ఎవ్వని కర్మమువలన నేశరీరము పుట్టినదో, ఆ యాత్మది ఆశరీరమని యెఱుఁగవలయును." ఆమాటయును, ఘటిల్లదు; ఏలయన— ఏశరీరమందు కర్మము చేయఁబడినదో, ఆకర్మవంతమగు పూర్వశరీరమందును సకలాత్మలకు సంబంధమగుటవలన కర్మముగూడ సర్వాత్మల దగును; ఒకే యాత్మదనుట ఘటిల్లదు.

మఱియు నైయాయికుఁ డిట్లనును—"ఏయాత్మయొక్క మనస్సుతోఁగూడిన యేశరీరము గలదో, ఆయాత్మది ఆశరీరము" ఆమాటయు ఘటిల్లదు; ఏలయన— శరీరముతోఁబోలె మనస్సుతోఁగూడ, సకలాత్మలకు సంబంధము గలదు; దానిలో ఈ మనస్సు ఈయాత్మది యని నిశ్చయము గానేరదు; సర్వాత్మలకు సర్వమనస్సులగును; అట్లు సర్వేంద్రియములును సర్వాత్మల కగును; బాహిరపదార్థములందు ఇదినాది, ఇది యితరులది అనునట్టి వ్యవహారమును శరీరములను గుఱించినదే గలుగును; ఆశరీర మైననో, సర్వాత్మలకు సర్వమగుటవలన బాహ్యపదార్థములును సర్వాత్మలకు సర్వములు గావలయును.

మఱియు నైయాయికుఁడిట్లనును—"ఏయాత్మకు నేశరీరమందు అహంబుద్ధిమమబుద్ధియగునో, ఆయాత్మది ఆశరీరమగును; ఆయహంబుద్ధిమమబుద్ధి ఒక్కొక్కటిగా నుండును; సర్వాత్మల యందుండదు; ఒకధర్మము ఒకేధర్మియందుండును; ఈవిధముగా నొకాత్మయొక్క శరీరము ఒకటిగా నుండుటవలన నేయాత్మది

ఏశరీరమగునో, ఆశరీరసంబంధమనస్సు ఇంద్రియములు, మఱియు బాహ్యపదార్థములు ఆయాత్మకే;" ఆవార్తయు ఘటిల్లదు; ఏలాగునన ననఁగా— అహంబుద్ధి, మమబుద్ధి ఒకేశరీరమందు, ఒకేయాత్మకయినను, న్యాయమతమందు ఈవార్త ఘటిల్లదు; అచ్చట సర్వాత్మలకును ఒకేశరీరమందు అహంబుద్ధి, మమబుద్ధి కావచ్చును; ఏలయన— న్యాయమతమందు బుద్ధిని జ్ఞానమందురు; ఆ జ్ఞానము మనస్సుయొక్కయు, ఆత్మయొక్కయు సంయోగమువలన కలుగును;ఒకమనస్సుతో సంయోగము సర్వాత్మలకుఁ గలదు; కనుక మనస్సంయోగమువలన ఎట్లు ఒకశరీరమందు ఒకాత్మకు అహంబుద్ధి, మమబుద్ధి యగునో, అట్లు ఒకశరీరమందు సర్వాత్మలకును అహంబుద్ధి, మమబుద్ధి కావలయును.

మఱియు నైయాయికుఁ డిట్లనును— "మనస్సుతో సంయోగము సర్వాత్మలకుఁ గలిగినను, ఏయాత్మయందు జ్ఞానజనకమైన అదృష్టము గలదో, ఆయాత్మకే అహంబుద్ధి మమబుద్ధి గలుగును, అన్యునకుఁ గలుగదు." ఈవార్తయు ఘటిల్లదు; ఏలయన— వ్యాపకమైన నానాత్మను అంగీకరించినయెడల, ఒకశరీరముయొక్క శుభాశుభక్రియలవలన ఆశరీరమందుండు సర్వాత్మలయందును అదృష్ట ముండవలయును; మఱియు ఆయదృష్టమువలన సర్వాత్మలందు అహంబుద్ధి, మమబుద్ధి కలుగవలయును; ఈసంగతి పూర్వమునుండి చెప్పుచువచ్చినారము; కావున వ్యాపకాత్మను నానాయని యంగీకరించిన, ఒకేశరీరమందు సుఖదుఃఖములభోగము సర్వాత్మలకుఁ గావలసియుండెను; అదియో, గాలేదు.

ఈ ప్రకారముగా ఆత్మ నానా, వ్యాపకుఁడు; కర్త భోక్త యను న్యాయసిద్ధాంతము సమీచీనము గాదు.

మాయితమంద్రైననో, కర్త, భోక్త అంతఃకరణము, ఆ యంతఃకరణము వ్యాపకమును గాదు; అణువును గాదు; మఱే మనఁగా— శరీరముతో సమానాకారముగ నున్నది; దీప ప్రకాశమువలె పెద్దశరీరమును పొందినపుడు, అంతఃకరణము వికసించుచున్నది; చిన్నశరీరమును పొందినపుడు, సంకోచించుచున్నది. [శ్రీగతి సిద్ధాంతబిందువ్యాఖ్యానమందు మధుసూదనస్వాములు ప్రతిపాదించియున్నారు.] ఏయంతఃకరణము నకు ఏశరీరముతో సంబంధముగలదో, ఆయంతఃకరణమునకు ఆ శరీరసంబంధభోగ మగుచున్నది.

అంతఃకరణము వ్యాపకమని యంగీకరించినపుడు సర్వశరీరములు సర్వాంతఃకరణములకగును; సర్వభోగములును సర్వాంతఃకరణములకగును; ఆయంతఃకరణమో, వ్యాపకముగాదు; అందువలన ఆ దోషము ఘటిల్లదు; అంతఃకరణము అణువనుట యును ఘటిల్లదు; ఏలాగుననఁగా— ఒకేకాలములో పాదమందును, మస్తకమందును కంటకవేధమైనట్లయిన, రెండుస్థలములందును ఒకేకాలములో పీడ ఏది ప్రతీతమగునో, అది గాకుండవలసియుండెను; ఏలయన— అంతఃకరణ మణువైనపక్షమందు పీడ ఒకకాలములో ఒకేస్థానమందుండును; ఏస్థానమందుండునో, అస్థానమందే పీడ ప్రతీతము గావలయును; ఇతరస్థానమందు ప్రతీతము గాఁగూడదు.

ఈవిధముగా అంతఃకరణము అణువును గాదు; వ్యాపకమును గాదు; మఱేమనఁగా—శరీరముతో సమానాకారముగ

నున్నది. ఈమతమునందే దోషమును లేదు; అణువ్యాపకముల కన్న విలక్షణమైనదానిని మధ్యమపరిమాణ మందురు.

న్యాయమతమందు నవీనుఁ డొకఁ డిట్లనును—"ఆత్మ నానా, కర్త, భోక్త అయినను, వ్యాపకుఁడుగాఁడు; కనుక భోగ సంకరము లేదు; అణువుగాఁడు; కావున రెండుస్థానములందు పీడానుభవాసంభవమును లేదు; ఎట్లు వేదాంతమతమునందు అంతఃకరణము మధ్యమపరిమాణ మని యంగీకరింతురో, అట్లు ఆత్మయును మధ్యమపరిమాణుఁడుగా నున్నాఁడు; వానియందు పూర్వోక్తచతుర్దశగుణములు గలవు." [1|2]

ఈమతమును సమీచీనము గాదు; ఏలయన—ఆత్మను సంకోచవికాసములు గలవాఁడుగా నంగీకరించినయెడల దీపప్రకాశమువలె ఆత్మ వినాశి యగును; అట్లయినపక్షమందు మోక్షప్రతిపాదకశాస్త్రమును, సాధనములును నిష్ఫలము లగును; మఱియు మధ్యమపరిమాణుఁ డని యంగీకరించి, సంకోచ వికాసవంతుఁ డని యంగీకారము చేయనియెడల ఏశరీరమునకు సమానుఁడుగా ఆత్మను అంగీకరింపవలెనో, అది నిశ్చయము

1. ఎట్లు నానాఘటములను వ్యాపకమనుట నిష్ఫలమో, అట్లు దేహదేహమందు కర్త భోక్తయయిన నానాత్మను వ్యాపకుఁ డనుట నిష్ఫలము. లేక నానాంతఃకరణముల యొక్క యంగీకారము చేయుటచే భోగాసంకరసిద్ధివలన వ్యాపకాత్మను నానా యనిచెప్పుట నిష్ఫలము.

2. ఇచ్చట ఈరహస్యము గలదు—ఎందువలన శరీరాంతర్గతములగు మనస్సు, ఇంద్రియములు మొదలగు సకలాల్పపదార్థములతో ఆత్మకు సంయోగముగలదో, అందువలన మధ్యమపరిమాణముగల ఆత్మయందును న్యాయసంప్రదాయోక్తమయిన వ్యాపకలక్షణము సంభవించినది.

గా నేరదు; ఏలయన—మనుష్యశరీరసమానుఁడని అంగీకరించిన యెడ, ఎప్పుడు గజశరీరమును పొందునో, అప్పుడు సర్వశరీరమందు ఆత్మ యుండదు; కనుక గజమునకు ఏదేశమందాత్మ లేదో, ఆదేశమందు పీడ గాఁగూడదు; మఱియు హస్తిశరీరముతో సమానుఁడని అంగీకరించిన, దానికన్న పెద్దశరీరమును పొందినపుడు దానియొక్క ఏకదేశమందు పీడ గాఁగూడదు.

మఱియు దేనికన్న ఇంకొక్క శరీరము అధికము లేదో, తాదృశశరీరాకారమని అంగీకరించినట్టాయెన, ఇట్లు సర్వముకన్న ఎక్కువయైన విరాట్టుయొక్క శరీరము గలదు; తత్సమానుఁడని అంగీకరింపవలెను; ఇట్లు అంగీకారము చేసినయెడల విరాట్టుశరీరమునకు అంతర్భూతములుగా సర్వశరీరములు గలవు; కాఁబట్టి సర్వాత్మలకు సర్వశరీరములతో సంబంధమగును; ఆపక్షమందు మొదటినుండి చెప్పఁబడుచున్నదోషమే ప్రాప్తమగును. మఱియు ఆత్మకు పెద్దశరీరముయొక్క పరిమాణమంగీకరించిన పక్షమున గజశరీరమునం దుండినఆత్మ పిపీలికాది స్వల్పశరీరమునకు వచ్చినపుడు అవకాశము చాలకపోవును.

మఱియు ఇది నియమము—మధ్యమపరిమాణవస్తువు ఏది గలదో, అది శరీరమువలె అనిత్యము; అట్లు ఆత్మయు మధ్యమపరిమాణుఁ డనిన, అనిత్యుఁ డగును; అంతఃకరణమునకో, మామతమందు జ్ఞానముచేత నాశము అంగీకరించియున్నాము; కనుక అది అనిత్యమే; దానికి మధ్యమపరిమాణమంగీకరించుటవలన దోషము లేదు.

ఈప్రకారముగా నవీనతార్కికులమతమును సమీచీనము గాదు.

ఒకానొకఁడిట్లనును—"ఆత్మ నానాయుండఁగా అణుస్త్ర;" ఆవార్తయు ఘటిల్లదు; ఏలయన—ఇందు ఆత్మను కర్త భోక్త యని అంగీకరించిన, అంతఃకరణముయొక్క అణుత్వపక్షమందు ఏదోషము చెప్పినాఁడో, ఆదోష మగును; మఱియు కర్తృత్వ భోక్తృత్వాంగీకారము చేయకుండిన; ఆత్మ నానాత్వాంగీకారము నిష్ఫలమగును; ఒక్కఁడే వ్యాపకుఁడైన ఆత్మను సకలశరీరము లందు అంగీకరించుట యోగ్యము; కర్తృత్వభోక్తృత్వాంగీకారము చేయకుండిన, తనసిద్ధాంతముయొక్క త్యాగమగును; ఏలయన ఇది యణువాది సిద్ధాంతము—జ్ఞానసుఖదుఃఖములు మొదలుగాని పదునాలుగు ఆత్మయొక్కధర్మములు, ఆయాత్మ అణువని యంగీకరించిన, శరీరముయొక్కఏదేశమందు ఆత్మ లేఁడో, ఆదేశము మృతసమానమై యుండవలెను; కాఁబట్టి దానియందు పీడాదికము గాకుండవలసియుండును.

మఱియు నతఁ డిట్లు చెప్పును—"ఆత్మ శరీరముయొక్క ఏకదేశమందున్నను, కస్తూరీగంధమువలె వానిజ్ఞానము సకలశరీర మందు వ్యాపకమగును; కనుక సర్వశరీరమందు అనుకూలప్రతికూలసంబంధమును అనుభవించును!" ఆవార్తయు ఘటిల్లదు.

ఏలయన ఇది నియమము—ఏదేశమునందు గుణి యుండునో, ఆదేశమునందే గుణముండును; బాహ్యముగా నుండదు; ఎట్లనఁగా—నీలపీతాదిరూపము ఘటాదులకంటె బాహ్యము కాదు; కస్తూరియొక్క సూక్ష్మభాగము ఎంతదేశమునందు వ్యాపించునో, అంతదేశమందే సుగంధము గలదు; కనుక కస్తూరీ దృష్టాంతమును ఘటిల్లదు.

ఎచ్చట శ్రుతియందు ఆత్మ, అణువుకన్న అణు వని చెప్పఁబడినదో, అచ్చట ఆత్మ, దుర్విజ్ఞేయుఁడు అభిప్రాయముచే అట్లు చెప్పఁబడినది; ఎట్లు అత్యంతాణువస్తువుయొక్క జ్ఞానము సూక్ష్మదృష్టిగలపురుషునకుఁగాని కాదో, అట్లు బహిర్ముఖపురుషునకు ఆత్మయొక్క జ్ఞానము గానేరదు; ఈయభిప్రాయమున అణువుకన్న అణు వని శ్రుతియందు చెప్పఁబడినది; అయినను అట్లు చెప్పుటయందు ఆత్మ అణు వని శ్రుత్యభిప్రాయము లేదు;[1] ఏల యన అనేకస్థానములందు వ్యాపకుఁ డని శ్రుతి తానే ప్రతిపాదించుచున్నది.

ఈప్రకారముగా ఆత్మ మధ్యమపరిమాణము, లేక అణువు, లేక నానా అనుట సంభవింపదు.

## 257. అబాధితమైనట్టి వేదాంతమతమందు వ్యాపకాత్మ ఒక్కఁడే.

పరిశేషముగా[2] వ్యాపకాత్మ ఒకఁడుగా నున్నాఁడు; వానియందు ధర్మాధర్మసుఖదుఃఖములు, బంధమోక్షములు ఎవ్వఁడేని అంగీకరించిన' ఒకనికి సుఖము, ఒకనికి దుఃఖము, ఒకనికి బం

1. "అణోరణీయాన్ మహతో మహీయాన్" ఈశ్రుతికిది యర్థము— పృథివికన్న జలము సూక్ష్మము, మఱియు వ్యాపకము; జలముకన్న తేజము, తేజముకన్న వాయువు, వాయువుకన్న ఆకాశము సూక్ష్మము, మఱియు వ్యాపకము. అట్లు ఆకాశముకన్న ఆత్మ సూక్ష్ముఁడు, మఱియు వ్యాపకుఁడు. ఈయర్థము ఉపదేశసాహస్రియందు భగవంతుఁడయిన భాష్యకారుఁడు చెప్పియున్నాఁడు; కాబట్టి ఆత్మ అణు వనుట అనుచితము.

2. అనేకార్థములు ప్రాప్తమయిన వెనుక అన్ని అర్థములయొక్క నిషేధమై, అవశిష్టమయిన ఏకార్థమును పరిశేష మందురు.

క్షము, ఒకనికి మోక్షము ఇట్టి వ్యవహారము గలుగదు; కనుక సుఖదుఃఖాదికములు బుద్ధిధర్మము లని చెప్పఁబడినది.

యద్యపి బుద్ధిజడమగుటవలన దానియందును సుఖదుఃఖాదులు ఘటిల్లవు; తథాపి ఆత్మయొక్క ధర్మము గాదను నభిప్రాయముచే బుద్ధియొక్క ధర్మమని చెప్పఁబడినది; అయితేను బుద్ధిధర్మమే యని అభిప్రాయము గాదు; ఏలయన — బుద్ధియును, సుఖదుఃఖములును ఆత్మయందధ్యస్తములు; ఏవస్తువు దేనియందధ్యస్తమగునో, ఆవస్తువు దానియందు పరమార్థముచే నుండదు. ఎట్లు రజ్జువునందధ్యస్తమైన సర్పము, రజ్జువునందు పరమార్థముచే లేదో, అట్లు బుద్ధియును, సుఖాదులును ఆత్మయందధ్యస్తమగుటవలన ఆత్మయందు పరమార్థముచే లేవు; మఱియు అధ్యస్తవస్తువు దేనికిని ఆశ్రయము గాదు. ఆ కల్పితవస్తువులలో ఇంతభేదముగలదు — అజ్ఞానమో, శుద్ధచైతన్యమందు అధ్యస్తము, అంతఃకరణము అజ్ఞానోపహితచైతన్యమందు అధ్యస్తము, మఱియు ధర్మాధర్మసుఖదుఃఖబంధమోక్షాదులు అంతఃకరణోపహితచైతన్యమందు అధ్యస్తములుగా నున్నవి. ఈప్రథముగా ఆత్మయందు సుఖదుఃఖాద్యధ్యాసముయొక్క అధిష్ఠానత్వమునకు అంతఃకరణము ఉపాధియగుటవలన సుఖదుఃఖాదులు అంతఃకరణముయొక్క [బుద్ధియొక్క] ధర్మము లని చెప్పఁబడినది.

అంతఃకరణవిశిష్టమందు ధర్మాదికము అధ్యస్తమనఁగూడదు; అనినయెడల, విశేష్యచైతన్యమువలె విశేషణమైన అంతఃకరణము గూడ అధిష్ఠానమగును; ఆయంతఃకరణము తాను మిథ్య, మిథ్యావస్తువు అధిష్ఠానమగుట ఘటిల్లదు; కనుక ఆత్మ

యందు ధర్మాద్యధ్యాసమునకు అంతఃకరణము విశేషణము గాదు; ఉపాధిగానే యున్నది.

ఉపాధి కిది స్వభావము—తాను తటస్థమై, యెంతదేశమందు తాను ఉండునో, అంతదేశమం దుండు వస్తువును తన కన్నవేఱుగా చూపును; విశేషణమున కిది స్వభావము—ఎంత దేశమందు తాను ఉండునో, అంతదేశమందుండు వస్తువును తన సహితముగా చూపును. ఉపాధివంతమును ఉపహితమని, విశేషణవంతమును విశిష్టమని యందురు.

ఈవిధముగా ఎంతదేశమందు అంతఃకరణము గలదో, అంతదేశమందుండు చైతన్యమాత్రమందే అధిష్ఠానత గలదు; అంతఃకరణమందు లేదు. ఆ యంతఃకరణము అజ్ఞానోపహిత చైతన్యమందు అధ్యస్తము; విశిష్టమందు గాదు.

ఈరీతిగా అధ్యస్తమైన ధర్మాదికమునకు అధిష్ఠానము ఆత్మ, మఱియు అధిష్ఠానత్వమునకు ఉపాధి అంతఃకరణముగా నున్నది; కాబట్టి ధర్మాదికము బుద్ధియొక్క ధర్మ మందురు. తద్ధర్మాదికము అవివేకమువలన అంతఃకరణము, మఱియు ఆత్మ ఈ రెంటియందు ప్రతీత మగుచున్నది; అందువలన అంతఃకరణ విశిష్టుడై, ప్రమాత ఎవడు గలడో, తద్ధర్మ మందురు; తద్ధర్మాదికము అంతఃకరణధర్మము గానీ, లేక ప్రమాతృధర్మము గానీ, లేక రజ్జుసర్పస్వప్నపదార్థగంధర్వనగరాదులవలె దేనికిని ధర్మములుగాకపోనీ, సర్వప్రకారములను ఆత్మధర్మము గాదు; ఇది తాత్పర్యము.

ఆత్మయందు అధ్యస్తమైనను, ఆత్మయొక్క ధర్మముగాదు; ఏలయన— ఏ వస్తువు దేనియందు అధ్యస్తమగునో, ఆవస్తువు

దానియందు పరమార్థముచేత లేదు; కాబట్టి రాగద్వేషములు, ధర్మాధర్మములు, సుఖదుఃఖములు, బంధమోక్షములు వీనిచేత రహితుఁడై, ఒక్కఁడై, వ్యాపకుఁడైన ఆత్మయందు ఏధర్మమును అసంభవము.

## 258. ఆత్మ సద్రూపుఁడు

ఆత్మ సత్తుగా నున్నాఁడు; ఏలాగున ననఁగా—త్రికాలాబాధ్యపదార్థమును సత్తందురు; సకలపదార్థములయొక్కయు, తన్నివృత్తియొక్కయు అధిష్ఠానము ఆత్మ, వానిని బాధితమని నపుడు, వానినివృత్తి యంగీకరింపవలసివచ్చును; వానికి నివృత్తి గలదన్ననో, వానికిని, తన్నివృత్తికిని అధిష్ఠానము ఇతరము గావలయును; శూన్యమఁదో, నివృత్తిగానేరదు; ఇంక ఏయధిష్ఠానమందు నివృత్తి యంగీకరించినాఁడో, దానికిని వేఱొక్క అధిష్ఠానము అంగీకరింపవలయును; ఈరీతిగా అనవస్థ యగును.

ఆత్మనివృత్త్యంగీకారము ఎవ్వఁడుచేయునో, వానినడుగవలయును— ఆత్మనివృత్త్యనుభవము ఎవఁడైన చేసినాఁడా? లేఁడా?

అనుభవము చేసినాఁడనుమాట ఘటిల్లదు; ఏలయన— ఎవ్వఁడు అనుభవము చేయువాఁడో, వాఁడే ఆత్మ, అందువలన వానికి తనస్వరూపనివృత్త్యనుభవము తనశిరచ్ఛేదనానుభవసమానముగా నున్నది.

మఱియు "ఆత్మయొక్కనివృత్తియో, యగుచున్నది; కాని, అనుభవము ఏవనికిని లేదు;" అనుటయు ఘటిల్లదు; ఏలయన—ఏవస్తువు ఎవ్వఁడును అనుభవింపఁడో, ఆవస్తువు వంధ్యాపుత్త్రిసమానము.

ఈరీతిగా ఆత్మయొక్క నివృత్తియగుట ఏరీతిగాను సిద్ధింపదు; అందువలన ఆత్మ సత్తుగానున్నాఁడు.

## 259. ఆత్మ చిద్రూపుఁడు

ఆత్మ చిత్తుగా [1] నున్నాఁడు; అలుప్తప్రకాశరూపజ్ఞానమును చిత్తందురు; ఆత్మను అప్రకాశరూపుఁడని అంగీకరించినయెడ, అనాత్మ ఘటాది జడవస్తుప్రకాశము ఎన్నటికిని ఘటిల్లదు.

అంతఃకరణేంద్రియములచే ప్రకాశమగునసుట ఘటిల్లదు; ఏలయన— ఎట్లు పరిచ్ఛిన్నమగుటవలన ఘటాదిపదార్థములు కార్యములో, అట్లు అంతఃకరణేంద్రియములును పరిచ్ఛిన్నములగుటవలన కార్యములు; ఏది కార్యమో, అది ఘటాదికము వలె జడము, అట్లు అంతఃకరణేంద్రియములును కార్యములగుటవలన జడములు, వానివలన ఏవస్తువుయొక్కయు ప్రకాశము ఘటిల్లదు.

ఒకానొకఁడిట్లనును—"ఆత్మ ప్రకాశరూపుఁడు గాఁడు; మృత్తికవలెఁగా జడుఁడు; వానియందు జ్ఞానగుణము గలదు; ఆ జ్ఞానగుణముచే ఆత్మయొక్కయు, అనాత్మయొక్కయు ప్రకాశమగుచున్నది." వాని నడుగవలయును—ఆత్మయొక్క జ్ఞానగుణము నిత్యమా? అనిత్యమా?

నిత్యమనినట్లయిన, ఆ జ్ఞానము ఆత్మయొక్క స్వరూపముగా సిద్ధమగును; ఏలయన ఇది నియమము—ఏది ఆత్మకన్న

---

1. అలుప్తప్రకాశమును చిత్తందురు; చైతన్యరూపజ్ఞానముయొక్క లోపము కాదు. దీని ప్రతిపాదనమందు ఇది శ్రుత్యర్థము—"ద్రష్టయొక్క స్వరూపభూతమయిన దృష్టిలోపము కాదు. అవినాశియగుటవలన."

భిన్నమో, అది అనిత్యము; అట్లు జ్ఞానమును ఆత్మకన్న భిన్నమనిన, అది అనిత్యమేయగును; నిత్యమని అంగీకరించి, ఆత్మకన్న భిన్నమని చెప్పుట ఘటిల్లదు; అనిత్యమనిన, ఘటాదికమువలె జడమగును; కాఁబట్టి జ్ఞానము నిత్యము; మఱియు ఆ నిత్యజ్ఞానము ఆత్మయొక్క స్వరూపమే.

మఱియు జ్ఞానము అనిత్యమని యంగీకరించిన, ఆత్మయందు ఒకానొకప్పుడు ఉండును; ఒకానొకప్పుడు ఉండదు; దానివలన నది ఆత్మకన్న భిన్నమని సిద్ధమగును; నిత్యమనిన, ఆత్మకన్న భిన్నముగానేరదు; ఏలయన— ఏది గుణమో, అది ఆగమాపాయి [1] యగుటవలన గుణియందు ఒకప్పుడు ఉండును; ఒకప్పుడు ఉండదు; ఎట్లనఁగా—వస్త్రముయొక్క నీలపీతాది గుణము వస్త్రమునందు ఒకప్పుడు ఉండును; ఒకప్పుడు ఉండదు; జ్ఞానము నిత్యమగుటవలన అట్లు ఆగమాపాయి కాదు; గనుక జ్ఞానము ఆత్మయొక్క స్వరూపమే.

మఱియు జ్ఞానము అనిత్యమనిన, ఇంద్రియముల చేత, లేక అంతఃకరణముచేత ఉత్పన్నమగునని చెప్పవలయును; అదియును ఘటిల్లదు; ఏలయన— సుషుప్తియందు ఉక్తప్రకారముగా జ్ఞానజనకమైన ఇంద్రియాదికము లేకున్నను, సుఖముయొక్కయు, అజ్ఞానముయొక్కయు జ్ఞానమగుచున్నది; ఇట్టిదైన జ్ఞానమును అనిత్యమనుట ఘటిల్లదు; కాఁబట్టి జ్ఞానము నిత్యము; జ్ఞానమును విడిచి ఆత్మ యెప్పటికిని ఉండదు; గనుక ఆజ్ఞానము ఆత్మయొక్క స్వరూపమే; ఎట్లనఁగా—ఉష్ణతను విడిచి, అగ్ని యెప్పటికిని ఉండదు; గనుక ఆ ఉష్ణత అగ్నియొక్క స్వరూపమే; ఏది ఆగ

1. ఉత్పత్తినాశములుగలది.

మాపాయియగునో, అది గుణమగును; ఉష్ణతయు, జ్ఞానమును ఆగమాపాయులు గామివలన అవి అగ్నియొక్కయు, ఆత్మ యొక్కయు స్వరూపములుగా నున్నవి.

ఉత్పత్తినాశములు అంతఃకరణవృత్తికగును; జ్ఞానమునకుఁ గావు; ఆత్మస్వరూపభూతమయిన జ్ఞానము వ్యవహారమునకు హేతువు గాదు; జ్ఞానసహితవృత్తి, లేక వృత్తిసహితజ్ఞానము వ్యవహారమునకు హేతువు; ఇది అవచ్ఛేదవాదముయొక్క మార్గము; ఆభాసవాదమందో, ఆభాససహితవృత్తివలన వ్యవహారమగుచున్నది; సారాంశము ఆభాసద్వారమున, లేక సాక్షివృత్తిద్వారమున ఆత్మస్వరూపజ్ఞానముచేతనే సకలవ్యవహారము సిద్ధమగుచున్నది; అన్యప్రకారముచేతఁ గాదు.

ఈరీతిగా సర్వమునకు ప్రకాశకుఁడై, జ్ఞానస్వరూపుఁడై, ఆత్మ యున్నాఁడు; అందువలన ఆత్మ చిత్తుగా నున్నాఁడు.

## 260. ఆత్మ ఆనందరూపుఁడు

ఆత్మ ఆనందరూపుఁడుగా నున్నాఁడు; ఆత్మ ఆనందరూపుఁడు గాఁడేని, విషయసంబంధమువలన స్వరూపానందము యొక్క భానమేది గలదో, అది గాకుండవలెను; ఏలయన — విషయమందో, ఆనందము లేదు; ఈసంగతి మొదలే చతుర్థ తరంగమందు చెప్పఁబడినది; ఇదియునుగాక విషయమందు ఆనందమున్నపక్షమందు ఒకేవిషయముచేత ఒకపురుషునకువలె ఎల్లరకును సుఖమే గావలయును; అట్లగుటలేదు; ఎట్లనఁగా — అగ్ని

స్పర్శమువలన అగ్నికీటమునకు, సర్పసింహములను చూచుటవలన సర్పసింహస్త్రీలకు ఆనందమగును; ఇతరునకుఁ [1] గాదు.

సిద్ధాంతప్రకారమందో, ఎప్పుడు అగ్నికీటమునకు అగ్నిస్పర్శేచ్ఛ గలుగునో, అప్పుడు దానికి చంచలమయిన బుద్ధియందు ఆనందభానము గలుగదు; అగ్నిసంబంధమువలన క్షణమాత్రము ఇచ్ఛ దూరమగుటచే బుద్ధి నిశ్చలమగును; ఆ నిశ్చలమైన బుద్ధియందు స్వరూపానందభానము కలుగుచున్నది; ఇతరునకు అగ్నిసంబంధేచ్ఛ లేదు; అన్యపదార్థేచ్ఛ గలదు; ఆ యిచ్ఛ అగ్నిసంబంధమువలన దూరము గానేరదు; కనుక ఇచ్ఛాసహితచంచలబుద్ధియందు అగ్నిసంబంధమువలన వానికి స్వరూపానందభానము గానేరదు.

దానియందు ఈశంక గలుగుచున్నది—ఇచ్ఛారూపాంతఃకరణవృత్తియో, విషయప్రాప్తివలన నశించును; అన్యవృత్తియుత్పత్తికి ఏదియు నిమిత్తము లేదు; కనుక అన్యవృత్తియొక్కయుత్పత్తి గాలేదు; అన్యవృత్తిలేక స్వరూపానందభానముగానే

1. ఎందువలన ఒకేవిషయముచేత కొందఱికి సుఖమును, కొందఱికి దుఃఖమును కలుగునో, అందువలన విషయము ఇచ్ఛారహితపురుషునకుఁగాని, ఇచ్ఛాసహితపురుషునకుఁగాని నియమముచేత సుఖహేతువు గాదు; అయిన విషయము, ఇచ్ఛాసహితపురుషునకు తనప్రాప్తిచేత ఇచ్ఛాతిరస్కారమువలన అంతర్ముఖమైనవృత్తియందు ప్రియమోదప్రమోదములయొక్క పర్యాయరూపమైన ఆత్మస్వరూపానందముయొక్క ప్రతిబింబమునందు నిమిత్తమాత్రమగుచున్నది; కనుక విషయమందలి ఆనందకారణత సవ్యభిచారముగానున్నది. అచ్చట విషయప్రాప్తివలన, లేక ఏకాంతదేశముయొక్క సేవనమువలన అగునట్టి ఇచ్ఛాభావము ప్రతిబింబరూపసుఖమునకు నిమిత్తకారణముగానున్నది; ఆత్మ ఆనందరూపుఁడుగాఁడేని, అంతర్ముఖవృత్తియందయిన ఆనందము గాఁగూడదుగదా!

రదు; ఈరీతిగా సరూపానందము సిద్ధింపదు; విషయమందే ఆనందము సిద్ధించును.

ఆశంక ఘటిల్లదు; ఏలయన—ఇచ్ఛారూపవృత్తియొక్క అభావము గానీ, లేక సద్భావము గానీ, దానియందు ఆనందము ప్రకాశింపదు; ఏలాగుననఁగా—ఇచ్ఛారూపవృత్తి రాజసము, అభావవృత్తి తామసము, ఆనందప్రకాశమో, సాత్త్వికవృత్తియందుఁ గావలెను; ప్రాప్తమయినవాంఛితపదార్థస్వరూపమును విషయము చేయుటకొఱకు ఉత్పన్నమయిన జ్ఞానరూపమగు వృత్తి సాత్త్వికము, ఆ సాత్త్వికవృత్తియందు ఆనందభానము గలుగుచున్నది; యద్యపి ఆ జ్ఞానరూపవృత్తి బహిర్ముఖము, అంతఃకరణోపహితచైతన్యస్వరూపమగుఆనందముయొక్క గ్రహణము ఆ వృత్తిచేతఁ గానేరదు; తథాపి ఆ వృత్తిచేత విషయోపహితచైతన్యస్వరూపానందముయొక్క భానము కలుగును; ఆ విషయోపహితచైతన్యము అంతఃకరణోపహితచైతన్యరూపాత్మకన్న భిన్నముగాదు; ఈలాగు విషయమునందు ఆత్మానందభానము చెప్పఁబడినది. ఆ జ్ఞానరూపవృత్తికి ఆత్మానందప్రాప్తికొఱకు విషయముతో నేత్రాదులయొక్క సంబంధము నిమిత్తకారణముగా నున్నది.

లేక ఆ ప్రసంగమందు జ్ఞానరూపబహిర్ముఖవృత్తికన్న అన్యమయిన అంతర్ముఖవృత్తి [1] యగును; దానియందు అంతఃకరణోపహితచైతన్యస్వరూపానందముయొక్క భానమగును; తద్వృత్త్యుత్పత్తియందు ఇచ్ఛాదులవృత్తియొక్క అభావమే

1. ఏకాగ్రతాయుక్తమైన సాత్త్వికవృత్తిని ప్రసంగానుసారముగ ప్రియవృత్తి, మోదవృత్తి, లేక ప్రమోదవృత్తి యందురు.

నిమిత్తము; ఎట్లు ఏకాంతదేశమందుండు ఇచ్ఛారహితుఁడైన ఉదాసీనపురుషునికి బహిర్ముఖమైన జ్ఞానరూపవృత్తి లేనందున ఆనందభానమగునో, అట్లు వాంఛితవిషయలాభమువలనకలిగినట్టి ఇచ్ఛావృత్త్యభావరూపనిమిత్తముచేతఆనందమును గ్రహించునట్టి అంతర్ముఖవృత్తి యగును; ఆ వృత్తిద్వారమున అంతఃకరణోపహితానందముయొక్క గ్రహణ మగును; ఆ స్వరూపానంద గ్రహణమును, విషయజ్ఞానమునుఅత్యంతావ్యవహితములగుట వలన పురుషునకు ఇట్టి భ్రాంతి యగును— "నేను విషయమునందు [1] ఆనందము ననుభవించితిని." ప్రథమపక్షముకన్న

1. ఎట్లు శ్వానము, ఎముకను కొఱికి, దానిచేత నలఁగిన తననోటియొక్క ఇగురులనుండి వెడలురక్తమును నాకి, ఈరుధిరము నాకు ఎముకనుండి వచ్చినదనుకొనునో, అట్లు వాంఛితవిషయప్రాప్తిరూపనిమిత్తమువలన ఇచ్ఛానివృత్తిద్వారమున అంతర్ముఖమయిన వృత్తియందుప్రతిబింబితస్వరూపానందముయొక్క అనుభవము చేసి, నేను విషయమందు ఆనందానుభవము చేసితి నని అవివేకిపురుషునకు భ్రాంతి యగుచున్నది; ఈభ్రాంతిచేత వాఁడు మఱియును అధికాధికవిషయప్రాప్తికొఱకు ప్రయత్నము చేయుచున్నాఁడు; వివేకపురుషునకు ఉక్తభ్రాంతి లేదు. కనుక వాఁడు నిరుపాధికానందప్రాప్తికొఱకు వేదాంతవిచారాదిప్రయత్నము చేయుచున్నాఁడు.

విషయమునందుఁగూడ ఆనందభానము ఏది గలదో, అదియును స్వరూపానందమే; అట్లయినను శ్వానముయొక్క తలయెముకయందుండు దుగ్ధమువలె నిషిద్ధమగుటవలన ఆ విషయానందము గ్రాహ్యముగాదు; మఱేమనఁగా— అనేకవిక్షేపములకును, అపవిత్రతకును హేతువగుటవలన త్యాజ్యముగా నున్నది: మఱియుం విషయాభావపూర్వకముగా వేదాంతవిచారాది సాధనములచేత ఏయానందలాభమగునో, అది సువర్ణపాత్రమందుంచు దుగ్ధమువలె గ్రాహ్యముగా నున్నది.

[1] ఈపక్షము ఉత్తమము; ఏల యన—విషయజ్ఞానరూపమైన సాత్త్వికవృత్తివలన అంతఃకరణోపహితానందమునకో, భానము ఘటిల్లదు; అయినను, సాత్త్వికవృత్తిచే విషయోపహితానందము యొక్క భానమగును; ఆయానందమునే ఆత్మానంద మని తెలియవలెను; ఇట్లు చెప్పినట్లయిన, మార్గమునందు వృక్షజ్ఞానరూపమైన వృత్తి ఏది గలదో, అదియు సాత్త్వికమగుటవలన దానిచే వృక్షోపహితచైతన్యానందముయొక్క భానము గావలయును; అట్లు సకలజ్ఞేయపదార్థజ్ఞానమువలన సకలజ్ఞేయోపహితచైతన్యానందముయొక్క భానము గావలయును; అది యోగ; గానేరదు; కాబట్టి అనాత్మవస్తుజ్ఞానరూపమైన బహిర్ముఖవృత్తివలన జ్ఞేయోపహితచైతన్యానందముయొక్క గ్రహణమనుట అశ్రేష్ఠము.

ఈరీతిగా విషయసంబంధమువలన ఆత్మానందభానమగును; ఆత్మ ఆనందరూపుఁడు గాఁడేని, విషయసంబంధముచే ఆనందభానము గాకుండవలసియుండెను.

మఱియు ఆత్మసంబంధి యయిన వస్తువేది గలదో, దానియందు ప్రేమ యగును, సంబంధియందుకూడ సన్నిహితమయిన దానియందు ఎక్కువప్రేమ గలుగును; ఈవిధముగా బాహ్యాబాహ్యపదార్థాపేక్షవలన ఆంతరాంతరపదార్థంబులందు అధిక ప్రేమ గలుగును; పరంపరగా ఆత్మసంబంధులయిన పుత్త్రమిత్త్రాదులందు ప్రేమ గలుగును; మిత్త్రునియపేక్షవలన పుత్త్రునియందు

1. విషయాకారవృత్తివలన విషయోపహిత చైతన్యానందముయొక్క భానమగును; ఈ ప్రథమపక్షముకన్న అన్యమగు అంతర్ముఖవృత్తియందు అంతఃకరణోపహితచైతన్యానందముయొక్క భానమగు నను ద్వితీయపక్షము ఉత్తమము. ఈపక్షమే పూర్వము చతుర్థతరంగమందు చెప్పఁబడినది.

అధికప్రేమగలదు; పుత్త్రునికన్న నుస్థూలశరీరమునందు, స్థూలముకన్న సూక్ష్మమునందు అధికప్రేమ గలదు; ఉక్తములైన పూర్వపూర్వముకన్న నుత్తరోత్తరము ఆత్మకు సమీపము; ఆత్మయొక్క ఆభాసము సూక్ష్మశరీరమునందుఁ గలదు; కనుక ఆభాసద్వారమున ఆత్మకు సూక్ష్మశరీరముతో సంబంధము గలదు; ఆ సూక్ష్మశరీరమునందు ఎక్కువప్రేమ గలదు; ఇట్లు క్రమముగా పూర్వపూర్వము దూరదూరముగ్గుటవలన న్యూనన్యూనప్రేమ యుండును; ఏయాత్మయొక్క సంబంధమగుటవలన ఇతరపదార్థములందును ప్రేమ గలుగునో, ఆయాత్మయందే ముఖ్యప్రేమ గలదు; ఇతరపదార్థమునందు లేదు; ఇట్లు సిద్ధమగుచున్నది.

ఆ ప్రేమ ఆనందమునందు, మఱియు దుఃఖాభావమునందుఁ గలదు; ఇతరమునందుఁ గాదు; ఇతరపదార్థములందును ఏ ప్రేమ గలదో, అదియును ఆనందనిమిత్తముగాను, దుఃఖాభావనిమిత్తముగాను గలదు; కాఁబట్టి ఆనందముకన్నను, దుఃఖాభావముకన్నను భిన్నమయిన దానియందు ప్రేమ గలుగదు; ఈరీతిగా అందఱికిని ప్రేమమునకు విషయమయిన ఏయాత్మ గలఁడో; వాఁడు ఆనందరూపుఁడుగాను, దుఃఖాభావరూపుఁడుగాను ఉన్నాఁడు.

కల్పితముయొక్క అభావము అధిష్ఠానరూపము, ఇది సిద్ధాంతము; ఎట్లు కల్పితసర్పముయొక్క అభావము అధిష్ఠానరజ్జురూపమగునో, అట్లు కల్పితదుఃఖాదులయొక్క అభావము అధిష్ఠానాత్మరూపముగా నున్నది. ఈరీతిగా ఆత్మ ఆనందరూపుఁడుగా నున్నాఁడు.

న్యాయమతమునందు ఆత్మకు ఆనందగుణ మంగీకరింపఁబడిన నది సమీచీనము గాదు; ఏలయన—ఆనందగుణము నిత్యమని అంగీకరించిన, అది ఆగమాపాయిగామివలన గుణమని సిద్ధింపదు; అనిత్యత్వపక్షమందు అనుకూలవిషయేంద్రియసంబంధము వలన ఆనందోత్పత్త్యంగీకారము చేయవలసివచ్చును; సుషుప్తియందో, విషయేంద్రియసంబంధము లేకుండినను ఆనందభానమగును; కాఁబట్టి ఆనందము ఆత్మగుణము గాదు; అది ఆత్మయొక్క స్వరూపమే ఈరీతిగా ఆత్మ సచ్చిదానందస్వరూపుఁడుగా నున్నాఁడు.

**261.** సచ్చిదానందములు[1] పరస్పర భిన్నములు గావు, ఆత్మ బ్రహ్మరూపుఁడు.

ఆ సచ్చిదానందములు పరస్పరభిన్నములు గావు; మఱేమనఁగా—ఏకముగానే యున్నవి; ఆత్మయొక్క గుణములయిన పక్షమందు, పరస్పర భిన్నములగును; అవి ఆత్మయొక్క స్వరూపముగా నున్నవి; కనుక పరస్పరభిన్నములు గావు.

ఒక్కఁడేయాత్మ నివృత్తిగహితుఁడగుటవలన సత్తందురు; జడముకన్న విలక్షణుఁడై, ప్రకాశరూపుఁడగుటవలన చిత్తం

1. ఆరక్తము, ఉష్ణము, ప్రకాశము అనుటచేత ఈమూఁడుశబ్దములు వేఱువేఱుగా కనఁబడుచున్నవి; వాని అర్థములును వేఱువేఱుగా ప్రతీతమగుచున్నవి; అట్లయినను, ఉక్తమైన మూఁడులక్షణములచే సంపన్నమైనట్టిది అగ్ని యను పదార్థమొక్కటే. అప్రకారముగా సత్తు, చిత్తు, ఆనందము ఈ మూఁడుశబ్దములు వేఱువేఱుగా కనఁబడుచున్నను, వానియర్థమును వేఱువేఱుగా ప్రతీతమయినను ఉక్తమైన మూఁడులక్షణములచే సంపన్నమైనట్టిది బ్రహ్మ మను పదార్థ మొక్కటే.

చిదానందములకన్న భిన్నమో, జడము, మఱియు దుఃఖము; కావున చిదానందములకంటె సత్పదార్థమును భిన్నమనిన, దానిని జడరూపమని, దుఃఖరూపమని అంగీకరింపవలసివచ్చును; దుఃఖరూపపదార్థమునకో, సత్తయే లేదు; కావున చిదానందములకంటె భిన్నమనిన, సత్పదార్థమును అసద్రూపమని అంగీకరింపవలసివచ్చును.

సదానందములకంటె భిన్నమయినదో, అసత్తు, మఱియు దుఃఖము; కావున సదానందములకంటె చిత్పదార్థమును భిన్నమనిన, దానిని అసత్తు, మఱియు దుఃఖరూపమనవలసివచ్చును. అసద్రూపము, దుఃఖరూపము ఇట్టిది జడపదార్థముగా నున్నది; కావున సదానందములకంటె భిన్నమనిన, చిత్పదార్థమును జడరూపమనవలసివచ్చును.

సచ్చిత్తులకంటె భిన్నము అసత్తు; మఱియు జడము; కాబట్టి సచ్చిత్తులకంటె ఆనందపదార్థము భిన్నమనిన, దానిని అసజ్జడమనవలసివచ్చును; అసజ్జడపదార్థములు దుఃఖరూపములే; కావున సచ్చిత్తులకంటె భిన్నమనిన, ఆనందపదార్థమును దుఃఖరూపమనవలసివచ్చును.

ఆ సదసచ్చిదచిత్సుఖాసుఖపదార్థములయినవో, పరస్పరవిరోధములుగా నున్నవి; కాబట్టి సత్పదార్థమును అసద్రూపమని, చిత్పదార్థమును జడరూపమని ఆనందపదార్థమును దుఃఖరూపమని అంగీకరించినపక్షమందు, అగ్నిని శీతలమని, మిత్రుని శత్రువని అంగీకరించిన న్యాయమును అపహాసాస్పదమగును.

ఏలాగుననగా—అత్యంతోష్ణమైన పదార్థమునకు పేరు అగ్ని, మఱియు ఉష్ణతకు విరుద్ధమైనది శీతలత; అట్లు హితచింతనము చేయువాని పేరు మిత్రుడు, మఱియు నాశచింతనము చేయువాని పేరు శత్రువు; మిత్రత్వముకన్న విరుద్ధమైనది శత్రుత్వము, కాబట్టి అగ్నిని శీతలమని మిత్రుని శత్రువని అనుటకు అపహాసము దప్ప ఇంకొక్కటి ఫలము లేనేలేదు.

ఈరీతిగా సత్తు, చిత్తు, మఱియు ఆనందము ఇవి మూడును ఒక బ్రహ్మము యొక్క లక్షణములగుటవలనను, వానిని వేఱువేఱుగా అంగీకరించుటయందు అపహాసదోషప్రాప్తియగుటవలనను పైజెప్పిన మూడులక్షణములుగూడి ఒకటే బ్రహ్మస్వరూపముగా అంగీకరింపవలయును.

దురు; దుఃఖముకన్న విలక్షణుఁడై, ముఖ్యప్రీతికి విషయమగుట వలన ఆనందమందురు; ఎట్లు ఉష్ణప్రకాశరూపమై, యగ్ని యున్నదో, అట్లు సచ్చిదానందరూపుఁడై, యాత్మ యున్నాఁడు.

మఱియు సచ్చిదానందస్వరూపమునె శాస్త్రంబులందు బ్రహ్మమందురు; కనుక ఆత్మ బ్రహ్మరూపుఁడుగా నున్నాఁడు. వ్యాపకపదార్థమునకు బ్రహ్మమని పేరు; కావున ఆత్మ బ్రహ్మము కన్న భిన్నుఁడైనపక్షమందు; ఆత్మ దేశముచేత అంతవంతుఁడగును; ఎవనికి దేశముచే నంతము గలదో, వానికి కాలము చేతను అంతము గలదు; ఇది నియమము; ఎవనికి కాలముచే నంతమగునో, వానిని అనిత్యమందురు; అట్లు ఆత్మయు బ్రహ్మము కన్న భిన్నుఁడయినయెడల, అనిత్యుఁడగును; పూర్వోక్తప్రకారముగా ఆత్మను అనిత్యుఁడనఁగూడదు; ఈలాగు ఆత్మ బ్రహ్మము కన్న భిన్నుఁడు గాఁడు.

మఱియు ఆత్మకన్న భిన్న బ్రహ్మమయినపక్షమందు, బ్రహ్మము అనాత్మయగును, అనాత్మయయిన ఘటాదికపదార్థము వదిగలదో, అది జడము; అట్లు బ్రహ్మమును అనాత్మయయినపుడు జడమగును; కనుక ఆత్మకన్నభిన్నము బ్రహ్మమును కాదు; బ్రహ్మము, ఆత్మ ఏకరూపముగానే యున్నవి.

ఒక్కఁడే చైతన్యము సర్వప్రపంచమునకును, మాయకును అధిష్ఠానమగుటవలన దానిని బ్రహ్మమందురు; ఆ దే చైతన్యము వ్యష్ట్యవిద్యకును; వ్యష్టి దేహాదికమునకును అధిష్ఠానమగుటవలన దానిని ఆత్మయందురు; తత్పదమునకు లక్ష్యము బ్రహ్మము, త్వంపదమునకు లక్ష్యము ఆత్మ; ఈశ్వరసాక్షి తత్పదమునకు లక్ష్యము, జీవసాక్షి త్వంపదమునకు లక్ష్యము; సమష్టిసంఘా

తోపహితచైతన్యము ఈశ్వరసాక్షి, మఱియు వ్యష్టిసంఘాతోప హితచైతన్యము జీవసాక్షి.

యద్యపి జీవునికిని, ఈశ్వరునికిని ఏకత ఘటిల్లదు; తథాపి జీవసాక్షికిని, ఈశసాక్షికిని ఏకత ఘటిల్లును; ఏల యనఁగా— ఇద్దఱికిని ఉపాధిభేదమువలన భేదము గలదు; గాని, స్వరూపమువలన భేదము లేదు; ఎట్లు ఘటాకాశమునకును, మఠాకాశమునకును ఉపాధిభేదమువలన భేదము గలదో, స్వరూపమువలన భేదము లేదో, అట్లు ఆత్మకును, బ్రహ్మమునకును ఉపాధిభేదమువలన భేదము గలదు; స్వరూపమువలన భేదము లేదు; వస్తువొకటే, ఒక్కటే.

## 262. బ్రహ్మరూపుఁడైన ఆత్మ అజన్ముఁడు

ఆ బ్రహ్మరూపుఁడైన ఆత్మ అజన్ముఁడుగా నున్నాఁడు; చూడుము.

ఆత్మకు జన్మము అంగీకరించిన, మరణమును అంగీకరింప వలయును; అట్లయినయెడల, ఆత్మ అనిత్యుఁడగును; ఆమాట పరలోకవాది ఆస్తికునకు ఇష్టము గాదు; ఏలయన—ఆత్మ ఉత్పత్తినాశవంతుఁడయినయెడల, కృతనాశాకృతాభ్యాగమును దోషము [కృతకర్మముయొక్క భోగము లేకయే నాశము, మఱియు పూర్వకర్మము లేకయే సుఖదుఃఖములభోగము] ప్రాప్తమగును; అందువలన కర్మవాదిగూడ ఆత్మ కర్తభోక్త యని యంగీకరించినను, జన్మనాశరహితుఁడుగానే యంగీకరింపవలయును.

మఱియు హేతువులేక దేనికిని జన్మము గానేరదు; కావున ఆత్మజన్మము నంగీకరించునెడ, ఆత్మజన్మమునకు హేతువు

చెప్పవలెను; ఏది ఆత్మకు జన్మమునకు హేతువో, దానిని ఆత్మ కన్న భిన్నమని చెప్పవలయును; ఆత్మభిన్నమైన సర్వపదార్థములు ఆత్మయందు కల్పితములు, అవి ఆత్మజన్మమునకు హేతువనుట ఘటిల్లదు; ఏలయన—కల్పితపదార్థము అధిష్ఠానమునకు హేతువుగాదు; ఎట్లనఁగా—రజ్జువునందు కల్పితమైనసర్పము రజ్జువునకు హేతువు గాదు.

ఒకేరజ్జువునందు నానాపురుషులకు సర్పదండమాలాజలధారాపృథ్వీరేఖాదుల భ్రాంతి యగును; ఆ భ్రాంతియందు రెండంశములు గలవు; ఇదమ్ [ఇది] అను మొదటిది సామాన్యాంశము, రెండవది సర్పాది విశేషాంశము; వీనిలో—సామాన్యాంశము, విశేషాంశమందు వ్యాపకముగా నున్నది.

ఈసర్పమున్నది, ఈదండమున్నది, ఈమాల యున్నది, ఈరీతిగా సర్పాదిసకలవిశేషాంశములందు సామాన్యమయిన ఇదమంశము వ్యాపకముగ నున్నది; ఇదమంశమును భ్రాంతిహేతువైన రజ్జువుయొక్క సామాన్యజ్ఞానమందురు; ఆ సామాన్యాంశము సత్యముగా నున్నది; రజ్జుజ్ఞానానంతరమును ఇదమంశప్రతీతియగుచున్నది; ఎట్లనఁగా—భ్రాంతికాలమందు ఈ సర్పమున్నది; ఈరీతిగా సర్పాదులతోఁగూడి ఇదమంశప్రతీతి యగుచున్నది; అట్లు భ్రాంతినివృత్తికి అనంతరమును ఈరజ్జువున్నది; ఈరీతిగా రజ్జువుతోఁ గూడి ఇదమంశప్రతీతి యగుచున్నది: ఆ యిదమంశము మిథ్యయయినట్టయిన సర్పాదిప్రతీతిగామివలె భ్రాంతినివృత్త్యనంతరము దానియొక్క ప్రతీతి గాఁగూడదుగదా!

ఈరీతిగా ఆ సామాన్యమయిన ఇదమంశము సత్యమై, అధిష్ఠానరజ్జురూపముగా నున్నది; మఱియు పరస్పరవ్యభిచారులయిన సర్పాదివిశేషాంశములు కల్పితములుగా నున్నవి.

అట్లు నామము, రూపము, అస్తి, భాతి, ప్రియముకూడి అయిదు అంశములు సకలపదార్థములందుఁ గలవు; వానిలో— "ఘట" అను నీ రెండక్షరములు నామము, కంబుగ్రీవాది రూపము, ఘటమున్నది అస్తి, ఘటము ప్రతీతమయినది భాతి, ఘటము ఉపయోగముగలది ప్రియము; ఈరీతిగా సర్వపదార్థములందు అయిదు అంశములుగలవు; వానియందు అస్తిభాతిప్రియములు ఈమూడుఅంశములు సకలపదార్థములందు వ్యాపకములుగా నున్నవి; మఱియు నామరూపములైన రెండంశములు వ్యభిచారులుగా నున్నవి [ఏవస్తువు కొన్నిచోట్ల ఉండునో, కొన్నిచోట్లఉండదో, దానిని వ్యభిచారి యందురు]; ఘటమను నామమును, కంబుగ్రీవాదిరూపమును పటమునందు లేదు; పటమనునామము, మఱియు జాలసదృశరూపము ఘటమునందు లేదు; ఈరీతిగా సకలపదార్థములందు నామరూపాంశములు వ్యభిచారులుగాను, అస్తిభాతిప్రియాంశములు అనుగతములుగాను ఉన్నవి.

ఎట్లు సర్పదండాదికమునందు అనుగతమైన ఇదమంశము సత్యమై, అధిష్ఠానరూపమో, అట్లు సర్వపదార్థములందు అనుగతమయిన అస్తిభాతిప్రియాంశములు సత్యములయి, అధిష్ఠానరూపములు; మఱియు ఆ యస్తిభాతిప్రియాంశములు సచ్చిదానందరూపము లగుటవలన ఆత్మస్వరూపములుగా నున్నవి.

ఈరీతిగా సచ్చిదానందరూపుఁడైన ఆత్మయందు సంపూర్ణ నామరూపప్రపంచము కల్పితముగా నున్నది; అకల్పితపదార్థ

మేఁదియు ఆత్మజన్మమునకు హేతువగుట ఘటిల్లదు; కాఁబట్టి ఆత్మ అజన్ముఁడు.

ఇదియునుగాక ఏవస్తువునకు జన్మరూపమైన ఒకవికారముగునో, దానికే [1] సత్త, వృద్ధి, పరిణామము, అపక్షయము, వినాశము ఈయయిదు వికారములు నగుచున్నవి; ఆత్మకు జన్మము లేమివలన ఆ యయిదు వికారములును ఆగుట లేదు; ఈరీతిగా ఆత్మ జన్మాదిషడ్వికారరహితుఁడై యున్నాఁడు.

## ౨౬౩. ఆత్మ అసంగుఁడు

ఆత్మ అసంగుఁడుగా నున్నాడు; సంగ మనఁగా సంబంధము, అది సజాతీయవిజాతీయస్వగతపదార్థములచే నగును; ఎట్లనఁగాఘటమునకు అన్యఘటముతో సంబంధముసజాతీయము, ఘటమునకు పటముతో సంబంధము విజాతీయము, స్వగతమని అవయవసంబంధమునకు పేరు, కనుక పటమునకు తంతువులతో సంబంధము స్వగతము; వీనిలో ఆత్మయందు ఏసంబంధము సంభవింపదు—

ఆత్మ రెండు, లేక అనేకములయినపక్షమందు ఒకఆత్మకు వేఱొక్క ఆత్మతో సజాతీయసంబంధమగును; ఆత్మ యో ఒకఁడు, వానికి సజాతీయసంబంధము ఘటిల్లదు; మఱియు ఆత్మకన్న

---

1. 1. ఘటో జాయతే [ఘటమగుచున్నది] ఈవ్యవహారమునకు హేతువు జన్మము. దీనియనంతరము 2. "ఘటో జాతః" [ఘటముపుట్టెను] ఇదిసత్త. 3. "వర్ధతే"[దేహమునకు బాలత్వమైనది]ఇదివృద్ధి. 4."విపరిణమతే" [దేహమునకు యౌవనమైనది] ఇది పరిణామము. 5. "అపక్షీయతే" [దేహము వృద్ధమైనది] ఇది యపక్షయము. 6. "నశ్యతి" [దేహము చచ్చినది] ఇది వినాశము. ఇవి ఆఱువికారములు.

అన్యమగునది అనాత్మ, ఆయనాత్మ మృగజలమువలె ఆత్మయందు కల్పితము, ఆ కల్పితముతో సత్యమైనఆత్మకు సంబంధము ఘటిల్లదు; ఎట్లనఁగా—మృగజలము తో పృథ్వికి సంబంధము ఘటిల్లదు; ఘటిల్లినట్టయిన, శుష్కభూమి ఆర్ద్రము గావలయును; మఱియు ఆత్మకు అవయవము లుండినపక్షమందు, వానికి స్వగత సంబంధము గును; ఆత్మ నిరవయవుఁడు, కనుక స్వగతసంబంధము ఘటిల్లదు; ఈరీతిగా సంబంధత్రయరహితుఁ డగుటవలన ఆత్మ అసంగుఁడుగా నున్నాఁడు.

ఓశిష్యుఁడా! ఈరీతిగా సచ్చిదానంద బ్రహ్మరూపుఁడై, జన్మాదివికారరహితుఁడై, అసంగుఁడైన ఆత్మ, నీవుగా నున్నావు. ఇది ప్రథమప్రశ్నోత్తరము.

**246**. 252 గత ద్వితీయప్రశ్నోత్తరము—
జగత్కర్త ఈశ్వరుఁడు.

జగత్తునకు కర్త ఎవఁడు? దీనికుత్తరము—ఓయగ్రోధుఁడా! విభు వనఁగా వ్యాపకమయిన ఏ చైతన్యము గలదో, తదాశ్రితమై, తద్విషయమైనది మాయ అనఁగా సదసద్విలక్షణమయిన అద్భుతశక్తి రూపాజ్ఞానము, దానివలన జగదుత్పత్తిస్థితిభంగ ములు అయినవి. అభిప్రాయ మేమనఁగా—మాయాయుక్త చైతన్యమును ఈశ్వరుఁ డందురు; ఆ యీశ్వరుఁడు [1] జగదుత్పత్త్యాదులకు హేతువుగా నున్నాఁడు. ఇట్లు చెప్పుటవలన

1. జగత్తుయొక్క కారణము నానావాదులు నానావిధముగా చెప్పుచున్నారు—

(1) అకస్మాత్కారణవాదులు జగత్తునకు కారణము లే దని.

(2) కొందఱు అభావ మని.

జగత్తునకు ఎవ్వఁడైన కర్తయున్నాఁడా? లేక జగత్తు తానుగా ఐనదా? దీనికి ఉత్తరము చెప్పితిమి. ఇప్పుడు జగత్తునకు కర్త ఈశ్వరుఁడా? లేక జీవుఁడా? దీనికిని ఉత్తరము చెప్పుచున్నాము.

---

(3) కొందఱు శూన్య మని.

(4) నైయాయికులు పరమాణు వని.

(5) కొందఱు కాల మని.

(6) చార్వాకులు స్వభావ మని.

(7) పూర్వమీమాంసకులు అదృష్ట మని.

(8) ప్రత్యక్షవాదులు యదృచ్ఛ యని.

(9) ప్రత్యక్షప్రమాణవాదులు పృథివ్యాదిపంచభూతము లని.

(10) సాంఖ్యమతస్థులు ప్రకృతి [ప్రధానము] యని.

(11) యోగులు హిరణ్యగర్భాదిరూపుఁడైన యనంగపురుషుఁ డని.

(12) కొందఱు కాలాదిసంయోగ మని.

(13) కొందఱు పరిణామపురుషుఁడైన జీవుఁ డని.

(14) కొందఱు బ్రహ్మ మని.

ఈవిధముగా జగత్కారణము అనేకవాదులు అనేకవిధముగా చెప్పుచున్నారు; వీనిలో ప్రతిమతమందు దోషము వర్తించుచున్నది. ఏ ప్రకారమనఁగా—

(1) జగత్తునకు కారణము లేకపోయినట్టైన, ఘటము కారణము లేకయే, పుట్టవలెను; ఇట్లు అకారణమందు ప్రత్యక్షవిరోధరూపదోషము వర్తించును.

(2) అభావము కారణ మనిన, అభావముచే భావముకలుగుట ప్రత్యక్షవిరోధదోషమే.

## 265. జగత్కర్త ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు, మఱియు స్వతంత్రుఁడు.

### జగత్తునకు కర్త ఈశ్వరుఁడు; జగత్తు తనకుతానె గాలేదు;

(3) శూన్యము కారణ మనిన, బీజములేకయే ధాన్యము పుట్టవచ్చును; ఇట్లు అసంభవరూపదోష మగును.

(4) నిరవయవములును, జడములును అయిన పరమాణువులసంయోగము అసంభావ్యము.

(5) కాలము ఎప్పటికిని ఉండినను, సకలకార్యములు ఎప్పటికిని పుట్టనందున కాలమందు అకారణరూపదోషము సంభవించును.

(6) గొడ్రాలియందు వీర్యముండియు, గర్భమును ఉత్పన్నముచేయుం స్వభావముకనఁబడనందున స్వభావముకారణమనుట అనుచితము.

(7) అదృష్టము కారణమనిన, అది జడమగుటవలన ఇట్టికారణముచే ఇట్టికార్యము కావలయునని నిశ్చయము లేకపోవును.

(8) యదృచ్ఛ కారణమనిన, పృథివ్యాదిభూతములచే జగదుత్పత్తి అసంభవము.

(9) జడమగు పృథివ్యాదిభూతములే కారణ మనిన, అవియును కారణమును అపేక్షించుటచే స్వకారణము కాఁజాలవు.

(10) జడమయిన ప్రకృతి స్వయముగా ప్రవర్తింపచాలదు.

(11) పురుషుఁడు అసంగుఁడగుటచే ఏప్రకారమునను కారణమగుట ఘటిల్లదు.

(12) కాలాదులును జడమగుటచే అవి కారణము కాఁజాలవు.

(13) జీవుఁడు కారణము కాఁజాలఁడనుట పూర్వమందె చెప్పఁబడినది.

(14) నిర్వికారియైన బ్రహ్మము కారణము కాఁజాలదు.

ఈవిధముగా పైన కనుపరచిన చతుర్దశమతములందు దోషములున్నవి; మాయావిశిష్టబ్రహ్మము కారణ మని చెప్పుటయందు ఏదోషమును లేదు.

కర్తలేక జగత్తయినట్టయిన, కులాలుఁడు లేకయు ఘటము పుట్ట వలయును; అట్లనుటచే జగత్తునకు కర్తగలఁ డనుట సిద్ధమగు చున్నది.

ఇపుడు జగత్కర్త సర్వజ్ఞుఁడైన ఈశ్వరుఁడని చెప్పు చున్నాము—ఎవఁడు ఏకార్యమునకు కర్తయగునో, వాఁడా కార్యమును, తదుపాదానమును తెలిసి, ఆకార్యము చేయును; అట్లు జగత్కర్తయును జగత్తును, తదుపాదానమును తెలిసి, జగత్తు చేయవలెను; ఎట్లు ఘటోపాదానమృత్తికను తెలిసి, ఘటోత్పత్తి చేయువాఁడైన కులాలుని ఘటసర్వజ్ఞుఁ డనుచున్నారో, అట్లు జగత్తునకు ఉపాదానమైన మాయను తెలిసి, జగదుత్పత్తి చేయు వాఁడైన ఈశ్వరుని జగత్సర్వజ్ఞుఁ డనుచున్నారు.

మఱియు ఆయీశ్వరుఁడు సర్వశక్తిమంతుఁడుగా నున్నాఁడు; ఏలయన—అల్పశక్తిమంతుఁడయిన జీవుఁడు ఈజగద్రచన మనస్సుచే చింతింపనైనను శక్తుఁడుగాఁడు; కనుక అద్భుత జగత్తునకు కర్తయయినవాఁడు అద్భుతశక్తిగలవాఁడుగా నున్నాఁడు.

మఱియు ఆయీశ్వరుఁడు స్వతంత్రుఁడుగా నున్నాఁడు; ఏలయన—ఎవఁడు న్యూనశక్తిగలవాఁడో, వాఁడు పరాధీనుఁడు, సర్వశక్తిగలవాఁడు పరాధీనుఁడు గాఁడు.

ఈరీతిగా జగత్తునకు కర్త సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు, స్వతంత్రుఁడుగా నున్నాఁడు; వానినే ఈశ్వరుఁ డందురు.

అల్పజ్ఞుఁడు, అల్పశక్తిమంతుఁడు, పరాధీనుఁడయిన వానిని జీవుఁడందురు. అల్పజ్ఞతాదికము జీవునియందును పరమార్థముచే

నుండుటలేదు; అట్లయినను, అవిద్యాకృతమయిన మిథ్యాల్పజ్ఞతాదికము జీవునియందు ప్రతీతమగుచున్నది; కనుక జీవునియందు చెప్పఁబడినది. అవిద్యాకృతాల్పజ్ఞతాదికముయొక్క భ్రాంతి ఏది గలదో, అదియే జీవునియొక్క జీవత్వమనఁబడియె. ఆ యల్పజ్ఞతాదికముయొక్క భ్రాంతి ఈశ్వరునియందుఁ గలుగదు; కాఁబట్టి మనఁగా—మాయాకృతసర్వజ్ఞతాదికము గలదు.

ఈరీతిగా జగత్తునకు కర్త జీవుఁడుగాఁడు; ఈశ్వరుఁడుగా నున్నాఁడు.

**266. ఈశ్వరుఁడు వ్యాపకుఁడు, మఱియు నిత్యుఁడు.**

ఆ యీశ్వరుఁడు ఏకదేశస్థితుఁడు గాఁడు; సర్వత్ర వ్యాపకుఁడుగా నున్నాఁడు; వానిని ఏకదేశస్థితుఁడుగా నంగీకరించుట సంభవింపదు; చూడుము.

ఏవస్తువునకు దేశముచే నంతమగునో, దానికి కాలము చేతను నంతమగును; కనుక అనిత్యమగును; ఏది అనిత్యమగునో, అది కర్తచేత జన్యమగును; కనుక ఈశ్వరునకును కర్త నంగీకరింపవలసివచ్చును; ఈశ్వరునకో; కర్త ఘటిల్లఁడు; ఏలయన— తనకుతాను కర్తయనిన, ఆత్మాశ్రయదోషమగును; ఎచ్చట తానె క్రియకు కర్తయగునో, మఱియు తానె క్రియకు కర్మమగునో, అచ్చట ఆత్మాశ్రయదోష మందురు; ఎట్లు కులాలుఁడు ఘటమునకు కర్త, ఘటము కర్మము; అట్లు కర్తృకర్మములు భిన్న భిన్నములు గావలయును; కర్తృకర్మములు ఒక్కటైనపక్షమందు ఆత్మాశ్రయదోషమగుచున్నది [కార్యమునకు పేరు కర్మము, కార్యవిరోధికిపేరు దోషము; ఆత్మాశ్రయము కార్యమునకు విరోధియగుటవలన అది దోషమని చెప్పఁబడినది.]

కనుక ఈశ్వరునకు కర్తను అన్యుని నంగీకరింపవలయును; ఆ యన్యకర్తయును ప్రథమకర్తవలె కర్తృజన్యుఁడనియే చెప్పవలయును; వానికిని ఇంకొక్కఁడని చెప్పవలయును; ఆ ప్రథముఁడయిన ఈశ్వరుఁడు ద్వితీయకర్తకు కర్తయనిన, అన్యోన్యాశ్రయదోషమగును [పరస్పరాపేక్ష యన్యోన్యాశ్రయమనఁబడును.]

కనుక తృతీయకర్తను అంగీకరింపవలయును; ఆ తృతీయునకు కర్త ద్వితీయుఁ డనిన, మరల అన్యోన్యాశ్రయమగును; ప్రథముఁడనిన, చక్రకదోషమగును; ఎట్లు చక్రముయొక్క భ్రమణమగునో, అట్లు ప్రథమకర్త ద్వితీయజన్యుఁడు, ద్వితీయకర్త తృతీయజన్యుఁడు, తృతీయకర్త ప్రథమజన్యుఁడు అను రీతిగా కార్యకారణభావమునకు భ్రమణమగును; చక్రకస్థానమందు సర్వమునకును పరస్పరాపేక్ష యగుటవలన ఏదియును కర్త సిద్ధముగాలేదు; అన్యోన్యాశ్రయమునందు పరస్పరాపేక్ష యగుటవలన ఒకదానికి సిద్ధిలేక రెండవదానికి సిద్ధి ఘటిల్లదు.

కనుక ఎట్లు కులాలునకు కర్త. కులాలుఁడు తాను ఘటిల్లఁడో, మఱేమనఁగా—వానితండ్రి ఘటిల్లునో, అట్లు ప్రథమేశ్వరునికర్తకు అన్యకర్త చెప్పవలయును; మఱియు కులాలుని తండ్రి తనపుత్త్రునిచేత ఉత్పన్నుఁడుగాఁడు; వేఱెతండ్రిచేత ఉత్పన్నుఁడగును; అట్లు ద్వితీయకర్త ప్రథమకర్తచేత ఉత్పన్నుఁడుగాఁడు; తృతీయకర్తచే నని చెప్పవలయును; ఆ కులాలుని పితామహుఁడును తనతండ్రిచేత ఉత్పన్నుఁ డగును; ఈరీతిగా కర్తృధార ఎన్నటికిని తెగదు; ఎచ్చట కర్తృధారయొక్క ఖండనము లేదో; అచ్చట అనవస్థాదోష మగును; ఇట్లనుటవలన ఈశకర్త జగత్తును చేసెనను నిర్ణయము గానేరదు.

అనవస్థాప్రసంగమునందు ఎవ్వనినైనను జగత్తునకు కర్తయని సంగీకరించువిషయమున నేయుక్తియు దొరకకుండును; ఇట్లు యుక్తి కుంఠితమగుటకు వినిగమనవిరహదోషమని పేరు.

ధారకు ఎచ్చటనేని విశ్రాంతి నంగీకరించిన, ఏకర్తయందు ధారయొక్క అంతమంగీకరింపఁబడినదో, వానినే జగత్తునకు కర్తయని అంగీకరించుట యోగ్యమగును; ఈపక్షమందు పైఁజెప్పబడిన, సకలకర్తృసముదాయము నిష్ఫలమగును; ఇట్టి పూర్వోక్తనిరర్థకతాసిద్ధికిని ప్రాగ్లోపదోషమందురు.

ఈరీతిగా ఈశ్వరునకు దేశమువలన అంతము అంగీకరించిన, ఉత్పత్త్యంగీకారము చేయవలసివచ్చును; ఉత్పత్తి అంగీకరించిన, పైజెప్పిన ఆత్మాశ్రయాది ఆఱుదోషములు ప్రాప్తములగును; కాఁబట్టి ఈశ్వరునకు దేశముచే అంతము అనఁగూడదు; మఱేమనఁగా ఈశ్వరుఁడు వ్యాపకుఁడు, నిత్యుఁడుగ వలయును.

### 267. ఈశ్వరునకును, జీవునకును స్వరూపముచేత భేదము లేదు

ఆ వ్యాపకుఁడైన యీశ్వరునకును, జీవునకును స్వరూపముచే భేదము లేదు; ఉపాధిభేదముచే భేదము గలదు; ఏలాగున ననఁగా—అవచ్ఛేదవాదమందు మాయావిశిష్టచైతన్యమును ఈశ్వరుఁడందురు; అవిద్యావిశిష్టచైతన్యమును జీవుఁడందురు; ఆభాసవాదమందు ఆభాససహిత మాయావిశిష్టచైతన్యమును ఈశ్వరుఁ డందురు; ఆభాససహితావిద్యావిశిష్టచైతన్యమును జీవుఁడందురు; ఆభాసవాదమందు ఆభాససహితమాయకును, ఆభాససహితావిద్యకును భేదము గలదు; చైతన్యమునకుఁ

గాదు; అట్లు అవచ్ఛేదవాదమందు అవిద్యకును, మాయకును భేదము గలదు, చైతన్యమునకుఁ గాదు.

అట్లు ప్రతిబింబవాదములో అజ్ఞానమునందు చైతన్య ప్రతిబింబము జీవుఁడు, మఱియు బింబము ఈశ్వరుఁడందురు; ఈపక్షమందు ఉపాధిభేదము లేకపోయినను, ఇద్దఱికిని ఒకే యుపాధి యుండినను, చైతన్యమునకు స్వరూపముచేత భేదము లేదు; ఒక్కటే చైతన్యమునందు జీవత్వము, ఈశ్వరత్వము ఆరోపితముగా నున్నది; ఈసంగతి ముందు మహావాక్యార్థ విచారమందు చెప్పఁబడును.

ఓశిష్యుఁడా! జగత్తునకు కర్త సర్వజ్ఞుఁడై, సర్వశక్తి మంతుఁడై, స్వతంత్రుఁడైన ఈశ్వరుఁడుగా నున్నాఁడు. ఆ యీశ్వరుఁడు వ్యాపకుఁడు; వానికిని, జీవునకును విశేషణ మాత్రముచేతనే భేదము గలదు; స్వరూపముచే భేదము లేదు.

ఈప్రకారముగా ద్వితీయప్రశ్నకుత్తరము చెప్పితిమి.

**268. 252—గతతృతీయప్రశ్నకుత్తరము—**
**ముక్తికి హేతువు జ్ఞానము.**

ఓయగ్రజుఁడా! మోక్షమునకు సాధన మేమి? ఈప్రశ్నమున కుత్తరము చెప్పుచున్నాము—

ముక్తికి హేతువు కర్మోపాసనలు గావు; జ్ఞానముగానే యున్నది; ఏల యన—ఆత్మయందు బంధము నిత్యమైనట్టయిన, తన్నివృత్తిరూపమైన మోక్షము జ్ఞానముచేతఁ గాకుండును; కర్మోపాసనలచేతఁ గావలయును; ఆ బంధము నిత్యము గాదు; రజ్జుసర్పన్యాయమున మిథ్య; ఆమిథ్యాబంధముయొక్క నివృత్తి

అధిష్ఠానజ్ఞానముచేతనే ఘటిల్లును; కర్మోపాసనలచేత ఘటిల్లదు; ఎట్లు రజ్జ్వజ్ఞానముచేత ప్రతీతమయిన సర్పము ఏక్రియచేతను దూరముగాదో, రజ్జుజ్ఞానముచేతనే దూరమగునో, అట్లు ఆత్మాజ్ఞానమువలన ప్రతీతమైనబంధము ఏక్రియచేతను దూరము గాదు; ఆత్మజ్ఞానముచేతనే దూరమగుచున్నది.

## 269. కర్మోపాసనలు ముక్తికి హేతువులుగావు

కృష్యాదికర్మముయొక్క ఫలము అన్నాదిక మేదిగలదో, అది అనిత్యము, యజ్ఞాదికర్మఫలమయిన స్వర్గాదికము[1] అనిత్యము; అట్లు మోక్షము కర్మఫలమనిన, మోక్షమును అనిత్యమగును; ఉపాసనాఫలమనినను, మోక్షమనిత్యమగును; ఏలయన ఉపాసనయు మానసకర్మమే.

## 270. కర్మఫలపంచకము

కర్మకర్తకు కర్మమువలన పంచవిధముల యుపయోగము గలదు—మొదటిది ఉత్పత్తి, రెండవది నాశము, మూడవది ప్రాప్తి, నాల్గవది వికారము, అయిదవది సంస్కారము.

1. ఎట్లు ఇది పాపాధిక్యముచే రచితమైన లోకము క్షీణమగునో, అట్లు ఇవి పుణ్యాధిక్యముచే రచితమైన లోకము న క్షీణమగును. ఈరీతిగా కర్మరచితోత్తమాధమలోకములను అనిత్యమని ఎంచి, వీనివలన బ్రాహ్మణుడు [బ్రహ్మముగావలెనను నిచ్ఛగలవాడు ముముక్షువు]నై రాగ్యమును పొందును. "కృతమైనకర్మముచే అకృతమైన మోక్షము పొందుట లేదు." ఈయర్థముగల శ్రుతిచేత మఱియు "భావన [ఉపాసన] చేత జన్యమయిన ఫలమును స్థిరమని అంగీకరించుట యోగ్యముగాదు." అను సురేశ్వరాచార్యులవాక్యమువలన కర్మముయొక్క, లేక ఉపాసనయొక్క ఫలము మోక్షము గాదు.

[ఉత్పత్తినాశప్రాప్తులు ప్రసిద్ధములుగా నున్నవి; అన్యరూపప్రాప్తికిపేరు వికారము.] సంస్కారము ద్వివిధము:—మలముయొక్క నివృత్తి, మఱియు గుణముయొక్క ఉత్పత్తి; ఈయిరుదు ప్రకారములయిన ఉపయోగములు కర్మముచేతఁ గలవు; ఆ యుపయోగములందు ముముక్షువునకు ఏయుపయోగము ఘటిల్లదు. చూడుము—

(1) ఎట్లు కులాలకర్మమువలన కులాలునికి ఘటోత్పత్తిరూపోపయోగ మగునో, అట్లు ముముక్షువునకు కర్మమువలన మోక్షోత్పత్తిరూపోపయోగము గలుగదు; ఏలయన—మోక్షము అనర్థనివృత్తిరూపము, మఱియు పరమానంద ప్రాప్తిరూపము; దానిలో—రజ్జువునందు సర్పనివృత్తి న్యాయమున అనర్థనివృత్తి[1] ఆత్మయందు నిత్యసిద్ధమే; మఱియు ఆత్మ పరమానందస్వరూపుఁడగుటవలన గృహస్థితనిధిన్యాయమున పరమానందప్రాప్తియును ఆత్మయందు నిత్యసిద్ధము[2]; ఈరీతిగా స్వభావసిద్ధమైన మోక్షముయొక్క ఉత్పత్తి కర్మమువలన ఘటిల్లదు; ఏవస్తువు పూర్వసిద్ధము గాదో, దానిఉత్పత్తి కర్మముచేత నగును; సిద్ధవస్తువున కుత్పత్తి సంభవింపదు; వేదాంతశ్రవణ

1. ఎట్లు రజ్జువునందు సర్పాభావరూపనివృత్తి నిత్యసిద్ధమో, అట్లు ఆత్మయందు కార్యసహితాజ్ఞానాభావరూపనివృత్తి నిత్యసిద్ధము.

2. ఎట్లు విస్మృతికంఠమణియొక్క ప్రాప్తి, లేక గృహానిక్షిప్తనిధిప్రాప్తి నిత్యసిద్ధమో, అట్లు నిజరూపమగు పరమానందముయొక్క ప్రాప్తి నిత్యసిద్ధము.

మును ముముక్షువునకు మోక్షోత్పత్తినిమిత్తము చెప్పలేదు; ఏలయనఁగా—"ఆత్మ నిత్యముక్తుఁడు, కాను కించిన్మాత్రమును కర్తవ్యములేదు;" అను వార్త తెలియుటకొఱకే శ్రవణము విధింపఁబడినది; ఇట్లు తెలిసికొనినపుడు కర్తవ్యభ్రాంతి దూరమగుచున్నది; కనుక వేదాంతశ్రవణానంతరమును ఎవ్వనికికర్తవ్యము ప్రతీతమగునో; వాఁడుతత్త్వము తెలియనివాఁడని [1] తెలియవలెను; ఈకారణము చేతనే నిత్యనివృత్తమైన అనర్థముయొక్కనివృత్తి, మఱియు నిత్యప్రాప్తమైన ఆనందముయొక్కప్రాప్తి వేదాంతశ్రవణఫలమని శ్రీ సురేశ్వరాచార్యుల చేత నైష్కర్మ్యసిద్ధియందు చెప్పఁబడినది.

(2) ఎట్లు ప్రహారకర్తకు దండప్రహారరూపకర్మముచేత ఘటభంగరూపమైనఉపయోగమగునో; అట్లు ముముక్షువునకు కర్మమువలన ఏపదార్థముయొక్కయు నాశరూపమైన యుపయోగము ఘటిల్లదు; ఏలయన అన్యపదార్థముయొక్క నాశమో, ముముక్షువునకు

జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్యమస్తిచేన్న స తత్త్వవిత్. ।

---

1. ఇచ్చట ఈస్మృతివచనము గలదు—

దీనియర్థము—జ్ఞానరూపామృతముచేత తృప్తుఁడు, మఱియు అందువలననే కృతకృత్యుఁడు [కృతార్థుడు] అయిన యోగి [జ్ఞాని]నానికి మోక్షార్థము, లేక జ్ఞానార్థము కించిత్తును కర్తవ్యము లేదు; మఱియు ఎవ్వనికి కర్తవ్యము గలదో, వాఁడు తత్త్వవేత్తగాఁడు.

వాంఛితము లేదు; బంధనాశమే కర్మోపయోగ మని చెప్పవలయును; ఆ బంధము ఆత్మయందు పరమార్థముచేత లేదు; మఱేమనఁగా మిథ్యాప్రతీతమగును; ఆమిథ్యాప్రతీతబంధముయొక్క నాశము కర్మముచేత ఘటిల్లదు; ఆత్మజ్ఞానముచేతనే ఘటిల్లును.

(3) ఎట్లు గమనరూపకర్మమువలన గ్రామప్రాప్తిరూపోపయోగము పాంథునకు అగునో, అట్లు మోక్షప్రాప్తిరూపోపయోగము కర్మముచేత ముముక్షువునకు ఘటిల్లదు; ఏలయన ఆత్మ నిత్యముక్తుఁడు, వానికి మోక్షప్రాప్తి ఘటిల్లదు; ఎవనికి బంధమయినదో, వానికి మోక్షప్రాప్తి ఘటిల్లును; ఆత్మయందో, బంధముండుట లేదు [పరమార్థముచే లేదు].

(4) ఎట్లు పాకరూపకర్మమువలన అన్నముయొక్క వికారరూప మయిన [1] ఉపయోగము పాచకునకు [2] అగునో, అట్లు ముముక్షువునకు కర్మమువలన వికారరూపోపయోగము ఘటిల్లదు; ఏలయన—ముముక్షువునకు ఏవికారముయొక్క అపేక్షయు లేదు; ఆత్మయందు ప్రథమమున బంధమును అంగీకరించి, మోక్షదశయందు చతుర్ముఖాదివిలక్షణరూపప్రాప్తి నంగీకరించినయెడ, ఆ ప్రాప్తిరూపవికారము కర్మోపయోగము ముముక్షువునకు ఘటిల్లును; ఆయన్యరూపప్రాప్తియో, బంధరహితుఁడై, అరూపుఁడైన ఆత్మయందు అంగీకరింపఁబడ లేదు.

1. పూర్వరూపమును విడిచి, అన్యరూపప్రాప్తిని వికారమందురు.
2. పాచకుఁడు [వంటవాఁడు]

(5) సంస్కారరూపోపయోగమును ముముక్షువునకు కర్మముచేత ఘటిల్లదు; ఎట్లాగుననఁగా—

(1) ఎట్లు వస్త్రక్షాలనరూపకర్మముచే[1] మలనివృత్తియను సంస్కారరూపోపయోగము రజకునికి అగునో, అట్లు మలనివృత్తియను సంస్కారరూపోపయోగము ముముక్షువునకు కర్మముచేతఁ గానేరదు; ఏలయన- అన్యముయొక్క మలనివృత్తియో, ముముక్షువునకు వాంఛితము గాదు; ఆత్మమలనివృత్త్యపేక్ష చెప్పవలెను; ఆత్మయో, నిత్యశుద్ధుఁడు, వానియందు మలము లేదు; యద్యపి అంతఃకరణస్థితమైన పాపరూపమలనివృత్తికర్మోపయోగము ఘటిల్లుచున్నది; తథాపి ప్రస్తుతము శుద్ధాంతఃకరణవంతుఁడైన ముముక్షువుయొక్క విచారము చెప్పుచున్నాము; వాని అంతఃకరణమందు పాపము లేదు; అందువలన వానికి పాపనివృత్తిరూపోపయోగము లేదు; మఱియు అజ్ఞానరూపమలము ఆత్మయందుండినను, దానినివృత్తి కర్మముచేతఁ గానేరదు; ఏలయన అజ్ఞానమునకు విరోధి జ్ఞానము, కర్మము గాదు.

(2) ఎట్లు కుసుంభమందు వస్త్రమజ్జన[2]రూపకర్మముచేత వస్త్రమునందు రక్తగుణోత్పత్తి యను సంస్కారరూపోపయోగము వస్త్రకారునికగునో, అట్లు గుణోత్పత్తిరూపసంస్కారమును ముముక్షువునకు కర్మముచేతఁ గానేరదు; ఏలయన—అన్య విషయమందు

1. కడుగుట. 2. ముంచుట.

గుణోత్పత్తి ముముక్షువున కుపయోగింపదు; ఆత్మయందే గుణోత్పత్తిగావలె నని చెప్పవలసివచ్చును; ఆయాత్మ నిర్గుణుఁడు, వానియందు గుణోత్పత్తి ఘటిల్లదు.

ఈవిధముగా కర్మఫలము పంచప్రకారములగును; ఎక్కువ గాదు; ఆ పంచప్రకారఫలమును ముముక్షువునకు కర్మమువలన ఘటిల్లదు; కాఁబట్టి కర్మమును వదలి, జ్ఞానసాధనములైన శ్రవణాదికమునందే ముముక్షువు ప్రవృత్తుఁ డగును; ఉపాసనయు మానసకర్మముగా నున్నది; కనుక దానిఖండనమునందు పృథగ్యుక్తి చెప్పలేదు.

ఈరీతిగా కర్మము, లేక ఉపాసన మోక్షమునకు హేతువు గాదు; మఱేమనఁగా కేవలజ్ఞానమే మోక్షమునకు హేతువు.

## 271. ఆక్షేపము - కర్మోపాసనలు, జ్ఞానమునకును మోక్షమునకును హేతువు?

ఒకానొకఁడు [1] కర్మోపాసనాసహితజ్ఞానమును మోక్షహేతు వని అంగీకరించి, దానియందు దృష్టాంతములను చెప్పియున్నాఁడు—

ఎట్లు ఆకాశమందు పక్షికి ఒకపక్షముచే గమనము గానేరదో, రెండుపక్షములచేత నగునో, అట్లు ముముక్షురూపపక్షికి మోక్షలోకమందు జ్ఞానరూపమైన ఏకపక్షముచే గమనము గానేరదు; కర్మోపాసనాజ్ఞానములను రెండుపక్షములు గావల

1. భర్తృప్రపంచ యని ప్రాచీనవృత్తికారుఁడు [బ్రహ్మసూత్రములకు టీకచేసినవాఁడు] సముచ్చయవాది.

యును; ఉపాసనయు మానసకర్మ మగుటవలన ఉపాసనాసహిత కర్మము ఒకపక్షము, మఱియు జ్ఞానము ఒకపక్షము.

వేఱుదృష్టాంతము— సేతుదర్శనమువలన పాపనాశ మగును; ఆ సేతుదర్శనము ప్రత్యక్షరూపమైనను పాపనాశరూపమయిన తత్ఫలమునందు ఎట్లు శ్రద్ధాదినియమాపేక్ష గలిగియున్నదో, అట్లు బ్రహ్మజ్ఞానమును మోక్షరూపఫలోత్పత్తియందు కర్మోపాసనలయొక్క అపేక్ష గలిగియున్నది.

మఱియును చూడుము— కేవలజ్ఞానముచేత మోక్షమంగీకరించువాఁడును జ్ఞానమునకు హేతువయిన కర్మోపాసనలు చేయుచున్నాఁడు; ఏలయన— శుద్ధనిశ్చలమయినట్టి అంతఃకరణమందు జ్ఞానమగును; ఉపాసనవలన నిశ్చలమగును.

మఱియు ఎట్లు కర్మోపాసనలు జ్ఞానమునకు హేతువో, అట్లు జ్ఞానఫలమైన మోక్షమునకును హేతువుగా నున్నవి; ఉదాహరణము—జలసేచనము వృక్షోత్పత్తికిని, ఫలోత్పత్తికిని హేతువగును; వనవృక్షములయందు జలసేచనము లేకయే ఫలమైనను, మూలమందు జలమున్నది; జలసంబంధము లేక వృక్షము ఎండిపోవును; అట్లు కర్మోపాసనలు జ్ఞానోత్పత్తికిని, జ్ఞానఫలమైన మోక్షమునకును హేతువుగా నున్నవి; కాబట్టి జ్ఞానవంతుఁడును కర్మోపాసనలు చేయవలయును.

లేక కర్మోపాసనలు జ్ఞానరక్షణమునకు హేతువులుగా నున్నవి; జ్ఞానవంతుఁడు వానిని త్యజించినట్టయిన, ఉత్పన్నమయిన జ్ఞానము జలములేని వృక్షమువలె నష్టమగును; ఏలాగునననఁగా— శుద్ధాంతఃకరణమందు జ్ఞానమగును; శుభకర్మము

గుణోత్పత్తి ముముక్షువున కుపయోగింపదు; ఆత్మయందే గుణోత్పత్తిగావలె నని చెప్పవలసివచ్చును; ఆయాత్మ నిర్గుణుఁడు, వానియందు గుణోత్పత్తి ఘటిల్లదు.

ఈవిధముగా కర్మఫలము పంచప్రకారములగును; ఎక్కువ గాదు; ఆ పంచప్రకారఫలమును ముముక్షువునకు కర్మమువలన ఘటిల్లదు; కాఁబట్టి కర్మమును వదలి, జ్ఞానసాధనమగు శ్రవణాదికమునందే ముముక్షువు ప్రవృత్తుఁడగును; ఉపాసనయు మానసకర్మముగా నున్నది; కనుక దానిఖండనమునందు పృథగ్యుక్తి చెప్పలేదు.

ఈరీతిగా కర్మము, లేక ఉపాసన మోక్షమునకు హేతువుగాదు; మఱేమనఁగా కేవలజ్ఞానమే మోక్షమునకు హేతువు.

**271.** ఆక్షేపము:-కర్మోపాసనలు, జ్ఞానమునకును మోక్షమునకును హేతువు?

ఒకానొకఁడు [1] కర్మోపాసనాసహితజ్ఞానమును మోక్షహేతు వని అంగీకరించి, దానియందు దృష్టాంతములను చెప్పియున్నాఁడు—

ఎట్లు ఆకాశమందు పక్షికి ఒకపక్షముచే గమనము గానేరదో, రెండుపక్షములచేత నగునో, అట్లు ముముక్షురూపపక్షికి మోక్షలోకమందు జ్ఞానరూపమైన ఏకపక్షముచే గమనము గానేరదు; కర్మోపాసనాజ్ఞానములను రెండుపక్షములు గావల

1. భర్తృప్రపంచ యని ప్రాచీనవృత్తికారుఁడు [బ్రహ్మసూత్రములకు టీక వేసినవాఁడు] సముచ్చయవాది.

యును; ఉపాసనయు మానసకర్మ మగుటవలన ఉపాసనాసహిత కర్మము ఒకపక్షము, మఱియు జ్ఞానము ఒకపక్షము.

వేఱుదృష్టాంతము— సేతుదర్శనమువలన పాపనాశ మగును; ఆ సేతుదర్శనము ప్రత్యక్షరూపమైనను పాపనాశరూపమయిన తనఫలమునందు ఎట్లు శ్రద్ధాదినియమాపేక్ష గలిగి యున్నదో, అట్లు బ్రహ్మజ్ఞానమును మోక్షరూపఫలోత్పత్తి యందు కర్మోపాసనల యొక్క అపేక్ష గలిగియున్నది.

మఱియును చూడుము— కేవలజ్ఞానముచేత మోక్ష మంగీకరించువాఁడును జ్ఞానమునకు హేతువయిన కర్మోపాసనలు చేయుచున్నాఁడు; ఏలయన—శుద్ధనిశ్చలమయినట్టి అంతఃకరణమందు జ్ఞానమగును; ఉపాసనవలన నిశ్చలమగును.

మఱియు ఎట్లు కర్మోపాసనలు జ్ఞానమునకు హేతువో, అట్లు జ్ఞానఫలమైన మోక్షమునకును హేతువుగా నున్నవి; ఉదాహరణము—జలసేచనము వృక్షోత్పత్తికిని, ఫలోత్పత్తికిని హేతువగును; పనసవృక్షమూలమునందు జలసేచనము లేకయే ఫలమైనను, మూలమందు జలమున్నది; జలసంబంధము లేక వృక్షము ఎండిపోవును; అట్లు కర్మోపాసనలు జ్ఞానోత్పత్తికిని, జ్ఞానఫలమైన మోక్షమునకును హేతువుగా నున్నవి; కాఁబట్టి జ్ఞానవంతుఁడును కర్మోపాసనలు చేయవలయును.

లేక కర్మోపాసనలు జ్ఞానరక్షణమునకు హేతువులుగా నున్నవి; జ్ఞానవంతుఁడు వానిని త్యజించినట్టయిన, ఉత్పన్నమయిన జ్ఞానము జలములేని వృక్షమువలె నష్టమగును; ఏలాగున ననఁగా— శుద్ధాంతఃకరణమునందు జ్ఞానమగును; శుభకర్మము

చేయకుండిన, అంతఃకరణమందు పాపముగును; ఉపాసనలత్యాగ మువలన అంతఃకరణ చంచలమగును; ఆ మలినమై, చంచలమయిన అంతఃకరణమందు జ్ఞానముండదు; ఎట్లనఁగా—శుష్క భూమియందు ఉత్పన్నమయిన వృక్షము జీవింపఁజాలదు.

జ్ఞానరక్షణ హేతువునందు అన్వయదృష్టాంతము—సంస్కారముచేత శుద్ధమయిన స్థానమందు వేదపాఠియైన బ్రహ్మచారి నివసించును; ఆ శుద్ధస్థానము ఏనిమిత్తముచేనైనను మరల అపవిత్రమయినట్టయిన, ఆ స్థానమును బ్రహ్మచారి విడుచును; అట్లు కర్మత్యాగముచే మలినమై, ఉపాసనాత్యాగముచే చంచలమయిన అంతఃకరణమందు జ్ఞానముండదు.

ఈరీతిగా కర్మోపాసనాజ్ఞానములు మూఁడును గూడి [1] మోక్షమునకు హేతువు లని అంగీకారము చేయనీ, లేక

---

1. యద్యపి వేదమందును కొన్నిచోట్ల జ్ఞానకర్మములయొక్క సముచ్చయము చెప్పఁబడియున్నది; తథాపి సమసముచ్చయము, మఱియు క్రమసముచ్చయము అను భేదముచే సముచ్చయము రెండువిధములు—

(1) జ్ఞానసాధనములయిన శ్రవణాదికము, కర్మసాధనమయిన అగ్నిహోత్రాదికమును ఏకకాలమందు అనుష్ఠానము చేయుటకు పేరు సమసముచ్చయము.

(2) మొదలు అంతఃకరణశుద్ధికొఱకు జిజ్ఞాసాపర్యంతము కర్మముచేసి, వెనుక కర్మ విధినిపరిత్యజించి జ్ఞానసాధనమయిన శ్రవణాదిద్వారమున జ్ఞానసంపాదనము చేయుటకు పేరు క్రమసముచ్చయము.

వీనిలో—సమసముచ్చయము త్యాజ్యము, మఱియు క్రమసముచ్చయము గ్రాహ్యము; ఇది వేదముయొక్క తాత్పర్యము; కనుక ఇచ్చట సమసముచ్చయమునకు ఖండన మగును; క్రమసముచ్చయమునకుఁ గాదు.

కర్మోపాసనలు జ్ఞానరక్షణమునకు హేతువై, కేవలజ్ఞానము మోక్షమునకు హేతువని అంగీకారము చేయనీ, ఈ రెండు ప్రకారములచేతను జ్ఞానవంతునకు కర్మోపాసనలు అవశ్యముగ కర్తవ్యమగును. దీనిని సముచ్చయవాద మందురు. ఇది సమీచీనము గాదు—

—{ 272, 271—గత ఆక్షేపమునకు సమాధానము—కర్మోపాసనలకును, జ్ఞానమునకును పరస్పరవిరోధము. }—

ఎవఁడు దేహముకన్న భిన్నుఁడని ఆత్మను ఎఱుఁగఁడో, వానివలన కర్మము గానేరదు, ఏలయన—జన్మాంతరభోగము కొఱకు కర్మము చేయఁబడినది; దేహము అగ్నియందు దగ్ధమగును; దానికి జన్మాంతరభోగము ఘటిల్లదు; ఈరీతిగా శరీరముకంటె ఆత్మ భిన్నుఁడనుజ్ఞానము కర్మ హేతువు; ఆశరీర భిన్నాత్మజ్ఞానమును, కర్తృత్వభోక్తృత్వయుక్తముగానే కర్మమునకు హేతువు.

"నేను పుణ్యపాపములు కలవాఁడను, పుణ్యపాపముల ఫలము నాకగును;" ఇట్లెవ్వఁడు తలంచునో, వాఁడు కర్మకర్తగా నున్నాఁడు; జ్ఞానవంతుఁడట్లు తలంపఁడు; మఱేమనఁగా—నేను పుణ్యపాపములచేతను, సుఖదుఃఖములచేతను రహితుఁడనై, అసంగబ్రహ్మరూపుఁడైన ఆత్మగా నున్నాను; ఇట్లు వేదాంత విచారముచే వానికి జ్ఞానము కలిగినది; ఆ జ్ఞానము కర్మమునకు హేతువు గాదు; వ్యత్యస్తమై, విరోధిగా నున్నది; కాఁబట్టి జ్ఞానవంతునిచే కర్మము గానేరదు.

అట్లు కర్తృకర్మఫలముల భేదజ్ఞానము కర్మమునకు హేతువు, ఆ కర్తృకర్మఫలభేదప్రతీతియో, జ్ఞానవంతునకుఁ గానేరదు; మఱేమనఁగా—సంపూర్ణాత్మస్వరూపమే ప్రతీతమగును; కనుక జ్ఞానవంతునిచేత కర్మము గానేరదు.

భాష్యకారులచేఁకూడ అనేకప్రకారములుగా జ్ఞానవంతునందు కర్మాభావము ప్రతిపాదింపఁబడియె. కర్మమునకును, జ్ఞానమునకును ఫలముచేత విరోధము గలదు, చూడుము—కర్మఫలము అనిత్యమైనస్వర్గాదికము, జ్ఞానఫలము నిత్యమైనమోక్షము; అందుచేతను జ్ఞానకర్మములసముచ్చయము ఘటిల్లదు.

మఱియు ఆత్మయందు జాత్యాశ్రమావస్థలయొక్క అధ్యాసము కర్మమునకు హేతువుగా నున్నది; ఏలయన—జాత్యాశ్రమావస్థలకు యోగ్యములయిన భిన్నభిన్నకర్మములు వేదమందు చెప్పఁబడినవి; యద్యపి జాత్యాశ్రమాద్యవస్థలు దేహధర్మములు, కర్మికి దేహమందు ఆత్మబుద్ధి గలుగదు; మఱేమనఁగా—ఆత్మ దేహముకన్న భిన్నుఁడయి, కర్మభోక్తయని కర్మపురుషుఁడు తెలిసికొనును; గనుక జాత్యాదులప్రతీతి ఆత్మయందు కర్మికిని ఘటిల్లదు; తథాపి దేహముకన్న భిన్నుఁడయిన ఆత్మయొక్క అపరోక్షజ్ఞానము కర్మికి లేదు; శాస్త్రముచే పరోక్షజ్ఞానము గలదు; మఱియు దేహాత్మయొక్క అపరోక్షజ్ఞానమో, స్వతఃసిద్ధముగానే గలదు; ఈ రెండును కూడి కర్మమునకు హేతువులు; దేహభిన్నాత్మయొక్క అపరోక్షజ్ఞానమయిన పక్షమందు, దేహాత్మయొక్క అపరోక్షజ్ఞానమునకు విరోధియగును; పరోక్షజ్ఞానమునకు అపరోక్షజ్ఞానముచేత విరోధము లేదు; గనుక దేహముకన్న భిన్నుఁడయిన కర్తభోక్త యను ప

జ్ఞానము, మఱియు దేహామందాత్మబుద్ధి ఈరెండును ఒకనికే [కర్మికే] ఘటిల్లుచున్నవి.

దృష్టాంతము—మూర్తియందు ఈశ్వరజ్ఞానము శాస్త్రముచేత పరోక్షము, స్వభావసిద్ధమయిన పాషాణబుద్ధి అపరోక్షము; వీనికి పరస్పరము విరోధము లేదు; కనుక రెండును ఒకనికే యగును; మఱియు ఎవనికి రజ్జువుయొక్క అపరోక్షజ్ఞానమగునో, వానికి అపరోక్షసర్పభ్రాంతి దూరమగును. కర్తృభోక్తృరూపముచేత ఆత్మజ్ఞానము భ్రాంతిరూపముగా నున్నది; విద్వాంసునకు భ్రాంతిలేదు; కావున వానికి కర్మంబునందు అధికారము లేదు; దేహామునందు అపరోక్షబుద్ధియయినపుడు దేహధర్మమయిన జాత్యాదికము ప్రతీతమగును; దేహమందాత్మబుద్ధి విద్వాంసునకు గలుగదు; వానికి బ్రహ్మరూపముచే ఆత్మయొక్క అపరోక్షజ్ఞానము గలదు; కాబట్టి జాత్యాశ్రమాదిభ్రాంత్యభావమువలనను, విద్వాంసునకు కర్మాధికారము లేదు.

ఉపాసనయైననో, "నేను ఉపాసకుడను, దేవుడు ఉపాస్యుడు" అను నీబుద్ధిచే నగును; విద్వాంసునకు ఉపాస్యోపాసకభావము ప్రతీతముగానేరదు; మఱియునగా—"నాయొక్క దేహాదిసంఘాతము, దేవునియొక్క దేహాదిసంఘాతము రెండును స్వప్నమువలె కల్పితములు, చైతన్యమొకటి." ఇది విద్వాంసుని నిశ్చయము, ఈజ్ఞానమునకు ఉపాసనతోడ విరోధము గలదు; కనుక విద్వాంసునందు ఉపాసన ఘటిల్లదు.

పక్షిగమనదృష్టాంతమును ఘటిల్లదు; ఏలయన—పక్షికైననో, రెండుపక్షములు ఏకకాలమందున్నవి; వీనికి పరస్పర

విరోధము లేదు; జ్ఞానకర్మోపాసనలకో, పరస్పరవిరోధము గలదు; అందువలన రెంటికి ఏకకాలమందు స్థితి ఘటిల్లదు.

## 273. జ్ఞానమందు కర్మోపాసనాపేక్ష లేదు.

సేతుదర్శనదృష్టాంతము సరి కాదు; ఏలాగుననఁగా—

సేతుదర్శనము దృష్టఫలమునకు హేతువు గాదు; అది అదృష్టఫలమునకు హేతువు; భోజనఫలమైన తృప్తివలె ఫలము ప్రత్యక్షముగ ప్రతీతమైనపుడు అది దృష్టఫల మనఁబడును; సేతుదర్శనమో, పాపనాశరూపమని శాస్త్రముచేత ఎఱుఁగఁబడినది; శాస్త్రముచేత ఎఱుఁగఁబడినది అదృష్టఫల మందురు; ఎట్లనఁగా—యజ్ఞాదికర్మమునకు స్వర్గాదిఫలము.

ఏది అదృష్టఫలమునకు హేతువగునో, అది తనఫలోత్పత్తికొఱకు శాస్త్రబోధితములైనయావత్సామగ్రితోసహితమై, హేతువగును; కేవలము హేతువు గాదు; సేతుదర్శనమును అదృష్టఫలహేతు వగుటవలన అది శాస్త్రబోధితమైన శ్రద్ధానియమాదిసహితముగా పాపనాశరూపఫలమునకు హేతు వగును; శ్రద్ధానియమాదిరహితముగ హేతువుగా నేరదు.

ఈప్రకారముగా సేతుదర్శనము శ్రద్ధానియమాదికమును అపేక్షించుచున్నది; అట్లు బ్రహ్మవిద్య కర్మోపాసనలను అపేక్షింపదు; ఎందుకనఁగా—

బ్రహ్మవిద్యాఫలమగుమోక్షము, స్వర్గాదికమువలెలోకవిశేషరూపమగు అదృష్టఫలమైనపుడు, మఱియు బ్రహ్మవిద్య కర్మోపాసనాసహితముగా మోక్షహేతువని శాస్త్రముచేత విధింపఁబడినపుడు బ్రహ్మవిద్యయు సేతుదర్శనమువలె కర్మోపాస

నలను అపేక్షించును; బ్రహ్మవిద్యాఫలమగు మోక్షము, అది లోకవిశేషముగాదు, మోక్షహేతువైన బ్రహ్మవిద్య అదృష్ట ఫలముగాదు; అందువలన నది తనఫలోత్పత్తియందు కర్మోపాస నలను కోరదు.

భ్రాంతివలన బంధము ప్రతీతమయినది; తన్నివృత్తి బ్రహ్మవిద్యకు ఫలము, ఆ భ్రాంతినివృత్తియో, కేవలబ్రహ్మ విద్యచేత నని జ్ఞానికి ప్రత్యక్షము, మఱియు రజ్జుజ్ఞానమువలన సర్పభ్రాంతియొక్కనివృత్తి సర్వులకు ప్రత్యక్షమే.

ఈవిధముగా అధిష్ఠానజ్ఞానము భ్రాంతినివృత్తిరూపమైన దృష్టఫలము గలదిగా నున్నది; దృష్టఫలోత్పత్తి ఏసామగ్రిచే ప్రత్యక్షప్రతీతమగునో, ఆసామగ్రియే దానికి హేతువగును; ఎట్లనఁగా—తురీతంతువేమలచేత పటోత్పత్తి ప్రత్యక్షము; కనుక తురీతంతువేమలు [1] పటమునకు హేతువులు, మఱియు కేవలభోజనముచేత తృప్తిరూపఫలము ప్రత్యక్షము; కనుక కేవలభోజనమే తృప్తికి హేతువు; అట్లు కేవలాధిష్ఠానజ్ఞానము వలన భ్రాంతినివృత్తి ప్రత్యక్షము; కనుక కేవలాధిష్ఠానజ్ఞానము భ్రాంతినివృత్తికి హేతువుగా నున్నది; ఎట్లు రజ్జుజ్ఞానము సర్ప భ్రాంతినివృత్తియందు అన్యపదార్థాపేక్ష చేయదో, అట్లు బంధ భ్రాంత్యధిష్ఠానరూపాత్మజ్ఞానమును బంధభ్రాంతినివృత్తియందు కర్మోపాసనలయొక్క అపేక్ష చేయదు.

జ్ఞానఫలమైనమోక్షము, స్వర్గమువలె లోకవిశేషరూప మైన అదృష్టమని అంగీకారము చేసినట్టయిన విరోధమగును;

1. తురి యనఁగా నేతగాని, తంతు [దారము] వేమ[సూత్రమునిండిన కొమ్ము]

ఏలయన "జ్ఞానవంతుని ప్రాణము బయటికిపోదు" ఇది వేదము నందు చెప్పఁబడియున్నది. మఱియు మోక్షమును లోకవిశేష మని యంగీకరించినయెడల స్వర్గమువలె మోక్షము అనిత్య మగును.

ఇట్లుండఁగా హఠముచేత మోక్షము లోకవిశేష మని యంగీకరించినను, కేవలజ్ఞానముచేతనే మోక్షలోకప్రాప్తి [1] యగు నని అంగీకరించుట యోగ్యమగును; ఏలయన—శాస్త్ర ప్రతిపాదితార్థము శాస్త్రానుసారముగానే గ్రహింపవలయును; శాస్త్రము జ్ఞానముచేతనే మోక్షము ప్రాప్తించునని ప్రతిపాదించుచున్నది.

వృక్షదృష్టాంతముఁగూడ సరికాదు; ఏలయన—జలసేచనము వృక్షోత్పత్తియందును, రక్షణమందును హేతువైనను, ఫలోత్పత్తియందు హేతువుగాదు; వృద్ధవృక్షమందు జలసేచనము రక్షణనిమిత్తముగాని, ఫలనిమిత్తము గాదు; జలసేచనముచేత యౌవనవృక్షమే ఫలించును; కనుక జలసేచనము ఫల హేతువుగాదు; యౌవనమే ఫలమునకు హేతువు; అట్లు కర్మోపాసనలకును జ్ఞానోత్పత్తియందు ఉపయోగము గలదు; మోక్షమునందు లేదు; కాఁబట్టి జ్ఞానోత్పత్తికిపూర్వము కర్మో

1. ఇచ్చట దుర్జనతోషన్యాయమున మోక్షము లోకవిశేష మని అంగీకరించినను, ఆ మోక్షము జ్ఞానములేక ప్రాప్తముగాదు; ఈసంగతి సిద్ధాంతి ప్రతిపాదనము చేయుచున్నాఁడు. దుర్జనతోషన్యాయ మనఁగా—ఒకఁడు తనదుష్టులశత్రువును కొట్టించుటకు ప్రబలశత్రువును ఆజ్ఞాపించి, వానికి సంతోషముచేయుచున్నాఁడు; తరువాత తాను స్వయముగ ఆప్రబలశత్రువును కొట్టించుచున్నాఁడు. దీనిపేరు దుర్జనతోషన్యాయము.

పాసనలు చేయవలయును; జ్ఞానోత్పత్తికిపూర్వముగా... కనఁగా—ఎంతవఱకు అంతఃకరణమందు మలవిక్షేపములు గలవో, అంతవఱకే చేయవలయును; శుద్ధనిశ్చలాంతఃకరణము ఎవ్వనికైనదో, ఆజిజ్ఞాసువునకు శ్రవణవిరోధియైన కర్మోపాసనల త్యాగము ఉచితము.

[మలము పాపమునకు పేరు, అది అశుభవాసనకు హేతువు; ఎదివఱకు మలము గలదో, అదివఱకు అశుభవాసన కలుగుచుండును; ఎప్పుడు అశుభవాసన గలుగదో, అపుడు మలముయొక్క అభావనిశ్చయము చేయవలయును; అంతఃకరణముయొక్క చంచలత, మఱియు ఏకాగ్రత అనుభవసిద్ధము.]

**274.** కర్మోపాసనలచేత జ్ఞానరక్షణము గాదు.

మొదట చెప్పఁబడినది—"ఎట్లు జలసంబంధము గాక పోయినట్టియైన ఉత్పన్నవృక్షము ఎండిపోవునో, అట్లు కర్మోపాసనలు చేయఁడేని, అంతఃకరణము మరల మలినమై, చంచలమగును; ఆ మలినచంచలాంతఃకరణమందు శుష్కభూమియందలి వృక్షమువలె ఉత్పన్నమైనజ్ఞానము నష్టమగును; కనుక జ్ఞానవంతుఁడు కర్మోపాసనలుచేయవలయును." ఈవార్తఘటిల్లదు—ఇచ్చట పూర్వపక్షిని ఇట్లడుగవలయును—ఆభాససహితమైన, లేక చైతన్యసహితమైన అంతఃకరణముయొక్క "నేను అసంగుఁడను" అను నిట్టివృత్తియే వేదాంతముయొక్క ఫలరూప జ్ఞానము, కర్మోపాసనలు చేయఁడేని, ఆవృత్తిరూపజ్ఞానముయొక్క నాశమగునా? లేక చైతన్యస్వరూపజ్ఞానముయొక్క నాశమగునా?

లేవు; అవిద్యచేత మిథ్యాప్రతీతమగును; ఆ యవిద్యాజన్య ప్రతీతి జ్ఞానవంతునకుఁ గలుగదు.

ఈస్థానమందిరహస్యముగలదు— బ్రహ్మజ్ఞానము దృఢము, అదృఢము [తీవ్రము మందము] అని ద్వివిధము—సంశయాది రహితమయిన జ్ఞానము దృఢము, సంశయాదిసహితమయిన జ్ఞానము అదృఢము; ఎవనికి దృఢజ్ఞాన మగునో, వానికి కించిన్మాత్రమును కర్తవ్యము లేదు; ఏకవారము ఉత్పన్నమైన ఏ సంశయాదిరహితమగు అంతఃకరణవృత్తిరూపజ్ఞానము గలదో, అదియె అవిద్యను నశింపఁజేసి, తానును దనయంత నశించును; ఆ జ్ఞానము తాను దూరమైనను, జ్ఞానియుంచి ప్రకారముగా తెలిసికొనియుండుటచేత మరలవానికి ఆత్మయందు భ్రాంతి గానేరదు; కాఁబట్టి భ్రాంతికి కారణమైన అవిద్య, అది ఒకసారి ఉత్పన్నమైన జ్ఞానముచే నష్టమైనపిదప భ్రాంతియొక్కయు, అవిద్యయొక్కయు అభావమువలన వృత్తిజ్ఞానావృత్తియొక్క ఉపయోగము లేదు.

విద్వాంసునకు జీవన్ముక్తిసుఖముకొఱకు వృత్తియొక్క ఆవృత్తి అపేక్షితమయినట్లయిన, వాఁడు పలుమారు వేదాంతార్థముయొక్క చింతనముచే మవలయును; వేదాంతచింతనముచేతనే పలుమారు బ్రహ్మాకారవృత్తి యగును; ఆవృత్తిచేత బ్రహ్మానందము ప్రకటమగును; ఆ యానందము కర్మోపాసనలచేతఁ గానేరదు; ఏలయన—కర్మోపాసనలో, అంతఃకరణశుద్ధి నిశ్చలతలద్వారమున జ్ఞానమందు ఉపయోగించుచున్నది; అన్యవిధి చేత ఉపయోగింపలేదు. విద్వాంసుని అంతఃకరణమందు పాపచంచలతలు లేవు; రాగద్వేషద్వారమున పాపచంచలతలకు హేతువు

ఇందుకు ఇట్లనుట-"స్వరూపజ్ఞానమో, నిత్యము; దానికి రక్షణనాశములు ఘటిల్లవు; అయినను వేదాంతఫలమైయిన బ్రహ్మవిద్యారూపజ్ఞానము ఏది గలదో, దానికి కర్మోపాసనల త్యాగముచే నాశమగును" ఈమాట ఘటిల్లదు; ఏలయన— ఒకతడవ ఉత్పన్నమైన బ్రహ్మాకారవృత్తివలన ఆత్మాశ్రితాజ్ఞానముయొక్క నాశమయినవెనుక మరల ఆ వృత్తిరక్షణముచే కర్మోపాసనములచే ఘటిల్లదు; ఏలాగుననఁగా-ఎప్పుడు కర్మోపాసనానుష్ఠానము చేయునో, అప్పుడు కర్మోపాసనాసామగ్రియొక్క వృత్తిరూపజ్ఞానమే యగును; బ్రహ్మాకారజ్ఞానము గానేరదు; రెండవవృత్తిఅయినపుడు ప్రథమవృత్తి యుండదు; కనుక కర్మోపాసనలు జ్ఞానోత్పత్తికి పరంపరగా హేతువులగును; మఱియు ఉత్పన్నమైన బ్రహ్మజ్ఞానవృత్తికి విరోధి యగును; కాఁబట్టి కర్మోపాసనవలన జ్ఞానరక్షణము ఘటిల్లదు.

## 275. జ్ఞానికి పాపచంచలతయొక్క అభావము వలన కర్మోపాసనలయొక్క అనుపయోగము.

మఱియు పూర్వము చెప్పెను—"జ్ఞానవంతునకు కర్మత్యాగమువలన పాపమగును" ఆ వార్త ఘటిల్లదు; ఏలయనశుభకర్మత్యాగము పాపహేతువు గాదు; మఱేమనఁగా—నిషిద్ధకర్మానుష్ఠానమే పాపహేతువు; ఈసంగతి భాష్యకారులచే అనేకయుక్తిప్రమాణములచే ప్రతిపాదింపఁబడినది. ఇదిగాక జ్ఞానవంతునకుశుభకర్మత్యాగమువలనను;అశుభకర్మానుష్ఠానము వలనను సర్వదా పాపము సంభవింపదు; ఏలయన—పుణ్యపాపములును, తదాశ్రయమైన అంతఃకరణమును పరమార్థముచే

లేవు; అవిద్యచేత మిథ్యాప్రతీతమగును; ఆ యవిద్యాజన్య ప్రతీతి జ్ఞానవంతునకుఁ గలుగదు.

ఈస్థానమందీరహస్యముగలదు—బ్రహ్మజ్ఞానము దృఢము, అదృఢము [తీవ్రము మందము] అని ద్వివిధము—సంశయాది రహితమయిన జ్ఞానము దృఢము, సంశయాదిరహితముగాని జ్ఞానము అదృఢము; ఎవనికి దృఢజ్ఞాన మగునో, వానికి కించి న్మాత్రమును కర్తవ్యము లేదు; ఏకవారము ఉత్పన్నమైన ఏ సంశయాదిరహితమగు అంతఃకరణవృత్తిరూపజ్ఞానము గలదో, అదియే అవిద్యను నశింపఁజేసి, తానును దనయంత నశించును; ఆ జ్ఞానము తాను దూరమైనను, జ్ఞానియంచిప్రకారముగా తెలిసికొనియుండుటచేత మరలవానికి ఆత్మయందు భ్రాంతి గానేరదు; కాఁబట్టి భ్రాంతికి కారణమైన అవిద్య, అది ఒకసారి ఉత్పన్నమైన జ్ఞానముచే నష్టమైనపిదప భ్రాంతియొక్కయు, అవిద్యయొక్కయు అభావమువలన వృత్తిజ్ఞానావృత్తియొక్క ఉపయోగము లేదు.

విద్వాంసునకు జీవన్ముక్తిసుఖముకొఱకు వృత్తియొక్క ఆవృత్తి అపేక్షితమయినట్లయిన, వాఁడు పలుమాఱు వేదాంతార్థముయొక్క చింతనముచే సుఖలయును; వేదాంతచింతనము చేతనే పలుమారు బ్రహ్మాకారవృత్తి యగును; ఆవృత్తిచేత బ్రహ్మానందము ప్రకటమగును; ఆయానందము కర్మోపాసనలచేతఁ గానేరదు; ఏలయన—కర్మోపాసనలో, అంతఃకరణశుద్ధి నిశ్చలతలద్వారమున జ్ఞానమందు ఉపయోగించుచున్నది; అన్యవిధి చేత ఉపయోగింపలేదు. విద్వాంసుని అంతఃకరణమందు పాపచంచలతలు లేవు; రాగద్వేషద్వారమున పాపచంచలతలకు హేతువు

అవిద్యగా నున్నది; ఆయవిద్యయొక్క నాశము జ్ఞానముచేత అగును.

ఈరీతిగా విద్వాంసునకు కర్మోపాసనలయుపయోగము ఏమియు లేదు; కనుక వేదపాఠిబ్రహ్మచారిదృష్టాంతముకూడ సంభవింపదు.

**276. జ్ఞానిప్రారబ్ధవిలక్షణతచే ఉపాసనయందు అప్రవృత్తి**

ఒకానొకఁ డిట్లనును—రాగద్వేషాదులు అంతఃకరణమునకు సహజధర్మములు; ఎదివరకు అంతఃకరణము గలదో, అదివరకు రాగద్వేషములనాశము సర్వథా గానేరదు; ఆ రాగద్వేషములచేత జ్ఞానవంతునియొక్కయు అంతఃకరణము చంచలమగును; ఆ చంచలత దూరముచేయుటకొఱకు జ్ఞానవంతుఁడును ఉపాసన చేయవలయును; యద్యపి జ్ఞానవంతునకు చంచలతవలన విదేహమోక్షమందు హానిలేదు; తథాపి చంచలాంతఃకరణమందు స్వరూపానందభానము గానేరదు; కాఁబట్టి జీవన్ముక్తిసుఖమునకు విరోధియైనచంచలత దూరముచేయుటకొఱకు ఉపాసన చేయతగినది?

ఆమాట సరికాదు; ఏలయన—ఎవనికి దృఢబోధ యగునో, వానికి సమాధివిక్షేపములు రెండును సమానములగును; వాఁడు నిశ్చలతకొఱకు యత్నారంభమును చేయఁడు; అట్లయినను, విద్వాంసునియొక్క ప్రవృత్తి లేక నివృత్తి ప్రారబ్ధమున కధీనము; ప్రారబ్ధకర్మము నానావిద్వాంసులకు నానావిధములుగా నున్నది; కొన్ని విద్వాంసులయొక్క ప్రారబ్ధము జనకాదుల ప్రారబ్ధమువలె భోగహేతువుగాను,

కొందఱి ప్రారబ్ధము శుకవామదేవాదుల ప్రారబ్ధమువలె నివృత్తికి హేతువుగాను ఉన్నది; ఎవ్వని ప్రారబ్ధము భోగహేతువో, వానికి ప్రారబ్ధముచేత భోగేచ్ఛ, మఱియు భోగసాధనములకొఱకు యత్నమగుచున్నది; ఎవ్వని ప్రారబ్ధము నివృత్తిహేతువగునో వానికి జీవన్ముక్తిసుఖేచ్ఛయై, భోగమందు గ్లానియగుచున్నది; ఎవనికి జీవన్ముక్తియం దిచ్ఛయగునో, వాఁడే బ్రహ్మాకారవృత్తినిమిత్తము వేదాంతచింతనము చేయును; ఉపాసన చేయఁడు; ఏలయన—అంతఃకరణనిశ్చలతామాత్రము వలన బ్రహ్మానందభానము విశేషరూపముచేతఁ గానేరదు; మఱేమనఁగా— బ్రహ్మాకారవృత్తిచేతనే యగును; ఆ బ్రహ్మాకారవృత్తి వేదాంతచింతనముచేతనే యగును; ఉపాసనచేతఁ గాదు; అంతఃకరణచాంచల్యమును విద్వాంసునకు వేదాంతచింతనముచేతనే దూరమగును.

ఈరీతిగా దృఢబోధగలవానికి కర్మోపాసనలయందు ప్రవృత్తి గానేరదు.

**277.** దృఢాదృఢజ్ఞానులకును, ఉత్తమమందజిజ్ఞాసువులను కర్మోపాసనలందధికారము లేదు.

ఎవనికి మందబోధ యగునో, వాఁడును మననిదిధ్యాసనములె చేయవలయును; కర్మోపాసనలు చేయఁగూడదు; ఏలయన—మందబోధగలవానిని ఉత్తమజిజ్ఞాసువందురు; ఆయుత్తమజిజ్ఞాసువునకు మననిదిధ్యాసనములుదప్ప అన్యకర్తవ్యము లేదు; ఈసంగతి భాష్యకారునిచే ప్రతిపాదింపఁబడియున్నది.

విద్వాంసునకు [1]మననని దిధ్యాసనములును కర్తవ్యములు గావు; ఏవిద్వాంసుఁడు జీవన్ముక్తిసుఖముకొఱకు మననని దిధ్యాసనములందు ప్రవృత్తుఁడగునో, వాఁడును స్వేచ్ఛవలన ప్రవృత్తుఁడగును; అది కర్తవ్యము గాదు; అయిన "నేను శేశాజ్ఞ అంగీకరింపనిపక్షమందు నాకు జన్మమరణసంసారమగును" అనుబుద్ధిచే చేయఁబడినది కర్తవ్యమగును; ఆ జన్మామలబుద్ధి విద్వాంసునకుఁ గాదు; స్వేచ్ఛచేత విద్వాంసుఁడు ఏ మననని దిధ్యాసనములు చేయునో, అది కర్తవ్య మనఁగూడదు.

ఎవనికి బోధ గాలేదో, అయినను ఆత్మ నెఱుఁగుటకు తీవ్రేచ్ఛ గలదో, భోగేచ్ఛ లేదో, వానియొక్కయు అంతఃకరణము శుద్ధమగుటవలన వాఁడును ఉత్తమజిజ్ఞాసువే, వానికిని బోధకొఱకు శ్రవణాదికము కర్తవ్యముగాని, కర్మోపాసనలుఁ గావు; ఏలయన—కర్మోపాసనలఫలము వానికి సిద్ధముగా నున్నది.

అంతఃకరణమందు భోగేచ్ఛ యుంచుకొని, సామాన్యజ్ఞానేచ్ఛవలన ఎవ్వఁడు శ్రవణమందు ప్రవృత్తుఁడగునో, వాఁడు

---

1. ఎవ్వఁడు అజ్ఞాతతత్త్వుఁడో, అతఁడు శ్రవణము చేయుని, నేను తత్త్వమును ఎఱిఁగిన వెనుక ఎందుకు శ్రవణము చేయుందును? ఎవ్వనికి సంశయమైనదో, అతఁడు మననము చేయునీ, నేను సంశయరహితుఁడను ఎందుకు మననము చేయుందును? ఎవ్వఁడు దేహమందాత్మజ్ఞానరూపవిపర్యయమును పొందునో, అతఁడు నిదిధ్యాసనముచే యునీ, నేను అట్టి విపర్యయమును ఎప్పుడును పొందను; నేను ఎందుకు నిదిధ్యాసనము చేయుందును? ఈరీతిగా పంచదశితృప్తిదీపమందు విద్యారణ్యస్వాములు విద్వాంసునకు కర్తవ్యాభావమును విస్తరముగా వ్రాసియున్నారు.

మందజిజ్ఞాసు వగును; వాఁడును శ్రవణాదికమును విడిచి, మరల కర్మోపాసనలందు ప్రవృత్తుఁడు గాఁగూడదు; కర్మోపాసనలఫల మైన ఏ యంతఃకరణశుద్ధి నిశ్చలతలు గలవో, అవి వానికి శ్రవణాదికముచేతను గలుగును; శ్రవణాదికముయొక్క ఆవృత్తివలన అంతఃకరణదోషము దూరమై, ఈజన్మమందు, లేక జన్మాంతరమందు, లేక బ్రహ్మలోకమందు వానికి జ్ఞాన మగును; ఇట్లుండగా శ్రవణాదికమును విడిచి, ఎవ్వఁడు కర్మోపాసనలందు ప్రవృత్తుఁడగునో, వానిని [1] ఆరూఢపతితుఁ డనవలయును.

ఎవ్వనికి జ్ఞానేచ్ఛ గలిగినను, భోగమందు ఆసక్తబుద్ధియుండుటవలన శ్రవణమందు ప్రవృత్తుఁడు గాఁడో, అట్టియే అత్యంత మందజిజ్ఞాసువు గలఁడో, వానికి నిష్కామకర్మమందు లేక ఉపాసనమందు అధికారము గలదు.

ఎవనికి భోగమునందే ఆసక్తిగలదో, జ్ఞానేచ్ఛలేదో, అట్టి బహిర్ముఖుఁడైనవానికి సకామకర్మమందధికారము గలదు.

ఈరీతిగా జ్ఞానమునకు విరోధియగుటవలన జ్ఞానవంతుఁడు మొదలు మందజిజ్ఞాసువు వఱకు కర్మోపాసనలందు అధికారవంతులం కారు.

**278.** దృఢబోధమునకు కర్మోపాసనలు విరోధులుగావు, మందబోధకే విరోధులు.

కర్మోపాసనలును అంతఃకరణశుద్ధినిశ్చలతా ద్వారమున

1. మోక్షముయొక్క శ్రేణి నెక్కి, అచ్చటనుండి పడినవానికి కరంలేధిన్యాయము [ప్రాప్తమయినభక్ష్యముఁ పారవైచి, చేయి నాకుదృష్టాంతము] ప్రాప్తమయినది. ఈ యర్థము పంచదశీధ్యానదీపవ్యాఖ్యానమందు స్పష్టముగా వ్రాయఁబడినది.

జ్ఞానమునకు హేతువుగా నున్నవి, అయిన మందజ్ఞానోత్పత్త్య నంతరము కర్మోపాసనలు చేసినయెడల, ఉత్పన్నమైన మంద జ్ఞానముకూడ నష్టమగును; ఏలయన—నేను కర్తను, యజ్ఞాది కము నాకు కర్తవ్యము, యజ్ఞాదికర్మముయొక్క స్వర్గాదిఫలము నాకు కలుగును." ఈభేదబుద్ధివలన కర్మమగును, అట్లు "నేను ఉపాసకుఁడను, దేవుఁడు పాస్యుఁడు" ఈభేదబుద్ధిచేత ఉపాసన యగుచున్నది; ఆ రెండుప్రకారములబుద్ధి "సర్వము బ్రహ్మము" అనుబుద్ధిని దూరముచేయును; ఈరీతిగా కర్మోపాసనలు మంద జ్ఞానమునకు విరోధులుగా నున్నవి.

జ్ఞానవంతుఁడు ఆత్మను అసంగుఁడని తెలిసికొనును; అప్పు డును భోజనాదివ్యవహారము, లేక జనకాదులవలె అధికముయిన రాజ్యపాలనాదివ్యవహారము చేసినను, విద్వాంసునియొక్క దృఢ జ్ఞానమునకు ఆ వ్యవహారము విరోధి గాదు; మఱియు వ్యవ హారమునకు జ్ఞానమును విరోధిగాదు; ఏలయన— ఏ యాత్మ జ్ఞానముచేత అసంగ మని ఎఱుఁగఁబడునో, ఆ యాత్మయందు వ్యవహారము ప్రతీతమైనపుడు, వ్యవహారమునకువిరోధిజ్ఞానము, అట్లే జ్ఞానమునకువిరోధి వ్యవహారము.[1] అగును; విద్వాంసు నకో, ఆత్మయందు వ్యవహారము ప్రతీతముగానేరదు; మఱే

1. ఈయర్థము విద్యారణ్యస్వాములు పంచదశియందువ్రాసినారు— తృప్తిదీపము.

జగత్సత్యత్వమాపాద్య ప్రారబ్ధం భోజయేద్యది,
తదావిరోధివిద్యాయా భోగమాత్రాన్న సత్యతా. 177

భావార్థము—ప్రారబ్ధము ఎపుడు జగత్సత్యతను సంపాదించి, భోగము నిచ్చునో, అపుడు విద్యావిరోధి యగును; భోగమాత్రమువలన విషయము సత్యమగుటలేదు; గనుక భోగమాత్రమువలన ప్రారబ్ధము విద్యావిరోధికాదు;

మనఁగా—విద్వాంసునిచేత "సంపూర్ణ వ్యవహారము దేహాదులకు ఆశ్రితము, ఆత్మయందు వ్యవహారసహితమైన దేహాదుల సంబంధము లేదు." అనునీబుద్ధిచేత సంపూర్ణ వ్యవహారము చేయ

---

యది విద్యాపహ్నుపీత జగత్ప్రారబ్ధఘాతినీ,
తదాస్యాన్నతుమాయాత్వే బోధేన తదపహ్నవః. 179

భావార్థము—విద్య, ఎపుడు జగత్తును విలయము చేయునో, అపుడు ప్రారబ్ధమునకు విరోధియగును; బోధవలన జగత్తుయొక్క విలయమగుట లేదు; గనుక విద్య ప్రారబ్ధమునకు విరోధి గాదు. ఇచ్చట ప్రారబ్ధశబ్దముచేత వ్యవహారరూపకార్యముయొక్కయు గ్రహణము గలదు.

ధ్యానదీపము.

అపేక్షతే వ్యవహృతిర్న ప్రపంచస్య వస్తుతాం,
నాప్యాత్మజాడ్యం కింత్వేషా సాధనాన్యేవ కాంక్షతే. 89

భావార్థము—వ్యవహారమేది గలదో, అది ప్రపంచముయొక్క సత్యతను, ఆత్మయొక్క జడతను అపేక్ష చేయదు; మఱేమనఁగా—అది వ్యవహారసాధనములనే అపేక్షించుచున్నది.

మనోవాక్కాయతద్బాహ్యపదార్థాస్సాధనాని తాః,
తత్త్వవిన్నోపమృద్నాతి వ్యవహారోస్య నో కుతః. 90

భావార్థము—మనోవాణీశరీరాదులు గృహక్షేత్రాది బాహ్యపదార్థములు వ్యవహారమునకు సాధనములు, వానిని తత్త్వవేత్త మిథ్యగా ఎఱుఁగును; అయిన స్వరూపముచే నాశముచేయఁడు; అపుడు వానికి వ్యవహారము ఎందుకు గాఁగూడదు? కానే అగును.

ఈరీతిగా జ్ఞానమునకును, ప్రారబ్ధజనితవ్యవహారమునకును విరోధము లేదు

బడును; ఈకారణమువలన విద్వాంసుని యొక్క ప్రవృత్తియు నివృత్తి యందురు.

ఎట్లు అన్యవ్యవహారము జ్ఞానమునకు విరోధిగాదో, అట్లే కర్మోపాసనలయందు అన్యబహిర్ముఖ పురుషులను ప్రవర్తింపఁ జేయుట కొఱకు "ఆత్మ అసంగుఁడు, క్రియ దేహేంద్రియాంతఃకరణముల నాశ్రయించినది" యని యెఱిఁగి, కర్మోపాసనలు చేసిన యెడ, అవియు జ్ఞానమునకు విరోధులుగావు; ఏయాత్మ విద్వాంసులచేత అసంగుఁడని ఎఱుఁగఁబడునో, వానిని కర్తయని యెంచి, కర్మోపాసనలు చేసినట్లయిన, అవి జ్ఞానమునకు విరోధులగును; పైఁజెప్పిన ఆత్మయొక్క అసంగరూపమగు దృఢనిశ్చయము కర్మోపాసనలచేత దూరము గాదు; అందువలన ఆకర్మోపాసనలు ఆభాసరూప[1] మగుటవలన విద్వాంసునియొక్క దృఢజ్ఞానమునకు విరోధులుగావు.

ఈ కారణమువలననే జనకాదులచేత ఆభాసరూపకర్మము చేయఁబడెను; ఆత్మను అసంగుఁడని యెంచి, ఇతరవ్యవహారము వలె దేహాదులధర్మమని ఎఱిఁగి, విద్వాంసుఁడు ఏ శుభాశుభక్రియను చేయునో, ఆక్రియను ఆభాసరూపకర్మమందురు; అట్టి ఆభాసరూపకర్మము జ్ఞానమునకు విరోధి గాదు; భాష్యకారులు కర్మోపాసనలు జ్ఞానమునకు విరోధమనిచెప్పుటఅత్మయందు కర్తృబుద్ధిచేత చేయునట్టి కర్మోపాసనలవిషయము; ఆభాసరూపకర్మోపాసనల విషయము గాదు.

మందబోధమునకు ఆభాసరూపకర్మోపాసనలు విరోధు

1. ఆత్మను అసంగుఁడనియెంచి, క్రియ దేహప్రాణమనస్సులను ఆశ్రితమని ఎఱిఁగి, ఏకర్మోపాసనలు చేయునో, అవి ఆభాసరూపములు.

లుగా నున్నవి; ఏలయన—సంశయాదిసహితమగు బోధను మందబోధ యందురు; అంతఃకరణమందు "ఆత్మ అసంగుఁడవునా? కాదా?" ఇట్లు ఒకానొకప్పుడు సంశయపురుషుఁడు పలుమారు "ఆత్మ అసంగుఁడు, నాకు కించిన్మాత్రమును చేయఁదగినది లేదు" ఈయర్థమును చింతనము చేసినట్టయిన, ఆ సంశయము దూరమై, బోధ సుదృఢమగును; ఉక్తచింతనమును విడిచి, కర్మోపాసనలు చేసినట్టయిన, ఉత్పన్నమైన మందబోధగూడ దూరమై "నేను కర్తను, నేను భోక్తను" అనునీ విపరీతనిశ్చయము దృఢమగును; కాఁబట్టి మందబోధ పుట్టుటకుమునుపే కర్మోపాసనలు చేయవలయును; అనంతరము చేయరాదు.

ఉదాహరణము—పక్షి, తనఅండములను పక్షోత్పత్తికి మునుపే సేవించును; పక్షోత్పత్తికి తరువాత సేవింపదు; తరువాతఁ గూడ సేవించినప్పుడు అండస్థితబాలపక్షియొక్క పక్షము అండస్థితజలముచే గలితమగును; అట్లు జ్ఞానోత్పత్తికిమునుపే కర్మోపాసనలు సేవింపవలయును; జ్ఞానోత్పత్తికితరువాత సేవింపఁగూడదు; తరువాతఁగూడ సేవించినట్టయిన, మందజ్ఞానము నశించును;మఱియు వృద్ధపక్షి కెట్లు అండసంబంధముచేత హానిగాదో, అటు దృఢబోధవంతునకు కర్మోపాసనలచేత హాని కాదు.

ఈవిధముగ జ్ఞానవంతునకు మోక్షముకొఱకు కించిన్మాత్రమును కర్తవ్యము లేదు. ఇది తృతీయప్రశ్నకుత్తరము చెప్పినారము.

## 279. ఉక్తార్థము సర్వవేదముయొక్క సారము.

ఓశిష్యుఁడా! ఏది నేను నీకు చెప్పితినో, అది సర్వవేదములసారముగా నున్నది; అందువలన దీనియందు నీవు విశ్వా

సము చేయుము; దీనిని ఎఱుఁగుటవలన అనాయాసముగా అపారమైనసంసృతి [జననమరణరూపసంసారము] యొక్కనాశమగును.

### 280. ఉక్తార్థముయొక్క సంగ్రహము 280—83

"జగత్తునకు కర్త ఈశ్వరుఁడు, వాఁడు నీకన్న భిన్నుఁడుగాఁడు; సచ్చిదానందరూపుఁడైన బ్రహ్మము నీవు." అనునీసంగతి ఆచార్యులు మొదట చెప్పియుండిరి; దానినే కృపచేసి, మఱియొకతీరున చెప్పనారంభించిరి.

ఓశిష్యుఁడా! నీవు దీనతయొక్క పరిత్యాగముచేయుము; నీస్వరూపమును చూడుము; ఓయి! నీవు శుద్ధబ్రహ్మముగానున్నావు; ఓయి! నీవు నీయజ్ఞానముచే జగత్తుయొక్క ఉత్పత్తిస్థితిసంహారములు చేసియును, నీవు స్వయము అవినాశివిగానున్నావు; ఇట్లుండఁగా ఈమిథ్యాప్రపంచమునుచూచి, యెందుకు భయపడుచున్నావు? ఓయి! నీవు సకలదేవతలకును దేవతగానున్నావు; నీవు సుఖరాశిగా నున్నావు; జీవుఁడు, జగత్తు, మఱియు ఈశుఁడు వీరిని నీమాయాయోగముచే నీవు ప్రకాశితులఁ జేయుచున్నావు; ఎట్లనఁగా—రజ్జు సర్పమును, శుక్తి రజతమును ప్రకాశము చేయును [సత్తాస్ఫూర్తియిచ్చును].

### 281. జ్ఞానసాధనములు

జ్ఞానమునకు సాధనములు చెప్పనారంభించిరి: ఓయి శిష్యుఁడా! రాగమును పరిత్యజించి, [1] లోభమును ఓడించి, ద్వేషమును కొట్టి, మారుని దూరము చేయుము. రాగాదుల గ్రహణమువలన సర్వరాజసతామసవృత్తులయొక్క గ్రహణ

1. విషయములందు దోషదర్శనమువలన రాగనాశ మగును; అర్థమునందు అనర్థము చూచుటవలన లోభనాశ మగును; కామాభావముచేత క్రోధ

ముచున్నది; కనుక సర్వరాజసతామసవృత్తుల నాశము చేయవలెను; ఇట్లు చెప్పుటవలన ఈయర్థము సిద్ధమగును—రాజసతామస వృత్తులు జ్ఞానమునకు విరోధులుగా నున్నవి; వానియొక్క నాశములేక జ్ఞానము గానేరదు; కాఁబట్టి వానినివృత్తి జిజ్ఞాసువునకు అపేక్షితముగా నున్నది.

వివేకము, వైరాగ్యము, శమాదిషట్కము, ముముక్షుత ఈనాలుగు జ్ఞానసాధనములు గలవు. వీనిలో వివేకము ప్రధానము; ఏల యన—వివేకముచే వైరాగ్యాదులైన ఉత్తరసాధనములు ఉత్పన్నమగును, ఆచార్యులు ఆ వివేకప్రకారము పలుక నారంభించిరి.

ఓశిష్యుఁడా! పారవారమైన సంసారమును మృగజలముతో సమానమని ఎఱుఁగుము. పారావారమని సంసారమునకు పేరు; అపారవారమని ఆత్మకు పేరు; పారవారము మిథ్యయగుటచే అపారవారము నిత్యమనువార్త అర్థముచే సిద్ధమగుచున్నది; ఐంద్రజాలికుని వినోదము చూచుపుత్రునితో తండ్రి చెప్పును— ఓపుత్త్రుఁడా! "ఈమామిడిచెట్టు మొదలుకొని ఏయనేకపదార్థములను ఐంద్రజాలికుఁడు చేయుచున్నాఁడో,

రూపద్వేషోత్పత్తి గాదు; మఱియుం పదార్థచింతనరూపమయిన సంకల్పముయొక్క అభావమువలన ఇచ్ఛారూపకామోత్పత్తి గానేరదు.

ఈరీతిగా రాజసతామసవృత్తులయొక్క నాశమునకు ఉపాయము శాస్త్రమువలన తెలియవలెను; లేక భాగవతైకాదశస్కంధము త్రయోదశాధ్యాయమునందు చెప్పఁబడిన దేశకాలాదిరూపములగు దశసాత్త్వికపదార్థములయొక్క సేవనమువలనసత్త్వవృద్ధిద్వారమున రాజసతామసవృత్తులయొక్క నాశమగును.

అవంతయు మిథ్యయే." ఇట్లు చెప్పుటవలన ఐంద్రజాలికుఁడు మిథ్య యని సిద్ధముగాదు; సత్యమని సిద్ధమగును; అట్లే జగత్తును మిథ్యయనుటచే ఆత్మ సత్యమని ఎఱుఁగవలయును; ఈయభిప్రాయమువలన ఆచార్యులు పారవారము మిథ్య యని పలికిరి. [ఈ విశేషోపదేశముచే వైరాగ్యము మొదలైన అన్యబహిరంగ సాధనములయొక్కయు నుపదేశ గ్రహణ మగుచున్నది].

ఇప్పుడు అంతరంగసాధనములను చెప్పుచున్నారు— ఓశిష్యుఁడా! జ్ఞానరూపమైన ఏ భానువు గలదో, దానిని శ్రవణముచే సంపాదించి, అజ్ఞానరూపమయిన తమమును నశింపఁజేయుము సుమా!

## 282. జ్ఞానముయొక్క స్వరూపము

జ్ఞానముయొక్కస్వరూపము అన్యశాస్త్రములందు [1] నానాప్రకారముగా అంగీకరింపఁబడినది అనుచితముగా ఎఱిఁగి, ఇచ్చట మహావాక్యానుసారముగా జ్ఞానముయొక్కస్వరూపమును పలుకనారంభించిరి: ఓశిష్యుఁడా! జీవేశ్వరులందుండు అవిద్యామాయాభాగమును విడిచి, జీవేశ్వరులందు ప్రతీతమయిన భేదమును ఛేదింపుము; మఱియు జీవేశ్వరులందు ఏ చైతన్యభాగము గలదో, దానిని భేదరహితమని ఎఱుఁగుము. ఇట్లనుటచే మహావాక్యములందు భాగత్యాగలక్షణవలన జీవేశ్వరులఏకత ఎఱుఁగు మని సూచించెను.

ఓశిష్యుఁడా! చల మనఁగా వినాశియయిన ఏ దేహాది సంఘాతము గలదో, అది నీవు గావు; అచల మనఁగా అవినాశి

1. సాంఖ్య న్యాయాది శాస్త్రములందు.

రైయున ఏ బ్రహ్మము గలదో, అది నీవుగా నున్నావు; చలదల ముగా వృక్షరూపమయిన [1] సంసారము, అది చలమునఁగా మిథ్యగా నున్నది; నభస్సునందు తలమలమునఁగా కటాహరూపత, నీలత నిజముగా ఉండుటలేదు; మిథ్యాప్రతీతమై యున్నది; అట్లు సంసారమును ఆత్మయందు నిజముగా లేదు; మిథ్యాప్రతీతముగ నున్నది.

[వృక్షరూపముచేత సంసారస్వరూపము శ్రుతిస్మృతులందు చెప్పఁబడినది; అందువలన ఇచ్చటను సంసారవిషయమందు వృక్షవాచకమైన చలదలశబ్దము ప్రయోగింపఁబడినది.]

**283.** అన్యప్రకారముగా మోక్షసాధనము జ్ఞానమునికథనము, జ్ఞానజ్ఞానిచిహ్నములు.

ఓశిష్యుఁడా! అజ్ఞాని, మఱియు జ్ఞాని ఈయిద్దఱికి బంధమోక్షరూపములగు రెండు ధామములు గలవు; వానిలో

1. సర్వముకన్న ఉత్కృష్టమైన మాయావిశిష్టపరబ్రహ్మము మూలము దేనికి, మహత్తత్త్వము అంకురము దేనికి, అహంకారము స్కంధము దేనికి, పంచతన్మాత్రలు శాఖలు దేనికి [పైఁజెప్పఁబడిన మహత్తత్త్వాదికములు అవన్నియు కార్యములగుటచే నికృష్టములగుటవలన క్రిందిశాఖలుగా చెప్పఁబడినవి;], మఱియు శాస్త్రాదికము ప్రరోచనవాక్యముచేత దానియొక్క అనిత్యతాది దోషములను మూసిపెట్టుచున్నది; కనుక శాస్త్రాదికము దేనికి పర్ణములు; నాలుగుపురుషార్థములు దేనికి రసము, ధర్మాధర్మములు దేనికి పుష్పములు, జన్మమరణాదిదుఃఖములు దేనికి ఫలములు, మఱియు అజ్ఞ జీవరూపపక్షి దేనికిభోక్త, వైరాగ్యముచేత తీక్ష్ణమైనజ్ఞానకుఠారము దేనికి ఛేదకము, ఇట్టిది సంసారరూప వృక్షముగ నున్నది. ఇత్యాద్యనేకప్రకారములచేత శాస్త్రములందు సంసారవృక్షవర్ణనము చేయఁబడియున్నది.

అజ్ఞానికి బంధధామము, జ్ఞానికి మోక్షధామము. రాగవిరాగములు వీనికి రెండుధ్వజములు, ఎట్లు ధ్వజము రాజనగరమునకు చిహ్నమో, అట్లు రాగవిరాగములు వీరిధామములకు చిహ్నములు. వానిలో అజ్ఞానిధామమునకు రాగచిహ్నము, జ్ఞానిధామమునకు విరాగచిహ్నము. ఓ ప్రియుఁడా! విషయమందు సత్యమతి, మఱియు విషయమందు భ్రమమతి అవి వాతమువలె రాగవిరాగరూపధ్వజములను చంచలముచేయుచున్నవి [విషయమందు సత్యమతి విరాగధ్వజమునకును, విషయమందు భ్రమమతి రాగధ్వజమునకును].

అజ్ఞానికిని విరాగము గలదు; అయినను, అజ్ఞానిజ్ఞానివిరాగములందు పరస్పరభేదము గలదు; చూడుము— అజ్ఞానియొక్క విరాగమేది గలదో, అది విషయమందు మిథ్యాబుద్ధిచే జనితముగాదు; కనుక మందము; యద్యపి శాస్త్రయుక్తిచేత అజ్ఞానియును మిథ్యయని ఎఱుఁగును; తథాపి విషయము మిథ్యయను నపరోక్షమతి జ్ఞానవంతునకే గలుగును; అజ్ఞానికిఁ గాదు; అజ్ఞానికి విషయమందు ఏ పరోక్షమైన మిథ్యాబుద్ధి గలదో, దానికన్న అపరోక్షసత్యబుద్ధి ప్రబలమగును; గనుక ఆ మిథ్యాబుద్ధిచేత ఆసత్యబుద్ధి దూరముగానేరదు; కాఁబట్టి అపరోక్షమిథ్యాబుద్ధి దృఢవిరాగమునకు హేతువు గాదు.

మఱియు అజ్ఞానికి విరాగము కేవలము విషయమందు మిథ్యాబుద్ధిచేతఁ గాదు; దోషదృష్టివలన నగును; జ్ఞానవంతుఁడు సర్వప్రపంచమును అపరోక్షరూపముచే మిథ్యయని ఎఱుఁగును; కాఁబట్టి రాగహేతువైన విషయమందుసత్యబుద్ధి యేది గలదో, అది జ్ఞానికిఁ గలుగదు; ఎట్లనఁగా—అపరోక్షమిథ్యాప్రతీతమైన

నట్టి రజ్జుసర్పమందు సత్యబుద్ధి మరల కానేరదు; ఈరీతిగా జ్ఞాని యొక్క విరాగము దృఢముగా నున్నది.

మఱియు అజ్ఞానికి విరాగము దోషదృష్టివలన నగును; ఆ యజ్ఞానజనితమగు ఏ విరాగము గలదో, అది స్థిరము కాఁజాలదు; ఏలయన—ఏపదార్థమునందు ఒకకాలమందు దోషదృష్టి యగునో, ఆ పదార్థమందే అన్యకాలమున సమ్యగ్దృష్టి యగును; ఎట్లనఁగా—సర్వపురుషులకు గ్రామ్యధర్మాంతకాలమందు స్త్రీవిషయమున దోషదృష్టి యగును; మఱియు కాలాంతరమున మరల సమ్యగ్దృష్టి యగును; ఎప్పుడు సమ్యగ్బుద్ధి యగునో, అప్పుడు ఆ విరాగమును దూరమగును; కనుక ఆ విరాగము [1] దృఢముగాదు;

ఈరీతిగా రాగము, విరాగము అజ్ఞానియొక్క, జ్ఞాని యొక్క చిహ్నములు ధ్వజరూపముచేత చెప్పఁబడినవి.

---

1. అజ్ఞానికి దృఢవిరాగముగాదు; ఈయభిప్రాయముచేత గీతయందు భగవంతుఁడు చెప్పియున్నాఁడు—

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 1 భ. గీ.

నిరాహారుఁడు [బాహిరమైన విషయమును విడిచినవాఁడు] దేహి [దేహధారియైన ఏజిజ్ఞాసువు ఉన్నాఁడో] వానికి రసవర్జితముగా విషయసంబంధముగల బాహ్యరాగము నివృత్తమయినది; అనఁగా—వానికి విషయములందు స్థూలరాగము ఏది గలదో, అది నివృత్తమైనది; అయినను రసశబ్దమునకు వాచ్యమైన వాసనారూపసూక్ష్మరాగము ఏది గలదో, అది మనస్సునందున్నదే యున్నది; ఆసూక్ష్మరాగమును పరబ్రహ్మదర్శనముచే నివృత్తమగుచున్నది.

మఱియును చిహ్నములను చెప్పుచున్నారు:—ఓ శిష్యుఁడా? ఎట్లు ధామముమీఁద సాంకేతికమైన హస్త్యాదికముయొక్క చిత్రములు వ్రాయఁబడునో, అట్లు బంధమోక్షధామరూపములైన అజ్ఞానిజ్ఞానులయొక్క అంతఃకరణములయందు సాక్ష్యసాక్షులు సాంకేతికచిత్రములుగా నున్నవి; అజ్ఞానియొక్క అంతఃకరణమందు సాక్ష్యరూపము, మఱియు జ్ఞానియొక్క అంతఃకరణమందు సాక్షిరూపము సాంకేతికచిత్రముగా నున్నది. [సాక్షికి విషయమయిన దేహాదిప్రపంచమును సాక్ష్యమందురు, తత్ప్రకాశకుఁడు సాక్షియందురు]; సాక్ష్యరూపచిత్రము మలినముగాను, సాక్షిరూపచిత్రము ఉజ్జ్వలముగాను ఉన్నది [మలిన మనఁగా జడరూపము, ఉజ్జ్వల మనఁగా ప్రకాశరూపము].

## 284. లక్షణాత్రయనిరూపణము

జహతి, అజహతి, భాగత్యాగము అను భేదమువలన లక్షణ త్రివిధముగ నున్నది. [ఇట్లు గురువు చెప్పినమీఁదట] "ఎట్లు సామాన్యబ్రాహ్మణజ్ఞానమయిన వెనుక సారస్వతకనోజాది విశేషజ్ఞానమగునో, అట్లు లక్షణాసామాన్యజ్ఞానమయిన వెనుక జహత్యాది విశేషరూపజ్ఞానమగును" అను నభిప్రాయముచేత శిష్యుఁడు ప్రార్థించుచున్నాఁడు:—

ఓ ప్రభో! లక్షణ యనఁగా నేమి? నేనేమియును నెఱుఁగను; మీరు కృపచేసి, దానిని సామాన్యవిశేషరూపసహితముగా నిరూపణము చేయుఁడు!

ఓ శిష్యుఁడా! పదముయొక్క అర్థముతో సంబంధము[1]

---

1. వత్సమునకు ఆవుతో సంబంధము గలదు; కావున దానికి అనేకగోమధ్యస్థితమైన తనతల్లియందు ప్రవృత్తి యగును; సంబంధములేక ప్రవృత్తి

ఏది గలదో, దానికి వృత్తి యందురు; అది శక్తివృత్తి, లక్షణావృత్తి భేదముచే ద్వివిధము; దానియొక్క విశదనిరూపణము చేయుచున్నాము—

---

గాదు. దానివలన వత్సముయొక్కయు, గోవుయొక్కయు పరస్పర జన్యజనక భావసంబంధము ఎఱుఁగఁబడును; ఆ జన్యజనకభావసంబంధజ్ఞానమునకు హేతువయిన వత్సమునకు గోవునందు ప్రవృత్తి ఏది గలదో, దానినిరూఢ సంబంధమందురు.

అట్లు శబ్దములకు తమతమయర్థములందు ప్రవృత్తియు సంబంధము లేక ఘటిల్లదు; కనుక శబ్దముయొక్క తనతన వాచ్యరూపార్థముతో, లేక లక్ష్యరూపార్థముతో వాచ్యవాచకభావరూపమగు, లేక లక్ష్యలక్షకభావరూపమగు సంబంధము ఎఱుఁగవలయును; ఈద్వివిధసంబంధమును స్మార్యస్మారకభావరూప సంబంధమనియు చెప్పుదురు; స్మరణయోగ్యమగుటవలన వాచ్యరూపార్థమును, లేక లక్ష్యరూపార్థమును స్మార్యమందురు; వాచకరూపము, లేక లక్షకరూపము అర్థమును స్మరింపచేయునదగుటవలన దానిని స్మారకమందురు.

ఈసంబంధముయొక్క జ్ఞానము చేయుహేతువైన శబ్దమునకు తనఅర్థమందు ప్రవృత్తి ఏది గలదో, అనియు శబ్దార్థములందు పరస్పరసంబంధము ఏది గలదో, తద్రూపముగా నున్నది; ఆ ప్రవృత్తిరూపసంబంధమును శబ్దముయొక్క వృత్తియందురు; ఆ వృత్తిరూపసంబంధము కొన్నిచోట్ల శక్తిరూపమగును; కొన్నిచోట్ల లక్షణారూపమగును; దీనిని ఆయాప్రసంగానుసారముగ ఎఱుఁగవలెను.

శాస్త్రమందు వృత్తి యను పేరు అంతఃకరణముయొక్క, లేక అవిద్యయొక్క పరిణామమునకుఁ గలదు; ఇట్లు వర్తనము చేయుందాని పేరును వృత్తియే; అట్లే జీవికయొక్క పేరును వృత్తియే; అట్లు ప్రాణులక్రియయొక్క నామమును వృత్తియే; అట్లే వ్యాకరణవిభాగము పేరు వృత్తియే; వీనిలో నేదియు వృత్తిశబ్దార్థము ఇచ్చట తెలియుటకు యోగ్యము గాదు; మఱి

### 285. న్యాయమత ప్రకారముగ శక్తిలక్షణము—ఈశ్వరేచ్ఛ.

ఈపదమునకు ఈయర్థము కావలయు నని ఈశ్వరేచ్ఛ యేది గలదో, దానిని న్యాయమతమందు శక్తి యందురు; ఎట్లనఁగా ఘటపదమువినఁగా—కంబుగ్రీవాదిలక్షణముగలకలశము యొక్క బోధ కావలయును; ఇట్టి ఈశ్వరేచ్ఛ గలదు; అదే పదమందుశక్తి.

### 286. స్వమత ప్రకారముగ శక్తిలక్షణము— పదమునందు అర్థజ్ఞానసామర్థ్యము.

పదమునందు అర్థబోధకసామర్థ్యమును [1] వేదాంతమతమునందు శక్తి యందురు; ఎట్లు ఘటపదముయొక్క శ్రోతకు

---

మనఁగా—శబ్దమునకు అర్థముతో ఏ సంబంధము గలదో, అదియే ఇచ్చట వృత్తిశబ్దముయొక్క అర్థముగా ఎఱుఁగవలయును. ఈశబ్దార్థవృత్తియొక్క వర్ణనము వేదస్తుతిసాన్వయార్థదీపికయందును, వృత్తిరత్నావళియందును వ్రాయఁబడినది.

1. శబ్దమునందు తనయర్థముయొక్క జ్ఞానముచేయుసామర్థ్యము గలదు; దానిని శబ్దశక్తి యందురు; ఆ శబ్దముయొక్క శక్తి కపాలద్వయమధ్యస్థితమగు కపాలసంయోగమువలె. మఱియు కార్యకారణాదికముయొక్క మధ్యమందుండు సమవాయసంబంధమువలె, లేక తాదాత్మ్యసంబంధమువలె శబ్దము, మఱియు అర్థము ఈరెండింటిమధ్యమందు గలదు; కాఁబట్టి అశక్తిరూపమైన వృత్తి [శక్తివృత్తి] శబ్దమునకు అర్థముతో ఏసాక్షాత్సంబంధము గలదో, అ ద్రూపముగా చెప్పఁబడినది; అశక్తివృత్తియోగము, రూఢి, మఱియు యోగరూఢి [ఉభయరూపము] ఈభేదమువలన మూఁడువిధములుగా నున్నది. ఎట్లో—

(1) ఏశబ్దములందు తమతమ అవయవములయోగము [మేళనము] వలన అర్థజ్ఞానముచేయు సామర్థ్యము గలదో, ఆశబ్దములకు తమ అర్థముతో యోగశక్తిరూపసంబంధము గలదు; దానిని శబ్దము యొక్క యోగవృత్తి యందురు; ఉదాహరణము—"పాదరక్షా" ఈసంస్కృతశబ్దమందు పాద, మఱియు రక్షా ఈరెండవయవములు గలవు; ఈ రెండుఅవయవములుగూడి, సిద్ధమాయిన ఏ పాదరక్షాశబ్దము గలదో, దానియందు చరణముయొక్క రక్షణముచేయునది, ఇట్టి అర్థజ్ఞానముచేయు సామర్థ్యము గలదు గనుక పాదరక్షాశబ్దమునకు తన పాదత్రాణరూపార్థముతో యోగశక్తిరూపమైన సంబంధము గలదు.

(2) ఏపదమునకు అవయవముచేత అర్థజ్ఞానము గానేరదో, మఱే మనఁగా—ఈపదమునకు ఈయర్థము గావలయును; ఇట్టిసంకేతము [పరిభాష]ఏపదమందు గలదో, ఆపదమునకు తనదగుఅర్థముతో రూఢిశక్తిరూపమైన సంబంధము గలదు; అది శబ్దము యొక్క రూఢివృత్తియని చెప్పఁబడినది; ఉదాహరణము—జ్యోతిశ్శాస్త్రమందు బాణశబ్దము గలదు; దానియొక్క అవయవముచేత ఏమియు అర్థజ్ఞానము గానేరదు; మఱేమనఁగా బాణశబ్దమునకు పంచసంఖ్యారూపమె అర్థము గావలయును; ఇట్టు ఏజ్యోతిశ్శాస్త్రకారునియొక్క సంకేతము గలదో, అది బాణశబ్దమునకు తనపంచసంఖ్యారూపమైన అర్థముతో రూఢిశక్తిరూపమైన సంబంధము.

(3) ఎచ్చట శబ్దముయొక్క అవయవముచేత అర్థజ్ఞానమై, దానిలో లోకసంకేతమును సిద్ధమగునో, అచ్చట ఆశబ్దము తనయర్థముతో యోగరూఢిశక్తి గలదిగా నున్నది; అది పదముయొక్క ఉభయరూపవృత్తి చెప్పఁబడినది; ఉదాహరణము—పంకజపదము

కలశరూపార్థజ్ఞానముచేయు సామర్థ్యము ఏది గలదో, అదియే ఘటపదమునందలి శక్తిగా నున్నది; మఱియు పటపదమునందు వస్త్రరూపజ్ఞానము చేయుసామర్థ్యము ఏది గలదో, అదియే పటపదమునందు శక్తిగా నున్నది; ఎట్లు వహ్నియందు తనతోఁ గూడఁగానే వస్తువుల దహించునట్టి సామర్థ్యము శక్తియందురో, అట్లు శ్రోతయొక్క కర్ణములఁగూడఁగానే వస్తుజ్ఞానము చేయునట్టిదైన పదమునందలి సామర్థ్యమును శక్తి యందురు.

అగ్నియందు దాహముచేయుట, జలమునందు ఆర్ద్రము చేయుట, తృషాశాంతిచేయుట అట్లు సర్వపదార్థములందును తమతమకార్యములను చేయుట యను ఏ సామర్థ్యము గలదో, దానిని వేదాంతమున శక్తి యందురు; దానినే నీవు నిశ్చయమును గొనుము; మఱియు న్యాయాదులయొక్క రీతి త్యాజ్యమని తెలిసికొనుము.

---

గలదు; దానియొక్క అవయవములయిన "పంక" మఱియు "జ" ఈరెంటికి యోగముచేత "బురదయందు పుట్టినది" అను కమలరూపమైన అర్థముయొక్క జ్ఞానమగును; మఱియు బురదయందు పుట్టిన ఏనుఁదూకకీటకాదులు గలవో, వానిని పంకజమనఁగూడదు; మఱేమనఁగా—కమలమునే పంకజ మనవలయును; ఇట్లు పంకజశబ్దమందు జనులసంకేతమును గలదు; కనుక పంకజశబ్దమునకు తనఅర్థముతో ఉభయశక్తిరూపమగు సంబంధము గలదు.

ఈరీతిగా చెప్పఁబడిన శబ్దముయొక్క త్రివిధమైన శక్తివృత్తి ఏది గలదో, దానిని ముఖ్యవృత్తి యని యందురు.

**287.** ప్రశ్న—పదసమువాయముకన్న భిన్నశక్తిలేదు; కనుక ఈశ్వరేచ్ఛయే శక్తిగా కనఁబడుచున్నది.

ఓభగవంతుఁడా! వహ్నియందు దానిస్వరూపముకన్న భిన్నమైనశక్తి గనఁబడదు; "దాహసామర్థ్యము వహ్నియందలి శక్తి" యని మీరుచెప్పితిరి; అది ఘటింపదు; ఏలయన— దాహముయొక్క హేతుత [జనకత] కేవలవహ్నియందే యున్నది; అప్రసిద్ధసామర్థ్యమును వహ్నియం దంగీకరించి, దాని యందు హేతుత అంగీకరించుట, మఱియు ప్రసిద్ధహేతుత విడుచుట నిష్ప్రయోజనముగఁ దోఁచుచున్నది.

అట్లె పదమునందును వర్ణసముదాయమైన పదస్వరూప ముకన్న భిన్నమైన శక్తి గనఁబడదు; మఱియు దానియొక్క ప్రయోజనమును లేదు; అందువలన ఈశ్వరేచ్ఛారూపమగు శక్తి న్యాయమతమునందు అంగీకరించుచున్నారు; అదియే నాకు సమీచీనముగాఁ దోఁచుచున్నది?

**288.** 287—గతప్రశ్నకుత్తరము—అగ్న్యాదులందు దాహశక్తి ప్రతిపాదనము

ఓప్రియుఁడా! ప్రతిబంధకపదార్థముండుటవలన అగ్ని చేత దాహము గానేరదు; మఱియు ఉత్తేజకపదార్థమును సమీపమునుంచిన, ప్రతిబంధకముండినను,సన్నిహితపదార్థముయొక్క దాహ మగుచున్నది; కేవలాగ్నికి దాహహేతుత యుండిన యెడల, సర్వకాలమందును [ఉత్తేజకరహితమైన ప్రతిబంధక సత్త్వకాలమందును] సన్నిహితపదార్థముయొక్క దాహము

గావలయును; ఏలయన దాహహేతువైన కేవలాగ్నియో ఆ కాలమునందు విద్యమానముగా నున్నది.

వేదాంతమతములో ఈదోషము లేదు; ఏలయన— దానియందు అగ్నిశక్తి, లేక శక్తిసహితాగ్ని దాహమునకు హేతువుగా నున్నది; కేవలాగ్ని గాదు, యద్యపి ప్రతిబంధకముచేత అగ్నియొక్క నాశము, లేక తిరోధానము గాదు; తథాపి అగ్నిశక్తియొక్క నాశము, లేక తిరోధానము అగుచున్నది. గనుక ఆప్రసంగమునందు దాహహేతువైన శక్తియొక్క, లేక శక్తిసహితాగ్నియొక్క అభావమగుటవలన దాహము గానేరదు.

ప్రతిబంధకముయొక్క సమీపము ఉత్తేజకము వచ్చినట్టయిన; అప్పుట ప్రతిబంధకముచేతనో, అగ్నిశక్తియొక్క నాశము, లేక తిరోధానము అగుచున్నది; అయిన, ఉత్తేజకముచేత మరల శక్తియొక్క ఉత్పత్తి, లేక ప్రాదుర్భావము అగుచున్నది; కాబట్టి ప్రతిబంధక మున్నను, ఉత్తేజకముయొక్క ప్రభావము వలన దాహహేతువైన శక్తి, లేక శక్తిసహితాగ్ని ప్రకటముగుటవలన సన్నిహితపదార్థముయొక్క దాహ మగుచున్నది.

ఓబాలకుఁడా! ప్రతిబంధకమువలన నష్టమగునట్టిది, ఉత్తేజకమువలన ప్రకటమగునట్టి ఏది అజ్ఞాతతత్త్వముగలదో, అదియే దాహహేతుశక్తియని తెలియుము. [కార్యమునకేది విరోధియో, అది ప్రతిబంధక మనఁబడును; మఱియు ప్రతిబంధకమున్నను, ఏది కార్యమునకు సాధకమో, అది ఉత్తేజక

ముసఁబడును]; అగ్నిస్థానంబునందు ప్రతిబంధకములు, ఉత్తేజకములు[1] మణిమంత్రౌషధములుగా నున్నవి.

ఓశిష్యుఁడా! వహ్నివలె జలాదిసర్వపదార్థములందును నీవు శక్తిని తెలియుము; ఏలయన-శక్తిలేక ఏ హేతువుచేతను ఏ కార్యమును కానేరదు.

## 289. న్యాయమతశక్తి ఖండనము

న్యాయమతమునందు ఈశ్వరేచ్ఛారూపమని పదశక్తిని ఏది చెప్పితిరో, అది ఘటిల్లదు; ఏలయన—ఈశ్వరునియొక్క ఇచ్ఛ[2] ఈశ్వరధర్మముగా నున్నది; అది ఈశ్వరునియందుఁ

1. దేనిచేత అగ్నిస్థితమైన దాహశక్తియొక్క నాశము, లేక తిరోధానము అగునో, అట్టు ఉత్తేజకరూపమగు మణిమంత్రౌషధములు గలవు; వానివలన అగ్నిశక్తియొక్క ఉత్పత్తి, లేక ప్రాదుర్భావము గలుగును, ఇట్టి ప్రభావము శికరనాథాది పదార్థములందు ప్రసిద్ధము.

ప్రతిబంధకపదార్థముయొక్క సద్భావకాలమందు దాహకారకశక్తి ప్రజ్వలితాగ్నియందుఁ గలుగదు; మఱియు ఉత్తేజకపదార్థముయొక్క సద్భావకాలమందు మరల శక్త్యుద్భవమగును; ఇట్టిది శక్త్యనుభవము శికరనాథాదిపదార్థములయొక్క వినోదముచూచువారైన జనులకగును. ఓయీ శిష్యుఁడా! ఆ అనుభవమును నీవు లేదని ఎట్లు చెప్పఁగలవు?

2. ఈశునిఇచ్ఛ ఈశునిధర్మమగుటవలన నది ఈశాశ్రితమై, యాశసమీపమందుండును; ఉక్తప్రకారముగా ఈశసంబంధియగుటవలన నది ఈశశక్తి యని సిద్ధమగును; గాని, ఈశేచ్ఛ ఘటాదిపదములధర్మముగామివలన పదసమీపము రాదు; సంబంధియును గాదు; అందువలన నది పదములశక్తి యని సిద్ధముగాదు. కులాలునకు ఘటముచేయుం ఇచ్ఛగలదు, అది కులాలుని ధర్మముగాని, ఘటధర్మముగాదు; అట్టు "ఈఘటపదమునకు ఈకలశరూపా-

గలదు; ఎది ధర్మమో, అది ధర్మియం దుండును; ధర్మిని విడిచి, ఇతరస్థానమం దుండదు; ఈరీతిగా ఈశ్వరేచ్ఛ అనునది పదము యొక్క శక్తియనుట ఘటిల్లదు; కాఁబట్టి పదములందుండు సామర్థ్యమే పదములశక్తి యనఁబడును; ఈశ్వరేచ్ఛ పదములయొక్క సమీపమందును లేదు; ఆ యీశ్వరేచ్ఛ పదములయొక్క శక్తి ఎట్లగును ? కాఁజాలదని యభిప్రాయము.

## 290. వ్యాకరణమతశక్తిలక్షణము— పదమునందు అర్థజ్ఞానయోగ్యత.

ఘటపదమునందు కలశరూపార్థజ్ఞానముయొక్క హేతుకారూపయోగ్యత ఉండునట్లు సకలపదమునందును అర్థజ్ఞానముయొక్క యోగ్యత ఏది గలదో, అదే శక్తి యని వ్యాకరణాచార్యులు చెప్పుచున్నారు; [వైయాకరణభూషణ గ్రంథమందు హరికారికాప్రమాణము వ్రాసి, [1] ఈరీతిగానే శక్తిలక్షణము చెప్పఁబడియున్నది].

---

ర్థము గావలయును" అనుసంకల్పపూర్వకమగు ఈశ్వరేచ్ఛ ఏది గలదో, అది ఈశధర్మమగుటవలన ఈశునిశక్తిగా నున్నది; అది పదములధర్మముగా మివలన పదములశక్తియును గాదు.

1. వైయాకరణభూషణగ్రంథమునందు హరికారికయనునది హరిపండితకృతగ్రంథము; దానియొక్క ప్రమాణముచూపి, శక్తిలక్షణము మూలగ్రంథమునందు వ్రాసినప్రకారముగ చెప్పఁబడినది; మఱియు మంజూషాగ్రంథమందు యోగభాష్యమురీతిగా పదమునకు అర్థముతో తాదాత్మ్యసంబంధమును శక్తియందురు; ఈశక్తియొక్క ఖండనము ముందు భట్టమతప్రసంగమందు చెప్పుచున్నాము.

## 291. వ్యాకరణోక్తశక్తియొక్క ఖండనము

ఓశిష్యుఁడా! అర్థజ్ఞానమునకు హేతుతారూపమైన యోగ్యతను ఎవఁడు శక్తి యనునో, వాని నిట్లడుగుము:—నీ మతములో పదమునందు సామర్థ్యమున్నదా? లేదా?

సామర్థ్యమున్నదనిన పక్షమందు, మామత ప్రకారము శక్తియే సిద్ధమగుచున్నది. పదమునందు సామర్థ్యము గలదని నపుడు, లోకమందు ప్రసిద్ధమైన సామర్థ్యరూపశక్తియే పదము నందు అంగీకరించుట యోగ్యము; అర్థజ్ఞానజనకతారూప యోగ్యతను శక్తియని యంగీకారము అయోగ్యము.

దీనియభిప్రాయమేమనఁగా- ఎవఁడు పదమునందు సామ ర్థ్యము నంగీకరించునో, వానికి సామర్థ్యముకన్న భిన్నరూప మయినశక్తిని అంగీకరించుట యోగ్యముకాదు; ఏలయన— సామర్థ్యము, బలము, పరాక్రమము, శక్తి ఈనాలుగుపేళ్లు ఏక వస్తువునకే లోకమునందు ప్రసిద్ధము; శక్తిహీనమును సామర్థ్య హీన మందురు; ఈరీతిగా సామర్థ్యముయొక్కయు, శక్తి యొక్కయు, ఏకత లోకమునందు ప్రసిద్ధము; మఱియు వహ్ని యందును సామర్థ్యరూపశక్తిని అంగీకరించుట యోగ్యము; పదమునందు సామర్థ్య మంగీకరించి, దానికన్న భిన్నమయిన యోగ్యతను శక్తి యనుటయందు కేవలము లోకప్రసిద్ధవిరో ధముదప్ప, వేఱొక్కఫలము లేదు.

అందువలన—"సామర్థ్యమునే మేము యోగ్యత యను చున్నాము." అప్పుడు మామతమే సిద్ధమగును.

మఱియును ఇట్లనును.—"మేము సామర్థ్యము నంగీక రింపము; మఱేమనఁగా—అర్థజ్ఞానజనకతారూపమయిన యోగ్యతయే శక్తిగా నంగీకరింతుము." వాని నిట్లడుగవలయును—సామర్థ్యముయొక్క అభావము కేవలము పదమునందే యంగీక రింతువా? లేక వహ్న్యాదిసకలపదార్థములందును అంగీక రింతువా?

రెండవపక్షము చెప్పిన, వహ్న్యాదిపదార్థములందు సామర్థ్యరూప శక్తియొక్క ప్రతిపాదనమందు ఉక్తమయిన యుక్తి వలన ఆ సామర్థ్యాభావపక్షము ఖండింపఁబడినది.

మఱియు ప్రథమపక్షము చెప్పినట్టయిన; దానియందు ద్వితీయపక్షోక్తదోషము లేదు; అట్లయినను, పదమునందును వహ్నియందువలె సామర్థ్యముయొక్క యంగీకారము అవశ్యము; ఏలయన—పదమునందు సామర్థ్యాంగీకారము చేయనిపక్షమందు ఏది యసమర్థపదము గలదో, అది అర్థజ్ఞానమునకు జనకముగా నున్నదనుట, అర్థజ్ఞానముయొక్క జనకతారూపయోగ్యత పదము నందున్నదనుట షండునకు అమోఘవీర్యమున్న దనున్యాయము న సవిరోధముగా నున్నది; ఏలాగున నఁగా—సామర్థ్యముతోఁగూడిన దానిపేరు సమర్థమని, లేనివానిపేరు అసమర్థమని, అసమర్థముచేత ఏకార్యమును గానేరదని లోకమునందు ప్రసిద్ధము; కాఁబట్టి అసమర్థపదమువలన అర్థజ్ఞానరూపమయిన కార్యము ఘటిల్లదు.

అందువలన పదమునందు సామర్థ్య మంగీకరించుటయే యోగ్యము; ఏరీతిగాను సామర్థ్యమువదలి, అర్థజ్ఞానజనక తా

రూపయోగ్యత [1] పదమునందలి శక్తి యనఁగూడదు; మఱే మనఁగా—సామర్థ్యరూపమే శక్తి యనఁబడును.

## 292. భట్టమతరీతిగా శక్తిలక్షణము— పదమునకు అర్థముతో భేదాభేద తాదాత్మ్యము.

పదమునకు అర్థముతో ఏ తాదాత్మ్యసంబంధము గలదో, దానిని భట్టమతమునందు శక్తియందురు; ఆ తాదాత్మ్యమును భేదాభేదరూప మందురు. అభిప్రాయము — అగ్నిపదమునకు అంగారమను అర్థముతో అత్యంత భేదము లేదు; అత్యంత భేద మునిన, ఎట్లు అగ్నిపదమువలన అగ్నిపదముకన్న అత్యంతభిన్న మైన జలాదికముయొక్క ప్రతీతి గానేరదో, అట్లు అగ్నిపదము వలన అంగారరూపార్థముయొక్కయు ప్రతీతి గాఁగూడదు గదా!

ఎట్లు పదమునకు తనఅర్థముతో అత్యంతభేదము లేదో, అట్లు అత్యంతాభేదమును లేదు; అత్యంతాభేద మైనట్లయిన, ఎట్లు అగ్నిపదమునకు వాచ్యమైన అంగారము, దానిచేత దాహ మగునో, అట్లు అంగారముయొక్క వాచకమైన అగ్నిపదము నుచ్చరించుటవలన నాలుక కాలవలెను; అది కాలదు; ఈవిధ ముగా అత్యంతాభేదమును లేదు; మఱేమనఁగా—భేదసహితా భేదము గలదు.

---

1. భర్జితబీజన్యాయమున సామర్థ్యహీనపదములందు అర్థజ్ఞానజనకత రూప యోగ్యతయొక్క అభావము గలుగుటవలన యోగ్యత పదమునందు శక్తిగాదు; అయిన ఆ యోగ్యత ఏ సామర్థ్యముచేత అగునో, ఆ సామర్థ్యమే లోకప్రసిద్ధశక్తి.

భేదముండుటవలన దాహము గానేరదు;అభేదముండుట వలన అగ్నిపదముచే జలాదిప్రతీతి గానేరదు; అంగారప్రతీతియే యగును; ఎట్లు అగ్నిపదమునకు అంగారరూపార్థముతో భేద సహితాభేదము గలదో, అట్లే ఉదక వన జల జీవనపదములకును నీళ్లు అను అర్థముతో భేదసహితాభేదము గలదు.

ఈవిధముగా సకలస్థానమునందును తమతమవాచ్యముల తో వాచకపదములకు భేదసహితాభేదము గలదు; ఈ భేదసహితాభేదమునకే భట్టమతానుసారులు తాదాత్మ్యసంబంధమని చెప్పుదురు; ఆ భేదాభేదరూపతాదాత్మ్యసంబంధమే సకలపదములందు అర్థబోధకశక్తి యందురు; ఈ తాదాత్మ్యసంబంధముకన్న భిన్నమగు సామర్థ్యరూపశక్తి యనరు. ఆ భేదాభేదమందు ప్రమాణమును చూపుదురు.

మాండూక్యాది వేదవాక్యమునందు "ఓమ్" అక్షరము బ్రహ్మ మనఁబడును; అచ్చట వ్యాకరణరీతిగా ప్రకాశరూపమయిన సర్వరక్షకమని ఓమక్షరమునకు అర్థమగుచున్నది; ఇట్లు బ్రహ్మమున్నది; కనుక ఓంకారము బ్రహ్మమునకు వాచకము, బ్రహ్మము వాచ్యము;వాచ్యవాచకములకు పరస్పరము అత్యంత భేద మయినట్లయిన, వాచకమయిన ఓంకారమునకును, వాచ్యమైన బ్రహ్మమునకును మాండూక్యాదులందు అభేదము చెప్పఁబడియుండదు; ఈరీతిగా వాచ్యవాచకములయొక్క అభేదమునందు వేదము ప్రమాణము.

మఱియు సకలజనులయొక్క అనుభవముచేతనో, వాచ్యవాచకములభేదము ప్రసిద్ధముగా నున్నది; ఎట్లనఁగా— అగ్న్యాదికపదములు వాణియందున్నవి? మఱియు అంగారాద్య

ర్థములు ఘటాద్యాదికములలం దున్నవి; అట్లు ఓంకారపదము వాణి యం దున్నది; తదర్థమైన బ్రహ్మము వాణికన్న బాహ్యము తన మహిమయందున్నది. యద్యపి బ్రహ్మము వ్యాపకముగానుండుట వలన వాణియందు బ్రహ్మముయొక్క అభావమనుట ఘటిల్లదు; తథాపి బ్రహ్మమునందు వాణియున్నది; కాని, వాణియందు బ్రహ్మము[1] లేదు.

ఈరీతిగా సర్వజనులకు పదము వాణియందును, అర్థము వాణికన్న బాహ్యమునను ప్రతీతమగుటవలన పదమునకును, అర్థమునకును భేదము లోకమునందు ప్రసిద్ధముగా నున్నది.

అన్యస్థానమందును భేదాభేదరూపతాదాత్మ్యసంబంధము చూపుచున్నారు; చూడుము—

రూపరసగంధాదులు గుణము లందురు; వీని కాశ్రయమయిన తేజోజలపృథివ్యాదులను గుణు లందురు; అనేకధర్ములం దుండునట్టి ఒకధర్మమును జాతియందురు; ఎట్లనగా—అనేక బ్రాహ్మణులందు ఒకబ్రాహ్మణత్వము, అనేకజీవులందు ఒకజీవత్వము, అనేకఘటములందు ఒకఘటత్వము; జాతియొక్క ఆశ్రయమయిన ఏ బ్రాహ్మణాదులు గలరో, వారిని వ్యక్తియందురు; గమనాగమనాదులను క్రియయందురు; క్రియకు ఆశ్రయమయిన దానిని కర్తయందురు; ఇట్లు గుణిగణములకు, జాతివ్యక్తులకు,

1. ఘటము న్యూనదేశమం దుండుటవలన వ్యాప్యము, ఆకాశము అధిక దేశమందుండుటవలన వ్యాపకము; వ్యాప్యము అంతరముగాను,వ్యాపకము బాహిరముగాను ఉన్నది; అట్లు వాణి బ్రహ్మముకన్న న్యూన దేశమందుండుటచే వ్యాప్యమగుటవలన బ్రహ్మములో నున్నది; మఱియు బ్రహ్మము వాణికన్న అధికదేశమందుండుటచే వ్యాపకమగుటవలన వాణికన్న వెలుపలగా నుండును.

క్రియాకర్తలకు, కారణకార్యములకు తాదాత్మ్య సంబంధము గలదు; నిమిత్తకారణమునకును, కార్యమునకును తాదాత్మ్యము లేదు; అత్యంతభేదమే గలదు; అయినను, ఉపాదానకారణమునకు కార్యముతో తాదాత్మ్యసంబంధము గలదు; ఎట్లనఁగా— నిమిత్తకారణములైన కులాలదండాదులకు ఘటాదిరూపకార్యముతో అత్యంతభేదము గలదు; అయినను, ఉపాదానకారణమైన మృత్పిండమునకు ఘటముతో తాదాత్మ్యసంబంధము గలదు.

మృత్పిండముకన్న ఘటము అత్యంతభిన్నమైనట్టయిన, ఎట్లు తనకన్న అత్యంతభిన్నమైన తైలముయొక్క ఉత్పత్తి మృత్పిండముచేతఁగానేరదో, అట్లు ఘటోత్పత్తియుఁగాఁగూడదు గదా! అత్యంతాభేదపక్షమందును మృత్పిండముచేత ఘటోత్పత్తి గాఁగూడదు; ఏలయన— తనచేత తనయుత్పత్తి గానేరదు.

ఈరీతిగా నుపాదానకారణకార్యములకు భేదాభేదము సిద్ధమయినది; మఱియు ప్రతీతిచేతను ఉక్తభేదాభేదము సిద్ధముగా నున్నది; చూడుము— "ఈమృత్పిండ మున్నది. ఈఘటమున్నది" ఈరీతిగా భిన్నప్రతీతివలన భేదము సిద్ధమగుచున్నది; మఱియు విచారము చేసిచూచినట్టయిన, ఘటముయొక్క బాహ్యాభ్యంతరములందు మృత్తికకన్న భిన్నమైన ఏవస్తువును ప్రతీతము గానేరదు; ఈప్రకారముగా అభేదము సిద్ధమగుచున్నది.

అట్లు గుణిగుణములకును తాదాత్మ్యసంబంధము గలదు; చూడుము— నీలపీతాది ఘటరూపమునకు ఘటముతో అత్యంతభేదమయినపక్షమందు, ఎట్లు పటమునకు ఘటముతో అత్యంతభేదమగుటవలన పటము ఘటాశ్రితము గానేరదో, మఱే

మునఁగా—స్వతంత్రముగా నున్నదో, అట్లు ఘటముయొక్క నీలపీతాదిరూపములకు ఘటముతో అత్యంతభేద మగుటవలన ఆరూపమును ఘటాశ్రితము గాఁగూడదు; పటమువలె స్వతంత్రముగా నుండవలసివచ్చును; అత్యంతాభేద మయినపక్షమందును రూపముచేత ఘటాశ్రితము గాకుండవలసివచ్చును, ఏలయన— తనకుతాను ఆశ్రయమగుట ఘటిల్లదు; అట్లు కార్యకారణజాతి వ్యక్తి క్రియాకర్తృప్రభృతులకును పరస్పరము భేదాభేదరూప తాదాత్మ్యసంబంధము [1] గలదు.

---

1. అభావము, సాదృశ్యము వీనికి అన్యమయి, ప్రతియోగిని అపేక్షించి జ్ఞానమునకు విషయముగానుండునది సంబంధమని చెప్పఁబడును; దేనియందు ఏది చేరుచున్నదో, అట్టి చేరఁబడినవస్తువు సంబంధమునకు అనుయోగియనియు, చేరునట్టివస్తువు సంబంధమునకు ప్రతియోగియనియు చెప్పఁబడును; ఈసంబంధము అనేకవిధమైనను, ముఖ్యముగా 1. సంయోగము 2. సమవాయము 3. తాదాత్మ్యము అనెడు మూఁడుసంబంధములు చెప్పఁబడుచున్నవి—

(1) రెండుద్రవ్యములసంబంధము సంయోగసంబంధమగును; ఇది త్రివిధము—i. కర్మజసంయోగము ii. సంయోగజసంయోగము iii. సహజసంయోగము—

1. దేనిఉత్పత్తియందు క్రియ అసమవాయికారణముగా నున్నదో, అది కర్మజసంయోగము; ఇది ద్వివిధము—i. అన్యతరకర్మజము ii. ఉభయకర్మజము.

1. ఒకదానిక్రియవలన ఉత్పన్నమగునది అన్యతరకర్మజము—పక్షియెగురుటవలన పక్షికి వృక్షమునకు కలిగినసంబంధము అన్యతరకర్మజము.

2. రెండువస్తువులక్రియచేత సంబంధమగునది ఉభయకర్మజము—రెండుమేకలు తగులుటచేత కలిగినసంబంధము ఉభయకర్మజము.

2. సంయోగరూపాసమవాయికారణముచే కలుగునది సంయోగజ సంయోగము—హస్తమును వృక్షముపయిన ఉంచుటచే శరీరమునకు వృక్షమునకు కలుగుసంబంధముసంయోగజసంయోగము.

3. జన్మమందేయుండుసంబంధము సహజసంయోగము—సువర్ణమందు పార్థివభాగమునకు, తైజసభాగమునకు ఉండుసంబంధము సహజసంయోగము.

(2) నిత్యసంబంధమునకు సమవాయసంబంధ మని పేరు; న్యాయమతమందు గుణగుణులకు, జాతివ్యక్తులకు, క్రియాకర్తలకు, కారణకార్యములకు ఉండుసంబంధము సమవాయము.

3) న్యాయమతమందు సమవాయసంబంధ మని చెప్పఁబడినదానికి పేరు తాదాత్మ్యము. పూర్వమీమాంసావార్తికకారులయిన భట్టులమతమందు భేదసహితాభేదమునకు తాదాత్మ్యమని పేరు. వేదాంతసిద్ధాంతమందు భేదాభేదవిలక్షణమయినదానిని తాదాత్మ్యసంబంధమందురు. గుణిగుణాదులయందు న్యాయమతములో సమవాయసంబంధము చెప్పియుండఁగా భట్టమతమందు, వేదాంతమతమందు తాదాత్మ్యసంబంధమని చెప్పఁబడును. ఆతాదాత్మ్య సంబంధము త్రివిధము—

1. సహజతాదాత్మ్యము—చిత్తు, అహంకారమందు ప్రతిబింబించి, ఆ ప్రతిబింబము, అహంకారము కలిసి, తప్తాయఃపిండమువలె ఏకరూపమై, అగుపడునది, ఆ చిత్ప్రతిబింబముతోడనే కలుగు కొనియుండు అహంకారమునకు సహజతాదాత్మ్య మని పేరు; పుట్టినప్పుడే రెండును కలిసిపుట్టినందున ఈరెంటియొక్క తాదాత్మ్యము, సహజతాదాత్మ్యమని చెప్పఁబడును.

## 293. భట్ట [1] మతశక్తిఖండనము

ఒకఘటమునందు తనఅభేదము గలదు; ఇతరుల భేదము గలదు; అట్లయినను, దేనియభేదము గలదో, దానిభేదము గలుగదు; మఱియు దేనిభేదము గలదో, దానియభేదము గలుగదు; ఈయభిప్రాయముచేత ఒకేవస్తువునకు భేదము, అభేదము విరుద్ధమని చెప్పఁబడియున్నది; ఏలయనఁ—ఆ భేదాభేదములు తమలో తాము విరోధులుగా నున్నవి; రెండువిరోధిపదార్థములు ఏకకాలమునందు ఏకస్థానమందుండుట లేదు; కాఁబట్టి వాచ్యవాచకాదులయిన సకలస్థానములందు భేదాభేదరూపమయిన తాదాత్మ్యసంబంధమును అంగీకరించుట కేవలవిరుద్ధము.

---

2. కర్మజతాదాత్మ్యము—చిత్తు ప్రతిబింబము ఈరెంటితో కలసినది కాని, చిత్తువలె ప్రకాశించెడు అహంకారమునకు స్థూలశరీరముతో కలిగినసంబంధము కర్మజతాదాత్మ్య మనఁబడును; జాగ్రద్భోగహేతువయిన కర్మము పుట్టినప్పుడే ఆ కర్మజతాదాత్మ్యము పుట్టును; కర్మము నష్టమైనపుడు కర్మజతాదాత్మ్యము నష్టమగును; కర్మము ఉండువరకుమాత్రము ఉండును; జాగ్రత్స్వప్నములను చూడుము.

3. భ్రాంతిజతాదాత్మ్యము—నేను బ్రాహ్మణుఁడను, నేను శూద్రుఁడను, నేను బ్రహ్మచారిని, నేను సన్న్యాసిని అనెడు చిత్తవృత్తిచే కలసిన యహంకారమునకును సాక్షికిని గలిగిన తాదాత్మ్యము భ్రాంతిజతాదాత్మ్యము; ఆత్మస్వరూపమును నే నని తెలియకయే, ఇట్లు భ్రాంతి కలిగినందున దీనికి భ్రాంతిజతాదాత్మ్య మని పేరు.

1. పూర్వమీమాంసావార్తికకారుఁడయిన కుమారిలభట్టు [భట్టపాదుఁడు, భట్టాచార్యుఁడు]

పూర్వముచూపిన వాచ్యవాచకముల అభేదప్రతిపాదనము నైన వేదవచనరూపప్రమాణముయొక్క వ్యవస్థ చెప్పుచున్నారు—

ప్రణవమునకును, బ్రహ్మమునకును వేదమందు అభేదము చెప్పఁబడియున్నది; ఆవేదవచనమునకు వాచ్యవాచకముల అభేదమందు తాత్పర్యము లేదు; దానియందు గోప్యాభిప్రాయము గలదు; అది భట్టునిచేత వ్యాఖ్యానింపఁబడలేదు; ఆ యభిప్రాయ మే మనఁగా—ఎచ్చట ఓంకారమును బ్రహ్మమందురో, అచ్చట "ఓంకారమును బ్రహ్మబుద్ధిచేత నుపాసన చేయవలయును" అను నీ యర్థమందు వేదవాక్యమునకు తాత్పర్యము గలదు.

ఉపాసనవిధి, ఉపాస్యంబునందు యద్బుద్ధి యుంచవలెనని చెప్పుచున్నదో, ఉపాస్యము తత్స్వరూపమే కావలెనను నియమము లేదు; మఱేమనఁగా—ఉపాస్యమునుయొక్క పూర్వస్వరూపమును విడిచి, దానియందు అన్యస్వరూపబుద్ధిచేతఁగూడ ఉపాసన విధింపఁబడును; ఎట్లనఁగా—సాలగ్రామమునందు విష్ణుబుద్ధిచేతను, నర్మదేశ్వరునందు శివబుద్ధిచేతనుఉపాసన చెప్పఁబడియున్నది; అచ్చట శంఖచక్రాదిసహితమగు చతుర్భుజపీతాంబరధారి విష్ణుమూర్తి సాలగ్రామమునందు లేదు; మఱియు గంగాభూషిత త్రిశూలడమరుగజచర్మ విరాజితశివమూర్తినర్మదేశ్వరునందు లేదు; రెండును శిలారూపములుగా నున్నవి; ఇట్లుండఁగా శాస్త్రాజ్ఞవలన శిలారూపదృష్టిని విడిచి రెండింటియందు విష్ణుశివదృష్టులచేత ఉపాసన చేయవలెను.

ఈ ప్రకారముగా ఉపాస్యస్వరూపాధీనము ఉపాసన కాదు; మఱేమనఁగా—విధివిశ్వాసాద్యధీనముగ నున్నది; ఎట్లు

శాస్త్రవచనము విధానము చేయునో, అట్లు ఉపాసన చేయవలయును; చూడుము—

ఛాందోగ్యోపనిషత్తులో పంచాగ్నివిద్యాప్రకరణమందు స్వర్గమేఘభూమిపురుషస్త్రీలు ఈ యయిదుపదార్థములందు అగ్నిబుద్ధిచే, శ్రద్ధాసోమవర్షాన్న వీర్యములను అయిదుపదార్థముల యొక్క ఆహుతిరూపోపాసన చెప్పఁబడియున్నది; అచ్చట స్వర్గ మేఘాదికము అగ్ని కాదు; శ్రద్ధాసోమాదికము ఆహుతిగాదు; అట్లయినను, వేదాజ్ఞవలన ఉక్తప్రకారములగు అగ్న్యాహుతులు అంగీకరింపవలయును. [పంచమతరంగమందలి ఉపాసనప్రకరణము స్మరింపుము].

ఈరీతిగా బ్రహ్మబుద్ధిచే ఓంకారోపాసన వేదంబునందు చెప్పఁబడియున్నది; అచ్చట ఓమక్షరము బ్రహ్మముగాదు; అయినను, బ్రహ్మరూపముచేత ఉపాసన ఘటిల్లును; ఉపాసనమందు వస్తువులఅభేదముయొక్క అపేక్ష లేదు; మఱేమనఁగా—భిన్న వస్తువులయొక్కయు అభిన్నరూపముచేత ఉపాసనయగుచున్నది.

విచారముచేత చూచినట్టయిన, బ్రహ్మవాచకమయిన ఓమక్షరమునకు తలవాచ్యమయిన బ్రహ్మముతో అభేదముఘటిల్లును. అయిన, ఘటాదపదములకు తమతమ జడరూపార్థముతో అభేదముఘటిల్లదు;ఏలయన—సకలనామరూపములు బ్రహ్మంబునందు కల్పితములు; బ్రహ్మము వానికధిష్ఠానము; ఓమక్షరమును బ్రహ్మమునకు నామమగుటవలన బ్రహ్మంబునందు కల్పితము; కల్పితవస్తువు అధిష్ఠానముకన్న భిన్నము గాదు; అధిష్ఠానరూపమే; కాఁబట్టి ఓమక్షరము బ్రహ్మరూపము; ఘటాదిపదముల జడరూపార్థము ఏది గలదో, అది దానియధిష్ఠానము గాదు; మఱే

ఘునఁగా— వాచ్యసహితమయిన ఘటాదిపదములు బ్రహ్మంబు నందు కల్పితములుగాను, బ్రహ్మము వానికి అధిష్ఠానముగాను ఉన్నది; కనుక బ్రహ్మముతో సర్వమునకు అభేదము ఘటిల్లియే యున్నది; అయిన, ఘటాదిపదములకు తమతమ జడరూపమయిన వాచ్యార్థములతో అభేదము ఏరీతిగాను ఘటిల్లదు; ఈరీతిగా భట్టమతమునందు అంగీకరించిన వాచ్యవాచకాభేదము అసంగతము.

మఱియును వాచ్యవాచకములకు కేవలభేదము నెవ్వఁడంగీకరించునో, వానిమతమునందు భాట్టులు ఈదోషమును చెప్పుచున్నారు—"ఘటపదముయొక్క వాచ్యము ఘటపదముకన్న అత్యంతభిన్నమయినట్టయిన, ఎట్లు ఘటపదముచేత అత్యంతభిన్నమయిన పటరూపార్థముయొక్క ప్రతీతి గానేరదో, అట్లు ఘటపదముచేత అత్యంతభిన్నమైన కలశరూపార్థము యొక్కయు ప్రతీతి గాకుండవలసియుండెను; మఱియు ఘటపదముకన్న వాచ్యమును అత్యంతభిన్నమని అంగీకరించి, ఆ ఘటపదమువలన కలశప్రతీతిని అంగీకరించినట్టయిన, అత్యంతభిన్నమయిన పటమునకు ప్రతీతి గావలసియుండును."

ఈదోషమును సామర్థ్యరూపము, లేక ఇచ్ఛారూపము అగుశక్తి నంగీకరింపనివారిమతమందుఁ గలదు; ఎవ్వరు ఈ శక్తి నంగీకరింతురో, వారిమతమందు లేదు; ఏలయన—ఘటపదమునకు వాచ్యమయిన కలశము, మఱియు అవాచ్యమయిన పటాదికము అవి రెండును ఘటపదముకన్న భిన్నముగా నున్నవి; అయిన, ఘటపదమునందు కలశరూపార్థముయొక్క జ్ఞానము చేయు శక్తి గలదు; అన్యార్థజ్ఞానజనకశక్తి లేదు, కనుక ఘట

పదమువలన కలశరూపార్థముకన్న భిన్నార్థమునకు ప్రతీతి గానేరదు.

ఈరీతిగా ఏపదమునందు ఏయర్థముయొక్క జ్ఞానము చేయు శక్తిగలదో, ఆపదముచేత ఆయర్థముయొక్క ప్రతీతి యగును; అన్యార్థముయొక్కగాదు; కాఁబట్టి శక్తివాదిమతము నందు వాచ్యవాచకముల అత్యంతభేద మంగీకరించుటయందు దోషము లేదు.

అట్లు ఉపాదానకారణమునకును కార్యముతో భేద సహితాభేదము లేదు; కేవలభేదమే [1] యున్నది; కేవలభేద పక్షమందు భాట్టులు ఏదోషము చెప్పుచున్నారో, ఆదోషము నైయాయికులయొక్కయు, శక్తివాదులయొక్కయు మతము లందు లేదు; ఏలయన—కారణకార్యములయొక్క అత్యంత భేదమందు భాట్టులు ఈదోషము చూపుచున్నారు—"మృత్పిం

1. శక్తివాదియయిన సిద్ధాంతిమతమందు ఉపాదానకారణమునకు కార్యమునకు కేవలభేదము లేదు; మఱేమనఁగా—అనిర్వచనీయతాదాత్మ్యము గలదు; అట్లయిన, ఇచ్చట కేవలభేద మేది చెప్పఁబడినదో, అది ప్రౌఢివాద ముగా నున్నది; ప్రౌఢి యనఁగా తనయుత్కృష్టతచేత వాదము అనఁగా కథ నము, ఇది ప్రౌఢివాదముయొక్క స్వరూపము; మఱియు దాని విశదలక్ష ణము ఇట్లున్నది—ప్రతివాదియొక్క యుక్తి అంగీకరించి, ఆయుక్తియందు చూపిన ఏస్వమతమందు దోషమో, ఆదోషముయొక్క స్వయుక్తిచేత పరి హారము చేయుటను ప్రౌఢివాద మందురు. ఇచ్చట కార్యకారణముల భేదపక్ష మందు భట్టునిచేత దోషము చెప్పఁబడియున్నను, స్వయుక్తిచేత ఆభట్టోక్త దోషసహితపక్షమును అంగీకరించి, స్వమతమందు స్వయుక్తిచేత దోషపరిహా రము చేసియున్నాఁడు; కనుక ఇది ప్రౌఢివాదము.

డముకన్న అత్యంతభిన్నఘటోత్పత్తి మృత్పిండమువలన నయి నట్టయిన, మృత్పిండమువలన అత్యంతభిన్నమయిన తైలము యొక్కయు ఉత్పత్తి గావలయును; అదియో, గాదు; లేక అత్యంతభిన్నమయిన తైలముయొక్క ఉత్పత్తి గాదన్నయెడ, మృత్పిండమువలన అత్యంతభిన్నమయిన ఘటముయొక్కయు నుత్పత్తి గాఁగూడదు; అదియో, యగుచున్నది."

ఈదోషము నైయాయికమతమందు లేదు; ఏలయన— సర్వవస్తువులయొక్క ఉత్పత్తియందు నైయాయికులు ప్రాగభావ మును కారణమని యెంచుచున్నారు; ఎట్లు ఘటోత్పత్తియందు కులాలదండచక్రాదులు కారణములో, అట్లు ఘటముయొక్క ప్రాగభావమును కారణముగా నున్నది; ఈరీతిగా సర్వము యొక్క ప్రాగభావము సర్వముయొక్క ఉత్పత్తియందు కారణ ముగా నున్నది; ఆ ఘటముయొక్క ప్రాగభావము ఘటమునకు ఉపాదానకారణమయిన మృత్పిండమం దుండును; అన్యమునందు ఉండదు; తైలముయొక్క ప్రాగభావము తిలలయం దుండును; ఇతరమునందు లేదు.

అట్లు సర్వకార్యములయొక్క ప్రాగభావము తమతమ యుపాదానకారణమునం దుండును; ఏపదార్థమందు దేనియొక్క ప్రాగభావము గలదో, ఆపదార్థమువలన దానియొక్క ఉత్పత్తి యగుచున్నది; అన్యముయొక్కగాదు; కాఁబట్టి కార్యకారణ ముల అత్యంతభేద మంగీకరించినను, నైయాయికమతమునందు భట్టోక్తదోషము లేదు.

సామర్థ్యరూపశక్తివాదియొక్క మతమునందును ఈ దోషము లేదు; ఏలయన—మృత్పిండమునందు ఘటోత్పాదన

సామర్థ్యరూపశక్తి గలదు; తైలోత్పాదనశక్తి లేదు; తిలల యందు తైలోత్పాదనశక్తి గలదు; ఘటోత్పాదనశక్తి లేదు; అందువలన మృత్పిండముచే ఘటముయొక్క, మఱియు తిలల వలన తైలముయొక్క ఉత్పత్తి యగుచున్నది; అన్యముయొక్క గాదు. కాబట్టి ఈమతమందును కార్యకారణముల అత్యంత భేద మంగీకరించినను, భట్టోక్తదోషము లేదు.

భేదమందు అట్లు అభేదమందు భాట్టులు ఏదోషమును చెప్పియున్నారో, ఆ రెండుపక్షముల దోషములును భట్టమతము నందు అఖండనివాసము చేయుచున్నవి; ఏలయన—భాట్టులు భేదసహితాభేదము అంగీకారము చేసియున్నారు; దానివలన ఈయర్థము సిద్ధమగుచున్నది—కార్యకారణములకు భేదమును గలదు; అభేదమును గలదు; భేద మనుటవలన భేదపక్షోక్త దోషము గలదు; అభేద మనుటవలన అభేదపక్షోక్తదోషము గలదు; ఎట్లనఁగా—చోరునియొద్దఁ జౌర్యదోషము గలదు; జారునియొద్ద జారత్వదోషము గలదు; ఈరెండుగలపురుషుని యొద్ద రెండుదోషములు గలవు.

కార్యకారణములకువలె గుణగుణిజాతి వ్యక్తిక్రియా కర్త్రుప్రభృతులకును భేదాభేద మనుట అయుక్తముగా నున్నది; శక్తివాదియొక్కమతమందు కేవలభేదాంగీకారమువలనదోషము లేదు; ఏలయన—గుణియందు గుణధారణశక్తి, వ్యక్తియందు జాతిధారణశక్తి, కర్తయందు క్రియాధారణశక్తి గలదు; ఇతర శక్తి గలుగదు; ఈమతమందు దోషములేదు; భేదాభేదముల తాదాత్మ్యసంబంధము అసంగతము; వానిలో పూర్వోక్తద్వివిధ దోషములు గలవు; మఱియు ఒకేస్థానమునందు భేదాభేద

రూపములైన విరోధిధర్మములయొక్క అసంభవ మను తృతీయ దోషమును గలదు; యద్యపి వేదాంతశాస్త్రమందును కార్యకారణగుణగుణి ప్రభృతులకు అత్యంత భేద మంగీకరింపఁబడ లేదు; తాదాత్మ్యసంబంధమే అంగీకరింపఁబడినది; తథాపి వేదాంతమందు భేదాభేదసహితతాదాత్మ్యసంబంధ మనరు; మఱే మనఁగా—భేదాభేదవిలక్షణమగుతాదాత్మ్యసంబంధము చెప్పుదురు; భేదముకన్న విలక్షణమగుటవలన భేదపక్షోక్తదోషము లేదు; అభేదముకన్న విలక్షణ మగుటవలన అభేదపక్షోక్త దోషము లేదు.

ఈరీతిగా భేదాభేదముకన్న విలక్షణమగు అనిర్వచనీయ మయిన [1] తాదాత్మ్యసంబంధము నిర్దోషముగా నున్నది. భట్ట

---

1. ఎచ్చట భేదము గలదో, అచ్చట తాదాత్మ్యము సంభవింపదు; ఏలయన—అభేదప్రతీతివిషయముయొక్క నామమే తాదాత్మ్యము; కేవల భేద ముండఁగా అభేదప్రతీతి సంభవింపనందున, తాదాత్మ్యసంబంధమందు అభేదముయొక్క అపేక్ష గలదు. మఱియు ఎచ్చట కేవలాభేదము గలదో అచ్చట సంబంధము సంభవింపదు; ఏలయన—రెండుపదార్థములకు సంబంధము సంభవించినది ; తనస్వరూపముతో తనసంబంధము సంభవింపదు; అందువలన సంబంధమందు భేదముయొక్క అపేక్ష గలదు.

ఈరీతిగా భేదము, మఱియు అభేదము ఈ రెండు లేనపుడు తాదాత్మ్యసంబంధము ఘటిల్లదు ; మఱియు పరస్పరవిరోధిధర్మమగుటవలన రెంటికి ఏక స్థానమునందు స్థితి ఘటిల్లదు ; కావున ఇచ్చట భేదాభేదవిలక్షణమయిన తాదాత్మ్యము చెప్పఁబడియున్నది ; దాని కిది అభిప్రాయము—

భేదముకన్న విలక్షణ మని చెప్పుటవలన వాస్తవభేదరహిత మని చెప్పి వాస్తవభేదములేకుండినను కల్పితభేదసహిత మని తెలిపినారు. మఱియు అభే

మతోక్త భేదాభేదరూపమయిన తాదాత్మ్యసంబంధము అసంగతము.

## 294. శక్యముయొక్క లక్షణము

లక్షణాజ్ఞానమందు శక్యజ్ఞానముయొక్క ఉపయోగము గలదు; ఏలయన—శక్యముయొక్కసంబంధమే లక్షణాస్వరూపము; శక్యము తెలియక, శక్యసంబంధరూప మగు లక్షణాజ్ఞానము గానేరదు; ఆ శక్యముయొక్క లక్షణము చెప్పుచున్నాము.

పదముయొక్క శక్తివృత్తివలన ఏయర్థము తెలియఁబడునో, దానిని పదముయొక్క శక్యము, శక్యార్థము లేక వాచ్యము, వాచ్యార్థము [1] అనఁబడును; ఎట్లనఁగా—అగ్నిపదమునందు అంగారరూపార్థబోధక మగు శక్తి కలదు; ఆ శక్తివలన అగ్నిపదముచే అంగారరూపార్థము ఏది తెలియఁబడినదో, అది శక్యార్థ మనఁబడును, వాచ్యార్థ మనియు ననఁబడును; మఱియు వాచ్యార్థబోధకపదము వాచక మనఁబడును.

## 295. లక్ష్యార్థముయొక్కయు, లక్షణయొక్కయు స్వరూపము.

పదమునకు శక్యార్థసంబంధమును లక్షణయందురు;

---

దముకన్న విలక్షణ మనుటవలన కల్పితాభేదముచే రహిత మని చెప్పి, వాస్తవాభేదము తెలిపినారు. ఈరీతిగా సిద్ధాంతమందు కల్పితభేదసహితమై, వాస్తవాభేదము తాదాత్మ్యసంబంధ మని చెప్పినారు. దీనినే అనిర్వచనీయతాదాత్మ్యసంబంధ మందురు.

1. దీనిని అభిధేయార్థ మనియు, ముఖ్యార్థ మనియుం చెప్పుదురు.

ఏయర్థముయొక్క జ్ఞానము శక్తివృత్తిచేత గానేరదో, లక్షణావృత్తిచేత నగునో, దానిని పదముయొక్క లక్ష్యార్థ మందురు.[1]

## 296. లక్షణాత్రయవిచారము

జహతి, అజహతి, జహదజహతి [భాగత్యాగము] అని లక్షణాభేదములు మూఁడుగలవు; వానిలో—

---

1. ఏది శబ్దముయొక్క శక్తివృత్తిరూపమైన సంబంధముచే తెలియనగునో, అట్టిదై, శబ్దముయొక్క సాక్షాత్సంబంధియయిన అర్థమును శక్యార్థ మందురు; ఆశక్యార్థముయొక్క సంబంధియయి, వక్తయొక్క తాత్పర్యవిషయమయిన అన్యార్థమునందు శబ్దముయొక్క పరంపరాసంబంధము ఏది గలదో, అది శబ్దముయొక్క లక్షణావృత్తి యందురు; మఱియు ఆలక్షణావృత్తివలన ఎఱుఁగఁదగిన అర్థము ఏది గలదో, అది శబ్దముయొక్క లక్ష్యార్థ మందురు.

పితృశబ్దమునకు శబ్దవృత్తిరూపమగు సాక్షాత్సంబంధము జనకరూపార్థముతోఁ గలదు, కావున పితృశబ్దముయొక్క శబ్దవృత్తిరూపసంబంధమువలన ఎఱుఁగవలయునట్టి పితృశబ్దముయొక్క సాక్షాత్సంబంధియయిన జనకరూపార్థము ఏది గలదో, అది పితృశబ్దముయొక్క శక్యార్థ మందురు; మఱియు ఆ జనకరూపశక్యార్థసంబంధియయిన పితామహరూపమగు అన్యార్థము ఏది గలదో, దానియందు పితృశబ్దముయొక్క పరంపరాసంబంధము ఏది గలదో, అది పితృశబ్దమునకు లక్షణావృత్తిగా నున్నది; మఱియు ఆలక్షణావృత్తివలన ఎఱుఁగఁబడిన పితామహరూపార్థము ఏది గలదో; దానిని పితృశబ్దమునకు లక్ష్యార్థ మందురు.

ఏయర్థముతో ఎవనికి సాక్షాత్సంబంధము కాదు; మఱేమనఁగా— ఒకనిద్వారమున సంబంధమగునో, ఆయర్థముతో వానికి పరంపరాసంబంధము చెప్పఁబడినది; ఎట్లు పౌత్రరూపుఁడగు తృతీయపురుషునకు తనపితామహరూపుఁడైన ప్రథమపురుషునితో సాక్షాత్సంబంధము లేదు; మఱేమనఁగా—

(1) ఎచ్చట వాచ్యార్థమును సంపూర్ణముగా విడిచి, వాచ్యార్థసంబంధియొక్క గ్రహణమగునో, అచ్చట జహల్లక్షణచెప్పఁబడినది; ఎట్లనఁగా—"గంగాయాం ఘోషః" ఈస్థానమందు గంగాపదమునకు వాచ్యార్థము దేవనదీప్రవాహము, దానియందు గొల్లపల్లె యను గ్రామము స్థితికి అసంభవము; అందువలన సకలవాచ్యార్థమును విడిచి, తీరమందు గంగాపదమునకు జహల్లక్షణగలదు; ఈస్థానమందు గంగాపదవాచ్యమైన ప్రవాహమునకు తీరముతో సంబంధము గలదు; కనుక ఆ సంబంధము లక్షణ, మఱియు వాచ్యముయొక్క సమగ్రత్యాగము గలదు; కావున

---

పౌత్రరూపుఁడైన తృతీయపురుషునికి తనతండ్రితో సాక్షాత్సంబంధముండును, ఆతండ్రికి పితామహునితో జన్యజనకభావము సాక్షాత్సంబంధము గలదు; గనుక పౌత్రునికి పితామహునితో తండ్రిద్వారమున సంబంధము గలదు; అది పరంపరాసంబంధ మనఁబడును.

అట్లు శబ్దమునకు తనసాక్షాత్సంబంధియై, శక్యార్థముకన్న భిన్నమైన శక్యార్థసంబంధితో సాక్షాత్సంబంధము లేదు; మఱేమనఁగా—శబ్దమునకు శక్యార్థముతో మఱియు శక్యార్థమునకు తనసంబంధియగు అన్యార్థముతో [లక్ష్యార్థముతో] సంబంధము గలదు; గనుక లక్ష్యార్థముతో తనశక్యార్థద్వారమున సంబంధమగుటవలన అది పరంపరాసంబంధము అగును; అది ఏ శబ్దముయొక్క పరంపరాసంబంధము ఏయర్థముతోఁ గలుగునో, ఆయర్థము ఆశబ్దమునకు లక్ష్యార్థము.

ఈలక్షణావృత్తియొక్క లక్షణము ఇంకను ముందు చెప్పఁబడును.

జహతి, ఈ రెండునుగూడి జహల్లక్షణ [1] యనఁబడి నది.

1. "కూపము నడుచుచున్నది [బావియయిన కపిలెసంబంధులైన యెద్దులు నడుచుచున్నవి.]" అచ్చట కూపశబ్దమునకు శక్యార్థము జలపూరిత గర్తము, దానియందు చలనరూపక్రియాభావమువలన వక్తృతాత్పర్యము సంభవింపదు; అయిన కూపసంబంధమయిన యెద్దులయందు తాత్పర్యము గలదు; అందుచేఁగాన నిది జహల్లక్షణ. అట్లు "మార్గము నడుచుచున్నది. [మార్గస్థపురుషుఁడు నడుచుచున్నాఁడు.]" "పొయ్యి మండుచున్నది [పొయ్యియందు కట్టెలు కాలిపోవుచున్నవి.]" ఇత్యాది వాక్యములందును జహల్లక్షణ యెఱుఁగవలయును.

ఈ జహల్లక్షణను కొందఱు గ్రంథకారులు సిద్ధాంతమందు ప్రయోగము చూపించియున్నారు; చూడుము—"సర్వంఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యములందు సర్వజగత్తునకు బ్రహ్మరూపత చెప్పియున్నారు; అచ్చట వికారిత, జడత, దుఃఖరూపత మొదలైన విపరీతధర్మములుగలదై, నామరూపాత్మకమైన జగత్తును అవికారి చేతనానందాదిస్వరూప బ్రహ్మమని చెప్పుట విరుద్ధము; కనుక దానియందు శ్రుతివాక్యముల తాత్పర్యము సంభవింపదు; మఱేమనఁగా—బాధసామానాధికరణ్యమురీతిగా నామరూపములబాధచేత అవశేషమైన తత్సంబంధి అధిష్ఠానచైతన్యము బ్రహ్మము, ఈయర్థమందు శ్రుతివాక్యముల తాత్పర్యము గలదు; కాఁబట్టి ఇచ్చట సర్వశబ్దమందలి వాచ్యమయిన నామరూపాత్మకజగత్తును విడిచి, తత్సంబంధియయిన అస్తిభాతిప్రియరూపాధిష్ఠానమగుచైతన్యమునకు గ్రహణము గలదు; ఇది జహల్లక్షణ యగును. ఇచ్చట ఆరోపితమయిన నామరూపములయొక్క తమ అధిష్ఠానచైతన్యముతో నేతాదాత్మ్యసంబంధము గలదో, అది లక్షణ, మఱియు దీనివలన ఎఱుఁగఁబడిన యేయధిష్ఠానచైతన్యము గలదో, అది లక్ష్యార్థము.

(2) వాచ్యార్థసహితమైన వాచ్యసంబంధియొక్క గ్రహణము ఏపదముచేత నగునో, ఆపదమునందు అజహల్లక్షణ చెప్పఁబడినది; ఎట్లనఁగా—"శోణోధావతి" [ఆరక్తము పరుగెత్తుచున్నది] ఇచ్చట శోణపదమునకు రక్తవర్ణముగల అశ్వమునందు అజహల్లక్షణ గలదు; ఏలయన—శోణపదమునకు వాచ్యము ఆరక్తవర్ణము, ఆ కేవలారక్తవర్ణమందు ధావనము అసంభవము; అందువలన శోణపదముయొక్క వాచ్యమైన ఆరక్తముతోఁగూడిన అశ్వమందు శోణపదమునకు అజహల్లక్షణ, గుణగుణికి తాదాత్మ్యసంబంధము గలదు; ఆరక్తమైన గుణమునకు గుణియైన అశ్వముతో తాదాత్మ్యసంబంధ మేది గలదో, అది లక్షణ, మఱియు వాచ్యముయొక్క త్యాగము చేయక, అధికార్థముయొక్క గ్రహణమువలన అజహాతి ఈరెండునుకూడి అజహల్లక్షణ [1] యనఁబడినది.

---

ముఖ్యసిద్ధాంతమందయిననో, అధిష్ఠానమునువిడిచి, ఆరోపితముయొక్క ప్రతీతి గానేరదు ; కావున అస్తిభాతిప్రియసహితనామరూపము స్వరశబ్దమునకు, లేక జగచ్ఛబ్దమునకు వాచ్యార్థము; దీనినుండి నామరూపభాగముయొక్క త్యాగముచేయగా, అవశేషమైన అస్తిభాతిప్రియరూపాధిష్ఠానభాగము బ్రహ్మముగా నున్నది ; ఇట్లు ఉక్తశ్రుతివాక్యగతసర్వపదమందు భాగత్యాగలక్షణ అంగీకరించినారు.

1. అజహల్లక్షణకు ఉదాహరణము—"కాకేభ్యో దధి రక్ష్యతామ్" ఈవాక్యమందు కాకపదమునకు వాచ్యమయిన వాయసపక్షి కేవలము దీనివలన దధిరక్షణమందు వక్తృతాత్పర్యములేదు ; దధిభక్షకధర్మముచే కాకసజాతీయ

(3) ఎచ్చట పదముయొక్క వాచ్యార్థమునుండి ఏక భాగముయొక్క త్యాగము, ఏకభాగముయొక్క గ్రహణము గలదో, అచ్చట భాగత్యాగలక్షణ గలదు; ఏలయన—అతీతకాలమందు, మఱియు దూరదేశమందు, ఉండువస్తువు "సః" అని చెప్పఁబడును; వర్తమానకాలమందు సమీపదేశమందు ఉండువస్తువు "అయమ్" అని చెప్పఁబడును; కనుక "సోఽయం దేవదత్తః" ఇట్లనుటచేత అతీతకాలమందు, దూరదేశమందు స్థితుఁడైన ఎవ్వఁడు దేవదత్తుఁడో, వాఁడే విద్యమానకాలమందు, సమీపదేశమందున్న దేవదత్తుఁడు; ఇట్లు సోఽయందేవదత్తః ఈసముదాయవాక్యముయొక్క వాచ్యార్థముచేత తెలియవచ్చును. అది సంభవింపదు; ఏలయన—అతీతకాలమునకును, విద్యమానకాలమునకును పరస్పరవిరోధము, అట్లు దూరదేశమునకును, సమీపదేశమునకును పరస్పరవిరోధము; అందువలన "సః" మఱియు "అయమ్"

---

మయిన బిడాలాదికములనుండియుం, దధిని రక్షింపవలయుంనని వక్తృతాత్పర్యము: ఇచ్చట కాకపదవాచ్యమయిన వాయసము, దీనికి బిడాలాదికములతో ఏ సజాతీయసంబంధము గలదో, అది లక్షణ, మఱియుం వాచ్యముయొక్క త్యాగముచేయక అధికముయొక్క గ్రహణము గలదు; కనుక ఇది అజహల్లక్షణ యనఁబడును.

ఈరీతిగా ఎచ్చట శ్రుతివాక్యములో ఆత్మయొక్క సదానందాదిలక్షణములందు రెండు, లేక ఒకటి లక్షణము చెప్పఁబడినదో, అచ్చట వానితో అన్వాయనుక్తమయిన సర్వలక్షణముల గ్రహణము గలదు; అచ్చట సిద్ధాంతమందును అజహల్లక్షణోపయోగము చేయఁబడుచున్నది.

ఈరెండుపదములయందుండు దేశకాలరూపమైన వాచ్యముయొక్క ఏకభాగము విడిచి, దేవదత్త మాత్రుని గ్రహించుటచే సంపూర్ణవాచ్యమునందు ఏకాంశత్యాగరూప మయిన భాగత్యాగలక్షణ [1] గలదు.

---

1. "అది, ఇది యున్నది" అది మఱియు ఇది ఈరెండుపదములు, వీనికి పరస్పరముసమానమైన [ఏకవిభక్తిబలమువలన ఏకార్థత్వరూపమైన] ఏసామానాధికరణ్యసంబంధము గలదో, దానిబలమువలన వీనివాచ్యములగు పరోక్షాపరోక్షములయిన రెండువస్తువులకు ఏకత ప్రతీతమగును; ఈరెండువాచ్యార్థములలో, విరోధిధర్మములగుటవలన వీనికి ఏకత సంభవింపదు; అందువలన ఇచ్చట లక్షణ అంగీకరించుట యోగ్యము; ఆ లక్షణయయిననో, ఇచ్చట జహతి, లేక అజహతి సంభవింపదు; మఱేమనఁగా—భాగత్యాగలక్షణ సంభవించును; కనుక "అది" అను పదమునకు వాచ్యము పరోక్షతాసహితవస్తువు, "ఇది" అను పదమునకు వాచ్యము అపరోక్షతాసహితవస్తువు వీనినుండి పరోక్షత్వాపరోక్షత్వభాగముయొక్క త్యాగముచేసి, అవిరోధియైన వస్తుమాత్రము యొక్క గ్రహణము గలదు; ఇచ్చట పరోక్షతాపరోక్షతాభాగములకు వస్తువులతో ఆశ్రయతాసంబంధము గలదు; మఱియు వస్తుభాగములకు పరస్పరముతో తాదాత్మ్యసంబంధముగలదు; ఈసంబంధము లక్షణ; మఱియు పరస్పరవిరోధియైన ఒకభాగముయొక్కత్యాగమై, అవిరోధియైన వస్తుమాత్రముయొక్క గ్రహణ మగుటవలన ఇది భాగత్యాగలక్షణ యనఁబడును.

అట్లు తత్త్వమస్యాది మహావాక్యములం దుండెడు జీవేశవాచకములయిన రెండుపదములు, వీనికిని పరస్పరము సమానవిభక్తిబలమువలన వీనివాచ్యులైన జీవేశ్వరులయేకత ప్రతీతమగుచున్నది; ఈయిద్దఱును విరోధిధర్మములుగలవారగుటవలన వీరియేకత సంభవింపదు; గనుక ఇచ్చట లక్షణాంగీకారము

## 297. తత్త్వమసిమహావాక్యమునందు లక్షణ, తత్పదవాచ్యార్థము.

సర్వశక్తిమంతుఁడు అనఁగా అన్నిసామర్థ్యము గలిగిన వాఁడు, సర్వజ్ఞుఁడు అనఁగా సర్వవస్తువులను ఎఱిఁగినవాఁడు, విభు వనఁగా వ్యాపకుఁడు, ఈశుఁ డనఁగా సర్వమున కంతరప్రేరకుఁడు, స్వతంత్రుఁడనఁగా కర్మమున కధీనుఁడుగానివాఁడు, పరోక్షుఁ డనఁగా జీవుని ప్రత్యక్షమునకు విషయముగానివాఁడు, మాయి యనఁగా మాయ స్వాధీనముగఁ గలవాఁడు, మఱియు బంధమోక్షరహితుఁడు [ఎవ్వనికి బంధముగునో, వానికి మోక్షముగును; ఈశ్వరుఁడు బంధరహితుఁడు; కనుక మోక్షరహితుఁడు]; ఇన్నిధర్మములుగల ఈశ్వరచైతన్యము తత్పదమునకు వాచ్యార్థము.

---

యోగ్యము; ఆ లక్షణ, పూర్వముచెప్పినరీతిగా ఇచ్చటను జహదజహల్లక్షణాద్వయము సంభవింపదు; మఱేమనఁగా—భాగత్యాగలక్షణయే సంభవించును.

ఈరీతిగా సకలమహావాక్యములందు రెండురెండుపదములకు వాచ్యులయిన జీవుఁడు, మఱియు ఈశ్వరుఁడు వీరినుండి ధర్మసహితోపాధియయిన విరోధిభాగముయొక్క త్యాగము, మఱియు అవిరోధియైన చైతన్యభాగముయొక్క గ్రహణము గలదు; ఇచ్చట ధర్మసహితమాయావిద్యలకు చైతన్యముతో అధిష్ఠానతాసంబంధము గలదు; మఱియు చైతన్యభాగమునకు తనతో తాదాత్మ్యసంబంధము గలదు: ఇది సకలవాచ్యములయొక్క చైతన్యభాగముతో అధిష్ఠానతాదాత్మ్యసంబంధము ఏది గలదో, అది లక్షణ, మఱియు విరోధిభాగమును త్యజించి; అవిరోధియైన చైతన్యభాగమునకు గ్రహణమగుట వలన ఇది భాగత్యాగలక్షణ యనఁబడును.

## 298. త్వంపదమునకు వాచ్యార్థము

ఈశ్వరుని ధర్మములు ఏవి చెప్పఁబడినవో, వానికన్న విపరీతధర్మములు ఎవ్వనియందుఁ గలవో, ఆజీవచైతన్యము త్వంపదమునకు వాచ్యార్థమని ఎఱుఁగవలయును; దానికభిప్రాయమిది—అల్పశక్తి, అల్పజ్ఞుఁడు, పరిచ్ఛిన్నుఁడు, అనీశుఁడు, కర్మాధీనుఁడు, అవిద్యామోహితుఁడు, బంధమోక్షవంతుఁడు, మఱియు ప్రత్యక్షుఁడు [తనస్వరూపము ఎవనికి పరోక్షము గాదు, ప్రత్యక్షముగానే[1] యున్నది; ఈశ్వరునకు తనస్వరూపము ప్రత్యక్షమయినను, ఈశ్వరునిస్వరూపము జీవునకు ప్రత్యక్షము గాదు; అందువలన ఈశ్వరుని పరోక్షుఁ డందురు; జీవుని స్వరూపమును జీవుఁడు, ఈశ్వరుఁడు ఇద్దఱును ఎఱుఁగుదురు; కనుక జీవుని ప్రత్యక్షుఁ డందురు.] ఇన్నిధర్మములుగల జీవచైతన్యము త్వంపదమునకు వాచ్యార్థము.

## 299. వాచ్యార్థమందు విరోధము, మఱియును లక్షణాపేక్ష.

సామవేదమందలి ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకముని తనపుత్త్రుఁడయిన శ్వేతకేతువునకు జగదుత్పత్తి చేయునాఁడైన

---

1. యద్యపి జీవుఁడు తననిజరూపమయిన అహంపదలక్ష్యుఁడైన కూటస్థమాత్రుని ఎఱుఁగఁడు; తథాపి అహంపదవాచ్యమైన అంతఃకరణవిశిష్ట చైతన్యమును, లేక స్థూలసూక్ష్మసంఘాతవిశిష్టచైతన్యము నే నని ఎఱుఁగుచున్నాఁడు; కాఁబట్టి జీవునకు వివేకజ్ఞానముకన్న ముందలుకూడ విశిష్టాత్మరూపముచే తనస్వరూపముయొక్క జ్ఞానము ప్రత్యక్షముగా నున్నది.

ఈశ్వరుని వర్ణనముచేసి, "తత్త్వమసి" [1] అని పలుకు చున్నాఁడు; ఆ తత్త్వమసివాక్యమునకు వాచ్యార్థము—తత్

1 "తత్త్వమసి" అనునీ సామవేదముయొక్క ఛాందోగ్యోపనిషత్తు షష్ఠాధ్యాయమందలి మహావాక్యమును శ్వేతకేతువను పుత్త్రునిగూర్చి ఉద్దాలకుఁ డనుపిత తొమ్మిదిమాఱులు ఉపదేశము చేసినాఁడు; అవి సర్వరీతులు పంచదశి మహావాక్యముయొక్క హిందూస్థానిటీకయందు వ్రాయఁబడినవి.

ఈ "తత్త్వమసి" అను వాక్యము, సంబంధత్రయముచేత అఖండ బ్రహ్మార్థమును బోధించుచున్నది; ఆ సంబంధత్రయము—1 పదములసామా నాధికరణ్యము 2 పదార్థములవిశేషణవిశేష్యభావము 3 లక్ష్యలక్షణాభావము వీనిలో—

(1) సామానాధికరణ్యసంబంధముయొక్క లక్షణము పూర్వము చతుర్థ తరంగమందు వ్రాయఁబడినది.

(2) విశేషణవిశేష్యములయొక్క లక్షణము పూర్వము చతుర్థతరంగ మందును, ఈ షష్ఠతరంగమందును వ్రాయఁబడినది, ఇప్పుడు విశేషణవిశేష్యములకు పరస్పరసంబంధమును చెప్పుచున్నాము— "వాఁడువీఁడున్నాఁడు" అను వాక్యమందు వాఁడు విశేషణుఁడు, వీఁడు విశేష్యుఁడు; మఱియుం "వీఁడువాఁడున్నాఁడు" అను వాక్యమందు వీఁడు విశేషణుఁడు, మఱియుం వాఁడు విశేష్యుఁడు; ఈరీతిగా రెండువాక్యములందలి పదములకు పరస్పరవిశేషణ విశేష్యభావ సంబంధము గలదు; ఆ ప్రకారముగా "తత్త్వమసి" అను వాక్యమందు తత్పదమువిశేషణము, త్వంపదమువిశేష్యము; "త్వం తదసి" అను వాక్యమందు త్వంపదమువిశేషణము, తత్పదము విశేష్యము; ఈ ప్రకారముగా రెండువాక్యములందుండిన తత్పద మునకు, త్వంపదమునకు పరస్పరవిశేషణవిశేష్యభావసంబంధము గలదు.

అనఁగా ఆ జగదుత్పత్తి చేయునట్టి, సర్వజ్ఞత్వాదిధర్మసహితుఁడైన ఈశ్వరుఁడు, త్వమ్ అనఁగా నీవు, అల్పశక్త్యల్పజ్ఞత్వాది ధర్మములుగల జీవుఁడు, అసి యనఁగా ఉన్నావు; ఇచ్చట వాఁడు నీవుగా నున్నావు; అట్లు చెప్పుటవలన ఈశ్వరజీవులఏకత వాచ్యార్థముచేత [1] ప్రతీతమగును; అది సంభవింపదు; చూడుము.

సర్వశక్తి మఱియు అల్పశక్తి, సర్వజ్ఞుఁడు మఱియు అల్పజ్ఞుఁడు, విభుఁడు మఱియు పరిచ్ఛిన్నుఁడు, స్వతంత్రుఁడు మఱియు కర్మాధీనుఁడు, పరోక్షుఁడు మఱియు ప్రత్యక్షుఁడు, మాయాపతి మఱియు అవిద్యామోహితుఁడు ఒకఁడుగా నున్నాఁడు; ఇది చెప్పుట— "అగ్ని శీతలముగ నున్నది" అని చెప్పుటతో సమానముగా సవిరోధముగా నున్నది; అందువలన ఈస్థానమందు నీవు లక్షణచేత అర్థగ్రహణము చేయుము; ఈస్థానమందు లక్షణ అయ్యెను, పూర్వము చెప్పిన జహదజహత్తులవి రెండును సంభవింపవు; గనుక తృతీయమైన భాగత్యాగలక్షణచేత అర్థగ్రహణము చేయుము,

(3) లక్ష్యలక్షణలయొక్క స్వరూపవర్ణనము ఈ షష్ఠతరంగమందు పూర్వము చేయఁబడినది.

ఈరీతిగా మూఁడుసంబంధములచేతను మహావాక్యములయొక్క అర్థమగుచున్నది;

1. ఇచ్చట వాచ్యార్థముతో ఏకతాభానము ఏది చెప్పఁబడినదో, అది "తత్త్వం" ఈరెండుపదముల సామానాధికరణ్యసంబంధముయొక్క బలముచేత చెప్పఁబడిన దని ఎఱుఁగవలెను; దీనివిశేషప్రకారము చతుర్థతరంగమందు వ్రాయఁబడినది.

## 300. మహావాక్యమునందు జహత్యసంభవము

సంపూర్ణవేదాంతమునకు జ్ఞేయమయిన బ్రహ్మచైతన్యము మఱియు సాక్షిచైతన్యము తత్పదవాచ్యంబునందు, మఱియు త్వంపదవాచ్యంబునందు ప్రవిష్టముగా నున్నది; ఎచ్చట జహల్లక్షణ యగునో, అచ్చట వాచ్యముయొక్క సంపూర్ణత్యాగము చేసి, వాచ్యసంబంధియైన అన్యమగు జ్ఞేయపదార్థముయొక్క గ్రహణమగును; కావున మహావాక్యమునందు జహల్లక్షణను అంగీకరించినపుడు వాచ్యంబునందున్న చైతన్యమును విడిచి, దానికన్న భిన్నమయినదానిని గ్రహింపవలసియుండెను; చైతన్యము కన్న భిన్నమైననో, అసజ్జడదుఃఖములుగా నున్నవి; వానిని ఎఱుఁగుటవలన పురుషార్థసిద్ధి గానేరదు; కావున మహావాక్యమందు జహల్లక్షణ సంభవింపదు.

## 301. మహావాక్యమునందు అజహత్యసంభవము

ఓ ప్రియుఁడా! ఎచ్చట అజహల్లక్షణ యగునో, అచ్చట వాచ్యార్థము సమగ్రము గ్రహించి, వాచ్యార్థముకన్న అధికము గ్రహణమగును; కావున మహావాక్యంబునందు అజహల్లక్షణను అంగీకరించినట్టయిన, వాచ్యార్థము సకలము ఉండవలయును; వాచ్యార్థములో, పరస్పరవిరోధము గలదు; విరోధము దూరము చేయుటకొఱకే లక్షణాంగీకారము చేయవలయును; అజహతిని అంగీకరించుటచే విరోధము దూరము కాదు; ఈవిధముగా మహావాక్యమునందు అజహతి యోగ్యము కాదు.

## 302. మహావాక్యమునందు భాగత్యాగలక్షణాంగీకారము

ఓశిష్యుఁడా! తత్పదమునకు వాచ్యుఁడైన ఈశ్వరునకును, జీవునకును పరస్పరవిరోధము గలదు; దానిని విడిచి, శుద్ధాసంగచైతన్యమును లక్షణవలన తెలిసికొనుము; ఇచ్చట భాగత్యాగలక్షణ ఆవశ్యకముగా నున్నది.

## 303. జీవేశ్వరులస్వరూపము అనేకవిధము

ఈస్థానమందు దీరహస్యముగలదు—జీవేశ్వరులస్వరూపము అనేకప్రకారములుగా అద్వైతగ్రంథములందు చెప్పఁబడి యున్నది.

వివరణగ్రంథంబునందు అజ్ఞానమందుండు ప్రతిబింబము జీవుఁడు, మఱియు బింబము ఈశ్వరుఁడు అని చెప్పఁబడినది; విద్యారణ్యులమతమందు శుద్ధసత్త్వగుణసహితమాయయందుండు ఆభాసము ఈశ్వరుఁడు, మఱియు మలినసత్త్వగుణసహితావిద్యాంశమందుండు ఆభాసము జీవుఁడు అని చెప్పఁబడినది.

పంచదశియందు విద్యారణ్యస్వాములు అంతఃకరణమందుండు ఆభాసమును జీవుఁడని చెప్పియున్నారు; అట్లయిన, అంతఃకరణస్థితచైతన్యాభాసమును జీవుఁడనిన, సుషుప్తియందు అంతఃకరణాభావమువలన ఆభాసము ఘటిల్లదు; ప్రాజ్ఞరూపజీవుఁడో, సుషుప్తియందున్నాఁడు; కావున స్వాములఅభిప్రాయము ఇట్లు ఎఱుఁగవలయును.

అంతఃకరణరూపపరిణామముపొందిన అవిద్యాంశమందు ఆభాసము జీవుఁడు గలఁడు; ఆ యవిద్యాంశము సుషుప్తి

యందును గలదు; దానివలన ప్రాజ్ఞునియొక్క అభావము లేదు; మఱియు కేవలాభాసమో, జీవేశ్వరులు [1] గారు; మాయాధిష్ఠానచైతన్యమును మాయాసహితాభాసుఁడును చేరి, ఈశ్వరుఁడు, అవిద్యాంశముయొక్క అధిష్ఠానచైతన్యమును అవిద్యాంశసహితాభాసుఁడునుచేరి, జీవుఁడు; ఈశ్వరోపాధియందు శుద్ధసత్త్వగుణము గలుగుటవలన ఈశ్వరునియందు సర్వశక్తి సర్వజ్ఞత్వాది ధర్మములు గలవు; జీవునిఉపాధియందు మలినసత్త్వగుణము గలుగుటవలన జీవునియందు అల్పశక్త్యల్పజ్ఞత్వాదిధర్మములు గలవు. దీనిని ఆభాసవాద మందురు.

వివరణమతమందు జీవేశ్వరులు ఇద్దఱియొక్క ఉపాధి ఒక్కటేయజ్ఞానమగుటవలన ఇద్దఱును సర్వజ్ఞులు గావలయును; లేక ఇద్దఱును అల్పజ్ఞులు గావలయును; అట్లయినను, ఉపాధికిది

---

1. కేవలచిదాభాసులే జీవేశ్వరులు గారు; ఏలయన—తన తాదాత్మ్యసంబంధముచే అధిష్ఠానముకన్న అభిన్నమై, ఏది ప్రతీతమగునో, అది ఆరోపిత మనఁబడును; ఆరోపితమునకు అధిష్ఠానముతో భిన్నతచే ప్రతీతిగానేరదు; రజ్జువునందు సర్పమారోపితము, దానికి రజ్జువుతో భిన్నతవలన ప్రతీతిగానేరదు; మఱేమనఁగా—రజ్జువుకన్న అభిన్నమై, రజ్జుస్వరూపము మూసి, సర్పప్రతీతియగును; అట్లు మాయావిద్యలందు ఆభాసులును ఎందువలన ఆరోపితములో, అందువలన తమఅధిష్ఠానములగు బ్రహ్మముతో, కూటస్థునితో భిన్నతచేత ప్రతీతులుగానేరరు; మఱేమనఁగా—తమతమ అధిష్ఠానచైతన్యములనాచ్ఛాదించి, అధిష్ఠానముతో అభిన్నులై, ప్రతీతులగుదురు; అందువలన అధిష్ఠానచైతన్యము, మాయోపాధిసహితచిదాభాసుఁడు ఈ రెండును చేరి ఈశ్వరుఁడని, అధిష్ఠానచైతన్యము, అవిద్యోపాధిసహితచిదాభాసుఁడు ఈ రెండును చేరి, జీవుఁడని చెప్పఁబడినది.

స్వభావము—ప్రతిబింబమం దుపాధి తనదోషమును చూపును; బింబమందు చూపదు; దర్పణరూపోపాధియందు ముఖము యొక్క ప్రతిబింబమగును; అచ్చట దర్పణరూపోపాధియొక్క శ్యామపీతలఘుకీర్త్యాదులైన అనేకదోషములు ప్రతిబింబమందు భాసిల్లును; గ్రీవాస్థితముఖమందు భాసిల్లవు; అట్లె దర్పణరూపాజ్ఞానమందుండు ప్రతిబింబరూపజీవునియందు అజ్ఞానకృతమగుచున అల్పజ్ఞత్వాదిదోషములు భాసిల్లును; బింబరూపేశ్వరునియందు భాసిల్లవు; ఈశ్వరునియందు సర్వజ్ఞత్వాదులు భాసిల్లును.

## 304. ఆభాసమునకును, ప్రతిబింబమునకును భేదము

ఆభాసపక్షమందు ఆభాసము మిథ్య యగును; ప్రతిబింబపక్షమందు ప్రతిబింబము మిథ్యగాదు; ఏలయన—ప్రతిబింబవాదిసిద్ధాంత మిది—దర్పణమందు ముఖముయొక్క ప్రతిబింబమేది గలదో, అది ముఖముయొక్క ఛాయ గాదు; ఏలాగున ననఁగా—

ఛాయకిది స్వభావము—ఏదిశయందు ఛాయావంతుని ముఖము, మఱియు పృష్ఠములగునో, ఆదిశయందే ఛాయయొక్క ముఖపృష్ఠములగును; మఱియు ప్రతిబింబముయొక్క ముఖపృష్ఠములు విపరీతములగును; కాఁబట్టి దర్పణమందుండిన ప్రతిబింబము ఛాయారూపము కాదు; మఱేమనఁగా— దర్పణమునకు విషయము చేయుటకొఱకు నేత్రమునుండి వెడలిన అంతఃకరణవృత్తి దర్పణమును విషయముచేసి, తత్కాలమందే దర్పణమునుండి పరావృత్తమయి, గ్రీవాస్థితముఖమును విషయము చేయుచున్నది; ఎట్లు భ్రమణవేగమువలన అలాతము చక్రాకారముగా భాసిల్లునో, వాస్తవముగా అలాతము చక్రా

కారము కాదో, అట్లు దర్పణమును, ముఖమును విషయము చేయుటయందు వృత్తివేగమువలన ముఖము దర్పణమునందుండు నట్లు భాసిల్లును; ముఖమో, గ్రీవయందే యున్నది; దర్పణ మందు లేదు; మఱియు ఆ ప్రతిబింబము ఛాయ కాదు; వృత్తి వేగమువలన దర్పణమునం దగు ముఖప్రతీతియే ప్రతిబింబము; విచారముచే చూచినట్టయిన, బింబప్రతిబింబభావములు గలుగుట లేదు.

అట్లు అజ్ఞానరూపోపాధియొక్క సంబంధమువలన అసంగ మయిన చైతన్యమే బింబస్థానమందు ఈశ్వరభావముచేత ప్రతి బింబస్థానమందు జీవభావముచేత ప్రతీతమగును; విచారదృష్టిచే చూచినట్టయిన ఈశ్వరభావము, జీవభావము లేవు; కాబట్టి బింబత్వ ప్రతిబింబత్వములు మిథ్య; మఱియు స్వరూపముచే బింబప్రతిబింబములు సత్యములుగా నున్నవి; ఏలాగున ననఁగా- బింబప్రతిబింబములస్వరూపము దృష్టాంతమందు ముఖము, మఱియు దార్ష్టాంతికమందు చైతన్యము; ఆ ముఖము మఱియు చైతన్యము సత్యము; కనుక బింబప్రతిబింబములును సత్యములు; ఆభాసునిస్వరూపము ఛాయ యగుటవలన మిథ్య; ఇది ఆభాస వాదమునకును ప్రతిబింబవాదమునకును [1] భేదము సర్వ

1. ప్రతిబింబవాదమందు శుద్ధబ్రహ్మమే ఈశ్వరుఁడు, గనుక వాని యందు సర్వజ్ఞతాదిధర్మములు సంభవింపవు; అయినను జీవునియొక్క అల్పజ్ఞ తాదిధర్మముల నపేక్షించి, శుద్ధబ్రహ్మమందు బింబత్వము, ఈశ్వరత్వము, సర్వజ్ఞత్వము మొదలైనధర్మములు ఆరోపితములైనవి; వాస్తవముగా జీవేశ్వరు లిద్దఱును శుద్ధబ్రహ్మరూపులే; వీ రిద్దఱియందును ధర్మములసంభవము లేదు.

## వేదాంతప్రక్రియలు [1] అద్వైతాత్మ ఎఱిఁగించుటకొఱకు

ఎట్లు బాహ్యాంగమును, అంతరాంగమును రెండును చూపునట్టి వెలయాలు, నృత్యముచేసి సభాజనులకు తనబాహ్యాంగమును చూపుచున్నదో, మఱియుం తనజారునికి అంతరాంగమును చూపుచున్నదో, అట్లు సకలధర్మములంగల మాయావిద్యయను వెలయాలు, బింబచైతన్యమునెదుట సర్వజ్ఞత్వేశ్వరత్వాదిధర్మములను చూపుచున్నది; మఱియుం ప్రతిబింబచైతన్యము నెదుట అల్పజ్ఞత్వజీవత్వాదిధర్మములను చూపుచున్నది.

1. కొన్నిగ్రంథకారులమతము ఇట్లున్నది—జలపూరితమైన అనేక ఘటములందు సూర్యునియొక్క అనేకప్రతిబింబములు అగును; వానిలో ఒక్కొక్క ప్రతిబింబమును వ్యష్టి యనఁబడును; మఱియుం అన్నిగూడిన ఒక ప్రతిబింబము సమష్టి యనఁబడును; వానియందు ఉపాధిరూపజలాభావమగుట వలన ఏప్రతిబింబముయొక్క అభావ మగునో, వానికి సూర్యునితో అభేద మగును; అన్యమునకుఁ గాదు; ఈవిధముగా ఎప్పుడు సర్వప్రతిబింబములయొక్క అభావ మగునో, అప్పుడు సమష్టిప్రతిబింబమునకు సూర్యునితో అభేద మగును.

ఈరీతిగా ప్రతిబింబవాదియొక్క పక్షమందు అనేకబుద్ధిరూపము లేక అవిద్యాంశరూపము అయిన జలమందు బ్రహ్మముయొక్క అనేకప్రతిబింబములు అగును; వానిలో ఒక్కొక్క ప్రతిబింబమును వ్యష్టి యందురు; మఱియుం అన్నియుంగూడిన ఒక ప్రతిబింబమును సమష్టి యందురు; వానిలో అనేకవ్యష్టిప్రతిబింబములు జీవులు, మఱియుం ఒకసమష్టిప్రతిబింబము ఈశ్వరుఁడు; వానియందు ఏజీవునకు ఎప్పుడు ఉపాధ్యభావమువలన అభావ మగునో, వానికి అప్పుడు బ్రహ్మముతో అభేద మగును; ఇట్లు ఎప్పుడు సర్వజీవులయొక్క అభావ మగునో, అప్పుడు ఆసమష్టిప్రతిబింబరూపమయిన ఈశ్వరునికి విదేహమోక్ష మగును.

ఉన్నవి; వానిలో ఏప్రక్రియచేత జిజ్ఞాసువునకు బోధయగునో, అదియే వానికి సమీచీనముగా నున్నది.

---

ఈపక్షమందు జగద్బ్రహ్మలయొక్క, లేక జీవబ్రహ్మఃయొక్క అభేద బోధకములయిన శ్రుతివాక్యములందు భాగత్యాగలక్షణయొక్క స్వీకారము లేదు; అయిన "గంగాయాం ఘోషః" ఈవాక్యమురీతిగా సకలవాచ్యము యొక్క త్యాగము, మఱియు తత్సంబంధమయిన బ్రహ్మముయొక్క గ్రహణమువలన జహల్లక్షణయొక్క స్వీకారము గలదు; ఇది అధిష్ఠానకూటస్థుని విడిచి, కేవలబుద్ధిసహిత మయిన, లేక అవిద్యాసహితమయిన ఆభాసము జీవునిగా అంగీకరించునట్టి కొందఱి వేదాంతైకదేశులయొక్క మతముగా నున్నది.

ఈపక్షమందు మోక్షముకొఱకు ప్రయత్నము చేయువాఁడైన జీవునికి మోక్షదశయందు అభావ మగును; కనుక "ధనవృద్ధివాంఛవలన వ్యాపారము చేయఁగా వర్తకుని మూలధన మును నష్టమాయెను." ఈన్యాయముగా మోక్షప్రాప్తికొఱకు ప్రయత్నముచేయువాఁడైన జీవునియొక్క స్వరూపము నష్ట మగును ; ఈయర్థము నెఱిఁగిన, ఆసిద్ధాంతమందు ఏముముక్షువునకు ప్రవృత్తి గానేరదు ; కాఁబట్టి ఈపక్షము సమీచీనము గాదు.

పంచదశ్యాదిగ్రంథమందు భాగత్యాగలక్షణాంగీకారము గలదు ; అచ్చట ఆకాశప్రతిబింబముయొక్కయు, ముఖప్రతిబింబముయొక్కయు అధిష్ఠానరూపోపాదానము ఘటాకాశము, దర్పణముగా నున్నవి ; మఱియు పరిణామ్యుపాదానము జలము, అవిద్యగా నున్నవి ; నిమిత్తకారణము ఘటాకాశబింబములతో ఉపాధులయొక్క సాన్నిధ్యముగా నున్నది ; ఆప్రతిబింబములబాధచే తమతమబింబములైన ముఖాదులతో అభేదము గలదు ; అట్లయిన, ఎదివఱకు దర్పణాదికముయొక్కయు, బింబముయొక్కయు సాన్నిధ్యరూప మయిన నిమిత్తముండునో, అదివఱకు బాధితప్రతిబింబముల యొక్క అనువృత్తి [ప్రతీతి] యగును ; దీనిని బాధితానువృత్తి యందురు.

అట్లయినను వాక్యవృత్తియందును, ఉపదేశసాహస్రియందును భాష్యకారులు ఆభాసవాదమునే వ్రాసియున్నారు; అందువలన శ్రీగురువు తదనుసారముగ తత్త్వమసిమహావాక్యమును పలుకనారంభించెను.

---

ఆప్రకారముగా చిదాభాసరూపజీవునకు అధిష్ఠానరూపోపాదానము కూటస్థుఁడు, పరిణామ్యుపాదానము బుద్ధి, లేక అజ్ఞానాంశము; నిమిత్తకారణము ప్రారబ్ధము; వీనినుండి చిదాభాససహితబుద్ధిరూపము, లేక అజ్ఞానాంశరూపము అయిన తనఉపాధియొక్క బాధచేసి, అహమాదిజీవవాచకపదముల యొక్క లక్ష్యార్థమయి, అధిష్ఠానరూపకూటస్థుఁడైన నిజరూపము ఏది గలదో, దానియందు అభిమానముధరించి, ఆకూటస్థునికి బింబరూపబ్రహ్మముతో పూర్వసిద్ధమయిన ఏకత ఎఱుఁగువాఁడు ముక్తుఁడు, ఇతరులు బద్ధులు.

యద్యపి ఉక్తమయిన "అహం బ్రహ్మాస్మి" ఈజ్ఞానసమయమందు అవిద్యారూపోపాదానముయొక్క బాధద్వారమున దానికార్యమయిన జగత్సహితచిదాభాసునియొక్కయు బాధ యగును; తథాపి ఎదివఱకు ప్రారబ్ధరూపనిమిత్తము గలదో, అదివఱకు బాధితమయిన జగత్సహితచిదాభాసుని ప్రతీతి యగును; ఎప్పుడు ప్రారబ్ధాంతమగునో, అప్పుడు ఆప్రతీతియొక్క అభావమగును; అదియే విదేహమోక్షము. పూర్వోక్తపక్షముకన్న ఈపక్షము ఉత్తమము.

మఱియు ప్రతిబింబవాదమందు ముఖప్రతిబింబముయొక్క అధిష్ఠానరూపోపాదానము ముఖరూపబింబము, పరిణామ్యుపాదానము బింబముయొక్క అజ్ఞానము, నిమిత్తకారణము దర్పణబింబములయొక్కసాన్నిధ్యము; బింబప్రతిబింబములయొక్క అభేదజ్ఞానమువలన ప్రతిబింబముయొక్క అభావరూపనివృత్తి యగును; అయినను, ఎదివఱకు బింబముయొక్కయు దర్పణముయొక్కయు సాన్నిధ్యరూపోపాధినిమిత్తము గలదో, అదివఱకు మిథ్యగా తెలియఁబడిన ప్రతిబింబస్వరూపముయొక్క ప్రతీతి యగును; మఱియు

మాయయు, మాయయందాభాసమును, మాయాధిష్ఠాన చైతన్యమునుగూడి, సర్వశక్తిసర్వజ్ఞత్వాది ధర్మసహితుఁడయిన ఈశ్వరుఁడు, వాఁడుతత్పదమునకువాచ్యుఁడు;వ్యష్ట్యవిద్యయు, అవిద్యయందాభాసుఁడును,అవిద్యాధిష్ఠానచైతన్యమునుగూడి,

---

ఎప్పుడు దర్పణము అపసారిత మగునో, అప్పుడు ప్రతిబింబప్రతీతియొక్క అభావ మగును.

ఈపక్షమందు ఏకాజ్ఞానముచే శుద్ధబ్రహ్మరూపబింబమందు జీవరూప ప్రతిబింబభావము ప్రతీత మగుచున్నది; దానికి ఉపాదానము అజ్ఞానము; మఱియు అధిష్ఠానము శుద్ధబ్రహ్మము, నిమిత్తకారణము అదృష్టము; ఎప్పుడు ఆప్రతిబింబరూపజీవునకు తనబింబరూపబ్రహ్మముతో ఏకత ప్రతీత మగునో, అప్పుడు దానిప్రతిబింబభావము [జీవభావము] నివృత్తమగును; అయిన, ఎదివఱకు ప్రారబ్ధరూపోపాధినిమిత్తము గలదో, అదివఱకు ఆజీవునకు బాధిత మయిన జగత్సహితజీవభావరూప ప్రతిబింబస్వరూపముయొక్క ప్రతీతి యగును; ఎప్పుడు ప్రారబ్ధాంతమగునో, అప్పుడు ప్రతీతియొక్క అభావమై, కేవలబ్రహ్మము అవశేషముగా నుండును; అదియే వానికి విదేహమోక్షము.

ఈపక్షమునందు స్వప్నమువలె ముఖ్యమయిన ఏకజీవాంగీకారము గలదు; మఱియు నానాజీవులుప్రతీతులు, వారు జీవాభాసులు; ఈమత మందు మూఁడుసత్తల అంగీకారము గలదు; కనుక ఇదియును వ్యావహారిక పక్షమే; అయిన ఇతరమైన సకలవ్యావహారికపక్షములందు ఈపక్షము శ్రేష్ఠము.

వేదాంతమునందు కార్యకారణోపాధివాదము, అవచ్ఛిన్నానవచ్ఛిన్న వాదము, దృష్టిసృష్టివాదము మొదలయిన అనేకపక్షములయొక్క ప్రమాణము గలదు; వేదాంతముయొక్క అనేకపక్షములయనువాదము అప్పయ్యదీక్షితకృత సిద్ధాంతలేశమందును, వృత్తిప్రభాకరమందును చేయఁబడియున్నది.

అల్పశక్త్యల్పజ్ఞత్వాదిధర్మసహితుఁడయిన జీవుఁడు, వాఁడు త్వంపదమునకు వాచ్యుఁడు.

ఈరెంటికి "తత్త్వమసి" వాక్యముచేత ఏకత బోధింపబడుచున్నది; వాచ్యార్థముచేత విరోధముండుటవలన అది ఘటిల్లదు; కనుక ఆభాససహితమయిన మాయ, మాయాకృతసర్వశక్తిసర్వజ్ఞత్వాది ధర్మములు-ఈవాచ్యభాగమునువిడిచి చైతన్యభాగమందు తత్పదమునకు భాగత్యాగలక్షణ చేయవలయును; అట్లు ఆభాససహితమయిన అవిద్యాంశము, అవిద్యాకృతాల్పశక్త్యల్పజ్ఞత్వాదిధర్మములు-ఈవాచ్యభాగమునువిడిచి, చైతన్యభాగమందు త్వంపదమునకు భాగత్యాగలక్షణ చేయవలయును.

ఈరీతిగా ఈశ్వరజీవులస్వరూపమందు లక్ష్యమయిన చైతన్యభాగముయొక్క ఏకతను తత్త్వమసిమహావాక్యము బోధించుచున్నది.

## 305. అన్యమహావాక్యములందు[1] భాగత్యాగలక్షణాప్రదర్శనము.

"అయమాత్మా బ్రహ్మ[2]" అను మహావాక్యమందు ఆత్మపదమునకు వాచ్యుఁడు జీవుఁడు, మఱియు బ్రహ్మపదమునకు వాచ్యుఁడు ఈశ్వరుఁడు ఈరెండుపదములందు లక్షణయొక్క

1. "తత్త్వమసి" ఇదియొక ఉపదేశవాక్యము, మఱియు దీనికన్న భిన్నమయిన అయమాత్మాబ్రహ్మేత్యాదులు మూఁడు అనుభవవాక్యములు కలవు.

2 ఇది మాండూక్యోపనిషద్గతమయిన మహావాక్యము. దీనివిశేష వర్ణనము పంచదశియందు వ్రాయఁబడియున్నది.

ప్రమాణముగలదు; లక్ష్యార్థము పరోక్షముగాదని తెలియఁబఱు చుటకొఱకు అయంపదము గలదు; ఈ అయంపదమువలన అంద ఱికి అపరోక్షముగు [1] ఆత్మ, బ్రహ్మ మని తెలియఁబఱుపఁబడి యున్నది.

"అహంబ్రహ్మాస్మి [2]" ఈమహావాక్యమందు అహంపద మునకు వాచ్యుఁడు జీవుఁడు, బ్రహ్మపదమునకు వాచ్యుఁడు ఈశ్వ రుఁడు. ఈ రెండుపదములకు చైతన్యభాగమందు లక్షణ గలదు; "నేను బ్రహ్మముగా నున్నాను" అనున దీవాక్యమునకు అర్థము.

"ప్రజ్ఞానమానందం బ్రహ్మ [3]" ఈమహావాక్యమందు ప్రజ్ఞానపదమునకు వాచ్యుఁడు జీవుఁడు, బ్రహ్మపదమునకు వాచ్యుఁడు ఈశ్వరుఁడు. ఈ రెండుపదములకుచైతన్యభాగమందు లక్షణ గలదు; లక్ష్యమైన బ్రహ్మాత్మ, ఆనందగుణముగలవాఁడు గాఁడు; ఆనందరూపుఁడుగా నున్నాఁడు; ఈయర్థమును ఎఱుఁ గుటకొఱకు ఆనందపదము గలదు; ఆత్మకన్న అభిన్నమయిన బ్రహ్మము ఆనందరూపముగ నున్నది; ఇది ఈవాక్యమునకు అర్థము.

---

1. అపరోక్షము ద్వివిధము—ఆత్మయొక్క స్వరూపము స్వయం ప్రకాశముగా నుండును; ఇది మొదటిది. మఱియు "నేను స్వప్రకాశాత్మను" ఈరీతిగా దేనిచేత ఆవరణభంగ మగునో, అట్టి బుద్ధిరూపజ్ఞానము రెండవది; వీనిలో—ప్రథమాపరోక్షము నిత్యము, మఱియు రెండవ అపరోక్షము అనిత్యము.

2. ఇది యజుర్వేదముయొక్క బృహదారణ్యకోపనిషద్గత మహా వాక్యము.

3. ఇది ఋగ్వేదముయొక్క ఐతరేయోపనిషద్గతమహావాక్యము.

ఎట్లు మహావాక్యములందు భాగత్యాగలక్షణా గ్రహణము చేయవలయునో, అట్లు సత్యజ్ఞానానందాద్యన్యములగు అవాంతరవాక్యములందును శుద్ధబ్రహ్మరూపార్థమును భాగత్యాగలక్షణచేతనే గ్రహింపవలయును; శక్తిచేత గ్రహింపఁగూడదు; ఏలయన—శుద్ధబ్రహ్మము ఏపదమునకును వాచ్యముగాదు; ఇది సిద్ధాంతము. సకలపదములు విశిష్టబ్రహ్మమునకు వాచకములుగాను, శుద్ధబ్రహ్మమునకు లక్షకములుగాను ఉన్నవి.

చూడుము—"సత్యజ్ఞానానందమ్" ఈవాక్యమునందు మాయయొక్క ఆపేక్షికసత్యత, మఱియు చైతన్యముయొక్క నిరపేక్షసత్యత ఈరెండునుగూడి, సత్యపదమునకు వాచ్యము; నిరపేక్షసత్యత లక్ష్యము; బుద్ధివృత్తిరూప మయిన, లేక మాయావృత్తిరూప మయిన జ్ఞానము, స్వయంప్రకాశజ్ఞానము ఈరెండును గూడి, జ్ఞానపదమునకు వాచ్యము, స్వయంప్రకాశ జ్ఞానము లక్ష్యము; విషయసంబంధజన్యసుఖాకారమయిన అంతఃకరణముయొక్క సాత్త్వికవృత్తి, మఱియు పరమప్రేమాస్పదమగు స్వరూపసుఖము ఈరెండును గూడి ఆనందపదమునకు వాచ్యము, స్వరూపసుఖము లక్ష్యము.

ఈరీతిగా బ్రహ్మవాచక మయిన సకలపదములకును శుద్ధబ్రహ్మస్వరూపమునందు లక్షణాప్రతిపాదనము సంక్షేపశారీరకమునందు చేయఁబడియున్నది.

## 306. ప్రశ్న—రెండుపదములందు లక్షణ యంగీకరించుట నిష్ఫల మగును.

ఒకానొకఁడు శంకించును—మహావాక్యములందుండిన విరోధము దూరముచేయుటకొఱకు రెండుపదములందు లక్ష

ణాంగీకారము నిష్ప్రయోజనము; మఱేయనఁగా—ఏకపదము నందు లక్షణాంగీకారముచేయుటవలననే విరోధము దూరమగు చున్నది; దీనికి యభిప్రాయ మిది—సర్వజ్ఞత్వాది విశిష్టునకు అల్పజ్ఞత్వాది విశిష్టునితో ఏకత ఘటిల్లకున్నను, ఏకపదమునకు లక్ష్యమయిన ఏశుద్ధము గలదో, దానికి ద్వితీయ విశిష్టునితో ఏకత ఘటిల్లును. చూడుము.

"శూద్రమనుష్యుఁడు బ్రాహ్మణుఁడుగా నున్నాఁడు" ఈలాగు శూద్రత్వధర్మవిశిష్టుఁడయిన మనుష్యునకు బ్రాహ్మణత్వ ధర్మవిశిష్టునితో ఏకతచెప్పుట విరుద్ధము; అయిన, మనుష్యుఁడు బ్రాహ్మణుఁడుగా నున్నాఁడు; ఈలాగు శూద్రత్వధర్మరహితుఁ డయిన శుద్ధమనుష్యునకు బ్రాహ్మణత్వవిశిష్టత చెప్పుటయందు విరోధము లేదు; అట్లు అల్పజ్ఞత్వాదిధర్మ విశిష్టచైతన్యమునకు సర్వజ్ఞత్వాది ధర్మవిశిష్టచైతన్యముతో ఏకత విరుద్ధమయినను, జీవవాచకపదమునకు, లేక ఈశవాచకపదమునకు చైతన్యమందు లక్షణచేసి, ఆచైతన్యమాత్రమునకు సర్వజ్ఞత్వాదిధర్మవిశిష్టు నితో లేక అల్పజ్ఞత్వాదివిశిష్టునితో ఏకత చెప్పుటయందు విరోధము లేదు.

## 307. 306—గతప్రశ్నకుత్తరము—రెండు పదములందు లక్షణ సఫలము.

ఎవఁడు ఏకపదమందే లక్షణను అంగీకరింపవలయు ననునో, వాని నిట్లడుగవలయును: రెండుపదములలో దేని యందు లక్షణాంగీకారము చేయవలెను ?

వాఁడు ఇట్లనును—సర్వమహావాక్యములయొక్క ప్రథమ పదమందు లక్షణ గలదు; ద్వితీయమునందు లేదు; లేక ద్వితీయ

మందుఁ గలదు; ప్రథమమందు లేదు; ఆమాట ఘటిల్లదు; ఏల యన—"అహం బ్రహ్మాస్మి, ప్రజ్ఞానమానందం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ" ఈమూఁడువాక్యములందు జీవవాచకపదము మొదటిది గలదు; అందువలన ఈమూఁడుస్థానములందు ప్రథమపదమందు లక్షణాంగీకారము చేసినట్టయిన, ఈ వాక్యములకు ఈయర్థ మగును—అల్పజ్ఞత్వాది విశిష్టమయిన జీవపదమందు ఏచైతన్య భాగము గలదో, అది సర్వజ్ఞత్వాది విశిష్టేశ్వరరూపముగా నున్నది; మఱియు తత్త్వమసివాక్యమందు ఈశపదము మొదటిది; అందువలన ఈస్థానమందు ఈయర్థ మగును—సర్వజ్ఞత్వాది ధర్మవిశిష్టమయిన ఈశపదమందు చైతన్యభాగము ఏది గలదో, అది అల్పజ్ఞత్వాదివిశిష్టసంసారిజీవరూపముగా నున్నది; ఏల యన—మూఁడు వాక్యములందు ప్రథమము జీవవాచకపదము, దానికి చైతన్యభాగమందు లక్షణ, మఱియు ద్వితీయమయిన ఈశ్వరవాచకపదవాచ్యమునకు గ్రహణమగును; "తత్త్వమసి" అను ఒక వాక్యమునందు మొదటిది ఈశవాచకపదము, దానికి చైతన్యభాగమందు లక్షణ, మఱియు రెండవదయిన జీవవాచక పదవాచ్యమునకు గ్రహణమగును; దానివలన సర్వజ్ఞానం దాత్మకుఁడైన ఈశ్వరుఁడు అల్పజ్ఞుఁడై, దుఃఖాత్మకుఁడగు జీవుఁ డగును.

ఉక్తప్రకారముగా నియమము చేసినట్టయిన, సర్వవాక్యములకు పరస్పరవిరోధ మగును; మఱియు సర్వవాక్యముల యొక్క ద్వితీయపదమునందు లక్షణాంగీకారము చేసినట్టయిన, ఉక్తప్రకారమునకు విపరీత ప్రకారార్థమగును; అయిన, నాలుగు వాక్యములకు ఏకపద్ధతిచే అర్థము గానేరదు, ఈరీతిగా ప్రథమ

పదమునందో, లేక ద్వితీయపదమునందో, లక్షణానియమము ఘటిల్లదు.

**308. ఈశవాచకపదమునందు లక్షణాంగీకారము, మఱియు దానికి ఉత్తరము.**

ఒకానొకం డిట్లనును— ప్రథమపదమునందు లేక ద్వితీయపదమునందు లక్షణానియమము లేదు; అయిన, సర్వవాక్యములలో ఈశ్వరవాచకపదమునందు లక్షణాంగీకారము చేయవలెను; ఆ ఈశ్వరవాచకపదమునందు పూర్వముగానీ, లేక ఉత్తరముగానీ; ఆమాటయు ఘటిల్లదు; ఏలయన— ఈ ప్రకారముగా శ్రుతివాక్యములో లక్షణాంగీకారమువలన ఈశపద లక్ష్యార్థమైన శుద్ధచైతన్యము ఏది గలదో, అది సర్వానర్థసహితత, అల్పజ్ఞత, పరాధీనత, జన్మమరణము మొదలగునవానికి గనియైన సంసారిజీవమగును; దానివలన పురుషార్థమునకు [మోక్షమునకు] హాని యగును.

దానికభిప్రాయము— ఈశ్వరవాచకపదమునందు లక్షణ అంగీకరించినప్పుడు, మహావాక్యములకు ఇది అర్థమగును— ఈశపదమునకు లక్ష్యమయిన అద్వయాసంగమాయారహితచైతన్యమేదిగలదో, అది అవిద్యాధీనత్వపుణ్యపాపసుఖదుఃఖజన్మమరణాద్యనంతానర్థములకు పాత్రముగా నున్నది; ఇట్లు మహావాక్యముయొక్క అర్థమయినప్పుడు, జిజ్ఞాసువునకు ఈయర్థమందు బుద్ధి నుంచవలసి వచ్చును; ఏయర్థమందు బుద్ధియొక్క స్థితి యగునో, ఆయర్థమే ప్రాణవియోగానంతరము ప్రాప్తమగును; వేదవాక్యవిచారముచే ముముక్షువునకు అనర్థప్రాప్తియే యగును; ఆనందప్రాప్తి కాదు.

"యం యం వాఽపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః." భ. గీ.

ఈరీతిగా ఈశ్వరవాచకపదమునందు లక్షణానియమము అసంగతము.

## 309. జీవవాచకపదమునందు లక్షణాంగీకారము, దీని కుత్తరము.

ఒకానొకఁడిట్లనును—సర్వమహావాక్యములందు జీవవాచకపదములో లక్షణాంగీకారము చేయఁదగినది, దీనివలన పురుషార్థమునకు హానిలేదు; ఇచ్చట మహావాక్యమున కిట్టి యర్థమగును—త్వంపదమునకు లక్ష్యమయిన ఏ చైతన్యభాగము గలదో, అది సర్వశక్తి సర్వజ్ఞేశ్వరరూపముగా నున్నది; ఈయర్థమందు బుద్ధియొక్క స్థితి చేసినట్టయిన, జిజ్ఞాసువునకు అత్యుత్తమమయిన ఈశ్వరభావముయొక్క ప్రాప్తి యగును; ఈ ప్రకారముగా జిజ్ఞాసువునకు సద్గతిదాయకమైనట్టి జీవవాచకపదమునందు లక్షణాంగీకారము యోగ్యము?

దానికి సమాధానము—త్వంపదమునకు లక్ష్యార్థము సాక్షి, వాఁడు ఈశ్వరరూపుఁడగుట ఘటిల్లదు; అందువలన శ్రీశంకరభగవత్పాదుఁడు రెండుపదములందును లక్షణ చెప్పియున్నాఁడు; దాని కిది యభిప్రాయము—

జీవవాచకమైన త్వంపదమునకు లక్షణ వ్యాపకచైతన్యమందున్నదా? లేక జీవోపాధిస్థితముగు సాక్షిచైతన్యమందున్నదా? వ్యాపకచైతన్యమందు చెప్పినట్టయిన, ఘటిల్లదు; ఏలయన—వాచ్యార్థమందు దేనికి ప్రవేశము గలదో, దానియందే

లక్షణయగును; వాచ్యార్థమునందు వ్యాపకమయిన ఈశచైతన్యమునకు ప్రవేశము లేదు; జీవోపాధిదేశస్థితమగు సాక్షిచైతన్యమునకు ప్రవేశము గలదు; ఆసాక్షిచైతన్యమందు సర్వహృదయప్రేరకత్వము, సర్వప్రపంచవ్యాపకత్వము మొదలయిన ఈశ్వరధర్మములు సంభవింపవు; మఱియు ఆ సాక్షి, సదా అపరోక్షమగుటవలన వానియందు ఈశ్వరధర్మమయిన పరోక్షత సంభవింపదు; మఱియు మాయారహితుని మాయావిశిష్టుఁడని చెప్పుట అయుక్తము; ఎట్లనఁగా—దండరహితుని దండియని చెప్పుట, సంస్కారరహితద్విజబాలకుని సంస్కారవిశిష్టుఁడని చెప్పుట అయుక్తము; ఏరీతిగాను సాక్షికి ఈశ్వరునితో అభేదము సంభవింపదు; కావున అభేదము చెప్పినపక్షమందు మహావాక్యము అసంభవార్థప్రతిపాదకమగును.

## 310. రెండుపదములందు లక్షణ, మఱియు ఓతప్రోతభావము.

రెండుపదములందు లక్షణనంగీకరించిన, ఏదోషము లేదు; ఏలయన—ఉపాధివలనను, ఉపాధిధర్మములవలనను చైతన్యమునందు పరస్పరభేదము గలదు; స్వరూపముచేత భేదములేదు; కనుక ఉపాధియొక్కయు, ఉపాధిధర్మములయొక్కయు త్యాగము చేయుటవలన రెండుపదములయొక్క లక్ష్యమయిన చైతన్యమునకు ఏకత సంభవించును; ఘటాకాశమందు ఘటదృష్టిని విడిచినను, మఠవిశిష్టాకాశముతో ఏకత ఘటిల్లదు; అయినను, ఘటమఠదృష్టినివిడిచిన, ఆకాశమాత్రమునకు ఏకత ఘటిల్లును; అందువలన ఓశిష్యుఁడా! తత్త్వమసి వాక్యమునందు

"తత్త్వమ్" "త్వంతత్" ఈరీతిగా ఓతప్రోతభావప్రకారముగ [1] ఎఱుఁగుము, ఓతప్రోతభావముయొక్క బాహుళ్యముచేత వాక్యార్థమందుండిన పరోక్షతా భ్రాంతియొక్కయు, పరిచ్ఛిన్నతాభ్రాంతియొక్కయు హానియగును.

"తత్త్వమ్" అని చెప్పుటవలన తత్పదార్థమునకు త్వంపదార్థముతో అభేదప్రతీతి యగును; ఆ త్వంపదముయొక్క యర్థము యైనసాక్షి, అపరోక్షుఁడగుటవలన పరోక్షభ్రాంతికిహానియగును; మఱియు "త్వంతత్" అని చెప్పుటవలన త్వంపదార్థమునకు తత్పదార్థముతో అభేదము ప్రతీతమగును; ఆతత్పదముయొక్క యర్థముయైన శుద్ధబ్రహ్మము వ్యాపకమగుటవలన పరిచ్ఛిన్నభ్రాంతికి హాని యగును.

అట్లు అన్యవాక్యములందును "అహం బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, ఆత్మా బ్రహ్మ" ఇట్లనుటచేత పరిచ్ఛిన్నతాభ్రాంతికి హాని యగును; మఱియు "బ్రహ్మాహమ్, బ్రహ్మజ్ఞానమ్, బ్రహ్మాత్మా" అనుటచేత పరోక్షతాభ్రాంతికి [2] హానియగును; ఓశిష్యుఁడా! వేదమందును, శాస్త్రమందును ఏయేస్థానమందు జీవబ్రహ్మముల

1. గమనాగమనరూపమయిన పరిచయములేక, మార్గముయొక్క సమ్యగ్జ్ఞానము గాదు; అట్లు ఓతప్రోతభావములేక, సమ్యగభేదజ్ఞానము గాదు; కనుక మహావాక్యోపదేశానంతరము జిజ్ఞాసువునకు ఓతప్రోతభావము కర్తవ్యము. దానినే అన్వయవ్యతిరేక మనియును అందురు.

2. ఇచ్చట ఈప్రశ్న గలదు—మహావాక్యోపదేశమునకనంతరము జిజ్ఞాసువునకు బ్రహ్మమునందు, మఱియు ఆత్మయందు పరోక్షతయొక్కయు, పరిచ్ఛిన్నతయొక్కయు భ్రాంతి ప్రతీతమగును; అది కారణములేక సంభవింపదు; అచ్చట భ్రాంతికారణము అన్యమేమో, ఏదియు సంభవింపదు; ఒకటి

బ్రహ్మామునందుండు మాయ, మఱియుం ఆత్మయందుండు అవిద్యయే భ్రాంతికి కారణమగుట సంభవించును—

ఆ మాయావిద్యలో బ్రహ్మాశ్రితమై పూర్వకాలమందుండెను; ఎప్పుడు జిజ్ఞాసువు తత్త్వంపదార్థములశోధనముం జేసెనో, అప్పుడు అవిరెండును నష్టములగును; ఎట్లు ఘటస్వరూపముయొక్క విచారము చేసినవెనుక ఘటనిష్ఠావిద్య యుండదో, అట్లు బ్రహ్మాత్మలయొక్క విచారము చేసినవెనుక మాయావిద్యలు ఉండవు.

తృతీయచైతన్యమో, లేదు; చైతన్యముగాక అన్యజడవస్తువులను ఆశ్రయించినవైన మాయావిద్య లుండవు; మాయావిద్యలులేక ఉక్తద్వివిధభ్రాంతి సంభవింపదు; మఱియుం జిజ్ఞాసువుయొక్క చిత్తమందు ప్రతీయమానమైన భ్రాంతికి మాయావిద్యలుగాక అన్యకారణము సంభవింపదు. ఈయర్థాపత్తి ప్రమాణముచేత మాయావిద్యలస్థితియొక్క కల్పన అయినది; కాఁబట్టి మహావాక్యోపదేశానంతరము అవే మాయావిద్యలు ఎచ్చటనుండి ఆ ద్వివిధభ్రాంతిని పుట్టించును?

దీనికి ఉత్తరము—యద్యపి తత్త్వంపదార్థశోధనమయిన తరువాత జ్ఞాతులైన బ్రహ్మాత్మలయందు మాయావిద్యలు సంభవింపవు; తథాపి మహావాక్యార్థరూపమైన ఏబ్రహ్మాత్మలయొక్క ఏకత గలదో, అది సమ్యగ్జ్ఞాతము గాలేదు; కావున నది యజ్ఞాన మనియే యెఱుఁగవలయును; ఆయజ్ఞాతైకతయందు మాయావిద్య లుండి, పరోక్షతాపరిచ్ఛిన్నతాభ్రాంతిని పుట్టించినది.

ఈభ్రాంతియొక్క నివారణముకొఱకు ఓకప్రోతభావము చేయఁదగినదిగా నున్నది; ఓకప్రోతభావముచేయుటవలన ఏకతయొక్క సమ్యగ్జ్ఞానమై మాయావిద్యలనివృత్తిద్వారమున పరోక్షతాపరిచ్ఛిన్నతాభ్రాంతియొక్క నివృత్తి యగుచున్నది.

పేకత చెప్పఁబడినదో, ఆయాస్థానమందు అంతటను ఉక్తప్రకారముగా భాగత్యాగలక్షణచేత అర్థగ్రహణము చేయుము.

**311.** ప్రశ్న-సార్థగ్రంథాధ్యయనము చేసినను, ఈవనము దుఃఖహేతువుగా కనఁబడుచున్నది.

ఈప్రకారముగ స్వప్నస్థగురూపదేశము శ్రవణముచేసికొని, అగృధదేవుఁడు ప్రార్థించెను—ఓభగవంతుఁడా! మీరు గ్రంథమును చదివించితిరి; దానియొక్క అర్థసహితాధ్యయనము నేను చేసితిని; అట్లయినను, ఈవనము నాకు దుఃఖహేతువుగా కనఁబడుచున్నది; కనుక నేను తన్నివృత్తి కోరుచున్నాను; నీవు కృపచేసి, తన్నివృత్త్యుపాయమును నాకు చూపవలయును.

**312.** 311—గతప్రశ్నకుత్తరము—వననాశమునకు హేతువు మహావాక్యవిచారము, అగృధదేవుని స్వప్నసమాప్తి.

శిష్యుని ప్రార్థనవిని, స్వప్నస్థగురువు పలికెను—ఓశిష్యుఁడా! ఈయరణ్యహానికి మఱియొకఉపాయము లేదు; వననాశనహేతువు ఒకమహావాక్యవిచారమే. ఓశిష్యుఁడా! మహావాక్యముయొక్క లక్ష్యార్థమైన ఏయగృధదేవుఁడో, వాఁడు నీవుగా నున్నావు; కాఁబట్టి "నేను అగృధదేవుఁడు, అగృధదేవుఁడు నేను" ఈప్రకారముగా ఓతప్రోతభావముచేత నీవు గట్టిగా అఱువుము; ఇట్లు శ్రీగురువచనమువిని, శిష్యుఁడు- "నేను అగృధదేవుఁడు, అగృధదేవుఁడు నేను" ఇట్లు గట్టిగా అఱచుచున్నాఁడు; దానివలన నిద్రాదోషసహితమైన స్వప్నముయొక్క నాశమై, కండ్లు తెఱచెను; అప్పుడేమి! వనము

లేదు, గురువు లేఁడు, గ్రంథమును లేదు; "నేను నామంచము వయిన సుఖరూపముగా కండుకొన్నాను".

## 313. మిథ్యావేదగురువులచే మిథ్యాజగత్తు యొక్క పరిహారము

వారణాసీక్షేత్రవాసియైన పూర్వగురువు, తర్కదృష్టి నామధేయుఁడగుతనశిష్యునకు చెప్పుచున్నాఁడు—ఓశిష్యుఁడా! చూడుము—స్వప్నస్థమిథ్యాగురువుచే మిథ్యాగురువుయొక్క అధ్యయనముచేసికొనియు, అగ్నిధదేవుని కల్పితమయిన మిథ్యారణ్యముయొక్క సంహారమాయెను; ఆప్రకారముగా మిథ్యావేదగురువులవలన మిథ్యాసంసారముయొక్క నాశము ఆవశ్యముగా కలుగును.

పూర్వము పంచమతరంగమునందు ప్రతిపాదనముచేసిన రాజుయొక్క స్వప్నస్థతనివృత్తికొఱకు సత్యమయినఔషధము, మఱియు సత్యుఁడైనవైద్యుఁడు నిరర్థకమయినప్రకారముగా సత్యవేదగురువులచే మిథ్యాసంసారముయొక్క నాశము ఘటిల్లదు; కాఁబట్టి సంసారనివృత్తికొఱకు సత్యవేదగురువుల యొక్క అపేక్షయు లేదు.

ఏస్వప్నదృష్టాంతముచే ప్రపంచము మిథ్యయనవలెనో, ఆస్వప్నము నీవు సత్యమని గట్టిపట్టుపట్టితివి; ఇదివఱకు మేము యుక్తులచే ఆభ్రమము నిరాకరించియున్నాము; ఓతర్కదృష్టే! జన్మమరణాదులగు ప్రపంచము స్వప్నన్యాయమున మిథ్యయని ఎఱుఁగుము సుమా!

ఈవిధముగా ప్రపంచమిథ్యాత్వప్రతిపాదకమయిన ఏ విచారాబ్ధిషష్ఠతరంగము గలదో, దాని శ్రవణముచేసికొని, తర్కదృష్టి స్వతః కనిష్ఠాధికారిగా నుండినను, కృతకృత్యుం డాయెను; అందువలన ఉత్తమమధ్యమాధములలో ఏయధికారి యయినను, యుక్తిప్రధానమైన ఈతరంగముయొక్క శ్రవణ పఠనముచేసినయెడ, వాఁడు సద్గురుకృపవలన మిథ్యయయిన ఈభవసింధువును దరించుచున్నాఁడు.

ఇది శ్రీ ప్రపంచమిథ్యాత్వవర్ణననామకము.

అట్లు కనిష్ఠాధికారిసంశయనికృంతననామకము అగు షష్ఠతరంగము

సంపూర్ణము.

---



# శ్రీవిచారసాగరము

## సప్తమతరంగము

### జీవన్ముక్తివిదేహముక్తివర్ణనము.

#### 314. జ్ఞానికి వ్యవహారమందు నియమము లేదు

శ్రీగురువు, ముగ్గురన్నదమ్ములకు తోడనే యుపదేశము చేసెను; ఉపదేశమందో, ఏమియూ విలక్షణత లేకుండినను, గురూపదేశమువలన ఉత్తమసాక్షాత్కారము తత్త్వదృష్టి కాయెను. తరువాత పవనయోగముచేత ఎట్లు శుష్కపత్రము భ్రమణము చేయునో అట్లు శేషప్రారబ్ధముచేత తత్త్వదృష్టియొక్క వ్యవహారక్రియ నడుచుచున్నది.

ఒకానొకప్పుడు ఉత్తమరథారూఢుఁడై, గజారూఢుఁడై, అశ్వారూఢుఁడై సంచరించును; ఒకప్పుడు నగ్నపాదుఁడై, నడుచును; ఒకప్పుడు ఉత్తమవస్త్రాలంకారములచేత అతనిశరీరము శోభిల్లును; ఒకప్పుడు దుమ్ముబురదలచేత నిండియుండును; ఒకప్పుడు ఉత్తమప్రాసాదమందు దాసదాసీసహావర్తమానుఁడై, నివాసము చేయును; ఉత్తమమృష్టసభోజనము చేయును; ఉత్తమ

మంచమునందైన పరుండును; ఒకప్పుడు క్షుధచేత వ్యాకులుఁడై, గిరికందరమందు తిరుగును; రాతిపై నిద్రపోవును.

కొందఱు భక్తజనులు వాని నవలోకించి, "మహాత్ముఁడు" భగవద్రూపుఁడు అనియెంచి, పూజచేయుదురు; కొందఱు దుష్టజనులు నిందించుచు రాళ్ళు వేయుదురు; పూజచేయువారు వాఁడుచేయు సుకృతమును పొందుదురు; నిందచేయువారు వాఁడుచేయు దుష్కృతమును [1]పొందుదురు; ఈరీతిగా తత్త్వదృష్టియొక్క ఆయువంతయు నియమరహితముగా వ్యవహారము నడుచుచున్నది.

## 315. జ్ఞానికి సమాధియందే ప్రవృత్తి యుండవలెనని ఆక్షేపము 315—330

కొందఱు [2]అనుచున్నారు—జ్ఞానికి వ్యవహారమందు నియమము లేదు; అయినను, జ్ఞానికి వ్యవహారనివృత్తి నియమము గలదు; జ్ఞాని, సతతము సమాధియందు వర్తింపవలెను; వ్యవహారమయినను భిక్షాన్నజలపానాది శరీరనిర్వాహమంత చేయవలయును; ఆ శరీరనిర్వాహ వ్యవహారమునందును జ్ఞాని, జుగుప్సచేయుచు,సమాధియందే ప్రయత్నము చేయవలయును. ఎవ్వఁడు జ్ఞానవంతుఁడు సమాధిసుఖమును విడిచి, వ్యవహారమందు తిరుగుచున్నాఁడో, వాఁడు శ్వానవరాహములవలె నగును?

---

1. ఇది ఒక అర్థవాదవచనము గ్రంథాంతరమందును వ్రాయఁబడియున్నది.

2. కేవలసన్న్యాసినే జ్ఞానమునకు ముఖ్యాధికారిగా తెలియువారు శంకరానందస్వామి మొదలయిన వారు.

ఈ ప్రకారముగా జ్ఞానికి సమాధియందు ఆదరము, వ్యవహారమునందు అనాదరము కావలెనను మాటను విని, తత్త్వదృష్టి నవ్వుచున్నాఁడు; ఎందు కనఁగా— జ్ఞానికి వ్యవహారనియమము కావలెననువాక్యము మహాత్ముఁడైన తత్త్వదృష్టికి పిశాచావిష్టుఁడగు పురుషుని ప్రలాపమువలె అవ్యవస్థితముగా కనఁబడుచున్నది.

అభిప్రాయ మే మనఁగా— జ్ఞానవంతునివ్యవహారమందు అజ్ఞానము, తత్కార్యమైన భేదభ్రాంతి, మఱియుతత్కార్యమైన రాగద్వేషములు ఉండవు; తద్వ్యవహారమందు ప్రారబ్ధకర్మము నిమిత్తముగా నున్నది; ఆప్రారబ్ధకర్మము, పురుషభేదమువలన నానాప్రకారముగ నగును; కనుక ఆ ప్రారబ్ధకర్మజన్య వ్యవహారమునందు నియమము సంభవింపదు; ఇది సిద్ధాంతపక్షము.

కొందఱందురు— జ్ఞానవంతునకు ప్రవృత్తి గలిగినను, దేహస్థితి హేతువయిన భిక్షాసన కౌపీనగ్రహణమందే గలుగును; అన్యప్రవృత్తి గలుగనేరదు; ఏలయన— జ్ఞానోత్పత్తికన్న మొదలు జిజ్ఞాసాకాలములో విషయమందు దోషదృష్టిచేత వైరాగ్యముగును; ఆవైరాగ్యము జ్ఞానోత్పత్తికి తరువాతను ఉండును; మఱియు జ్ఞానోత్తరకాలములో విషయమందు మిథ్యాబుద్ధిచే వైరాగ్యమగును; అపరోక్షరూపముచే మిథ్యయని యెఱిఁగిన పదార్థమందు సత్యత్వబుద్ధి గానేరదు; దోషదృష్టిచే రాగము గానేరదు; ప్రవృత్తియో, రాగముచేతనగును; జ్ఞానియందు రాగము సంభవింపనందున ప్రవృత్తిగానేరదు.

శరీరనిర్వాహకమయిన భోజనాదికమందు ప్రవృత్తియో, రాగములేకయు ప్రారబ్ధకర్మమువలన సంభవించెను; ఏలాగున

ననఁగా కర్మము [1] త్రివిధము—మొదటిది సంచితము, రెండవది ఆగామి, మూఁడవది ప్రారబ్ధము; వీనిలో—

(1) భూతశరీరములందు చేయఁబడినకర్మములో ఫలారంభరహిత మేది గలదో, దానిని సంచిత మందురు.

(2) భవిష్యత్కర్మమును ఆగామి యందురు [జ్ఞానము సంపాదింపనిపక్షమందు సంచితకర్మములో చేరునట్టి జ్ఞానియొక్క వర్తమానశరీరమునందు చేయఁబడిన కర్మమును ఆగామి యందురు. దానినే క్రియమాణ మందురు.]

(3) భూతశరీరములందు చేయఁబడిన వర్తమానశరీరమునకు హేతువయిన కర్మమును ప్రారబ్ధ మందురు.

---

1. ఒకకాపు, ఉత్పన్నమయిన ధాన్యమును కణఁజమందు వేసుకొనుచున్నాఁడు; పునరపి ధాన్యోత్పత్తికి ప్రయత్నపడుచున్నాఁడు; ఉత్పన్నమయిన ధాన్యమును మరల శిలుకులో చేర్చుచున్నాఁడు; ఖర్చుకొఱకు బుట్టలో నుంచుచున్నాఁడు; ఇదేప్రకారముగా జన్మాంతరమందు చేసినకర్మములు అంతఃకరణోపహితసాక్షియందుండిన అజ్ఞానసంబంధావరణశక్తిరూపమైన కణఁజమందు శిలుకులో చేరుచున్నవి; ఈకర్మములు సంచిత మనఁబడును.

వీనినుండి పరిపక్వమైన [ఈశ్వరునిచేత నిర్ణీతమైన] కొన్నికర్మములు వర్తమానశరీరమును ఇచ్చునటువంటివి, సుఖదుఃఖములను ఇచ్చునటువంటివి ఉక్తాజ్ఞానముయొక్క విక్షేపశక్తిరూపమగు బుట్టను ఆశ్రయించుకొని యున్నవి, ఏవి గలవో, అవి ప్రారబ్ధ మనఁబడును.

వర్తమానశరీరమందు [ఏజన్మమందు జ్ఞానమగునో. ఆజన్మమందు] చేసినకర్మములు, అప్పుడు ఆ కర్మములు జ్ఞానోత్పత్తికన్న మొదలుచేయఁబడియుండనీ, లేక ముందు చేయఁబడియుండనీ అవి ఆగామి, లేక క్రియమాణమని చెప్పఁబడును.

వీనిలో ఈదిగువవ్రాసినప్రకారముగ ప్రత్యేకకర్మము యొక్క పర్యవసానముగును—

(1) సంచితకర్మముయొక్కనాశము సాధారణప్రాయశ్చిత్తమువలనను, బ్రహ్మజ్ఞానమువలనను నగును.

(2) జ్ఞానమునకు పూర్వోత్తరకాలభేదముచే ఆగామికర్మము ద్వివిధము; వానిలో జ్ఞానముకన్న పూర్వకాలమందు చేయఁబడిన ఆగామికర్మము సంచితకర్మమువలె జ్ఞానాగ్నియందు దగ్ధమగును; మఱియు జ్ఞానోత్తరకాలమందు చేయఁబడిన ఆగామికర్మము జ్ఞానవంతునకు ఆత్మయందు కర్తృత్వభ్రాంతి లేమివలన నిష్ఫలమగును.

(3) ప్రారబ్ధకర్మము భోగముచేతనే నశించును.

ప్రారబ్ధకర్మనాశము భోగముదక్క గానేరదు; కావున శరీరస్థితికి హేతువయిన భిక్షాన్నజలపానాదులందు జ్ఞానికి ప్రవృత్తి గలుగును; తదితరవ్యవహారమునందు ప్రవృత్తి గానేరదు.

మఱియును కొన్నిచోట్ల[1] ఇట్లును వ్రాయఁబడియున్నది-

సంచితాగాములవలె జ్ఞానికి ప్రారబ్ధకర్మముగూడ ఉండదు; కనుక భోజనాదిప్రవృత్తియును జ్ఞానికి సంభవింపదు; దానికభిప్రాయ మేమనఁగా—జ్ఞానియొక్కదృష్టిచేతఆత్మయందు కర్మముయొక్క, లేక తత్ఫలముయొక్క సంబంధము లేదు; ఈలాగు ఆత్మయందుసర్వకర్మములయొక్క నిషేధమువలనప్రారబ్ధనిషేధమును

1. అపరోక్షానుభూతి,వివేకచూడామణి మొదలయిన గ్రంథములందు.

చెప్పఁబడియున్నది; గాని, జ్ఞానియొక్క శరీరమునకు ప్రారబ్ధకర్మముచే భోగము గాదనునీ యభిప్రాయమువలన తన్నిషేధము చెప్పఁబడలేదు; ఏలయన—సూత్రకారులిట్లు వ్రాసియున్నారు- "జ్ఞానికి సంచితకర్మనాశము జ్ఞానమువలన నగును; ఆగామికర్మసంబంధముగానేరదు; ప్రారబ్ధముయొక్క నాశము భోగమువలన నగును;" దానివలన కనఁబడుచున్నది; ఏమనఁగా- ప్రారబ్ధబలము వలన శరీరనిర్వాహకక్రియ జ్ఞానికగును; అధికము గాదు—

అయినను, కర్మము నానాప్రకారములు గలది, ఎచ్చట నానా [1] శరీరములకు ఆరంభమయిన ఒకకర్మముచేత ఆరబ్ధమయిన ప్రథమశరీరమందు జ్ఞానమగునో, అచ్చట జ్ఞానవంతునకును ఉత్తరశరీరములయొక్క ప్రాప్తి గావలయును; ఏలయన దేనిచేత ఫలారంభము చేయఁబడినదో, దానిని ప్రారబ్ధకర్మమందురు; దానియొక్క నాశము భోగములేక గానేరదు; అనేక శరీరములకును హేతువయినకర్మముఒకటి;ఆకర్మముచేత ప్రథమ శరీరము పుట్టినది; దానియందు జ్ఞానమయినది; ప్రారబ్ధకర్మఫలమునకో; జ్ఞానమునకు తరువాతను ఇతరశరీరారంభకమయిన అవశేషము గలదు.

---

[illegible] 1. కొన్నికర్మములు అనేకజన్మములకు హేతువులగుచున్నవి; బ్రహ్మహత్యయనుకర్మము నరకదుఃఖానుభవానంతరము శ్వానసర్పాద్యనేకజన్మములను ఇచ్చుచున్నది; కార్తికేయస్వామిదర్శనము ధనాదిసంపదలతోకూడిన సప్తబ్రాహ్మణజన్మముల నిచ్చుచున్నది; ఈవిధముగా అనేకజన్మములకు కారణమైన ఒకటేకర్మము ప్రారబ్ధరూపముగా నున్నది. ఇది పూర్వమీమాంసానుసారముగా కర్మస్వాతంత్ర్యమంగీకరించి, ప్రారబ్ధవ్యవస్థ చెప్పఁబడినది.

ఈవిధముగ ప్రారబ్ధకర్మముయొక్క ఫలముగు ఎన్నిశరీరములు గావలయునో, అన్నిశరీరములు జ్ఞానికిని అగును; ప్రారబ్ధభోగముకన్న అధికముమాత్రము గానేరదు; దానివలన జ్ఞానమును సఫలముగ నున్నది?

ఆమాట ఘటిల్లదు; ఏలయన—నిగమరాజుయొక్క భేరిభాంకారము ఘోషించుచున్నది—"జ్ఞానవంతుని ప్రాణము అన్యలోకమందు, లేక ఈలోకముయొక్క అన్యశరీరమందు గమనము [1] చేయదు; అదేస్థానమందు లీనమగుచున్నది." ప్రాణగమనము లేక, అన్యశరీరప్రాప్తి సంభవింపదు.

---

వేదాంతమతానుసారముయిననో, కర్మఫలప్రదాతయగు ఈశ్వరుఁడు సంచితకర్మమునుండి ఎంతకర్మమును ప్రారబ్ధముని నిర్ణయించినాఁడో, ఆ ప్రారబ్ధకర్మమందు అనేకజన్మములుండినప్పుడు ఆ ప్రారబ్ధము ఫలమిచ్చుటచే ప్రతిబంధమగు నున్నది; శ్రవణాదివిచారరూప జ్ఞానసాధనములందు ప్రవర్తించిన పురుషునికి ఈ ప్రతిబంధముండు వరకు జ్ఞానోత్పత్తి కాజాలదు; గనుక ఈ ప్రారబ్ధకర్మఫలాంత్యజన్మమందె జ్ఞానముత్పన్నమగునని తెలియవలెను; ఎందుకనఁగా—ప్రారబ్ధకర్మము భోగములేక నశింపదు; జ్ఞానానంతరము ఇతరజన్మములగుటలేదు; అట్లయినను, ఇతరజన్మములందు చేసినశ్రవణాదివిచారము వ్యర్థముగాదు; వామదేవభరతులవలె ప్రారబ్ధాంతజన్మమందు ఉపదేశములేకయే పూర్వకృతవిచారమువలన వారికి జ్ఞానము కలుగును.

1 "న తస్య ప్రాణా ఉత్క్రామంతే హ్యత్రైవ సమవలీయంతే" [జ్ఞానియొక్క ప్రాణము గమనముచేయదు; అచ్చట అనఁగా మరణస్థానమందలి విద్యమానచైతన్యమందే లీనమగును] మొదలగు వేదవాక్యములఘోషము.

జ్ఞానియొక్క ప్రాణము, కొందఱు—మరణస్థానమందు విద్యమానచైతన్యమందనియు, కొందఱు—విద్యమానమూలావిద్యయందనియు, కొందఱు—విద్యమానభూతములందనియు, లీనమగుచున్నదనుచున్నారు; వానిలో—అవిద్యయందు, భూతములందు లయమను వారిమతమునందు ఎక్కువవిచారణీ

మఱియు ఇట్లనును—జ్ఞానికి వర్తమానశరీరానంతరము అన్యశరీరోత్పాదకమైన ప్రారబ్ధకర్మశేషము గలదు?

ఆవార్తయు ఘటిల్లదు; ఏలయన—ఎచ్చట అనేకశరీరారంభకమయిన ఏకకర్మము గలదో, అచ్చట అంత్యశరీరమందే జ్ఞానమగును; పూర్వశరీరమందుఁ గానేరదు; ఏలాగున ననఁగా—అనేకశరీరారంభకమయిన ప్రారబ్ధము జ్ఞానమునకు ప్రతిబంధకముగా [1] నున్నది; ఎట్లు విషయాసక్తి, బుద్ధిమాంద్యము, భేదవాదివచనమందు విశ్వాసము జ్ఞానమునకు ప్రతిబంధకములో, అట్లే ఉక్తప్రారబ్ధమును [2] జ్ఞానమునకు ప్రతిబంధకముగానున్నది.

---

యము లేదు; ఎందుకనఁగా—భూతములందు విదకమానమగు అవిద్య ఉన్నదే యున్నది. మఱియు అవిద్యయందు లయమగుటను [ఏరీతిగా నుత్పత్తియో, దానికన్న విపరీతక్రమముగా లయము] భూతములద్వారమైన పరంపరగానే అవిద్యయందు లయమగును; అయినను,

చైతన్యమందు లయమనువారిమతము సర్వదా అసంగతముగా నున్నది; ఎందుకనఁగా—సకలపదార్థములు చైతన్యమందు కల్పితములు, కల్పితపదార్థమునకు అధిష్ఠానమందు లయము గానేరదు; మఱేమనఁగా బాధము అగును; సకలపదార్థములయొక్క ఉపాదానకారణము అవిద్యయైయుండుటవలన సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని దానియందే లయమగుచున్నది.

1. త్రివిధమైన జ్ఞానప్రతిబంధముయొక్క నివృత్త్యుపాయవర్ణనము ధ్యానదీపమందు వ్రాయఁబడినది; దానిలో పంచమతరంగమందు కొంచెము వ్రాసినారము.

2. జన్మాంతరమునకు హేతువైన ప్రారబ్ధశేషము.

జ్ఞానమునకు ప్రతిబంధకముండఁగా, ఎచ్చట జ్ఞానసాధనములయిన శ్రవణాదులు కలుగునో, అచ్చట ప్రతిబంధకము దూరమయిన వెనుక ప్రథమజన్మమందు చేయఁబడిన శ్రవణాదికముచేతనే ఉత్తరజన్మమందు జ్ఞానము కలుగును; ఎట్లనఁగా— వామదేవుఁడు [1] పూర్వజన్మమందు శ్రవణాదికము చేసినప్పుడు, ప్రారబ్ధఫలము శరీరాంతరశేష ముండుటవలన వానికి ఆ జన్మమందు జ్ఞానము గాలేదు; శ్రవణాదికము చేయఁగా చేయఁగా వర్తమానశరీరముయొక్క పాతమై, అన్యశరీరప్రాప్తి యయిన వెనుక పూర్వజన్మమందు చేయఁబడిన శ్రవణాదికమువలన గర్భమందే జ్ఞానమాయెను.

ఈ ప్రకారముగా జ్ఞానమునకు తరువాత అన్యశరీరముయొక్క సంబంధముగాదు, వర్తమానశరీరముయొక్క చేష్టయో, ప్రారబ్ధముచేత అయినది; అచ్చట ఎన్ని చేష్టలు శరీరనిర్వాహకములో; అన్నియే యయినవి; రాగజన్యమయిన అధికచేష్ట గలుగదు; కాఁబట్టి నిర్వాహేతర సర్వప్రవృత్తి రహితుఁడుగా జ్ఞాని యాయెను;

ఈరీతిగా జ్ఞానియొక్క వ్యవహారము నివృత్తిప్రధానముగా నున్నది; దానియందీశంకగలదు—మనస్సుయొక్క స్వభావము అతిచంచలము; మనస్సునకు నిరాలంబ [2] స్థితి గానేరదు;

---

1. ఋషభదేవుని పుత్త్రుఁడైన భరతరాజునకును మూఁడుజన్మములకు హేతువైన ప్రారబ్ధశేష ముండెను; దానిచేత సాధనసామగ్రి యుండియు, జ్ఞానము గాలేదు; వెనుక మూఁడవజన్మమందు పూర్వకృతవిచారమువలన ఉపదేశము లేకయు జ్ఞానమయినది.

2. ఆశ్రయరహితముగు.

వేఱొక ఆలంబనముచేతనే[1] మనస్సు నిలుచును; కనుక మనస్సునకు ఆలంబప్రాప్తికొఱకైనను జ్ఞానవంతునకు ప్రవృత్తి యగును? ఈయాక్షేపమును, క్రిందవ్రాసినతత్సమాధానమును రెండును పూర్వపక్షాంతర్గత మని ఎఱుఁగవలెను.

దానికి సమాధానము-యద్యపి సమాధిరహితుఁడయిన పురుషునిమనస్సు చంచలమగును; తథాపిసమాధివలన మనస్సుయొక్క విజయ మగును; జ్ఞానవంతుఁడు సమాధిసిద్ధియందున్నాఁడు; కనుక జ్ఞానవంతునకు ప్రవృత్తి గానేరదు.

## 316. సమాధియొక్క అష్టాంగము[2]

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సవికల్పసమాధి ఈయష్టాంగమువలన సమాధి [నిర్వికల్పసమాధి] యగుచున్నది.

1. ఆశ్రయమువలన.

2. శ్రీమచ్ఛంకరాచార్యులు అపరోక్షానుభూతియందు పంచదశాంగముచేత రాజయోగమును జెప్పుచున్నారు.—

యమో హి నియమస్త్యాగో మౌనం దేశశ్చ కాలతా,
ఆసనం మూలబంధశ్చ దేహసామ్యం స్వదృక్స్థితిః. 102
ప్రాణసంయమనం చైవ ప్రత్యాహారశ్చ ధారణా,
ఆత్మధ్యానం సమాధిశ్చ ప్రోక్తాన్యంగాని వై క్రమాత్,

భావార్థము—1. యమము 2. నియమము 3. త్యాగము 4. మౌనము 5. దేశము 6. కాలము 7. ఆసనము 8. మూలబంధము 9. దేహసామ్యము 10. దృష్టిస్థితి 11. ప్రాణాయామము 12. ప్రత్యాహారము 13. ధారణ 14. ధ్యానము 15. సమాధి ఇవి పంచదశాంగలక్షణములు క్రిందవ్రాయుచున్నాము.—

సర్వం బ్రహ్మేతి విజ్ఞానాదింద్రియగ్రామసంయమః,
యమోఽయమితిసం ప్రోక్తోఽభ్యసనీయో ముహుర్ముహుః.

భావార్థము—సర్వము బ్రహ్మముగా నున్నదను జ్ఞానమువలన ఇంద్రియములు బ్రహ్మరూపముగా కనఁబడుచున్నవి; ఈవిధముగా ఇంద్రియములను బ్రహ్మరూపముగా కనఁబడునట్లు ఏయభ్యాసమో, ఆయభ్యాసము పలుమారు చేయుంట ఇంద్రియసంయమ మనఁబడును; ఉక్తప్రకారమైన ఏ ఇంద్రియ సంయమముగలదో, అదియే యమము; అభిప్రాయము—యోగశాస్త్రమందు అహింసాసత్యాది ఏది యమ మని చెప్పఁబడినదో, అది దీనియందు గౌణముగా నున్నది.

సజాతీయప్రవాహశ్చ విజాతీయతిరస్కృతిః,
నియమో హి పరానందో నియమాత్క్రియతే బుధైః. 105

భావార్థము—విజాతీయమైన [బ్రహ్మభిన్నమగు] ఘటపటాదుల దృష్టిని విడుచుట, మఱియు సజాతీయమైన [బ్రహ్మాభిన్నమగు] బ్రహ్మదృష్టి యొక్క ప్రవాహము గలుగుటయే నియమము, అనఁగా—జడరూపములైన అలంకారములందు చైతన్యరూపమైన హేమమునుచూచుట నియమము, అది ఆనందప్రదముగా నున్నది; అభిప్రాయము—యోగశాస్త్రోక్తమైన శౌచతపస్సులు మొదలగునియమము గౌణముగా నున్నది; జ్ఞానియయినపురుషుఁడు, చెప్పఁబడిన ఆనందప్రదనియమమును అంగీకరించుచున్నాఁడు.

త్యాగః ప్రపంచరూపస్య చిదాత్మత్వావలోకనాత్,
త్యాగో హి మహతాం పూజ్యస్సద్యో మోక్షమయో యతః.

భావార్థము—సర్వత్ర ఆత్మను చూచుటవలన ప్రపంచమందు మొదలేకనఁబడిన ఏజడతగలదో [ఏప్రపంచము జడరూపము చేత కనఁబడినదో] దానియొక్క సహజముగా త్యాగమగుచున్నది; విద్వజ్జనులకు పూజ్యమయినట్టి త్యాగము ఇదియె; ఈత్యాగమువలన మోక్షము తత్కాలమగుచున్నది;

అభిప్రాయము—గృహాపుత్రాదులత్యాగము, లేక శిఖాసూత్రాదులత్యాగము గౌణముగా నున్నది.

యస్మాద్వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ,
యన్మౌనం యోగిభిర్గమ్యమ్ తద్భజేత్సర్వదా బుధః. 107
వాచోయస్మాన్నివర్తంతే తద్వక్తుం కేన శక్యతే,
ప్రపంచో యది వక్తవ్యస్సోఽపి శబ్దవివర్జితః. 108
ఇతి వా తద్భవేన్మౌనం సతాం సహజసంజ్ఞితమ్,
గిరా మౌనం తు బాలానాం ప్రయుక్తం బ్రహ్మవాదిభిః. 109

భావార్థము—ఎక్కడనుండి వాక్కు వెంటతిరుగునో [బ్రహ్మము వాణికి అగోచరమగుటవలన దానినుంచి వాక్కు వెనుకకు తిరుగును], అపర బ్రహ్మమే సకలప్రపంచరూపమయి యున్నది; కనుక వాక్కును బ్రహ్మ రూపముగా నున్నది; ఇట్లు ఎఱుఁగుట ఏప్రకారమనఁగా-ఏప్రకారముండఁగా చెప్పునప్పుడును సహజముగానే మౌనము ఘటిల్లినదో, ఇట్టిప్రకారరూపమైన ఏమౌనము గలదో, అదియే యుత్తమమౌనము, అదియే విద్వజ్జనులచేత అంగీకారార్హము; మూఢజనులమౌన మేలాగున నున్నది; నోరుమూసుకొనుట, లేక చేతితో నాలుకపట్టుకొనుట; దీనివలన ముఖమునుండి శబ్దోచ్చారణమెట్లు గాలేదు; అయినను, కడుపునందు శబ్దకోలాహలము అనివార్యమై, కడుపు పగిలిపోవునట్లు ప్రసంగము వచ్చుచున్నది; లేక ఆఁ! ఆఁ! ఇట్లు ఉచ్చారణముచేసి, వ్రేలిచేత సంకేతమును చూపుట, లేక వ్రాసిచూపుట ఇత్యాద్యనేక విధములైన మూఢజనులమౌనము ఉపహాసాస్పదముగా నున్నది.

ఆదావంతే చ మధ్యే చ జనో యస్మిన్న విద్యతే,
యేనేదం సతతం వ్యాప్తం స దేశో విజనస్స్మృతః. 110

భావార్థము—ఎచ్చట ఆద్యంతమందు జనులు లేరో, దానిని విజనమనుట, లేక నిర్జనమనుట లోకమందు ప్రసిద్ధము; జనులయాదియందును,

అంతమందును, మధ్యమందును బ్రహ్మము గలదు; ఇట్టి అనుభవము ఎవ్వనికి గలదో, వానికి సకలజనులును నిర్ధనరూపముగా నున్నారు; ఉదాహరణము—అలంకారముయొక్క ఆద్యంతమధ్యమునందు సువర్ణదృష్టిగలసరాజునకు త్రికాలమందు అలంకారాభావముగా నున్నది; అభిప్రాయము—దీనియపేక్షచేత యోగశాస్త్రమందు చెప్పఁబడిన ఏకాంతవాసము గౌణము.

కలనాత్సర్వభూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః,
కాలశబ్దేన నిర్దిష్టో హ్యఖండానంద అద్వయః. 111

భావార్థము—దేనిచే ఒకనిమిషమందు బ్రహ్మదేవుఁడు మొదలయిన భూతములు పెక్కుమాఱులు ఉత్పన్నము లగుచున్నవి, నశించుచున్నవి; అట్టియే అఖండానందాద్వయరూపమైన పరబ్రహ్మము గలదో, అది సకలకాలముయొక్క కాలముగా నున్నది; కాఁబట్టి సకలకాలములో, ఎవనికి బ్రహ్మరూపముచేత అనుభవము గలదో, వానికి సర్వకాలమును శుభముగా నున్నది; అభిప్రాయము—ఏకాలమందు బ్రహ్మచింతనము కలుగదో, ఆకాలమును యమఘంటకాల మని ఎఱుఁగవలయును; అప్పుడాకాలము జ్యోతిశ్శాస్త్రమురీతిగా ఎంతయుం శుభముగా నుండనీ.

సుఖేనైవ భవేద్యస్మిన్నజస్రం బ్రహ్మచింతనమ్,
ఆసనం తద్విజానీయాన్నే తరత్సుఖనాశనమ్. 112

భావార్థము—ఏప్రకారమున శరీరస్థితియుండినప్పుడు సుఖముగా [ఆయాసములేక] బ్రహ్మము స్ఫురద్రూపమగునో, ఆప్రకారముగా నుండుటయే ఆసన మనఁబడును; దానిఁదప్ప ఇతరమయిన ఆసనములు సుఖనాశనముగా [సుఖనాశనమునకు హేతువుగా] నున్నవి; కాఁబట్టి దానికి ఆసనమనఁగూడదు; అభిప్రాయము—అశ్వముపై గూర్చుండనీ, లేక రథముపై కూర్చుండనీ, లేక ఉచ్చనీచమయినట్టి ఏయాసనమునయిన కూర్చుండనీ, లేక నిలువఁబడియుండనీ, లేక మంచమునయిన పరుండనీ [ఎట్లో ఒక ట్లుండనీ], ఆ స్థితియందు

బ్రహ్మము స్ఫురద్రూపమయియుండినప్పుడు అదియే ఉత్తమాసనమని తెలియ వలెను; బ్రహ్మము స్ఫురద్రూపముగానిపక్షమందు యోగశాస్త్రోక్తమయిన ఏ యాసనమును ఉత్తమప్రకారముగా రచింపబడినను, ఆయాసనమును గౌణ మని ఎఱుఁగవలయును.

సిద్ధం యత్సర్వభూతాది విశ్వాధిష్ఠానమవ్యయమ్,
యస్మిన్సిద్ధాః సమావిష్టా స్తద్వై సిద్ధాసనం భవేత్. 113

భావార్థము—సర్వాసనములందు వరిష్ఠాభిప్రాయముచేత సిద్ధాసనలక్షణ మును చెప్పుచున్నాఁడు—ఏది సర్వభూతములకన్న ఆదిగా నున్నది; లేక ఏది సర్వభూతములకు ఆది అనఁగా కారణముగా, లేక అధిష్ఠానముగానున్నది; ఏది స్వతస్సిద్ధమనఁగా ఏకారణమువలనను, లేక అధిష్ఠానమువలనను ఉత్పన్న మైనది గాదు; ఏది అవ్యయమనఁగా నాశరహితము; ఏయాసనమందు సిద్ధులైన జ్ఞానిజనులు ప్రవర్తించుచున్నారు; ఇటువంటిది ఆసనము ఏదిగలదో, అదియే సిద్ధాసనమనంబడును; అదే సిద్ధాసనము సకలాసనములందు వరిష్ఠముగా నున్నది. [యోగశాస్త్రమందు గుదద్వారమువరకు మేఢ్రమును అదిమి, దానిపైన వామ పాదముయొక్క మడిమతో త్రొక్కవలయును; ఈప్రకారముగా సిద్ధాసన లక్షణమును చెప్పి, ఆ సిద్ధాసనము సకలాసనములందు వరిష్ఠమని చెప్పఁబడినది; దానియొక్క వికల్పితార్థము ఈశ్లోకమందు వ్రాయఁబడినది.]

యన్మూలం సర్వభూతానాం యన్మూలం చిత్తబంధనమ్,
మూలబంధస్సదా సేవ్యో యోగ్యోఽసౌ రాజయోగినామ్.

భావార్థము—విశ్వరూపమయిన అశ్వత్థముయొక్క మూలమయిన మాయ, ఆ మాయయొక్కయు మూలమయిన ఏ బ్రహ్మము గలదో, దాని యందు చిత్తమూలముయొక్క ఏ బంధనము గలదో అదియే మూలబంధము. ఆమూలబంధమే రాజయోగు లయిన జ్ఞానిజనులకు సర్వదా మాన్యముగా నున్నది; అభిప్రాయము—యోగశాస్త్రపద్ధతిచే గుదద్వారమునకు బిరడపెట్టి కట్టువేయఁన దేది మూలబంధమో, అది గౌణముగా నున్నది,

అంగానాం సమతాం విద్యాత్సమే బ్రహ్మణి లీయతే,
నోచేన్నైవ సమానత్వ మృజుత్వం శుష్కకాష్ఠవత్. 115

భావార్థము—సకలాంగరూపములయిన తరంగములయొక్క లయము, సమమైన చైతన్యసాగరమునం దగుచున్నది [అంగరూపమయిన తరంగము చైతన్యసముద్రరూపముగానే యున్నది; సముద్రముకన్న తరంగము వేఱు గాదు]. ఇట్టి దేజ్ఞానము గలదో, అదియే విద్వాంసులకు అంగసామ్యముగా నున్నది; అభిప్రాయము—యోగశాస్త్రమురీతిగా శుష్కకాష్ఠవత్తు అంగము వినిగలదో, అది గౌణముగా నున్నది.

దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మమయం జగత్,
సా దృష్టిః పరమోదారా న నాసాగ్రవిలోకినీ. 116
ద్రష్టృదర్శనదృశ్యానాం విరామో యత్ర వా భవేత్,
దృష్టిస్తత్రైవ కర్తవ్యా న నాసాగ్రవిలోకినీ. 117

భావార్థము—అధిష్ఠానరూపమయిన బ్రహ్మమునందు దృష్టియుంచిన మొదల, ఆదృష్టి, చరాచరరూపమయిన జగత్తును బ్రహ్మరూపముచే చూచు చున్నది; దానిపేరు దృష్టి; నాసాగ్రావలోకనదృష్టి దృష్టిగాదు; అభిప్రాయము— యోగశాస్త్రమందు భూచరిఖేచరీ మొదలయిన ముద్రలందు ఎచ్చట నాసాగ్రమందు దృష్టియుంచుట, ఎచ్చట దృష్టి యూర్ధ్వముఖము చేయుట, ఎచ్చట దృష్టివ్యత్యస్తముగా చేయుట మొదలయిన దృష్టియొక్కస్థితి చెప్పఁ బడినది కేవలము మూఢజనులకొఱకు చెప్పఁబడినది; కాఁబట్టి అది గౌణముగా నున్నది; ఈశ్లోకద్వయోక్తమయిన దృష్టిస్థితి సకలవిద్వాంసులకు మాన్య ముగా నున్నది.

చిత్తాదిసర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్,
నిరోధః సర్వవృత్తీనాం ప్రాణాయామః స ఉచ్యతే. 118

భావార్థము—చిత్తాదు లంన సర్వవృత్తులును బ్రహ్మరూపముచే చూచుటవలన వృత్తినిరోధ మేది గలదో, అదే ప్రాణాయామము సుజ్ఞజనులకు

ముఖ్యముగా నున్నది; అభిప్రాయము—యోగశాస్త్రోక్తమయిన ముక్కుమూసుకొనుట మొదలయిన ప్రాణాయామము గౌణముగా నున్నది.

నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్యః సమీరణః,
బ్రహ్మైవాస్మీతి యా వృత్తిః పూరకో వాయురీరితః. 119
తత స్తద్వృత్తినైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః,
అయం చాపి ప్రబుద్ధానామజ్ఞానాంఘ్రాణపీడనమ్. 120

భావార్థము—పయిన ముఖ్యముగా ప్రాణాయామము యొక్క లక్షణము చెప్పఁబడినది; ఇప్పుడు వేఱువేఱుగా అవయవశః ప్రాణాయామలక్షణమును చెప్పుచున్నాడు—ప్రత్యగ్వృత్తి [అంతర్ముఖవృత్తి] చైతన్యరూపాత్మాకారముగుట అదియే పూరకము; మఱియు ఆత్మాకారవృత్తియగుటవలన అవృత్తియందు మొదలుండినదే ప్రపంచజడతయో [ప్రపంచజడరూపమయిన సత్యజ్ఞానము] అది మెల్లమెల్లగా విడచుటయే రేచకము; మఱియు అద్వైతమయిన బ్రహ్మమునందు వృత్తిని స్థిరముగ చేయుటయే కుంభకము; ఈరీతిగా అవయవత్రయసహితము ప్రబుద్ధజనుల ప్రాణాయామము.

మూఢజనులు ఏమి చేయుచురనఁగా—యోగశాస్త్రపద్ధతిగా ముక్కును నానావిధముగా నలిపి నలిపి, బాధించుచున్నారు; చూడుము—నాసికయొక్క ఇడానామకవామనాడిచే వాయుగ్రహణరూపపూరకము చేయుచున్నారు; పింగళానామక దక్షిణనాడిచే విడిచినరీతిగా రేచకము చేయుచున్నారు; సుషుమ్నానామకమధ్యనాడిచే వాయునిరోధరూపకుంభకము చేయుచున్నారు [ముక్కును గట్టిగాపట్టుకొనకపోయిన కుంభకమేగాదు.]

విషయేష్వాత్మతాం దృష్ట్వా మనసశ్చిత్తమజ్జనమ్,
ప్రత్యాహారస్స విజ్ఞేయో భ్యసనీయో ముముక్షుభిః. 121

భావార్థము—అంతఃకరణవృత్తి నేత్రాదీంద్రియద్వారమున ఘటాదివిషయములవఱకు వచ్చి, ఆయావిషయముయొక్క జ్ఞానమును చేయుచుండఁగా

ఆయా ప్రసంగమందు మనస్సు చైతన్యస్వరూపమందు పడిపోవుచున్నది; ఆదియే ఉత్తమప్రత్యాహారము; ముముక్షువు పలుమాఱు ఈ ప్రత్యాహారము యొక్క అభ్యాసము చేయవలయును; అభిప్రాయము—విషయములనుండి ఇంద్రియములను బలాత్కారముగా లాగుటయొక్క ప్రయత్నరూప ప్రత్యాహారావశ్యకత బుద్ధిమంతుఁడయిన ముముక్షువునకు లేదు.

యత్ర యత్ర మనో యాతి బ్రహ్మణస్తత్ర దర్శనాత్,
మనసో ధారణం చైవ ధారణా సాపరామతా. 122

భావార్థము—ఎచ్చటెచ్చట మనస్సు పోయినదో, అచ్చటచ్చట ఆ మనస్సు బ్రహ్మమును పట్టుకొనుచున్నది [అచ్చటచ్చట మనస్సునకు బ్రహ్మమే ప్రతీతమగును; విషయము కనఁబడదు]; ఈరీతిగా మనస్సు బ్రహ్మమును పట్టుకొనునట్టి ధారణ ఏది గలదో, అదియే ముఖ్యముగా నున్నది; కేవలాంతర్ముఖమయిన వృత్తిస్థితిరూపమగు ధారణ గౌణముగా నున్నది. [పూర్వోక్తధారణాపేక్షచేత ఇది గౌణ మని ఎఱుఁగవలయును.]

బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః,
ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానందదాయినీ. 123

భావార్థము—నేను బ్రహ్మముగా నున్నాను; ఇట్టిది అంతర్ముఖమయిన వృత్తి, బ్రహ్మభిన్నమయిన ఏపదార్థముయొక్కయు ఆశ్రయములేక బ్రహ్మసన్ముఖమయి, స్థిరముగా నిలుచుచున్నది; ఆ వృత్తి ధ్యాన మని చెప్పఁబడినది; ఈ ప్రకారమగు ఏ ధ్యానము గలదో, అది పరమానందదాయకముగా నున్నది; ఇది గాక, అంతరాయరహితమయిన అద్వితీయవస్తువునందు అంతఃకరణప్రవాహరూపధ్యానము [అహం బ్రహ్మాస్మి అహం బ్రహ్మాస్మి యని సదైవచింతనము] ఏది చెప్పఁబడినదో, అది గౌణముగా నున్నది. [పూర్వోక్తధ్యానాపేక్షచేత ఇది గౌణ మని ఎఱుఁగవలయును.]

వేదాంతవేత్తలసభలో శ్రీ అపరోక్షానుభూతి చదువుచుండఁగా ఈప్రక రణము వచ్చినపుడు ఒకఁడనుచున్నాఁడు—ఏమి ఆశ్చర్యమిది! అహంబ్రహ్మాస్మి చింతనమును గౌణ మనఁగా ఇంకను శ్రేష్ఠధ్యానము గలదా?

ఇంకొక్కఁడనుచున్నాఁడు—సకలోపనిషత్తుల అభిప్రాయము అహం బ్రహ్మాస్మి చింతనముకన్న శ్రేష్ఠధ్యానము లేనేలేదు; ఏమి ఆచార్యులు చెప్పు చున్నారు?

ఇద్దఱియొక్క భాషణము విని, శ్రద్ధావంతుఁ డొకఁ డనుచున్నాఁడు: ఆచార్యస్వామి ఎప్పటికిని అబద్ధము చెప్పఁడు; దానికన్నను శ్రేష్ఠధ్యానము ఉండవలెను. ఎట్లు? అని ప్రశ్న చేసినపుడు సమాధానముచెప్పుటకు వానికి తోఁచదు.

ఈసమారంభమును చూచి, అత్యంతశ్రద్ధావంతుఁడైన శ్రోత్రియబ్రహ్మ నిష్ఠపురుషుఁడొకఁడు మనస్సులో అనుచున్నాఁడు—అహాహా! అవిద్యమ్మ యొక్క మాహాత్మ్యము అగమ్యముగా నున్నది—స్వాములవారు, అహంబ్రహ్మా స్మివృత్తియొక్క ప్రవాహముకన్న బ్రహ్మసమ్ముఖముగా వృత్తినిలుచుట శ్రేష్ఠ మని చూపి, దానినే ధ్యాన మనుచున్నారు; ప్రవాహవృత్తికన్న స్థిరవృత్తి శ్రేష్ఠ మని సిద్ధమే; ఈరెండువృత్తులు నిదిధ్యాసనమున కంతర్గతములుగా నుండినను, బహుళముగా ప్రవాహవృత్తికి నిదిధ్యాసనమందురు. స్థిరవృత్తికి సవికల్పసమాధి యందురు; సామాన్యతః నిదిధ్యాసనమునకు ధ్యానమని పేరు; స్వాములవారు నిది ధ్యాసనముయొక్క పరిపాకావస్థయగు సవికల్పసమాధికి ధ్యానమనుచున్నారు; ఈ ప్రకారముగా ఇచ్చట స్పష్టార్థముండినను, ఈపండితజనులు ఎఱుఁగరు; కుదక తాను విశదార్థముగ అందఱికి సమాధానము చెప్పుచున్నాఁడు.

సారాంశము—ఈవిషయము శ్రద్ధాసహితమైన సూక్ష్మతరబుద్ధికి గోచరమగునట్టిది కాని, శ్రద్ధారహితసామాన్యబుద్ధికి గోచరమగునట్టిది కాదు.

నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః,
వృత్తివిస్మరణం సమ్యగ్ సమాధిర్జ్ఞానసంజ్ఞకః. 124

భావార్థము—వేదాంతవిచారమునుండి ఉత్పన్నమయినట్టి అంతఃకరణముయొక్క "అహంబ్రహ్మాస్మి" అనునీవృత్తి సకలములయిన ఆకారపదార్థములనుండి పరావృత్తమయి, సర్వాకారములను విడిచి, ఆ వృత్తి అంతర్ముఖమయి, బ్రహ్మప్రకాశమందు లయము పొందుచున్నది. [స్వయంప్రకాశబ్రహ్మమందు ఆ వృత్తియొక్క బాధమగుచున్నది]; అదియే సమాధిగా నున్నది; దానికన్న ఇతరమయినదానిని వృత్తివిస్మృతి యనవలెను;సమాధియనఁగూడదు.

ఉదాహరణము—ఒకానొక ఉమేదవారుఁడు చాలాదినములనుండి ఉద్యోగముకొఱకు ప్రయత్నము చేయుచుచేయుచు ఉండగా, వానికి సర్కారునుంచి ఒకసారి ఆజ్ఞవచ్చెను—"నీవు మంత్రిపనికి పొమ్ము" అప్పుడు పరమసంతోషముగా ఇంటిపనులను విడిచి, పోవుట కారంభించెను; దోవలో పోవుచుపోవుచు ఇంక మంత్రిపని సెట్టుచేయవలెనని ఆలోచించుచున్నాఁడు; అప్పుడు వాని కావిచారమేమియు తోచక, స్తబ్ధుఁడై, పోయిగా దోవలో పండుకొనెను.

ఆప్రకారముగా ముముక్షువుయొక్క అంతఃకరణవృత్తి బ్రహ్మానందానుభవము చేయుటకొఱకు ఉత్కంఠగా బ్రహ్మభిన్నమయిన సకలసాకారనిరాకారపదార్థములయొక్క పరిత్యాగముచేసి, వృత్తి అంతర్ముఖమైనవెనుక ఆ వృత్తికి ఏమియు తోఁచదు; కాఁబట్టి ఆ వృత్తి తటస్థమయి, ఎక్కడకక్కడనే యుండెను; ఈవృత్తిని సమాధియనఁగూడదు. యోగశాస్త్రానుసారి ఈవృత్తి తాటస్థ్యమును, లేక వృత్తియొక్కమూర్ఛను సమాధి యని ఎఱుఁగుచున్నాఁడు; దానినిషేధముకొఱకు శ్రీమదాచార్యస్వామి ఇచ్చట స్పష్టముగా చెప్పుచున్నాఁడు; ఏమనఁగా—అది సమాధి కాదు; దానిని వృత్తివిస్మృతియనవలయును.

ఈ క్త రాజయోగమును మాహాత్మ్యసహితముగా దానియందు ప్రవృత్తి కొఱకు ముందు శ్లోకద్వయముచే ముముక్షువులకు, మఱియుం విద్వజ్జనులకు ఆచార్యస్వామి యుపదేశము చేయుచున్నాఁడు—

ఇమం చావృత్తిమానందే తావత్సాధు సమభ్యసేత్,
వశ్యో యావత్ క్షణాత్పుంసః ప్రయుక్తస్సన్భవేత్స్వయమ్.
తతః సాధననిర్ముక్తః సిద్ధో భవతి యోగిరాట్,
తత్స్వరూపం న చైతన్య విషయో మనసో గిరామ్. 126

భావార్థము—బ్రహ్మానందేచ్ఛుఁడయిన ముముక్షువు, లేక జీవన్ముక్తుఁడయిన విద్వాంసుఁడు ఈరాజయోగమును బలుమాఱు అభ్యాసము చేయవలెను.

ఈరాజయోగ మేలాగున నున్నది? దీనియందు చిత్తముయొక్క యోజన చేసినపుడు, చిత్తము తాత్కాలికముగా బ్రహ్మానందమందు పడుచున్నదిః ఇట్లుండగా ఈరాజయోగికి [ముముక్షువునకు, లేక జీవన్ముక్తవిద్వాంసునకు] వేఱేసాధనములు ఎందుకు కావలెను? ఏమివలనేవలదు [యోగశాస్త్రోక్తమైన హఠయోగరాజయోగముద్రాప్రాణాయామాదులసాధనములు ఎందుకుఁ గావలయును? ఏమియుంవల దని యభిప్రాయము].

ఈరాజయోగ మేలాగున నున్నది? దీనియనుష్ఠానమువలన జీవునకు పరమాత్మునితో వియోగము లేదు; ఇట్లుండఁగా అన్యయోగాదులసాధనాపేక్ష ఎందుకు? అన్యసాధనములు వలనేవలదు. ఈరాజయోగముయొక్క అంత మాహాత్మ్యవర్ణనము చేసినను, ఆచార్యస్వామికి తృప్తి గాలేదు; కనుక మఱియును మాహాత్మ్యవర్ణనము నారంభించుచున్నాఁడు—

ఈరాజయోగానుష్ఠానమువలన జీవపరమాత్మలకు వియోగము లేదు; అంతమాత్రము కాదు; మనస్సునకును, వాక్కునకును, సకలేంద్రియములకును, సకలక్రియలకును, శరీరమునకును, జగత్తునకును పరమాత్మునితో వియోగము

లేదు [సర్వమును బ్రహ్మరూపమే ప్రతీతమగుచున్నది]; ఇట్టి ఈయోగము ఉత్తమోత్తమముగా నున్నది; దీనియందు వియోగవార్తయైనను ఉండదు; ఇది స్వాములయొక్క యభిప్రాయము.

ఒక శ్రీమంతుఁడగు గృహస్థుని బంధువర్గములో నొకఁడు కుటుంబసంపన్నుఁడై, దరిద్రుఁడుగా నున్నాఁడు; వాఁడు నీచోద్యోగముచే తనజీవికచేసి, యున్నాఁడు; వాఁడు నీచోద్యోగము చేస్తాఁడని ఆ శ్రీమంతునకు బలుమాఱు కోపము వచ్చుచున్నది; తాను కొంచెమాత్రము సాహాయ్యము చేయుంటనా! ఇదేమిఁకుటిల్ల నేఁకుటిల్లను; మాకులమందుపుట్టి నీచోద్యోగము చేస్తాఁడని వానిని నిర్భర్త్సన చేయుచున్నాఁడు; అప్పుడాదరిద్రునికి కోపమే వచ్చునుగదా!

ఆప్రకారముగా హఠయోగిజనులు, వారికి విచారశక్తి ఉండినపుడు వారుహఠయోగమందు ఎందుకు ప్రవృత్తులగుదురు? విచారరూపధనాపేక్షచే దరిద్రులే, తాము విచారరహితులగుటవలన విచారశూన్యగురువును శరణు పొంది, గురువు—"ఇదే పరమసాధనము, ఇదే మోక్షమునకు హేతువని చెప్పుట" మంచిదె. ఇదె పరమసాధన మని ఎఱిఁగి, పామరులు దానియందు శ్రద్ధాపూర్వకముగా ప్రవృత్తులగుదురు. [నిజమైన పదార్థముమీఁద శ్రద్ధ యుంచుటయందుకన్న అబద్ధపదార్థముమీఁద శ్రద్ధ యుంచుటయందు శ్రద్ధయొక్కబలువు ఎక్కువని ఎఱుఁగవలసినది.]

వారిని రాజయోగులైన జీవన్ముక్తవిద్వాంసులు ఉపహాసము చేయుచున్నారు; వారికి ఇట్లుకాదు అట్లు, అట్లుకాదు ఇట్లు అని వారిమనస్సులో మెల్లమెల్లగా కొంచెముకొంచెము విచారముచేర్చుట, ఇదేమి లేదు; కేవలము ఉపహాసము చేసినపుడు వారు కోపగించుకొనరా?

ఆచార్యస్వామియొక్కయు "హఠయోగము వేదబాహ్యము, అది సర్వథా త్యాజ్యము" అను నభిప్రాయముకాదు: అది వేదశాస్త్రానుసారమే, గ్రాహ్యమే యని యభిప్రాయము గలదు; దానియందు ఆచార్యస్వామి ఈసార్ధశ్లోకముచే అధికారిభేదము చూపుచున్నాఁడు—

కించిత్పక్వకషాయాణాం హఠయోగేన సంయుతః. 127

భావార్థము—ఎవరియొక్క, కషాయాదిమలములు పూర్తిగా కాలఁబడలేదో, అటువంటిఅధికారులకు హఠయోగముయొక్క యుంపయోగము గలదు; గాని, రాగాదికషాయములు సంపూర్ణముగా కాల్చుటవలన మనస్సు పరిపక్వమైన దెవరికో, అటువంటిజనులకు ఈరాజయోగము సులభముగ, త్వరితముగ సిద్ధమగుచున్నది.

లేశమును రాగాదికషాయముచే రహితమగు అధికారిదుర్లభ మని ఆశ్రయించినపక్షమందు చెప్పుచున్నాఁడు:—

పరిపక్వమ్మనో యేషాం కేవలోయం చ సిద్ధిదః,
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్. 128

గురుభక్తులుగాని, ఈశభక్తులుగాని సర్వులకు అనఁగా—బ్రాహ్మణ క్షత్రియాది ఏవర్ణస్థులుగాని, బ్రహ్మచర్యగార్హస్థ్యాది ఏయాశ్రమస్థులుగాని అందఱికి ఈరాజయోగము సులభముగా త్వరలోనే సిద్ధిప్రదమగుచున్నది; ఈప్రకారముగా అధికారులయొక్క బాహుళ్యము చూపుచున్నాఁడు.

ఇప్పుడు గురుభక్తాది ఏయధికారి చెప్పుచున్నాఁడో, వానియందు కషాయాదిదోషములు లేశమును లేవని సిద్ధముకాదైనను, అధికము లేదని చూపుచున్నాఁడు. [వీనినిగూర్చి హఠయోగాదికారివలె "కించిత్పక్వకషాయాణామ్" అను వాక్యము లేమివలన తెలియఁబడుచున్నది]; మఱియుం పూర్వోక్త శ్లోకార్థమందు ఎవరు హఠయోగాధికారు లని చెప్పుచున్నాఁడో, వారిని "కించిత్పక్వకషాయాణామ్" అనిచెప్పి, బహుదోషములు గలవా రని చూపుచున్నాఁడు; ఆబహుదోషములందు రాగాదికము, పాపము, బుద్ధిమాంద్యము, శరీరజాడ్యము మొదలగు అనేకదోషములయొక్క సమావేశమగుచున్నది.

ఒకఅశ్వముమీఁద కొఱడా వైఁచేసినచాలు, యజమానుఁడు తన్ను అవమానము చేయుఁచున్నాఁడని ఎఱిఁగి, కోపముచే పరుగెత్తును; మాహిష

## 317. యమనియమప్రకారములు

యమముయొక్క పంచాంగము—అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము. నియమము యొక్కపంచాంగములు—శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము.[1]

## 318. ఆసనప్రకారములు

ఆసనభేదములు అనేకములుగా నున్నవి; వానిలో— స్వస్తిక గోముఖ వీర కూర్మ పద్మ కుక్కుటోత్తాన కూర్మ కధనుస్సు మత్స్య పశ్చిమతాన మయూర శరభసింహాభద్రసిద్ధములు మొదలైన యెనుబదినాలుగు ఆసనములు లక్షణసహితముగ యోగగ్రంథములందు వ్రాయఁబడియున్నవి; వేదాంతమందు అంత ఉపయుక్తముగాదు; కనుక ఇచ్చట వ్రాయలేదు; సకల ఆసనము

---

మును ముల్లుకోలచే పొడుచుట, యజమానుఁడు తన్ను నడువ మనుచున్నాఁడని ఎఱిఁగి, మెల్లమెల్లఁగా నడుచును.

ఆ ప్రకారముగా నేతీధౌతీఆసనముద్రా ప్రాణాయామాది దుష్కర దుష్కరమైనట్టి ఒక్కొక్కసాధనము చేయఁగా చేయఁగా, నవన్ని దమించి, ప్రాణము వ్యాకులమవుట అవుట హఠయోగాధికారులు "ఇదే యోగము, ఇదే పరమార్థసాధనము" అని తెలియపరుచుచున్నారు; వారికి నవిచారనులభమైనట్టి సాధనము చెప్పినపక్షమందు అది పరమార్థసాధన మని కనఁబడనేకనఁబడదు; విచారమనఁగా ఒకఅసహ్యపదార్థము, చెప్పువాఁడు శత్రువే.

1. జ్ఞానసముద్రగ్రంథమందు యమనియమములు పదిపదివిధములని చెప్పఁబడినది పురాణపద్ధతిగా చెప్పఁబడినది; వేదాంతసంప్రదాయమందో, ఐదయిదు ప్రకారముగా వ్రాయఁబడియున్నది.

లందు సింహభద్రపద్మసిద్ధములు ఈచతురాసనములు ప్రధాన ములు; ఈనాలుగింటియందును సిద్ధాసనము మిక్కిలి ప్రధానము.

దానిలక్షణ మేమనఁగా—వామపాదముయొక్క మడి మను గుదమేఢ్రమధ్యప్రదేశమునందు అదిమియుంచుచు, దక్షిణపాదముయొక్క మడిమను మేఢ్రమధ్యభాగమునందు అదిమియుంచవలయును; భ్రూకుటీమధ్యమందు దృష్టియుంచి, స్థాణువు[1] వలె సరళనిశ్చలముగా శరీరస్థితిని చేయవలయును; దానిని సిద్ధాసనమందురు; ఈసిద్ధాసనమే అతిప్రధానము; ఏల యన—ఎన్ని ఆసనములో, రోగనాశకములు; ఎన్ని ఆసనములో, ప్రాణాయామాదిసమాధ్యంగములకు సాధకములు; సిద్ధాస నమో, సమాధికాలమందు గలదు; అందువలన నది అతిప్రధా నము; దానినే వజ్రాసనము, ముక్తాసనము, గుప్తాసనము అని యందురు.

## 319. ప్రాణాయామము[2]

ఆసనసిద్ధికి తరువాత ప్రాణాయామము చేయవలయును; ఆ ప్రాణాయామము అనేకప్రకారములుగా నున్నది; అట్లుండి నను, దానికి సంక్షేపముగా ఇది లక్షణము—నాసికయొక్క వామరంధ్రమునుండి ఇడానామకనాడివలనవాయువునుపూరింప వలయును; దానిని పూరకమందురు; దక్షిణరంధ్రమునుండి పింగళానాడివలన విడువవలయును; దానిని రేచకమందురు;మధ్య

1. స్తంభన్యాయమున.

2. సకలహఠయోగమునకు ప్రాణాయామమందు అంతర్భావము గలదు; గనుక ప్రాణాయామరీతి హఠప్రదీపికాదిగ్రంథములందు స్పష్టముగా వ్రాయఁ బడినది.

సుషుమ్నానాడివలన వాయువును నిరోధింపవలయును; దానిని కుంభక మందురు; ఈరీతిగా పూరకాదిత్రయము ప్రాణాయామ మందురు.

ఆప్రాణాయామము, అగర్భసగర్భ భేదమువలన ద్వివిధముగ నున్నది. ప్రణవోచ్చారణరహితమయినది అగర్భము; తదుచ్చారణసహిత మయినది సగర్భము.

## 320. ప్రత్యాహారము; ధారణ, ధ్యానము.

విషయములనుండి సకలేంద్రియములను నిరోధించుటను ప్రత్యాహార మందురు; అంతరాయరహితమగు అంతఃకరణము యొక్క స్థితిని ధారణయందురు; అంతరాయరహితాద్వితీయవస్తువునందు అంతఃకరణవృత్తియొక్క ప్రవాహమును ధ్యాన మందురు.

## 321. సమాధినిరూపణము

వ్యుత్థానసంస్కారముయొక్క తిరస్కారము, మఱియు నిరోధసంస్కారముయొక్క ప్రకటతగల అంతఃకరణముయొక్క ఏకాగ్రతారూపపరిణామమును సమాధియందురు, ఆ సమాధి ద్వివిధము — మొదటిది సంకల్పము, రెండవది నిర్వికల్పము వానిలో —

(1) జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపత్రిపుటీభానసహితమయిన అద్వితీయబ్రహ్మమునందలి అంతఃకరణవృత్తియొక్క స్థితిని సవికల్పమందురు; ఆసవికల్పసమాధియు శబ్దానువిద్ధ శబ్దాననువిద్ధభేదమువలన ద్వివిధము వీనిలో — "అహం బ్రహ్మాస్మి" అనునీశబ్దముచేత అనువిద్ధ మనఁగా

మిశ్రమయినది శబ్దానువిద్ధము, శబ్దరహితమయి నది శబ్దానను విద్ధము.

(2) త్రిపుటీజ్ఞానరహితమగు అఖండబ్రహ్మాకారవృత్తిని నిర్వికల్పమందురు [దీని భేదములు ముందు 323 అంక మందు].

ఈరీతిగా సవికల్పనిర్వికల్ప భేదముచేత సమాధి ద్వివిధము; వీనిలో సవికల్పసమాధి సాధనరూపముగాను, నిర్వికల్ప సమాధి ఫలరూపముగాను ఉన్నది.

సాధనరూపమయిన సవికల్పసమాధియందు త్రిపుటీరూప ద్వైతము ప్రతీతమయినను, ఆ ద్వైతము బ్రహ్మరూపముచేత ప్రతీతమైయున్నది; ఎట్లు మృత్తికావికారమును మృత్తికారూపమని ఎఱుఁగుటవలన వివేకికి మృత్తికావికారమయిన ఘటాదికము ప్రతీతమయినను, మృత్తికారూపముచేతనే ప్రతీతమగునో, అట్లు సవికల్పసమాధియందు త్రిపుటీద్వైతము బ్రహ్మరూపముచేతనే ప్రతీతమగుచున్నది.

నిర్వికల్పసమాధియందు సవికల్పసమాధివలె త్రిపుటీరూప ద్వైతము విద్యమానమయినను దానియొక్క ప్రతీతి గలుగదు; ఎట్లు జలమందు వైచినలవణము అచ్చట విద్యమానముగా నుండినను, పైన జల ముండుటవలన నేత్రముచేత లవణము ప్రతీతము గానేరదో, అట్లు నిర్వికల్పసమాధియందు త్రిపుటి ప్రతీతము గానేరదు.

ఈరీతిగా సవికల్పసమాధియందు బ్రహ్మరూపముచేత త్రిపుటీద్వైతముయొక్క ప్రతీతి గలదు; మఱియు నిర్వికల్ప సమాధియందు దానియొక్క ప్రతీతిలేదు; రెంటియందిట్టి విలక్షణత గలదు.

[జాలముకట్టినవానిని నగ్నుఁడనుట ఘటిల్లనట్లు, లేశ మును ద్వైతప్రతీతి గలవానిని నిరావరణుఁడనుట ఘటిల్లదు.]

## 322. సుషుప్తికి నిర్వికల్పసమాధికి భేదము

సుషుప్తికిని, నిర్వికల్పసమాధికిని ఇట్లు భేదము—సుషుప్తి యందు అంతఃకరణోద్భవమగు బ్రహ్మాకారవృత్తి లేదు; నిర్వికల్ప సమాధియందు బ్రహ్మాకారవృత్తి కలదు. ఈవిధముగా సుషుప్తి యందు వృత్తిసహితాంతఃకరణము లేదు; నిర్వికల్పసమాధి యందు వృత్తిసహితాంతఃకరణము [1] కలదు; అయినను, దాని యొక్క ప్రతీతి గలుగదు.

---

1. సమాధియందు అంతఃకరణాభావమగు నేని, యోగియొక్క దేహము నిద్రితుని దేహమువలె పడవలయును ; అట్లు పడదు ; కనుక సమాధియందంతః కరణము గలదని తెలియవలయును ; అగ్నియొక్క యుపాదానకారణము వాయువగుటవలన అగ్నియొక్క ఉత్పత్తిస్థితినాశములు వాయువునకధీనముగా నుండును; కాఁబట్టి వాయువు ఎక్కువయుండినయెడల, దీపము ఆఱిపోవుట ప్రసిద్ధము; వాయువధికముగా లేనిస్థలమందు, స్వల్పముగా నుండుస్థలమందు దీపముండును; ఇదేతీరున సమాధియందు అంతఃకరణము కొంచెమయినను లేని పక్షమందు శరీరము పడిపోవుచున్నది; కనుక మనోబుద్ధిచిత్తాహంకారరూప వృత్తులులేని యంతఃకరణము సూక్ష్మముగా సమాధియందుండునట్లు సిద్ధమయి నది; అట్లు సమాధినుండి యుత్థానకాలమందు సమాధిస్మరణముండుటవలన, అనుభవింపఁబడని దాని స్మరణముండకుండుటవలన సమాధికాలమందు అంతః కరణముండినట్లు అనుమతి యగును; ఈయర్థము యోగవాసిష్ఠమందు భగవం తుఁడైనవసిష్ఠముని శ్రీరామచంద్రునికొఱకు పలికెను—

జితే తస్మిన్వృత్తిశూన్యం మన స్తిష్ఠతి మూకవత్,
ఏతత్పదం వసిష్ఠేన రామాయ బహుధేరితమ్, 1

నిర్వికల్పసమాధియందు ఏ బ్రహ్మాకారవృత్తి గలదో, ఆ వృత్తికి హేతువు సవికల్పసమాధియొక్క అభ్యాసమగుటవలన సాధన రూపాష్టాంగములందు సవికల్పసమాధియొక్క గణన చేయఁబడినది; ఈలాగు నిర్వికల్పసమాధి, సవికల్పసమాధి యొక్క ఫలరూపము.

## 323. నిర్వికల్పసమాధిభేదములు

నిర్వికల్పసమాధి ద్వివిధము—మొదటిది అద్వైతభావనారూపము, రెండవది అద్వైతావస్థానరూపము; వీనిలో—అద్వైతబ్రహ్మాకారమయిన అంతఃకరణముయొక్క అజ్ఞాతవృత్తి సహిత మేదిగలదో, అది అద్వైతభావనారూపమనఁబడును; ఆ యద్వైతభావనారూపసమాధియందు అభ్యాస మధికమగుట వలన బ్రహ్మాకారవృత్తియును శాంతమగుచున్నది; ఆ ప్రసంగ మందు వృత్తిరహితసమాధి ఏదిగలదో, దానిని అద్వైతావస్థాన [1] రూపమందురు.

ఎట్లు తప్తలోహముమీఁద [2] జలబిందువు పడినపుడు తప్తలోహమందు లీనమగునో, అట్లు అద్వైతభావనారూప

1. ఇది యద్వైతావస్థానరూపమైన నిర్వికల్పసమాధి, జ్ఞానముయొక్క సప్తమభూమిక; ఇది యోగముయొక్క పరమావధిగా నున్నది.

2. ఇచ్చట ఈరహస్యము గలదు—ఈ శుద్ధసమాధియందు నిశ్శేషరజస్తమముల తిరోధానముచేత ఆవిర్భావమునుపొందిన సత్త్వగుణరూపోపాదానమందు వృత్తియొక్క లయము సంభవించుచున్నది; నిర్వికారబ్రహ్మప్రకాశమందు సంభవింపదు; తప్తలోహమందు జలబిందువు దృష్టాంతము చెప్పఁబడినది; అచ్చటను విచారదృష్టిచే చూచినట్లయిన, పార్థివలోహమందు జలబిందువులలయము గాదు; జలోపాదానమగు అగ్నిమాత్రమందు జలబిందువుల లయమగుచున్నది; దానికిలోహమందులయమని ఉపచారముగా కథనమగును; అటు

సమాధియొక్క దృఢాభ్యాసమువలన అత్యంతప్రకాశమాన బ్రహ్మంబునందు వృత్తియొక్కలయ మగుచున్నది; దానిని అద్వైతావస్థాన మందురు.

[అద్వైతావస్థానరూపనిర్వికల్ప సమాధియందు బాధిత మైనట్టి బ్రహ్మాకారవృత్తియొక్క సద్భావము గలదనినపక్షమందు ఏ వివాదము గలుగదు.]

## 324. అద్వైతావస్థానసమాధికి సుషుప్తికి భేదము

అద్వైతావస్థానరూపసమాధికిని, సుషుప్తికిని ఈ భేదము గలదు—సుషుప్తియందు వృత్తియొక్కలయము అజ్ఞానమం దగును; అద్వైతావస్థానసమాధియందు వృత్తియొక్కలయము బ్రహ్మప్రకాశమం దగుచున్నది; సుషుప్తియొక్క ఆనందము అజ్ఞానావృతము, ఉక్తసమాధియందు నిరావరణబ్రహ్మానందమే ప్రకటమగుచున్నది.

## 325. నిర్వికల్పసమాధియొక్క నాలుగు [1] విఘ్నములు

ఆయద్వైతావస్థానరూపనిర్వికల్పసమాధియందు నాలుగు

---

బ్రహ్మప్రకాశముయొక్క భానరూపనిమిత్తముచేత వృత్తిలయమగుచున్నది; కనుక ఉపచారముగా బ్రహ్మప్రకాశమందు లయ మని చెప్పఁబడినది.

లేక ఈ సమాధివంతుఁడైన బ్రహ్మవిద్వరిష్ఠునిదృష్టిచేత గుణాదికము ప్రతీతముగాదు; శుద్ధబ్రహ్మమే ప్రతీతమగుచున్నది, అచ్చట ఆ వృత్తిరూప వివర్తముయొక్క అభావమైనది; అందువలనను, బ్రహ్మప్రకాశమందు వృత్తియొక్కలయ మని చెప్పఁబడియున్నది.

1. శ్రీశంకరాచార్యులు శ్లోకద్వయముచేత సమాధియొక్క అష్టవిధ విఘ్నములు పలుకుచున్నారు:—

విఘ్నములు గలవు; వానిని తిరస్కరించుటకొఱకు ఆ విఘ్నములను లక్షణసహితముగా చెప్పుచున్నాము—మొదటిదిలయము, రెండవది విక్షేపము, మూఁడవది కషాయము, నాల్గవది రసాస్వాదము.

### 326. లయవిఘ్ననిరూపణము

ఆలస్యముచేత, లేక నిద్రచేత వృత్త్యభావము, లయమనఁబడును; ఆ లయముచేత సుషుప్తితో సమానమగు అవస్థయగును; నిరావరణబ్రహ్మానందముయొక్క భానము గానేరదు; అందువలన నిద్రాలస్యాది నిమిత్తమువలన వృత్తి తనయుపాదానమైన అంతఃకరణమందు లీనమైనట్టు కనఁబడినపుడు యోగి సావధానుఁడై నిద్రాదికము నిరోధించి, వృత్తిని మేలుకొల్పవలయును; ఈరీతిగా లయరూప విఘ్నవిరోధియై, వృత్తియొక్క ప్రవాహరూపమగు జాగరణ మేదిగలదో, దానిని గౌడపాదాచార్యులు [1] చిత్తసంబోధన మని చెప్పిరి.

---

సమాధౌ క్రియమాణేతు విఘ్నాన్యాయాంతి వై బలాత్,
అనుసంధానరాహిత్య మాలస్యం భోగలాలసా. 1
భయం తమశ్చ విక్షేప స్తేజఃస్పందశ్చ శూన్యతా,
ఏవం యద్విఘ్నబాహుల్యం త్యాజ్యం బ్రహ్మవిదా శనైః. 2

భావార్థము—1. అనుసంధానభంగము 2. ఆలస్యము 3. భోగేచ్ఛ 4. భయము 5. నిద్ర 6. కల్పన 7. చిత్తచాంచల్యము 8. శూన్యత ఇవి అష్టవిధ విఘ్నములు.

1. ఈయర్థము గౌడపాదాచార్యకృత మాండూక్యోపనిషట్టీకయందు వ్రాయఁబడినది; ఇది వేదాంతదీపిక యను హిందుస్థానిభాషాటీకయందును వ్రాయఁబడియున్నది.

## 327. విక్షేపవిఘ్న నిరూపణము

దేగకు, లేక పిల్లికి భయపడి, చటకము గృహమును ప్రవేశించినపుడు భయవ్యాకులమగుటవలన దానికి గృహము లోపల స్థానము గనఁబడదు; కనుక పలుమారు బయలుఁ వచ్చును, లోపలికి పోవును; ఈప్రకారముగ వర్తనము చేయుచుచేయుచు తుదకు వెలుపలికి వచ్చి, మరణమును పొందుచున్నది; అట్లు అనాత్మపదార్థములను దుఃఖహేతు వని ఎఱిఁగి, అద్వైతానందమును విషయము చేయుటకొఱకు అంతఃకరణవృత్తి అంతర్ముఖమయినను, అచ్చట వృత్తివిషయమైన చైతన్యము అతిసూక్ష్మమగుటవలన కించిత్కాలము వృత్తికి నిలుకడ లేనియెడ, తత్కాలముందే చైతన్యస్వరూపానందముయొక్క లాభము కాదు; కనుక తొందరపడి, వృత్తి బహిర్ముఖమగును; ఈరీతిగా బహిర్ముఖ మగునట్టి వృత్తిని విక్షేప మందురు.

తద్వృత్తిస్థిరతను పొందినంగాని, స్వరూపానందముయొక్క లాభము కాదు; కాఁబట్టి అంతర్ముఖమైన వృత్తి ఎంతకాలమువఱకు బ్రహ్మాకారము కాదో, అంతకాలమువఱకు బాహ్యపదార్థములందు దోషభావనచేసి, యోగివృత్తిని బహిర్ముఖముగానీయక అంతర్ముఖముగా స్థాపింపవలయును; ఈరీతిగా విక్షేపరూప విఘ్నముయొక్క విరోధియైన యోగియొక్క ప్రయత్నము ఏది గలదో, అది గౌడపాదాచార్యులచేత శమ మని చెప్పఁబడినది.

## 328. కషాయవిఘ్ననిరూపణము

రాగాదిదోషమును కషాయ మందురు. ఇచ్చట ఈయాశంక గలదు—రాగాదికము ద్వివిధము-మొదటిది బాహ్యము,

రెండవది అంతరము—పుత్రక్షేత్రస్త్రీధనాదులగు ఎన్ని విషయములు వర్తమానములుగా నున్నవో, అవన్నీ బాహ్యము, మఱియు భూతవిషయము యొక్క, లేక భవిష్యద్విషయము యొక్క చింతనరూపమైన మనోరాజ్యము అంతరము; ఆ రెండు ప్రకారముల రాగాదికము సమాధియందు ప్రవృత్తుఁడైన యోగియందు సంభవింపదు?

ఏలయన: చిత్తమునకు పంచభూమికలు గలవు. మొదటిది క్షేపభూమిక, రెండవది మూఢభూమిక, మూఁడవది విక్షేపభూమిక, నాల్గవది ఏకాగ్రభూమిక, ఐదవది నిరోధభూమిక.

(1) లోకవాసన [1] దేహవాసన [2] శాస్త్రవాసన [3] ఇవి మొదలుకొని రజోగుణపరిణామమైన దృఢానాత్మవాసనను క్షేప మందురు.

(2) నిద్రాలస్యాది తమోగుణ పరిణామమును మూఢ మందురు.

---

1. ఎవ్వఁడును నన్ను నిందింపఁడు; సర్వులు స్తుతియే చేయుదురు; ఈయాగ్రహముయొక్క దృఢసంస్కారము.

2. స్థూలదేహముయొక్క, లేక సూక్ష్మదేహముయొక్క రోగాది రూపము, లేక పాపరూపము అగు మలమేది గలదో, దానిని ఔషధాదికము చేత లేక తీర్థాటనము చేత నిశ్శేషనివారణము చేయవలయును; మఱియు దీనియందు పుష్ట్యాదిరూపము, లేక పుణ్యరూపము అగు గుణములు సంపాదనము చేయవలయును; ఈయాగ్రహముయొక్క దృఢసంస్కారము.

3. సర్వశాస్త్రముయొక్క పాఠమును, లేక అర్థమును లేక తదుక్తాచరణమును నేను చేయవలయును; ఈయాగ్రహముయొక్క దృఢసంస్కారము.

(3) ధ్యానమందు ప్రవృత్తమైన చిత్తముయొక్క కదాచిద్బాహ్యప్రవృత్తిని విక్షేప మందురు.

(4) అంతఃకరణముయొక్క అతీతపరిణామమును, మఱియు వర్తమానపరిణామము ఈ రెండు సమానాకారమగుట ఏకాగ్ర మందురు. ఈ యేకాగ్రముయొక్క లక్షణము యోగసూత్రమందు పతంజలి చెప్పియున్నాఁడు; దానియభిప్రాయము—సమాధికాలములో యోగియొక్క యంతఃకరణమందు ఏకాగ్రత గలదు; ఆ యేకాగ్రత ప్రవృత్త్యభావ రూపము గాదు; అయినను, అంతఃకరణముయొక్క ఎన్నిపరిణామములు సమాధికాలమం దగునో, అవన్నియు బ్రహ్మమునే విషయముచేయును; అందువలన అంతఃకరణముయొక్క అతీతపరిణామము, మఱియు వర్తమానపరిణామము కేవల బ్రహ్మాకార మగుటవలన సమానాకార మగును; దానిని ఏకాగ్రత యందురు.

(5) పైచెప్పఁబడిన ఏకాగ్రతయొక్కవృద్ధిని నిరోధ మందురు.

ఈ యయిదుభూమికలు అంతఃకరణమునకుఁ గలవు. [భూమికయనఁగా యవస్థ]. ఈపంచభూమికలతోఁగూడిన అంతఃకరణమునకు క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అనిపేళ్లు. వీనిలో క్షిప్తమూఢాంతఃకరణములకో, సమాధియం దధికారము లేదు; విక్షిప్తాంతఃకరణమునకు అధికారము గలదు; ఏకాగ్రము, నిరుద్ధము ఈరెండు అంతఃకరణములు సమాధికాలమందుఁగలవు;ఈవిధముగా యోగగ్రంథమునందు చెప్పఁబడియున్నది.

రాగాదిదోష సహితాంతఃకరణము క్లిష్టముగానే యున్నది; దానికి యోగమునం దధికారము లేదు; కనుక రాగాది దోషరూపకషాయము సమాధికి విఘ్న [1] మనుట సంభవింపదు.

దానికి సమాధానము— బాహ్యాంతర రూపమైన [2] రాగాదికములు క్లిష్టాంతఃకరణమునందే గలవు; ఆ యంతఃకరణమునకు సమాధియం దధికారమే లేదు; అయినను, అనేకజన్మము

1. ఏపురుషునకు రాజునొద్దపోవుటకు అధికారము గలదో, వానిని ద్వారపాలకుఁడు అడ్డగించెను; ఇట్లుచెప్పుట సంభవించును; ఎవ్వనికి అచ్చట పోవుటకు అధికారమే లేదో, వానిని ద్వారపాలకుఁడు అడ్డగించెనని చెప్పుట సంభవింపదు; అట్లు క్లిష్టాంతఃకరణమునకు సమాధియందు అధికారముండినపుడు వానికి రాగాదిరూపకషాయము సమాధివిఘ్న మని చెప్పనగును; ఎందువలన క్లిష్టాంతఃకరణమునకు సమాధియం దధికారములేదో, అందువలన వానికి కషాయము సమాధివిఘ్న మనిచెప్పుట సంభవింపదు.

2. ఉద్వ్యక్తము, ఆశారూపము, వాసనారూపము అని భేదముచే రాగాదికము త్రివిధము—

(1) బాహ్యప్రవృత్తికి హేతువైన రాగాదికము ఏది గలదో, దానిని ఉద్వ్యక్త మందురు; దానినే బాహ్యమనియు అందురు.

(2) మనోరాజ్యరూపమైన రాగాదికము ఏది గలదో, దానిని ఆశారూప మందురు; దానినే ఆంతర మందురు.

(3) జన్మాంతరమందు అనుభూతమైన రాగాదికముయొక్క సంస్కార మేది కలదో; దానిని వాసనారూప మందురు.

వీనియందు వాసనారూపరాగాదికము ఉద్భూతానుద్భూతభేదముచే ద్వివిధముగా నున్నది; ఈయర్థము, జీవన్ముక్తివివేక మను గ్రంథమందు విద్యారణ్యస్వాములు వ్రాసియున్నారు.

లందు పూర్వానుభూతములైన బాహ్యాంతరరాగద్వేషముల యొక్క సూక్ష్మసంస్కారము విక్షిప్తాద్యంతఃకరణమందును సంభవించును; రాగద్వేషములకు పేరు కషాయము గాదు; అయిన, రాగద్వేషాదులయొక్క సంస్కారమునే కషాయ[1] మందురు; ఆ సంస్కారము ఎదివఱకు అంతఃకరణముండునో, అదివఱకు దూరము గానేరదు; సమాధికాలమందును అంతఃకరణము గలదు; కాఁబట్టి సంస్కారముగూడ ఉన్నది, అయిన, ఉద్భూత సంస్కారము సమాధికి విరోధిగా నున్నది; అనుద్భూతసంస్కారము విరోధిగాదు [ప్రకటమును ఉద్భూత మందురు; అప్రకటమును అనుద్భూత మందురు].

విక్షేపమునకును, కషాయమునకును ఈ భేదము గలదు- బాహ్యవిషయాకారవృత్తిని విక్షేప మందురు; యోగియొక్క ప్రయత్నమువలన వృత్తి యంతర్ముఖమైనను, రాగాదికము యొక్క ఉద్భూతసంస్కారమువలన అంతర్ముఖమైన వృత్తియును బ్రహ్మాకారముగాక, తటస్థ మగును; దానిని కషాయ మందురు.

విషయమందు దోషదర్శనసహితమైన యోగియొక్క ప్రయత్నమువలన కషాయవిఘ్నముయొక్క నివృత్తి యగును.

1. దానికి ఈ దృష్టాంతము గలదు—రాజును చేరుటకొఱకు గృహమునుండి వెడలిన ఒకానొకధనికుని రాజద్వారమందు ద్వారపాలకుఁడు అడ్డగించెను; అట్లు సర్వవిషయములనుండి ఉపరమించి, నిర్వికల్పసమాధియొక్క యానందముకొఱకు అంతర్ముఖమయిన యోగియొక్క మనస్సు ఏది గలదో, దానిని మధ్యమందు ఉద్భూతరాగాదుల సంస్కారరూపకషాయము అడ్డగించుచున్నది; కనుక అది సమాధికి విఘ్నము.

## 329. రసాస్వాదవిఘ్ననిరూపణము

రసాస్వాదమున కిది యర్థము— యోగికి బ్రహ్మానందము యొక్క అనుభవ మగుచున్నది, మఱియు విక్షేపరూపదుఃఖ నివృత్తియొక్కయు అనుభవమగుచున్నది; లోకమునందు దుఃఖ నివృత్తినిగూడ ఆనంద మందురు; దానికి దృష్టాంతము—భార వాహిపురుషుఁడు భారముదించుటవలన ఆనందానుభవము చేయుచున్నాఁడు; అచ్చట ఆనందమునందు ఇంకొక హేతువు లేదు; భారజన్యదుఃఖముయొక్క నివృత్తివలననే వాఁడిట్లు ఎఱుఁగు చున్నాఁడు—"నాకానందమయినది" ఈ ప్రకారముగా నివృత్తి యును ఆనందరూపముని కనఁబడుచున్నది; అట్లు యోగికిసమాధి యందు విక్షేపజన్యదుఃఖముయొక్క నివృత్తివలన ఏ యానంద మగుచున్నదో, ఆ యానందానుభవమును రసాస్వాదమందురు.

దుఃఖనివృత్తిజన్యమైన ఆనందానుభవమందే యోగి అలంబుద్ధిచేయునెడ, సకలోపాధిరహితమగు బ్రహ్మానందాకార వృత్తియొక్క అభావమువలన సమాధియందు వానికి బ్రహ్మా నందము లభ్యముగాదు; కనుక ఉక్తరసాస్వాదము సమాధికి విఘ్న మని చెప్పఁబడినది.

వాంఛితార్థప్రాప్తి లేకయు, విరోధ్యర్థనివృత్తివలన ఆనందోత్పత్తియందు అన్యదృష్టాంతము చెప్పుచున్నారు— పృథ్వియందు నిధి గలదు; ఆ నిధి విషధరసర్పముచేత రక్షిత మయి యున్నది; అచ్చట నిధిప్రాప్తికి మున్నె తద్విరోధి సర్ప నివృత్తివలన ఆనంద మగుచున్నది; అపుడు సర్పనివృత్తిజన్యా నందమందు అలంబుద్ధి చేసినట్టయిన, ఉత్తరోద్యమత్యాగముచే నిధిప్రాప్తియొక్క పరమానందము ప్రాప్తము గాదు.

అట్లు అద్వైత బ్రహ్మరూపనిధి గలదు; దానిమీఁద దేహాద్యశాత్మప్రతీతిరూపవిక్షేపము ఏది గలదో, అది సర్పముగా నున్నది; ఆ సర్పనివృత్తిజన్యమైన అవాంతరానందరూప రసముయొక్క అనుభవరూపాస్వాదము ఏది గలదో, అది నిధిరూపబ్రహ్మప్రాప్తికి ప్రతిబంధక మగుటవలన దానిని విఘ్నమందురు. లేక రసాస్వాదమునకు మఱియొక అర్థమగుచున్నది— సవికల్పసమాధి కనంతరము నిర్వికల్పసమాధి యగును; సవికల్పసమాధియందు ఏ యానందము ప్రాప్తమగునో, ఆయానందము త్రిపుటీరూపోపాధిసహిత మగుటవలన సోపాధిక మందురు; నిర్వికల్పసమాధియందు త్రిపుటీప్రతీతి గామివలన దానియందుఁ గలుగు ఆనందము నిరుపాధికము; యోగియో, ఆ సోపాధికానందమును విడువక, దానియందే రమమాణుఁడై యుండును; కనుక దానిని రసాస్వాద మందురు.

పూర్వము చెప్పఁబడిన విక్షేపనివృత్తిజన్యానందానుభవము గానీ, లేక సవికల్పసమాధియొక్క ఆనందానుభవము గానీ ఈరెండుప్రకారములగు రసాస్వాదమును నిర్వికల్పసమాధియొక్క పరమానందానుభవమునకు విరోధియగుటవలన విఘ్నముగా నున్నది; కనుక యోగి, ఆ ద్వివిధానందమును విడువవలయును.

ఈరీతిగా నిర్వికల్పసమాధియందు నాలుగువిఘ్నములు గలవు; ఈ విఘ్నములు సమాధియొక్క ఆరంభమందు అగుచున్నవి; కాఁబట్టి సావధానముగా వీనిని పరిహరింపవలయును.

## 330. జ్ఞానికి బాహ్యప్రవృత్తిసంభవాక్షేపము, మఱియు దానియొక్క సమాధానము.

ఏ విద్వాంసుఁడు సమాధియందు పరమానందానుభవము చేయునో, వాఁడే జీవన్ముక్తుఁడు; ప్రారబ్ధబలమువలన వాఁ డెప్పుడు సమాధినుండి లేచునో, అపుడును సమాధియందనుభూతమైన పరమానందమును స్మరించును; ఈరీతిగా వ్యుత్థానకాలమందును జ్ఞానియొక్క చిత్తము నిరాలంబముగాదు; ఆ విద్వాంసునకు భోజనాదికమునందు ప్రవృత్తి ఏది యగునో, అది కేవల ప్రారబ్ధమువలన నగును; ఆ భోజనాదివ్యవహారమందును జ్ఞాని ఖేదముచేత ప్రవృత్తుఁ డగును; ఏలయన—భోజనాదిప్రవృత్తి యును సమాధికి విఘ్నముగా నున్నది; ఎవ్వనికి భోజనాదిశరీరకర్మమందును ప్రవృత్తి ఖేదరూపమయి ప్రతీతమగునో, వానికి అంతకన్న అధికప్రవృత్తి సంభవింపదు?

ఈరీతిగా అనేకాచార్యులు ఇదేపక్షము వ్రాసియున్నారు; జీవన్ముక్తియొక్క ఆనందమును బాహ్యప్రవృత్తివలనఁగా నేరదు; కనుక జీవన్ముక్తిసుఖార్థియైన జ్ఞానవంతునకు బాహ్యప్రవృత్తి సంభవింపదు?

## 331. 315—330 గతాక్షేపమునకు సమాధానము, జ్ఞాని నిరంకుశుఁడు, ప్రారబ్ధము చేత వ్యవహారము 331—334

పూర్వపక్షవార్తయో, సంభావితముగ కనఁబడుచున్నది; అట్లయినను, జ్ఞానవంతునికి నివృత్తినియమము సంభవింపదు; ఏలయన—ప్రవృత్తియందుఁగాని, నివృత్తియందుఁగాని జ్ఞానికి వ్యవహారనియమము విధించునట్లు వేదాజ్ఞారూపవిధి లేదు;ఎందు

వలన జ్ఞానివ్యవహారమందు నియమవిధి లేదో, అందువలన జ్ఞాని నిరంకుశుఁడుగా నున్నాఁడు; వానియొక్క వ్యవహారము ప్రారబ్ధమువలననగును; ఏజ్ఞానియొక్క ప్రారబ్ధము భిక్షాభోజనమాత్రమునకు హేతువో, వానికి భిక్షాభోజనమాత్రమందే ప్రవృత్తి యగును; ఎవ్వని ప్రారబ్ధము అధికభోగమునకు హేతువో, వానికి అధికవ్యవహారమందును ప్రవృత్తి యగును.

ఒకానొకఁ డిట్లనును—ఎవని ప్రారబ్ధము భిక్షాభోజనమాత్రమునకు హేతువో, వానికే జ్ఞానమగును; ఎవ్వని ప్రారబ్ధము అధికవ్యవహారమునకు హేతువో, వానికి జ్ఞానము గానేరదు; కనుక భిక్షాభోజనాదివ్యవహారముకన్న నధికవ్యవహారము జ్ఞానికి ఘటిల్లదని చెప్పఁబడినది; ఈవిధి చేతను ఎవనికి అధిక ప్రవృత్తి యగునో, వాఁడు జ్ఞానిగాఁడు.

ఆశంకయు ఘటిల్లదు; ఏలయన— యాజ్ఞవల్క్యజనకాదులను జ్ఞానులందురు; సభావిజయమువలన ధనసంగ్రహవ్యవహారము యాజ్ఞవల్క్యునకు, అట్లె రాజ్యపాలనవ్యవహారము జనకునకు చెప్పఁబడినది; మఱియును యోగవాసిష్ఠమునందు నానాజ్ఞానిపురుషులవ్యవహారము నానాప్రకారములుగా చెప్పఁబడినది; ఈరీతిగా జ్ఞానులకు ప్రవృత్తియందుఁగాని, నివృత్తియందుఁగాని నియమము లేదు.

యద్యపి యాజ్ఞవల్క్యుఁడు సభావిజయము తరువాత విద్వత్సన్న్యాసరూప [1] నివృత్తిని ధరించెను; మఱియు ప్రవృత్తి

1. సన్న్యాసిశబ్దముయొక్క వాచ్యార్థము శాస్త్రపురాణలౌకికరీతులందు అనేకప్రకారములుగా శ్రవణమందు వచ్చుచున్నది; నిరగ్నియయ్యు, శిఖాసూత్రముల పరిత్యాగము చేయువాఁడు సన్న్యాసి యని లోకములందు

యందు గ్లాని హేతువైన నానాదోషములను చెప్పెను; తథాపి యాజ్ఞవల్క్యునకు విద్వత్సన్న్యాసమునకన్న మొదలు జ్ఞానము లేదని చెప్పుట సంభవింపదు; జ్ఞానమో, మొదలే యుండెను; అయినను, విద్వత్సన్న్యాసమునకన్న మొదలు జీవన్ముక్తిసుఖము దొరకదు; ఆజీవన్ముక్తిసుఖమునకొఱకు సర్వసంగ్రహమునొక్క త్యాగము చేసెను.

---

సర్వత్ర ప్రసిద్ధముగా నున్నది; వానిలో—1. కుటీచకుఁడు 2. బహూదకుఁడు 3. హంసుఁడు 4. పరమహంసుఁడు ఈవిధములుగా సన్న్యాసియొక్క నాలుగు భేదములు అంగీకరించియున్నారు.

కొందఱు హంసుఁడు, పరమహంసుఁడు ఈ ముఖ్యములయిన రెండు భేదముల నంగీకరించి, వానిలో—

(1) హంసునియందు కుటీచకుఁ డని, బహూదకుఁ డని రెండు భేదము లంగీకరించిరి. 1. తీర్థయాత్ర చేయుట కసమర్థుఁ డగుటవలన మఠము కట్టుకొనియుండినవాఁడు కుటీచకుఁడు; వాఁడు తీర్థయాత్ర చేయక, మొదలే మఠముకట్టునీ, లేక తీర్థయాత్ర చేసి చేసి, అసమర్థుఁడగుటవలన కట్టునీ. 2. తీర్థయాత్ర చేయువాఁడు బహూదకుఁడు.

(2) పరమహంసునియందు వివిదిషు వని, విద్వాంసుఁ డని రెండు భేదము లంగీకరించి, వానిలో—1. దోషదృష్టిరూపవైరాగ్యాదిసాధనసంపన్నుఁడై, జ్ఞానాపేక్షచే చేయుసన్న్యాసము వివిదిషాసన్న్యాసము 2. దోషదృష్టిరూపము, అపరోక్షమిథ్యాదృష్టిరూపము ఈ ద్వివిధవైరాగ్యాదిసాధనములతో సంపన్నుఁడై, జీవన్ముక్తిసుఖముకొఱకు జ్ఞానోత్తరము చేయుసన్న్యాసము విద్వత్సన్న్యాసము.

కొందఱు శాస్త్రానుసారియై, ఆచారసంపన్నుఁడైన సన్న్యాసిని హంసుఁ డని, యథేష్టాచరణము చేయువాఁడైన సన్న్యాసిని పరమహంసుఁడని

లేక ఆరూఢుఁడని, లేక అవధూతుఁడని చెప్పుచున్నారు; పూర్వమందు సన్న్యాసదీక్ష గ్రహింపక భ్రష్టుఁడై, యథేష్టాచరణము చేయువాఁడై యుండినను, వానియందును ఉక్తపరమహంసాది నామత్రయముయొక్క వ్యవహారము చేయుచున్నారు [వాని జ్ఞానాజ్ఞానమును ఎవ్వరు చూడరు].

మఱియు గిరిపురీభారతీసరస్వతీతీర్థారణ్యనామములచేత సన్న్యాసియొక్క తరగతులు ఏర్పఱుచుచున్నారు. కొందఱు యుక్తప్రకారములకంటె వేఱేప్రకారముగా సన్న్యాసియొక్క వర్గములను చేయుచున్నారు.

వానికి వర్గభేదములచేత విచారశూన్యమయినట్టి అనేకవిధములుగా విలక్షణములయిన ఆచారములు గలవు; వానిలో కొన్ని ఆచారములు సశాస్త్రములుగాను, కొన్ని ఆచారములు అశాస్త్రములుగాను నున్నవి.

సన్న్యాసికి ఎన్ని తరగతులయిననుండని, మఱి ఎన్ని యాచారములయిననుండని, 1. అంతఃకరణశుద్ధికొఱకు తీసికొనిన నిరగ్నిసన్న్యాసము 2. జ్ఞానప్రాప్తికొఱకు తీసికొనిన వివిదిషాసన్న్యాసము 3. జీవన్ముక్తిసుఖముకొఱకు తీసికొనిన విద్వత్సన్న్యాసము ఇవి మూఁడుసన్న్యాసములలో ఒకటికంటె నొకటి ఉత్తమోత్తమముగానున్నది; ఇవితప్ప ఇతరములయిన సన్న్యాసములు వేషధారియయిన నటునివంటివని తెలియవలయును.

ఈయర్థమును మహారాష్ట్రభాషయందు వామనస్వాములు చెప్పుచున్నారు—

అంతరీంసతతజో భగవాహే బాహ్యవేషచితభగవాహే,
అంతరీంభజననిష్కపటాచేం త్యాసి కాయభయశుభ్రపటాచేం.

భావార్థము—భగము అనఁగా—ఇంద్రియవిశేషము, లేక స్త్రీధనపుత్త్రాదివిషయము, లేక శబ్దస్పర్శాదివిషయపంచకము, లేక బ్రహ్మాభిన్నఘటాది విషయము ఎవ్వఁడు సార్వకాలముగా అంతఃకరణమందు ధరించుచున్నాఁడో [చింతనము చేయుచున్నాఁడో], వాఁడు బాహ్యముగా కా

మత్తివేషమును [కాషాయవస్త్రము, దండము, కమండలు ఇత్యాది చిహ్నము లను] ధారణము చేయుచున్నాఁడు; ఎవ్వఁడు అంతఃకరణమందు నిష్కపట ముగా భజనము చేయుచున్నాఁడో, వాఁడు శ్వేతవస్త్రమునకు ఎందుకు భయ పడుచున్నాఁడు?

శ్రీకృష్ణభగవంతుఁడు గీతాషష్ఠాధ్యాయారంభమందు సన్న్యాసి యోగుల లక్షణములను చెప్పుచున్నాఁడు—

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
సనన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః. 1

భావార్థము—ఎవ్వఁడు కర్మఫలాపేక్షారహితుఁడై, చేయుటకు యోగ్యమయిన కర్మమును చేయుచున్నాఁడో, వాఁడు సన్న్యాసి, మఱియు వాఁడే యోగి [కర్మయోగి] అనఁగా—సకామనిషిద్ధకర్మములను పరిత్యజించి, విడచుటకు యోగ్యములేనట్టి ఏనిత్యనైమిత్తికప్రాయశ్చిత్తకర్మములు గలవో, అవి నిష్కామబుద్ధిచే, కృష్ణార్పణబుద్ధిచే ఎవ్వఁడు చేయుచున్నాఁడో, వాఁడు సన్న్యాసి; వాఁడే యోగి; ఎందుకనఁగా—పరిత్యాగము చేయువాఁడు సన్న్యాసియనియు, అక్రియుఁడు యోగియనియు లోకమందును, శాస్త్రమం దును ప్రసిద్ధముగ నున్నది; పైఁజెప్పఁబడినపురుషుఁడో, సకామనిషిద్ధకర్మ పరిత్యాగమువలన సన్న్యాసి, మఱియు నిష్కామకృష్ణార్పణబుద్ధిచే కర్మము చేయుటవలన యోగి [నిష్కామకృష్ణార్పణకర్మకర్తను అక్రియుఁడనవలెనని భగవంతుని యభిప్రాయము.] అగ్నిహోత్రస్నానసంధ్యాదిపరిత్యాగము చేయు వాఁడు సన్న్యాసికాఁడు; మఱియు దానపరిగ్రహాగమనాగమనాదులగు క్రియలను చేయనివాఁడు అనఁగా స్థిరముగ కూర్చుండువాఁడు యోగికాఁడు; ఈయభిప్రాయము శ్లోకాంతమందు భగవంతుఁడు స్పష్టముగా చూపు చున్నాఁడు.

యాజ్ఞవల్క్యునిప్రారబ్ధము పూర్వకాలమందు అధిక భోగమునకు హేతువుగాను, ఉత్తరకాలమందు న్యూనభోగ మునకు హేతువుగాను ఉండెను; అందువలన వానికి ప్రథమము అధికభోగమై, తరువాత గ్లానియై, సకలభోగములయొక్క త్యాగము ఘటిల్లినది.

జనకునిప్రారబ్ధము జన్మమునుండి మరణమువఱకు రాజ్య పాలనాదిసమృద్ధభోగమునకు హేతువుగా నుండెను; అందు వలన వానికి ఎప్పటికిని త్యాగమే ఘటిల్లదు.

శుకవామదేవాదులప్రారబ్ధము సర్వదా న్యూనభోగము నకు హేతువయినది; వారికి సర్వదా భోగములందు గ్లానియై, ప్రవృత్తియొక్క అభావమే చెప్పఁబడినది. యోగవాసిష్ఠము నందు ఇట్టిప్రసంగమును గలదు—శిఖరధ్వజునికి జ్ఞానానంతరము భోగమందు అధికప్రవృత్తి యయినది.

ఈరీతిగా నానాప్రకారములైన విలక్షణవ్యవహారము జ్ఞానిపురుషులకు చెప్పఁబడియున్నది; సర్వులకు జ్ఞానమో, సమా నముగాను [1] తత్ఫలమైన మోక్షమును సమానముగాను ఉన్నది; అయిన, ప్రారబ్ధభేదమువలన వ్యవహార మగుచున్నది;

1. ఇచ్చట ఈ సాంప్రదాయికవచనము గలదు—

కృష్ణో భోగీ శుకస్త్యాగీ నృపౌ జనకరాఘవౌ,
వసిష్ఠః కర్మకర్తా చ పంచైతే జ్ఞానినస్సమాః. 1

ఈరీతిగా నానాజ్ఞానులయొక్క ప్రారబ్ధభేదముచేత నానాప్రకారము లుగా వ్యవహారము చెప్పఁబడినది; ఈ త్వార్థప్రతిపాదకమైన చిత్రదీపవచ నము—

ఆరబ్ధకర్మనానాత్వాత్ బుధానామన్యథాన్యథా,

వ్యవహారన్యూనతవలన జీవన్ముక్తిసుఖముయొక్క అధికత మఱియు వ్యవహారాధిక్యమువలన జీవన్ముక్తిసుఖముయొక్క న్యూనత కలుగుచున్నది.

### 332. జ్ఞానికి విదేహమోక్షత్యాగమందు, లేక పరలోకేచ్ఛయందు శంకాసమాధానము

ఒకానొకఁ డిట్లు శంకించును—ఎవ్వఁడు జీవన్ముక్తి సుఖమును విడిచి, తుచ్ఛభోగములందు ప్రవృత్తుఁడగునో, వాఁడు విదేహమోక్షమును విడిచి, వైకుంఠాదిలోకములకు పోవును?

ఆశంక [1] ఘటిల్లదు; ఏలయనఁగా—జీవన్ముక్తిసుఖత్యాగమును, భోగములందు ప్రవృత్తియు జ్ఞానికి ప్రారబ్ధబలముచే సంభవించును, విదేహమోక్షత్యాగమును, పరలోకగమనమును

వర్తనం తేన శాస్త్రార్థే భ్రమితవ్యన్న పండితైః. 1
స్వస్వకర్మానుసారేణ వర్తంతాం తే యథా తథా,
అవిశిష్టస్సర్వబోధస్సమా ముక్తిరితి స్థితిః. 2

భావార్థము—1. ప్రారబ్ధకర్మము నానావిధమగుటవలన వేర్వేఱు ప్రకారములుగా జ్ఞానులవర్తనము గలదు; దీనిచేత పండితజనులు దృఢబోధముద్వారమున మోక్షప్రతిపాదకశాస్త్రమందు భ్రాంతులగుట యోగ్యముకాదు. 2. జ్ఞానులు, తమతమకర్మానుసారముగా ఎట్లైనవర్తించనీ. సర్వులకు బోధసమానము, దానిఫలమైన ముక్తియును సమానము; ఇట్లు శాస్త్రముయొక్కయు, విద్వాంసులయొక్కయు నిర్ణయము.

1. ఈశంక ద్వైతవివేకమందు విద్యారణ్యస్వాములు వ్రాసియున్నారు; అచ్చట స్వాములకు "ప్రారబ్ధమువలన భోగాదికములందు ప్రవృత్తుఁడైన జ్ఞానికి విదేహమోక్షత్యాగమునందు, లేక పరలోకగమనమునందు ఇచ్ఛయగును" అనునర్థమందు అభిప్రాయము లేదు; అయిన, ప్రయత్నరహితుఁడైన

ప్రారబ్ధముచేత సంభవింపదు; ఏలాగున ననఁగా—జ్ఞానియొక్క ప్రాణము బహిర్గమనము చేయదు, కనుక పరలోకగమనము సంభవింపదు; క్రింద వ్రాసినరీతిగా విదేహమోక్షత్యాగమును సంభవింపదు.

జ్ఞానమువలన అజ్ఞాననివృత్తియై, ప్రారబ్ధభోగమునకు తరువాతజ్ఞానకాలమందు బాధితమైనట్టిస్థూలసూక్ష్మశరీరాదులు తమతమకారణములైన భూతములద్వారమున మూలాజ్ఞానమునందు లీనమగుచున్నవి; ఆ బాధితమైన మూలాజ్ఞానముయొక్క లయము అనావశ్యము; ఈవిధముగా జ్ఞానికి విదేహమోక్షము అవశ్యముగా ప్రాప్తమగును; ఆ మూలాజ్ఞానముయొక్క శేషముండినపక్షమందు, లేక నష్టాజ్ఞానము పునరుత్పన్న పక్షమందు విదేహమోక్షాభావమగును; మూలాజ్ఞానమునకు విరోధి జ్ఞానమగుటవలన అజ్ఞానశేషముండదు; మఱియు ప్రమాణమువలన నష్టమైన అజ్ఞానమునకు పునరుత్పత్తి గానేరదు; కనుక విదేహమోక్షముయొక్క అభావము గానేరదు.

---

జ్ఞానికి, యథేష్టాచరణమునకు హేతువైన భోగాదికములనందలి ఆసక్తిమండి మరలించి, జీవన్ముక్తిసుఖమునందు ఆసక్తునిచేయుటయందు అభిప్రాయము గలదు ; ఎట్లనఁగా—

రోగజనకపదార్థమును దినుపుత్త్రునిఁ జూచి—"బాలకుఁడా! ఎప్పుడు నీవు ఆరోగ్యేచ్ఛ వదలి, చూచుటకుమాత్రము సుందరమైనట్టి రోగజనకపదార్థములెనుచున్నావో, అప్పుడు నీవు జీవితేచ్ఛయును విడిచి, విషమోదకముకు తిందువు" అనునిట్లు చెప్పుమాతకు పుత్త్రుని జీవత్యాగమందును, విషమోదకము గోరుటయందును అభిప్రాయము లేదు; రోగజనకపదార్థము విడిపించుటయందు అభిప్రాయము గలదు.

ఏ సామగ్రి లేక, భోగము సంభవింపదో, ఆసామగ్రిని ప్రారబ్ధము రచించుచున్నది; ఎచ్చట ఇచ్ఛలేక భోగము సంభవింపదో, అచ్చట భోగేచ్ఛయును జ్ఞానికి ప్రారబ్ధఫలముగ నున్నది; ఆ భోగేచ్ఛారూపప్రారబ్ధఫలమును వర్తమానశరీరమందే ఉపభోగింపఁదగినది, కావున అన్యలోకమందు, లేక ఈలోకమందు అన్యశరీరసంబంధముకొఱకు జ్ఞానికి ప్రారబ్ధమువలన ఇచ్ఛ సంభవింపదు.

ఈరీతిగా జ్ఞానికి ప్రారబ్ధమువలన విదేహమోక్షత్యాగమునందు, లేక పరలోకగమనమునందు ఇచ్ఛ సంభవింపదు.

## 333 జ్ఞానికి మంద ప్రారబ్ధముచే జీవన్ముక్తి సుఖవిరోధియయిన ప్రవృత్తి.

జీవన్ముక్తిసుఖమునకు విరోధియైన అధికభోగేచ్ఛ భిక్షాభోజనాదికమువలె జనకాదులకు సంభవించినది; ఈస్థానమునందు ఈరహస్యము గలదు.

జ్ఞానియొక్క బాహ్యప్రవృత్తి జీవన్ముక్తికి విరోధి గాదు; అయినను, జీవన్ముక్తిసుఖమునకు విరోధిగా నున్నది; ఏలయన— ఆత్మ నిత్యముక్తుఁడు, అవిద్యవలన బంధప్రతీతియైనది; ఏకాలమందు జ్ఞానమగునో, ఆకాలమందే బంధభ్రమ నష్టమగును; జ్ఞానమయినవెనుక మరల బంధభ్రాంతి గానేరదు; శరీరముండినను బంధభ్రమాభావమగుట జీవన్ముక్తియందురు; దేహాదికముయొక్క ప్రవృత్తి యుండనీ, లేక నివృత్తియుండనీ జ్ఞానికి ఆత్మయందు బంధభ్రాంతి ప్రతీతము గానేరదు; కావున బాహ్యప్రవృత్తియైనను, జీవన్ముక్తి దూరముగాదు; బాహ్యప్రవృత్తివలన జీవన్ముక్తిసుఖము మాత్రము గలుగదు; ఏలయనఁగా—ఏకాగ్రతా

రూపాంతఃకరణపరిణామమువలన జీవన్ముక్తి సుఖమగును; ఆయేకాగ్రతాపరిణామము బాహ్యప్రవృత్తివలన నశించుచున్నది.

ఈవిధముగా ప్రారబ్ధభేదము [1] వలన జ్ఞానులయొక్క వ్యవహారము నానాప్రకారములుగా నగును; వానిలో ఎవ్వని ప్రారబ్ధము అధికప్రవృత్తికి హేతువగునో, వానిది మందప్రారబ్ధ మందురు; ఏలయన అధికప్రవృత్తి ఏకాగ్రతకు విరోధియగును; ఏకాగ్రత లేక నిరుపాధికానందము ప్రతీతము గాదు [ఇది పూర్వము సమాధినిరూపణమునందు చెప్పఁబడియున్నది.]

---

1. ప్రారబ్ధవిచారమునందు భిన్నభిన్నములగు టిప్పణములు ఇవి—

(1) రజ్జుజ్ఞానమువలన సర్పభ్రాంతి నివారింపఁబడినట్లు అధిష్ఠానాత్మజ్ఞానమువలన అహంకారాది జగద్భ్రాంతి బాధింపఁబడినది; సర్పజ్ఞానమువలన కలిగిన భయకంపాదులు కాలాంతరమందు నివృత్తమైనట్లు సుఖదుఃఖాదిభోగములు ప్రారబ్ధసమాప్తివఱకు ఉండును; మందాంధకారమందు మరల రజ్జువు సర్పరూపముగా ప్రతీతమైనట్లు భోగకాలమందు నేను మనుష్యుఁడు మొదలైన ప్రతీతి జ్ఞానికి కలుగుచున్నది.

ఉపాదానమైన అజ్ఞానముయొక్క నివృత్త్యనంతరము కార్యమైన ప్రపంచము జ్ఞానికి ప్రతీతముకావుట అయుక్తముగా కనఁబడినను, ఏరీతిగా ఎద్దును వ్యాఘ్రమని తెలిసి, దానిపైన బాణము విడిచినపిదప ఎద్దని తెలిసికొనుట వలన ఇతరబాణములను ప్రయోగము చేయకపోయినను, ప్రయోగించిన బాణము వేగమున్న పర్యంతము పోవునో, ఆరీతిగా జగమునకు కారణమగు భ్రమస్థానమందుండు అజ్ఞానము, ఇతరబాణస్థానమందుండు సంచితక్రియమాణకర్మములు, ఏవి గలవో ఆ యజ్ఞానముయొక్కయు, సంచితక్రియమాణకర్మములయొక్కయు నాశమైనను, విడిచినబాణస్థానమందుండు ప్రారబ్ధము, మఱియు జగత్తు ఉండజేయుఁదును.

(2) ఎట్లు తనపరాక్రమముచే శత్రుసంహారము చేయుం సార్వభౌమునృపతికి రోగహేతువైన ప్రారబ్ధము భోగమునకు ప్రతిబంధకమగుటవలన మందమందురో, అట్లు అవిద్య, మఱియుం తత్కార్యరూపశత్రువుయొక్క సంహారము చేసి, బ్రహ్మభావమును పొందిన జ్ఞానిరాజునకు అధికప్రవృత్తికి హేతువైన ప్రారబ్ధము ఏకాగ్రతకు విరోధియగుటవలన మందమందురు; ఉక్తరాజు శిథిలప్రారబ్ధజన్యమైన సులభసాధ్యకష్టసాధ్యరోగములకు ఔషధాదిప్రయత్నముచేత నివృత్తి చేయుంను; అయిన, మందప్రారబ్ధజన్యాసాధ్యరోగముయొక్క నివృత్తిచేయుంట వానికి అశక్యము; అట్లు శిథిలప్రారబ్ధఫలరూపమైన ప్రవృత్తిని విద్వాంసుఁడు జీవన్ముక్తిసుఖముకొఱకు వాసనానాశాదిప్రయత్నమువలన దూరము చేయుంను; అయిన, మందప్రారబ్ధఫలరూపప్రవృత్తి వానికిని నివారణము చేయుంట అశక్యము.

ఈరీతిగా వ్యవస్థచేసిన, ప్రారబ్ధము, మఱియుం ప్రయత్నము రెండును సఫలమగును; ఈపక్షమందు అధికప్రవృత్తికి హేతువైన ప్రారబ్ధము శిథిలము గాదు; తీవ్రముగ నుండినను, అది నికృష్టమగుటవలన దానిని మందమందురు.

(3) ఇచ్చట ఈవివేకము గలదు—మందతీవ్రతీవ్రతరభేదములచేత ప్రారబ్ధము త్రివిధము.

(1) దేనియొక్క ఉపాదేయఫలము భిక్షాన్నమువలె నధికప్రయత్నముచేత ప్రాప్తమగునో, మఱియుం ప్రాప్తమైన హేయఫలము సులభసాధ్యరోగమువలె అల్పప్రయత్నముచే నివృత్తమగునో, ఆ ప్రారబ్ధము మందము.

(2) దేనియొక్క ఉపాదేయఫలము నిమంత్రణాన్నమువలె అల్పప్రయత్నమువలన ప్రాప్తమగునో, మఱియుం ప్రాప్తమైన హేయఫలము కష్టసాధ్యరోగమువలె అధికప్రయత్నముచేత నివృత్తమగునో, ఆ ప్రారబ్ధము తీవ్రము.

(3) దేనియొక్క ఉపాదేయఫలము కూర్చున్నచోటదొరకు అన్నము వలె ప్రయత్నములేక, ప్రాప్తమగునో, మఱియుం ప్రాప్తమైన హేయఫలము బలీవర్దముయొక్క దామమువలె మరణాంత ప్రయత్నముచేతను నివృత్తము కాదో, ఆ ప్రారబ్ధము తీవ్రతరము.

వీనిలో మందతీవ్రప్రారబ్ధఫలమైన ప్రవృత్తి ప్రయత్నాధీనముగా నున్నది;ఎలాగుననగా ---ఆప్రవృత్తికి హేతువైన శుభాశుభవాసనలనివృత్తి పురుషప్రయత్నమువలన నగును; శుభవాసనానివృత్తి సత్సంగమువలన, అశుభ వాసనానివృత్తి సత్సంగవివేకజ్ఞానాదులవలన అగును; ఎందువలన జ్ఞాని సత్సంగ వివేకజ్ఞానాదిగుణములచేత సంపన్నుఁడో, అందువలన వానిచిత్త మందు ప్రవృత్తిహేతువైన అశుభవాసన గానేరదు; శుభవాసన యగును; సత్సంగబలమువలన ఆ శుభవాసనచేతను ప్రవృత్తి గానేరదు.

రోగికి అన్వయవ్యతిరేకములచేత దోషనిశ్చయమైనను, అపథ్యసేవన మందు ప్రవృత్తి ఏది యగునో, అది ప్రయత్నశీలరోగికి గానేరదు ; జిహ్వా లోలుఁడైన ప్రయత్నరహితరోగికి అగుచున్నది ; ప్రయత్నశీలరోగికిని అపథ్య సేవనమందు ప్రవృత్తియగుట తీవ్రతరప్రారబ్ధఫలమని తెలియవలయును. ఈ రీతిగా దోషనిశ్చయమిథ్యాత్వనిశ్చయరూపమైన దృఢవివేకముతోఁగూడిన జ్ఞానికి మందతీవ్రప్రారబ్ధములయొక్క ఫలభూతమైన యథేష్టాచరణరూప నిషిద్ధప్రవృత్తి సంభవింపదు.

ఇచ్చట ప్రారబ్ధభక్తుఁడు ఇట్లనును---ప్రారబ్ధముయొక్క ఫలము సర్వథా అనివార్యము ; కనుక పురుషప్రయత్నము వ్యర్థము.

ఇట్లయినప్పుడు సర్వజ్ఞరచితములగు వైద్యశాస్త్రము,మంత్రశాస్త్రము, యోగశాస్త్రము మొదలైన ఉపాయబోధకశాస్త్రములు వ్యర్థములగును; దృష్ట ఫలోపాయబోధకశాస్త్రములు వ్యర్థమనుట ఘటిల్లదు ; ఇచ్చటచెప్పిన వ్యవస్థ వలన ప్రారబ్ధము, ప్రయత్నము రెండును సఫలములగు; ఈయుక్తిప్రాయమువల

నని మనోనాశాది ప్రయత్నము యోగవాసిష్ఠాద్యుత్తమగ్రంథములందు చెప్పఁబడియున్నది.

(4) ఇచ్చట నీయభిప్రాయము గలదు—స్వాధీనకార్యమందు నియమమగును; పరాధీనకార్యమందు నియమము సంభవింపదు; ఎందువలన నానాజ్ఞానులయొక్క శరీరవ్యవహారము నానాప్రారబ్ధములకధీనముగ నున్నదో, అందువలన హస్తముక్తబాణవేగాధీనమైన గోవధమువలె ప్రారబ్ధములకధీనమైన జ్ఞానియొక్క దేహవ్యవహారము ఏది గలదో, దానిని నియమించుటకు జ్ఞాని స్వతంత్రుఁడు గాఁడు; గనుక నియమము సంభవింపదు.

యద్యపి రాగాదివాసనను అడ్డపెట్టి, స్వాధీనచిత్తవంతులైన కొందఱు జ్ఞానులు మందతీవ్రప్రారబ్ధఫలరూపమైన శరీరవ్యవహారమును నియమింతురు; తథాపి తీవ్రతరప్రారబ్ధఫలరూపమగు శరీరవ్యవహారముయొక్క నియమము జ్ఞానికిని ఘటిల్లదు.

(5) జ్ఞానికి స్వేచ్ఛ, అనిచ్ఛ, పరేచ్ఛ వీనిభేదమువలన ప్రారబ్ధము త్రివిధమని విద్యారణ్యస్వాములు పంచదశీతృప్తిదీపమునందు వ్రాసియున్నారు;

(6) ఒకానొకగ్రంథకారుని యభిప్రాయము—ఉత్తమము, మధ్యమము, అధమము, అధమతరము, అధమతమము ఈవిధముగ ప్రారబ్ధము పంచవిధము.

(1) జననము మొదలు మరణమువఱకు నివృత్తికి హేతువగు ప్రారబ్ధము ఉత్తమము; శుకవామదేవసనకాదుల ప్రారబ్ధమువలె.

(2) ప్రథమమందు ప్రవృత్తికి హేతువై, యనంతరము నివృత్తికి హేతువగు ప్రారబ్ధము మధ్యమము; యాజ్ఞవల్క్యాదుల ప్రారబ్ధమువలె.

(3) సర్వదా ప్రవృత్తికే హేతువగు ప్రారబ్ధము అధమము; జనకాదుల ప్రారబ్ధమువలె.

(4) ప్రథమమందు నివృత్తికి హేతువై, యనంతరము ప్రవృత్తికి

హేతువగు ప్రారబ్ధము అధమతరము; శిఖిధ్వజప్రియవ్రతాదుల ప్రారబ్ధమువలె.

(5) స్వేచ్ఛగా నడుచుట, వచించుట, భుజించుట మొదలగు ప్రమాదమునకు హేతువగు ప్రారబ్ధము అధమతమము.

ఈప్రకారముగా ఇచ్చట ప్రారబ్ధవిచారము షడ్విధములుగ చెప్పఁబడినది; ఇదిగాక ఈవిచారము ఇదివఱకు ఈగ్రంథమందు అనేకమాఱులు వచ్చుచున్నది; ఇవన్నియు కృపాళుసర్వజ్ఞులచేతనే చెప్పఁబడియున్నవి; అయినను, దానియొక్క అర్థసమన్వయము చేయుటయందు తనబుద్ధికి జాగ్రత్త చేయవలయును.

ఈప్రకరణమందు ఈదిగువ వ్రాయఁబడిన ఆక్షేపములు పుట్టుచున్నవి.

1. కర్మఫలప్రదాతృసర్వజ్ఞుఁడగు ఈశ్వరునిచేత నియమింపఁబడిన దుర్నివారమైనట్టి ప్రారబ్ధకర్మమందు మందతీవ్రములనియు, నివార్యానివార్యములనియు తరగతులు పుట్టునా?

2. ఏ పక్షమందు ప్రయత్నముచే కొన్ని ప్రారబ్ధఫలములు నివారించి, కొన్ని ఉపభోగించుటయందు ప్రయత్నము, ప్రారబ్ధము రెండును సఫలమగునో, ఆపక్షమందు ప్రయత్నమునకు ప్రారబ్ధఫలము నివారించుటకన్న ఇంకొక్క ఫలమే లేదా?

3. రోగాదితాపనివారకమైనట్టి సర్వజ్ఞులచేత రచింపఁబడిన వైద్యశాస్త్రయోగశాస్త్రాదికము ప్రారబ్ధఫలనివృత్తికొఱకా?

4. ప్రయత్నాధికారి ప్రయత్నము చేయవలయునా? లేక ప్రయత్నానధికారి ప్రయత్నము చేయవలయునా?

5. యోగవాసిష్ఠాదిగ్రంథములందు మనోనాశాదిసాధనములు ఏవి చెప్పఁబడినవో, అవి జీవన్ముక్తవిద్యాంసులకొఱకా? ఇంకెవనికొఱకు?

6. పామరవిషయిజిజ్ఞాసుజనులు సంసారసముద్రమునందు మునిఁగి మునిఁగి, హాహాకారము చేయుచున్నారు; వారిని ఉద్ధరించు మార్గమును విడిచి, జీవన్ముక్తవిద్వాంసులు బ్రహ్మసాక్షాత్కారమై, విదేహముక్తియగుటకు మధ్యమందు నాలుగుదినములు బాధితమైనట్టి సంసారతాపము అనుభవించుచున్నారు; వారియొక్క తాపము నివారించి, వారికి జీవన్ముక్తిసుఖమార్గము చూపుటకు కృపాళులై, సర్వజ్ఞులైన గ్రంథకారులు యత్నించుచున్నారా?

ఈ ప్రకరణమునందు విచారము చేయఁజేయ ఇంకను ఆక్షేపములు పుట్టుచున్నవి; అన్ని ఆక్షేపములు వ్రాసి, సమాధానము వ్రాయుటయందు బహువిస్తరమగును; ఇచ్చట అంత ఆవశ్యకతయును లేదు; ప్రారబ్ధనియామకుఁడైన పరమాత్మ కేవలప్రారబ్ధవిచారమను స్వతంత్రగ్రంథము వ్రాయఁబోవును; ఇచ్చట ఆవశ్యకముగా కనఁబడునట్టి కొంచెముసమాధానము వ్రాయుచున్నాము—

జీవన్ముక్తవిద్వాంసునకు ప్రయత్నావశ్యకతయును లేదు, అవకాశమును లేదు: ఏలయనఁగా—ఎవ్వఁడు నిరంకుశతృప్తిగలవాఁడై, కృతకృత్యుఁడో, వాఁడు జీవన్ముక్తుఁడు; వానికి ఏమియును కర్తవ్యము లేదు, కర్తవ్యమున్నదనిన, వాఁడు తత్త్వవేత్త కాఁడు; ఈయర్థమునకు వాచకమైన సాంప్రదాయిక వచనము—

జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్. 1

వాది ఇట్లనును—అజ్ఞాని జ్ఞాని అందఱును సుఖముకోరినవారే, ప్రయత్నముగా జ్ఞానము సంపాదించుటకూడ సుఖముకొఱకే; లేనిపక్షమందు జ్ఞానమేమో, తినుటదార్థమా? త్రాగుటదార్థమా? అది ఎవ్వనికిని వద్దు; విద్వాంసుఁడు పరిశ్రమచే జ్ఞానము సంపాదించినాఁడు; ఇప్పుడు జ్ఞానముకొఱకు వానికి ఏమియును కర్తవ్యము లేదు, కాని, పరమ బ్రహ్మసుఖముయొక్క

సుఖము చూడలేదు; ఆబ్రహ్మసుఖము ఏకాగ్రాంతఃకరణముగలవానికే యగును; బాహ్యప్రవృత్తి ఏకాగ్రాంతఃకరణమునకు విరోధి; కనుక ప్రయత్నముచే మనోనాశవాసనాక్షయాదిసాధనములు విద్వాంసుఁడు చేయవలయును?

వాదిని అడుగవలయును—విద్వాంసుఁడు ఎప్పుడును బ్రహ్మసుఖానుభవము చేయలేదా? లేక సదా చేయఁడా?

ఎప్పుడును చేయలేదనుట ఘటిల్లదు; ఎందుకనఁగా—బ్రహ్మసాక్షాత్కారమైనతరువాత తనకృతకృత్యతాతృప్తి వర్ణనముచేయుటయందు "బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్" "అహో సుఖమహో సుఖమ్" విద్వాంసుఁడనెను.

సదాప్రాప్తము లేదనిన, ఆచింత ఇప్పుడు వద్దు; శరీరపాతానంతరము అఖండముగ ప్రాప్తమగును.

వాది యనుచున్నాఁడు—శరీరపాతానంతరమగును; కాని, శరీరపాతమువఱకు ఒక్కొక్కక్షణాని అనేకతాపముల ననుభవించినాఁడు; చూడుము—ఒకానొకగురువు సంసారతాపానుభవముచే వ్యాకులుఁడైయుండఁగా శిష్యుఁడు వచ్చి, ప్రార్థనాపూర్వకముగా అడుగుచున్నాఁడు—స్వామీ! బ్రహ్మసాక్షాత్కారమయినతరువాత జీవన్ముక్తవిద్వాంసులు ఏమిచేయుచున్నారు? గురువు పలుకుచున్నాఁడు—"నాద్యాపి కర్మవిచ్ఛిన్నమితి క్లిశ్యంతి సంతతమ్" ఇంతదుఃఖవిద్వాంసులు ఏకాగ్రాంతఃకరణముకొఱకు ప్రయత్నము చేయవలయును; అనఁగా—సంసారతాపనివృత్తమై, బ్రహ్మసుఖము ప్రకటమగును?

ఆర్యా! ఆవార్త ఘటిల్లదు—ప్రారబ్ధకర్మము ప్రతిబంధకముండువఱకు ఏప్రయత్నమును నడువదు; ఏకాగ్రాంతఃకరణమును గాదు; బ్రహ్మసుఖమును ప్రాప్తము కాదు; నీవుచెప్పినగురువుకూడ శ్లోకార్థమందు ప్రారబ్ధకర్మమందే తాపహేతుత చూపుచున్నాఁడు.

విద్వాంసులకు ప్రయత్నము చేయుటకు అవకాశమును లేదు; ఏలాగున ననఁగా—అజ్ఞానికి ప్రారబ్ధకర్మఫలోపభోగము చేయుటయందు ఒకభోగమైన తరువాత రెండవభోగమవుటకు మధ్యమందు ఏయవకాశము గలదో, దాని యందు ప్రయత్నము ఘటిల్లును; దానివలన ప్రారబ్ధప్రయత్నములు రెండును అజ్ఞానియందు సార్థకములగును; జ్ఞానియందట్లు ఘటిల్లదు; ఏలాగుననఁగా—జ్ఞానికి ప్రారబ్ధకర్మముచే ఒకభోగమయినతరువాత ప్రయత్నముగాకయే తత్కాలము బ్రహ్మాకారవృత్తి యగును; అది రెండవభోగము ప్రాప్తమగు వఱకు ఉండును; ఈప్రకారముగ జ్ఞానమైనతరువాత సకలాయుర్వ్యయమువఱకు వానికి క్షణమాత్రముకూడ ప్రయత్నముకొఱకు కాలము దొరకదు; ప్రయత్నముచే ప్రాప్తమైనట్టి బ్రహ్మసుఖము వానికి ప్రయత్నము లేక, సహజముగ ప్రాప్తమగును; ప్రారబ్ధభేదముచే ఒకనికి రెండుభోగములందు సంధి ఎక్కువగా దొరకును; ఒకనికి లేశమాత్రము దొరకును; గాని, బ్రహ్మసుఖముకొఱకు వానికి ప్రయత్నావశ్యకతయుం లేదు; చేయుటకొఱకు అవకాశమును లేదు.

వాది ఇట్లనును—విద్వాంసుఁడు అధికారిగాఁడనిన మనోనాశాది సాధనములకు అధికారి ఎవఁడు? జిజ్ఞాసువనుట ఘటిల్లదు; ఎందుకనఁగా—జీవన్ముక్తిగలవానికే జీవన్ముక్తిసుఖముకొఱకు ప్రయత్నము చెప్పవలసినది; జిజ్ఞాసువునకు జీవన్ముక్తియే ప్రాప్తముగాలేదు; వానికి ఎట్లు చెప్పవలయును? ఇంకొకనికిని ఎట్లు చెప్పవలయును?

అయ్యా! "మాతురిని కోపగించుట కోడలికి తెలియుటకొఱకు" అనునీ అత్తయొక్క లక్షణము లోకప్రసిద్ధము; తృతీయతరంగమునందు చెప్పంబడిన ఏబీసీడీ, వారియొక్క గురువులు, మొదలగు అజ్ఞానిపురుషులు తాము సజ్జ్ఞానులని ఎఱుఁగుచున్నారు; అట్లే ఎన్ని అదృఢజ్ఞానులు మేము సదృఢజ్ఞానులని ఎఱుఁగుచున్నారు; వారికొఱకు మనోనాశాదిసాధనములు చెప్పఁబడియున్నవి.

వాది ఇట్లనును—గ్రంథకారులచే వారియొక్క పేర్లు ఎందుకు చెప్పఁబడలేదు భయమా? జీవన్ముక్తుల పేర్లు మీఁద స్పష్టముగ చెప్పఁబడియున్నవి; నీవు

## 334. జ్ఞానికి వ్యవహారముయొక్క అనియమము

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము]

జ్ఞానవంతునకు సర్వానాత్మపదార్థములందు మిథ్యాబుద్ధి యగుటవలన వానియందు ప్రవృత్తి సంభవింపదు?

[ఉక్తానువాదమునకు సమాధానము]

జ్ఞానికి దేహమునందు మిథ్యాబుద్ధి కలిగినను, దేహమునకు అనుకూలమైన భిక్షాదికమునందు వానికి కేవలప్రారబ్ధమువలన

---

యుక్తిచే ఒక్కనియొక్క విషయము ఇంకొక్కనికి మార్చి, అతిప్రసంగము చేయుచున్నావేమొ?

జలపూరితకుంభము శిరముపై తీసికొని నడచుటయందు చలబలశబ్దము కాదు; కుంభమందు అపూర్ణజలముండఁగా చలబలమగుచున్నది; ఆప్రకారముగ అపూర్ణజ్ఞానముగలవానికి గర్వమగుచున్నది; ఆ యపూర్ణజ్ఞానులు, మీకు సదృఢజ్ఞానము లేదు; అందువలన మీరు ఈసాధనములు చేయవలయుననిన, వారికి కోపము వచ్చుచున్నది; అందువలన ఆత్మయొక్క లక్షణము సంగీకరించి, కృపాళుసర్వజ్ఞులైన గ్రంథకారులచేత పూర్ణజ్ఞానియొక్క పేర్లమీఁద చెప్పఁబడినవి.

లేక "మనోనాశాదిసాధనములు జిజ్ఞాసువులచే, అదృఢజ్ఞానులచే ఆదరణీయములుగా నున్నవి; ఇక్కలేల జీవన్ముక్తవిద్వాంసులచేఁగూడ ఆదరణీయములు" అనునీప్రకారముగ మనోనాశాదిసాధనములయొక్క ఆదరమందు అర్థవాదవచనముగ నున్నది; దానియందు విద్వాంసులు చేయవలయునని యభిప్రాయము లేదు,

ఈరీతిగానైనను సదృఢజ్ఞానులైన జీవన్ముక్తవిద్వాంసులకొఱకు చెప్పఁబడలేదు.

ప్రవృత్తియగును; అట్లు ఎవనికి అధికభోగహేతు ప్రారబ్ధ మగునో, ఆ జ్ఞానికి అధికప్రవృత్తియు నగును.

ఎట్లు ఐంద్రజాలికుని వినోదమును మిథ్యయనియెఱిఁగి, సకలలోకములకు ప్రవృత్తి యగునో, అట్లు సర్వపదార్థములందు జ్ఞానికి మిథ్యాబుద్ధియయినను వెనుక వానియందు ప్రవృత్తి సంభవించును.

[పూర్వపక్షియొక్క పూర్వభాషణమునకు అనువాదము.]

ఎవనికి ఏపదార్థమందు దోషదృష్టి యగునో, రాగము గాదో, వానికి దానియందు ప్రవృత్తి గానేరదు; జ్ఞానికో, అనాత్మపదార్థమందు దోషదృష్టి యగును, రాగముగాదు; కనుక ప్రవృత్తి సంభవింపదు.

[ఉక్తానువాదమునకు సమాధానము.]

అపథ్యసేవనమందు రోగి అన్వయవ్యతిరేకము ద్వార మున దోషనిశ్చయము చేసినను, అపథ్యసేవనమందు ప్రారబ్ధ బలము వలన ఎట్లు రోగికి ప్రవృత్తి యగునో, అట్లు ప్రారబ్ధ బలమువలన జ్ఞానికి సర్వవ్యవహారమందు దోషదృష్టి యుండి నను ప్రవృత్తి సంభవించును.

ఈరీతిగా జ్ఞాని వ్యవహారమునకు నియమము లేదు. ఈ పక్షము విద్యారణ్యస్వాములు తృప్తిదీపమందు విస్తరముగా ప్రతిపాదించియున్నారు. ఆప్రకారముగా తత్త్వదృష్టియొక్క వ్యవహారము నియమరహితముగా నున్నది; అందువలన సమాధి రూపమగు నియమవిధి విని, తత్త్వదృష్టి నవ్వుచున్నాఁడు.

### 335. తత్త్వదృష్టియొక్క దేశాద్యపేక్షా రహితమయినట్టి దేహపాతము.

ప్రారబ్ధభోగమునకుతరువాత జ్ఞానియొక్క ప్రాణము ఎక్కడను గమనముచేయదు; కనుక తత్త్వదృష్టియొక్క ప్రాణము లీనమాయె నని చెప్పఁబడినది.

జ్ఞానియొక్క శరీరత్యాగమందు కాలవిశేషముయొక్కయు, దేశవిశేషముయొక్కయు అపేక్ష లేదు; దేహపాతము ఉత్తరాయణమం దగుఁగాక, దక్షిణాయనమం దగుఁగాక, సర్వథా[1] ముక్తుఁడు. అట్లు కాశ్యాదిపవిత్రదేశమం దగుఁగాక, శ్వపచగృహాద్యపవిత్ర దేశమందగుఁగాకసర్వథాముక్తుఁడు.అట్లు ఆసనవిశేషముయొక్కయు అపేక్ష లేదు. వ్యవస్థితముగు సిద్ధాసనముచే నగుఁగాక, అవ్యవస్థితముగు ప్రేతాసనముచే నగుఁగాక సర్వథాముక్తుఁడు. అట్లు సావధానుఁడై, బ్రహ్మచింతనముచే నగుఁగాక, రోగవ్యాకులుఁడై, హాహాకారముచే నగుఁగాక సర్వథాముక్తుఁడు; ఏలయన—ఏకాలమందు జ్ఞానమువలన అజ్ఞానము నివృత్తమగునో, ఆకాలమందే జ్ఞాని ముక్తుఁడుగా నున్నాఁడు.

1. ఇచ్చట యీసాంప్రదాయికవచనము గలదు—

దేహః పతతు వా కాశ్యామ్ శ్వపచస్య గృహేఽథ వా.
జ్ఞానసంప్రాప్తిసమయే సర్వథా ముక్త ఏవ సః. 1

భావార్థము—దేహము కాశియందు పడనీ, లేక చండాలగృహమందు పడనీ దానివలన తాత్పర్యము లేదు; ఏలాగుస నసఁగా—జ్ఞానప్రాప్తిసమయమునందే బంధభ్రాంతియొక్క నివృత్తిచేత జ్ఞాని సర్వప్రకారముచే ముక్తుఁ డగును.

ఎట్లు జ్ఞానికి దేహపాతమందు దేశకాలాద్యపేక్ష లేదో, అట్లు జ్ఞానహేతువయిన శ్రవణాదిసాధనములకొఱకును, వివేకాదిసాధనములకొఱకును దేశకాలాద్యపేక్ష లేదు.

### 336. ఉపాసకునకు దేశకాలాద్యపేక్ష

ఉపాసకునకు దేశకాలాదికముయొక్క అపేక్ష గలదు; యద్యపి భీష్మాదులను జ్ఞానులని చెప్పుదురు; భీష్ముఁడు ఉత్తరాయణముగాక ప్రాణవియోగము చేయలేదు; తథాపి భీష్మాదులు అధికారిపురుషులు; గనుక ఉపాసకులకు ఉపదేశముకొఱకు వానిచేత కాలవిశేషముయొక్క అపేక్ష చేయఁబడినది.

వసిష్ఠభీష్మాదులు అధికారులుగా నున్నారు; అందువలన వారికి అనేకజన్మములయినవి; అధికారపురుషులప్రారబ్ధము ఒక కల్పమువఱకు అగును; కల్పాంతము లేక వారికి విదేహమోక్షము గాదు; కల్పమునకు లోపల ఇచ్ఛాబలమువలన నానాశరీరములగును; అట్లయినను, ఆత్మస్వరూపమందు వారికి జన్మమరణాది భ్రాంతిగాదు; కనుక వారు జీవన్ముక్తులు; ఆ యధికారిపురుషుల వ్యవహారముసంపూర్ణము జనుల ఉపదేశముకొఱకుఁగానున్నది; అన్యజ్ఞానులవ్యవహారమందు నియమము లేదు; ఈ యభిప్రాయమువలన తత్త్వదృష్టియొక్క దేహపాతమునందు దేశకాలాసనాదులు ఏమియు చెప్పలేదు.

### 337. అదృష్టదృష్టియొక్క దేశకాలాద్యపేక్షాసహితదేహపాతము.

జ్ఞానికి దేశకాలములయపేక్ష లేదు; వానికన్న వ్యత్యస్తముగా ఉపాసకుని ఎఱుఁగవలయును; కాశ్యాది పవిత్రదేశ

మునందు, ఉత్తరాయణాది కాలమునందు శరీరత్యాగము చేసి నప్పుడు, వానికి ఉపాసనాఫలమగును; జ్ఞానికి మరణసమయ మందు సావధానముగా జ్ఞేయబ్రహ్మముయొక్క స్మృత్యపేక్ష లేదు; ఉపాసకునకు మరణసమయమునందు సావధానముగా ధ్యేయదేవతల స్మృత్యపేక్ష గలదు.

పూర్వము ఏ ధ్యేయముయొక్క ధ్యానము చేసినాఁడో, ఆ ధ్యేయముయొక్కస్మృతి మరణసమయమం దయిన, ఉపాసన యొక్కఫలమగును; అట్లు ధ్యేయబ్రహ్మప్రాప్తిమార్గము పంచ మతరంగమునందు ఎట్లు చెప్పఁబడినదో, అట్లు దానియొక్క స్మృతి గావలయును; ఏల యన మార్గచింతనము ఉపాసన కంగముగా నున్నది.

జ్ఞానసాధనమగు శ్రవణాదికమునందు దేశ కాలాసనముల యపేక్ష లేదు; ధ్యానమునకు పవిత్రదేశము, శుభకాలము, సిద్ధాది కాసనము వీనియొక్క అపేక్ష గలదు; అందువలన అదృష్ట దృష్టికి గంగాతీరమందు నివాసము, మఱియు మరణసమయము నందు యోగశాస్త్రరీతిగా దేహపాతము చెప్పఁబడినది.

### 338. తర్కదృష్టియొక్క నిశ్చయము— విద్యాప్రస్థానములైన సర్వశాస్త్రములు బ్రహ్మజ్ఞానహేతువులు

తర్కదృష్టి యను మూఁడవశిష్యుఁడు గురువువలన ఉప దేశమును విని, విన్నయర్థమందు అన్యశాస్త్రముల విరోధమును దూరముచేయుటకొఱకు సర్వశాస్త్రాభిప్రాయమును విచారించి, ఇది నిశ్చయము చేసెను. సకలశాస్త్రములకుపరమ ప్రయోజనము మోక్షము, మోక్షమునకుసాధనము జ్ఞానము; ఆ జ్ఞానము అద్వై

యనిశ్చయరూపముగాని, భేదనిశ్చయరూపము గాదు; సకల శాస్త్రములు సాక్షాత్తుగా, లేక పరంపరగా బ్రహ్మజ్ఞానమునకు హేతువుగా నున్నవి.

యద్యపి సంస్కృతవైఖరీవాణికి అష్టాదశప్రస్థానములు గలవు; వీనియందు కొన్ని కర్మములను ప్రతిపాదించుచున్నవి; కొన్ని విషయసుఖోపాయములను ప్రతిపాదించుచున్నవి; కొన్ని బ్రహ్మోపాసన బోధించుచున్నవి; కొన్ని బ్రహ్మాభిన్నదేవతల యొక్కయుపాసన బోధించుచున్నవి; అట్లు జ్ఞాననిమిత్తములైన న్యాయసాంఖ్యాది శాస్త్రములు ఏవి గలవో అవియును భేదజ్ఞానమునే యథార్థజ్ఞానమని చెప్పుచున్నవి; అందువలన సర్వప్రస్థానములకు అద్వైతబ్రహ్మబోధకత ఘటిల్లదు; తథాపి సకల శాస్త్రములకర్తలు సర్వజ్ఞులుగా నున్నారు; కృపాళువులుగా నున్నారు; వీరిచేత చేయబడిన మూలసూత్రములో, వేదానుసారముగానే యున్నవి; అయిన, వానివ్యాఖ్యానకర్తలు భ్రాంతులై యున్నారు; వారు, మూలసూత్రకారుల అభిప్రాయముకన్న విలక్షణార్థమును చేసియున్నారు. ఇట్లు తర్కదృష్టి ఉత్తమసంస్కారమువలన నిశ్చయము చేయుచున్నాడు.

## 339. విద్యయొక్క అష్టాదశప్రస్థానములు[1]

నాలుగువేదములు, నాలుగుపవేదములు, ఆఱువేదాంగములు, ఒకపురాణము, ఒకన్యాయము, ఒకమీమాంస, ఒక

1. విద్యాంగమును ప్రస్థానమందురు; అష్టాదశప్రస్థానములు అగ్నిపురాణారంభమందు, అట్లు మధుసూదనస్వామికృత ప్రస్థానభేదమందు వ్రాయబడినవి. సకలప్రస్థానములందు శ్రేష్ఠప్రస్థానము వేదములు, వానియందలి సారము ఉపనిషత్తులు, వానియొక్క విభాగములు చెప్పుచున్నాము.

ధర్మశాస్త్రము ఈరీతిగా వైఖరీవాణీరూపమైన విద్యాభేదములు పదునెనిమిది గలవు; వానిని ప్రస్థానము లందురు.

---

ఋగ్వేదమందు ఇరువదొకటి, యజుర్వేదమందు నూటతొమ్మిది, సామవేదమందు వేయి, అథర్వణవేదమందు యాభై, శాఖలు కల్పింపఁబడినవి.

ఒకవృక్షమునందనేకశాఖలను కల్పించి, తనపుత్రులకు వాటిని విభాగించియిచ్చినట్లు వ్యాసభగవానులు వేదమును నాలుగుభాగములుగా కల్పించి, వానియందనేకశాఖలను ప్రతియొకశాఖకుఁదగిన విధులను ఏర్పఱచిరి.

ఎన్ని శాఖ లుండునో, అన్నియుపనిషత్తు లుండును. ఈసంగతి ముక్తికోపనిషత్తునందు, మహావాక్యరత్నావళియందు చెప్పఁబడినది. శాఖలు 1180 అందువలన ఉపనిషత్తులును 1180. వానిలో,

840 ఉపనిషత్తులు కర్మమును బోధించి, కర్మకాండ మని చెప్పఁబడుచున్నది; 232 ఉపనిషత్తులు ధ్యేయబ్రహ్మమును బోధించి, ఉపాసనాకాండ మని చెప్పఁబడుచున్నవి; 108 ఉపనిషత్తులు జ్ఞేయబ్రహ్మమును బోధించుచున్నవి; ఇవి వేదముయొక్క అంత్యభాగమగుటవలనను, వేదసారార్థము బోధించుటవలనను వేదాంత మనియు, జ్ఞానకాండ మనియు చెప్పఁబడుచున్నది.

ఉక్త జ్ఞానకాండములయిన నూటయెనిమిది ఉపనిషత్తులందు ఈశకేన కఠప్రశ్నముండక మాండూక్యతైత్తిరీయ ఐతరేయఛాందోగ్యబృహదారణ్యకములు ఈ దశోపనిషత్తులు ప్రధానము లయినవి; వీనిలో,

ఐతరేయము, ప్రశ్న ఇవిరెండు ఋగ్వేదమునకు చేరినవి; ఈశావాస్యము, బృహదారణ్యకము ఇవిరెండు శుక్లయజుర్వేదమునకు చేరినవి; కఠవల్లి, తిత్తిరము ఇవిరెండు కృష్ణయజుర్వేదమునకు చేరినవి; కేనము, ఛాందోగ్యము ఇవిరెండు సామవేదమునకు చేరినవి; ముండకము, మాండూక్యము ఇవి రెండు అథర్వణవేదమునకు చేరినవి.

## 340. నాలుగువేదములకు బ్రహ్మజ్ఞానమందు తాత్పర్యము

ఋగ్యజుస్సామాథర్వములు ఇవి నాలుగు వేదములుగా నున్నవి; వీనిలో కొన్ని వచనములు జ్ఞేయబ్రహ్మమును బోధించును; కొన్ని వచనములు ధ్యేయబ్రహ్మమును బోధించును; శేషించిన సర్వవచనములు కర్మమును బోధించుచున్నవి; కర్మ బోధక వేదవచనములకును అంతఃకరణశుద్ధివలన జ్ఞానమే ప్రయోజనము; ప్రవృత్తియందు ఏ వేదవచనమునకును అభిప్రాయము లేదు; దానికిని నిషిద్ధమై స్వాభావికమైన ప్రవృత్తినుండి నిరోధమందు అభిప్రాయము గలదు.

కాఁబట్టి, అభిచారాది కర్మప్రతిపాదకమైన అథర్వవేదమునకును నివృత్తియందే తాత్పర్యము గలదు; ఎవ్వఁడు ద్వేషముచే శత్రువును గొట్టుటకు ప్రవృత్తుఁడగునో, వాఁడు శిరశ్ఛేదాగ్నిదాహాములు మొదలైన ఉపాయములచే శత్రువును గొట్టఁగూడదు; ఇందుకొఱకు అభిచారకర్మమైన శ్యేనయాగాదికము అథర్వవేదమందు చెప్పఁబడుచున్నది. [శత్రువును గొట్టు నిమిత్తమైన కర్మమును అభిచారమందురు; అట్టిది శ్యేననామకయాగము].

ఆ శ్యేనయాగబోధక వేదవచనమునకు ఇది యభిప్రాయము గాదు. "శత్రుమరణము గోరువాఁడు శ్యేనయాగమందు ప్రవృత్తుఁడు గావలయును. [శ్యేనయాగద్వారమున శత్రువును గొట్టవలయును]" అయిన, శత్రువునుగొట్టుట ఎవనికి కోరికయో, వాఁడు శ్యేనయాగముకన్న భిన్నమైన శిరశ్ఛేదనాద్యుపాయము చేయఁగూడదు; ఈరీతిగా ద్వేషమువలన ప్రాప్తమైన

శిరశ్ఛేదనాద్యుపాయములనుండి నివృత్తి, శ్యేనయాగబోధక వచనము యొక్క అభిప్రాయముగాని, తత్ప్రవృత్తియందు అభిప్రాయము గాదు; ప్రవృత్తియో, ద్వేషమువలన ప్రాప్తముగానే యున్నది; ఏది యన్యమార్గమువలన ప్రాప్తమయినదో, దానియందు వేదవచనమునకు [1] అభిప్రాయము గానేరదు.

ఈవిధముగా సకలాథర్వవేదమునకు నివృత్తియందు తాత్పర్యము గలదు; కాఁతేయు మూఁడు వేదములందు కర్మబోధకవాక్యములకు అంతఃకరణశుద్ధిద్వారమున జ్ఞానమందుపయోగము స్పష్టముగానే కనఁబడుచున్నది.

---

1. పరిణీతఋతుమద్భార్యాసంగము చేయవలెను; యజ్ఞశేషమైన మాంసము భక్షణము చేయవలెను; సౌత్రామణియాగమందు సురాపానము చేయవలెను; మొదలయిన వేదవిధివచనములకు స్త్రీసంగాదులందు అభిప్రాయము లేదు; మరి యేమనఁగా—పరస్త్రీసంగము, లేక పరిణీతస్త్రీయొక్క సర్వదాసంగము, లేక మాంసమద్యములయొక్క సర్వదాసేవనము వానినుండి నివృత్తి చేయించుటయందు అభిప్రాయముగలదు; కనుక ఇవి వేదవాక్యములు పరిసంఖ్యావిధిరూపములుగా నున్నవి; అపూర్వవిధి నియమవిధిరూపములయినవి గావు.

అట్లు శ్యేనయాగబోధకమైన అథర్వవేదవచనమునకును ద్వేషమువలన ప్రాప్తమగు శత్రుసంహారప్రవృత్తినుండి నివృత్తియందు యభిప్రాయము గలదు; కనుక శ్యేనయాగబోధకవచనమును పరిసంఖ్యావిధిరూపమే.

అన్యమువలన ప్రాప్తమైన అర్థబాహుళ్యముయొక్క సంకోచనిమిత్తబోధకమైన వచనము పరిసంఖ్యారూప మనఁబడును; ధర్మాధర్మబోధకవచనము అపూర్వరూప మనఁబడును; నియమితార్థబోధకవచనము నియమరూప మనఁబడును; ఈవిధివచనముయొక్క సవిస్తరవర్ణనము వేదాంతపదార్థమంజూషా గ్రంథమునందు చేయఁబడినది.

## 341. నాలుగుపవేదములకు బ్రహ్మజ్ఞానమందు తాత్పర్యము

ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము ఈనాలుగు నుపవేదములు; వీనిలో—ఆయుర్వేదమునకు కర్తలు బ్రహ్మ, ప్రజాపతి, అశ్వినికుమారులు, ధన్వంతరి మొదలైనవారు; చరకవాగ్భటాదులచికిత్సాశాస్త్రము ఆయుర్వేదము; మఱియు వాత్స్యాయనకృత కామశాస్త్రమును ఆయుర్వేదాంతర్భూతముగా నున్నది; ఏలయన—కామశాస్త్రవిషయమైన వాజీకరణ స్తంభనాదులును చరకాదులు చెప్పియున్నారు; ఆ యాయుర్వేదమునకు వైరాగ్యమందు అభిప్రాయము గలదు; ఎట్లనఁగా—ఆయుర్వేదముఁరీతిగా రోగాదులు నివృత్తములైనను, మరల ఉత్పన్నములగును; కనుక లౌకికోపాయము తుచ్ఛము [ఈ తుచ్ఛబుద్ధి వైరాగ్యరూపముగ నున్నది]; మఱియు ఔషధదానాదికముచవలన పుణ్యమై, దానివలన అంతఃకరణశుద్ధిద్వారమున జ్ఞానమందును ఉపయోగము గలదు.

అట్లు విశ్వామిత్రకృత ధనుర్వేదమందు ఆయుధనిరూపణము చేయఁబడియున్నది; ఆయుధములు నాలుగువిధములు—

మొదటిది ముక్తము, రెండవది అముక్తము, మూఁడవది ముక్తాముక్తము, నాల్గవది యంత్రముక్తము వానిలో—

(1) హస్తముచే వేయఁదగిన చక్రాదికము ముక్త మనఁబడును.

(2) ఖడ్గాదికము అముక్త మనఁబడును.

(3) బల్లెము మొదలైనవి ముక్తాముక్త మనఁబడును.

(4) శరీరగోళకము యంత్రముక్త మనఁబడును.

వీనిలో ముక్తమును అస్త్రమందురు [కొన్నిచోట్ల మంత్రప్రయోగమును అస్త్ర మందురు]; అముక్తమును శస్త్ర మందురు.

ఈ నాలుగువిధములయిన ఆయుధములకు బ్రహ్మ, విష్ణు, పశుపతి, ప్రజాపతి, అగ్ని, వరుణుఁడు మొదలగువారు దేవతలని చెప్పఁబడియున్నది; వానికి వేలువేలుమంత్రములు చెప్పఁబడి యున్నవి; క్షత్త్రియకుమారులు, మఱియు తదనుసారులయిన బ్రాహ్మణాదులును అధికారులుగా చెప్పఁబడియున్నారు; పదాతి, రథారూఢుఁడు, అశ్వారూఢుఁడు, గజారూఢుఁడు అని అధి కారులందు నాలుగుభేదములు చెప్పఁబడియున్నవి; మఱియును యుద్ధమందు మంగళశకునములు చెప్పఁబడియున్నవి; ఇంత యర్థము ధనుర్వేదముయొక్క ప్రథమపాదమందు చెప్పఁబడినది. మఱియు ఆచార్యలక్షణము, ఆచార్యునిగూర్చినుండి శస్త్ర గ్రహణరీతి ద్వితీయపాదమునందు చెప్పఁబడియున్నది. మఱియు గురుసంప్రదాయమువలన ప్రాప్తమయిన శస్త్రములయభ్యా సము, మంత్రసిద్ధిదేవతాసిద్ధిప్రకారము తృతీయపాదమునందు చెప్పఁబడియున్నది. మఱియుసిద్ధమయిన మంత్రములప్రయో గము చతుర్థపాదమునందు చెప్పఁబడియున్నది. ఇంతయర్థము ధనుర్వేదమునందు చెప్పఁబడియున్నది.

ఆ యర్థము బ్రహ్మప్రజాపతులు మొదలగువారివలన విశ్వామిత్రునికి దొరకినది; వానిచేత ప్రకటమయినదిగాని, విశ్వా మిత్రునిచేత ధనుర్వేద ముత్పన్నము గా లేదు; దుష్టచోరాదుల నుండి ప్రజలను రక్షింపవలయు నను ధర్మము బోధించునది ధను

ర్వేదము; కనుక దానికిని అంతఃకరణశుద్ధిచే జ్ఞానముద్వారమున మోక్షంబునందు అభిప్రాయము.

అట్లు గాంధర్వవేదమును భరతుఁడు ప్రకటము చేసెను; దానియందు స్వరతాలమూర్ఛనాసహితమగు గీతనృత్తవాద్యములనిరూపణము సవిస్తరముగా చెప్పఁబడియున్నది; దేవతారాధనముద్వారమున నిర్వికల్పసమాధిసిద్ధి గాంధర్వవేదమునకు ప్రయోజనముగా చెప్పఁబడియున్నది; కావున దానికిని అంతఃకరణైకాగ్రతవలన జ్ఞానముద్వారమున మోక్షమే ప్రయోజనము.

అట్లు అర్థవేదమును నానాప్రకారములు గలదిగానున్నది—నీతిశాస్త్రము, అశ్వశాస్త్రము, శిల్పిశాస్త్రము, సూదశాస్త్రము మొదలుకొని ధనప్రాప్త్యుపాయబోధక మయినది అర్థవేద [1] మందురు. ధనప్రాప్తియొక్క సకలోపాయములందు నిపుణుఁడైనవానికిని భాగ్యోదయము లేక, ధనప్రాప్తి గానేరదు; కనుక అర్థవేదమునకును వైరాగ్యముద్వారమున మోక్షమందే తాత్పర్యము.

## 342. చతుర్వేదషడంగములయొక్క ప్రయోజనము

నాలుగువేదములకు ఆఱు అంగములు గలవు—మొదటిది శిక్ష, రెండవది కల్పము, మూఁడవది వ్యాకరణము, నాల్గవది నిరుక్తము, ఐదవది జ్యోతిషము, ఆఱవది ఛందస్సు. ఈ యాఱును వేదముల కుపయోగమగుటవలన నివి వేదాంగములు; వీనిలో—

1. దీనిని స్థాపత్యవేద మనియుం జందురు.

శిక్షకు కర్త పాణిని; వేదశబ్దములందు అక్షరములయొక్క స్థానజ్ఞానము, మఱియు నుదాత్తానుదాత్తస్వరితములు [1|2|3] వీనియొక్క జ్ఞానము శిక్షవలన కలుగును; వేదములవ్యాఖ్యాన రూపమైన అనేకవిధప్రాతిశాఖ్యగ్రంథములు ఏవి గలవో, అవి యును శిక్షకు అంతర్భూతములుగా నున్నవి.

అట్లు వేదబోధితమగు యజ్ఞ కర్మానుష్ఠానరీతి కల్పసూత్రము వలన ఎఱుఁగవలసినది; యజ్ఞముచేయించుచున్నట్టి బ్రాహ్మణుఁడు ఋత్విక్కనఁబడును; వీఁడు భిన్నభిన్నముగా చేయఁదగిన కర్మ ప్రకారమును బోధించునది కల్పసూత్రము; ఈ కల్పసూత్రము నకు కర్తలు కాత్యాయన ఆశ్వలాయనాదులగు మునులుగా నున్నారు; వేదోపయోగి యగుటవలన కల్పసూత్రము వేదాంగము.

అట్లు వ్యాకరణమువలన వేదశబ్దముల శుద్ధతయొక్క జ్ఞాన మగును; ఆ వ్యాకరణసూత్రరూపమైన అష్టాధ్యాయిని పాణిని చేసియున్నాఁడు; కాత్యాయనుఁడు, పతంజలి ఆ సూత్రములకు వ్యాఖ్యానరూపమైన వార్తికభాష్యములు చేసి యున్నారు; మఱియు నితరవ్యాకరణములును గలవు; వానిలో వేదశబ్దములవిచారము లేదు; కనుక వానికి పురాణాదులందు ఉపయోగము గలదు; వినను వేదమునకు ఉపయుక్తముగాదు; పాణినివ్యాకరణముచే వేదశబ్దములశుద్ధత తెలియుచున్నది; అందువలన నది వేదాంగము.

అట్లు యాస్కముని త్రయోదశాధ్యాయి నిరుక్తము చెప్పియున్నాఁడు; వానిలో వేదమంత్రములందు అప్రసిద్ధపద

---

1. ఉచ్చస్వరము. 2. నీచస్వరము. 3. సమానస్వరము.

ములయొక్క అర్థబోధనిమిత్తము నామనిరూపణము చేసి యున్నాఁడు; కనుక నిరుక్తమును వేదాంగము. సంజ్ఞాబోధక మైన పంచాధ్యాయరూప నిఘంటువును యాస్కముని చెప్పి యున్నాఁడు; అదియు నిరుక్తమున కంతర్భూతముగ నున్నది.

అట్లు ఆదిత్యగ్రహాదికృత జ్యోతిషమును వేదాంగమే; ఎలయనఁగా—వైదికకర్మారంభమందు కాలజ్ఞాన మావశ్యకము, ఆ కాలజ్ఞానము జ్యోతిషమువలన నగుచున్నది.

అట్లు పింగళముని సూత్రరూప మయిన అష్టాధ్యాయ ముల ఛందోనిరూపణము చేసియున్నాఁడు; దానివలన వైదిక గాయత్ర్యాది ఛందస్సులయొక్క జ్ఞాన మగును; గనుక అదియు వేదాంగము.

ఈయాఱు వేదాంగములలో వేదమునందు నిరుపయోగ మయిన యర్థముగూడ ప్రసంగానుసారము నిరూపింపఁబడి యున్నది; ప్రధానతవలన నిరూపింపఁబడలేదు; అందువలన వేద మున కేదిప్రయోజనమో, అదియే షడంగములకు ప్రయో జనము, వేఱే గాదు.

## 343. అష్టాదశపురాణములు, ఉపపురాణములు

బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా,
మార్కండేయం నారదీయ మాగ్నేయం చ భవిష్యకమ్.1
బ్రహ్మవైవర్తలైంగ్యే చ వారాహం స్కాందవామనే,
కౌర్మం మాత్స్యం గారుడం చ బ్రహ్మాండం చేతి నామతః.2

ఇవి పదునెనిమిది పురాణములు వ్యాసరచితములుగా నున్నవి; మఱియును కాళీపురాణాదులు అనేకములు గలవు;

అవన్నియు ఉపపురాణములు; కొన్నిచోట్ల ఉపపురాణములును పదునెనిమిదిగా చెప్పఁబడినవి; అయిన, ఆ నియమము లేదు; ఉపపురాణములు అనేకములు గలవు. భాగవతములు రెండు— మొదటిది వైష్ణవభాగవతము, రెండవది దేవీభాగవతము; రెండింటికిని సమానసంఖ్య అష్టాదశసహస్రగ్రంథము, రెంటికిని ద్వాదశస్కంధములు గలవు; అయిన, వీనిలో ఒకటి పురాణము, ఇంకొకటి ఉపపురాణము; వ్యాసకృతములగుటవలన రెండును ప్రమాణములు.

ఎట్లు పురాణములు వ్యాసుఁడు చేసియున్నాఁడో, ఎట్లు కొన్ని ఉపపురాణములును వ్యాసుఁడు చేసియున్నాఁడో, మఱియును అట్లే కొన్ని ఉపపురాణములు పరాశరాదులయిన సర్వజ్ఞమునులు చేసియున్నారు; గనుక ఉపపురాణములును ప్రమాణములు; ఉపనిషత్తుల యభిప్రాయ మేది గలదో, అదియే పురాణోపపురాణములదిగా నున్నది; ఇది ముందు ప్రతిపాదించుచున్నాము.

## 344. న్యాయవైశేషికసూత్రములఫలము

పంచాధ్యాయరూపమయిన న్యాయదర్శనము గౌతమముని చెప్పియున్నాఁడు; వానిలో యుక్తి ప్రధానముగా నున్నది; యుక్తిచింతనమువలన పురుషునకు తీవ్రబుద్ధియయినప్పుడు మననము చేయుటయందు సమర్థుఁ డగును; కనుక యుక్తిప్రధానమైన న్యాయసూత్రములకును మననముద్వారమున వేదాంతజన్యజ్ఞానమే ఫలముగా నున్నది. ఈ యర్థము న్యాయపారంగతులగు భట్టాచార్యులు వ్రాసియున్నారు.]

మఱియు కణాదుఁడనుముని దశాధ్యాయరూపమైన వైశేషిక దర్శనము చెప్పియున్నాఁడు; దీనికిని న్యాయమునం దంతర్భావము గలదు.

## 345. మీమాంసాసంకర్షణకాండములఫలము

మీమాంసలు రెండువిధములున్నవి—మొదటిది ధర్మమీమాంస[1]; రెండవది బ్రహ్మమీమాంస. ధర్మమీమాంస ద్వాదశాధ్యాయములు; జైమిని దానికికర్త; కర్మానుష్ఠానప్రకారము దానియందు ప్రతిపాదింపఁబడినది. కాఁబట్టి విధిపూర్వకకర్మమందు ప్రవృత్తి ధర్మమీమాంసకు ఫలము; కర్మముచే అంతఃకరణశుద్ధిద్వారమున జ్ఞానమును, దానివలనమోక్షమగుచున్నది.

ఆ ధర్మమీమాంస ద్వాదశాధ్యాయియందు పరస్పర భేదము గలదు; అది గహనముగా నున్నది. మఱియును సంకర్షణకాండము పంచాధ్యాయరూపమయినది జైమిని చేసినాఁడు; దానియందు ఉపాసన చెప్పఁబడినది; అదియు ధర్మమీమాంస యందు అంతర్భావముగా నున్నది.

అట్లు బ్రహ్మమీమాంసకు నాలుగు అధ్యాయములు గలవు; దానికి కర్తవ్యాసుఁడు; ప్రతిఅధ్యాయమునకు నాలుగు నాలుగు పాదములు గలవు; వానిలో—

(1) సకలోపనిషద్వాక్యములు బ్రహ్మమును ప్రతిపాదించుచున్నవి; అన్యమును గాదు; ఈయర్థము ప్రథమాధ్యాయమందు చెప్పఁబడినది.

---

1. దేనియందు ధర్మవిచారము గలదో, అది ధర్మమీమాంస; దేనియందు బ్రహ్మవిచారము గలదో, అది బ్రహ్మమీమాంస. ధర్మమీమాంసను పూర్వమీమాంస యని, బ్రహ్మమీమాంసను ఉత్తరమీమాంస యని చెప్పుదురు.

(2) ఉపనిషద్వాక్యములందు మందబుద్ధిపురుషునకు పరస్పరము విరోధము ప్రతీతమగును; తత్పరిహారసంగతి ద్వితీయాధ్యాయమందు చెప్పఁబడినది.

(3) జ్ఞానముయొక్కయు, ఉపాసనయొక్కయు సాధన విచారము తృతీయాధ్యాయమందు చెప్పఁబడినది.

(4) జ్ఞానోపాసనలయొక్క ఫలము చతుర్థాధ్యాయమందు చెప్పఁబడినది.

ఈ బ్రహ్మమీమాంసరూప శారీరకశాస్త్రమే సర్వశాస్త్రములందు ప్రధానము; ముముక్షువునకు ఈశాస్త్రమే ఉపాదేయము; తద్వ్యాఖ్యానరూపములయిన గ్రంథములు[1] నానాగానున్నవి. అందు శ్రీశంకరకృత[2] భాష్యరూపమయిన వ్యాఖ్యానమే ముముక్షువునకు శ్రోతవ్యము; తద్జ్ఞానమువలన మోక్షఫలము స్పష్టముగానే యున్నది.

---

1. శంకరాచార్య రామానుజమధ్వభాస్కరాచార్య విష్ణుస్వామివిజ్ఞానేంద్రభిక్షుప్రభృతులు మొదలగువారిచే చేయఁబడిన భాష్యరూపవ్యాఖ్యానములు.

2. ఇప్పట భాష్యశబ్దముచేత శ్రీవిద్యారణ్యమునీంద్రకృత 555 బ్రహ్మసూత్రములమీఁద శ్రీశంకరాచార్యులచేత మఱియు వారిశిష్యప్రశిష్యులచేత చేయఁబడిన భాష్యవ్యాఖ్యానములయొక్క గ్రహణము గలదు; ఇవి సకలవ్యాఖ్యానములు అద్వైతప్రతిపాదకములుగా నుండుటవలన వానియొక్క నామములుమాత్రము క్రిందవ్రాసినప్రకారముగ పంచదశీతృప్తిదీపమందు వ్రాయఁబడినవి.

ఈ శంకరాచార్యుఁడు బ్రహ్మసూత్రములమీఁద శారీరకభాష్యము గ్రంథసంఖ్య పదివేలు.

శ్రీపద్మపాదాచార్యుఁడు శారీరకభాష్యముమీఁద విజయాభిదండిని అగ్నిహ్యర్పణమై, విద్యమానముగ పంచపాదిక ఐదువేలుఐదునూరు.
శ్రీప్రకాశాత్మచరణుఁడు పంచపాదికమీఁద వివరణము పదినాలుగు వేలు.

ఒకానొకసన్న్యాసి వివరణముమీఁద సందీపనము ఇరువదిఐదు వేలు.
వాచస్పతిమిశ్రుఁడు శారీరకభాష్యముమీఁద భామతీనిబంధము పండ్రెండు వేలు.
గంగాధరస్వామి భామతీనిబంధముమీఁద కల్పతరువు పదునాలుగు వేలు.
అప్పయ్యదీక్షితుఁడు కల్పతరువుమీఁద పరిమళము ఇరువది వేలు.
ఒకానొకసన్న్యాసి శారీరకభాష్యముమీఁద బ్రహ్మవిద్యాభరణము ఇరువదియాఱు వేలు.
ఆనందగిరి శారీరకభాష్యముమీఁద ఆనందగిరీయము పదునెనిమిది వేలు.
రామాశ్రముఁడు శారీరకభాష్యముమీఁద రత్నప్రభ పదకొండు వేలు.
సర్వజ్ఞాత్మముని శారీరకభాష్యముమీఁద సంక్షేపశారీరకము రెండు వేలు ఐదునూరు.
మధుసూదనస్వామి సంక్షేపశారీరకముమీఁద టీక పదిహేడు వేలు.
రామాశ్రముఁడు సంక్షేపశారీరకముమీఁద టీక పండ్రెండు వేలు.
మధుసూదనస్వామి సూత్రభాష్యముమీఁద కల్పలత నాలుగు వేలు ఐదునూరు.
రామాశ్రముఁడు బ్రహ్మసూత్రముమీఁద రామాశ్రమి ఆఱు వేలు.
నారాయణభట్టుఁడు బ్రహ్మసూత్రముమీఁద సూత్రవృత్తి నాలుగు వేలు.
అప్పయ్యదీక్షితుఁడు బ్రహ్మసూత్రముమీఁద సూత్రవృత్తి రెండు వేలు.
శంకరానందుఁడు బ్రహ్మసూత్రముమీఁద సూత్రవృత్తి వేయిఐదు నూరు. ఇవిగాక అధికరణసూత్రములు 400.

## 346. స్మృత్యాదిగ్రంథములకు కర్తలు మఱియు ప్రయోజనము

మన్వత్రివిష్ణుహారీతా యాజ్ఞవల్క్యోశనోఽంగిరః,
శాతాతపో వసిష్ఠశ్చ కాత్యాయనబృహస్పతీ. 1
గౌతమశ్శంఖలిఖితౌ వ్యాసో దేవలనారదౌ,
శుక్రాపస్తంబసంవర్తాః దక్షశ్చ స్మృతి కారకాః. 2

ఇత్యాదులు సర్వజ్ఞులుగా నున్నారు; వారు వేదానుసారముగా స్మృతులను గ్రంథములను చేసియున్నారు; వానిని ధర్మశాస్త్ర మందురు; వానిలో వర్ణాశ్రమములయొక్క కాయికవాచికమానసిక ధర్మములు చెప్పఁబడియున్నవి; వానికిని అంతఃకరణశుద్ధివలన జ్ఞానముం, మోక్షమే ప్రయోజనముగా నున్నది; అట్లు వ్యాసుఁడు మహాభారతము, మఱియు వాల్మీకి రామాయణము చేసియున్నారు; వానికిని ధర్మశాస్త్రమందు అంతర్భావము గలదు.

మఱియు దేవతారాధనముకొఱకు మంత్రశాస్త్రము గలదు; దానికిని ధర్మశాస్త్రమం దంతర్భావము గలదు. అట్లు సాంఖ్యశాస్త్రము, యోగశాస్త్రము, వైష్ణవతంత్రము, శైవతంత్రము మొదలగునవి ధర్మశాస్త్రమునకు అంతర్భూతములు;

---

విద్యారణ్యస్వామి అధికరణసూత్రముమీఁద అధికరణసూత్రటీక నాలుగువేలు.

రఘునాథపండితుఁడు బ్రహ్మసూత్రముమీఁద శంకరపాదభూషణము ఇరువదివేలు.

వేలయన—వీనియందును [1] మానసధర్మములయొక్క నిరూపణము గలదు.

## 347. సాంఖ్యశాస్త్రముయొక్క ఫలము.

సాంఖ్యశాస్త్రము ఆఱుఅధ్యాయములు కపిలముని చేసినాఁడు; దానియొక్క ప్రథమాధ్యాయమందు విషయనిరూపణము, ద్వితీయాధ్యాయమందు మహత్తత్త్వాహంకారాదులయిన ప్రధానకార్యములు, తృతీయాధ్యాయమందు వైరాగ్యము, చతుర్థాధ్యాయమందు విరక్తులఆఖ్యాయిక, పంచమాధ్యాయమందు పరపక్షఖండనము, షష్ఠాధ్యాయమందు సకలార్థసంగ్రహము చెప్పఁబడియున్నది.

ప్రకృతిపురుషుని వివేకమువలన పురుషుని అసంగజ్ఞానము సాంఖ్యశాస్త్రమునకు ప్రయోజనము గలదు; దానికిని త్వంపదలక్ష్యార్థశోధనముద్వారమున మహావాక్యజన్య జ్ఞానముం దుపయోగమగుటవలన మోక్షమే ఫలము.

## 348. యోగశాస్త్రముయొక్క ఫలము, మఱియు శారీరకముతో అవిరోధము.

యోగశాస్త్రము నాలుగుపాదములు గలదిగా నున్నది; పతంజలి దానికర్త, ఆ పతంజలి శేషునియవతారముగా నున్నాఁడు; ఒకఋషి సంధ్యోపాసనము చేయుచుండఁగా వానియంజలియందు ప్రకటమయి, భూమిమీఁద పడెను; కనుక వానికి పతంజలి యని పేరు; దానిచేత శరీరముయొక్క రోగరూపమలము దూరముచేయుటకొఱకు చికిత్సాగ్రంథము చేయఁ

1. ఉపాసనారూపధర్మము.

బడియున్నది; మఱియు అశుద్ధశబ్దోచ్చారణరూపమయిన వాక్కులనివృత్త్యర్థము పాణినిసూత్రములకు భాష్యము చేయఁబడియున్నది.

అట్లు విక్షేపరూపాంతఃకరణమలనివృత్త్యర్థము వాఁడు యోగసూత్రములను చేసియున్నాఁడు; అచ్చట ప్రథమపాదమందుచిత్తనివృత్తినిరోధరూపమయినసమాధి, మఱియుతత్సాధనములయిన అభ్యాసవైరాగ్యాదులు చెప్పియున్నాఁడు; అట్లు విక్షిప్తచిత్తునకు యమనియమాదిసమాధిసాధనములయిన అష్టాంగములు ద్వితీయపాదమందు చెప్పియున్నాఁడు; తృతీయపాదమందు యోగముయొక్క విభూతి, చతుర్థపాదమందు యోగఫలమయినమోక్షము చెప్పియున్నాఁడు.

ఈరీతిగా యోగశాస్త్రమును జ్ఞానసాధననిదిధ్యాసనసంపాదనద్వారమున మోక్షమునకు హేతువుగా నున్నది.

శారీరకసూత్రమందుసాంఖ్యయోగఖండనము ఏదిచేయఁబడినదో, దానికి వీనివ్యాఖ్యానములో ఎచ్చట ఉపనిషత్తులతో విరోధము గలదో, ఆ భాగముమాత్రమే విషయము, మూలసూత్రము విషయముగాదు; "ఆత్మభేదో జగత్సత్యమీశోఽన్య ఇతి చేత్త్రయమ్, త్యజ్యతే తైస్తదా సాంఖ్యయోగవేదాంతపద్ధతిః" 1 పం. ద

న్యాయవైశేషికమతఖండనమును విరుద్ధవ్యాఖ్యానమాత్రవిషయకము, అన్యార్థవిషయకము గాదు.

## 349. పాంచరాత్రపాశుపతతంత్రముల ఫలము

నారదుఁడు పాంచరాత్రమనుతంత్రము చేసియున్నాఁడు; దానిలో వాసుదేవునియందు అంతఃకరణస్థాపనము చెప్ప

చున్నాఁడు; దానికిని అంతఃకరణస్థిరతాద్వారమున జ్ఞానమువలన మోక్షమేఫలము.సకలవైష్ణవగ్రంథములుపాంచరాత్రమందంత ర్భూతములుగాను, ఆ పాంచరాత్రము ధర్మశాస్త్రమున నంత ర్భూతముగాను ఉన్నది.

అట్లు పాశుపతతంత్రమందు పశుపతియొక్క ఆరాధ నము చెప్పఁబడియున్నది; దానికి కర్త పశుపతి, దానికిని అంతః కరణనిశ్చలతాద్వారమున జ్ఞానమువలన మోక్షఫలముగా నున్నది; మఱియు దానికి ధర్మశాస్త్రమందు అంతర్భావముగ నున్నది.

అట్లు గణేశదేవీ సూర్యోపాసనబోధకములైన గ్రంథ ములకును చిత్తనిశ్చలతాద్వారమున జ్ఞానమువలన మోక్షము ఫలముగా నున్నది; మఱియు వాని కన్నిటికిని ధర్మశాస్త్రమం దంతర్భావముగా నున్నది.

## 350. వామమార్గము

దేవ్యుపాసనాబోధకములయిన గ్రంథములందు రెండు సంప్రదాయములు గలవు—మొదటిది దక్షిణసంప్రదాయము, రెండవది ఉత్తరసంప్రదాయము; దానిని వామమార్గమందురు; వీనిలో దక్షిణసంప్రదాయమురీతిగా ఉపాసన ఏది చెప్పఁబడి నదో, అది ధర్మశాస్త్రమున నంతర్భూతముగా నున్నది; మఱియు వామమార్గము ధర్మశాస్త్రముతో విరుద్ధమగుటవలన అప్రమా ణముగాను ఉన్నది.

యద్యపి వామతంత్రమును శ్రీశివుఁడు చెప్పియు న్నాఁడు; తథాపి సకలవేదశాస్త్రములతో విరుద్ధమగుటవలన ప్రమాణముగాదు; ఎట్లు విష్ణువు బౌద్ధావతారమందు చెప్పిన

నాస్తిక గ్రంథము వేదవిరుద్ధమగుటవలన అప్రమాణమో, అట్లే శివకృతవామతంత్రమును అత్యంతవిరుద్ధమగుటవలన అప్రమాణముగా నున్నది.

ఆ మతమందు మదిరాదులయిన అత్యంతాశుద్ధపదార్థములయొక్క గ్రహణము చెప్పఁబడియున్నది; మఱియు లోకవంచనకొఱకు అత్యంతమలినపదార్థములకు ఉత్తమపదార్థముల పేళ్లు చెప్పఁబడియున్నవి—

మాంసమునకు పేరు శుద్ధము, మదిరకుపేరు తీర్థము, మదిరాపాత్రకుపేరు పద్మ, మద్యవిక్రయికిపేరు దీక్షితుఁడు, ఉల్లిగడ్డపేరు వ్యాసుఁడు, తెల్లగడ్డపేరు శుకదేవుఁడు; అట్లు వేశ్య, దాసి, చర్మకారిణి, చాండాలి వీరిపేళ్లు ప్రయాగి, కాశి అని చెప్పియున్నారు; మఱియు భైరవీచక్రమందుండు చండాలాదులకుపేళ్లు బ్రాహ్మణులని, అత్యంతవ్యభిచారిణి యోగిని యని, వ్యభిచారి యోగి యని చెప్పుచున్నారు; వారివ్యవహారము నిషిద్ధముగా నుండును.

పూజాసమయమందు అనేకదోషవత్స్త్రీలను ఉత్తమశక్తి యని యంగీకరింతురు; జాతిచాండాలిని, అత్యంతవ్యభిచారిణి, రజస్వలను దేవీబుద్ధిచేత పూజించుచున్నారు; దానియొక్క ఉచ్ఛిష్టమదిరను పానముచేయుదురు; అధికమదిరపానమువలన వమనముచేసిన, దానిని నేలమీఁద పడనియ్యరు; మఱేమనఁగా- ఆచార్యసహితముగా సకలభక్తజనులు చేతులుచాఁచి,పైపైననే భక్షించివేయుదురు; వమనమును భైరవి యందురు; మఱియు నీచస్థానములో జిహ్వతగిల్చి, మంత్రజపము చేయుదురు.

వారిమతప్రకారముగా దేవీపూజ నింద్యనింద్యములై యట్టి అనేకవిధములుగా నున్నది; వానియందు పంచదశి, షోడశి అని రెండుపూజలు ప్రధానములుగా నున్నవి; వానిలో పంచ దశీపూజయొక్క విధానము వినినచో, సామాన్యజనులకును అసహ్యమగుచున్నది; షోడశీపూజవిధానమువినిన, వామమార్గ జనులుదక్క వాంతిచేయనిమనుష్యుఁడు ప్రపంచమందు ఎవ్వఁ డును ఉండఁడు.

మదిర, మాంసము, మత్స్యము, ముద్ర, మైథునము ఈ పంచమకారములను భోగమోక్షములకొఱకు సేవించుచున్నారు; ఈమకారములను అప్రసిద్ధనామములతో వ్యవహరింతురు; ఇవి మొదలయిన వామతంత్రముయొక్క సకలవ్యవహారము ఈ లోకమునుండి, పరలోకమునుండి భ్రష్టునిచేయునదిగా నున్నది. కర్ణచ్ఛేది జోగి అవధూత గోసాయి సన్న్యాసి బ్రాహ్మణాదులు వామతంత్రమును సేవింతురు; అయినను, లోకనిందితము, వేద నిందితము అని యెఱిఁగి, గుప్తముగా నుంచియున్నారు.

ఎక్కువయేమి చెప్పుదును! వామతంత్రరీతిని విని, నీచ జనులకును రోమాంచము గలుగును; ఇట్లు సకలనింద్యమార్గము లందు వామమార్గము ప్రధానముగానున్నది! ఇట్టి అతినీచవ్యవ హారము వ్రాయుటకు యోగ్యము గాదు; దిగ్దర్శనమాత్రము చేసితిమి.

సారాంశము—వామతంత్రము అన్నివిధములను త్యా జ్యముగా నున్నది.

## 351. నాస్తికమతము

అట్లు నాస్తికమతమును త్యాజ్యముగానున్నది; నాస్తి కులు ఆఱువిధములు— మాధ్యమికుఁడు, యోగాచార్యుఁడు,

సౌత్రాంతికుఁడు, వైభాషికుఁడు, చార్వాకుఁడు, దిగంబరుఁడు ఈ షడ్విధనాస్తికులు వేదమును ప్రమాణముగా నంగీకరింపరు; వీరలకు పరస్పరము విలక్షణములయిన సిద్ధాంతములు గలవు—

(1) మాధ్యమికుఁడు శూన్యవాది.

(2) యోగాచారమతమందు సకలపదార్థములు విజ్ఞానమునకన్న భిన్నములుగావు, విజ్ఞానమే పరమతత్త్వము, ఆ విజ్ఞానము క్షణికము.

(3) సౌత్రాంతికమతమందు విజ్ఞానముయొక్క ఆకారము బాహ్యపదార్థజ్ఞానము లేక గాదు; కాఁబట్టి విజ్ఞానమువలన బాహ్యపదార్థములయొక్క అనుమానమగును; ఈరీతిగా బాహ్యపదార్థము అనుమానప్రమాణమునకు విషయము; ప్రత్యక్షము గాదు; స్థిరమును గాదు; మఱేమనఁగా—సకలపదార్థములు క్షణికములుగా నున్నవి.

(4) వైభాషికమతమందు బాహ్యపదార్థముఁ క్షణికమేమోయున్నది; అయిన, ప్రత్యక్షప్రమాణమునకు విషయము.

(5) చార్వాకమతమందు పదార్థము క్షణికముగాదు; అయిన, వానిమతమందు దేహమే ఆత్మ.

(6) దిగంబరమతమందు దేహము ఆత్మ గాదు; ఆత్మ, దేహముకన్న భిన్నముగా నున్నాఁడు; అయినను, దేహముయొక్క పరిమాణ మెంతో, అంతే ఆత్మయొక్క పరిమాణము.

ఈరీతిగా ఈమతములలో తమలోతమకు భేదము

లున్నవి; ఈ షడ్విధమతములు సర్వథా త్యాజ్యములగుటవలన వీనియొక్క ఉపపాదనము, ఖండనము విశేషముగా వ్రాయ లేదు.

పయిఁజెప్పిన నాలుగుమతములు సుగతునివి, యద్యపి ఆ సుగతుఁడు విష్ణ్వవతారముగా నున్నాఁడు; కనుక వానిమత ములు అంగీకరించుట యోగ్యము; తథాపి ఆ యవతారము విప్రలిప్సార్థమే అయినది; అందువలన విప్రలిప్సకొఱకు రచిత మయిన వానిమతములును త్యాజ్యములుగా నున్నవి.

### 352. సాహిత్యాదికములయొక్క తాత్పర్య పూర్వకమైన తర్కదృష్టిసారగ్రాహి నిశ్చయము

వామమార్గముయొక్కయు, నాస్తికమతముయొక్కయు గ్రంథములు సంస్కృతవాణీరూపముగా నుండినను, అవి వేద బాహ్యములగుటవలన వేదానుసారి విద్యాప్రస్థానములు పదు నెనిమిదని చెప్పఁబడినది.

మఱియును మమ్మటాదులచేత ఏ సాహిత్యగ్రంథములు [1]చేయఁబడియున్నవో, వానికిని కామశాస్త్రము దంతర్భా వము గలదు. అట్లు సకలకావ్యములకును కొన్నిటికి [2] కామ శాస్త్రమందు కొన్నిటికి [3] ధర్మశాస్త్రమందు అంతర్భావముగా నున్నది.

---

1. అలంకారగ్రంథములు.

2. నాయికాభేదరసభేదప్రతిపాదకమైన కావ్యగ్రంథములందు.

3. భగవచ్చరిత్రము వర్ణించు కావ్యగ్రంథములందు.

ఈరీతిగా అష్టాదశ విద్యలప్రస్థానములు, సకలములును బ్రహ్మజ్ఞానమువలన మోక్షమునకు హేతువులుగా నున్నవి; కొన్ని జ్ఞానమునకు [1] సాక్షాద్ధేతువులు, కొన్ని పరంపరగా హేతువులు; ఇట్లు తర్కదృష్టి సకలశాస్త్రములయొక్క అభిప్రాయనిశ్చయము చేసినాఁడు; యద్యపి ఉత్తరమీమాంసతక్కం దక్కినసకలశాస్త్రములు జిజ్ఞాసువునకు త్యాజ్యములుగా నున్నవి; ఈసంగతిశారీరకమందుసూత్రకారభాష్యకారులు ప్రతిపాదించియున్నారు; కావున అన్యశాస్త్రములును మోక్షోపయోగమనుట సంభవింపదు; తథాపి సారగ్రాహి [2] దృష్టిగా తర్కదృష్టిచేత ఈ సారనిశ్చయము చేయఁబడినది.

1. క్షుధాక్రాంతుని క్షుధను నివర్తించి, తృప్తిచేయుంటకు పక్వమగు అన్నమే సాక్షాత్సాధనము, వ్యవసాయము మొదలగునవి పరంపరాసాధనములుగా నున్నట్లు అజ్ఞానము నివర్తించి, ఆత్మానుభవతృప్తినిచ్చుటకు కొన్ని గ్రంథములు నామమును, ధ్యానమును, కర్మమును బోధించెను. అవి పరంపరాసాధనములుగా నున్నవి; మఱియుం కొన్నిగ్రంథములు జ్ఞానమును బోధించెడు. అవి సాక్షాత్సాధనములుగా నున్నవి.

2. ఒకానొక సారగ్రాహకపండితుని వచనము—

భక్తిర్జ్ఞానే యత్ర విష్ణోర్యత్ర వేదాః పరాప్రమా,
మతాని తాని సర్వాణి జీవోద్ధారస్య హేతవః. 1

భావార్థము—ఎవరిమతములందు వ్యాపకపరమాత్మయొక్క భక్తి, లేక జ్ఞానము గలదో, మఱియును ఎవరిమతములందు వేదము పరమప్రమాణముగలదో, అవన్నియుం సమ్మతములుంగా నున్నవి; అవి సాక్షాత్తుగా, లేక పరంపరగా జీవోద్ధారమునకు హేతువులుంగా నున్నవి.

**353. తర్కదృష్టికి అన్యవిద్వాంసులతో మేలనము**

గురుద్వారమున విన్న యర్థమందు బుద్ధిస్థిరతకొఱకు సకలశాస్త్రముల యభిప్రాయము విచారించినను, మరల సందేహము కలుగుచున్నది; అదేమనఁగా-శాస్త్రములయభిప్రాయము నేను నిశ్చయించితిని, అదేనా? కాదా? [తర్కదృష్టి కనిష్ఠాధికారియగుటవలన పలుమాఱు కుతర్కముచేత సందేహము పుట్టుచున్నది.] ఈ సందేహనివృత్తికొఱకు అన్యవిద్వాంసుల నిశ్చయముతో తననిశ్చయమును సరిచూచుటకు పోయెను.

విద్వజ్జనులదగ్గనముయినప్పుడు తర్కదృష్టిచేత సకలశాస్త్రములయొక్క ఏకవాక్యతారూపమయిన తనయభిప్రాయము నివేదింపఁబడియున్నది; అది విని సాధుజనులు సన్మానించి, పరమాహ్లాదయుక్తులై యనుచున్నారు—నాయనా! నీవు ఏ యభిప్రాయము ఎఱిఁగితివో, అది యథార్థముగా నున్నది; నీవు ధన్యుఁడు గా నున్నావు; నీవు సాక్షాత్పరబ్రహ్మముగా నున్నావు.

**354. జ్ఞానికి ఇచ్ఛాసంభవముయొక్కయు, అసంభవముయొక్కయు అభిప్రాయము**

జ్ఞానియొక్క సకలవ్యవహారము అజ్ఞానివ్యవహారమువలె ప్రారబ్ధాధీనముగా నున్నది; ప్రారబ్ధబలమువలన జ్ఞానికిని ఇచ్ఛ సంభవించును; అయిన, కొన్నిచోట్ల శాస్త్రమందు ఇట్లు వ్రాయఁబడియున్నది—"జ్ఞానికి ఇచ్ఛ కలుగదు" దానియందు జ్ఞానియొక్కఅంతఃకరణము పదార్థేచ్ఛారూపపరిణామమును పొందదను నభిప్రాయము లేదు; ఏలయన— అంతఃకరణమునకు ఇచ్ఛాదికము సహజధర్మముగా నున్నది; యద్యపి అంతఃకరణము భూతములసత్త్వగుణముయొక్క కార్యమని చెప్పఁబడియున్నది;

తథాపి రజోగుణతమోగుణ సహితమయిన సత్త్వగుణము యొక్క కార్యముగా నున్నది; కేవలసత్త్వగుణకార్యము గాదు; కేవలసత్త్వగుణకార్యమయినట్టయిన, చలస్వభావము అంతఃకరణమునకు కాఁగూడదుగదా! మనోరాజ్యకామక్రోధాదులయిన రాజసవృత్తులు, మఱియు మూఢతాది తామసవృత్తులు కాఁగూడదు గదా! అగుచునే యున్నవి; దానివలన నది కేవల సత్త్వగుణకార్యము గాదని సిద్ధమే.

అప్రధానరజోగుణతమోగుణసహితములు, ప్రధానసత్త్వగుణవంతములయిన భూతములవలనఅంతఃకరణము పుట్టుచున్నది; కావున అంతఃకరణమందు మూఁడుగుణములు గలవు; ఆమూఁడు గుణములు సర్వపురుషులయొక్క అంతఃకరణములందు సమానములు గావు, న్యూనాధికములుగా నున్నవి; కనుక గుణముల న్యూనాధికతవలన సర్వపురుషులకు పరస్పరము విలక్షణస్వభావమగుచున్నది; కాఁబట్టి ఎదివఱకు అంతఃకరణము గలదో, అదివఱకు రజోగుణపరిణామ మయిన ఇచ్ఛయొక్క అభావము ఘటిల్లదు.

ఇట్లుండఁగా జ్ఞానికి ఇచ్ఛయుఁగూట లేదని చెప్పుచున్నారు; కనుక దానియభిప్రాయము ఇట్లు ఎఱుఁగవలెను—అజ్ఞాని జ్ఞాను లిద్దఱికిని ఇచ్ఛయో, సమానము; అయిన, అజ్ఞాని ఇచ్ఛాదులను ఆత్మధర్మ మని తెలియును; జ్ఞాని, ఆత్మధర్మ మని తెలియఁడు; కామసంకల్పసందేహరాగద్వేషశ్రద్ధాభయలజ్జేచ్ఛాదులు అంతఃకరణపరిణామములగు అంతఃకరణముయొక్క ధర్మములని తెలిసికొనును.

ఈరీతిగా ఇచ్ఛాదులయినను, అవి జ్ఞాని ఆత్మధర్మము లని ఎఱుఁగఁడు; కాఁబట్టి జ్ఞానియందు ఇచ్ఛాఽభావము చెప్పి

యున్నారు; అట్లు మనోవాక్కాయములచేత వ్యవహారమును చేయునో, అంతయు జ్ఞానికి ఆత్మయందు ప్రతీతముగాదు; అయిన "సకలక్రియ మనోవాక్కాయములం దుండును, ఆత్మ అసంగుఁడు" అనునిది జ్ఞానియొక్క నిశ్చయము; ఈకారణము వలన శ్రుతియందు చెప్పఁబడినది—"జ్ఞానమునకనంతరము వర్తమానశరీరమందు చేసిన శుభాశుభకర్మములయొక్క, మఱియు వానిఫలమయిన పుణ్యపాపములయొక్క, సంబంధము జ్ఞానికి సంభవింపదు."

ఈరీతిగా ప్రారబ్ధబలమువలన అజ్ఞానికి వలె సకలవ్యవహారమును, తదిచ్ఛయు జ్ఞానికి సంభవించుచున్నది.

## 335. శుభసంతతిరాజప్రసంగము

శుభసంతతి యను రాజును విడిచి, ముగ్గురుకొడుకులు వెడలిపోయిరి; ఆ సంగతి పూర్వము చతుర్థతరంగమునందు చెప్పితిమి; ఇప్పుడు తండ్రియొక్క ప్రసంగము చెప్పుచున్నాము-

ముగ్గురుపుత్త్రులు ఇంటినుండి వెడలినపిమ్మట రాజునకు తీవ్రవైరాగ్యాభావమువలన తద్వియోగజన్యదుఃఖము బహుళముగా ఆయెను; అట్లు మందవైరాగ్యమగుటవలన విషయసుఖమును గానేరదు; పుత్త్రులు వెడలిపోవుటవలన [అధికారియభావమువలన] శూన్యమయిన రాజ్యమును విడువశక్యము గాదు; తీవ్రవైరాగ్యముండినయెడ, శూన్యరాజ్యము నేని విడిచిపోవుచుండెను; ఈరీతిగా రాజునకు సర్వప్రకారములను దుఃఖమాయెను.

మందవైరాగ్యము యొక్క ఫలము విషయోపభోగమందనాసక్తి, మఱియు ఉపాస్యమునందు జిజ్ఞాన అందురు; అట్టియవ

స్థను రాజు పొందెను; పిదప, ఉపాస్యదేవతలు అనేకములు శ్రవణమందు వచ్చుటవలన ఏదేవతను ఉపాసన చేయువల యును? ఉత్తముఁడయిన దేవుఁడెవఁడు? ఇది రాజునకు తెలియక యుండెను; కనుక రాజు, ఒకనాఁడు పండితజనులసభ చేసి, ఉపాస్య దేవతయొక్క నిర్ణయము చేయుటకొఱకు వారిని ప్రశ్న చేసెను.

### 356. రాజుయొక్క ప్రశ్న

ఎవఁడు నిద్రింపఁడో, ఎల్లప్పుడు మేలుకొనియుండునో, అట్టిదేవుఁ డెవ్వఁడు?

### 357. విష్ణూపాసకుల యుత్తరము

ఆ రాజుయొక్క ప్రశ్నవిని, ఆ సభాసదులనుండి ఒకవైష్ణ వుఁడు పురస్సరుఁడై, భాషణమునకు ఆరంభించెను—ఓ రాజా! ఉత్తమదేవుని చెప్పుచున్నాను; వినుము.

ఎవ్వఁడు శ్యామసుందరవిగ్రహుఁడు పీతాంబరధరుఁడయి హస్తములశంఖచక్రగదాపద్మముల ధరించియుండు, ఎవ్వనికంఠం బున వైజయంతీమాలయు, వక్షంబునఁ గౌస్తుభంబును, శ్రీవత్స లాంఛనంబును వెలుంగుచుండు, ఎవ్వని చరణనఖరంబునుండి త్రైలోక్యపావనియగు గంగ ప్రవహించు, ఎవ్వని చరణధూళిని శివవిరించిప్రముఖులగు సురవరులు నిరంతరము గోరుచుందురు; మఱియు నెవ్వఁడు భక్తవత్సలుఁ డెవ్వఁడు దీనదయాళుఁ డెవ్వఁ డనాథనాథుఁ డెవ్వఁడు సర్వజ్ఞ భక్తకార్యకల్పద్రుము వేదాంత వేద్యుఁడు, త్రిభువనవంద్యుఁడు అట్టి శ్రీవిష్ణు వొక్కఁడే.

శ్రీవిష్ణువు సకలదేవతలలో శ్రేష్ఠుఁడనుటను నృసింహ తాపనీయ గోపాలతాపనీయాద్యుపనిషత్తులు భారతభాగవత

రామాయణపద్మ పురాణాదులునిరూపించుచున్నవి; అద్దేవదేవుని స్తోత్రము చేయుచుచేయుచు, వేదములు నేతినేతి యని చెప్పు చున్నవి; మఱియును ఈయనంతుని మాహాత్మ్యమును బొగడుచుఁబొగడుచు సహస్రముఖుండగు శేషుఁడు తననాలుకలు ద్విగుణితంబులయినను, అంతము తెలియఁజాలకున్నాఁడు; అమ్మహాత్ముని చరిత్రములు గానముచేయుచు నారదతుంబురప్రభృతులుం కృతకృత్యులయిరి; ఇట్టిదేవుఁడు ఒకవిష్ణువే.

ఓరాజా! శ్రేష్ఠదేవుఁడగు విష్ణువు ఒకఁడె సకలసురవరసేవ్యుఁడు, వానితో సమానుఁ డెవ్వఁడు లేఁడు, యద్యపి శివుఁడు విష్ణుభక్తుఁడుగా నున్నాఁడు; కనుక వాఁడును శ్రేష్ఠుఁడు; తథాపి సేవ్యునియోగ్యత సేవకునకు రాదు; ఇదియునుగాక శివుఁడు అమంగళరూపమును ధరించి; డమరుగజచర్మాస్థినరకపాలాద్యమంగలపదార్థములను ధరించి, ప్రేతన్యాయమున శ్మశానమందు వర్తించుచున్నాఁడు; ఎద్దుమీఁద ఎక్కుచున్నాఁడు; కాఁబట్టి శివుఁడు సర్వథా త్యాజ్యుఁడుగా నున్నాఁడు.

మంచిది, వానిపుత్త్రుఁడు గజాననుఁడు, వాఁడయిననేమి! సాక్షాత్తు నరపశువు—ఏనుగువంటిముఖము, మూషికవాహనము; దేవియయిననో యేమి! కేవలము అశుచితయొక్కగని, ఎవ్వనికి అత్యంతదుర్గతిచ్ఛ గలదో, వాఁడు దేవ్యుపాసన చేయవలయును; సుజ్ఞుఁ డయినవాఁడు ఎప్పటికిని దానిమార్గమునకు పోఁడు; సూర్యుఁడయిననో యేమి! ప్రాతఃకాలమునుండి ఇంకొకప్రాతఃకాలమువఱకు తిరుగుచుండును; క్షణమాత్రవిశ్రాంతి లేదు; వానిభక్తుఁడయినప్పుడు వానివెంబడి పరుగెత్తిపోవలసి వచ్చును; వానికి విశ్రాంతి ఎక్కడ?

మంచిది, స్మార్తజనులు అయిదు దేవతలను సమానులని యెఱిఁగి, ఉపాసన చేయుచున్నారు; వారితో సమానులయిన మూఢులెవ్వరును లేరు; ఏలయన—అమంగళరూపులగు, అశుచిరూపులగు దేవతలను అత్యంతశుచి, ఉత్తమోత్తముండగు పరమాత్మునితో సమానులుగా నెఱుంగుట కేవలమూర్ఖలక్షణమే: శ్రేష్ఠునకు నీచునితో సామ్యము చెప్పుటకన్న వేఱొక పాపము లేదు.

## 358. శైవపండితుని యుత్తరము

వైష్ణవునిచేత శివుఁడు విష్ణుసేవకుఁడని చెప్పఁబడినది విని, ఆ సభలోఁ గూర్చున్నవారయిన శైవజనులకు పరమక్రోధమాయెను; అప్పుడు ఆ శివభక్తులలో ఒకపండితుఁడు పురస్సరుఁడై, భాషణమున కారంభించెను—

ఓరాజా! వినుము—ఓరీ! భక్తుఁడు ఏదేది గోరుచున్నాఁడో, శివుఁడు అదంతయు ఇచ్చుచున్నాఁడు; ఇట్లు శివసమాన దాత ఎవ్వఁడు చెప్పు? విష్ణువునకు ఇంతవైభవము ఎక్కడనుంచి వచ్చెను? హరికి ఏయైశ్వర్యము వైష్ణవునిచేత చెప్పఁబడినదో, ఆ సకలవైభవము శివునిచేత ఇయ్యఁబడినది శివుఁడు ఏలాగుననున్నాఁడు; చూఁడుము—హరివిరించాద్యులకు సకలవైభవము నొసంగి, తాను భస్మచర్చితుఁడై [1] కూర్చున్నాఁడు.

1. మహాదేవుఁడు ఆత్మారాముఁడగుటవలన సర్వపదార్థములందు సమబుద్ధి అనఁగా—సకలపదార్థములు మిథ్య యను బుద్ధిగలవాఁడు, లేక సకలపదార్థములు బ్రహ్మరూపమను బుద్ధిగలవాఁడు అందువలన ఆ సర్వేశ్వరుఁడు విరక్తుఁడగుట, చర్మకపాలాది నింద్యవస్తువులను ధరించుచున్నాఁడు. మహిమ్నస్తోత్రమందు పుష్పదంతాచార్యుఁడు చెప్పుచున్నాఁడు—ఓవరదుఁడా! ఇంద్రాది

ఎవ్వఁడేని ఇట్లనును—"భక్తులకు ఐశ్వర్యమిచ్చి, దరిద్రుఁడైనాఁడాయెను! దానివలన శివునైశ్వర్యము అంతవంతమని సిద్ధమయినది" ఓరీ! అట్లుగాదు; శివునైశ్వర్యమయిననో, అనంతము; అయిన, భస్మచర్చితుఁడైయుండుట ఎందుకనఁగా— జగద్గురువైన పరమేశ్వరుఁడు జనులకు ఉపదేశించుచున్నాఁడేమనఁగా—సకలైశ్వర్యము అనిత్యము, వైరాగ్యభాగ్యము వంటిది యేభాగ్యము లేదు.

ఇప్పుడు వైష్ణవుఁ డనుచున్నాఁడు—"శివుఁడు చర్మనరకపాలాద్యమంగలపదార్థములను ధరించెను" ఓరీ! దానియభిప్రాయము ఈమూఢుఁ డెఱుఁగఁడు. ఓరీ! శివుఁడో; సమబుద్ధి పరబ్రహ్మము; వాఁడు ఉత్తమాధమపదార్థముల విచారము చేయఁడు; సకలము సమానమై, యొకపరబ్రహ్మరూపమే యని ఎఱుఁగుచున్నాఁడు; బ్రహ్మాభిన్నమని పదార్థానుభవమే శివునికి ఘటిల్లదు; కనుక సకలవేదవంద్యుఁడైనవాఁడు ఒకశంకరుఁడే.

శివునియందు ఉచ్చనీచత్వానుభవము కించిన్మాత్రమును లేదు; సర్వులకు సమానుఁడై, సర్వులకు ముక్తియిచ్చుట శివుని

దేవతలు నీభ్రుకుటీరచితులం, ఈయీసమృద్ధులు ధరించుచున్నారు; నీయొద్దనో, కుటుంబోపకరణము [సాధనము] నందికేశ్వరుఁడు [ఒకఎద్దు] ఖట్వాంగము [ఒకకాష్ఠశస్త్రము] కుఠారము, గజచర్మము, భస్మము, సర్పములు; ఈహేతువులవలన తెలియనగును—స్వాత్మారామపురుషుని విషయరూపమృగజలము భ్రమింపఁజేయదు—

మహోక్షః ఖట్వాంగం పరశురజినం భస్మఫణినః,
కపాలం చేతీయత్తవ వరద తంత్రోపకరణమ్
సురాస్తాంతామృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం
న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి. 1

యొక్క ముఖ్యలక్షణము; ఓరీ! కాశీపురియందు ఏ ప్రాణులు చనిపోవుదురో, వారందఱకు అంతకాలమందు ఉపదేశము చేసి, సర్వులకు సమానము ముక్తి ఇచ్చుచున్నాఁడు; శివశివయని ఉచ్చారణము ఎవ్వనిముఖమందుఁ గలదో, వాఁడు మరల సంసారముఖమును చూడఁడు; "శివునిభజనము చేయువాఁడైన జీవుఁడు శివరూపుఁడుగా నున్నాఁడు" అను నీయర్థవాచకము శ్రుతివాక్యము గలదు.

ఓరాజా! విష్ణువుగాని, లేక అన్యదేవుఁడుగాని ఎవ్వఁడు తనయందు భక్తిచేయునో, వానికే వరమిచ్చును; సాశివుఁడు అట్లు గాదు; భక్తులుగాని, అభక్తులుగాని వారికందఱకు శివుఁడొకఁడే వరప్రదాత. ఓరీ! ఇతఁ డనుచున్నాఁడు—"శివుఁడు విష్ణుభక్తుఁడు" రామేశ్వరుని స్థాపన ఎవనిచేత చేయఁబడినదో, ఈమూర్ఖుఁ డెఱుఁగఁడు; ఏదేవుని శేషశాయియనుచున్నారో, వానిని జాగరూకుఁడని ఎవ్వఁడనవలయును? విష్ణువు ఇట్టి దేవుఁడుగా నున్నాఁడు; స్కాంద బ్రహ్మాండాది సకలపురాణములందు శివునియొక్క ఈశ్వరత ప్రతిపాదింపఁబడినది.

ఇతఁ డనుచున్నాఁడు—"మహాభారతమందు విష్ణుశ్రేష్ఠత చెప్పఁబడినది" ఈమూర్ఖుఁడు భారతతాత్పర్య మేమిఱుఁగును? విబుధుఁడైన అప్పయ్యదీక్షితునిచేత భారతతాత్పర్యము వ్రాయఁబడినది చూడుము—

భారతమం దీప్రసంగము గలదు—అశ్వత్థామ నారాయణాస్త్రమును, ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను; అప్పుడ అనేకసైన్యసంహార మాయెను; ఐనను, పంచపాండవు లందు ఎవ్వఁడును చావలేదు; అప్పుడు అశ్వత్థామ రథమును విడిచి,

ధనుర్వేదమును, ఆచార్యులను ధిక్కరించుచు; వనమునకు పోయెను; అచ్చట మార్గమందు వ్యాసభగవానుని దర్శన మాయెను; అప్పుడు వ్యాసభగవంతుఁడు ఇట్లనెను—ఓ బ్రాహ్మణుఁడా! నీవు ఆచార్యులను వేదమును ధిక్కరింపకుము. ఈ కృష్ణార్జునులు ఇద్దఱు నరనారాయణరూపులుగా నున్నారు; వీర లిద్దఱు శివపూజనము చాలచేసినారు; కనుక వీరిభక్తికధీనుఁడైన త్రిశూలిమహాదేవుఁడు వీరిరథము ముందర నుండును; వీరిద్దఱి మీఁదచేసిన శస్త్రాస్త్రాదిసర్వప్రయోగములను వాఁడే నశింపఁ జేయును; ఈభారతప్రసంగము చూచినట్టయిన, నారాయణ రూపుఁడైన కృష్ణునివిభూతి మహాదేవునికృపవలన పుట్టినదని సిద్ధమైనది; కాఁబట్టి విష్ణుచరిత్రప్రతిపాదకములైన గ్రంథములు అన్నియు శివాధిక్యమే ప్రతిపాదించుచున్నవి; వైష్ణవగ్రంథము లందు సేవ్యుఁడనిచెప్పఁబడిన యేవిష్ణువు గలఁడో; అతఁడు భారత ప్రసంగమువలన శివభక్తుఁడుగా నున్నాఁడు; అందువలన ఏశివునందు భక్తివలన విష్ణువు సేవ్యుఁడగునో, ఆశివుఁడే పరమ సేవ్యుఁడుగా నున్నాఁడు; ఈరీతిగా అప్పయ్యదీక్షితుఁడు [1] సకలవైష్ణవగ్రంథములకు ప్రతిపాద్యుఁడు శివుఁడని చెప్పి యున్నాఁడు.

మఱియును చూడుము-శంకరుని మహాదేవుఁడని, మహే శుఁడని, శివుఁడని చెప్పుదురు; ఇతరులను దేవులు, ఈశులందురు; కల్యాణమును శివమందురు; దానికన్న భిన్నమైనది అశివము; దానియర్థము ఇట్లు సిద్ధమైనది—శివునికన్న భిన్నులైన ఇతర దేవ

1. శివకాంచిలో ప్రసిద్ధపండితుఁడు, ఆయనచేత సిద్ధాంతలేశ సంగ్రహమను గ్రంథము చేయఁబడినది.

తలు అకల్యాణరూపులు; ఈ అకల్యాణరూపదేవతలను విడిచి, కల్యాణరూపశివుని ఉపాసన చేయవలయును; వైష్ణవుని సకల మతము నారదపాంచరాత్రముమీఁద నైనది; దానికి సూత్ర భాష్యమందు ఖండనము చేయఁబడినది; తదనుసారులైన అన్ని వైష్ణవమతములు కల్పతరువుయొక్క టీక యగు పరిమళ[1] గ్రంథమునందు ఖండింపఁబడియున్నవి.

సముద్రమథనప్రసంగమునందు సాగరమునుండి హాలాహాలనామధేయమగు విషయము వెలువడి, సర్వులను దహింప నారంభించినప్పుడు సమస్తసురాసురులు భయగ్రస్తులయిరి; ఆ కాలకూటవిషమును ఒక్కశివుఁడే ప్రాశనముచేసి, సకలసురాసురులకు అభయ మొసంగెను; ఇట్లు సమర్థుఁ డెవఁడున్నాఁడు; శివునివంటి సమర్థుఁ డెవ్వఁడును లేఁడు.

చూడుము—ఎవనికి నామసంకీర్తనమువలన విఘ్నజాలము యొక్క సమూలనాశ మగుచున్నదో, అట్టి యోగజాననుఁడు గలఁడో, వాఁడు శివుని సాక్షాత్ పుత్త్రుఁడుగా నున్నాఁడు; కార్యమందు కారణగుణము గలదు, కాఁబట్టి గణపతియందు విఘ్ననాశనసామర్థ్యము ఏది గలదో, అదన్నియు కారణరూపుఁ డయిన శివునిదై యున్నది; ఈలాగు సర్వథా సేవ్యుఁడు ఒకసదాశివుఁడుగా నున్నాఁడు; ఆ సదాశివుఁడు సమాధియందు సర్వదా జాగరూకుఁడుగా నున్నాఁడు; వాఁడు ఎప్పటికిని నిద్రపోఁడు.

### 359. గణపత్యుపాసకుని యుత్తరము

గణపతి శివునిపుత్త్రుఁ డనియు, కారణగుణము కార్య

1. శ్రీశంకరాచార్యకృత బ్రహ్మసూత్రభాష్యముమీఁద వాచస్పతి మిశ్రకృత భామతీనిబంధమనుటీక, దీనివ్యాఖ్యానము పేరు కల్పతరువు.

ముందు వచ్చిదనియు శైవునిభాషణము విని, ఆ సభనుండి క్రోధావిష్టుఁడయి, ఒకగణపతి భక్తుఁ డనుచున్నాఁడు—

ఔనౌను! గణపతి శివునిపుత్త్రుఁడు, ఎట్లు శ్రీరాముఁడు దశరథునిపుత్రుఁడో, అట్లు గణపతి శివునిపుత్త్రుఁడు; ఓరీ రాజా! చూడుము—ఎప్పుడు త్రిపురాసురునితో సంగ్రామము చేయుట కొఱకు శివసహితులయి సర్వదేవతలు పోయిరో, అప్పుడు దేవతలకు పరాభవమాయెను; అప్పుడు సకలదేవతలతోఁగూడ శివుఁడు గణపతిపూజనము చేసినాఁడు; పిమ్మట త్రిపురునితో సంగ్రామముచేసి, త్రిపురవధము చేసెను. గణపతి శివునిపుత్త్రుఁడైనయెడల పుత్త్రునిపూజ శివుఁడు చేసినాఁడాయేమి? చూడుము—ఎవని శుండాదండమునుండి హరిహరబ్రహ్మాదులగు సకలదేవతలు పుట్టిరో, వాఁడే శ్రీమద్విఘ్నరాజు మంగళమూర్తి శివుని పుత్త్రుఁడనుటయందు సిగ్గులేదేమి? అజన్ముఁడైన గజాననభగవంతుఁడు శివునిపుత్త్రుఁ డగునా?

ఓరాజా! ఆ గజాననభగవంతుఁడు ఏలాగున నున్నాఁడు! వాఁడు సకలవిద్యలకుదాత, వానితో సమానుఁడెవ్వఁడు? ఎవ్వఁడును లేఁడు. ఓరీ! సకలదేవతలయినను, శుభకార్యమునకు తృప్తులుగా నున్నారు; నా వరదమూర్తియగుగణపతి ఏలాగున నున్నాఁడు! ఓరీ! ఎవనిపూజనము చేయకుండిన, ఏదియు శుభకార్యముగాని, అశుభకార్యముగాని ఆరంభమగుటయే లేదో చింతనముచేయు పురుషునియొక్క విఘ్నపరిహారము చేయుటకొఱకు నావక్రతుండస్వామి మార్గప్రతీక్షచేయుచు జాగరూకుఁడై కూర్చున్నాఁడు; వానిసర్వజ్ఞత, పూజ్యత వ్యాసభగవానునిచేత గణేశపురాణమందు ప్రతిపాదింపఁబడియున్నది.

### 360. శక్త్యుపాసకుని యుత్తరము.

శక్తియొక్క హేతువు గణపతి యని విని, ఒకదేవ్యుపాసకుఁడు క్రోధనిర్భరుఁడై, యనుచున్నాఁడు—ఓ రాజా! ఒకశక్తి లేసిరొండ, సకలదేవతలు శక్తిహీనులయి, మృతసమానులయి యుందురని నీవెఱుఁగుము; ఓరీ! సకలదేవతలు శక్త్యుపాసకులుగా నున్నారు; కనుక వారియందు శక్తి గలదు; శక్తిహీనుఁడు అశక్తుఁడని లోకమందు ప్రసిద్ధమే; శక్తిలేకుండినపుడు దేవుని దేవుఁడని ఎవ రందురు?

ఓరీ రాజా! శక్తిస్వరూపవర్ణనము చేయుచున్నాము; వినుము. భగవతికి రెండురూపములు గలవు—మొదటిది సామాన్యము, రెండవది విశేషము. సర్వపదార్థములందు తమ తమ కార్యముచేయు సామర్థ్యము సామాన్యరూపము, మఱియు అష్టభుజాదిసహితమూర్తి విశేషరూపము. సామాన్యరూపశక్తికి అనంతాంశములు గలవు. ఎవనియందు శక్తియొక్క న్యూనాంశము గలదో, వానిని అల్పశక్తి, అసమర్థుఁడందురు; ఎవనియందధికాంశము గలదో, వానిని సమర్థుఁ డందురు.

విష్ణుశివాదులందు శక్తియొక్క అధికాంశముండుటవలన వారిని సమర్థులందురు; ఈరీతిగా భగవతియొక్క సామాన్యరూపాంశాధిక్యమువలనవిష్ణుశివగణేశసూర్యులయొక్క మహిమ ప్రసిద్ధముగానున్నది; శక్తిరహితమైనట్టయిన, ఎట్లు ప్రాణము లేక శరీరము అమంగళరూపమగునో, అట్లు సకలదేవతలు శక్తిరహితులై అమంగళరూపు లగుదురు; కాఁబట్టి ఏ శక్తియొక్క ఆధిక్యమువలన దేవతలమహిమ ప్రసిద్ధమో, ఆ మహిమ శక్తిదిగా నున్నది; దేవతలది గాదు; విష్ణుశివాదులు భగవతియొక్క

సామాన్యవిశేషరూపశక్తిని అధికముగానుపాసనచేసియున్నారు; కనుక వీరియందు శక్త్యంశము అధికముగా నున్నది.

ఎట్లు భగవతి నిరాకారరూపశక్తికి అనంతాంశములు గలవో, అట్లు సాకారరూపశక్తికిని అనంతాంశములు గలవు; ఈ సాకారాంశములందు కాళీరూపము ప్రధానముగా నున్నది; మాహేశ్వరి వైష్ణవీ సౌరీ గణేశ్యాదులును ప్రధానాంశములుగా నున్నవి; విష్ణువునకు భగవతియొక్క ఉపాసనవలన వైష్ణవీనామకమగు భగవత్యంశముయొక్క లాభమయినది; అట్లు అన్యదేవతలకును భగవతియొక్క యుపాసనవలన నిజనిజ మాహేశ్వర్యాదికాంశములయొక్క లాభమయినది.

ఏయే దేవునకు ఉపాసనచేత ఏయే భగవత్యంశము యొక్క లాభ మయినదో, ఆయా దేవునకు తదనుసారముగ విష్ణుమహేశ్వరసూర్యగణేశాది పేళ్లు ప్రాప్తములయినవి; భగవతియొక్క సకలభక్తులందు విష్ణుశివులిద్దఱు ప్రధానభక్తులుగా నున్నారు; ఏలయన—ధ్యాతకు ధ్యేయరూపప్రాప్తి ఉపాసనయొక్క పరమావధిగా నున్నది; విష్ణుశివులకు ఉపాసనవలన ధ్యేయరూపముయొక్క ప్రాప్తి అయినది; కావున నిద్దఱు ప్రధానోపాసకులుగా నున్నారు.

సురాసురులుగూడి, సముద్రమథనము చేసినప్రసంగమునందు అమృతము ప్రకటమైనప్పుడు సురాసురులవివాదము శాంతిచేయుటయందు విష్ణువు అసమర్థుఁడాయెను; అప్పుడు తన యుపాస్యరూపభగవతిని ఏకాగ్రబుద్ధిచే ధ్యానము చేసెను; ఆ ధ్యానమువలన విష్ణువు తానే ఉపాస్యరూపమును 1 పొందెను;

తరువాత ఆ మోహినిరూపమాహాత్మ్యమువలన సురాసురులు వానికనుకూలు లయిరి.

అట్లు శివుఁడు సమాధియందు భగవతీధ్యానము చేసెను; దానివలన శివుని అర్ధవిగ్రహము ఉపాస్యరూపమాయెను; ఏల యన—ఒకానొకపుడు విక్షేపమువలన సమాధియొక్క అభావమాయెను; కనుక విక్షేపము సమాధియొక్క విఘ్నమని చెప్పఁబడినది; విక్షేపము శంకరునకుఁ బీడ గలిగించెను; కావున శివునియొక్క సకలవిగ్రహము ఉపాస్యరూపము గాలేదు.

ఈరీతిగా సకలదేవతలు భగవతియొక్క ఉపాసకులుగా నున్నారు; ఆ భగవత్యుపాసన రెండువిధములుగా చెప్పఁబడినది- మొదటిది దక్షిణామ్నాయమువలన, రెండవది ఉత్తరామ్నాయమువలన; మొదలు దక్షిణామ్నాయము చెప్పఁబడినది; తరువాత ఉత్తరామ్నాయము చెప్పఁబడినది.

హరిహరు లెట్లు భగవతీభక్తులుగా నున్నారో, అట్లు మఱియెవరును లేరు; అట్లయినను, శ్రద్ధాభక్తిపూర్వకముగా ఎవఁడు మహామాయయొక్క ధ్యానము చేయునో, వాఁడు తత్కాలముగా పురుషార్థమును పొందును; ఏసాధనమువలన భోగమును; మోక్షమును ఒకేస్థానమందు ప్రాప్తమగునో, అట్టి సాధనము భగవతీభక్తియేగాని, జగత్తునందు మఱేదియు లేదు.

భగవతియొక్క భక్తియును అత్యంతసుఖకారకముగా నున్నది; దానిసమగ్రరీతి శివతంత్రమందు చెప్పఁబడినది; కనుక ముఖ్యజనులు పంచమకారములత్యాగము ఎప్పటికిని చేయరు; కృష్ణబలదేవులయినను, సర్వదా ప్రథమమందు నిమగ్నులయి యున్నారు; హరిహరగణేశసూర్యాదులగు సురవరులు ప్రథమ

మందే నిమగ్నులంఋ, భగవతీధ్యానము చేయుచున్నారు; మఱియును సకలసురనరులు పురాతనకాలమునుండి సకలమకార ములయొక్క సేవనము చేసియున్నారు; మకారాసాదరము సుజ్ఞ జనులు ఎప్పటికిని చేయరు.

శ్రీవ్యాసాచార్యులచేతను కాళీపురాణమందు భగవతీ మహిమ అనేక ప్రకారములుగా చెప్పఁబడియున్నది; మఱియు పూజావిధియును అనేకవిధములుగా చెప్పఁబడియున్నది; కృపా మూర్తి శ్రీశంకరునిచేనైననో, సకలజనోద్ధారముకొఱకు ఉత్త మోత్తమమైనయుత్తరసంప్రదాయము ఉపదేశింపఁబడియున్నది; దానియందు దృఢవిశ్వాసముంచి, పంచమకారములసేవనము చేయువాఁడైన పురుషుఁడంత భాగ్యవంతుఁడెవ్వఁడును లేఁడు.

## 361. సూర్యోపాసకుని యుత్తరము

భగవతీభక్తుఁడు సూర్యుఁడను వచనము విని, క్రోధమున సూర్యునివలె తపనుఁడై, ఒకసూర్యభక్తుఁడు భాషణమునారం భించెను.

ఓరీ రాజా! ఈ పాపియొక్క వచనము వినవలదు; ఓరీ! వీనిమతము అత్యంతనీచముగా నున్నది; ఎవ్వనికి సదైవ నరక వాసమునందు గర్భవాసమునందు అపేక్ష గలదో, వాఁడు వాని భాషణము ఆదరింపవలయును; మద్యమాంసాదులయిన సకలా పవిత్రపదార్థములును వీనిమతమందు ఉత్తమబుద్ధిచే అంగీకరింపఁ బడినవి; మఱియు వానికిపేళ్లు పవిత్రపదార్థవాచకము లయినట్లు ఉంచఁబడియున్నవి; ఈమతవర్ణనముచేసినప్పుడు వాణి దూషిత మగుచున్నది; ఇట్టిదే వీనియొక్క వామమార్గముగా నున్నది.

ఓరీ రాజా! నేను నిష్పక్షపాతముగా చెప్పుచున్నాను. దేవియుపాసనమందు దక్షిణసంప్రదాయము శాస్త్రసమ్మతముగా నున్నది; అట్లు వైష్ణవశైవాదులమతములను శాస్త్రసమ్మతములుగా నున్నవి; అయినను, ఓరీ రాజా! చూడుము—ఒక భానువు లేనియెడ, అందఱు నంధు లగుదురు.

సూర్యనారాయణునకు రెండురూపములుగలవు— మొదటిది నిరాకారప్రకాశము, రెండవది సాకారప్రకాశము. ఈ రెంటియందు నిరాకారప్రకాశము సకలసామరూపములందు వ్యాపకముగా నున్నది; దీనిని వేదాంతిజనులు భాతిశబ్దముచే వ్యవహరింతురు; ఆ నిరాకారప్రకాశరూపమైన సూర్యుని సామాన్యరూపము సకలజగత్తునకు అధిష్ఠానముగా నున్నది; తదజ్ఞానము వలన జగద్భ్రమమైన వివర్తము పుట్టినది; నిరాకారప్రకాశమే అంతఃకరణవృత్తియందు ప్రతిబింబమగు జ్ఞానముందురు; ఎప్పుడు "అహంభానుః" ఇట్టి అంతఃకరణవృత్తిప్రకాశ ప్రతిబింబమగునో, అప్పుడు అజ్ఞాననివృత్తియై, జగన్నివృత్తి యగును.

ఆ నిరాకార సాకారరూపములందు నిరాకారరూపము జ్ఞేయముగాను, సాకారరూపము ధ్యేయముగాను ఉన్నది; అవి వేదాంతమందు నిర్గుణసగుణభేదమువలన ద్వివిధబ్రహ్మమని చెప్పఁబడినది. ఆ ప్రభాకరుఁడు ఏలాగున నున్నాఁడు! వానియందు తమోలేశమును లేదు; ఆ దివాకరుఁడు త్రికాలమందు తిరుగుచున్నాఁడు; క్షణమాత్రమును విశ్రాంతి తీసికొనఁడు, వానియొక్క ధ్యానము చేయువానికి అజ్ఞానరూపతమోనివృత్తియై, వాఁడు దేహముండే జీవన్ముక్తుఁడగుచున్నాఁడు. ఓరీ రాజా!

ఇట్టి సూర్యనారాయణునిదప్ప ఇతర దేవత లుపాస్యులనుట సర్వము శుష్కవాద మని ఎఱుఁగుము.

## 362. ఉక్తపంచ మతములయొక్క అనువాదపూర్వకమైన స్మార్తమతము

ఎట్లు ఐదుగు రుపాసకులు పరస్పరవిరుద్ధవచనములు చెప్పిరో, అట్లు అనేకపండితులు నిజనిజబుద్ధ్యనుసారముగా విరుద్ధముగానే చెప్పుచున్నారు; ఎట్లు ఈ యైదుగురియొక్క విరుద్ధమతములు గలవో, అట్లు ఐదు దేవతలం దభేదబుద్ధి చేయువాఁడయిన స్మార్తునిమతమును వీనిఅన్నిటికంటె విరుద్ధముగానున్నది; ఏల యన—

వైష్ణవులదీమతము-విష్ణువుతో సమానుఁడయిన దేవుఁడు లేఁడు; సర్వులు విష్ణువునకు భక్తులు; అందువలన విష్ణువుయొక్క రామకృష్ణనారాయణాదినామములతో సమానమని అన్యదేవతల పేళ్లను ఎవ్వాఁడు ఎఱుఁగునో, వాఁడు [1] నామాపరాధి; వానికి

1. ఎవ్వనికి దశనామాపరాధములలో ఒకానొక అపరాధము గలుగునో, వాఁడు నామాపరాధి యనఁబడును; ఆ దశాపరాధములు—

సన్నిందాసతి నామవైభవకథా శ్రీశేశయోర్భేదధీః,
అశ్రద్ధా శ్రుతిశాస్త్రదేశికగిరాం నామ్న్యర్థవాదభ్రమః,
నామాస్తీతి నిషిద్ధవృత్తివిహితత్యాగౌ హి ధర్మాంతరైః
సామ్యం నామ్ని జపే శివస్య చ హరేర్నామాపరాధా దశ.

దీనియర్థము—1. సత్పురుషనింద 2. అసాధుపురుషులసన్నిధియందు నామమాహాత్మ్యవర్ణనము 3. విష్ణుశివులందు పరస్పర భేదబుద్ధి 4. 5. 6. శ్రుతిశాస్త్రగురువాక్యములందు అశ్రద్ధ 7. నామమందు అర్థవాదముయొక్క [మహిమస్తుతియొక్క] భ్రమ 8. అనేక పాపనాశకమయిన భగవన్నామము

రామకృష్ణాది నామోచ్చారణముయొక్క యథార్థఫలప్రాప్తి గానేరదు. అట్లు శైవమతమందు శివసమానుఁడయిన ఇతర దేవుఁడు లేఁడు; శివనామోచ్చారణఫలము విష్ణునామోచ్చారణమువలన గాదు.

ఈరీతిగా సర్వాలమతమందు తమతమ ఉపాస్యదేవతతో సమానుఁడు అన్యదేవుఁడు గాఁడు: స్మార్తమతమందో, సకలదేవతలు సమానులు; అందువలన వానిమతమును అయిదుగురితోను విరుద్ధముగా నున్నది.

### 363. షట్ఛాస్త్రముల యొక్క పరస్పరవిరుద్ధత

సాంఖ్యము, పాతంజలము, న్యాయము, వైశేషికము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస ఈయాఱు శాస్త్రముల మతములను పరస్పరవిరుద్ధములుగా నున్నవి; ఏలాగుననఁగా— సాంఖ్యశాస్త్రమందు ఈశ్వరుని యంగీకారము లేదు; యోగనిరపేక్షముగా [1] ప్రకృతిపురుషుల వివేకజ్ఞానమువలన మోక్ష మంగీకరింపఁబడినది; పాతంజలశాస్త్రమందు ఈశ్వరుని యంగీ

---

నాయొద్ద నున్నదని విశ్వాసముచేత నిషిద్ధకర్మాచరణము 9. మఱియు ఆ విశ్వాసముచేత విహితకర్మత్యాగము 10. అన్యధర్మములతో నామమునకు సామ్యముఁ దలఁచుట శివవిష్ణునామగ్రహణమందు ఈ దశవిధములగు అపరాధములు చెప్పఁబడినవి. ఈ విషయమందు ఒకఁడు మహాత్ముఁడు చెప్పుచున్నాఁడు—

రామ రామ సబ కోయి కహే దశరిత కహే న కోయ,
ఏక బార దశరితక కేతో కోటిజజ్ఞఫల హోయ. 1

1. యోగనిరపేక్ష మనఁగా సమాధియోగాపేక్షారహితమైనట్టి కేవల విచారముద్వారమున.

కారము గలదు; సమాధిచేత మోక్ష మంగీకరింపఁబడినది; ఇది పరస్పరవిరోధము గలదు.

న్యాయమతమందు నాలుగుప్రమాణములు, వైశేషిక మతమందు రెండుప్రమాణములు ఇది విరుద్ధముగా నున్నది; న్యాయవైశేషికములకు తమలో తమకు మఱియును విరోధము గలదు.

అట్లు పూర్వమీమాంసయందు ఈశ్వరుని యంగీకారము లేదు; కర్మజన్యవిషయసుఖమే పురుషార్థముగా నంగీకరింతురు; మఱియు ఉత్తరమీమాంసయందు ఈశ్వరునియొక్కయు, మోక్షముయొక్కయు నంగీకారము గలదు; విషయసుఖము పురుషార్థ మని అంగీకారము లేదు; ఇదియునుగాక ఉత్తరమీమాంసామతము ఈ గ్రంథమందు స్పష్టముగానే యున్నది; సర్వ శాస్త్రములమతములు దీనితో విరుద్ధములు—ఇతరశాస్త్రము లందు భేదవాదము గలదు; దీనిలో భేదముయొక్క ఖండనము, మఱియు అభేదముయొక్క ప్రతిపాదనము గలదు; ఇదిగాక ఇంకను అనేకవిధములుగ విలక్షణత గలదు.

ఈరీతిగా సకలశాస్త్రముల సిద్ధాంతములు పరస్పర విరుద్ధములుగా నున్నవి.

## 364. రాజుయొక్క సంశయాభివృద్ధి, మఱియు దీనత

ఉక్తప్రకారముగా నానాపండితులయొక్క నానావిధ భాషణమును వినవిన, రాజునకు అధికాధికము సంశయము పుట్టుచున్నది. ఏల యన—ఎవ్వఁడెవ్వఁడు ఏయేదేవుని స్తుతి చేయుచున్నాఁడో, వాఁడువాఁడు ఆయాదేవుని స్తుతియందు యుక్తిప్రయుక్తి ప్రమాణము దప్ప వేఱుమాట చెప్పఁడు.

వానిలో ఎవ్వనిభాషణమును సత్యమని ఎఱుఁగవలయును? ఎవ్వనిది మిథ్యయని తెలియఁగవలయును? ఈవిషయమందు రాజునకు ఏమియును తోఁచదు; రాజు మొదటినుండి చింతా దుఃఖములచేత గ్రస్తుఁడయి యున్నాఁడు; అదిగాక పండితజనుల యొక్క పరస్పరవిరుద్ధమైన భాషణము సంశయద్వారమున మఱియు నధికదుఃఖమునకు హేతువయినది.

ఆ దుఃఖరోగముచేత రాజు అత్యంతదీనుఁడై, ఏకాగ్రచిత్తముచే పరమాత్ముని ప్రార్థన చేయుచున్నాఁడు—ఓ ప్రభూ! సర్వదేవతలకు దేవుఁడయిన నీవెవఁడవు? నిన్ను నేను ఏమియు నెఱుఁగను; ఏలయన—నేను కేవలము అజ్ఞానిని పాపిష్ఠుఁడనై యున్నాను; నీవో, వేదశాస్త్రములకును అగమ్యుఁడవు; అట్టి నిన్ను అజ్ఞాని పాపిష్ఠుఁడైన నే నేమి ఎఱుఁగుదును?

అయినను, ఓ దేవాధిదేవుఁడా! నీవు కరుణాసాగరుఁడవు; నీవు పతితపావనుఁడవు; అనునీకీర్తి బుధజనులద్వారమున పలుమాఱు విని, నాకు నీవిషయమందు పెద్దఆశ పుట్టినది; ఏలాగున ననఁగా—నేను సంసారతాపముచే తప్తుఁడనై యున్నాను; నేను ఎంత దుఃఖిని, ఆ నాదుఃఖముయొక్క వర్ణనము చేయుటయందును నేను దుఃఖినై యున్నాను; అసమర్థుఁడనై యున్నాను; నీవో, సర్వజ్ఞుఁడవు, సకలాంతర్యామి వని వినుచున్నాను; కాఁబట్టి నాదుఃఖమును నీవు సర్వప్రకారముల నెఱుఁగుదువు.

ఇదియునుగాక, నాదుఃఖమును నీకు చెప్పుటకు నాకు సిగ్గు ప్రాప్తమగుచున్నది; ఏలయన—ఎపుడు సుఖపడుచుంటినో, అపుడు నీభజనముచేసి, సర్వసుఖములను నీచరణారవిందములను అర్పణము చేసియుండునేని, ఇపుడు దుఃఖము నివేదించుటకును

నాకు అధికారముండును; నేను పాపిని, సుఖప్రసంగమందు నీ స్మరణము చేయలేదు; ఇపుడు ఏముఖముచేత నీకు దుఃఖము చెప్పుకొందును; ఈప్రకారముగా నామనస్సు శంకించుచున్నది.

ఇప్పుడు ఎంత చెప్పుచున్నానో, అంతయును బుధజనుల కృపచేతనే, ఏలయన—సాధుజనులద్వారమున నేను ఇట్లు వినుచున్నాను—"నీవు సకలజగత్తుయొక్క తల్లివి తండ్రివిగా నున్నావు". ఎందువలన నీవు తల్లివితండ్రివో, అందువలన నా సకలాపరాధములను క్షమింతు వని నమ్ముచున్నాను.

ఓభగవంతుఁడా! ఈప్రసంగమందు అనేకతాపములచేత తప్తుఁడనై యున్నాను; వానియందును నేను ఏదేవుని భజనము చేయుదును? ఈవిషయమందు నాకుఁగల అత్యంతోత్కంఠా రూపమైన ఏతాపము గలదో, దానినుండియైనను నాకు విముక్తి చేయుము; ఓ మాయమ్మా! నేను నీగర్భకుహరమందుండి పాద తాడనము చేయుచున్నాను; దానిని నీవు క్షమింపుము; నేను నీయొక్క శిశువను, నీవు కృపచేత చూచుచుండుము; నీవుతల్లివి కృపచేయనియెడల, వేఱేయేదాదియును నన్ను చూచునది లేదు.

ఓసర్వేశ్వరా! నేను నిన్ను ఎవఁడని ఎఱుఁగవలయును? ఏమి నిన్ను విష్ణువని యెఱుఁగవలయునా? శివుఁడని యెఱుఁగ వలయునా? లేక గణపతి దేవి సూర్యుఁడని ఎఱుఁగవలయునా?

విష్ణు వని యెఱిఁగితినో, అప్పుడేమి శేషశయనుఁడై, బ్రహ్మ నాభికమలమందు లక్ష్మి చరణకమలమందు నుండఁగా— నారదతుంబుర్వాదులు సమ్ముఖమునందు సంగీతము చేయుచుఁ గొలువఁగా చెన్నొందుచున్న నీరూపమును ధ్యానము చేయు దునా? లేక వామదక్షిణభాగములందు శ్రీదేవిభూదేవివు లొప్ప.

శంఖచక్రాద్యాయుధవిరాజమానుఁడవు, శ్రీవత్సలాంఛనకౌస్తుభ వైజయంతీమాలాసహితుఁడైన నిన్ను ధ్యానము చేయుదునా? మత్స్యకూర్మాదిరూపములచేత ధ్యానము చేయుదునా?

శివుఁడని యెఱిఁగితినో, అపుడు భస్మోద్ధూళితుఁడై, గంగా భూషితుఁడై, త్రిశూలడమరుక గజచర్మవిరాజితుఁడయిన నిన్ను ధ్యానము చేయుదునా? లేక నందికేశ్వరారూఢుఁడవు, పురోభాగమందు పార్వతీ పార్షదగణసమవేతుఁడయిన నిన్ను ధ్యానము చేయుదునా? లేక సింహాసనారూఢుఁడవు, వామాంకమందు గౌరి, దక్షిణాంకమందు షణ్ముఖగజాననులు సేవింప ప్రమథగణపరివేష్టితుఁడవు, బాణరావణాది భక్తజనులు జయజయకారము చేయుచుండఁగా విష్ణువిరించ్యాద్యమరగణవందితుఁడయిన నిన్ను ధ్యానము చేయుదునా?

గణపతి యని యెఱిఁగితినో, అపుడేమి సింహారూఢుఁడయిన వినాయకరూపముచే ధ్యానము చేయుదునా! లేక మయూరారూఢుఁడయిన మయూరేశ్వరరూపమును ధ్యానము చేయుదునా? మూషకారూఢుఁ డయిన గజాననరూపముచే ధ్యానము చేయుదునా?

సూర్యుఁ డని యెఱిఁగితినో, అపు డేమి సామాన్యప్రకాశ రూపముచే ధ్యానము చేయుదునా? విశేషరూపప్రకాశరూపముచే ధ్యానము చేయుదునా? కేయూరమకరకుండలాలంకృత హిరణ్మయరూపముచే ధ్యానము చేయుదునా?

దేవి యని యెఱిఁగితినో, అపుడేమి సామాన్యశక్తిరూపముచే ధ్యానముచేయుదునా? విశేషశక్తిరూపముచే ధ్యానము

చేయుదునా? విశేషరూపముచే చేసినపుడు ఏమి? అష్టభుజ మూర్తి కాళీరూపముచే ధ్యానము చేయుదునా? లేక చండీ గౌరీలక్ష్మీరూపములచేత ధ్యానము చేయుదునా? లేక శివతంత్రా లంబనము చేసికొని, వామమార్గమునందు ప్రవృత్తి చేయుదునా?

ఓ దేవాధిదేవుఁడా! నేను అజ్ఞానరోగముచే అంధుఁడను, పాపరోగముచే కుంటివాఁడనయి కూర్చున్నాను; నాకు రోగార్యోగ్యములు లేమియు తెలియదు; నీయజనమందు ప్రవృత్తియు ఘటిల్లదు; ఓ పరమేశ్వరా! ఇపుడు నేనేమి చేయవలెను? ఓకరుణాసాగరుఁడా! నేను నీకు మనోభావముచే శరణాగతుఁడనయితిని, నాఅపరాధములదిక్కు చూడవలదు; ఓయిదీనబంధూ! నేను దీనుఁడుగా నున్నాను; అనాథనాథుఁడా! నన్ను కృపాదృష్టిచే చూడుము.

ఈ ప్రకారముగా రాజు తాను దేహాభిమానరహితుఁడయి, జ్ఞానాభిమానరహితుఁడయి, కేవలదీనుఁడయి, ప్రేమ నిర్భరుఁడయి, ఉచ్చగంభీరమైన కరుణస్వరముచే పరమేశ్వరుఁ బేర్కొని అఱచుచుండఁగా నేత్రద్వారమున ప్రేమాశ్రుధార కాఱుచుండఁగా రాజుయొక్కమనస్సు సకలవిషయములనుండి పరావృత్తమై, దేహాత్మత గలితమగుటవలన అంతర్ముఖవృత్తియై, క్షణమాత్రముగా తటస్థమాయెను.

అప్పుడు సకలాంతర్యామి కరుణాసాగరుఁడయిన పరమాత్మ దూరముగా నున్నాఁడా యేమి? లేఁడు, [1] హృద

1. "హాకహేంబఖియా బో లీకహేంగజరాజ" అనునీ హిందూస్థాని

యస్థుఁడుగానున్నాఁడు; నడుముమీఁద చేతులుంచి, నిష్కపట నిరహంకృతభక్తుని మార్గము చూచుచున్నాఁడు; భక్తకాము

---

భావలో ఒకసాధువు యొక్క వచనముగ నున్నది—బహుకాలమువఱకు నక్రునితో యుద్ధముచేసి, ప్రాణముల్యంతవ్యాకులములైనప్పుడు గజేంద్రుఁడు నిష్కపట దీర్ఘస్వరముతో పరమాత్ముని అఱచుచున్నాఁడు; విని, పరమాత్మ గజేంద్రోద్ధారముకొఱకు పోవుటవిషయమందు అత్యంతత్వర చేయుచున్నాఁడు; స్వామి గమనాత్యంతత్వరనుజూచి, శ్రీలక్ష్మీదేవి ఇంతత్వరచే ఎక్కడ పోవుట యని యడుగుటకు హస్తసంకేతము చేసినపుడు గజేంద్రోద్ధారముకొఱకు పోవుచున్నానని శ్రీదేవికి పలుకసారంభించెను; అపుడు "హా" అక్షరముయొక్క ఉచ్చారము వైకుంఠమునందు లక్ష్మీదేవియెదుట, మఱియు "రీ" అక్షరము యొక్క ఉచ్చారము గజేంద్రునెదుట కలుగుచున్నది [హిందుస్థానిమాటలో వినుగును హారీ యనుచున్నారు].

భక్తకామవిషయమందు పరమాత్మ ఎంతజాగరూకుఁడో, దానికి ఇది యొక ఉదాహరణముగ నున్నది; ఇట్టిఉదాహరణములు పురాణములందు పెండుగానున్నవి; పరమాత్మ భక్తకామకల్పద్రుమముఁడని నారదతుంబుర్వాది దేవర్షులచే గేయుఁడుగా నున్నాఁడు; పెక్కేల భక్తకామపూరణముదక్క ఈశ్వరునికి ఇంకొక్కపనియు లేదని కనఁబడుచున్నది.

కొందఱనుచున్నారు—అంతభక్తులు పూర్వకాలమందుండిరి; వారి విషయమందు పరమాత్ముఁడును జాగరూకుఁడుగా నుండెను; ఆ చరిత్రములు పురాణములందు వ్రాయఁబడియున్నవి, ఇపుడేమి! ఈకలికాలమందు అంతభక్తజనులును లేరు; పరమాత్మకూడ పండుకొనుచున్నాఁడు!

అట్లనఁగూడదు; కలికాలమందును అంతభక్తజనులు ఉన్నారు; పరమాత్మకూడ జాగరూకుఁడుగా నున్నాఁడు—భక్తవిజయము, భక్తలీలామృతము, సంతవిజయము, సంతలీలామృతము అని అధునికసాధుచరిత్రములు

పూరణముదప్ప వేఱొక్కపనియే వానికి లేదు; ఆ భక్తవత్సలుఁ

యొక్క పెద్దపెద్దగ్రంథములు మహారాష్ట్రభాషలో వ్రాయఁబడియున్నవి. దానివలన ఇపుడుగూడ సద్భక్తులు ఉన్నారు; పరమాత్మగూడ జాగరూకుఁడుగా నున్నాఁడని యెఱుఁగఁబడుచున్నది.

కొందఱనుచున్నారు—మేము, ఎన్నిసంవత్సరములనుంచి పరమాత్ముని గూర్చి నిష్కపటముగ అఱచుచున్నాము; ఒకసారికూడ పరమాత్మ మా యెదుటకు రాఁడు, ఒక కామముగూడ పూర్ణముచేయలేదు.

ఇది సిగ్గులేని భాషణముగ నున్నది; ఏలాగుననఁగా—"ప్రజ్వలితాగ్ని సమీపముగ కార్పాసరాశి యుండినను కాలనపుడు, అగ్నికార్పాసమధ్యమందు అగ్నిశక్తిప్రతిబంధకమగు ఒకానొకపదార్థము గలదని సహజముగా సిద్ధమగుచున్నది; పిదప ఆపదార్థము వ్యక్తముగానీ, అవ్యక్తముగానీ." రెండుచెవులుగల మనుష్యప్రాణి తనసమీపముగ నుండినపుడు ఒకసారిఅఱచినచాలు, తత్కాలముగ ఉత్తరము ఇచ్చుచున్నాఁడు—

"సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖం,
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి." 1

అంతపదార్థము సర్వేశ్వరుఁడు, ఎన్నిసంవత్సరములనుంచి నిష్కపటముగ అఱచుచున్నాననుట, సమీపమురాఁడనుట వీనియందు నేను నిష్కపటముగ అఱచుచున్నానని అర్థముండే కపటము సిద్ధమగుచున్నది.

గ్రంథకర్త ప్రతిజ్ఞాపూర్వకముగ పలుకుచున్నాఁడు—ఓ శ్రద్ధావంతుఁడా! నీవు నిష్కపటమైన మనస్సుచే ఒకసారి పరమాత్మను అఱువుము; తత్కాలముగ నీయెదుట ప్రకటుఁడగుచున్నాఁడు; ప్రకటముగానిపక్షమందు నాకు కావలసినంత శిక్ష చేయుము.

డము, కర్మరహితుఁడైన [1] పరమాత్మయొక్క కర్ణపుటమందు ప్రేమాతిశయముచే నిరహంకృతుఁడగు రాజుయొక్క కరుణ

---

1. శ్రుతియందు "అపాణిపాద" అను నీప్రకారముగ ఈశ్వరుని యొక్క వర్ణనము ఎచ్చట చేయఁబడినదో, అచ్చట పూర్వాపరము భక్తవాత్సల్యాది సగుణధర్మములం జెప్పి, ఆయీశ్వరుఁడు అపాణిపాదుఁడని చెప్పఁబడినది; బ్రహ్మస్తుతియందు బ్రహ్మనేత్రుఁడును ఈశ్వరవిషయమందు ఇదే యభిప్రాయము చూపుచున్నాఁడు; హస్తపాదరహితుఁడో, కర్ణము లేక వినుచున్నాఁడు; నేత్రము లేక చూచుచున్నాఁడు; పాదము లేక నడచుచున్నాఁడు; అనుట కలహామునకు హేతువుగాని, విశేషము లేదు; అందువలన నిచ్చట విశదార్థము చెప్పవలసినదే—

దీపప్రకాశముచేత నేత్రము ఘటపటాదిపదార్థములను చూచుచున్నది; నేత్రముచేత ప్రకాశరూపముగ నుండినను, దీపము ఏమియుంజూడక యూరకుండును; [నేత్రము లేక దీపమందు చూచుధర్మము గలుగదు]; అట్లు మాయలేనిపక్షమందు, బ్రహ్మమందు ఏధర్మము గలుగదు; "మాయినం తు మహేశ్వరమ్" ఈశ్వరస్థానమందు మాయ గలదు; ఎందు కనఁగా మాయావిశిష్టచైతన్యమునే ఈశ్వరుఁడనుచున్నారు; మాయయుండినపక్షమందు న్యూనత యేమి? అన్నిధర్మములును, అన్నికరణములును, శరీరమును, అవయవములును కావలసినపుడు సిద్ధములై యున్నవి; కనుక వినుటయనుధర్మమును కర్ణేంద్రియమును, చూచుటయనుధర్మమును నేత్రేంద్రియమును సిద్ధములే; ఇట్లుండఁగా అపాణిపాదాదిశ్రుతియందు లేవనిచెప్పుటకు అభిప్రాయమేమనఁగా—

ఈశ్వరునికి అహంబ్రహ్మాస్మియను జ్ఞానము అఖండముగ నుండుటవలన బ్రహ్మభిన్నమైన ఏపదార్థమును, తద్జ్ఞానమును లేవను స్మృతియున్నందున జగద్వ్యవహారములకు బాధితముగ నున్నవి; అవి ఈశ్వరునికి సాధకబాధకము గాదు; అందువలన శ్రుతియందు లేవని ప్రయోగమగుచున్నది.

స్వరము పడఁగానే దేవాధిదేవుఁడు తత్కాలముగానే తర్కదృష్టియొక్క బుద్ధియందు ప్రేరణ చేసెను—"నీవు పితృదర్శనమునకు పొమ్ము."

### 365. తర్కదృష్టికి రాజుతో మేలనము

రాజు మరల దేహస్మృతినొంది, కనువిచ్చిచూచినపుడు కనిష్ఠపుత్రుఁడైన తర్కదృష్టి సమ్ముఖమునందుఁ గనఁబడెను; తర్కదృష్టి తండ్రిచరణములమీఁద శిరముంచి, నమస్కారము చేసెను; తరువాత పితాపుత్రులచేత పరస్పరాలింగనము చేయఁబడినది; తర్వాత పరస్పరవియోగమైన యుపభోగించిన సుఖదుఃఖసంగతి ఒకరితోనొకరు చెప్పుకొనిరి; తరువాత స్నానభోజనాదివ్యవహారములైన వెనుక ఏకాంతస్థానమందుండఁగా తర్కదృష్టి తండ్రినడిగెను—నాయనా! నీముఖము ప్రసన్నముగాఁ గనఁబడదు; ఇంత చింతాతురుని చిహ్నము నీముఖముపైని నెందుకు కనఁబడుచున్నది? కృపచేసి, నాకు చెప్పుము; అపుడు రాజు చెప్పెను—బాలుఁడా; ఏమి చెప్పవలెను! నేను మొదలే అజ్ఞానముచేత అంధుఁడగుటవలన పరమాత్మవిషయమందు అనేక సంశయములు నాహృదయమందు నివసించుచున్నవి; వాని నివా

ఉపాసనాప్రకరణమందు ఈశ్వరధర్మములచింతనము చెప్పఁబడినది! అచ్చటను ఒకానొకప్పుడు అన్నికరణములు లేవనుట, ఒకానొకప్పుడు అన్ని గలవనుట దానియందు ఎచ్చటను విరోధములేదు; దూషణమును లేదు; సర్వత్ర అవిరోధముగానే యున్నది; భూషణముగానే యున్నది.

[కర్ణములేక వినుచున్నాఁడు; నేత్రములేక చూచుచున్నాఁడు; పాదములేక నడుచుచున్నాఁడు; మొదలగు ప్రయోగములు ఉపనిషత్తులందును, పురాణములందును అనేకస్థానములందు వ్రాయఁబడియున్నవి].

కరణముకొఱకు పెద్దపెద్దపండితజనుల సభచేసి, వారిని ఏ దేవుఁడు ధ్యేయుఁడని యడిగినప్పుడు అనేకపండితులు అనేక దేవతలనామములుచెప్పి, అనేకయుక్తిప్రమాణములచేత తమ తమదేవుని ప్రాధత వర్ణించిరి; అన్యదేవుని న్యూనతను నిరూపించిరి; దానివలన నామనస్సు పూర్వముకన్న అధికముగా[1] సంశయగ్రస్తమయి యున్నది; ఏమిచేయవలయునో ఏదేవుని భజనము చేయవలయునో నాకేమియుఁ దోఁచకున్నది.

ఆజన్మము నేను దేవుని భజనము చేయలేదు; సమస్త పాపాచరణము మాత్రము చేసితిని; ఇపుడు వార్ధక్యము ప్రాప్తమైనది; ఈనరదేహము ఉండులోపల నేను దేవుని ఆరాధనము చేయకపోవుదునేని, నాకు అనేకనరకవాసము, శ్వానసూకరమార్జారాదులజన్మములు ప్రాప్తములగును; ఇది నేను నిశ్చయముగా నెఱుఁగుదును; ఇపుడు నేను ఏమిచేయవలెను? ఎట్లుచేయవలెను? ఈచింత సార్వకాలము నాకుఁగలిగియున్నది; ఇట్లుచెప్పి, రాజు దుఃఖముచేత దీనుఁడాయెను. అపుడు తండ్రియొక్క దీనావస్థనుజూచి, తర్కదృష్టి పలుకనారంభించెను.

---

1. ఒకకూలిది, ముంగిట పిల్లి చచ్చుపడియుండఁగా ఆ పిల్లిని అది దేవాళిద్వారము తెఱచి పెట్టి, ఊరిపెలుపట పాఱవైచెను; అప్పుడు అచ్చట ఒకరోగిష్ఠమైనఒంటె చావఁబోవుచు మూల్గుచువచ్చి, దానియింటివాకిట ప్రాణమును విడిచెను; దీనివలన ఆ కూలిదానికి చాలచింత కలిగెను; అట్లు [illegible] రాజును ఉపాస్యదేవుని అజ్ఞానమును దూరము చేయుటకొఱకు పండితులనుగుఱించి ప్రశ్నచేసెను; దీనిచే చిత్తసంశయము పుట్టి, తన్నివారణమునకు వానికి చాలచింత ఆయెను.

నాయనా! నీవు ఏమియు చింతచేయవలదు; ఈ పండిత జనులభాషణమును అసత్యమని యెఱుఁగవలదు; పండితజనులు ఏమేమి చెప్పుచున్నారో, ఆయాసకలభాషణములును యథార్థములుగా నున్నవి; అయిన, తద్రహస్యమును వారెఱుఁగరు; కావున పరస్పరము కలహము చేయుచున్నారు; విచారదృష్టిగా చూచినట్లయిన, విరోధ మేమియు నుండదు; చూడుము:

### 366. పురాణమున అన్యనిందకు తాత్పర్యము స్తుత్యస్తుతియందు

సకలపురాణములకుకర్త ఒకవ్యాసుఁడు, అతడు స్కాంద పురాణమందు శివునకు స్వాతంత్ర్యాదులయిన ఈశ్వరధర్మములు చెప్పియున్నాఁడు, ఇతరదేవతలను శివకృపవలన సకలవిభూతి లాభము చెప్పి, జీవులవలె చూపుచున్నాఁడు; అట్లే విష్ణుపురాణమందు, పద్మపురాణమందు విష్ణువునకు ఈశ్వరత చెప్పియున్నాఁడు; అట్లు సూర్యగణేశదేవులకును కొందఱికి పురాణమందు, కొందఱికి ఉపపురాణమందు ఈశ్వరత చెప్పియున్నాఁడు; ఈరీతిగా వ్యాసవాక్యములందుపరస్పరవిరోధము ప్రతీతమగుచున్నది!

దానికి సమాధానము—సకలదేవతలు [1] ఈశ్వరరూపులుగా నున్నారు; ఏ ప్రకరణమందు అన్యదేవతలనింద గలదో, అచ్చట వారినింద చేయుటకుతదుపాసనాత్యాగమందు వ్యాసుల యభిప్రాయము లేదు; మఱేమనఁగా—ఆయా దేవుని ఉపాసన చేయుట యందు అభిప్రాయము గలదు; ఎట్లు విష్ణుపురాణమందు చేయఁబడిన శివాదులనింద, మఱియు విష్ణుస్తుతి విష్ణూపాసనయందు ప్రవృత్తిహేతువుగా నున్నదో, అట్లు శివపురాణ

1. విష్ణుశివాదులు ఐదు దేవతలు.

మున మవును. దేవయానమార్గమో ఒక బ్రహ్మలోకమునకుగలదు. కనుక విదేహమోక్షమునకు యోగ్యులయిన యుపాసకులు సర్వులు బ్రహ్మలోకమునకే పోవుదురు. ఆ బ్రహ్మలోకమందు ఇట్టి యద్భుతమహిమ గలదు—ఉపాసకుని ఇచ్ఛానుసారము సకలసామగ్రీసహితముగా ఆ బ్రహ్మలోకము వానికి ప్రతీత మగును. ఈరీతిగా పంచదేవతోపాసకులకును సమానఫలమగుచున్నది.

## 368. ఒకపరమాత్మయందు నానానామరూపములు సంభవించును.

ఉక్తసంగతియందీశంక యగును—పంచదేవతలనామరూపములు భిన్నభిన్నములుగా చెప్పఁబడినవి, ఈశ్వరుఁడొకఁడు, వానికి నానానామరూపములు సంభవింపవు. దాని కిది సమాధానము—పరమార్థముగానో, ఏ నామరూపమును పరమాత్మయందు లేదు; మందబుద్ధికి ఉపాసనకొఱకు నామరూపరహితుఁ డయిన పరమాత్మకు మాయాకల్పితముగా నానానామరూపములు చెప్పఁబడినవి; కాఁబట్టి ఒకపరమాత్మయందు కల్పితములయిన నానానామరూపములు సంభవించుచున్నవి; ఈరీతిగా సకలపురాణవాక్యములయొక్క విరోధము దూరమగుచున్నది.

---

(3) పలుమారు జన్మమృత్యుకారణమయిన మృత్యులోకమునకు పోయినట్టి మార్గము, జన్మమరణమార్గము.

ఈమూఁడు సంసారముయొక్క మార్గములు; మఱియు నాలుగవదయిన బ్రహ్మజ్ఞానరూపమార్గము ఏది గలదో, అది ఒకటే మోక్షమార్గము.

## 369. సకలపురాణములతాత్పర్యము కారణబ్రహ్మమం దుపాదేయత; కార్యబ్రహ్మమందు హేయత

పురాణవాక్యములందు విరోధశంకయొక్క ముఖ్యసమాధానము ఇట్లున్నది—విష్ణువు, శివుఁడు, గణేశుఁడు, దేవి, సూర్యుఁడు వీరి ఒక్కొక్కరికి ఎన్ని నామములు గలవో, అవన్నియు కారణబ్రహ్మముయొక్క నామములుగాను, కార్యబ్రహ్మముయొక్కయు నామములుగాను ఉన్నవి. ఎట్లనఁగా— మాయావిశిష్టకారణ బ్రహ్మమును పరబ్రహ్మ మందురు; ప్రసంగానుసారముగా మాయాకార్యవిశిష్టబ్రహ్మమును పరబ్రహ్మ మందురు.

ఈరీతిగా కారణబ్రహ్మమును విష్ణుశివగణేశదేవీసూర్య పదములు బోధించుచున్నవి; కార్యబ్రహ్మమునుగూడ ఉక్తములయిన పంచపదములు బోధించుచున్నవి; ఇట్టి పంచపదములకు నారాయణ నీలకంఠ విఘ్నేశ శక్తిభాన్విత్యాదులయిన అనంత పర్యాయపదములు గలవు. అవన్నియు కారణబ్రహ్మమును, కార్యబ్రహ్మమును రెంటిని ప్రసంగానుసారముగా బోధించుచున్నవి.

భోజనప్రసంగమందు సైంధవపదము లవణార్థమును బోధించును; మఱియు గమన ప్రసంగమందు సైంధవపదము అశ్వార్థమును బోధించును; ఆ ప్రకారముగా విష్ణుపురాణమందు విష్ణునారాయణాది పదములు కారణబ్రహ్మబోధకములుగాను, శివగణేశాదిపదములు కార్యబ్రహ్మబోధకములుగాను ఉన్నవి; అట్లు స్కాందపురాణాది శైవగ్రంథములందు శివమహేశాది పదములు కారణబ్రహ్మబోధకములుగాను, విష్ణుగణేశాదిపద

ఉపలక్షితవస్తువుయొక్క స్వరూపజ్ఞానమగుటయే ఉపలక్షణముయొక్క ప్రయోజనము, ఇంక ప్రయోజనము లేదు; ఎట్లు కాకమువలన దేవదత్తుని గృహజ్ఞానమగునో, కాకమునకు అన్య ప్రయోజనమేదియు లేదో, అట్లు చతుర్భుజాద్యాకారమువలన నిరాకారమైన కారణబ్రహ్మముయొక్క జ్ఞానమగుచున్నది; ఇదియే మూర్తిప్రతిపాదనముయొక్క ప్రయోజనము, ఉపాసనకొఱకు మూర్తిప్రతిపాదనమునకు ప్రయోజనము లేదు; మందప్రజ్ఞావంతులైనజనులు శాస్త్రాభిప్రాయము తెలియక ఆయా ఆకారములందు ఆగ్రహముచేసి, స్యాలకసారమేయన్యాయమున [1]పరస్పర కలహము చేయుదురు.

చూడుము—వైష్ణవగ్రంథములందు శివాదినామములచే కార్యబ్రహ్మముయొక్క నింద చేయఁబడెను; ఈయభిప్రాయమును ఎఱుఁగక శైవాదులు దుఃఖితులగుదురు. శైవగ్రంథము

1. [భార్యయొక్క బంధువును స్యాలకుఁడందురు; కుక్కను సారమేయ మందురు; దృష్టాంతమును న్యాయమందురు]. ఒకానొకని స్యాలకుని పేరు ఉత్ఫాలకుఁడని యుండెను; వానికుక్కపేరు భావకుఁడని యుండెను; ఈపురుషునికి ఇంటికుక్క పేరు భావక మని యుండెను; ఇంకొక్కని ఇంటికుక్క పేరు ఉత్ఫాలక మని యుండెను; అప్పుడు ఈపురుషునిభార్య గృహమునకు వెంటవచ్చినప్పుడు, రెండుకుక్కలుం తమయోగ్యము నిరంతరము కలహించు చుండెను; అప్పుడు దాని మగఁడుమామమొదలగువారు ఉత్ఫాలకుని తిట్టు చుండిరి; తమ భావకుని ఎక్కువచేయుచుండిరి; అప్పుడా స్త్రీ ఈభ్రాంతి అనెను—నాతమ్ముని తిట్టుచున్నారు, మఱియు వానికుక్కను ఎక్కువచేయు చున్నారు; దానివలన చాలనొచ్చి, భర్తతో దుఃఖము చెప్పుకొనెను. దాని యభిప్రాయము తెలియక సమానసంకేతమువలన భ్రమపడి, దుఃఖయుక్తయయ్యెను.

లందు విష్ణ్వాదినామములచే కార్యబ్రహ్మముయొక్క నిందను ఎఱుఁగక వైష్ణవాదులు దుఃఖితులగుదురు; సకలపురాణములకో ఇది యభిప్రాయముగా నున్నది—కారణబ్రహ్మము ఉపాస్యము, కార్యబ్రహ్మము త్యాజ్యము. మాయావిశిష్టచైతన్యమును కారణబ్రహ్మమందురు;మాయాకార్యవిశిష్టచైతన్యమును కార్యబ్రహ్మమందురు. ఇదేయర్థము భారతటీకారంభమందు నీలకంఠుఁడు వ్రాసియున్నాఁడు; సకలవేదములకును ఇదేసిద్ధాంతము. [కార్యబ్రహ్మము నింద్యపదార్థము, గనుక నది త్యాజ్యము, ఈయభిప్రాయము లేదు; కార్యబ్రహ్మోపాసనకన్న కారణబ్రహ్మోపాసన శ్రేష్ఠమని యభిప్రాయము.]

## 371. ఉత్తరమీమాంసయొక్క ప్రమాణత, అట్లు ఇతరములయొక్క అప్రమాణత.

సకలపురాణములందు విరోధశంకయొక్క పరిహారము వలన రాజునకు సుఖమాయెను; అయిన, షట్ఛాస్త్రవిరోధశంకా పరిహారము గామివలన కొంచెము అసుఖ ముండెను; కనుక పుత్రుని అడుగుచున్నాఁడు—షట్ఛాస్త్రములలో పరస్పరవిరోధముగా నగపడుచున్నది; వీనిలో నేది సత్యము? ఈప్రకారముగా తండ్రిప్రశ్న విని, తర్కదృష్టి సమాధానము పలుకనారంభించెను—

యద్యపి షట్ఛాస్త్రములకు కర్తలు సర్వజ్ఞులు, కాఁబట్టి వీరివచనరూపశాస్త్రములు సమానములై, ప్రమాణములుగా నుండవలయును; తథాపి సర్వవాక్యములందు ప్రబలప్రమాణము వేదవాక్యము, ఏలయన—వేదమునకు కర్త సర్వజ్ఞుఁడైన ఈశ్వరుఁడు; వానియందు భ్రమసందేహావిప్రలిప్సాది దోషములు

సంభవింపవు; శాస్త్రకర్తలు చెప్పలగుటవలన వీరియందు భ్రమాది దోషములు సంభవించును.

యద్యపి శాస్త్రకారులరు సర్వజ్ఞులందురు; తథాపి వీరికి సర్వజ్ఞత యోగమాహాత్మ్యమువలన అయినది; కనుక వారు యుంజానయోగులుగా నుందురు. ఈశ్వరునకు సర్వజ్ఞత స్వభావ సిద్ధమగుటవలన నాతడు యుక్తయోగిగా నున్నాడు. ఎవ్వనికి చింతనముచే పదార్థజ్ఞానమగునో, వానిని యుంజానయోగి యందురు; ఎవ్వనికి సర్వదా ఏకరసముగా సకలపదార్థములు అపరోక్ష ప్రతీతములగునో, వానిని యుక్తయోగి యందురు. అట్టి యుక్తయోగి ఈశ్వరుడు, కాబట్టి తదుక్తమైన వేదవచనము ప్రబలము; మఱియు యుంజానయోగ్యుక్తమైన శాస్త్రవచనము దుర్బలము.

అందువలన వేదానుసారమైన శాస్త్రము ప్రమాణము, వేదవిరుద్ధమైనది అప్రమాణము; పంచశాస్త్రములు వేదవిరుద్ధములు, ఇది శారీరకాదిగ్రంథములందు స్పష్టముగా వ్రాయబడినది; ఉత్తరమీమాంస ఏయంశమందును వేదవిరుద్ధము గాదు; అందువలన నది ప్రమాణముగా నున్నది.

ఇతరశాస్త్రములందు కొన్నియంశములు వేదానుసారముగా చూచుకొని, మందబుద్ధిజనులు వానియందు విశ్వాసము చేయుదురు; అయిన, అవి అనేకాంశములందు వేదవిరుద్ధములుగా నున్నవి; అందువలన నవి త్యాజ్యములుగా నున్నవి; కొంతయంశమందు వేదానుసారియగుటవలన ఉపాదేయమైనట్టిదయిన, జైనశాస్త్రమును కొంతయంశమందు వేదానుసారియే; "అహింసా పరమో ధర్మః" మొదలగునది వానిమతము, అది

యును గ్రాహ్యము గావలయును; అదియో, త్యాజ్యముగ నున్నది; వేదానుసారమైనట్టి ఉత్తరమీమాంసాశాస్త్రమే ముముక్షువునకు సర్వథా గ్రాహ్యముగ నున్నది.

యిదన్నిటి ఉత్తరమీమాంసాసూత్రములమీఁద వ్యాఖ్యానములను నానాపురుషులు నానారీతులుగా చేసియున్నారు; కాఁబట్టి అదియును సర్వథా గ్రాహ్యము గాఁగూడదు; తథాపి పూజ్యచరణశంకరకృతవ్యాఖ్యానము మాత్రము వేదానుసారిగా నున్నది; అది ఒకటిమాత్రము గ్రాహ్యముగ నున్నది. [ఇది పంచమతరంగమందు ప్రతిపాదింపఁబడినది.] ఇదిదక్క ఇతరములైన పంచశాస్త్రములు ఎట్లు అప్రమాణములో, అట్లు ఇతరులు చేసిన బ్రహ్మసూత్రవ్యాఖ్యానములును అప్రమాణములుగా నున్నవి.

## 372. ఇతరశాస్త్రముల పరిత్యాగమునందు దృష్టాంతము, మఱియు హేతువు.

ఈతరంగమందు పూర్వము సకలశాస్త్రములు మోక్షోపయోగము లని చెప్పఁబడినది. తర్కదృష్టియొక్క సారగ్రాహకవివేకమువలన చెప్పఁబడినది; ఎట్లు ఒకానొకనిని శత్రువు ఖడ్గముతో కొట్టెను; దానివలన వాని రోగనివృత్తి అయెను; అప్పుడు ఆసారగ్రాహిపురుషుఁడు కొట్టువాని ఉపకారమును స్మరించుచున్నాఁడు; ఏలాగున ననఁగా—వీనిచేత నారోగపరిహారము చేయఁబడినది; అట్లు అన్యశాస్త్రమువలనను ఏరీతిగాను అంతఃకరణముయొక్క శుద్ధి, లేక నిశ్చలత యైనవెనుక పురుషుఁడు దానిచే నివృత్తుఁడైన, వేదానుసారముగా నిశ్చయము చేసినట్టియున మోక్ష మగును; సర్వథా వానియందే ఆగ్రహముచేసి,

వానియందే రమమాణుఁడై యుండినపుడు అంధగోలాంగూల న్యాయమున అనర్థమును పొందును; కనుక సకలశాస్త్రములను విడిచి, అద్వైతవాక్యశ్రవణమురీతిగా నుత్తరమీమాంసా శాస్త్రమే జిజ్ఞాసువునకు ఉపాదేయముగా నున్నది.

## 373. అంధగోలాంగూలన్యాయమున కర్థము

ఒకానొకధనవంతుని సాభరణపుత్త్రుని చోరు లెత్తుకొని పోయిరి; పోయి, వనమందు సమగ్రాభరణములు ఒలిచికొని, వానికన్నులుతీసి, విడిచిపోయిరి; అప్పు డాబాలుఁడు ఏడ్చుచు పడియుండెను; అక్కడ నిర్దయవంచకుఁడు ఒకఁడువచ్చి, ఉన్మత్త బలీవర్దముయొక్క లాంగూలము వానిచేతపెట్టి, వానికి చెప్పెను—నీవు ఈలాంగూలమును విడువకుము; దీనిని గట్టిగా పట్టుకొనుటవలన నిన్నీబలీవర్దము నీయిల్లు చేర్చును; ఆ దుఃఖ బాలుఁడు వానిమాట నమ్మి, దుఃఖానుభవము చేయుచు నష్టుఁ డాయెను.

అట్లు విషయరూపచోరులు ఆత్మసుఖరూపమైన వైభవమునుహరించి, వివేకరూపనేత్రమునుదీసి, సంసారరూపారణ్యమందు పారవైతురు; అచ్చట భేదవాదిరూపుఁడగు నిర్దయవంచకుఁడు [1] అన్యశాస్త్రసిద్ధాంతమందు ఆగ్రహము చేయించును; మఱియు ఇట్లుచెప్పును—మాయుపదేశమే నీకు పరమసుఖ

---

1. భేదవాదిఆచార్యుఁడు స్వతః శాస్త్రశ్రవణరహితుఁడు, ఈశ్వరునియొక్క లేక మోక్షముయొక్క అపరోక్షజ్ఞానరహితుఁడు, వేదోక్తఉపాసనా యోగాది మోక్షసాధనములచే రహితుఁడు, ఇట్లుండఁగా—ద్రవ్యహరణము కొఱకు లోకులను తమసంప్రదాయచిహ్నములచేత లాంఛితులను చేసికొని, సాంకేతికమంత్రోపదేశమును చేయుచున్నాఁడు; మాయుపదేశమువలన అన్య

ప్రాప్తికి హేతువగును; దానిని విడువకుము; వీనివాక్యముందు విశ్వాసముచేసి; మందబుద్ధులైన అంధజనులు పురుషార్థసుఖ రహితులగుదురు; మఱియు జన్మమరణరూపమగు మహాదుఃఖమును అనుభవింతురు.

## 374. రాజునకు బ్రహ్మలోకప్రాప్తి

తర్కదృష్టి పుత్రుఁడుగా నుండెను; అట్లయినను, తండ్రికి ఉత్తమోపదేశముచేసెను, కనుక గురుపదవిని పొందెను; ఇది బ్రహ్మవిద్యయొక్క మాహాత్మ్యము; రాజుయొక్క మరణమందు దేశకాలములు చెప్పలేదు; దాని కిది యభిప్రాయము—

ఉపాసకునిమరణమందు దేశకాలాపేక్షలేదు; పగలే చావని, లేక రాత్రిచావని, దక్షిణాయనమందు చావని, లేక ఉత్తరాయణమందు చావని, పవిత్రభూమియందు చావని, లేక అపవిత్రభూమియందు చావని, సర్వథా ఉపాసనాబలమువలన దేవయానమార్గముద్వారమున వానికి బ్రహ్మలోకముయొక్క ప్రాప్తియగును.

పూర్వము అదృష్టదృష్టిప్రసంగమునందు దేశకాలాద్యపేక్ష ఏది చెప్పఁబడెనో, అది యోగసహితోపాసకునకు చెప్పఁబడినది; ఈశ్వరప్రణిధానోపాసకునకు [కేవలము ఈశ్వరశరణాగతుఁడైన ఉపాసకునకు] చెప్పఁబడలేదు; ఈయర్థమును సూత్రకారభాష్యకారులు ప్రతిపాదించియున్నారు.

---

సన్మార్గము తిరోధానమగుటవలన వీనిసకలజన్మము వ్యర్థమగు నని కరుణ మనస్సులో రాదు; కాఁబట్టి వాఁడు నిర్దయపంచకుఁడు. [వానికి వశులగువారిని ఏమని చెప్పవలెను?]

## 375. పరమాత్మతో అభేదరూపమైన తర్కదృష్టియొక్క విదేహముక్తి

తర్కదృష్టి వచ్చినపుడు రాజు వానికి రాజ్యాభిషేకము చేసి, తాను సర్వదా భగవద్భక్తియందు రమమాణుఁడై యుండెను; తరువాత వానియొక్క సత్యలోకప్రయాణవార్త ఇపుడు చెప్పఁబడినది; తండ్రి పరలోకవాసియయిన వెనుక తర్కదృష్టిచేత బహుకాలమువఱకు మంచినీతిగా ప్రజాపాలనము చేయఁబడెను; తరువాత ప్రారబ్ధాంతమైనపుడు ఇకదినమందు తానే పరబ్రహ్మమై యున్నాఁడు; అనఁగా— దేనిని శాస్త్రమందు విదేహమోక్షమనుచున్నారో, ఆ యవస్థను పొందుచున్నాఁడు.

కూటస్థునికి పరమాత్మతో సదా అభేదముండినను, ఉపాధికృతభేదముగా నున్నది; ఉపాధిలయమువలన ఆ భేదముయొక్క అభావమగుచున్నది; విదేహముక్తియందు పరమాత్మతో అభేదము చెప్పిరి; దానికిది యభిప్రాయము— విదేహముక్తియందు ఈశ్వరునితో అభేదమగును; శుద్ధబ్రహ్మముతో అభేదము గాదు. ఈసంగతి శారీరకభాష్యచతుర్థాధ్యాయమందు ప్రతిపాదింపఁబడినది.

అచ్చట ఈ ప్రసంగము గలదు— విదేహముక్తియందు సత్యసంకల్పాదిరూపముయొక్క ప్రాప్తి జైమినిమతమందు చెప్పఁబడినది. ఔడులోమిమతమందు సత్యసంకల్పాద్యభావము చెప్పఁబడినది; సిద్ధాంతమందు సత్యసంకల్పాదుల భావాభావములు చెప్పఁబడినవి.

దానికిది యభిప్రాయము—ఈశ్వరునితో అభేదము గలదు. ఈశ్వరుని సత్యసంకల్పాదులైన ధర్మములు ముక్తునందు

అన్యజీవులదృష్టిచేత వ్యవహరింపఁబడును; ఆయీశ్వరుఁడు పరమార్థదృష్టిచే శుద్ధుఁడు; వానియం దేగుణము లేదు; మఱేమనఁగా— ఈశ్వరుఁడు నిర్గుణుఁడు; వానియందు సత్యసంకల్పాదులయొక్క అభావము గలదు.

యద్యపి సంసారదశయందును జీవుఁడు పరమార్థముచేత నిర్గుణుఁడు, శుద్ధుఁడు; తథాపి జీవునకు సంసారదశయందు అవిద్యాబలమువలన కర్తృత్వభోక్తృత్వములు ప్రతీతమగును; ఈశ్వరున కెప్పుడును ఆత్మయందు, లేక ఇతరమందు సంసారప్రతీతి గానేరదు;కనుక సదా అసంగుఁడు, నిర్గుణుఁడు, శుద్ధుఁడు; ఆ ఈశ్వరునితో యభేదమే శుద్ధబ్రహ్మముతో యభేదమని ఎఱుఁగవలెను.

ఇట్లుండఁగా ఈశ్వరునితో యభేదమునే శుద్ధబ్రహ్మముతో అభేదముగా నంగీకరింపకుండినపక్షమందు, ఈశ్వరునకు జీవునివలె ఉపదేశజన్యజ్ఞానము లేనందున శుద్ధబ్రహ్మప్రాప్తిరూప విదేహమోక్షమో, ఎప్పటికిని గానేరదు; సదా ప్రాప్తమైన తద్రూపము శుద్ధము గాదనిన, జీవునికన్న న్యూనుఁడైన ఈశ్వరుఁడు సదాబద్ధుఁడుగా నుండవలెనని సిద్ధమగును; కాఁబట్టి ఇట్లు అంగీకరించుట యోగ్యము:—

ఈశ్వరునకు ఆవరణము లేదు, కనుక ఉపదేశజన్యజ్ఞానాపేక్షయు లేదు; ఆవరణాభావమువలన భ్రాంతియు లేదు, కనుక వాఁడు సర్వజ్ఞుఁడై, నిత్యముక్తుఁడుగా నున్నాఁడు; మాయ, మఱియు తత్కార్యము ఆత్మయందు ప్రతీతము గామివలన వాఁడు సదా అసంగుఁడు, అసంగుఁడగుటవలన శుద్ధుఁడు; ఉక్త

లక్షణసంపన్నుఁడైన ఈశ్వరునితో అభేదమే శుద్ధబ్రహ్మాభేదముగా నున్నది.

దృష్టాంతమువలనను, ఈశ్వరునితోడనే అభేదము సిద్ధమైనది; మఠమునందు ఘటభంగ మగుటవలన మఠాకాశమందే ఘటాకాశముయొక్క లయమైనది, మహాకాశమందుఁ గాదు; అట్లు విద్వాంసునిశరీరము బ్రహ్మాండమందు నష్టమైనది; సకల బ్రహ్మాండము ఈశ్వరశరీరమైన మాయకు అంతర్భూతముగా నున్నది; విద్వాంసునిఆత్మ విదేహమోక్షమందు బ్రహ్మాండమునకు బాహిరము గమనము చేయఁడు; కనుక ఈశ్వరునితోడనే అభేదమగును.

ఈవిధముగా మఠాకాశమందు ఘటాకాశముయొక్క అభేదమైనను, ఆ మఠాకాశము మహాకాశరూపముగానే యున్నది; అట్లు ఈశ్వరునితో అభేదమైనను, ఆయీశ్వరుఁడు శుద్ధబ్రహ్మముగా[1] నున్నాఁడు; కావున శుద్ధబ్రహ్మప్రాప్తియని చెప్పఁబడినది.

---

1. ఇచ్చట ఈరహస్యము గలదు—జ్ఞానవంతునిదృష్టిచేత విదేహమోక్షమునకు మొదట బ్రహ్మాండాదిజగత్తు ఏదియును లేదు; మఱేమనఁగా—బ్రహ్మమే యున్నది; కనుక వానిదృష్టివలననే, బ్రహ్మముతోనే అభేదమగుచున్నది; అదే వానికి శుద్ధబ్రహ్మముయొక్క ప్రాప్తి. అజ్ఞజనులదృష్టిచేత ఎక్కడఁజూచినను, బ్రహ్మాండాదికము ప్రతీతమగుచున్నది; కనుక వానిదృష్టివలన జ్ఞానికి ఈశ్వరునితో [ఈశ్వరదేహరూపబ్రహ్మాండముతో] అభేదమగుచున్నది; ఆయీశ్వరుఁడు నిజముగా [పరమార్థదృష్టివలన] శుద్ధబ్రహ్మముగానే యున్నాఁడు; కాఁబట్టి జ్ఞానికి శుద్ధబ్రహ్మముయొక్కప్రాప్తి యనఁబడినది. ఉక్తవిదేహమోక్షమందు జ్ఞానికెట్లు బ్రహ్మముతో నీ యభేదము గలదో,

## 376. ఈభాషాగ్రంథముయొక్క రచనాప్రయోజనము

శ్రీనిశ్చలదాసు లనుచున్నారు—నేను సాంఖ్యన్యాయ వ్యాకరణాద్యనేకశాస్త్రములయొక్క అధ్యయనము చేసితిని; వేదాంతశాస్త్రముయొక్క సంపూర్ణమర్మమును ఎఱింగితిని; అయినను, ప్రాకృతభాషాగ్రంథరచనయందు సిగ్గు అంగీకరింపను; ఏలయన—దయాధర్మము సకలధర్మములయొక్క శిరోరత్నముగా నున్నది.

ఈవిచారసాగరమందు గోప్యవేదాంతసిద్ధాంతరూపము లయిన అనేకరత్నములు గలవు; ఈగ్రంథముయొక్క అధ్యయనముచే సంస్కృతభాషాహీనుఁడైన జిజ్ఞాసువునకు [1] అనాయాసముగా బ్రహ్మస్వరూపమగు పరమానందముయొక్క ప్రాప్తి యగును.

---

దానియందు ఆభాసవాదాదిభిన్నభిన్నవేదాంతపక్షములయొక్క విచారము ఏది గలదో, అది వృత్తిప్రభాకరముయొక్క అష్టమప్రకాశమందు సవిస్తరముగ వ్రాయఁబడినది; ఈగ్రంథము ఆఱవతరంగమందు సంక్షిప్తముగా తెలుపఁబడినది.

1. ఎవనియొద్ద త్రాడుచెంబులు గలవో, వాఁడు కూపముయొక్క జలపానము చేయఁగలఁడు; ఎవనియొద్ద అవి లేవో, వాఁడు జలపానము చేయ శక్తుఁడుగాఁడు; అయినను, వాఁడు వాపిక [మెట్లనుంచి దిగునటువంటి బావి] లేక సరోవరముయొక్క జలపానము అనాయాసముగ చేయఁగలఁడు; అట్లు ఎవనియొద్ద కావ్యకోశవ్యాకరణాదిసామగ్రి గలదో, వాఁడు సంస్కృతగ్రంథార్థము తాత్పర్యసహితముగ ఎఱుఁగఁజాలును; ఎవనియొద్ద ఆ సామగ్రి లేదో, వాఁడు సంస్కృతార్థమును ఎఱుఁగఁజాలఁడు; అయినను, ఆమందపురుషుఁడు

## 377. మంగళాచరణపూర్వకముగా గ్రంథసమాప్తి

హస్తినాపురము నుండి పశ్చిమదిక్కున కిమాడౌలినామక మగు గ్రామము గలదు; అచ్చట ఈగ్రంథము సంపూర్ణమైనది. విదేహముక్తియందు విద్వాంసులు పరబ్రహ్మముతో అభేదము నొందుచున్నారో, అపరబ్రహ్మరూపులైన నాస్వామి దాదుజీ చరణారవిందములకు నేను [నిశ్చలదాసుఁడను] ప్రేమభావముతో ఈగ్రంథమును అర్పించుచున్నాను.

ఈప్రకారముగా విదేహముక్తిప్రతిపాదకమయిన విచారాబ్ధియొక్క సప్తమతరంగమందు పుత్రత్రయసమాప్తమానులైన శుభసంతతిరాజు విదేహముక్తిపొందుట వర్ణింపఁబడినది. ఇట్టి శుభతరంగమును ఎవ్వరు జిజ్ఞాసువులైనవారు ఆదరముతో శ్రవణకథనము చేయుచున్నారో, వారందఱును శ్రీగురుకృప వలన సచ్చిదానందపరబ్రహ్మరూపమయిన విదేహమోక్షమును పొందుదురు.

ఇతి శ్రీవిదేహముక్తిప్రతిపాదననామకమగు సప్తమతరంగము సంపూర్ణము.

---

భాషాగ్రంథార్థమును అనాయాసముగ ఎఱుఁగఁజాలుదు; దానివలన వాఁడు పరమానందమును పొందును. ఈ శిరోమణిదయాధర్మరూప హేతువువలన భాషాగ్రంథరూపవాదక శ్రీనిశ్చలదాసాచార్యులచే చేయఁబడినది. దీని వృద్ధ్యర్థము ఇది టిప్పణరూపప్రతిపాదనము శ్రీపీతాంబరాదిపాదిగులచేత రచింపఁబడినది. అదియును వానికి విశేషసుఖకారకముగా నుండును.

ఓమ్.

# శ్రీచైతన్యామృతము

అభినవసుఖకరగురువర భయకరభవవనహానఃకుఠారాయ,
నతజనచిత్తభ్రమహార తత్పదశిక్యాయ మంగలాయ నమః.1

ఎపుడు మృత్తికదక్క కుంభము కనఁబడదో, అపుడు మృత్తికదక్క కుంభము ఉండదు; ఆప్రకారముగా ఏపదార్థము దక్క మృత్తిక కనఁబడదో, ఆపదార్థముదక్క మృత్తిక ఉండదు.

ఏమృత్తికచే ఘటాకారము భాసిల్లునో, ఆమృత్తికఏపదార్థముచే భాసిల్లునో, ఆపదార్థమును ప్రకాశింపఁజేయుఁదగిన వేఱొక్కపదార్థము లేదు; అందువలన ఆపదార్థమునే శ్రుతి సత్యమని పలుకుచున్నది.

మృత్తికదక్క ఘటము కనఁబడనందున ఎట్లు ఘటము మృత్తికారూపమో, అట్లు ఏపదార్థముదక్కసర్వముకనఁబడదో, అందువలన ఆపదార్థరూపమే సర్వము. నీస్వరూపము అటువంటిదే.

ఆ స్వస్వరూపము మీఁద స్థిరముగనిలిచి, స్వరూపదృష్టిచే చూడుమఁటే! సర్వము నీస్వరూపమే కనఁబడును; చెప్పినసంగతి యందు వర్తించుటకు నీకు సంకటమా! కొంచెము గురుకృపావలంబనము చేయుము; చాలు.

అలంకారసృష్టియందు సువర్ణముదక్క ఏమిగలదు? చూడుమఱి! ఆదియందుసువర్ణము, అంతమందుసువర్ణము, మధ్యమందు సువర్ణము; ఆప్రకారముగ సజ్జనులచే విశ్వముయొక్క ఆదియందు బ్రహ్మము, అంతమందు బ్రహ్మము, మధ్యమందు బ్రహ్మము, చూడఁబడినది.

ఉక్తప్రకారముగ శ్రీగురువుయొక్క భాషణమువినివిని, శిష్యుఁడు ఆక్షేపము చేయుచున్నాఁడు—సజ్జనులకు విశ్వము కనఁబడదా యేమి? నేను అనేకసజ్జనులను చూచుచున్నాను; ఇది ఘటము, ఇదిపటము, అనుచున్నారు.

ఓయి శిష్యవర్యా! జగత్తునందు బ్రహ్మము గనఁబడినను, ఎదివఱకు విశ్వాకారస్థితియొక్క కాలము గలదో, అదివఱకు ఆకారముయొక్క నాశము గానేరదు; ఎట్లనఁగా—అలంకారమును సువర్ణరూపముగా చూచినను, కేయూరకుండలాకారములయొక్క నాశము గానేరదు; ఒక్కొకచోట అధిష్ఠానజ్ఞానకాలమందే కల్పితాకారముయొక్క నాశ మగుచున్నది; ఎట్లనఁగా—సర్పమును రజ్జురూపముగా చూచినప్పుడే సర్పాకారముయొక్క నాశమగుచున్నది.

సువర్ణమును అలంకారరూపముగ చూచుట, మఱియు రజ్జువును సర్పరూపముగ చూచుట, ఉభయత్ర అధ్యాసలక్షణము సమానముగ నున్నది; అయినను, ఏయధ్యాసయందు ఇంద్రియవ్యాపారముయొక్క, లేక మానససంకల్పముయొక్క, సాహాయ్యము గలదో, అచ్చట అధిష్ఠానజ్ఞానమైనతరువాత ఇంద్రియవ్యాపార సంకల్పకాలములయొక్క పూర్ణతయగువఱకు అధ్యస్తాకారముయొక్క నాశము గానేరదు; సువర్ణమును అలం

కారకుని చూచుటయందు కంసాలిచేతియొక్క వ్యాపారము దృష్టికి సహకారముగ నున్నది; అచ్చట అలంకారమును సువర్ణరూపముగ చూచినను, సుత్తెచే అలంకారనాశము చేయువఱకు అలంకారాకారము కనఁబడును; రజ్జువును సర్పరూపముగ చూచుటకు దృష్టికి ఏయొక వ్యాపారము సహకారము లేదు; అందువలన ఒకసారి రజ్జువుచూచిన, మరల సర్పాకారము గనఁబడదు.

ఆప్రకారముగ బ్రహ్మమును విశ్వరూపముగ చూచుటయందు ఈశ్వరసంకల్పము దృష్టికి సహకారము గలదు; అందువలన ఈశ్వరసంకల్పకాలము పూర్ణమగువఱకు విశ్వమును బ్రహ్మరూపముగాఁ జూచినను, విశ్వాకారముయొక్క నాశము గానేరదు.

కరముచే చేయఁబడినది మనస్సుచే, మనస్సుచే కల్పితమైనది కరముచే, నివృత్తము కాదు; ఆప్రకారముగా ఈవిశ్వము ఈశ్వరసంకల్పకాలకర్తృకమగుటవలన ఇది కాలముచేతనే నష్టము కావలసినది; నీచే చెప్పఁబడిన సజ్జనులకుకూడ ఈరీతిగానే ఘటాకారములును, పటాకారములును, కనఁబడుచున్నవి.

ఓయీ ప్రియదర్శనుఁడా! ప్రపంచమునందు సుఖముగా వర్తనము చేయునీ, గాకపోనీ, ఏప్రపంచము శబ్దస్పర్శాదిపంచభేదములచే శ్రోత్రత్వగాదిపంచేంద్రియములకు కనఁబడుచున్నదో, ఆప్రపంచమే స్వరూపమందు చూచినపుడు బ్రహ్మరూపముగా కనఁబడుచున్నది.

చూడుమఱి! నీలవర్ణమైనట్టి కాచోపనేత్రముచే చూచినపుడు, స్వశరీరము గౌరవర్ణముగా నుండినను, నీలవర్ణముగా కనఁబడుచున్నది; ఉపనేత్రము దూరముచేసి, కేవలనేత్రముచే

చూచినపుడు, గౌరవర్ణముగ కనఁబడుచున్నది; ఆ ప్రకారముగ తాను వ్యాపకపూర్ణమైనట్టి పరబ్రహ్మముగా నుండఁగ, మానసేంద్రియములను అంగీకరించినపుడు, తద్ద్వారమున అనేకాకారముగు విశ్వము కనఁబడుచున్నది; మానసేంద్రియములను తిరస్కరించి, కేవలాత్మదృష్టిచే చూచినపుడు, పరిపూర్ణబ్రహ్మమే కనఁబడుచున్నది.

ఏరీతిగా గౌరవర్ణముగు స్వశరీరము నీలకాచోపనేత్రముచే నీలవర్ణముగ కనఁబడి, కేవలనేత్రముచే గౌరవర్ణముగ కనఁబడుచున్నదో, ఆరీతిగానే మానసేంద్రియములకు విశ్వము నానాభేదముచే కనఁబడినను, ఆత్మదృష్టిచే స్వరూపమునందు భేదము కనఁబడదు.

మనస్సును, ఇంద్రియములను, మానసేంద్రియార్థమైన జగత్తును, ఏయొకవస్తువు ప్రకాశింపఁజేయుచున్నదో ఆయొకవస్తువే సత్యముగ నున్నది; మఱియు మానసేంద్రియజగత్తులైన అనేకవస్తువులు మిథ్యగానున్నవి; ఎట్లు మిథ్యయగు నానాఘటములందు సత్యమగు ఒకమృత్తికయే గలదో, అట్లు మిథ్యయగు మానసేంద్రియాదిపదార్థములందు సత్యమగు ఒకబ్రహ్మమే గలదని ఆత్మయోగులైన సజ్జనులు చూచుచున్నారు.

ఘటభూషణవస్త్రములందు సత్యములగు వస్తువు లేవి యనిన, మృత్తికాసువర్ణతంతువులుదక్క ఏదియు లేదు; భ్రాంతిబలముచే సత్యవస్తువులుగాకనఁబడునట్టి ఘటభూషణవస్త్రములు శుక్తిరజతమువలె మిథ్యగానున్నవి. అనేక కార్యములు చేసినను, అనేకోపయోగములకు వచ్చినను, ఎట్లు ఘటాదులను సత్యమునుటఁ ఘటిల్లదో, మిథ్యయనుటయే ఘటిల్లునో, అట్లు అనేకకర

ములుచేసినను, శరీరాదులను సజ్జనులు సత్య మనరు, మిథ్యయే యనుచున్నారు.

వాయుయోగముచే అంతరిక్షమందు పర్ణములు ఎట్లు సంచరించుచున్నవో, సూత్రధారిక్రియవలన బొమ్మలు ఎట్లు నర్తించుచున్నవో,అయస్కాంతసాన్నిధ్యముచే లోహము ఎట్లు చలించుచున్నదో, అట్లే చైతన్యసన్నిధానముచే కర్మశక్తిలేనివై జడములైన శరీరములు కర్మశక్తిగలవగుచున్నవి.

బుద్ధ్యాదివృత్తిరూపజ్ఞానశక్తులు స్వయముగ జ్ఞానహీనములు, స్వయంప్రకాశజ్ఞానమందో వృత్తియొక్క అభావము, ఇట్లుండఁగా ఆ స్వయంప్రకాశజ్ఞానసాన్నిధ్యముచే జ్ఞానహీనమైనట్టి బుద్ధ్యాదివృత్తులు ప్రకాశితములగుచున్నవి; ఎట్లనఁగా— చంద్రజ్యోతి స్వయముగ ప్రకాశహీనముగా నున్నను, అగ్నిజ్యోతియోగముచే ప్రకాశరూపముగుచున్నది.

ఎట్లు మతాపి, చంద్రజ్యోతి, చిచందరి, చక్రము మొదలగు మందుద్రవ్యము యొక్క భేదములచే అగ్నిజ్యోతి నానాప్రకారములుగ ప్రకాశించుచున్నదో, అట్లు ఆత్మచైతన్యము బుద్ధీంద్రియాది నానాజ్ఞానశక్తిభేదములచే నానాప్రకారములుగ ప్రకాశించుచున్నది.

ఏ ప్రకాశమునకు ఇతరప్రకాశములచే ప్రకాశము గలుగదో, మఱియు నేది ఇతరపదార్థములను బాహ్యాంతరములందు ప్రకాశింపఁజేయుచున్నదో, అదియే సత్యమనఁబడెను; దానియందు ఇతరపదార్థ మేది కనఁబడుచున్నదో, ఆపదార్థము ఆ ప్రకాశముదక్క మిథ్యయైయున్నది; ఎట్లనఁగా— పటాకారము మిథ్యయై, దానియందు సత్యముగు ఒకతంతువే యున్నది.

ఓయీ శిష్యోత్తమా! ఆచైతన్యరూపతంతువు నీవుగా నున్నావు; జగద్రూపపటాకారమైనట్టిది నీమాయగా నున్నది; ఆమాయయందు, మఱియు తత్కార్యములైన జగత్పదార్థములందు, ఒకటి నీసత్తయే వర్తించుచున్నది; ఇట్టిబుద్ధినిఅంగీకరించి, నీసత్తను చూడుమా!

సూక్ష్మదృష్టిచే చూడు మఱి! ఎట్లు స్వప్నసృష్టి నీచేత నిర్మింపఁబడినదో, అట్లు ఈజాగ్రత్సృష్టియును నీచేతనే నిర్మింపఁబడియున్నది; ఎపుడు స్వప్నమందు అనేకశరీరములను కల్పనచే పుట్టించి, కల్పనచే జీవరూపముగా వానియందు ప్రవిష్టుఁడవై, ఆశరీరములను వర్తింపఁజేయుచున్నావో, అపుడు మనస్సు, నీవు, ఈయిద్దఱిని దక్క అచ్చట ఎవఁడున్నాఁడు? చెప్పుమా! తనచే కల్పింపఁబడినసృష్టిని ఈశ్వరుఁడు ఆత్మస్వరూపమందుచూచునట్లు నీచే కల్పింపఁబడినసృష్టిని నీవు ఆత్మస్వరూపమందు చూడుమా!

శిష్యుఁడనుచున్నాఁడు—స్వామీ! ఈశ్వరుఁ డెంతసర్వజ్ఞుఁడు, నే నెంత అల్పజ్ఞుఁడను, తనచే కల్పితమైన జగత్తును ఈశ్వరుఁడు ఆత్మస్వరూపమందు చూచునట్లు చూచుట నాకేలాగున ఘటిల్లును?

గురువు—అయ్యా! ఈశ్వరునకును, నీకును, విలక్షణత లేదు; ఎందుకు భయపడుచున్నావు? ఈశ్వరుని ఆత్మ నీఆత్మ ఒకటే; విచారదృష్టిచే చూచినట్లయిన, ఈశ్వరుని ఉపాధియందు నీయుపాధియందుకూడ ఎక్కువ విలక్షణత లేదు; ఈశ్వరుని ఉపాధిజాగరము, నీయుపాధినిద్రితము, ఇంతేగదా! స్వోపాధిని జాగ్రత్తుగాఁ జేయుము!

ఏయుపాధి ఈశ్వరునియందుఁ గలదో, ఆయుపాధియే రామకృష్ణాదీశ్వరావతారములందుఁగలదు;ఆయుపాధియే జీవులందుఁ గలదు; ఉపాధియొక్కటే; అది ఈశ్వరేశ్వరావతారములందు శుద్ధరూపముగాను, జీవులందు అశుద్ధరూపముగాను ఉండును; శుద్ధరూపముగ నుండువఱకు భేదము కనఁబడదు; ఎక్కడనుండి అశుద్ధరూపముగ నుండునో, అక్కడనుండి కనఁబడును; అశుద్ధోపాధియందుఁగూడ ఎదివఱకు ఆయుపాధి శుద్ధముగా లేదో,అదివఱకు కనఁబడును; అశుద్ధోపాధి శుద్ధమైన తరువాత కనఁబడదు.

అశుద్ధోపాధి ప్రయత్నముచే శుద్ధమైనపుడు అదే యీశ్వరోపాధి; ఎట్లనఁగా— సువర్ణము ఉత్తమమనియు, హీనమనియు, ద్వివిధము గాదు; సువర్ణమనునది ఉత్తమపదార్థ మొక్కటే; అది ఒకానొకప్పుడు హీనముఁగ కనఁబడుచున్నది; అది హీనమా? ఒకసారి పుటమిచ్చిన అదే యుత్తమము.

స్వతస్సిద్ధశుద్ధమైనట్టి సర్వేశ్వరోపాధి ఎట్టిదో, సర్వాత్మబుద్ధిగలజ్ఞానియొక్క ఉపాధియును అట్టిదే; అశుద్ధుఁడైన విప్రుని శుద్ధవిప్రేంద్రుఁడు ప్రాయశ్చిత్తద్వారమున ఎట్లు శుద్ధునిగాఁ జేయుచున్నాఁడో, అశుద్ధుఁడైనజీవుని శుద్ధసర్వేశ్వరుఁడు ఉపదేశద్వారమున అట్లె శుద్ధునిగాఁ జేయుచున్నాఁడు. [జీవోద్ధార ధర్మము సకలధర్మములందు అత్యంత శ్రేష్ఠము.]

ఎవఁడు సర్వేశ్వరోపాధియందు జాగరూకుఁడో, వాఁడు దేహబుద్ధిని, విశ్వబుద్ధిని, దేహమును, విశ్వమును, అన్నిటిని స్వప్నవత్తుగాఁ జూచుచున్నాఁడు; నీవు తమోగుణనిష్ఠ సుషుప్తి

యందుండి జాగరూకుఁడవగుచున్నావుగదా! దానియొక్క విచారము చేయుఁదమా!

బుద్ధ్యాదికము లయమగుటవలన "స్వం చ న వేత్తి, పరం చ న వేత్తి" తన్నును ఎఱుఁగఁడు, ఇతరునిని ఎఱుఁగఁడు, ఇటువంటిది సుషుప్త్యవస్థ; దానినుండి ఏరీతిగా జాగరూకుఁడవగుచున్నావు? నీ ప్రయత్నమా? నీ ప్రయత్నము జరుగదు; మరే మనిన—జాగ్రద్ద్రావేశ్వరోపాధిచేతనే నీవు జాగరూకుఁడవగుచున్నావు; ఇట్లుండఁగా నీచేకల్పింపఁబడిన ఈవిశ్వమును స్వరూపమందు ఎందుకు చూచెదవు?

స్వప్నమందు అనేకప్రకారముగ సృష్టిని జేసిచేసి, ఎపుడు నీవు జాగరూకుఁడవగుచున్నావో, అపుడు "స్వప్నసృష్టి నాచేత కల్పితముగనుండెను, ఇపుడు లేనందున అది మిథ్య, నేనొకఁడు ఇపుడుకూడ నుండుటవలన నేనొకఁడు సత్యము" అనుప్రకారముగ ఎఱుఁగుచున్నావు; ఇపుడు "ఈజాగ్రత్తయందు కల్పింపఁబడినసృష్టి స్వప్నమందుండదు, నేనొక్కఁడుందును; అందువలన ఈసృష్టి మిథ్య, నేనొకఁడు మాత్రముసత్యము" అనునీప్రకారముగ ఎందుకు ఎఱుఁగవు?

అయ్యా! నీసుషుప్తిపోయె, స్వప్నమునుపోయి, ఇపుడు నీవు జాగరూకుఁడవై యున్నావు; ఇపుడైనను నీయోగము ఎందుకు రక్షింపవు? అశక్యమా? సులభముగానే యున్నది; ఇట్లు చేయుము—తుర్యంబునందు జాగరూకుఁడవు కమ్ము; దానియందును నీకు విశ్వము గనఁబడినపుడు, అది స్వప్నమని ఎఱుఁగుము, ఇంకేమి!

సర్వమునాత్మ రూపముగాచూచుటకే తుర్యంబని పేరు, ఇదే ఈశ్వరునియొక్క ఉపాధి, దీనికే నీవు జాగ్రత్తయని పేరు పెట్టుము; మఱియును ఇపుడు నీకు జాగ్రత్స్వప్న సుషుప్తులని ఏమూఁడవస్థలు గలవో, ఆమూఁడింటిని చేర్చి, స్వప్నమని పేరు పెట్టుము; అయినది!

అట్టి తుర్యంబునందు జాగరూకుఁడవై కూర్చుండఁగా పూర్వసంస్కారబలముచేతను, మనోబలముచేతను, ఇంద్రియ బలముచేతను, దృష్టియొక్క ప్రవాహము యథాపూర్వముగ నడిచి, ఎప్పుడెప్పుడు విశ్వము కనఁబడునో, అప్పుడప్పుడు విచారముచే ఆదృష్టిని ఆకర్షింపుము; ఈ ప్రకారముగ యోగము రక్షించుటకు నీకు సంకటమా!

తుర్యంబునందు వర్తించుటకు నీకు సులభవిచారము చెప్పెదను; వినుము—ఏది దృశ్యశక్తి గలదో, అది నామాయయని ఎఱుఁగుము; విశ్వ మేది గనఁబడునో అది, నాకామమని ఎఱుఁగుము; సమస్తమందు నాయాత్మయొకఁడే వర్తించుచున్నాఁడని ఎఱుఁగుము; నేను స్వతః పరబ్రహ్మముగా నున్నాను, నాయందు ఏయొకధర్మము లేదు, బుద్ధీంద్రియాదులు లేనిపక్షమందు విశ్వము కనఁబడదు, బుద్ధీంద్రియాదులచే కనఁబడినను, ఆబుద్ధీంద్రియాదులకు ప్రకాశకుఁడైన సాక్షి నేనుగానున్నానని ఎఱుఁగుము; ఎక్కడెక్కడ బుద్ధీంద్రియాదులుపోవుచున్నవో, అక్కడక్కడ మొదటనే నేనే సిద్ధమై యున్నానని ఎఱుఁగుము.

ఇపుడు నీకు తుర్యంబుయొక్క భేదములు చెప్పెదను; వినుము—శుద్ధతుర్యంబు, మిశ్రతుర్యంబు, అని తుర్యంబునందు రెండు భేదములు; వానిలో—సూర్యప్రకాశముచే దృష్టి ఘటపటాదిపదార్థములను చూచుచున్నది; ఒక్కొక్కసారి ఘట

ఘటాదిపదార్థములను విడిచి, కేవలసూర్యునినే చూచుచున్నది; ఆ ప్రకారముగా బుద్ధి విశ్వమును చూచుచున్నది; ఒక్కొక్క పారి విశ్వమునువిడిచి, ఆత్మనుచూచుటకొఱకుఆత్మయందువచ్చుచున్నది; అపుడు ఆయాత్మ అనంతుఁడుగా నుండుటవలన దాని యొక్క అంతముపొందక, బుద్ధి ఆత్మాకార మగుచున్నది; పిదప జగత్తునందు వర్తించినను, ఆత్మకన్న వేఱెపదార్థము చూడదు; ఆ కేవలాత్మాకారబుద్ధ్యవస్థను శుద్ధతుర్యం బనవలయును; మఱియు ఏతుర్యంబునందు ప్రపంచముస్ఫురద్రూపమై, ఆప్రపంచముఆత్మయని ఎఱుఁగఁబడినదో, ఆ బుద్ధ్యవస్థను మిశ్రతుర్యంబనవలయును.

ఓయీ ధీరుఁడా! ప్రపంచముచూచి, నీవు భయపడవలదు. ఓయీ ప్రియదర్శనుఁడా! మిథ్యాస్వప్నవత్ప్రపంచమిది, ఎదివఱకు కనఁబడును? ఎదివఱకునీవు స్వప్నభ్రమచే కన్నుస్పష్టముగా తెఱవవో, అదివఱకే; కన్ను స్పష్టముగ తెఱచి, జాగరూకుఁడవై కూర్చుండునపుడు ఎందుకు కనఁబడును?

ఈ ప్రకారముగా గురుశిష్యసంవాదరూపముచే చెప్పఁబడినదైన
ఈచైతన్యామృతము
ఏజిజ్ఞాసువులు శ్రవణరూపముఖముచేప్రాశనముచేయుచున్నారో,
వారు జన్మమృత్యువులను నశింపఁజేసి,
నిరంతరతృప్తిని పొందుచున్నారు.

ఇతి శ్రీవాసుదేవచైతన్యయూను జనార్దనచైతన్యవిరచితం
చైతన్యామృతం సంపూర్ణమ్.

---

# శ్రీ విజ్ఞాననౌక

తపోయజ్ఞదానాదిభిశ్శుద్ధబుద్ధి
ర్విరక్తో నృపాదౌపదే తుచ్ఛబుద్ధ్యా,
పరిత్యజ్య సర్వం యదాప్నోతి తత్త్వం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. 1
దయాళుం గురుం బ్రహ్మనిష్ఠం ప్రశాంతం
సమారాధ్య భక్త్యా విచార్యస్వరూపం,
యదాప్నోతి తత్త్వం నిదిధ్యాస్య విద్వాన్
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. 2
యదానందరూపం ప్రకాశస్వరూపం
నిరస్తప్రపంచం పరిచ్ఛేదశూన్యం,
అహంబ్రహ్మ వృత్త్యైకగమ్యం తురీయం
పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి. 3
యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం
ప్రణష్టం చ సద్యో యదాత్మప్రబోధే,
మనోవాగతీతం విశుద్ధం విముక్తం
పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి. 4
అనంతం విభుం నిర్వికల్పం నిరీహం
శివం సంగహీనం యదోంకారగమ్యం,
నిరాకారమత్యుజ్జ్వలం మృత్యుహీనం
పరం బ్రహ్మనిత్యం తదేవాహమస్మి. 5

నిషేధే కృతే నేతినేతీతి వాక్యై
స్సమాధిస్థితానాం యదాభాతి పూర్ణం,
అవస్థాత్రయాతీతమద్వైతమేకం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. 6

యదానందలేశై స్సమానంది విశ్వం
యథా భాతి చాన్యత్తథా భాతి సర్వం,
యదాలోచనే హేయమన్య త్సమస్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. 7

యదానందసింధౌ నిమగ్నః పుమాన్ స్యా
దవిద్యావిలాసస్సమస్తప్రపంచః,
తదా న స్ఫురత్యద్భుతం యన్నిమిత్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. 8

స్వరూపానుసంధానరూపాం స్తుతిం యః
పఠేదాదరాద్భక్తిభావో మనుష్యః,
శృణోతీహ వా నిత్యముద్యుక్తచిత్తో
భవేద్విష్ణురత్రైవ వేదప్రమాణాత్. 9

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరాచార్యవిరచితం శ్రీవిజ్ఞాననౌకాష్టకం సంపూర్ణమ్.

అహం బ్రహ్మాస్మి.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951.

# వేదాంతగ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అద్వైతసంగ్రహము, తెలుఁగువచనము ... | 0 | 6 |
| ఆత్మబోధము, సాంధ్రటీక ... | 0 | 6 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 3 |
| అపరోక్షానుభూతి ,, ... | 0 | 6 |
| అద్వైతపంచరత్నములు, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 3 |
| అద్వైతోపదేశపంచరత్నములు ,, ... | 0 | 3 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము ,, ... | 0 | 6 |
| అద్వైతవేదాంతపరిభాష, సవ్యాఖ్యానము, సంస్కృతము ... | 1 | 8 |
| ఆత్మానాత్మవివేకము ,, ... | 0 | 6 |
| అద్వైతానుభూతి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| శివగీతా ,, ... | 1 | 4 |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యము ... | 6 | 0 |
| కామకలావిలాసము ... | 2 | 8 |
| విద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక ... | 3 | 0 |
| నారదపురూరవసంవాదము, తెనుగుపద్యము ... | 0 | 3 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యము | 5 | 0 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 3 |
| ,, తెనుఁగువచనము ... | 0 | 3 |
| ప్రశ్నోత్తరరత్నమాల, ఆంధ్రతాత్పర్యము ... | 0 | 12 |
| ఋభుగీత, సాంధ్రతాత్పర్యము ... | 1 | 0 |
| మహావాక్యదర్పణము, ఆంధ్రతాత్పర్యము ... | 2 | 0 |
| శంకరగీతాభాష్యము, సంస్కృతము ... | 2 | 8 |
| వేదాంతడిండిమము, తాత్పర్యసహితము ... | 0 | 4 |
| సనత్సుజాతీయము, సటీక ... | 0 | 8 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| [illegible]ముక్తిసుధార్ణవము, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | | 0 | 10 |
| రామగీతా, చిన్నసైజు | ... | 0 | 8 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 8 |
| వివేకచూడామణి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| సౌందర్యలహరి, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 12 |
| బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 4 |
| ,, శంకరభాష్యము (సంస్కృతము) | ... | 10 | 0 |
| భక్తివలనముక్తి | ... | 0 | 1 |
| భగవద్గీతాసారసంకీర్తనలు | ... | 0 | 4 |
| భగవద్గీతలు, మూలము, చిన్నసైజు | ... | 0 | 10 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, కాలికోబైండు | ... | 2 | 0 |
| ,, బ్రౌనుపేపరు, కాకితము అట్ట | ... | 1 | 4 |
| ,, ద్వైతమతానుసారమైనవివరణము | ... | 1 | 0 |
| ,, శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యము | | 6 | 0 |
| ,, కందారదర్వ్యలు, శ్రీనందడి నాగనగారిది | ... | 1 | 4 |
| ,, అనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | ... | 0 | 12 |
| ,, తెనుగుపద్యములు, గోపీనాథము వేంకటకవిది | | 1 | 4 |
| శాంతివిలాసము | ... | 0 | 6 |
| గురాష్టకము | ... | 0 | 2 |
| యజ్ఞవరాహభగవద్గీత-తాత్పర్యసహితము | ... | 3 | 0 |
| వ్యవహారపంచకము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| విచారచంద్రోదయము, తెనుఁగువచనము | ... | 0 | 10 |
| వేదాంతస్తోత్రపంచకము, తాత్పర్యము | ... | 0 | 6 |




వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.1